హిమాలయ సాధువు

# స్వామీ రామ

## జీవన సంగ్రహం

పండిట్ రాజమణి టిగునైట్, పి.హెచ్.డి.

అనువాదం
రమాసుందరి ఎం.ఎస్.బి.పి.ఎన్.వి.

MANJUL
మంజుల్ పబ్లిషింగ్ హౌస్

# ఇందులో

# రాజకీయ పటం



జమ్ము
అమర్‌నాథ్
శ్రీ నగర్
కాశ్మీర్
హిమాచల్ ప్రదేశ్
అమృత్‌సర్
షిమ్లా
చండీగఢ్
పంజాబ్
హర్యానా
రాజస్థాన్
ఉత్తరప్రదేశ్
నేపాల్
అరుణాచల్ ప్రదేశ్
భూటాన్
ఖాట్మండు
పుష్కర్
అస్సాం
గౌహతి
నాగాలాండ్
బీహార్
ఖజురహో
మేఘాలయ
గయ
బంగ్లాదేశ్
మణిపూర్
బోధి గయ
చిత్రకూట్
మధ్యప్రదేశ్
అహ్మదాబాద్
పశ్చిమ బెంగాల్
ఢాకా
త్రిపుర
మిజోరాం
ఓంకారేశ్వర్
అమర్ కంటక్
కొల్‌కత్తా
ద్వారక
ఒరిస్సా
పూరీ
నాసిక్
మహారాష్ట్ర
ఆంధ్ర ప్రదేశ్
బంగాళాఖాతం
కర్ణాటక
మైసూర్
తమిళనాడు
కేరళ
కోయంబత్తూరు
మదురై
రామేశ్వరం
శ్రీ లంక

# భౌగోళిక పటం



పర్వతాలు
నదులు
సరస్సు
మఠాలు
చోకు మఠ్
కైలాస పర్వతం
నైన్రీ పర్వతం
మానససరోవర సరస్సు
నందా దేవి
భాగీరథి
నీలకంఠ
పూలలోయ
హేమకుండ్
యమున
గంగ
కాంచనగంగ
గౌరీ శంకర
ఎవరెస్ట్ పర్వతం
బ్రహ్మపుత్ర
కాశీ
అలహాబాద్
గంగ
వింధ్య పర్వతాలు
నర్మద
కావేరీ

# పరిచయం

నా చిన్ననాటి నుంచే స్వామీ రామ గురించి ఎన్నో కథలు విన్నాను. ఆ గాథలన్నీ ఆయన చేసిన గొప్ప తపస్సూ, కఠోర దీక్షలు, మరణించి తిరిగి బ్రతికిన భవాల్ రాకుమారుడుతో ఆయన సాంగత్యం, ఆయనకు గల యోగ శక్తుల చుట్టూ అల్లుకుని ఉండేవి. ఈ కథలు వింటుంటే, నాకు స్వామీ రామ కళ్లకి కనిపించే మనిషిలా కాక, జానపద గాథల్లో నాయకుడిలా కనిపించేవారు. ఉదాహరణకి, కాశీలో ఆగమాచారి అనే ఒక గొప్ప సంస్కృత పండితులు ఉండేవారు. ఆయన నాకు స్వామీ రామ యువకుడిగా ఉన్నపుడు బెనారస్‌లో గంగా నది ఒడ్డున కూర్చుని తీవ్రమైన ధ్యానస్థితిలోకి వెళ్తుండేవారనీ, అప్పుడు ఆయనకు తొంభై ఏళ్ల క్రితం మరణించిన ఒక గొప్ప మరుగుజ్జు పండితుడు ప్రతిరాత్రీ పాలూ, మిఠాయిలూ తీసుకొచ్చి ఇచ్చేవాడనీ చెప్పారు. ఆ కథ నాకు పరమాద్భుతంగా అనిపించేది. అదేదో కల్పనాలోకంలో జరిగే సన్నివేశంగా భావించేవాడిని. ఆగమాచారి నాకు మరో విషయం కూడా చెప్పారు. ఆ రోజుల్లో స్వామీ రామని అందరూ 'భోలే' అనో, 'భోలే బాబా' అనో పిలిచేవారట!

నేను ఈ కథని మా నాన్నగారికి చెప్తే, అసలు కథ అది కాదన్నారు ఆయన. నాన్న చెప్పడమేమిటంటే, భోలే బాబా కూడా తన గురువైన బాబా ధరమ్‌దాస్‌లాగా తన శరీరాన్ని స్వచ్ఛందంగా వదిలిపెట్టారట. 1950 లో ఆయన తన శరీరాన్ని వింధ్య పర్వతాల్లో ఒక దేవాలయం దగ్గర విడిచిపెట్టారు. తనకి శరీరాన్ని త్యజించాల్సిన సమయం ఆసన్నమైందని ఆయనకి అర్థమయ్యాక, తన గురూజీ కుటీరం ఎదుట ఒక గొయ్యి త్రవ్వి అందులో కూర్చుని, ఆ గోతిని బురదమట్టితో పూడ్చమని తన సహచరులతో చెప్పారు. వాళ్లు అలాగే చేశారు. అప్పుడు ఆయన తన చైతన్యాన్నంతా శిరస్సులోకి తెచ్చుకుని యోగ శక్తిని ఉపయోగించి, కపాలాన్ని భేదించి శరీర త్యాగం చేశారు. ఆ తర్వాత సాధు సంప్రదాయాన్ని అనుసరించి, ఆయన సహచర యోగులు ఆ గోతిని పూర్తిగా పూడ్చి వేసి, దానిపై ఆయన స్మారక చిహ్నాన్ని నిర్మించారు. 'ఆ స్మారక చిహ్నం ఇంకా అక్కడే ఉంది,' అన్నారు నాన్నగారు. నేనింకా అప్పటికి టీనేజ్‌లో ఉన్నాను. నాన్నగారు చెప్పిన ఈ కథ మరో అద్భుతమైన గాథలా అనిపించేది.

అప్పుడు 1972లో నేను అలహాబాదు యూనివర్శిటీలో చదువుతున్నాను. అక్కడ నేను స్వామి సదానంద అనే గొప్ప సాధువుని కలుసుకున్నాను. ఆయన నాకు యోగంలో అతి మార్మికమైన కొన్ని దృక్కోణాల గురించి బోధించారు. కానీ నేను ఆయనను శ్రీవిద్యోపాసన గురించి అడిగినప్పుడల్లా ఆయన చాలాసార్లు నా మాటని దాటేసేవారు. మరి కొన్నిసార్లు గట్టిగా నొక్కి అడిగితే నేను ఆ విషయాన్ని భోలే బాబా దగ్గర నుంచి నేర్చుకోవాలని అనేవారు. పరమ ఏకాంతాన్ని ఆనందించే ఆ భోలే బాబాని ఆయన 'యోగులకే యోగి', 'పరమయోగి' అంటూ ప్రస్తుతించేవారు. ఆయన ఎక్కడ ఉంటారో కనుక్కోవడం కష్టమనీ, ఆయన ఎప్పుడూ ఒక చోట ఉండే వారు కాదనీ స్వామి సదానంద చెప్పారు. భోలే బాబా బ్రతికే ఉన్నట్టు చెప్తారాయన. కానీ మా నాన్నగారు,

'ఆయన లేరు, శరీర త్యాగం చేశార'ని చెప్పారు! ఏది ఏమైనా, ఆయనను చూడాలని నాకు మరీ మరీ అనిపించసాగింది.

ఆ తర్వాత నా థీసిస్ సలహాదారు డా. లఖేరా, స్వామీ రామ ప్రస్తుతం అమెరికాలో ఉంటున్నారనీ, హిమాలయన్ ఇన్స్టిట్యూట్ అనే పేరుతో ఒక సంస్థని స్థాపించారనీ చెప్పారు. ఆ మాట వినగానే నాకు మొట్టమొదటగా స్ఫురించిన విషయం ఏమంటే, నాకు ఊహ తెలిసిన దగ్గర నుంచీ నేను వింటూ వచ్చిన 'స్వామీ రామ', ఈ స్వామీ రామ ఒకరే అయి ఉండరేమో అనిపించింది. నిజమైన సాధువు పశ్చిమ దేశాలకి ఎందుకు వెడతారు? నిజానికి స్వామీ రామ గురించి నేను విన్న కథలన్నీ నాలో పరస్పర విరుద్ధ భావాల్ని ఉత్పన్నం చేశాయి. నేను ఆయన్ని వెతుక్కుంటూ వెళ్లాలో లేదో నిర్ధారించుకోలేని ఒక అయోమయ స్థితిలో వదిలిపెట్టాయి. కానీ విధికి తనదైన ఒక ప్రణాళిక ఉంది సుమా!

1976 వ సంవత్సరం. న్యూఢిల్లీలోని ఫైవ్ స్టార్ అక్బర్ హోటల్– ఓ సాధు సందర్శనానికి అనువైన ప్రదేశం కాదు. కానీ నా జీవితంలో సరిగ్గా అక్కడే అలాంటి మహత్తర క్షణాలు సంభవించాయి. అంతే కాదు, అపూర్వ భూమికలకి నేను సాగించబోయే ప్రయాణానికి తొలి అడుగు పడింది కూడా అక్కడే. ఆయన ఎవరో కనుక్కోవడానికి రెండు గంటలు పట్టింది. నా జీవితమంతా ఈ సాధువు గురించి వింటూ వచ్చాను. అలాంటిది, ఆయనతోనే నేను మాట్లాడుతున్నాననే విషయం అర్థమయ్యేసరికి నా మనసు అనిర్వచనీయమైన ఆనందంతోనూ, వినమ్రభావంతోనూ నిండిపోయింది. ఒక క్షణం క్రితం దాకా నేను ఆయనతో చాలా సౌకర్యవంతంగా మాట్లాడుతూ ఉన్నాను. అకస్మాత్తుగా నేను మూగబోయాను. నాకిప్పుడు ఏం చేయాలో అర్థం కాలేదు. నా యావత్ శక్తీ కళ్లల్లో వచ్చేసింది. క్షణంలో వెయ్యో వంతు ఆయన్ని నేను శిరస్సు నుంచి పాదభాగం వరకు, లోపల నుంచి బయటకీ, బయట నుంచి లోపలికీ ఓ అద్భుతాన్ని చూస్తున్నట్టు చూశాను. నేను ఆయన ప్రక్కనే కూర్చుని ఉన్నాను. నా శిరస్సు అమాంతం ఆయన ఒడిలోకి వాలిపోయింది. నిశితంగా చూస్తున్న ఆయన విశాలమైన నేత్రాల్లో అనంతమైన దయాసాగరం పొంగులు వారుతోంది. ఆ క్షణంలో నాపై ఆయన వర్షించిన ప్రేమ మునుపెన్నడూ నాకు అనుభవంలో లేనిది! నేను అమితానందంలో మునిగి తేలుతున్నానని ఆయనకి అర్థమైపోయింది. నా ఆలోచన, మాట, చేష్ట, అన్నీ మూగబోయినాయి.

స్వామీజీ మాట్లాడారు, *'నేను నీ గురించే ఎదురు చూస్తున్నాను. ఎప్పుడు వస్తున్నావు అమెరికాకి? నువ్వు నాకు సహాయంగా ఉండాలి.'* ఆ తర్వాత ఆయన ప్రాపంచిక వ్యవహారాలు మాట్లాడసాగారు. కాసేపయ్యాక, స్వామీజీ నన్ను వెళ్లి మళ్లీ మరుసటి రోజు రమ్మన్నారు. ఆనాటి మధ్యాహ్నమంతా, ఆ రాత్రంతా స్వామీజీ గురించి మిగతా సాధువులు, యోగులు, మా నాన్నగారు చెప్పిన సంగతులన్నీ తలుచుకున్నాను. ఆ తర్వాత చాలాసేపు మనసులో ఆయన గురించి ఎన్నో ఆలోచనలు శరపరంపరగా వస్తూనే ఉన్నాయి: *ఇక మీదట నేను ఈ ప్రేమమూర్తితో, ఇంత దయతో ఆదరించే అనంత జ్ఞానితో, మహనీయ సాధువు సాన్నిధ్యంలో జీవిస్తాను. ఇదిగో, ఇప్పుడేగా ఆయనను కలుసుకున్నాను! ఇక నా సమస్యలన్నీ తీరిపోయినట్టే! ఆయన నన్ను అమెరికా తీసికెళ్తారు. ఇక ఈ భారతీయ సమాజాన్ని ఊపిరి తిప్పుకోలేనంతగా వేధిస్తున్న అవినీతిని ఎదుర్కోనవసరం లేదు.* స్వామీజీ ఎక్కడున్నారో వెతికి పట్టుకోమని ప్రేరణ ఇచ్చిన వారందరి పట్లా కృతజ్ఞతతో నా మనసు నిండిపోయింది. చాలా విచిత్రం కదా ఇలా జరగడం! నన్ను స్వామీజీ సాన్నిధ్యానికి చేర్చిన శ్రీ ఆనంద ప్రతాప్ ఋణం తీర్చుకోలేనిది! అపరిమితమైన కుతూహలం, ఉత్సాహంతో నిండిన మనసు చురుగ్గా పని చేస్తుండడంతో నాకు నిద్ర పట్టలేదు.

మరునాడు నేను హోటల్‌కి వెళ్లాను. కనీసం ఒక గంటసేపు లాబీలో వెయిట్ చేసిన తర్వాత స్వామీజీ నన్ను తన రూమ్‌కి రమ్మని కబురు చేశారు. పైకి వెళ్లాను. రూమ్ తలుపు తీసే ఉంది. నిశ్శబ్దంగా లోపలికి అడుగు పెట్టాను. ఆయన టూ-పీస్ వెస్టర్న్ సూట్‌లో ఉన్నారు. ఆయన పాదాల్ని తాకి నమస్కరించబోతుంటే, స్వామీజీ, 'నాతో రా. మనం కొంచెం షాపింగ్ చేసి వద్దాం,' అన్నారు. ముందటి రోజు ఆయన ఎంత ప్రశాంతంగా వ్యవహరించారో, ఆరోజున అంత ఆదేశాలూ, ఆజ్ఞలూ ఇస్తూ కఠినంగా వ్యవహరించారు. అయినా గానీ నేను ఎలాగోలా ధైర్యం కూడదీసుకుని ఆయన ఆశీర్వాదం కోసం ఆయన పాదాలకు నమస్కరించాను. ఆయన స్వరం దాదాపుగా గర్జిస్తున్నట్టే ఉంది, 'ఈ కాళ్లు పట్టుకోవడం...ఈ గోల ఏమిటి? సరే, లే, నడు, వెళ్దాం!' ఆయన నా చేతికి ఒక బ్యాగ్ ఇచ్చారు, మేమిద్దరం బయటికి వచ్చేశాం.

మేము కారులో ఎక్కాం. ఆయన ముందు సీటులో కూర్చుంటూ, నన్ను వెనక సీటులో కూర్చోమన్నారు. అలా ఎందుకు అన్నారో నాకు గాభరా వేసింది. ఎందుకంటే, భారతదేశంలో అనుచరులు ముందు సీట్లో కూర్చుంటూ ఉంటారు. హోదా కలిగినవారు వెనక సీటులో కూర్చుంటారు. మేము కన్నాట్ ప్లేస్‌కి వెళ్లాం, ఢిల్లీలో ప్రధాన షాపింగ్ జిల్లాల్లో ఒకటి. కారు ఆగగానే స్వామీజీ క్రిందికి దిగి షాపుల వైపు వేగంగా నడవసాగారు. నేను కాస్త చొరవ చేసుకుని, కారు తలుపు తీసుకుని దిగి బయటకి వచ్చాను. కారులో ఇంకేమీ వదిలిపెట్టామేమో అన్నట్టు ఓ సారి కారు అంతా కలయజూశాను. నేను స్వామీజీ వెనక నడవడం మొదలుపెట్టేసరికి, ఆయన అప్పటికే యాభై గజాల పైబడి నడిచి, వెనకగా వస్తున్న నా కోసం ఆగారు. నేను ఆయనకు దగ్గరగా వెళ్లి ఆయన ముఖం వంక చూశాను. అబ్బ! ఎంత ఎర్రగా ఉందో! ఆయన కళ్లు విస్ఫులింగాలు కురిపిస్తున్నాయి. చూపులతోనే పేల్చి పారేసేటట్టు చూశారాయన! నేను ఆయనకి ఒక గజం దూరంలో ఉండి ఉంటానేమో! అప్పుడు స్వామీజీ, 'ఇంత ఆలస్యంగా పనులు చేసేవాళ్లకి వాళ్ల పనులూ తెమలవు. వాళ్ల వల్ల అవతలవాళ్లకీ లేనిపోని ఆలస్యం! నువ్వు నాతో ఉండాలనుకుంటే, ఇలా తాత్సారం చేయకు!' అన్నారు. నేను గుణపాఠం నేర్చుకున్నాను. అలాగే, స్వామీజీలో ఈ రకమైన దృక్కోణం గురించి అంతకు ముందెన్నడూ విని ఉండకపోయినా అందుకు నన్ను నేను సిద్ధం చేసుకున్నాను.

వారంలో మిగతా రోజులన్నీ చాలా తీవ్రతతోనే గడిచాయి. కొద్దిసేపు మాత్రం స్వామీజీ చాలా ప్రేమగా, దయగా నాకు మళ్లీ మళ్లీ భరోసా ఇస్తూ వచ్చారు. నా మనసుకి అందనంత ఉన్నత స్థితికి తీసికెళ్లి నా ఊహలకు రెక్కలు తొడిగారు. నేను ఆయన ప్రియతమ శిష్యుడినని నేను ఊహించుకోవడం మొదలుపెట్టాను. ఆయనకు గల లౌకిక ఆధ్యాత్మికపరమైన విషయాలకు నేనే వారసుడిని అవుతానని భావించాను. స్వామీజీ నాతో ఉత్కృష్ట స్థాయికి చెందిన ఆధ్యాత్మిక సాధన చేయించి తన ఆధ్యాత్మిక శక్తిని నాలోకి పంపిస్తారనీ, త్వరలోనే యోగ సిద్ధులు నాకు పట్టుబడతాయనీ ఆశించాను. ఆయన దయవల్ల నేను ఐహిక ప్రపంచపు మాయలు, ఆకర్షణల నుంచి నేను విముక్తమవుతానని అనుకున్నాను. ఆయన కృపతో నా కోరికలకి నేను లొంగిపోకుండా నిలబడగలనని అనిపించింది. ఆ విధంగా నాలో చెలరేగుతున్న ఆధ్యాత్మిక ఆకాంక్షలను ఆయన ఉత్తేజితపరుస్తూ వచ్చారు. మూడు, నాలుగు రోజులు ఇలా గడిచాయి.

అప్పుడు యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ ఆఫ్ ఇండియా ఛైర్మన్, స్వామీజీని చూడడానికి వచ్చారు. అప్పుడు అకస్మాత్తుగా ఆయన ధోరణిలో మార్పు వచ్చింది. స్వామీజీ ఆయన్ని నాకు ఢిల్లీ యూనివర్సిటీలో లెక్చరర్ హోదా ఇమ్మని అడిగారు. పైగా, అంత పిన్న వయసులో లెక్చరర్ కావడం ఎంతో మంచిదని నన్ను ఒప్పించడం మొదలుపెట్టారు స్వామీజీ. ఆయన నన్ను ఒప్పించే ప్రయత్నంలో చెప్పిన కారణాలు చూడండి: 'నువ్వు త్వరలోనే ప్రొఫెసర్‌ని కాగలుతావు. నీ

తల్లిదండ్రులకీ, ఇతర కుటుంబ సభ్యులకీ చేరువగా ఉంటావు. నన్ను అంటే ఈ 'స్వామి'ని పెద్దగా లెక్కలోకి తీసుకోనవసరం లేదు. నేను నీకు గానీ మరెవరికైనా గానీ ఏమీ కాను, ఈ రోజు ఇక్కడ ఉంటే, మర్నాడు మరెక్కడో ఉంటాను...!'

నేను దిమ్మెరపోయాను. 'మరి ఆరోజు మీ నీడలో శరణు ఇస్తానని చెప్పారే! మరి దాని సంగతి?' అని అడిగాను.

'మరీ అంత భావుకుడివి కావద్దు. ఇలాంటి సువర్ణావకాశాల్ని వదులుకునే వాళ్లని మూర్ఖులని అంటారు,' అన్నారు. నేను మౌనంగా ఉన్నాను.

స్వామీజీ నన్ను పోరుతూనే ఉన్నారు, కానీ నేనమీ స్పందించలేదు. 'నువ్వేమీ మాట్లాడవేమిటీ?' ఆయన గుచ్చి గుచ్చి అడుగుతున్నారు. 'నాకు తీరని పనులుంటాయి. నువ్వు నా మాటైనా వినాలి, లేదా ఇక్కడ నుంచి వెళ్లిపోవాలి,' అని చెప్పారు.

'నేను మూర్ఖుడిలా ఉండకూడదనే ప్రయత్నిస్తున్నాను స్వామీ. మీరు నాకు మొదటి రోజున ఇచ్చిన అవకాశాన్ని వదులుకోదల్చలేదు. అంటే, నేను మీతోనే కలిసి ఉండడం గురించి మాట్లాడుతున్నాను!' అన్నాను నేను.

స్వామీజీ కఠినంగా మారారు, 'నువ్వు అంత మొండిగా, నిర్లక్ష్యంగా ఉంటావని నేను ఊహించలేదు. సరే, వెళ్లు. మనం రేపు కలుద్దాం,' అన్నారు గట్టిగా.

మరుసటి రోజు నేను ఆయన దర్శనానికి వెళ్లినపుడు, ఆయన ఎంతో ప్రేమగా, దయగా పలకరించారు. అందివచ్చిన ఆ టీచింగ్ పొజిషన్‌ని నేనెందుకు వదులుకుంటున్నానో చెప్పమన్నారు. నేనప్పుడు, 'స్వామీజీ, నేను మీతోనే ఉండాలనుకుంటున్నాను,' అని చెప్పాను.

దీనికి ఆయన చాలా సీరియస్ అయ్యారు. ఆయన విశాల నేత్రాలు నా వైపు తిరిగాయి, ఆయన గాఢమైన, బరువైన స్వరంతో, 'సాధువుతో కలిసి జీవించడం నిరంతరం అనేక రకాల క్లేశాలు, ఇబ్బందులతో కూడుకున్నది. అయినా సరే, అన్ని పరిస్థితుల్నీ తట్టుకుని నాతో ఉండడానికి సిద్ధమైతేనే నువ్వు నాతో రావడం గురించి ఆలోచించు,' అన్నారు. ఆయన ఉద్దేశ్యమేమిటో నాకు తెలియలేదు, ఆయన నన్ను వదిలించుకోవడానికి చూస్తున్నారనిపించింది.

'నాకు కావలసిందల్లా మీతో ఉండడమే,' నేను వేడుకున్నాను. 'నేను ఎన్నో రకాలుగా ఊహించుకున్నాను, కల్పనలు చేశాను. స్వామీజీ, నన్నిప్పుడు నిరాశ పరచకండి!'

'నువ్వు నిజంగా కోరుకునేది ఇదేనా?' అని అడిగారు స్వామీజీ సున్నితంగా.

'అవును, అంతే!'

'అయితే, నీ కోరికలన్నీ వదులుకోవలసి ఉంటుంది. అప్పుడు నీకేం కావాలో నేను అందిస్తాను. నువ్వు అందుకున్న విషయమంతా నీతో ఉండేలా చూస్తాను,' అన్నారు.

నేను ఆయన పాదాల మీద నా శిరసుని ఉంచాను. ఆయన నా తలపై చేయి వేసి, 'లే! ఇక మీదట నువ్వు ఎన్నడూ జ్యోతిష్యం జోలికి గానీ, రాజకీయాల జోలికి గానీ పోకూడదు. ఎన్నో మతాల్లో అనేకానేక వర్గాలు, వాటిల్లో చీలికలూ ఉన్నాయి, వాటి జోలికి నువ్వు పోకూడదు, సరేనా, అలా అని నాకు మాటివ్వు' అన్నారు. ఈ వాగ్దానానికి పూర్తి అన్వయమేమిటో నాకు అప్పుడు అర్థం కాలేదు, కానీ ఏమైతేనేం, నేను ఆయన కోరిన విధంగానే మాట ఇచ్చాను. ఒక్కోసారి నాకు ఆయనని రెండు నిముషాల సేపు కూడా చూడడం సాధ్యమయ్యేది కాదు, కానీ కొన్నిసార్లు స్వామీజీ నన్ను కొన్ని గంటలపాటు ఉంచేసేవారు. అలాంటి సమయంలో సాధారణంగా ఆయన చుట్టూ ఎవరూ ఉండేవారు కారు. నా డాక్టరల్ డిజర్టేషన్ తత్వ వివేచన, ఆధ్యాత్మిక సాధనకి సంబంధించినది కావడంతో ఆ విషయం గురించి మాట్లాడడానికి ఎక్కువ ఇష్టపడేవారు

స్వామీజీ. ఆ సమయాల్లో నేను ఆయన వ్యక్తిగత జీవితం గురించి ప్రశ్నిస్తే మాత్రం వాటిని పట్టించుకునేవారు కారు. అసలు గతమే లేనట్టు ఉండేది ఆయన వైఖరి.

నా అదృష్టంకొద్దీ మా నాన్నగారి స్నేహితుల్లో ఒకరైన శ్రీ ఆనంద ప్రతాప్ సింగ్‌కి స్వామీజీతో చాలా కాలంగా పరిచయం ఉంది. ఆయన టెహ్రీ గఢ్‌వాల్ రాజావారి అల్లుడైన శ్రీ రాజా దినేష్ సింగ్‌కి వ్యక్తిగత సహాయకులు, ఫ్యామిలీ ఫ్రెండ్ కూడా. స్వామీజీ ఈ రాజ్యంలోనే జన్మించారు, ఇక్కడే తన గురువుగారితో కలిసి జీవించారు. గఢ్‌వాల్ రాచ కుటుంబానికి వీరిద్దరి గురించీ బాగా తెలుసు. ఆ తర్వాత కొన్ని నెలలలోపే శ్రీ సింగ్‌జీ నాకు స్వామీజీ గురించి ఎన్నో కథలు చెప్పారు. దాంతో నాకు స్వామీజీ జీవిత చరిత్రని రాయాలనే ప్రేరణ, బలమైన నిశ్చయం మనసులోకి వచ్చేశాయి. వారి అనుమతి కోరాను. ఆయన హాయిగా నవ్వేసి, మృదువుగా, దృఢంగా, 'ఆ, సరే, సరే! ఇరవై ఒక్క ఏళ్లు ఆగు. ఆ తర్వాత రాద్దువు గానీలే,' అన్నారు. మానసిక పరిపక్వత లేని నా మనసు స్వామి మాటలకి తటాలున అసౌకర్యానికి గురైంది, ఆశ కాస్తా నిరాశగా మారింది. ఉత్సాహం ఆవిరై పోయింది. వెనువెంటనే స్వామీజీ మాట్లాడుతున్న విషయాన్ని వేరే వైపు తిప్పారు, స్వామీజీ తర్వాత నన్ను పంపేశారు. ఆ తర్వాత నేను మళ్లీ ఆయన్ని పది నెలల వరకు చూడలేదు.

స్వామీజీ గురించి నాకు మరింత అవగాహన కలిగించిన మరో ఇద్దరు మహనీయులు ఉన్నారు. వారిలో ఒకరు సింగ్‌జీ మాతృమూర్తి. 1962–1964 మధ్య కాలంలో స్వామీజీ అలహాబాదులో ఉన్నపుడు ఆయన వెంట ఉన్న పావనమూర్తి. ఆమె స్వామీజీ గురించి మాత్రమే కాక, వివిధ సంప్రదాయాలు, పంథాలకు చెందిన ఎందరో సాధువులు, యోగుల గురించిన విషయాలు చెప్పగల 'నడిచే *గ్రంథసమస్తం.*'

నేను స్వామీజీతో కలిసి పని చేయబోతున్నానని విన్న ఆమె నాకు ఉదార హృదయంతో ఒక సూచన చేసింది–'బాహ్య వైఖరి చూసి పొరబడకు నాయనా. ఆయన తన గురువుకి తప్ప ఎవరికీ చెందినవారు కారు. ఆయన ఈ ప్రపంచంలోనే ఉంటారు గానీ, ఈ ప్రపంచానికి చెందినవారు కారు. పైకి ఆయన ప్రశాంతంగానే ఉన్నట్టు కనిపిస్తారు గానీ, ఆయన ఓ రగులుతున్న అగ్నిజ్వాల. ఆయనతోటి ఉండడమంటే *అగ్నిగుండం* మీద కూర్చోవడమే. ఆయన సుడిగాలిలాంటి వారు. ఆయన్ని బంధించాలని ప్రయత్నించకు. ఆ ప్రయత్నాలన్నీ వ్యర్థమవుతాయి.'

ఆమె నన్ను స్వామీజీ నివసించిన అలహాబాదులోని 'శివ కుటీ'కి తీసికెళ్లి, అక్కడ స్వామీజీతో ఉండే రోజుల్లో తన అనుభవాలన్నీ పంచుకున్నారు. ఆమె చెప్పిన విషయాలతో స్వామీజీ మార్మిక కోణంపై నా అంతర్దృష్టి ప్రసరించింది. ఇప్పటి జీవితంలో స్వామీ రామాగా ప్రసిద్ధి పొందిన స్వామీజీ ఒకప్పుడు భోలే బాబాగా ఎలా ఉండేవారో మొదటగా నాకు తెలియజేసింది ఆమే! ఆమె నాకు భోలే బాబా గురువుగారైన బెంగాలీ బాబా గురించి కూడా చెప్పారు. ఆయన్ని *బాబా ధరమ్‌దాస్* అని పిలుస్తారు. గత శతాబ్ది ఆరంభంలో ఆ స్వామీజీని ఆ పేరుతోనే పిలిచేవారు. స్వామీ రామకి తన ఇచ్ఛానుసారం మరణించి, ఎన్నో గంటలు గడిచాక తిరిగి జీవించగలిగే శక్తి ఉందనే విస్మయం గొలిపే సంగతిని వివరించారు. అలహాబాదు విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ల గ్రూప్‌కి స్వామీజీ తన ఈ సామర్థ్యాన్ని ప్రదర్శించి చూపారు.

అలాగే స్వామీజీ గురించి నాకు తెలియజెప్పిన మరో వ్యక్తి డా. ఎం.పి.లఖేరా. ఆయన అలహాబాదు విశ్వవిద్యాలయంలో నా థీసిస్ సలహాదారు. ఆయనదీ స్వామీజీ జన్మించిన గ్రామమే. శ్రీ లఖేరా, స్వామీజీ గురించి ప్రస్తావించిన విషయాలు శ్రీ సింగ్‌జీ, ఆయన మాతృమూర్తి అందించిన సమాచారానికి పూర్తి భిన్నంగా ఉంది. వీరు చెప్పినదాన్ని బట్టి, స్వామీజీ గఢ్‌వాల్ హిమాలయాల్లో ఒక పండితుని కుమారుడు. పినతండ్రి నుంచి ఆయనకు వారసత్వంగా సంక్రమించిన అంతటి అపార సంపదని గానీ, అంతటి అందమైన మనిషిని గానీ తానెప్పుడూ చూడలేదని చెప్పారు

లఖేరా. మంచి తెలివితేటలు, అపారమైన ధారణాశక్తి గల స్వామీజీకి విద్యార్థిగా గొప్ప పేరు ప్రతిష్ఠలు ఉన్నాయి. కానీ ఆయన సన్యాసిగా మారి అదంతా వ్యర్థం చేసుకున్నారని దిగులుగా చెప్పారు డా. లఖేరా. నిజంగానే స్వామీ రామ విశ్వవిద్యాలయంలో చేరి ఉంటే, ఆయన భారతదేశంలో అత్యంత ప్రతిభావంతులైన తత్వజ్ఞులు ఆర్.డి.రానడే వారసత్వ జ్ఞానాన్ని ముందు తరాలకి అందించే మహత్తర జ్ఞాన సంవాహకులుగా ఉండేవారని అన్నారు. స్వామీజీ విద్యార్థి దశలో ఉన్నపుడు ప్రొఫెసర్ రానడే ఆయన పట్ల ప్రత్యేకమైన ఆప్యాయతని కనబరిచేవారట. ఆయనతో ఏకాంతంగా మాట్లాడేవారట. కానీ అందరినీ నిరాశపరుస్తూ స్వామీజీ తన అధ్యయన ప్రపంచాన్ని వదిలిపెట్టి లక్ష్యరహితంగా తిరగసాగారనీ, ఆయన హఠయోగంపై గొప్ప పట్టు సాధించారనీ చెప్పారు డా. లఖేరా. విద్యార్జనలో అత్యద్భుతంగా వికసిస్తున్న తన ప్రజ్ఞాపాటవాల్ని హఠాత్తుగా నిలిపివేసి స్వామీ రామ తన మానసిక శక్తుల్ని సంపుటీకరించుకున్నారనీ, స్వామీ రామ ఒక అద్భుతమైన హఠయోగిగా తయారయ్యారనీ డా. లఖేరా ఒప్పుకున్నారు.

నేను స్వామీ రామని 1976లో కలిసినది మొదలు మళ్లీ శీతాకాలంలో 1979లో అమెరికాకి వెళ్లే దాకా ఢిల్లీలో వీలైనన్ని ఎక్కువ సార్లు కలుస్తూ వచ్చాను. వారి ఆదేశాల్ని పాటించి, నేను కాశీ, కామాఖ్య ఆలయాలు దర్శించి వచ్చాను. ఆ తర్వాత 1979 శీతాకాలంలో నేను అమెరికాకి వచ్చాను. స్వామీజీ గురించి ఇక్కడివాళ్ల మాటలు నాకు పూర్తి కొత్తగా ఉన్నాయి. నాకు తెలిసిన స్వామీ రామ సమాచారం కంటే ఇదంతా పూర్తి భిన్నమైన సమాచారం. నేను మొదటి ఏడు నెలలు మిన్నియాపోలిస్‌లో ఉన్నాను. స్వామి గురించి దృఢమైన అభిప్రాయాల్ని వెలిబుచ్చిన వారెందరినో నేను కలిశాను. కొంతమంది ఆయన్ని తన అద్భుతశక్తులతో ఒక మనిషి జీవితాన్ని మార్చేయగల హిమాలయ సాధువుగా పరిగణించేవారు. మరి కొందరు ఆయనను నాడీ వ్యవస్థపై *అద్భుతమైన నియంత్రణ కలిగి* ఉన్న మర్మయోగిగా అభివర్ణించారు. మరి కొందరు ఆయనకి పదిమందినీ ఆకర్షించే ప్రబలమైన ఆకర్షణ శక్తి ఉందని అనేవారు. ఆయనకి గల ఈ మూడు రకాల కోణాలూ నాకు పూర్తిగా అపరిచితమైనవీ, విచిత్రమైనవీను. ఎందుకంటే, వారు భారతదేశంలో ఉండగా, నేను వారిని దర్శించినపుడు, ఏ విషయంలోనూ వారిని ముందుగా అంచనా వేయడం సాధ్యం కాదనీ, దివ్యప్రేమ ప్రవహించే సాధువనీ గ్రహింపుకొచ్చింది నాకు. స్వామీ రామకి తమ గురుదేవుల సాన్నిధ్యం, అమ్మవారి ప్రసన్న దృక్కులూ మహదానందాన్ని ఇచ్చేవి. భారతదేశంలో స్వామి గురించి చెప్పుకునే కథల ద్వారా వారు అనేకమంది గురువుల సమక్షంలో అధ్యయనం చేసిన తీరు, భారతదేశంలో పరమపావనమైన తీర్థక్షేత్రాల్లోని దేవాలయాల్లోనూ, సుదూర ప్రాంతాల్లోనూ వారు చేసిన తీవ్రమైన తపస్సూ, అప్పుడప్పుడూ ఆయన చేసే పొరబాట్లూ, వాటిని వారి గురు దేవులు మిగతా సాధువుల సాయంతో సరిదిద్దిన వైనమూ వంటి ఎన్నో అంశాలు తెలిశాయి. అప్పుడప్పుడూ కొందరికి ఆయన సమక్షంలో దివ్యానుభూతులు కలుగుతూ ఉండేవి. కానీ మిన్నియాపోలిస్‌లోని ఆయన అనుచరగణంలో కొందరు స్వామిని తమాషాలు చేసే ఇంద్రజాలికునిగా భావించారు. స్వామి గురించిన ఇలాంటి అభిప్రాయాన్ని మాత్రం నేను మన దేశంలో ఎక్కడా వినలేదు.

1980 వేసవిలో స్వామి నన్ను పెన్సిల్వేనియాలోని హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్ హెడ్ క్వార్టర్స్‌కి పిలిపించారు. సంవత్సర కాలంలో ఎక్కువ కాలం స్వామి అక్కడే ఉండేవారు. ఆ సమయంలో నేను స్వామీజీలో మరో వినూత్న కోణం చూశాను. స్వామీజీ ఒక పెద్ద సంస్థకి సీఈఓగా వ్యవహరిస్తున్న పాత్ర అది. స్వామీజీ ఒక షెడ్యూల్‌కి కట్టుబడి ఉంటారని నేనెన్నడూ ఊహించలేదు. పైగా ఇంత తీరికలేని కార్యప్రణాళికని ఆయన అంత అవలీలగా నిర్వహిస్తారని నేను ఏ మాత్రం ఊహించలేదు. కానీ వారు దేశమంతటా పర్యటిస్తూ, ప్రసంగాలు చేస్తూ, నాకు

మరో విభిన్నమైన కోణంలో కనిపించారు. పాలనాపరమైన వ్యవహారాల్లో ఆయన అందర్నీ పరుగులెత్తిస్తూ, మిలిటరీ కమాండర్‌లా వ్యవహరిస్తారు. స్వామీజీ ఇన్‌స్టిట్యూట్‌లో ఉన్నారంటే, సమావేశాలు, ప్రసంగాలూ, పుస్తకాల రచనా వ్యాసంగం, ఇలా ఎన్నో కార్యక్రమాలు నిరంతరాయంగా ప్రణాళికాబద్ధంగా జరుగుతూనే ఉంటాయి. నిర్మాణ కార్యకలాపాల్ని పర్యవేక్షించడమో, కొత్త ప్రాజెక్టుల రూపకల్పన చేయడమో ఏదో ఒకటి జరుగుతూనే ఉంటుంది. ఇన్ని పనులు పెట్టుకున్నా స్వామీజీ తన వంట తానే స్వయంగా వంట చేసుకునేవారు. నా అదృష్టం కొద్దీ ఆయనకు నేను వంటలో సహాయకుడిగా ఉన్నాను. భారతదేశంలో స్వామీజీ ఉన్నప్పుడు ప్రజలు ఆయనను తీరిగ్గా ఉంచేవారు కాదు. కానీ ఇక్కడి సంస్థలో సభ్యులకి మాత్రం ఆయన ఎంతో చక్కటి శిక్షణనిచ్చారు. అందుకే వాళ్లు స్వామీజీని బయట తిరుగుతున్నప్పుడు గానీ, నడకకి వెళ్లినపుడు గానీ, మొక్కలు నాటుతున్నపుడు గానీ, భోజనం చేసేటప్పుడు గానీ లేదా పిల్లలతో ఆడేటప్పుడు గానీ ఆధ్యాత్మపరమైన, వ్యాపారపరమైన ప్రశ్నలు వేసి విసిగించరు. భారతదేశంలో నేను స్వామీజీని ఫైవ్ స్టార్ హోటల్స్‌లో చూసేవాడిని. వారిని కలుసుకోవడం పెద్ద పెద్ద ప్రముఖులకి కూడా రెండేసి వారాలు పట్టేసేది. ఇక్కడ స్వామీజీ అందరికీ అందుబాటులో ఉంటారు. భారతదేశంలో ప్రజలందరికీ ఆయన గొప్ప ఆకర్షణీయమైన వ్యక్తి. కానీ ఆయన ఎంతో నిరాడంబరంగా ఉండేవారు.

ఆయన ఎంత కష్టపడి పని చేస్తారో, ఎంత తక్కువగా నిద్రపోతారో ప్రత్యక్షంగా చూసి నాకెంతో విస్మయంగా ఉండేది. సాధారణంగా వారు ఉదయం ఏడు గంటలకి తమ దినచర్య ప్రారంభించేవారు, రాత్రి రెండు గంటల దాకా ఏదో ఒక పని చేస్తూనే ఉండేవారు. పొద్దుపోయేదాకా తనతో కలిసి పనిచేసిన అనుచరగణాన్ని వెళ్లిపోమని చెప్పి, తెల్లవారుఝామున వారు స్నానం చేసి, తమ అసలు సాధన ప్రారంభించేవారు–ధ్యానం! ఎంత సమయం అయినా సరే, ఆయన తను ఉన్న క్షణాల్ని ఆనందించేవారు. తను ఏం చేస్తే దాన్నే ఆనందిస్తూ ఉండేవారు–ధ్యానం, టీవీ చూడడం, పుస్తకాలు రాయడం, పిల్లలతో తానూ కేరింతలు కొట్టడం, అతిథులతో మాట్లాడడం, సంస్థాగత సభ్యులతో టెన్నిస్ ఆడడం, ఇలా అన్ని పనులూ ఆయనకి ఆనందమే! వారి దృష్టిలో వంట చేసుకోవడం, పాడడం, పెయింటింగ్, తోటపని, బోధన, ప్రయాణించడం, వ్యాపార నిర్వహణ, ఆధ్యాత్మిక విషయాల్ని చర్చించడం మొదలైనవన్నీ వివిధ రూపాల్లో చేసే భగవదార్చనే. వారు ప్రతి ఒక్కరి పట్లా ఎంతో మర్యాదగా ప్రవర్తించేవారు, కానీ తమతో సన్నిహితంగా కలిసి పనిచేసేవారి పట్ల చాలా కఠినంగా వ్యవహరించేవారు. ఏకాంతంలో వారితో ఆయన చాలా ప్రసన్నంగా వ్యవహరించేవారు, కానీ పదిమంది ఎదుటా ఎంతో నిర్దయ కనబరిచేవారు. వారి వాస్తవిక స్వభావం పరిచయం లేని చాలా మంది శిష్యులు ఆయనని విడిచిపెట్టి వెళ్లిపోయేవారు.

1983లో స్వామీజీ తాను రచించిన హిమాలయ పరమగురువులతో జీవనం గ్రంథాన్ని నన్ను హిందీలోకి అనువదించమన్నారు. నేను పగటి వేళంతా అనువదించి, రాత్రి పూట ఆయనకి చదివి వినిపించేవాడిని. రాసిన విషయం వింటుంటే ఆయనకి కొత్త విషయాలు జ్ఞాపకం వచ్చేవి. దాంతో చదువుతున్న నన్ను మధ్యలో ఆపి ఆయన ఆ పుస్తకంలో ఉదహరించని అనుభవాలెన్నింటినో చెప్పుకొచ్చేవారు. అవి ఎంతో జిజ్ఞాస కలిగించే విషయాలు, సారగర్భితమైన అంశాలు. నాకు అప్పుడు రాయడానికి సమయం ఉండేది కాదు. కానీ వాటిని నేను నా హృదయంలో భద్రపరుచుకున్నాను. ఈ సెషన్లలోనే స్వామీజీ నాతో తమ గురుదేవుల గురించి చెప్పేవారు. గురుదేవులు పుట్టిన ప్రదేశం, హిమాలయాలు, వింధ్య పర్వతాల్లో వారికి నచ్చిన ప్రదేశాలు, వారి శిష్యవర్గంలో ప్రసిద్ధులైన రాకుమార భవాల్ సన్యాసి లాంటి కొందరి ముఖ్యుల గురించీ

మాట్లాడేవారు. ఆ సమయంలో స్వామీజీ ఎక్కువ కాలం టిబెట్‌లోనే గడిపే తమ పరమ గురువుల గురించీ, కైలాస పర్వతానికి పశ్చిమ దిశగా ఉన్న లచ్చూలోయలో ఉన్న చోకు గొంప గురించీ కూడా చెప్పారు. కానీ గురువుల సాన్నిహిత్యంలో తాను ఎలా గడిపారో, ఆ జీవితం గురించి మాత్రం స్వామీజీ ఎన్నడూ చెప్పలేదు. మధ్య భారతదేశంలో 1985లో టికమ్‌గఢ్ నుంచి ఖజురాహోకి వెళ్తున్నపుడు నేను కూడా స్వామీజీతో కలిసి వెళ్లిన సందర్భంలో నాకు ఆ విషయం తెలిసింది.

ఈ పర్యటనలోనే స్వామీజీ తన కుటుంబ సభ్యులకు, ఇతర బంధువర్గానికీ నన్ను పరిచయం చేశారు. వారు స్వామీ రామగా మారక మునుపు, వారితో స్నేహం చేసిన వ్యక్తుల్ని కూడా నేను కలుసుకున్నాను. ఈ మిశ్రమ సమూహాన్ని కలుసుకోవడం నాకు చాలా ఆసక్తిగానూ, నిర్ఘాంతపోయే విధంగానూ ఉండేది. వీళ్లలో కొందరు స్వామీజీకి అంకితమైపోయిన విద్యార్థులు, మరి కొందరు కేవలం ఆరాధకులూ, అనుచరులూ! మరి కొందరికి ఆయన కేవలం బంధువు, లేదా పాత స్నేహితుడు. ఆయన ఒకే సమయంలో అనేక పాత్రల్ని పోషించడం నేను చూశాను. సూట్, సిల్క్ షర్టులో ఉండే ఆయన ఎవరింటికి వెళ్లినా ఒక బంధువులా ఇమిడిపోయి, వారితో కుటుంబ విషయాలు మాట్లాడుతుండేవారు, ప్రాపంచిక విషయాల మీద పరిపూర్ణమైన ఆసక్తి కనబరిచేవారు. శిష్యులకి స్వామీజీ బోధ అత్యంత ప్రీతిపాత్రంగా ఉండేది. వీటన్నింటి మధ్యా తీరిక చేసుకుని దగ్గరలో ఉన్న కొన్ని ప్రదేశాల్లో ధ్యానం చేయడానికి చిన్న చిన్న ట్రిప్స్ వేసేవారు. ఇలాంటి సందర్భాల్లోనే వారి సహాధ్యాయి (ఒక గురువు వద్ద చదువుకునేవారు, గురుభాయి) అయిన టికమ్‌గఢ్ రాకుమారులు తమ సాధన (ఆధ్యాత్మిక అభ్యాసాలు)ని కొనసాగించేవారు. అక్కడికి స్వామీజీ గురుదేవులు తరచుగా వెళ్తుండేవారు.

ఈ సందర్భంలోనే స్వామీజీ మొట్టమొదటిసారిగా తమ గురుదేవులతో కలిసి ఈ పర్వతాలు, అరణ్యాల్లో కలిసి సంచరించడం గురించి తెలియజేశారు. గురుదేవులు తనకి పాములంటే ఉన్న భయాన్ని ఎలా పోగొట్టారో తెలియజేశారు. ఖజురాహో మందిర సముదాయం, శిథిలాలు వారికి ఇష్టమైన నివాస ప్రాంతాలని చెప్పారు. అక్కడికి దూరంగా ఉన్న 'అరవైనాలుగు మంది యోగినుల' మందిరాన్ని చూస్తూనే వారు అలౌకిక స్థితిలోకి వెళ్లిపోయేవారు. కొద్దిసేపు మాట్లాడలేకపోయేవారు. ఒక వారం తర్వాత స్వామీజీ తనకి ఏడేళ్ల వయసు ఉన్నపుడు గురుదేవులు ఆ ప్రదేశంలో తనకిచ్చిన అపురూపమైన ఆధ్యాత్మిక అనుభవం గురించి వివరించారు.

మొదటిసారి నేను స్వామీజీని కలిసినప్పటి నుంచి, ఆయన మన ఈ అస్తవ్యస్తమైన ప్రపంచంలోకి హిమాలయాల్ని ఎలా తీసుకొచ్చారో తెలుసుకోవాలని నాకు చాలా ఆసక్తిగా ఉండేది. వారు నాకు బోధ చేసే తీరు, ఇతరులకి బోధ చేసే తీరు, ఐహిక ప్రపంచాన్నీ, అలౌకిక ప్రపంచాన్నీ కలిపి ఉంచే తీరుని నేను బాగా నిశితంగా పరిశీలించినపుడు నా మనసు అత్యుత్సాహంతో నిండిపోయేది. నాకు వారి గురించి బాగా తెలిసిపోయిందనీ, తక్షణమే వారి జీవిత చరిత్ర మొదలుపెట్టి రాసేయాలనీ అనిపించేది. కానీ నేను వారి అనుమతి కోరినపుడు, 'ఎవరైనా తన జీవితచరిత్రని తాను జీవించి ఉండగానే రాయడానికి అనుమతిస్తారా?' అంటూ మరో ప్రశ్న వేసి, నర్మగర్భంగా సమాధానమిచ్చారు. అందువల్ల నేను గ్రంథరచనని వాయిదా వేశాను. కానీ మనసులో ఆ విషయం పొంగులు వారుతూ ఉండేది, కాబట్టి నన్ను స్వామి తమ సమీపంలో ఉండడానికి అనుమతించినంతసేపూ ఆయన దగ్గరే ఉండేవాడిని.

ఉత్తర భారతదేశంలో డెహరాడూన్ సిటీ శివార్లలో అన్ని రకాల పరికరాలూ, సౌకర్యాలతో కూడిన సంపూర్ణ వైద్యభవన సముదాయ నిర్మాణం సాధ్యపడేలా చూడడానికే 1987 నుంచి స్వామీజీ తమ సర్వశక్తులూ ధారపోశారు. ప్రపంచవ్యాప్తంగా ఉన్న వారి శిష్య బృందమంతా

వారితో కలిసి ఈ ప్రయత్నాన్ని విజయవంతం చేశారు. 1990 కల్లా ఈ ప్రాజెక్ట్ పూర్తి అయిపోయింది. భారతదేశంలో అత్యంత నిరుపేదలుగా ఉన్నవారికి సేవ చేయడానికి ఈ మెడికల్ కాంప్లెక్స్‌ని నిర్మించడం జరిగింది. ఈ ప్రాజెక్ట్ నిర్మాణానికి ఒకేసారి డబ్బు వరదలా వచ్చి పడడం, ఉద్యోగావకాశాలు ఇబ్బడిముబ్బడిగా పెరగడం, ఎక్కువ ప్రచారంలోకి రావడం వంటి అంశాలన్నీ కలిసి భారతదేశంలోనూ, అమెరికాలోనూ కొంతమంది అవకాశవాదుల్ని ఆకర్షించాయి. అప్పుడే ఇరు దేశాల్లోనూ స్వామీజీ గురించి సానుకూలంగానూ, ప్రతికూలంగానూ కూడా విస్మయానికి గురిచేసే అనేక రకాల కథలు ప్రచారంలోకి వచ్చేశాయి. ఆ కథలన్నింటికీ స్వామీజీయే మూలకేంద్రం. కొందరు వారి గురించి ఉన్నతంగా మాట్లాడారు, మరి కొందరు నీచంగా మాట్లాడారు. భారతదేశంలో అధికారులు, ప్రముఖులు, సామాన్య జనం...ఇలా అందరూ ఆయన్ని గొప్ప మానవతావాదిగా అభివర్ణించగా, మరి కొందరు వారిని సీఐఏ ఏజెంట్ అంటూ విమర్శించారు. పాశ్చాత్యుల్లో ఎంతోమంది వారి ఆధ్యాత్మిక జ్ఞానానికీ, దానశీల కార్యకలాపాలకీ ముగ్ధులై వారిని ఎంతగానో గౌరవించారు. కానీ మరి కొందరు వారిని ఏ పని చేసినా వారిని ఒక నీచమైన వ్యక్తిగా చిత్రించడానికే ప్రయత్నించారు. ఈ గొడవలు, గోలలన్నింటి మధ్యా స్వామీజీ నడి వేసవిలో సరస్సులో నిండుగా నీటిలో మునిగిన గజరాజానికి ఉండే ప్రశాంతత, నిశ్శబ్దాన్ని కలిగి ఉండడం నేను చూశాను.

13 నవంబరు 1996లో స్వామీజీ ఈ ప్రపంచాన్ని విడిచిపెట్టారు. వారి అవసాన కాలంలో పెద్ద భారీ నిర్మాణ ప్రాజెక్టుల్ని పర్యవేక్షించడం, నిధుల సేకరణ, భారతదేశంలో అన్ని రకాల పాలనాపరమైన విషయాలనూ నిర్వహించడం చేశారు. కానీ వారు తమ జీవితాన్ని చాలించబోతున్నారని తెలిసినపుడు, వారిలోని సన్యాసి అప్రమత్తంగా పనిచేశారు. వారి వద్దకు వచ్చినవారెవరూ వట్టి చేతులతో వెనక్కి తిరిగి వెళ్లలేదు. ఈ సమయంలో ప్రపంచం నలుమూలల నుంచీ వారిని సందర్శించడానికి ఎంతోమంది జనం వచ్చేవారు, ఎన్నో లేఖలు వచ్చేవి, ఎంతోమంది టెలిఫోన్‌లో మాట్లాడేవారు. అలా వారిని చూసిన వాళ్లు, మాట్లాడినవాళ్లు లేదా వేరే ఇతర పద్ధతుల్లో తమ ప్రశ్నలకి సమాధానాలు పొందిన వాళ్ల అనుభవాల్లోనూ ఒక్క విషయం మాత్రం సర్వ సాధారణంగా జరిగేది. వారు తమ సమస్యలు స్వామీజీతో చెప్పుకోవడంతోనే అవి పరిష్కృతమై పోయేవి. ఉదాహరణకి, ఒక కేన్సర్ రోగి తన సమస్యని స్వామి దృష్టికి తీసుకురాగానే అది తగ్గిపోయింది. ఒకసారి ఒక జంట, విడాకులతో వైవాహిక బంధాన్ని తెగతెంపులు చేసుకోవడానికి సిద్ధపడి వచ్చారు. వారి పిల్లలు మాదక ద్రవ్యాలకు అలవాటు పడ్డారు. ఎప్పుడూ మద్యం సేవిస్తూ ఉండేవారు. చివరికి ఆ కుటుంబం అత్యద్భుతమైన తీరులో తేరుకుంది. వారు ఈ ప్రపంచాన్ని త్వరలోనే విడిచిపెట్టబోతున్నట్టు నాకు చెప్పారు, కానీ నాకు వారు చెప్పిన తేదీ గుర్తు లేదు.

మే 1996 నాటికి స్వామీజీ దేహం కేవలం ఎముకల గూడులా తయారైంది. కానీ వారి మనసు మాత్రం స్ఫటికంలా పారదర్శకంగా పని చేస్తోంది. వారు ఈ ప్రపంచంలోనే ఉంటున్నా, దేశ కాలాలకు అతీతంగా ఉంటున్నట్టే కనిపించేవారు. వారి భూత, భవిష్యత్, వర్తమానాలు కలిసిపోయాయి. వారి ముఖమండలం దివ్య తేజస్సుతో విరాజిల్లేది. కానీ ఈ స్థితిలో కూడా వారు సమావేశాలు నిర్వహించేవారు, నిర్ణయాలు తీసుకునేవారు, ఆదేశాలు జారీ చేసేవారు. వారు నీరు, పండ్ల రసాల లాంటి ద్రవాహారంతోనే కాలం గడిపేవారు, కానీ వారి కళ్లలో వెలుగు ఎప్పటి కంటే మరింత కాంతివంతంగా ఉండేది. వారి ముఖ మండలం ఎంతో విశ్రాంతిగా, ఎంతో ఆనందంగా, దివ్య మాతృమూర్తి ఒడిలో సేద తీరుతున్నట్టు ప్రశాంతంగా

ఉండేది. చివరికి అంతిమ దినాన కూడా వారు హాస్యోక్తులు పలుకుతూనే ఉన్నారు. వారు తమ ప్రియతమ శిష్యుల్లో ఒకరైన శ్రీ రోషన్‌లాల్ కనోడియాని పిలిచి, హరిద్వార్ లే చలో (హరిద్వార్‌కి తీసికెళ్లు) అని చెప్పారు. రోషన్‌లాల్ తక్షణమే లేచి నిలబడి, కొద్ది తటపటాయింపులో ఉన్నాడు ఆలోచిస్తూ. అతను, 'గురూజీ, నేను టాటా సుమో తీసుకురానా లేకపోతే టాటా ఎస్టేట్ తీసుకురానా? (ది సువ్ ఆర్ ది సెడాన్?)' అని అడిగాడు. స్వామీజీకి మాట్లాడడానికి కూడా కష్టంగా ఉంది. కానీ సున్నితంగా నవ్వుతూ, 'పిచ్చాడా! ఎవరైనా శవాన్ని టాటా ఎస్టేట్‌లో రవాణా చేస్తారా?' అన్నారు. ఆ రాత్రి పదకొండు గంటలకి వారు దేహత్యాగం చేశారు.

నేను సెప్టెంబరు ఆరంభం నుంచీ వారి వెంటే ఉన్నాను. ఈ సమయంలో జరిగిన సంఘటనలన్నీ, హిమాలయ పరమగురువులతో జీవనంలో స్వామీజీ చెప్పినట్లు, వారికి సకల యోగ సాధనల్లోనూ అద్భుతమైన పట్టు ఉన్న వ్యక్తి అని నాకు నిరూపణ చేసి చూపించాయి. వారు యోగ పదజాలంలో ఇలా అంటుండేవారు, 'మీకు శరీరం ఉంటుంది, కానీ మీరు శరీరం కాదు. మీరు శరీరంలోనే ఉంటారు, కానీ మీరు శరీరానికి ఆవల ఉంటారు. జననం, మరణం అనేవి జీవితమనే పద్యంలో రెండు కామాల వంటివి. యోగికి చావు అంటూ ఏమీ ఉండదు. ఈ పుట్టుక అనేది సాధారణంగా మనిషి తన చిరుగుల చొక్కాని వదిలి కొత్త దుస్తులు ధరించినట్టే. యోగి కూడా అదే విధంగా తన పాత దేహాన్ని వదిలి కొత్త దేహాన్ని ధరిస్తాడు.' ఈ విధమైన భావంతో వారు దేహాన్ని విడిచిపెట్టారు. స్వామీజీ మహనీయులైన సాధుపురుషులని అని ప్రపంచం విశ్వసించడానికి అనేక కారణాలు ఉన్నాయి. చాలా కేసుల్లో ఆయన ప్రదర్శించిన అద్భుతాలే అందుకు కారణం. ఉదాహరణకి, కొందరి మశూచిని ఆయన స్వయంగా తీసుకున్నారు. అలాగే ఒక రోగిపై కొద్దిగా నీరు చిలకరించి జ్వరాన్ని తగ్గించారు. ఒక వ్యాపారవేత్త సంపద అనంతంగా పెరిగింది. ఒక వ్యక్తి తండ్రి అతి ప్రమాదకరమైన యాక్సిడెంట్ నుంచి బ్రతికి బట్టకట్టాడు. ఒక్కోసారి ఆయన కేవలం స్పర్శతోనో లేక దృష్టితోనో నమ్మశక్యం కాని విధంగా ఆధ్యాత్మిక శక్తిని తన విద్యార్థికి అందజేసేవారు. అదే స్థితిలో కొన్ని గంటలపాటు ఉండిపోయేవారు. లేదా తన తొడ మీద ఒక ట్యూమర్‌ని సృష్టించి, దాన్ని తన ఇచ్ఛాశక్తితో తర్వాత ఎప్పుడో నయం చేసుకునేవారు. ఒక్కోసారి ఎదుటి వ్యక్తి చేతి మీద ఉన్న పొక్కులు క్షణంలో మాయమయ్యేవి.

ఆయన మహనీయతనీ, సిద్ధ స్థితినీ గ్రహించడానికి ఇలాంటి సంఘటనలు తగిన ఆధారాన్ని అందించేవి. స్వామీజీని కలుసుకోక ముందు, నీటి మీద నడిచే యోగుల గురించి నేను విన్నాను, రెండు ఫ్లూట్స్‌ని రెండు నాసికా రంధ్రాలతో ఒకేసారి వాయించే మహనీయుల్ని చూశాను. నిమ్మకాయని కోసి, కోడిని చంపడం చూశాను. సన్నగా వీచే గాలి నుంచి స్ఫటిక శివ లింగం తెప్పించడం చూశాను. భావి కాలంలో జరిగే సంగతుల గురించి ముందుగా ఊహించగలిగేవాడిని. కానీ అలాంటి 'పరిపూర్ణ' సిద్ధులు కూడా ఆధ్యాత్మికత పట్ల ఆసక్తి ఉండదు, పైగా ప్రాపంచిక విషయాల్లో వారు నిండా మునిగి తేలుతూ ఎంతో విచారంగా ఉంటూ ఉండడం గూడా గమనించాను.

స్వామీజీలో నేను ప్రేమ, దయ ఉప్పొంగే ఒక పరిపూర్ణమైన సాధుపుంగవులనీ, వ్యర్థతనీ బొత్తిగా భరించని గొప్ప క్రమశిక్షణగల వ్యక్తినీ చూశాను. ఆయనకి గల దయాభావం సాటిలేనిది. ఆయన దాన వితరణకి దిగితే దానికి ఒక పరిమితి అంటూ ఉండదు. కానీ వారు ఒక చారిటబుల్ ఆర్గనైజేషన్‌కి పెద్ద కాబట్టి, సాధ్యమైనంతగా బేరమాడేవారు. వారిలోని నిర్మాణాత్మక, విధ్వంసక బలాల విశృంఖల తాండవ నృత్యాన్ని నేను ఓసారి చూశాను. అప్పుడు నేను వారిని దూరం నుంచే సాక్షీభూతంగా చూస్తూ ఉండిపోయాను. సంస్థలు ఆయన చుట్టూరా పెరిగాయి, వేరుపడ్డాయి.

అనుచర గణం వారిని అనేక బహుమతులు, దండలు తెచ్చిస్తూ చుట్టూ మూగేవారు. నిరాశతో, కోపంతో వారిని విడిచి వెళ్లేవారు. ఈ అన్ని స్థితుల్లోనూ వారు చిరునవ్వుతో ఉండడమే నేను చూశాను. లాభనష్టాలూ, మానావమానాల వంటి ద్వంద్వ స్థితుల్ని వారు నిండైన సమానత్వంతో తీసుకున్నారు. వారి జీవితంలో ప్రతి కోణమూ భరించలేనంత కొస దాకా సాగేది. పరస్పర విరుద్ధ భావాలతో నిండి ఉంది వారి జీవనయానం. కానీ వారిని బాగా సన్నిహితంగా ఎరిగిన వారికి వారొక సామాన్యమైన వ్యక్తి, అంతే!

నా వరకు నాకు స్వామీజీయే పరమగురువు. నేను ఈ మాట అంటున్నది వారి వద్ద ఎంతో మంది విద్యార్థులు ఉండడం వల్లనో, అనుచరగణం ఉండడం వల్లనో కాదు, వారు తమ పైన, తన చుట్టుప్రక్కల పరిస్థితుల పైనా గొప్ప ఆధిపత్యం కలిగి ఉంటారు. అందువల్ల! వారి జీవితంలో గత నలభై సంవత్సరాలుగా ఏ రోజూ కూడా రెండు గంటలకు మించి నిద్ర పోలేదు. కానీ ఎంత శక్తివంతంగా ఉండేవారంటే, ఎవరూ వారితో కలిసి ఎక్కువసేపు పనిచేయగలిగేవారు కాదు. వారితో పని చేసే వ్యక్తులంతా విడతల వారీగా పనిచేసేవారు. వారు ఉన్న ప్రదేశంలో ఓ ప్రశాంతమైన, బలమైన శక్తి ఆవరించి ఉండేది. సోమరితనం, బద్ధకం లాంటివి ఆ వాతావరణంలో నిలవలేకపోయేవి. తన అంతర్గత బలంతో ఆయన ఒకేసారి పెద్ద పెద్ద పనులు పదీ పదిహేను పెట్టుకుని అనుకున్న పనులు అనుకున్నట్టుగా గొప్ప ఒడుపుతో పూర్తి చేసేవారు. ఆయన ఒక పుస్తకం డిక్టేట్ చేస్తూ మధ్యలో ఓ కాంట్రాక్టర్ మీద టెలిఫోన్‌లో గట్టిగా అరిచేవారు. ఈలోగా టీ వస్తే హాయిగా సిప్ చేసేస్తూ ఉండేవారు, అప్పుడు మళ్లీ ఆ ముఖంలో ఎక్కడా చికాకులాంటి భావన ఏదీ గోచరించేది కాదు. ఎందుకంటే ఆయన ఈ ప్రపంచంలోనే జీవిస్తారు. కానీ దీనికి అతీతంగా ఉంటారు. వారు ఎప్పటికప్పుడు తనకేం కావాలో, తన చుట్టుప్రక్కల ప్రపంచానికి ఏం కావాలో అవన్నీ చేస్తుంటారు. ఆ క్షణంలోనే ఆయన చంద్రుడంత చల్లగానూ ఉంటారు, అదే క్షణంలో అగ్నిలా భగభగ మండిపడనూ పడతారు. తనతో కలిసి అధ్యయనం చేసినవారి పట్లా, తన పర్యవేక్షణలో సాధన చేసినవారి పట్లా స్వామీజీ ఎంతో ఆదరణ కనబరుస్తారు. కానీ ఎవరినైనా సరే, ఉంచాల్సినంత దూరంలోనే ఉంచుతారు. కానీ తనకి సన్నిహితం కాదలిచినవారి పట్లా, తన జీవన పరమార్థంగా ఎంచిన కార్యాన్ని నిర్వహించడం పట్లా చాలా కఠినంగా వ్యవహరిస్తారు. స్వామీజీ ఒక తుఫాను. పరిసరాల్లో ఉన్న వారందర్నీ స్వీయకేంద్రితంగా తన చుట్టూ తిప్పుకునే తుఫాను! స్వామీజీ ఆ తుఫాను కేంద్రంలో సుస్థిరంగా, ప్రశాంతంగా కూర్చుని తన వేగాన్ని ఎదుర్కొనే బలం, అంతర్దృష్టి ఎవరికి ఉన్నాయా అని పరిశీలిస్తూ ఉంటారు.

కానీ స్వామీజీ హిమాలయాల్లో నివసించినపుడు గానీ, భారతదేశంలో అక్కడక్కడా ఏకాంతంగా గడిపిన స్థలాల్లోగానీ వారిని ఎవరూ చూడలేదు. హిమాలయ గుహల్లో రాత్రిళ్లు ధ్యానం చేసుకుంటూ గడిపేవారు. చుట్టుప్రక్కల గ్రామస్తులు కొందరు వారికి పాలు, ఆహారం తీసుకొచ్చి ఇచ్చేవారు. స్వామీజీ చుట్టూ ఆవరించి ఉన్న ఖాళీ ప్రదేశమంతా అనిర్వాచ్యమైన భగవన్నామ తేజం నిండి ఉండేది. ఆ దివ్యపుంజాన్ని నిండారా దర్శించడం తప్ప ఆ గ్రామస్తులు మరేమీ ఆశించేవారు కాదు. స్వామీజీకి తనను తాను రహస్యంగా దాచేసుకోవడంలో ఎంతో దిట్ట. వారు ఈ ప్రపంచంలో తమ పనిని ప్రారంభించగానే, తనను ఎవరూ గుర్తించకుండా వారు తమ మౌలికమైన అస్తిత్వానికి ఒక మందపాటి తెర అడ్డుగా వేసేశారు. ఢిల్లీ, టోక్యో, చికాగో లాంటి బిజీగా ఉండే నగరాల్లో వారి చుట్టూ ఎప్పుడూ రాజకీయ నాయకులు, వ్యాపారవేత్తలు మసలేవారు. గ్రామీణులు వారిని కలవలేకపోయేవారు. ప్రజలు స్వామీజీని దర్శించడానికి పూలదండలు, పండ్ల బుట్టలు, నోట్ల కట్టలతో వచ్చేవారు. కొంతమంది తాము ఎన్నికల్లో గెలవాలని ఆశీర్వదించాలని స్వామీజీని కోరేవారు, మరి కొందరు తమకు సంపదలు కావాలని కోరేవారు,

ఇంకొందరు సంతాన ప్రాప్తి కలిగేలా ఆశీర్వదించమనేవారు. స్వామీజీ గురించి విన్న ఎందరో జ్ఞానసాధకులు వారిని ఎక్కడ దర్శించుకోవాలో తికమకపడుతూ చివరికి హోటల్‌కి వచ్చి వారి సన్నిధిలో కూర్చుని వారు చెప్పే విలువైన విషయాలు వినేవారు.

వారు 'ఫైవ్ స్టార్ హోటల్ స్వామి' పాత్ర పోషిస్తూ కూడా తనలో అంతర్గతంగా కొలువై ఉన్న స్వామి సమక్షంలోనే నిరంతరం గడిపేవారు. నిద్రపోని ఈ హిమాలయ గురువు అర్ధరాత్రి వేళ ఈ ప్రపంచం కోసం కప్పుకున్న ముసుగుని తొలగిస్తారు, తన వాస్తవ అస్తిత్వాన్ని ధరిస్తారు. పాశ్చాత్య దేశాల్లో స్వామీజీ చాలా బిజీ షెడ్యూల్ పెట్టుకునేవారు. కానీ లోపల్లోపల వారు నిద్రారహిత హిమాలయ యోగుల ప్రతినిధిలానే ఉండిపోయేవారు.

అద్భుతమైన వెలుగుని లోకానికి పంచిన మహానుభావులు, పరమగురువులు ఎందరో ఉన్నారు. కానీ వారందరిలోనూ స్వామీజీ చాలా ప్రత్యేకంగా కనిపిస్తారు. దానికి కారణం వారికున్న జ్ఞానసంపద గానీ, ఆధ్యాత్మిక శక్తి గానీ మిగతా వారి కంటే ఎక్కువ కావడమో కాదు, వారి జీవితగాథ చాలా వరకు మన జీవితాల్ని పోలి ఉండడమే అసలు కారణం. స్వామీజీలో పిల్లల్లో మనం చూసే చురుకుదనం, కుతూహలం కనిపిస్తాయి. యువకులు చేసినట్టే ఆయన కూడా అల్లరి చేసేవారు, కొన్నిసార్లు ఇబ్బందిలో పడ్డారు. ఆధ్యాత్మిక అన్వేషిగా ఆయన తన మాస్టర్‌తో గొడవ పడేవారు. ఆదేశాల్ని పాటించేవారు కాదు, పారిపోదామని కూడా ఆలోచన చేశారు. స్వామీజీ ఈ ప్రపంచంతో ఎంతగా మమేకమైపోయారంటే, వారి గురుదేవులకి తప్ప వారిని రక్షించడం మరెవరి వల్లా కాలేదు. మనందరి లాగానే వారికి కూడా జీవితంలో అనేక క్లిష్టతరమైన సమయాలు గడిచాయి. స్వామీజీ ఇంకా చిన్నపిల్లవాడిగా ఉన్నపుడే అనాథ అయిపోయారు. ఉదాహరణకి, తన స్వంత అన్నగారే ఆయన్ని విడిచిపెట్టేశారు, వెనకాల ఆస్తుల్లాంటివి ఏమీ లేని ఒక సాధువు ఈయన్ని పెంచి పోషించారు. ఎలాగో ఆయన ఒక క్రమశిక్షణలో పడ్డారు. ఆధ్యాత్మిక సాధనలకి సమయం వెతుక్కున్నారు. ఆత్మ గౌరవం పెంపొందించుకున్నారు. ప్రతికూల పరిస్థితుల్ని జయించారు, నిరంతర ప్రయత్నాలతో ఎవరైనా పరిపూర్ణులు కావచ్చని నిరూపించారు. ఒకసారి మీ జీవితాన్ని ఆ సర్వాంతర్యామికి అప్పగించుకుంటే చాలు, ప్రపంచమంతా మీ పాదాల మీద ఎలా మోకరిల్లుతుందో స్వామీజీ జీవితమే మనకి ప్రత్యక్షంగా నిరూపిస్తుంది. మిమ్మల్ని మీరు జయిస్తే, ప్రపంచాన్ని జయించినట్టే. మీలో ఉన్న అందాన్నీ, ఆనందాన్ని మీరు చూడడం మొదలుపెడితే, యావత్ ప్రపంచమూ అందంగా, ఆనందంగా కనిపిస్తుంది. మీ అంతరంగాన్ని మీరు జయించినట్లయితే, బాహ్య ప్రపంచంలో విజయాలు అవలీలగా సాధింపబడతాయి. మీ కోరికల్ని మీరు ఆ ప్రభువుకి చెప్పుకుంటే, మీ వ్యక్తిగత భ్రాంతులు, కోరికల నుంచి మీరు విముక్తమవుతారు. అప్పుడు ఆ దివ్య సంకల్పమే మీ కోరికగా మారిపోతుంది. మనకీ, దివ్యత్వానికీ మధ్య ఎలా అనుసంధానించుకోవాలో స్వామీజీ జీవిత గాథ నిరూపిస్తుంది. మన వ్యక్తిగతమైన వాంఛల్ని దివ్య సంకల్పానికి ఎలా అర్పించుకోవాలో తెలియజేస్తుంది. మనలో నిద్రాణంగా ఉన్న శక్తిని సంపూర్ణంగా ఎలా వికసింపజేసుకోవాలో బోధిస్తుంది. జీవితాన్ని సార్థకం చేసుకోగలిగే ఉన్నత లక్ష్యాల నుంచి దృష్టి తప్పించకుండా కూడా ఈ ప్రపంచంలో విజయవంతంగా ఎలా నెగ్గుకురావాలో నిరూపిస్తుంది.

'మీరు దివ్యత్వానికి ఉద్భవించిన సంతానం. మీరు ఏం కాదలుచుకుంటే అది కావడానికి అపరిమితమైన నిద్రాణశక్తి నిక్షిప్తమై ఉంది.' ఈ సందేశాన్ని అర్థం చేసుకున్న వారికి ఈ భూమ్మీద భయపడాల్సింది ఏదీ లేదనే సంగతి ఎందరో సాధుజనులకు అర్థమైనట్టుగానే స్వామీజీకి కూడా అర్థమైంది. స్వామీజీ జీవితమే వారి సందేశం!

అధ్యాయం 1

# స్వామి రామ

ఐహిక జీవితంలో స్వామీ రామకి ఒక కుటుంబం ఉంది, తల్లిదండ్రులు ఉన్నారు. కానీ ఆయనకు తనని పెంచినవారి కంటే తాను పెరిగిన చోటు మీదే ఎక్కువ మమకారం ఉంది. ఆధ్యాత్మిక భాషలో చెప్పాలంటే, హిమాలయాలే స్వామీజీ తల్లిదండ్రులు. *హిమాలయ పరమగురువులతో జీవనంలో* స్వామీజీ, 'అక్కడ జీవించడమంటే, అమ్మ ఒడిలో జీవించడమే. అమ్మ నన్ను సహజమైన వాతావరణంలో పెంచింది, ఒకానొక నిర్దిష్టమైన జీవనశైలి అలవాటు చేసింది,' అని వ్రాశారు. ఇంకొన్ని పేజీలు తిరగేస్తే, 'ఈ పర్వతాలు నా ఆట స్థలాలు. తన పిల్లలు ఈ లోయల్లో సుఖంగా, ఆనందంగా ఉండేందుకూ, జీవన సార్థకతని అర్థం చేసుకునేందుకూ ప్రకృతిమాత విశాలమైన తిన్నెలు పరిచిపెట్టింది. గడ్డిపరక నుంచి ఉన్నత పర్వత శిఖరాల వరకు జీవితంలో దు:ఖానికి చోటన్నది లేదని ఎవరికైనా అర్థమయ్యేది ఇక్కడే,' అని వ్రాశారు.

ఒక ముముక్షువు స్వామిగా మారితే, అతడు తన కుటుంబాన్ని వదిలిపెడతాడు. తన పాత జీవితంతో అనుసంధానించుకోవడం నిలిపివేస్తాడు. అతడికి ఐహిక విషయాలు, వ్యక్తులతో సంబంధం ఉండదు కాబట్టి, అతడు అన్ని రకాల సున్నితమైన భావనలు, భావాత్మక బంధాలకు అతీతంగా ఉంటాడు. కానీ స్వామీజీ తన వాస్తవ కుటుంబమైన హిమాలయ శిఖరాల్ని వీడలేదు. వాటికి సంబంధించినంత వరకు ఉన్న స్మృతులన్నీ వారి హృదయంలో పదిలంగానే ఉన్నాయి. పైగా ఆ బంధాలను ఆయన జీవితాంతం పెంచుకుంటూనే ఉన్నారు. *హిమాలయ పరమగురువులతో జీవనంలో* స్వామి తమ తల్లిదండ్రుల గురించి కేవలం మూడు పేజీల కంటే తక్కువ చోటు కేటాయించారు, అందులో కూడా వారు తమ గురుదేవుల్ని ఎలా కలుసుకున్నారో, ఆ తర్వాత ఏం జరిగిందో చెప్పారు. ఆ పర్వతాలు, అతి శీతల జలప్రవాహాలు, పుష్పాలతో నిండిన లోయలు తమకు జన్మనిచ్చిన తల్లిదండ్రులు, ఇతర బంధుగణాల బంధాలను కూడా మరిపిస్తూ, తనని తమ వద్దకు ఎలా రప్పించుకున్నాయో వర్ణించారు. ప్రాపంచిక ప్రేమ, మోహపాశం వల్లా, అంచనాల వల్లా కల్మషమవుతుందని అంటారు స్వామి. కానీ పవిత్ర హిమాలయ మందిరాలు హృదయాన్ని విశుద్ధమైన ప్రేమతో నింపేశాయనీ, ఆ ప్రేమానుభూతిని అనుభూతి చెందుతూ ఉండడం వల్లనే తాను ఆ పర్వత మధ్య ఎలాంటి భీతీ లేకుండా సంచరించేవాడిననీ స్వామి చెప్తారు. వాటి నుంచి స్వామీజీ ప్రకృతిని సందేశాన్ని ఎలా అధ్యయనం చేయాలో నేర్చుకున్నారు. ఆ పరిసరాల్లో వాటితో కలిసి జీవించడం వల్లనే వారికి ప్రతీదీ జీవంతో తొణికిసలాడుతూ కనిపించింది. చిరు లిల్లీ పూవు వికసించడం దగ్గర నుంచీ, జెముడు ముళ్ల వికాసం వరకూ, గడ్డి

పరక నుంచి అతి ఎత్తుకి పెరిగే దేవదారు వృక్షం వరకూ, అతి చిన్న గులకరాయి నుంచి ఆకాశాన్ని తాకే శిఖరాల వరకు ప్రతి వస్తువులోనూ పలికే ప్రాణశక్తి గానాన్ని వారు విన్నారు. స్వామీజీ భౌతిక శరీరం ఈ ప్రపంచంలోకి ప్రవేశించడానికి నిమిత్త కారణాలుగా ఉన్న వారి తల్లిదండ్రులకు సంబంధించిన జ్ఞాపకాల కంటే, హిమాలయ సానువుల జ్ఞాపకాలే వారి మనసుని ఎక్కువగా ఆక్రమించుకున్నాయి.

స్వామీజీ తల్లిదండ్రులు హిమాలయ ప్రాంతాలకు చెందిన భూభాగంలోనే నివసించేవారు. ఆ ప్రాంతాన్ని దేవభూమి అని కూడా అంటారు. ప్రస్తుతం ఆ ప్రాంతంలో అత్యధిక భాగాన్ని *గఢ్‌వాల్* అంటున్నారు. ప్రతి భారతీయుడూ తన జీవితంలో దిక్కసారైనా చూడాలని ఉవ్విళ్లూరే *బదరీనాథ్, కేదార్‌నాథ్, గంగోత్రి, యమునోత్రి, నందాదేవి, చౌఖంబా, నీలకంఠ* లాంటి పవిత్ర క్షేత్రాలు గఢ్‌వాల్ హిమాలయాల్లోనే ఉన్నాయి.

దేవాలయాల సందర్శనకు వచ్చే సాధువులు, సన్యాసులు, యాత్రికులకు సేవ చేస్తూ ఉండడం ఇక్కడి ప్రాంతాల్లోని గ్రామస్తులకి ఎప్పటి నుంచో ఉన్న అలవాటు. నిలువరించలేని నదీ ప్రవాహాలు, కుండపోత వర్షాలతో ఏర్పడే ఉన్నత శిఖరాలు, అగాథ లోయలలో వారు బాహ్య ప్రపంచంతో సంబంధం లేకుండా ఏకాంతవాసం సాగిస్తూ ఉంటారు. వీరి జీవితం అతి నిరాడంబరంగా ఉంటుంది. ప్రకృతి వీరికి ఐహిక సౌకర్యాల్ని ఎక్కువగా అమర్చుకునే అవకాశాన్ని ఇవ్వలేదు. అందువల్ల వీరికి మనసు మరీ అంతగా చెదిరిపోయే అవకాశం కూడా లేదు. ఆధునిక ప్రపంచంలో మాదిరిగా ఇక్కడి గతం కాలగర్భంలో సమసిపోదు. ఇక్కడి ప్రజలు సాధారణంగా ప్రాథమిక విద్య వరకే చదువుకుని ఉంటారు. కానీ వారు తమ సంప్రదాయ జ్ఞానాన్ని మాత్రం యథాతథంగా తరతరాలుగా అందుకుంటూ ముందు తరాలకి అందిస్తున్నారు. వీరు సాధారణంగా బాగా తెలివైనవారు. గఢ్‌వాలీ ప్రజలకి సరైన అవకాశం ఇచ్చి చూస్తే, వారు తమ సామర్థ్యాల్ని ప్రదర్శిస్తారు, యూనివర్శిటీల్లో ఉన్నత పదవుల్ని సంపాదిస్తారు, సివిల్ సర్వీసుల్లో గట్టి పోటీ ఉండే విషయాల్లో కూడా సునాయాసంగా నెగ్గుకుని రాగలరు.

పంతొమ్మిదవ శతాబ్దం దాకా గఢ్‌వాల్ తన సార్వభౌమత్వాన్ని సాగించి, స్వతంత్ర రాజ్యంగా ఉంది. 1803లో పోరాట పటిమకు గొప్ప పేరు గాంచిన నేపాలీ గూర్ఖాలు ఈ ప్రాంతాన్ని హస్తగతం చేసుకోవడం ప్రారంభించారు. ఇతరుల సాయం లేకుండా గూర్ఖాలను ఎదుర్కోవడం కష్టసాధ్యమని గఢ్‌వాల్ రాజు గ్రహించి, బ్రిటిష్ సైన్యం సాయం కోరాడు. ఒకవేళ గూర్ఖాలు ఓడిపోతే, ప్రతిఫలంగా బ్రిటిష్‌వారికి తన రాజ్యంలో సగభాగం ఇస్తానని చెప్పాడు. ఆ విధంగా శాంతి స్థాపన జరిగింది, గఢ్‌వాల్ అప్పుడు బ్రిటిష్ గఢ్‌వాల్, ప్రిన్స్‌లీ గఢ్‌వాల్ అని రెండు భాగాలుగా చేయబడింది. స్వామీజీ కుటుంబం లాండ్స్‌డౌన్ పట్టణం దగ్గరగా ఉన్న బ్రిటిష్ గఢ్‌వాల్‌లో నివాసం ఉండేది. అయితే, ఈ ప్రాంతంపై బ్రిటిష్ ప్రభావం ఉండడం వల్ల మిగతా ప్రాంతాల కంటే సమృద్ధవంతమైన అభివృద్ధి సాధించిది. బ్రాహ్మణులు వేదవేదాంగాలు, సంస్కృత భాష, జ్యోతిష్యం, మతపరమైన విషయాల్ని అధ్యయనంలో మంచి పేరుగాంచినవారు. వారికి ఇంగ్లీషు నేర్చుకునే అవకాశం కలిగింది. వారు బ్రిటిష్ పరిపాలనలో అనేక పెద్ద పెద్ద హోదాల్లో కూడా పని చేస్తూ ఉండేవారు.

వారి కుటుంబంలో ఇతర సభ్యులందరూ ఆధునికతని ప్రతిబింబించే జీవనశైలిని అవలంబించినా స్వామీజీ పితృదేవులైన బుద్ధి వల్లభ్ దశ్మన మాత్రం, సంస్కృత గ్రంథాలు, జ్యోతిష్య శాస్త్రం, యజ్ఞయాగాదులను చేస్తూ తమ పూర్వపు సంప్రదాయాన్ని నిలబెట్టుకోవడానికే ఇష్టపడ్డారు. ఆయనను అందరూ 'పండిట్‌జీ' అని పిలిచేవారు. వేదవేదాంగాలు పఠించి, ధార్మిక సంప్రదాయాల్ని పాటించేవారిని ఉత్తర భారతదేశంలో అలా పిలుస్తారు. దశ్మన కుటుంబానికి అతి విశాలమైన

వ్యవసాయక్షేత్రం ఉంది. కానీ వారు బ్రాహ్మణులు కావడం వల్లా, హిందూ సమాజంలో ప్రాచీన సంప్రదాయాల్ని పాటించేవారు కావడం వల్లా వారు తాముగా వ్యవసాయం చేసేవారు కాదు.

గ్రామంలో నివసించే వివిధ వర్ణాలవారు ఆ పొలాల్లో వివిధ రకాల పంటల్ని సాగుచేసే పనులన్నీ చూసేవారు. ఆ విధంగా బుద్ధి వల్లభ్‌కి గ్రంథాధ్యయనం చేసేందుకూ, తన ఆధ్యాత్మిక సాధనని మరింత తీవ్రం చేసేందుకూ అవకాశం చిక్కింది. స్వామీజీ ఆ కుటుంబంలోకి రాక ముందే బుద్ధివల్లభ్‌కి బాగా ఎదిగిన సంతానం ఉంది. వారంతా అప్పటికే చదువులు పూర్తి చేసి, ప్రభుత్వ ఉద్యోగాల్లో స్థిరపడ్డారు.

సాధన చేసుకోవడానికి ఏకాంత ప్రదేశాన్ని అన్వేషిస్తూ భారతదేశం నలుమూలల నుండీ అనేక మంది సాధకులు, సిద్ధ సాధువులు గఢ్‌వాల్ హిమాలయ ప్రాంతాన్ని తరచుగా సందర్శిస్తూ ఉంటారు. ఈ ప్రాంతంలోనే దశ్మన కుటుంబం నివసిస్తోంది. వీరి ఇంటికి అనునిత్యం బెంగాలీ బాబా, గుదారీ బాబా, సోంబారీ బాబా, బూఢే బాబా లాంటి సాధు పుంగవులు, యోగులు వస్తుండేవారు. బుద్ధి వల్లభ్ కరుణ, దయ, ఉదార స్వభావానికి పెట్టింది పేరుగా ఉండేవారు, పైగా ఆయన విద్వాంసుడు కూడా కావడంతో వారింటికి రావడం, కొన్ని రోజులు వారి ఇంట ఉండడమంటే సాధువులు, యోగులకు కూడా చాలా ఇష్టంగా ఉండేది. ఒకరోజు ఒక సాధువు వారి ఇంట బస చేశారు. ఆయన తాను మధ్య భారతదేశంలోని అమర కంటక్ పవిత్ర దేవాలయాన్ని సందర్శించి వస్తున్నట్టు చెప్పారు. బుద్ధి వల్లభ్, ఆయన ధర్మపత్ని ఆ సాధువుని భక్తిపూర్వకంగా ఆదరించారు. ప్రసంగవశాత్తూ, ఆ అతిథి వారిని ఒక వింత ప్రశ్న అడిగారు, 'మీ ఇంటి పేరు 'దశ్మన' అని ఎలా వచ్చిందో మీకు తెలుసా?' అంటూ! బుద్ధివల్లభ్‌కి ఆ సంగతి తెలియదు. అప్పుడు ఆ సాధువు ఇలా వివరించారు, 'నిజానికి మీ కుటుంబం పేరు 'భస్మన,' అంటే 'భస్మం నుంచి పుట్టడం' అని అర్థం. కానీ తర్వాత తర్వాత ఆ పదం జనం నోళ్లలో పడి 'దశ్మన' అయిపోయింది.'

అప్పుడు ఆ సాధువు ఓ పూర్వగాథని వినిపించారు. 'ఒకానొకప్పుడు ఓ సాధువు ఊరూరూ తిరుగుతూ ఒక గ్రామంలో భిక్ష అడగడానికి ఆగారు. ఒకనాడు ఆయన భిక్షాపాత్రలో ఓ ఇల్లాలు ఆహార పదార్థాలు వేయడానికి గడప దగ్గరకి వచ్చింది. ఆమె ఏదో విచారంలో ఉందని ఆ సాధువు గమనించారు. ఆయన ఆమె ఇచ్చిన ఆహారం స్వీకరించి అది ఆరగించడానికి ఒక చెట్టు క్రింద కూర్చున్నారట. అప్పుడే, ఆయన ఆ స్త్రీకి సహాయం చేయడానికి నిర్ణయించుకుని, తన ధుని (అగ్ని) ని ప్రజ్వలింపజేశారు. ఆ ధుని పక్కనే ఆయన కొద్దిరోజులు గడిపారు. ఆ సాధువుకి కావలసిన ఆహార పదార్థాలు ఆ స్త్రీ, అలాగే ఆ చుట్టుప్రక్కల ప్రజలు తెచ్చి పెడుతూ ఉండేవారు. ఆ స్త్రీ ఎంతో విచారంగా కనిపించేది. ఆ సాధువు ఆమెకు సహాయం చేయదల్చుకున్నారు. ఆమెతో కొంత పరిచయం ఏర్పడిన తర్వాత ఆయన ఆమె విచారానికి కారణం అడిగారు. తనకు సంతానం లేదనీ, అందువల్ల అందరూ తనను చూడడం అశుభంగా భావిస్తున్నారనీ ఆమె చెప్పింది. తన భర్తతో సహా అందరూ తనని వెలి వేశారనీ, ఎవరూ తన ముఖం చూడాలని కోరుకోరనీ ఏడ్చింది. ఇక తను ఇంత విషాదాన్ని భరించలేక తన జీవితాన్ని ముగించుకునే ఆలోచన కూడా చేశానని ఆమె చెప్పింది.

ఇది విన్న వెంటనే ఆ సాధువు కూర్చున్న చోటి నుంచి లేచి నిలబడి, భగవన్నామం జపించారు. ఆ తర్వాత గొప్ప అధికార స్వరంతో, 'అమ్మా, ఈ ధుని నుంచి కొంచెం విభూతి తీసుకో, దాన్ని నీ శరీరమంతా రాసుకో. కొద్ది విభూతి నీ నోటిలో కూడా వేసుకో. నీకు సంతానం కలుగుతుంది. గొప్ప తేజోవంతుడైన బాలుడు నీ గర్భాన ఉదయిస్తాడు. అతడు ఈ లోకాన్నే ప్రకాశింపజేస్తాడు,' అని చెప్పి అక్కడ నుంచి వెళ్లిపోయాడు.

మనసంతా ఆనందోత్సాహాలతో నిండిపోగా, ఆమె ఈ సంగతిని చుట్టుప్రక్కల అమ్మలక్కలతో చెప్పింది. వాళ్లు ఆమె మూఢత్వాన్ని ఎగతాళి చేశారు. 'పిల్లల్ని కనడానికి మహా మంచి మార్గమే చెప్పాడులే! ఒళ్లంతా ఈ బూడిద రాసుకోవాలా! పిల్లాడు ఆ బూడిదలోంచి వస్తాడా? ఇప్పటికే ఉన్న కోపానికి, నీ భర్తకి గానీ ఈ విషయం తెలిసిందంటే, నిన్ను మెడపట్టి బయటికి గెంటుతాడు,' అని తమకి తోచిన సంగతులన్నీ నూరిపోశారు. దాంతో ఆ స్త్రీ ఆ ధుని విభూతినంతా పోగు చేసి, పేడకుప్ప మీద పారబోసింది.

పన్నెండేళ్లు గడిచాయి. సాధువు బిడ్డ ఎలా ఉన్నాడో చూద్దామని వచ్చాడు. అతడు ఆ స్త్రీకి పిల్లవాడు పుట్టలేదని తెలుసుకుని, ఆశ్చర్యపడ్డాడు. ఆమెని 'ఆ విభూతిని ఏం చేశావమ్మా?' అని అడిగాడు. 'నేను దాన్ని పేడకుప్ప మీద వేశాను,' అని చెప్పింది.

సాధువు పేడకుప్ప దగ్గరకు వెళ్లారు. దాని ముందు నిలబడి, *'అలఖ్ నిరంజన్'* (కల్మషం లేనివాడా, కనులతో చూడలేనివాడా, రా!) అని పిలిచాడు. తేజోవంతుడైన ఓ పన్నెండేళ్ల బాలుడు అందులోంచి ఆవిర్భవించాడు. ఆవు పిడకల బూడిద నుంచి ఆవిర్భవించినవాడు కాబట్టి, అతడిని అందరూ 'గోరఖ్‌నాథ్' అని పిలిచారు. అతడు హిమాలయ సంప్రదాయంలో అత్యంత సుప్రసిద్ధుడైన యోగి అయ్యారు. ఆ సాధువు మరెవరో కాదు, గురు మత్స్యేంద్రనాథులు. గోరఖ్‌నాథ్ గురుదేవులు. ఆ ప్రాంతవాసులు గోరఖ్‌నాథుని 'భస్మన' అనే పేరుతో పిలిచేవారు. ఆయన సంతానం కూడా 'భస్మన' గానే పిలవబడింది. ఈ కథలో చెప్పబడిన సంగతులన్నీ లాండ్స్‌డౌన్ దగ్గరే జరిగాయి. ఇప్పటికీ ఆ ప్రాంతంలో గోరఖ్‌నాథ దేవాలయం ఒకటి ఉంది.

మత్స్యేంద్రనాథ కథని చెప్పడం ముగించిన సాధువు బుద్ధివల్లభ్‌తో, అతడి కుటుంబంలో సభ్యులంతా ఎప్పుడూ యోగులుగా మారుతూనే ఉన్నారనే మరో సంగతి కూడా చెప్పారు. పైగా, 'నువ్వు ఎప్పుడు మేల్కొంటావు? నీ కుటుంబ వారసత్వాన్ని ఎలా నిలబెడతావు?' అని ప్రశ్నించి ఓ దివ్య బీజం ఆయన మదిలో వేశారు.

మరునాడే ఆ సాధువు వెళ్లిపోయారు. కానీ అతడి సందర్శన బుద్ధి వల్లభ్‌పై ఓ చెరగని ముద్ర వేసింది. తాను జీవితంలో ఇప్పటి వరకూ ఏం చేశానా అని వెనక్కి తిరిగి చూసుకున్నారు. తాను ఏం చేశాడు ఇంతవరకూ! ఇదంతా ఎక్కడికి దారి తీస్తోంది? ఏదో జీవించి ఉండడానికి చేసిన పనులూ, తన మీద ఆధారపడినవారి కోసం చేసిన పనులే తప్ప, మరే విధమైన గొప్ప పనులూ చేసినట్టు అనిపించలేదు. తను ఆ క్షణంలో చనిపోతే, తన కూడా ఏం వస్తుందీ అని ఆలోచించారు. తన వెంట వచ్చేదెవరు? జీవితంలో పొందిన లాభాలూ, నష్టాలూ, విజయాలూ, అపజయాలూ, మానావమానాలూ వస్తాయా? వాటికి నిజమైన విలువ ఉందా అసలు?

బుద్ధి వల్లభ్ తన జీవితాన్ని పునస్సమీక్షించుకున్నారు. తాను సంపాదించిన జ్ఞానమంతా ఉపాధ్యాయులు, వేద వేదాంగాలు వల్లె వేయడం వల్లా ఉపనిషత్తులు అధ్యయనం చేయడం వల్లా అబ్బింది. ఇంతవరకూ ఒక బ్రాహ్మణ పండితుడి కర్తవ్యం మాత్రమే తాను నిర్వహించాడు. తనకి తెలియాల్సిన విషయాలన్నీ తెలిశాయని భావించాడు. అందుకే తనకి ఒక గురువు అవసరం ఉందని ఎన్నడూ భావించలేదు. కానీ ఒక సమర్థుడైన గురువు వద్ద దీక్ష తీసుకుంటే తప్ప ఈ మంత్ర పఠనం, ఈ వేదాధ్యయనాలకి విలువ లేదని అతడికి అనిపించింది. తనకి బాగా ఇష్టమైన పారాయణ గ్రంథం దుర్గా సప్తశతి పారాయణ అతడు గత ముప్ఫై నలభై ఏళ్లుగా చేస్తున్నాడు. దుర్గా సప్తశతిని విశ్వాసంతో పారాయణ చేస్తే దుర్గ దర్శనం లభిస్తుంది. కానీ తనకి ఆ అమ్మ ఎన్నడూ తన దివ్య దర్శనం ఇవ్వలేదు.

బుద్ధి వల్లభ్ అంతరాళంలో ఆ సాధువు వెలిగించిన జ్యోతి నానాటికీ తాపాన్ని పెంచసాగింది. ఇక తీవ్రమైన తపస్సాధన, ఏకాగ్ర ధ్యానం కోసం ఆయన ఇల్లు విడిచి వెళ్లాడు.

తన కోరిక తీవ్రంగా ఉంటే తనకు తప్పక సద్గురు దర్శనం, మార్గదర్శనం లభిస్తుందనీ, తాను తన లక్ష్యాన్ని సాధించగలననీ వేదజ్ఞానం నొక్కి వక్కాణిస్తోంది. కానీ తన కుటుంబం తనని అలా స్వేచ్ఛగా వెళ్లనిస్తుందా? భవబంధాల్ని వీడి తపస్సుకి వెళ్లిపోతానంటే కుటుంబ సభ్యులు ఒప్పుకుంటారా? కానీ అలా చేయకుండా తాను ఇంట్లోనే ఉండి, తపస్సాధన చేయబూనుకుంటే, తాను ఎన్నో ఏళ్లుగా నిర్వర్తిస్తూ వస్తున్న అర్చక సేవని పట్టించుకోలేని పరిస్థితి ఏర్పడుతుంది.

తాను ఒక అర్చకసేవలు చేసే పండితుడుగా కాక, నిజమైన సాధకునిగా మారదల్చుకున్నాడు. కాబట్టి తను తప్పక ఇక్కడ నుంచి దూరం వెళ్లాల్సిందే. తనెవరో ఏమిటో ఎవ్వరికీ తెలియని ప్రదేశానికి వెళ్తేనే తప్ప ఈ అంతరాగ్ని చల్లారేటట్టు లేదు. అందుకే ఆయన ఒక నిర్ణయానికి వచ్చి ఒకనాటి రాత్రి ధైర్యం కూడదీసుకుని, తన కుటుంబాన్ని విడిచిపెట్టి వెళ్లిపోయారు.

బుద్ధి వల్లభ్‌కి దుర్గాదేవికి అనుంగు భక్తుడు. అందువల్ల దగ్గరలో ఉన్న దుర్గాదేవి ఆలయాన్ని దర్శించి, అక్కడే ఉండాలనీ, ఆ మాతను సేవించాలనీ నిర్ణయించుకున్నారు. గఢ్‌వాల్‌లో అనేక ప్రదేశాలు ఉన్నాయి. కానీ అవన్నీ ఆయన గ్రామానికి దగ్గరగా ఉన్నాయి. తానెవరో తెలియకుండా ఉండాలంటే ఆ గ్రామాల్లో ఉండకూడదు. అందుకే ఆయన హరిద్వార్‌కి దగ్గరలో ఉన్న అటవీ ప్రాంతంలో గల మానసా దేవి మందిరానికి వెళ్లారు. ఆధ్యాత్మిక పథంలో ప్రయాణం ప్రారంభిస్తూ ఆయన అక్కడ తీవ్రమైన ధ్యానం చేశారు.

మానసా దేవి దయామయి. ఆమెను సేవించినవారి శాంతిసౌఖ్యాలు చేకూరతాయని భక్తుల విశ్వాసం. మనసారా కోరుకున్న కోర్కెలను తీర్చి మానసిక శాంతిని చేకూర్చే తల్లి మానసా దేవి. హరిద్వార్‌ని సందర్శించే యాత్రికులు ముఖ్యంగా మానసాదేవి మందిరాన్ని చూడడానికి వస్తారు. ఈ దేవాలయానికి కేబుల్ కారులో కూడా వెళ్లవచ్చు. కానీ డెబ్బై ఐదేళ్ల క్రితం ఆ మందిరం ఒక దట్టమైన అటవీ ప్రాంతం మధ్య ఉండేది. ఆనాడు కాలినడకన తప్ప అక్కడికి వెళ్లేందుకు వేరే మార్గం ఉండేది కాదు. ఆ ప్రాంతమంతటా ఏనుగులు, పులులు సంచరిస్తూ ఉండేవి. నిత్యావసర వస్తువులు కూడా దొరకని ఆ ప్రాంతంలో తపస్సు చేసుకోవాలని సంకల్పించడమంటే గొప్ప ధైర్యసాహసాలు, కఠోరమైన తపోదీక్ష ఉంటేనే సాధ్యపడుతుంది.

బుద్ధి వల్లభ్ ఆకస్మిక అదృశ్యం ఆ కుటుంబాన్ని విచారసాగరంలో ముంచింది. గ్రామస్తులు ఎన్నో ఊహాగానాలు చేశారు. ఆయన సన్యాసుల్లో కలిసిపోయాడని అన్నారు, చనిపోయి ఉంటాడని అన్నారు, అందరూ తలో మాటా మాట్లాడారు. మరి కొందరు దగ్గరలో ఉన్న తారకేశ్వర మందిరానికి వెళ్లి ఆయన జాడ కనుక్కోవడానికి ప్రయత్నించారు గానీ ఫలితం లేకపోయింది. ఇక అంతకు మించి ఆయన జాడ కనుక్కోవడానికి మరెవరికీ అంత సమయం లేకపోయింది. ఆయన భార్యకి మతిపోయినట్టయింది. ఆమె నిరంతరం ఏడుస్తూనే ఉండేది. ఆయన క్షేమంగా తిరిగి రావాలని ప్రార్థిస్తూ ఉండేది. ఇలా కొద్ది నెలలు ఎదురు చూసిన తర్వాత ఇక ఆమె తన భర్త తిరిగి వస్తాడనే ఆశ సన్నగిల్లింది. అయినా వంశ పారంపర్యంగా తను నమ్మిన దేవుళ్లు, దేవతలకి మొక్కుకుంటూ దగ్గరలో ఉన్న ఆలయాల్లో ఉండసాగింది.

ఆరు నెలలు గడిచాయి. బుద్ధి వల్లభ్ మానసా దేవి మందిరంలో కూర్చుని ఆ జగదేకమాతను ధ్యానించసాగాడు. శత చండిని సాధన చేయడంలో ఆయన నిష్ణాతుడు. దానికి అనేక నియమాలు పాటించాలి. రోజుకి ఒకపూటే తినాలి, గంగా స్నానం చేయాలి, త్రిలోక పూజిత అయిన ఆ దేవిని మందిరంలో దర్శనం చేసుకోవాలి, ఆ తర్వాత దుర్గా సప్తశతి మొత్తం గ్రంథాన్ని పారాయణ చేయాలి. పారాయణ పూర్తి అయిన తర్వాత మిగిలిన సమయమంతా

నవార్ణ మంత్ర జపం చేయాలి. ఆయన రోజంతా ఈ సాధనలోనే ఉండేవారు. ఆయన శత చండీ పారాయణ ముగించిన రోజున హిమాలయ ప్రాంతం నుంచి బెంగాలీబాబా దుర్గా మాత సందర్శన కోసం మానసా దేవి మందిరానికి వచ్చారు. బుద్ధి వల్లభ్ ఆయన్ని చూడగానే పులకించి పోయారు. తన పారాయణ పూర్తి అయిన చివరి రోజునే ఆ జగజ్జనని దుర్గామాత ఈ సాధువు రూపంలో వచ్చిందని భావించారు ఆయన. తనకి ఈ ఆధ్యాత్మిక మార్గంలో సరైన మార్గాన్ని సూచించగలిగేది ఈ బాబాయేనని బుద్ధి వల్లభ్ నమ్మారు. బుద్ధి వల్లభ్ చేతిలో జపమాలతో బాబా పాదాలకు సాష్టాంగ ప్రణామం చేశారు. బెంగాలీ బాబా ఆయన్ని ఆశీర్వదించి, 'నాయనా, మానసా దేవి వద్ద నీ సాధన ముగిసింది. మనమిప్పుడు నది దాటి చండీ దేవి ఆలయానికి వెళ్దాం, పద!' అని ఆదేశించారు.

బెంగాలీ బాబాని 'బాబాజీ' అని కూడా పిలిచేవారు. బుద్ధి వల్లభ్ బాబాజీని అనుసరిస్తూ, చండీ దేవి ఆలయానికి బయల్దేరారు. గురుశిష్యులిద్దరూ గంగా నదిలో స్నానం చేశారు. కమండలాల్లో గంగ నింపుకుని నిట్టనిలువుగా ఉన్న మరో పర్వత శిఖరం మీద ఉన్న ఓ చిన్న దేవాలయం దిశగా సాగిపోయారు. ఇక్కడ బెంగాలీ బాబా బుద్ధి వల్లభ్‌కి నాభి కేంద్రం మీద దృష్టి నిలిపి, నవర్ణ మంత్రాన్ని ఎలా ధ్యానించాలో ఉపదేశించారు. బుద్ధి వల్లభ్ ఈ మంత్రాన్ని గత ముప్పై నలభై ఏళ్లుగా పఠిస్తూనే ఉన్నాడు. కానీ అతడు పారాయణ క్రమంలో చేస్తున్నాడు. అయితే ఒక జ్ఞాని నుంచి మంత్ర దీక్ష తీసుకోవడం ఎలా ఉంటుందో అతడికి అనుభవపూర్వకంగా ఇప్పుడే తెలిసింది.

1983లో నేను స్వామీజీకి హిమాలయ పరమగురువులతో జీవనము చూపించాను. స్వామీజీ తమ పరమ గురుదేవుల గురించీ, తండ్రి గురించీ మాట్లాడడం మొదలుపెట్టారు. వారు అన్ని విషయాలూ మనసు విప్పి చెప్పేలా ఉన్నారని గ్రహించిన నేను, 'స్వామీజీ, బాబాజీ మీ తండ్రిగారికి సవర్ణ మంత్రాన్ని సాధన చేయడానికి చెప్పిన అసలు పద్ధతి ఏమిటి? మంత్రంలో ఒక ప్రత్యేకమైన తేడా ఏమైనా ఉంటుందా? గ్రంథాల్లో వ్రాయబడిన దానికీ, జపించే బీజాక్షరాలకీ మధ్య తేడా ఏమైనా ఉంటుందా?' అని అడిగాను వారిని.

దానికి స్వామీజీ, 'సవర్ణ మంత్రానికి గణపతి అధిష్ఠాన దేవత. ఇది గణేశునితో అనుసంధానమై ఉన్న సాధన. సమయం వచ్చినపుడు నువ్వు కూడా దీనిని సాధన చేస్తావు,' అంటూ ఆ సంభాషణని అక్కడికి ముగించారు. కానీ ఆ పుస్తకాన్ని అనువదించేందుకు నాకు ఆరు నెలలు పట్టింది. ఆ మంత్ర సాధన ఎలా చేయాలో, దానికి ఎలాంటి ఫలితాలు వస్తాయో నాకు స్వామీజీ వివరించారు. బాబాజీ తమ తండ్రిగారితో గల ఆత్మీయబంధం గురించి కూడా స్వామీజీ చెప్పారు.

బాబాజీ, బుద్ధి వల్లభ్‌లు చండీ దేవి దగ్గర ఒక వారం రోజులు ఉన్నారు. ఆ సమయంలో బుద్ధి వల్లభ్ మనసులో ఉదయించిన ఎన్నో ప్రశ్నలకు బాబాజీ సమాధానాలు చెప్పారు. బుద్ధి వల్లభ్ ఆయనతో తన జీవితాశయాన్ని గురించి వివరించారు. కేవలం పుట్టడం, పెరగడం, ముసలితనంలో చనిపోవడం కాక నెరవేర్చవలసిన విద్యుక్త ధర్మాన్ని తాను ఇప్పటికే నిర్వర్తించాననీ, ఇకపై సాధు జీవితాన్నే తాను గడపదలిచాననీ ఆయన వివరించారు.

అప్పుడు బాబాజీ బుద్ధి వల్లభ్‌ని ఇంటికి వెళ్లమని ఆదేశించారు. భార్య బిడ్డల దగ్గర కొంతకాలం గడపమనీ, మరొక బిడ్డని కనమనీ, ఈ బిడ్డని పెంచడం అతడి ఆధ్యాత్మిక పురోగతికి ఏ మాత్రం ఆటంకం కాబోదనీ ఆయన చెప్పారు. ఈ పుట్టబోయే బిడ్డని తమకి చెందిన సంతానంగా ఎంచవద్దనీ, ఈ బిడ్డ భూమ్మీదకి రావడానికి ఆ దంపతులు ఒక నిమిత్త కారణంగా ఉండాలనీ ఆదేశించారు. ఈ పుట్టబోయే బిడ్డడే తనకు 'గురుదక్షిణ' (విద్య గరపిన గురుదేవులకు శిష్యులు

(ప్రీతితో సమర్పించే బహుమతి) కాగలదని ఆయన చెప్పారు. ఇది విని బుద్ధి వల్లభ్ ఆశ్చర్యపోయారు. కానీ తన గురుదేవుల ఆదేశం కాబట్టి ఆయన ఇంటికి వెళ్లడానికి సుముఖత చూపారు.

బుద్ధి వల్లభ్‌ని చూసిన ఆయన భార్య సంతోషంతో పొంగిపోయింది. ఈ వార్త విని ఊరూవాడా అంతా ఆశ్చర్యపోయారు. కొంతమంది తెల్లబోయారు, మరి కొంతమందికి నిరాశ కలిగింది, ఆగ్రహం వచ్చింది. బుద్ధి వల్లభ్ వెళ్లిపోయిన తర్వాత వాళ్లు ఆయన గురించి చాలా ఆందోళన చెందారు. ఆయన భార్య పరిస్థితి చూసి వారికి కనికరం కలిగి అన్ని వైపులా వెదకడానికి వెళ్లారు. కొద్దికాలం ఎదురు చూశారు, చివరికి కాలాంతరంలో అతడిక చనిపోయి ఉంటాడనే నిర్ణయానికి వచ్చారు. ఆఖరికి అతడి కుటుంబం అతడికి పదమూడు రోజుల పాటు సంప్రదాయబద్ధమైన రీతిలో అపర కర్మలు జరిపించింది. కానీ అతడి భార్య అతడు మరణించాడంటే అంగీకరించలేదు. పుణ్య స్త్రీ లాగానే ఆమె పసుపు కుంకుమలు ధరిస్తూ ఉండేది. ఒక విధవరాలి లాగా జీవించడానికి ఆమె ఒప్పుకోకపోయే సరికి చుట్టూ ఉన్న సమాజం, బంధువర్గంలో చాలా చికాకులు తలెత్తాయి.

అంతేకాదు, బుద్ధి వల్లభ్ సజీవంగా ఉన్నాడనీ, తీవ్రమైన ఆధ్యాత్మిక అభ్యాసంలో నిమగ్నమై ఉన్నాడనీ గ్రామస్తులకు తెలిసి ఉంటే, ఆయనని ఒక ఆధ్యాత్మిక పథ ప్రదర్శకుడిలా కొంతమందీ, బాధ్యత లేకుండా బంధాల్ని తెంపుకుపోయాడని కొంతమందీ విమర్శించేవారేమో గానీ, ఆయన అనుకోకుండా చాలా కాలం తర్వాత తిరిగి వచ్చేసరికి అదో పెద్ద సంచలనంగా మారింది. ఆయన ఇల్లు వదిలి వెళ్లినపుడు అందరూ ఆయనని సన్యాసం తీసుకున్నాడని అనుకున్నారు. ఒక సంసారి సన్యాసిగా మారిన తర్వాత తిరిగి తన ఇంటికి చేరడం మహా పాపం. అందువల్ల ఒక పాపాత్ముడికి ఆశ్రయం ఇస్తే ఆ జాతి మొత్తానికీ చేటు కలుగుతుందని ఆ గ్రామస్తులు విశ్వసించారు. బుద్ధి వల్లభ్ రాకతో ఏదైనా దురదృష్టం వెన్నంటి వస్తుందేమోనని వారి అనుమానం. అందువల్ల బుద్ధి వల్లభ్ ఇంటి నుంచి వెళ్లిపోయిన తర్వాత ఎక్కడికి వెళ్లాడో, అతడికి సన్యాస దీక్ష ఎవరిచ్చారో ఆ మహాత్ముణ్ణి కనుగొనే పనిలో పడ్డారు.

బుద్ధి వల్లభ్ ప్రేమ గురించీ, భయం గురించీ ఒక ముఖ్యమైన పాఠం నేర్చుకున్నారు. ఆయన ఇంటికి వచ్చిన తర్వాత కాస్త స్తిమిత పడ్డ తర్వాత, తాను ఇల్లు విడిచి పెట్టి వెళ్లడానికి దారితీసిన మానసిక స్థితి, మానసా దేవి మందిరానికి వెళ్లడం, అక్కడ బెంగాలీ బాబా తనకు కనిపించి ఉపదేశం ఇవ్వడం గురించి అందరితోనూ సవివరంగా తెలియజేశారు. ఆ సాధు ఆదేశం వల్లనే తిరిగి తను ఇంటికి వచ్చాననీ అన్నారు. బాబా తనను సాధువుగా మారమని ఎన్నడూ చెప్పలేదని అన్నారు. తాను పూర్వపు బుద్ధి వల్లభ్‌నేనని చెప్పారు. అలాగే బాబాజీ తనకు ఒక ముఖ్యమైన ఆదేశం ఇచ్చారనీ, తాను గృహస్థాశ్రమ ధర్మం నిర్వర్తించి ఒక మగసంతానాన్ని కనమని ఆదేశించారనీ కూడా చెప్పారు.

ఏదో విధంగా అలజడి తగ్గింది. కానీ ఇంకా సందేహం వీడలేదు. బుద్ధి వల్లభ్‌కి డెబ్బై ఏళ్లు దాకా ఉన్నాయి. ఆయన భార్య అరవై ఏళ్లు. పర్వతప్రాంత వాసులని దృష్టిలో పెట్టుకుంటే, అది చాలా పెద్ద వయసు కిందే లెక్క. ఆయన భార్యకి ఈ వయసులో సంతానం ఎలా కలుగుతుందన్న సందేహం ఉన్నప్పటికీ, సాధు భవిష్యవాణి ఫలించింది. ఒక సంవత్సరం లోపే ఆమె గర్భం ధరించింది. త్వరలోనే ఒక పండంటి బిడ్డ జన్మించాడు. ఆ బాలుడు జన్మించిన రోజునే బాబాజీ బుద్ధి వల్లభ్ ఇంటికి వేంచేసి, ఆ బాబుని చూపించమని అడిగారు. సంప్రదాయం ప్రకారం తల్లి, బిడ్డలను పన్నెండు రోజుల పాటు వేరే గదిలో విడిగా ఉంచుతారు. అందువల్ల తల్లి, మిగతా కుటుంబ సభ్యులు, ఆ బిడ్డని గది దాటించి బయటికి తీసుకుని వెళ్లడం పట్ల

అభ్యంతరం వ్యక్తం చేశారు. కానీ ఆ సాధు ఆదేశంతోనే తమకు సంతానం కలిగిందనే సత్యాన్ని బుద్ధి వల్లభ్ తన భార్యకి గుర్తు చేసి, దీనివల్ల ఎలాంటి ఇబ్బందీ లేదని చెప్పాడు. పిల్లవాడిని బాబాజీ చేతుల్లో పెట్టారు. ఆ సాధువు శిశువుని కొన్ని నిముషాలు చేతుల్లో పెట్టుకుని, తదేకంగా చూశాడు. తర్వాత ఆ బాలుడిని తిరిగి ఇచ్చేస్తూ, 'గుర్తుంచుకోండి, ఈ పిల్లవాడు నా వాడు. ప్రేమగా పెంచండి, సమయం వచ్చినపుడు నేను తనని నాతో తీసుకుని వెళ్తాను,' అన్నాడు. బుద్ధి వల్లభ్ బాబాజీని భోజనం చేయమని అడిగాడు, కానీ బాబాజీ తిరస్కరిస్తూ, 'నేను నా బిడ్డని చూడడానికి వచ్చాను. నిజానికి ఈ బిడ్డ ఈ లోకంలో ఎవరికీ చెందడు, ఆ దైవానికి తప్ప! అతడి పట్ల మమతానుబంధాలు పెంచుకోకండి!' అని చెప్పి బాబాజీ వెళ్లిపోయారు.

ఆ తర్వాత నామకరణ మహోత్సవం జరిగింది. బాలుడికి 'వ్రజ కిశోర్ కుమార్' అని పేరు పెట్టారు. ఆ గ్రామంలో అందరూ అతడిని ప్రేమగా 'కిశోరి' అని పిలిచేవారు. అతడి తల్లిదండ్రులు మాత్రం అతడిని 'పుత్తు' ('పుత్ర' అనే పదానికి మాండలికం) పిలిచేవారు. ఈ బాలుడి జననమే ఒక వింత అనుకుంటే, ఇతడి చెవి కమ్మలకి పుట్టుకతోనే రంధ్రాలు ఉండడం గ్రామస్తులకి మరో భీతిగొలిపే కారణంగా మారింది. బుద్ధి వల్లభ్ ఆ ఇంట్లోకి తిరిగి సంసారిగా అడుగు పెట్టకూడదన్న గ్రామస్తుల నమ్మకం బలపడింది. ఈ వింతకి వారు చాలా భయపడ్డారు. ఏదైనా ఆపద జరిగితే అది ఆ తల్లిదండ్రులకే జరగాలి తప్ప మరెవరికీ జరగకూడదని వారు భగవంతుని ప్రార్థించారు. కానీ రంధ్రాలున్న ఈ చెవి కమ్మల వల్లే బుద్ధి వల్లభ్ ఈ బాలుడు అసాధారణమైన అంశలు కలవాడనీ, తన గురువు, దేవీ మాత వాక్కులు ఫలించాయనీ నమ్మారు. బుద్ధి వల్లభ్‌కి వారి వంశం పేరు 'దశ్మన' అని రావడానికి గల కారణం వివరించిన సాధువే, ఆధ్యాత్మిక దీక్ష పొందే సాధకులు సాధు సంప్రదాయంలో చెవులు కుట్టించుకోవడం సర్వసామాన్యమైన విషయమనీ, ఈ బాలుడి ఆత్మ గురు గోరఖనాథ్ సంప్రదాయానికి చెందినవారని చెప్పడానికి ఇంత కంటే గొప్ప నిదర్శనం ఏముందని ప్రశ్నించారు. ఆయన ఈ విషయాన్ని తన భార్యతో చెప్పారు. బిడ్డని ప్రేమగా చూడమనీ, కానీ అనుబంధం పెంచుకోవద్దనీ కూడా చెప్పారు.

తల్లి వృద్ధాప్యంలో ఉండడం చేత తన బిడ్డకి ఆమె పాలిచ్చి పెంచే స్థితి లేదు. కానీ ఆమె పెద్ద కొడుకు భార్య కూడా అదే సమయంలో ఒక బిడ్డకి జన్మనిచ్చింది. ఆమే మరిది కిశోరీకి కూడా పాలివ్వడానికి సంతోషంగా అంగీకరించింది. హైందవ సంప్రదాయ కుటుంబాల్లో ఉన్న అలవాటు ప్రకారం బుద్ధి వల్లభ్ దైనందిన కార్యకలాపాల్లో తన కుమారుడి గురించి పట్టించుకోకపోయినా, ఆ పిల్లవాడు జాగ్రత్తగా పెరగడానికి తను ప్రత్యేకంగా చేసే సాధన బాగా పని చేస్తుందని ఆయనకు బాగా తెలుసు. కాబట్టి తన గురువు బోధించిన మార్గం సాయంతో ఆయన తన సాధనని మరింత తీవ్రతరం చేశారు. ఇప్పుడు బుద్ధి వల్లభ్‌కి గార్హస్థ్య ధర్మం, బాధ్యతల్ని తలకెత్తుకోవడంలో ఎంతమాత్రం ఆసక్తి లేదు.

బుద్ధి వల్లభ్ సంతానంలో మగపిల్లలు అప్పటికే చదువుకుని, ప్రభుత్వోద్యోగాలు చేస్తూ స్థిరపడ్డారు. ఆర్థిక రీత్యా చెప్పుకోవాలంటే, కుటుంబం మధ్యతరగతికి చెందిన కుటుంబం. కానీ పిల్లలు బ్రిటిష్ పాలనలో ఆంగ్లంలో విద్యని అభ్యసించడం వల్లా, బ్రిటిష్ ప్రభుత్వ ఉన్నతాధికారులతో వారికి సన్నిహిత సంబంధాలు ఉండడం వల్ల వాళ్లలో ఆధిపత్య భావన ఎక్కువగా ఉండేది. ఆధునిక విద్య, మోడరన్ సంస్కృతికి అలవాటు పడ్డ ఆ పిల్లలకి తమ తండ్రి ధ్యానం కోసమూ, వేదాలూ, ఉపనిషత్తుల అధ్యయనం కోసమూ సాంసారిక, సామాజిక బంధాల్ని త్రోసిరాజనడం అధమంగా కనబడింది. పైగా ఇది చాలదన్నట్టు, కిశోరీ పట్ల ఆయన చూపే ప్రేమ ఎంత ఏకోన్ముఖంగా ఉండేదంటే, చివరికి ఆయన తన మనుమలకి అందించాల్సినంత చేరిక, అనురాగం అందించలేకపోయారు. స్వామీజీ ఈ స్థితి గురించి మాట్లాడుతూ, 'ఈ ప్రవర్తన అన్నకి చాలా

ఇబ్బందికరంగా మారింది. ముఖ్యంగా నా అంత వయసున్న పిల్లలు ఆయనకూ ఉన్నారు,' అన్నారు. అయినా, వదినగారు మాత్రం ఆయనను చాలా దయగా, ప్రేమగా ఆర్ద్రంగా పెంచింది. కిశోరీని ఎప్పుడూ తన పిల్లల్లో ఒకడిగానే చూసేది.

కిశోరీ అందానికి అందరూ ముగ్ధులయ్యేవారు. ఎవరిని చూసినా అంత అందమైన పిల్లవాడిని తామెన్నడూ చూడలేదని అనేవారు. కిశోరీ చురుగ్గా బలంగా ఉండేవారు. అప్పుడప్పుడూ ఉదాసీనంగా ఏం ఆలోచిస్తున్నాడో ఎవరికీ అర్థంకాని విధంగా ఉండేవాడు. ఒక్కోసారి పదహారు గంటలు, ఇరవైనాలుగు గంటలపాటు కూడా నిద్ర పోతుండేవాడు. కానీ తరచుగా మేల్కొని ఏడుస్తూ, ఏవో అర్థంకాని విషయాల్ని చెప్పడానికి ప్రయత్నిస్తూ ఉండేవాడు. అతడు శారీరికంగా బలంగా ఉండేవాడు. కానీ కొన్నిసార్లు ఎంతో మానసిక బలం కనిపించేది అతనిలో. ఈ పిల్లవాడు ఏదో విపత్తుకి కారకుడవుతాడనే భయం ఉన్నా గానీ, చుట్టుప్రక్కల ప్రజలంతా ఆ పిల్లవాడంటే చాలా ఆకర్షణ ఉండేది. కిశోరి జననం తర్వాత సాధువులు మరింత తరుచుగా ఆ గ్రామాన్ని సందర్శించేవారు. ఆ పిల్లవాడి పట్ల అమితాసక్తి కలిగిన గ్రామస్థులు అతడు చేసే వింత చేష్టల్ని చూసి ఆశ్చర్యపోతూ ఉండేవారు. వచ్చిన సాధువులకి కొంతమంది గ్రామస్తులు ఆ పిల్లవాడు వరప్రసాదమనీ, దైవం కరుణించి బిడ్డ అనీ చెప్పేవారు. మరి కొంతమంది ఆ పిల్లవాడికి గాలి సోకిందనీ, వారు తమ ఆశీస్సులతో ఎలాగైనా ఆ బిడ్డను కాపాడాలనీ, ఆశీస్సులివ్వాలనీ చెప్పేవారు.

బుద్ధివల్లభ్ ఒక కఠినమైన దినచర్యని అలవాటు పాటించేవారు. ఆయన త్వరగా లేచి స్నానం చేసి సాధన మొదలుపెట్టేవారు. ఆయన పూజలో ఎక్కువసేపు గణేశుని, దుర్గాదేవినీ పూజిస్తూ గడిపేవారు. ఆయన నీరు, గంధంపొడి, పూలు, పాలు, పెరుగు, తేనె, పసుపు, బియ్యం, సింధూరం, అగరబత్తులు, నెయ్యితో వెలిగించిన అఖండదీపం, పండ్లు, మిఠాయిలతో సంప్రదాయబద్ధమైన అర్చన చేసేవారు. తర్వాత మొత్తం దుర్గాసప్తశతి పారాయణ చేసి, గురువు ఉపదేశించిన మంత్రాన్ని జపించేవారు. పూజ ముగిసిన తర్వాత ప్రసాదాన్ని తన ప్రియ పుత్రుడికి పెట్టేవాడు.

కిశోరీకి అప్పుడు మూడేళ్లు ఉంటాయి. తన మిత్రుల్ని భోజనానికి పిలిచాడు. వాళ్ల కోసమని అన్నగారు స్వీట్లు ఆర్డరు చేసి తెప్పించాడు. అప్పటికి మధ్యాహ్నమైంది గానీ అతిథులు ఇంకా రాలేదు. బుద్ధివల్లభ్ తన పూజ ముగించి, మామూలుగానే మిఠాయి ప్రసాదం పుత్రుకి పెట్టారు. ఆయన తన ధ్యానమందిరంలోనే ఉండిపోయారు. పిల్లవాడు చేతిలో మిఠాయి ప్రసాదంతో పట్టుకుని సంతోషంగా బయటికి వచ్చాడు. ఇది గమనించిన అన్నగారు ఈ అల్లరి పిల్లవాడు చెడు అలవాట్లు నేర్చుకుంటున్నాడనీ, అతిథుల కోసం అట్టేపెట్టిన మిఠాయిల్ని దొంగిలించాడనీ భావించాడు. ఆ మిఠాయి ఎక్కడ నుంచి తీశావో చెప్పమని కిశోరీని గద్దించి అడిగాడు. కిశోరీ అన్నవైపు అల్లరిగా చూసి, మొత్తం మిఠాయిని నోట్లో కుక్కేసుకుని అక్కడ నుంచి పరిగెత్తడానికి ప్రయత్నించాడు. కానీ అన్నగారు అతణ్ణి పట్టుకుని ఎందుకలా చేశావో చెప్పమని కోప్పడ్డారు. కిశోరి నోటి నుండా మిఠాయి ఉండడం వల్ల వెంటనే మాట్లాడలేకపోతున్నాడు. అతడు దాన్ని మింగడానికి ప్రయత్నిస్తున్నాడు గానీ తన నాలికని కదపలేకపోతున్నాడు. కోపంతో ఊగిపోతూ అన్నగారు కిశోరీని చెంప మీద కొట్టాడు. చాలా నొప్పిగా ఉంది, అయినా కిశోరీ ఏడవలేక పోతున్నాడు. ఎలాగో అలా వెక్కిళ్లు పెడుతూ ఏడుపు మింగేస్తున్నాడు. దానితో అన్నగారు అరుస్తూ, 'మరీ మొండికెత్తిపోయావు పిల్లాడా! ఇదేనా నువ్వు నేర్చుకున్నదీ,' అంటూ ఇంకా కొట్టసాగాడు.

కిశోరీ ఆ మిఠాయిలో కొంచెం ముక్కని బయటికి ఉమ్మేసి, మిగతాది మింగేశాడు. ఇప్పుడు అతడు ఏడవడానికి వీలైంది. ఇంటి పైకప్పు లేచిపోయేట్టు ఏడవసాగాడు. ఓ పక్కన అన్న అతడిని బాదుతూనే ఉన్నాడు, ఆ మిఠాయి దొంగిలించింది తనేనని ఒప్పుకోమంటూ. ఈ

గొడవంతా విని బుద్ధి వల్లభ్ తన ధ్యానమందిరం నుంచి బయటికి వచ్చాడు. పిల్లవాడిని విడిపించి అతడిని అక్కున చేర్చుకున్నాడు. నిర్ఘాంతపోయిన బుద్ధి వల్లభ్ పిల్లవాడి భుజాలు చుట్టూ చేతులు వేసి, 'ఎందుకు వాడినలా కొడుతున్నావు?' అని అడిగారు పెద్ద కొడుకుని. దానికి ఆయన, 'మీరే వాణ్ణి చెడగొడుతున్నారు! వాడికి అసలు బుద్ధీ జ్ఞానం లేదు! ఏది పడితే అది దొంగతనం చేస్తాడు, పట్టుకుంటే మాత్రం నేనేం చేయలేదంటాడు!' అని చెప్పాడు కఠినంగా.

తీవ్రంగా బాధపడిన బుద్ధివల్లభ్ తన కొడుక్కి ఆ మిఠాయి ఎక్కడ నుంచి వచ్చిందో తెలియజేసి, 'నాశనమైపోతావు, నీకు శాంతి అనేదే ఉండదు!' అని శపించి, పుత్తుని ఎత్తుకుని ధ్యానమందిరంలోకి వెళ్లిపోయాడు. పిల్లవాడిని హృదయానికి హత్తుకుని విపరీతంగా ఏడ్చాడు. ఈ సంఘటన తర్వాత ఆయన మరింత అంతర్ముఖుడై పోయాడు. ఆ తర్వాత కొద్ది కాలానికే కాలం చేశారాయన.

ఆయన భార్య చలించిపోయింది. అంత పెద్ద వయసులో పిల్లవాడిని కన్న ఆమె చాలా నీరసించిపోవడం మొదలుపెట్టింది. రాన్రానూ ఆమెకి కనిపించడం కూడా పోయింది. ఇక కిశోరీ కోసం ఏదైనా చేసే ఓపిక కూడా లేదు. వదినగారు పిల్లవాడిపై అచంచలమైన ప్రేమ కురిపించేది కానీ, అత్తగారు కూడా బాధపడుతూ ఉండడం వల్ల కిశోరి ఉనికి ఎవరికైనా దు:ఖాన్నే కలుగజేస్తుందేమో అని భావన మాత్రం ఆమెలో నానాటికీ బలపడసాగింది. బెంగాలీ బాబా ముందుగానే 'ఈ పిల్లవానిది చాలా విశిష్టమైన జన్మ, అతడి వల్ల అందరికీ సంతోషం లభిస్తుంద'ని చెప్పినా, ఇంట్లో మిగతా కుటుంబ సభ్యులు కూడా ఈ అభిప్రాయాన్ని నమ్మసాగారు.

తండ్రి చనిపోయిన తర్వాత కిశోరీకి ఎక్కువగా కలలు వస్తున్నాయి. అతడు ఎక్కువగా మేల్కొంటున్నాడు. మరి కొన్ని సార్లు ఆ కలలు అతన్ని భయపెడుతున్నాయి కూడా. ఆ కలలో తనేం చూశాడో కిశోరీ వర్ణించి చెప్పేవాడు. కొన్నిసార్లు పిచ్చివాళ్లలా ఉన్న కొంతమంది తనను దట్టమైన అరణ్యాలు, చిమ్మచీకటిగా ఉన్న గుహల్లోకి తీసికెళ్తున్నట్టు, అక్కడ కొంతమంది జడలు కట్టి, ఎర్రని కళ్లతో భయంకరమైన కార్యకలాపాలేవో చేస్తుండడం చూసి అతడికి కలలోనే చాలా భయం వేసేది. కొన్నిసార్లు తన తండ్రి మిఠాయి పెట్టినట్టూ ఆయన చాలా సంతోషంగా ఉన్నట్టూ కలలు వచ్చేవి. అలాగే అతడి కలల్లో మరి కొంతమంది కనిపించేవాళ్లు. వాళ్లు చూడడానికి అసలు మనుష్యుల్లా ఉండేవారే కాదు.

ఒకవేళ తను మేల్కొన్నా, కిశోరీ తన కాల్పనిక ప్రపంచంలో మునిగి ఉండేవాడు. తండ్రి బ్రతికి ఉన్న రోజుల్లో ఈ లక్షణాలు మరింతగా కనిపించేవి. ఇప్పుడు పరిస్థితి మరింత హీనమైంది. కుటుంబ సభ్యులు వైద్యుల్నీ, పూజారుల్నీ కలిసి సలహాలు తీసుకుంటున్నారు. తాంత్రికులు క్షుద్రపూజలు చేస్తున్నారు. కానీ ఏమీ ప్రయోజనం లేదు. ఒకనాడు ఒక జ్యోతిష్కుల బృందం వచ్చి కిశోరీ జ్యోతిష్యాన్ని గురించి చర్చించారు. వాళ్లు మాట్లాడుకునే విషయాల్ని కిశోరీ చాటుగా వింటున్నాడు. తనకి ఇరవై ఎనిమిదవ ఏట మారక దశ అంటే మృత్యువాత పడే అవకాశం ఉన్నట్టు చెప్తున్నారు వాళ్లు. సరిగ్గా అదే సమయంలో బెంగాలీ బాబా వచ్చి, 'మీరంతా పోతారు, కానీ నా బిడ్డకి ఏమీ కాదు! అతడు చాలా అమాయకుడు ('భోలా' భోలా). మీరంతా కలిసి వాడి మనసులో భయం కలిగేలా చేస్తున్నారు. మీ గ్రహగతుల్ని పనికి రాకుండా చేస్తాను, చూడండి!' అంటూ ఆ జ్యోతిష్య పండితుల్ని హుంకరించారు. కిశోరీ భుజం మీద చేయి వేసి, బాబాజీ, 'నువ్వు నాకు అత్యంత ప్రీతిపాత్రుడివి నాన్నా! నేను నీ గురించి తీసుకోవలసిన అన్ని జాగ్రత్తలూ తీసుకుంటాను,' అంటూ అతడు తను చెప్పాల్సిన విషయం ముగించి వెళ్లిపోయారు అక్కడ నుంచి.

1983లో స్వామీజీని వారి గురుదేవుల గురించి నేను మాట్లాడిన అనేక సందర్భాల్లో తన అంతర్గత ప్రపంచంలోకి జారిపోయే ముందు, ఒకటీ రెండు వాక్యాలకి మించి ఏమీ చెప్పేవారు కాదు. ఆయన నేత్రాలు ఎక్కడో సుదూరంగా ఎక్కడో దేన్నో చూస్తూ ఉండేవి. ఆయన కొన్ని క్షణాలపాటు మౌనంగా ఉండేవారు. ఆ తర్వాత చాలా మెల్లిగా ఆయన 'ఇక నువ్వు వెళ్లు,' అనేవారు. ఆయన దూరదృక్కులు, గంభీరమైన ముఖం చూస్తే, ఆయన పైకి చెప్పని విషయాలన్నీ అర్థమయ్యేవి. పైకి చెప్పని విషయానికి చాలా విలువ ఉంటుందని నాకు తెలుసు. గురుదేవులు, ఆయన తండ్రిగారు, వారు చేసిన సాధన, ఆయన నుంచి పొందిన అనుభవాల సారం ఇలా ఉండేది.

తండ్రి ఈ ప్రపంచాన్ని వీడి వెళ్లిపోయిన తర్వాత కిశోరీకి మూలాధారం పోయింది. ఆయన అనాథ అయిపోయారు. కానీ ఉమ్మడి కుటుంబం కావడం వల్ల అన్నగార్ల పిల్లలతో కలిసి పెరగడం జరిగింది. స్కూల్లో చేరే వయసు వచ్చింది. దగ్గర్లో ఉన్న ఎలిమెంటరీ స్కూల్లో చేర్చారు కిశోరీని. అతడికి వెళ్లడం అంతగా ఇష్టం ఉండేది కాదు. ఒక చోట మౌనంగా కూర్చుని జీవితంలోని మార్మికమైన విషయాల్ని అర్థం చేసుకోవడమే ఎక్కువ ఇష్టం అతడికి. తండ్రి మరణం వల్ల పిల్లవాడు ఎవరితోనూ మాట్లాడడం లేదనీ, తన లోకంలో అనుకునేవారు చుట్టుప్రక్కల జనం. చిన్నతనంలో వస్తుండే వింత కలలు ఇప్పుడు రావడం తగ్గిపోయింది. కానీ తను ఒక్కడే ఏకాంతంగా ఉండడం అలవాటైంది. ఎప్పుడూ ఏదో దిగులుగా ఉండేవాడు. తన వయసు పిల్లలంతా స్కూలుకి వెళ్తారు కాబట్టి తనూ వెళ్లేవాడు. స్కూలు కూడా దగ్గరగానే ఉండేది. ఉపాధ్యాయులు ఈ పిల్లవాడిని ఇష్టంగా చూసేవారు. కానీ అతడికి నిరంతరం తన లోపల చెలరేగుతున్న ప్రశ్నలతో వ్యస్తంగా ఉండేవాడు. 'నేనెందుకు పుట్టాను? ఈ కుటుంబంలోనే ఎందుకు పుట్టాను? నా బాధ్యతల్ని చూస్తున్న వాళ్లతో నాకున్న బాంధవ్యం ఏమిటి? నా కలల్లోకి తరచుగా వచ్చేవాళ్లెవరు? బాబాజీయే నా తండ్రీ, తల్లీ కూడా. నన్ను తీసికెళ్లడానికి ఆయన ఎప్పుడు వస్తారు? ఈ ప్రపంచంలో భాగం కాని నాకు ఈ స్కూల్లో చదువుకునే బాదరబందీ ఎందుకు?' ఇలా సాగిపోయేవి ఆ ప్రశ్నలు.

'హిమాలయ పరమగురువులతో జీవనం'లో స్వామీజీ తనకు తన గత జీవితం గుర్తుందనే విషయాన్ని చాలా స్పష్టంగా రాశారు. తను ఈ కుటుంబంలో ఉండడం వింతగా అనిపించిందని చెప్తారు. కానీ ఆయన పెద్దవుతున్నకొద్దీ, ఆ జ్ఞాపకాలు మసకబారసాగాయి. ఆ జ్ఞాపకాన్ని నిలుపుకునేందుకు ఆయన ఎంత ఏకాగ్రతతో ధ్యానం చేసినప్పటికీ తన చుట్టూ ఉన్న ప్రపంచంలో తను అంతగా నిమగ్నం కావలసి వచ్చేది. అంతగా ఆయన పూర్వజన్మ స్మృతులు మరుపుకి వచ్చేవి. మెల్లమెల్లగా తన వాస్తవమైన ఉనికిని మరిచిపోవడం అతడిని ఆందోళనకీ, విచారానికీ గురి చేసింది. తను పిల్లవాడిగా ఉన్నప్పుడైతే తన ఆలోచనలు, అనుభూతుల్ని ఎలాంటి సంకోచమూ లేకుండా చెప్పేసేవాడు. ఆ వయసులో పిల్లలు అలా చేయడం చాలా అసాధారంగా ఉండేది. ఇప్పుడు కొంచెం పెద్దయ్యేసరికి, తన ఆలోచనలు అలా అందరితోనూ చెప్పుకోవడం తప్పని అనిపిస్తోంది.

అలా అని కిశోరీ పూర్తిగా ఒంటరిగా ఉండేవాడు కాదు. ఆ గ్రామంలో ఇద్దరు మహిళలు ఉండేవారు. అతడు వాళ్లతో కూర్చుని ఏవో కబుర్లు చెప్తూ ఉండేవారు. వాళ్లు ఆయనను చాలా ప్రేమగా చూసేవారు. వాళ్ల మాటలు ఆయనని ఎంతో సాంత్వనపరిచేవి. వాళ్లు అతడికి ఋషీశ్వరులు, యోగులు, దేవుళ్లు, దేవతల మహిమల గురించి వర్ణించి చెప్పేవారు. పునర్జన్మ గురించి వాళ్లు చెప్పిన సంగతులు విన్న కిశోరీకి తనకి వచ్చే కలలు, ఆలాపనలకి అర్థమేమిటో తెలిసింది. ఆ స్త్రీలిద్దరూ పెద్దగా చదువుకున్నవాళ్లు కాకపోయినా, వాళ్లకి చదువు విలువ తెలుసు.

వాళ్లు కిశోరీని స్కూలుకి వెళ్లి చదువుకోమని ప్రోత్సరించేవారు. బాగా చదువుకుంటే తండ్రి లాగా గౌరవం పొందవచ్చునని వాళ్లు చెప్పేవారు.

ప్రాథమిక విద్య పూర్తి చేసే సమయానికి కుటుంబ సభ్యులు తప్ప అతడిని ఎవరూ 'కిశోరీ' అని పిలిచేవారు కాదు. బయటంతా 'బ్రజ్ కిశోర్ కుమార్' అని పూర్తి పేరుతో పిలిచేవారు. అతడు జూనియర్ హైస్కూల్‌కి వచ్చేసరికి (ఆరు నుంచి ఎనిమిది క్లాసులు) అతడు బెంగాలీ బాబాతోనూ, మిగతా సాధువులతోనూ ఎక్కువ సమయం గడిపేవాడు. అప్పటికి బ్రజ్ కిశోర్, బాబాల బంధం బాగా బలపడింది. బాబాజీ దగ్గరలో ఉన్నపుడల్లా కిశోరీకి మరి దేని మీదా ఆసక్తి ఉండేది కాదు. బాబాజీ వేసవి కాలంలో ఎక్కువ భాగం, శీతాకాలం ప్రారంభంలో కొంతకాలం గఢ్‌వాల్ హిమాలయాల్లో గడిపేవారు. అందువల్ల కిశోరీ వేసవి కాలం అంతా ఆయనతోనే ఉండేవాడు. కానీ వేసవికాలం ముగిసిన తర్వాత కూడా బాబాజీతో కలిసి సంచరించడానికి కిశోరీ స్కూలు మానేసేవాడు. దాంతో హాజరు తగ్గేది. అయినా స్కూల్లో ఎప్పుడూ మంచి మార్కులు వచ్చేవి.

బెంగాలీ బాబా బాగా చదువుకున్నారు. ఆయన కిశోరీకి బాగా చదువు రావాలని ఆశీర్వచనమిచ్చారు. బాబాజీ మార్గదర్శకత్వంలో ఓ సాధుమండలి తరచుగా లాండ్స్‌డౌన్ ప్రాంతాన్నీ, చుట్టుప్రక్కల గ్రామాల్నీ సందర్శించేది. వారు బ్రజ్ కిశోర్‌ని 'భోలే' అని పిలిచేవారు. 'భోలే' అంటే, 'అమాయక బాలుడు,' అని అర్థం. వారంతా వచ్చి ఆ బాలుని సందర్శించడంలో గల ప్రత్యేకమైన ఉద్దేశ్యం ఒకటే, ఈ లౌకిక ప్రపంచంలో కిశోరీ అభ్యసించాల్సిన నైపుణ్యాల్ని చకచకా అభ్యసించేలా చేయడం. ప్రాపంచిక బంధనాల్లో చిక్కుకోకుండా దానితో యుక్తిగా గడపడం ఎలాగో నేర్చుకునేందుకు ప్రేరణ కల్పించడమే వారి ఉద్దేశ్యం. చదువు పట్ల గల అనాసక్తిని తొలగించేందుకు వారు అతడికి సహాయపడ్డారు. విద్యాభ్యాసం పూర్తి చేసుకుంటేనే బాబాజీ దగ్గర నుంచి అతడు పొందగలిగినదంతా చాలా వేగంగా పొందవచ్చని వాళ్లు సూచించారు. అప్పటికే గ్రామస్థులకి 'భోలే' గా పిలిచే కిశోరీ కొద్దికాలంలోనే తమ చిన్న సమాజాన్ని విడిచి వెళ్లిపోతాడని అర్థమైంది.

బెంగాలీ బాబా ఎన్నడూ జనాల్ని చేరనిచ్చేవారు కాదు. అయినా ఆయన సాధుమండలిలో బాగా పేరున్నవారు. ఆయన శిష్యుల్లో అనేకమంది సమాజంలో గొప్ప పేరు ప్రఖ్యాతులు, పలుకుబడి ఉన్నవారున్నారు, ప్రభుత్వంలో పెద్ద పెద్ద పదవుల్లో ఉండేవాళ్లు ఉండేవారు. ఆయన ఎప్పుడూ సంచారంలో ఉండేవారు, ఎక్కడా ఆయన స్థిరంగా నివసించేవారు కాదు. కానీ ఆయన ఎప్పుడు కావాలంటే, అప్పుడు ఊహించని ధనరాశులు ఆయన కాళ్ల దగ్గరకి వచ్చేవి. ఉత్తర భారతదేశంలో అమర్‌గఢ్ రాజు వందలాది ఎకరాలు బాబాకి దానం చేశారు. అంతే కాక అందులో బాబాజీకీ, ఆయన శిష్యులకీ ఒక భవ్యమైన ఆశ్రమాన్ని నిర్మించడానికి అవసరమైన ధనాన్ని కూడా అందజేశారు. అనుకున్న సంకల్పాన్ని నెరవేర్చుకునే మహత్తు గల బెంగాలీ బాబా, ఇప్పుడు ఇక భోలేబాబా చదువు బాధ్యతల్ని తీసుకున్నారు. ఉత్తర భారతదేశంలో మంచి పేరున్న పాఠశాలలో ఆయన్ని చదివించారు.

ఎనిమిదో తరగతి తరువాత భోలే జీవితం అసలు ఎలా గడిచిందో కనిపెట్టడం చాలా కష్టమైంది. ఆ సమయంలో ఆయన ఏం చేసి ఉంటారో తెలుసుకుని, వాటిని ఒక వరుసక్రమంలో రాయాలని దశాబ్దాల పాటు ప్రయత్నించినా ఆ ప్రయత్నం ఫలించలేదు. ఉదాహరణకు, గఢ్‌వాల్ ప్రాంతం నుండి వచ్చిన అనేక మందిని నేను స్వామీ రామ బాల్యం గురించి చెప్పమని అడిగాను. కానీ ఆ రోజుల్లో జరిగిన కొద్ది వాస్తవిక ఘటనలు తప్ప నేను అడిగిన కాలావధి గురించి పెద్దగా ఎవరికీ తెలియదనుకుంటా.

పురోహితులు, *దశ్మనలు, సాక్లానీలు, ఖండూరీల* లాంటి గఢ్‌వాలీ ప్రాంతవాసులు ఇచ్చిన సమాచారం ప్రకారం, స్వామీజీ పుట్టింది, పెరిగిందీ గఢ్‌వాల్‌లోనే. కానీ ప్రజల మనసుల్లో ఆయనకు సంబంధించిన జ్ఞాపకాలు జూనియర్ ఉన్నత పాఠశాల తర్వాత అదృశ్యమయ్యాయి, ఆ పైన మళ్లీ 1950 మధ్య జరిగిన విషయాల్ని వారు చెప్పగలుగుతున్నారు. కిశోరీ జీవితంలో పదహారు నుంచి ముప్పై సంవత్సరాల మధ్య వయస్సులో సుమారు పధ్నాలుగేళ్ల పాటు ఏం జరిగిందీ అస్పష్టంగా ఉంది. దీని గురించి ఏం చేయాలో నాకు తోచలేదు. తర్వాత నాకు క్రమేపీ, ఆ కాలావధిలోనే భోలే నిశితమైన అంతర్గతమైన వికాసం సాధించారని బలంగా అనిపించింది. కాబట్టి నేను స్వామి గురించిన సమాచారం కోసం ఆయన స్నేహితులు, కుటుంబ సభ్యులు పరిధిని దాటి పైవాళ్లని కలుసుకోవడానికి ప్రయత్నించాను.

*హిమాలయ పరమగురువులతో జీవనం* లో స్వామీజీ ఆ పదహారేళ్ల కాలంలో వర్ణించిన తన అనుభవాలు తప్ప మరే ఆధారమూ లేదు. నాకు 1981లో ఓ బలమైన సంకల్పం కలిగింది– *నేను గనక ఈ పుస్తకాన్ని ఓ వెయ్యి సార్లు చదివేస్తే, ఏదో ఒక రకంగా అందులో వర్ణించిన సాధువులు, మహానుభావులు, ప్రదేశాలను నా కళ్లతో నేనే సందర్శించగలను.* దాంతో నేను పుస్తకం చదవడం మొదలుపెట్టాను. నేను చదువుతున్న కొద్దీ ఆ కథల్లో చెప్పని భాగాల గురించి కూడా నాకు తెలుస్తూ ఉండేది. నేను ఆ పుస్తకాన్ని వెయ్యి సార్లు చదివాను. వెయ్యో సారి పూర్తి కాబోతుండగా స్వామీజీ నన్ను ఆ పుస్తకాన్ని హిందీలోకి అనువదించమని అడిగారు. నేను అనువాదం మొదలుపెట్టి, రోజూ సాయంత్రం వేళల్లో స్వామికి చదివి వినిపిస్తూ ఉండేవాడిని. ఆ సమయంలో నేను నా మనసులో ఉన్న ప్రశ్నల్ని అడగక ముందే ఆయన సమాధానాలు చెప్తూ ఉండేవారు.

స్వామీజీ గుహల్లోని మఠాల్లో తన గురువుగారితో ఉంటూ కాలేజీకి ఎలా వెళ్లారా అనే ప్రశ్న మనసులో మెదిలింది! *హిమాలయ పరమగురువులతో జీవనం* చదివిన పాఠకులందరి మాదిరిగానే నేను కూడా ఆయన తన చిన్ననాటి నుంచీ తమ గురువులతో ఉంటూ ఉండేవారనీ, అదే సమయంలో భారతదేశంలోని అలహాబాదు విశ్వవిద్యాలయం నుంచి గ్రాడ్యుయేషన్ పూర్తి చేశారనీ అనుకునేవాడిని. మేం మాట్లాడుకునే సమయాల్లో స్వామీజీని నేను, ఈ రెండు పనులూ ఒకే సమయంలో చేయడం ఎలా కుదిరిందని అడిగాను. కానీ ఆయన నాకు ఆధ్యాత్మికంగా ఆ రోజులు ఎంత సమృద్ధమైనవో చెప్పారు, అంతే!

అందువల్ల నేను ఒకరోజు స్వామీజీని నేరుగా అడిగేశాను: 'స్వామీజీ, మీ తండ్రిగారు మరణించిన తర్వాత, బాబాజీ మిమ్మల్ని తనతో వెంటబెట్టుకుని వెళ్లిపోయారు గదా, మరి ఇంట్లో ఎవరూ ఏమీ అనలేదా, అలా వెళ్లిపోనిచ్చారా?'

స్వామీజీ సమాధానమిస్తూ, 'మా అమ్మగారికి బాబాజీ మీద అఖండమైన విశ్వాసం ఉంది. నాకేం కావాలన్నా, ఆయన నాకు ఇస్తారని అమ్మ నమ్ముతుంది. బాబాజీలాగా నా గురించి బాధ్యత తీసుకునే వాళ్లెవరూ లేరని అమ్మ నమ్మకం!'

'అందుకే మీరు ఆయనతో ఉండిపోయారా, మళ్లీ వెనక్కి తిరిగి వెళ్లలేదా?' నేను అడిగాను.

'మరి అప్పుడు స్కూలుకి వెళ్లారా?'

''నేను ఆయనతోనే ఉండేవాడిని. కొన్నిసార్లు కొన్ని రోజులు మాత్రమే ఉండేవాడిని, మరి కొన్ని సార్లు ఓ వారం, లేదా కొన్నిసార్లు నెలల పాటు కూడా ఉండేవాడిని. 'ఆయనతో జీవించడం' అంటే ఆయనతో బాటు గుహలో ఉండడం కాదు. ఆయన ఏ ప్రదేశంలోనూ ఎక్కువ కాలం ఉండేవారు కాదు సాధారణంగా. ఒక్కోసారి కొద్దికాలం పాటు ఉన్నా, ఆయనతో

బాటు మిగతా సాధువులు కూడా ఉండేవారు. ఆయనకు నేనంటే చాలా ఇష్టమని నాకు తెలుసు. నాకు కూడా ఆయన అంటే ఎంతో ఇష్టం! కానీ చిన్న పిల్లాడిని కదా! నాతో వచ్చిన చిక్కు ఏమిటంటే, నేను చురుగ్గా ఉండాలనుకునేవాడిని– పరిగెత్తడం, మాట్లాడడం, ఆడుకోవడం– కానీ ఆయన చాలా మౌనంగా ఉండేవారు. మిగతా సాధువులంతా ఆయన దగ్గర ఉన్నపుడు నేను ఆయనతో ఉండడానికి ఇష్టపడేవాడిని.

'ఆయనతో కలిసి ప్రయాణం చేయడం మాత్రం చాలా ఉత్సాహంగా ఉండేది,' స్వామీజీ చెప్తూ ఉన్నారు. 'పర్వతాల్లో నడవడం, జలపాతాలు దాటడం, బయటికి పొడుచుకుని వచ్చినట్టున్న రాతి క్రింద తుఫాను సమయంలో కూర్చోవడం, రాత్రిపూట నెగడు వేసుకుని కూర్చోవడం, ఏ సామాన్లూ సరిగ్గా లేకపోయినా, బాబాజీ, ఆయనతో ఉన్న సాధువులంతా కలిసి వంట చేసుకుంటూ ఉంటే, వారికి సాయం చేయడం చేస్తూ ఉండేవాడిని. ఈ పనులు నాలో ఉద్వేగం నింపేవి. నా సెలవులన్నీ సాధుసాంగత్యంలో ఈ విధంగా గడిచిపోయేవి. అయినా నేను స్కూలుకి తిరిగి వెళ్లడానికి ఉత్సాహంగానే ఉండేవాడిని. నేను స్కూల్‌ని ఇష్టపడనని కాదు, ప్రతి సెలవుల్లోనూ వాళ్లు ఇంతకు ముందు చూసిన ప్రదేశాల కంటే మంచి చోట్లకి తీసుకుని వెళ్తామని వాగ్దానం చేసేవారు. కానీ నేను తిరిగి ఇంటికి వచ్చిన ప్రతిసారీ నాకు ఆ వాతావరణం అంతా నిస్తేజంగా, సారహీనంగా తోచేది– అదే కుటుంబం, ఆ స్నేహితులే, ఆ సహవిద్యార్థులే. కానీ నాకు వాళ్లంతా కొత్తగా కనిపించేవారు. నేను వాళ్లకి కొత్తగా కనబడేవాడిని. ఆ విధంగా నేను ఈ రెండు ప్రపంచాల్లోనూ జీవించేవాడిని.'

భోలేకి పధ్నాలుగు ఏళ్లు వచ్చిన ఆ వేసవిలో అతడి జీవితం ఒక మలుపు తిరిగింది. తన తోటి విద్యార్థులతో చేస్తున్న సహవాసం దాని ఫలితాన్ని చూపసాగింది. కిశోరీ మెల్లగా ప్రాపంచిక బంధనాల్లో చిక్కుకోసాగాడు. అదే సమయంలో ఒక వృద్ధ సాధువు కిశోరీ ఇంటికి వచ్చి, కొండరావిచెట్టు బెరడు ముక్క మీద రాసి ఉన్న ఓ రెండు వాక్యాల్ని చదవమని ఇచ్చాడు. అందులో, 'భోలే! ఆశీస్సులు! ప్రాపంచిక బంధనాల నుంచి విరాగివి కా! నీ ఆధ్యాత్మిక ప్రయాణం మొదలుపెట్టు. అవధూత, గంగోత్రి 1939.' అని ఉంది. ఈ సాధువుని భోలే ఇంతకు ముందెన్నడూ చూడలేదు. ఈ సందేశం తీసుకొచ్చిన సాధువుని కూడా అతడు ఎరగడు. కానీ ఇది ఆయన మీద చాలా బలమైన ముద్ర వేసింది. ఈ సందేశం అతడిని ఓ కుదుపు కుదిపింది. అతడు మళ్లీ తన అంతర్వీక్షణలోకి జారుకున్నాడు. తీవ్రమైన ధ్యానస్థితిలో అతడికి తన గత జన్మ విశేషాలు మెరుపుల్లా కనిపించాయి. స్కూలు మానేయడం గురించి కిశోరీ మరోసారి ఆలోచించాడు. మనసులో చెలరేగుతున్న విరుద్ధ భావాల సంఘర్షణని తట్టుకోలేక తన గురువుని కలిశాడు. బాబాజీ అప్పుడు ఆ ప్రాంతంలోనే ఒక దేవాలయంలో స్వామి శివానందతో కలిసి ఉన్నారు. స్వామి శివానంద గంగోత్రి నుంచి వచ్చారు. ఆయన బాబాజీ శిష్యులు. వయసులో స్వామీ రామ కంటే పెద్ద. బాబాజీ అభ్యర్థన మేరకు స్వామి శివానంద భోలేని స్కూల్లోనే ఉండమని సలహా ఇచ్చారు. ఎందుకంటే ఆ గ్రామంలో ఉన్న పాఠశాల కేవలం ఎనిమిదవ తరగతి వరకే ఉంది. ఆ తర్వాత విద్యాభ్యాసం కోసం భోలే ముస్సోరీ, డెహరాడూన్, అలహాబాదులాంటి ప్రదేశాలకి వెళ్లాలి. లౌకికంగానూ, పారలౌకికంగానూ అత్యంత గాఢమైన స్థితి అవసరం కిశోరీకి. అతడు కావాలంటే ఇంట్లో అయినా ఉండవచ్చు, లేదా సాధుమండలిలో అయినా ఉండవచ్చు. కానీ అతడు లేలేత నవ ప్రాయంలో ఉన్నాడు. మహా చురుకు. సరదా, అల్లరి అతడి వ్యక్తిత్వంలో నిండారా ఉన్నాయి. అతడికి ఏవో వస్తువుల్ని కొంటూ ఉండడం ఇష్టం. పాటలు వాయించడం ఇష్టం. రకరకాల ఫ్యాన్సీ డ్రస్‌లు వేసుకుని, చేతిలో ట్రాన్సిస్టర్ రేడియోతో తన గురువునీ, మిగతా

సాధువుల్నీ ఆనందింపజేయడానికి ప్రయత్నించేవాడు. పని జరిగేది కాదు, కానీ ఇన్ని అల్లరి పనులు చేస్తున్నా కిశోరీ పట్ల ఆ సాధువుల ప్రేమ ఎక్కడా తగ్గలేదు.

ఒకసారి భోలే ఋషికేష్ అవతల, నరేంద్రనగర్ అనే ఓ పట్టణం సరిహద్దుల్లో సాధుమండలితో కలిసి ఉన్న తన గురువుగారి కోసం మూడు గ్రామఫోన్లు, డజన్ల కొద్దీ రికార్డులూ కొన్నాడు. అక్కడికి వెళ్లిన తర్వాత అతడు, మిగతా వాళ్లంతా ధ్యానంలో ఉన్నా సరే, పగలూ రాత్రీ తేడా లేకుండా మ్యూజిక్ ప్లే చేస్తుండేవాడు. మ్యూజిక్ చాలా పెద్ద సౌండ్‌తో పెట్టేవాడు, ఇంకా ఇంకా సౌండ్ పెంచుతూ ఉండేవాడు. చివరికి ఆ సాధువులు పిల్లవాడు చేస్తున్న అల్లరి గురించి గురూజీకి మొరపెట్టుకున్నారు. బాబాజీ చిరునవ్వుతో, 'వాడా చిన్నపిల్లాడు! అందరి దృష్టీ తన వైపు తిప్పుకోవడానికి చూస్తుంటాడు. మనం కూడా వెళ్లి వాడి సంగీతమేమిటో విందాం, పదండి!' అంటూ వాళ్లని కూడా వెంటబెట్టుకుని భోలే దగ్గరికి బయల్దేరారు. అక్కడ భోలేకి సంగీతం పట్ల ఉన్న అభిరుచిని ప్రశంసించారు, భోలే దగ్గర ఎన్ని గ్రామ్‌ఫోన్లు ఉన్నాయో అడిగి తెలుసుకున్నారు. భోలే తన దగ్గర మూడు ఉన్నాయనీ, రెండు డజన్ల రికార్డులకి పైనే ఉన్నాయనీ చెప్పాడు. అలాగే తన దగ్గర బ్యాటరీతో పని చేసే రేడియో ఉందనీ, ఆ విధంగా తనకి వార్తలు ఎప్పటికప్పుడు తెలుస్తుంటాయనీ, ప్రసిద్ధ గాయకుల గురించి తెలుస్తుంటుందనీ చెప్పాడు. గురువుగారు నవ్వి, 'అత్యంత ఉత్కృష్టమైన అంశాల్లో అభిరుచి, అభినివేశం ఉన్నాయి నీలో. నీకిష్టమైన సంగీతం నేను కూడా వింటాను, ఆగు!' అన్నారు. అప్పుడు భోలే తన గ్రామ్‌ఫోన్లలో ఒక దాన్ని ప్లే చేయబోయాడు. కానీ గురువుగారు అదొక్కదాన్నే కాక, మిగతా వాటిని కూడా ప్లే చేయమని చెప్పారు. భోలే అప్పుడు, 'గురూజీ, అన్ని గ్రామ్‌ఫోన్ రికార్డులూ ఒకేసారి ప్లే చేయడం కుదరదు,' అన్నాడు. అప్పుడు గురువు, 'ఎందుకలా కుదరదు?' అని అడిగారు.

అయోమయంగా చూస్తూ, భోలే, 'ఎందుకంటే, అది చాలా గందరగోళంగా ఉంటుంది. మీకేమీ వినిపించదు,' అన్నాడు. అప్పుడు బాబాజీ, చాలా నిరాశగా చూస్తూ, 'ఎంత ఎక్కువ గందరగోళంగా ఉంటే, అంత బాగుంటుందేమో ఈ సంగీతం అనుకుంటున్నాను నేను!' అన్నారు. భోలేకి ఈ పరిస్థితి చాలా ఇబ్బందిగానే ఉంది, కానీ సాధువులు ఎంత అలజడికీ ప్రతిస్పందించడం లేదని తెలుసుకుని అల్లరి మానుకుని తను తెచ్చిన గ్రామ్‌ఫోన్స్ అన్నింటినీ ప్లే చేశాడు భోలే. చివరికి బెంగాలీ బాబా భోలేకి, 'ఎలాంటి సంగీతం వింటావనేది నీ ఇష్టం మీద ఆధారపడి ఉంటుంది. అయితే, నువ్వు దీన్ని కేవలం విని ఆనందించడంతోనే సరిపెట్టుకోవడం లేదు. ఈ గ్రామ్‌ఫోన్ లేకపోతే క్షణం కూడా గడపలేని పరిస్థితికి వచ్చావు. కానీ నువ్వు స్వంతంగా పాడి ఆనందించి చూడు! దానితో పోలిస్తే ఈ సంగీత శ్రవణ ప్రియత్వం ఎందుకూ కొరగాదు,' అని వివరించారు.

ఇప్పుడు భోలే సంగీతాన్ని సరైన రీతిలో ప్రేమించడం నేర్చుకున్నాడు. ప్రతిరోజూ తను చదువుకునే పాఠ్య విషయాలు పూర్తి కాగానే, సంగీత అభ్యాసాన్ని ప్రారంభించేవాడు. పాడేవాడు, తబలా, హార్మోనియం, సితార్, వీణ వాయించేవాడు. అతడు పాడే పాటలు, వాయించే సంగీత వాయిద్యాలకి అతడి స్నేహితులు విసిగిపోయేంతగా సాధన చేసేవాడు భోలా. అతడు లక్నో రేడియో స్టేషన్‌లో ఓ సంగీత ప్రదర్శన ఇచ్చాడు. ఆ తర్వాత అతడు తన వీణతో సహా బాబాజీ దగ్గరికి వెళ్లి ఆ వీణాగానంలో ఎంతగా నిమగ్నమైపోయాడంటే, ఆ తర్వాత అతడికి అంతకంటే మరేమీ కావాలనిపించలేదు. అతడు తన గురువుగారితో ఉన్నపుడు కట్టెపుల్లలు ఏరుకు రావడం, బియ్యం కడగడం, బీన్స్ కడగడం, పాత్రలు తోమడంలాంటి పనులు చేయాల్సి ఉంటుంది. అందువల్ల అతడు తన విధుల నుంచి తప్పించుకోవాలని చూస్తుండేవాడు.

ఒకరోజు బీన్స్ కడుగుతుంటే, భోలే మనసులో ఓ కొంటె ఆలోచన ప్రవేశించింది, 'సాధువులకి నేను ఓ క్రమశిక్షణ గల పిల్లవాడిని కాదనీ, నేను బీన్స్‌లో నుంచి రాళ్లను వేరుచేసే పని సరిగా చేయలేకపోతున్నానని అర్థమైతే, వాళ్లు నాకు ఆ పని చెప్పరు కదా!' అనుకున్నాడు. అందువల్ల అతడు బీన్స్‌లో నుంచి రాళ్లను ఏరిపారేయకుండా, ఇంకొన్ని చిన్న చిన్న రాళ్ల బెడ్డలు వాటిలో కలిపాడు. ఆ బీన్స్‌ని వండి వడ్డించడం జరిగింది. ఆహారం నమిలి తింటుంటే, ఓ వృద్ధ సాధువుకి పంటి కింద పడి పెద్ద చప్పుడైంది. ఆయనకి ఏకంగా పన్ను ఊడి వచ్చింది. ఆ పని చేసింది భోలే అని అందరికీ తెలుసు. కానీ ఏమీ ఎరగనట్టే నటిస్తూ ఉండిపోయారు వాళ్లంతా. అతడి గురువు ఆ పిల్లవాడికి ఓ గుణపాఠం నేర్పాలనుకున్నాడు. ఆయన సాధుమండలితో కలిసి ఆలోచించారు, 'పిల్లవాడు దారి తప్పుతున్నాడు, ఎలాగైనా వాడిని దార్లో పెట్టాలి' అని చెప్పారు వాళ్లతో. దాంతో వాళ్లు ఓ ఉపాయం ఆలోచించారు.

మర్నాటి ఉదయం, సాధువులంతా ధ్యానంలో ఉండగా, భోలే మామూలుగానే ఓ ప్రేమగీతం పాడుతూ వీణ వాయించసాగాడు. ధ్యానభంగమైన సాధువులు లేచి ఈ యువ సంగీతకారుడి దగ్గరికి వెళ్లి, అతడి వీణని పగులగొట్టి బాగా కొట్టారు. భోలే పరిగెత్తుతూ గుహలో ధ్యానం చేసుకుంటున్న తన గురువు దగ్గరికి వెళ్లి జరిగినదంతా చెప్పాడు. 'నన్ను సంగీతం అభ్యసించమన్నది మీరే కదా, ఈ సాధువులు చూడండి నన్నెలా కొట్టారో?' అని దెబ్బలు చూపించి ఏడుపు మొహంతో బాబాతో తన బాధ చెప్పుకున్నాడు. గురువు జవాబిచ్చారు, 'నేను నిన్ను అభ్యసించమన్న సంగీతం ఇతరులకు ఇబ్బంది కలిగించని సంగీతం! నీకు కర్మసూత్రం తెలుసా? నువ్వు అవతలి వాడి పన్ను విరగగొడితే నీ ఎముకలు పొడి పొడి కావాల్సిందే. ఇప్పటి నుంచీ నువ్వు నీ అంతర గానం విను. నలభై ఏళ్ల దాకా ఈ రకమైన గందరగోళపరిచే సంగీతాన్ని నువ్వు విననవసరం లేదు.'

తర్వాత కొద్ది గంటల దాకా బాబాజీ, సాధువులు భోలేతో కొంచెం దూరంగానే ఉన్నారు. ఓ గొప్ప సాధువుగా పేరున్న గుడారీ బాబా కూడా ఆ సాధుమండలిలోనే ఉన్నారు. కానీ ఆయన మాత్రం భోలేని కొట్టలేదు. ఆయన లేచి వెళ్లి భోలేని తన చిన్న కుటీరంలోకి తీసుకుని వెళ్లి దయగా ప్రేమగా చూశారు. ఆ విధంగా భోలే శారీరిక, మానసిక గాయాలకి ఆయన ప్రేమవైద్యం చేశారు. 'బాబాజీ, మేము ఎల్లప్పుడూ ప్రేమించే 'భోలే'వే! కానీ నువ్వు ఎంత గొప్పవాడివైనా, అత్యంత అణకువ, వినయం, దయ కలిగి ఉండాలి,' అని బోధించారు. 'అంతర గానం ఎలా వినాలో, ఎలా ఆనందించాలో బాబాజీని అడుగు! ఆ అంతర గానంతో ఎలా నీలో ఉన్న ప్రభువుని అలరించు. నీ జీవితేశ్వరుడిని అలరించిన నీకు నిన్నూ, నీ చుట్టూ ఉన్న వారందరినీ సహజంగానే అలరించగల నైపుణ్యం అబ్బుతుంది. జీవితలక్ష్యాన్ని మర్చిపోకు,' అని చెప్పారు.

అప్పుడే బాబాజీ గుడారీ బాబా కుటీరానికి వెళ్లి, కన్నీరు కారుస్తున్న భోలేని తన హృదయానికి గట్టిగా హత్తుకున్నారు. బాబాజీ గుడారీ బాబాతో మాట్లాడుతూ, 'వీడు ఇంత దిగులుగా ఉంటే నా మనసుకి ఎంత కష్టమనిపించిందో తెలుసా?' అన్నారు. ఆ రోజు బాబా భోలేకి ఒక పద్ధతిగా ఎలా కూర్చోవాలో, ఎలా శ్వాసించాలో, ఎలా ధ్యానించాలో నేర్పారు. జీవితాన్ని ఆరోగ్యంగా, ఆనందంగా గడిపే విధానం, ప్రభావాలకి లొంగకుండా స్నేహం ఎలా చేయాలో బోధించారు.

కొన్నేళ్ల తర్వాత కూడా స్వామీజీకి ఆ సంఘటన చాలా స్పష్టంగా గుర్తుంది. ఆ సంఘటన అల్మోరాకి పదిహేను మైళ్ల దూరంలో కొసి, సిరౌత్ నదీసంగమ స్థలం దగ్గర సోంబారీ బాబా ఆశ్రమం సమీపంలోని శివాలయంలో జరిగింది. బెంగాలీ బాబా, సోంబారీ బాబా, హరియాఖాన్ బాబా, గుడారీ బాబా ఈ ప్రాంతంలో చాలా తరచూ కలుసుకుంటూ ఉండేవారు. ఈ మహనీయుల

గొప్పదనం గురించి స్వామీజీ నాతో అనేక కథలు చెప్పారు. వేరే వాళ్లు కూడా వీరి గురించి చెప్పిన గాథల్ని నేను విన్నాను. వారు నడిచే దేవుళ్లనీ, భగవంతుని కృప, ఎంతో పూర్వజన్మ సుకృతం ఉంటే తప్ప వారి సాంగత్యం దొరకదనీ అనేవారు. ఇది విన్న తర్వాత నాకు మనసులో అనిపించింది, భోలే ఇంత అల్లరి పిల్లాడు కదా, అతడికి ఇలాంటి పరమ గురువుల సన్నిధి ఎలా లభించిందీ అని! పరమశాంతి, ఉత్తమ భావనలు ప్రవాహంగా సంచరించే ఆ ఆధ్యాత్మిక వాతావరణంలో, ఈ పరమయోగులంతా వంట చేసుకుంటూ, పాత్రలు కడుగుతూ ఉంటూ ఉంటే, అతడి మనసు చిత్తం వచ్చిన సంగీతం వచ్చినట్టు పెద్ద ధ్వనితో పెట్టడానికి మనసు ఎలా అంగీకరించింది? ఒకరోజు అవకాశం చూసుకుని నేను ఈ ప్రశ్నలు స్వామీజీని అడిగాను.

'ఆత్మ–రూపాంతరణకి పవిత్రమైన వాతావరణం కంటే మించి మరేదో కావాలి. అలవాట్లు అచేతన మనస్సులో చాలా బలీయంగా బీజరూపంలో నిక్షిప్తమై ఉంటాయి. 'మారాలి' అనే సంకల్పం ఉన్నవాడికి బుద్ధిగతమైన అవగాహన, అప్పుడప్పుడూ యోగులను కలవడం వల్ల వచ్చే ప్రేరణ ఫలితాన్నిస్తుంది. నేను మహా మొండి! మా గురువుగారు నా మొండితనాన్ని నా ఇచ్ఛాశక్తిగా మార్చడానికీ, ఉపద్రవాలు తెచ్చిపెట్టే నా బుద్ధిని సృజనాత్మకంగా మలచడానికీ చాలా తంటాలు పడ్డారు,' అని చెప్పారు స్వామీజీ.

'నాకు అప్పుడు ఏడేళ్లు ఉంటాయేమో, బాబాజీ నన్ను అమ్మవారి పాదాల దగ్గర పడేసి నాకు దివ్య దర్శనం కలిగించారు. ఆ అనుభవం వల్ల నాకు నా తల్లి జగజ్జనని అని అర్థమైంది. నేనెప్పుడూ అమ్మ సంరక్షణలోనే ఉన్నాను. నా గురువు నిరంతరం ఆ అమ్మని కొలిచేవారు. ఆ తల్లి ఎప్పుడూ ఆయనతోనే ఉండేది. ఆ సంగతి గ్రహించిన తర్వాత నేను నా గురువు పట్లా, మిగతా సాధువుల పట్లా అనంతంగా కృతజ్ఞతా భావం వెల్లువెత్తింది. మళ్లీ నా జీవితంలో ఎన్నడూ వారితో అమర్యాదగా ప్రవర్తించనని నాకు నేను గట్టి సంకల్పం చేసుకున్నాను. నేను వారిని ప్రేమిస్తూ, వారికి సేవ చేస్తూ ఉంటానని తీర్మానించుకున్నాను. కానీ సుమారు ఒక వారంలోనే నేను మళ్లీ నా పూర్వ రూపంలోకి వెళ్లిపోయాను– మళ్లీ అదే రకమైన ఉపద్రవానికీ, నిర్లక్ష్యానికీ తెగబడ్డాను. ఒక్కోసారి నాకు నా ప్రవర్తన దారి తప్పిందని కొంచెం బాధగా ఉండేది, ఆ విషయం మా గురువుగారి దగ్గర ఒప్పుకునేవాడిని. కానీ ఆయన నన్ను ప్రేమగా చేరదీసి, 'ఆ పని చేసేది నువ్వు కాదు, నీ బాల్యచాపల్యం. నీ కాళ్ల మీద నువ్వు నిలబడేలా మరి కొన్ని సార్లు ప్రయత్నిస్తాను. ఆ తర్వాత నువ్వే బాగై పోతావు!' అన్నారు.

అప్పటికీ నేను నా ప్రశ్నలకి పూర్తి సమాధానాలు తెలుసుకోలేకపోయాను, అందుకనే మళ్లీ ఇలా అడిగాను, 'స్వామీజీ, మీకు ఆ దివ్య దర్శనం ఎలా కలిగింది? ఎప్పుడు ఎలా జరిగింది?'

'అది ఖజురాహోలో జరిగింది. నాన్నగారు చనిపోయిన కొన్ని సంవత్సరాల తర్వాత గురూజీ మరో ఐదుమంది సాధువులతో కలిసి వచ్చి నన్ను తనతో తీసికెళ్లారు. ఆ రోజుల్లో ఆ ప్రాంతమంతా పూర్తిగా అడివి మాదిరిగా ఉండేది, చుట్టూ ఎక్కడా ఓ పట్టణమనేది లేదు. అక్కడికి బాగా దూరంలో కొన్ని గ్రామాలు మాత్రం ఉండేవి. ఖజురాహో అరవై, డెబ్భై ఆలయాల సముదాయం. వాటిలో చాలా వరకూ శిథిలాలుగా మారాయి కూడా. మా గ్రూప్‌లో ఉన్న వాళ్లంతా ఆ అరవైనాలుగు యోగినుల దేవాలయంలోనే ఉండేవారు. మా గురువుగారు ఆ దేవాలయంలోనే ఎక్కువ సమయం గడిపేవారు. ఆయన కళ్లు మూసుకుని ధ్యానం చేసుకుంటూ ఉండేవారు. మిగతా సాధువులు ఒకే చోట కూర్చుని ధ్యానం చేసేవారు లేదా అదే ప్రాంతంలో ఉన్న వేర్వేరు మందిరాల్లో ధ్యానానికి కూర్చునేవారు.

'మొదట కొద్ది రోజులు నేను చాలా ఉత్సాహంగా ఉన్నాను. నేను సాధువులతో కలిసి ఉండేవాడిని, వారు పూజలు, ధ్యానాలు చేసుకునే సమయంలో ఆ చుట్టుప్రక్కల ఆడుకునేవాడిని. వాళ్లు చెప్పినప్పుడు, నేను ఆ శిథిలాలయాల్లో ఉన్న దేవతా విగ్రహాల ముందు తల వంచుకుని కళ్లు మూసుకుని నిలబడేవాడిని ధ్యానం చేస్తున్నట్టు. కానీ కొద్ది రోజుల్లోకే విసిగిపోయేవాడిని. అది శీతాకాలం సమయం. రాత్రి పూట్ల చాలా చలిగా ఉండేది. తెల్లవారుఝామున అంతా ధ్యానానికి కూర్చునేవారు. నాకు వెచ్చగా ఉండడానికి నెగడు వేసుకోవాలని ఉండేది. చాలా ఆకలి వేసేది. అందుకే అక్కడ ధ్యానం చేసుకునే సాధువుల దృష్టిని ఆకర్షించడానికి నేను ప్రతిరోజూ ఉదయం పూట దేవాలయం చుట్టూ పెద్ద గొంతుతో అరుస్తూ పరిగెత్తుతూ ఉండేవాడిని. కానీ ఫలితం లేకపోయేది. వాళ్లెవరూ నా వంక చూసేవారు కాదు.

'చివరికి నేను మా గురువుగారి గదిలోకి వెళ్లి, దగ్గాను. అక్కడి వస్తువులన్నీ క్రింద పడేస్తూ అన్ని రకాల శబ్దాలూ చేస్తూ ఉన్నాను. కానీ గురూజీ నిశ్చలంగా ఉన్నారు. ఏం చేయాలో తెలియక నేను జుట్టు పీక్కున్నాను. చివరికి నేను నా వేళ్లతో ఆయన కనురెప్పల్ని పైకెత్తి కళ్లు బలవంతాన తెరవడానికి ప్రయత్నించాను. దాంతోటి ఆయన ఒక్క ఉదుటున లేచి, ప్రధాన ఆలయంలో అమ్మవారి ముందుకు తీసికెళ్లి, నన్ను గాల్లో పైకెత్తి ఆ తల్లితో, 'చూడమ్మా, వీడికి ఎలా ప్రవర్తించాలో నేర్పనన్నా నేర్పు, లేదా తీసుకుపో!' అని బిగ్గరగా అరిచారు!'

'మా గురూజీ నన్ను అమ్మవారి విగ్రహం ఎదుట పడేస్తుంటే, ఆ తల్లి దివ్యమంగళ స్వరూపం ధగద్ధగాయమానంగా కళ్లు మిరుమిట్లు గొలిపే కాంతితో ప్రత్యక్షమైంది. ఆ దేవి సౌందర్యాధి దేవత! ఆనంద సాగరం! ఆ అమ్మ నన్ను గురూజీ చేతుల్లోంచి అందుకుని, ఒళ్లో కూర్చోబెట్టుకుంది. ఆమె కనుకొసల నుంచి ప్రసరించిన కరుణా దృక్కులు, ఆ ముఖంలో నాపై కురిపించబడిన వాత్సల్యం నాకు ఈనాటికీ జ్ఞాపకమే. ఆ తల్లి నవ్వు వర్ణించలేనంత గొప్పగా ఉంది. అమ్మ గురూజీ వైపు తిరిగి నన్ను ఆశీర్వదిస్తూ, 'ఇక నుంచి వీడు బుద్ధిగా ఉంటాడు,' అని చెప్పింది.

నా మనసులో ఓ పక్క సంతోషం, మరో పక్క భయం కమ్ముకున్నాయి ఆమె తిరిగి నన్ను గురూజీకి అప్పగిస్తుంటే! అమ్మ అదృశ్యమైపోయింది. ఆ అందమైన జ్ఞాపకం మాత్రం మనసులో అలానే నిలిచిపోయింది.

'నన్ను నేను నిలవరించుకోలేక ఈ విషయాన్ని మిగతా సాధువులందరితోనూ చెప్పేయాలనుకున్నాను. కానీ గురూజీ నన్ను ఆపారు. 'నోటికి తాళం పెట్టు, ఎవరికీ ఈ రహస్యం చెప్పవద్దు. నీ గుండెల్లోనే ఉండిపోవాలి ఇది!' అన్నారు.'

అప్పుడు నా వైపు చూస్తూ స్వామీ రామ, 'ఓ రోజు నిన్ను నేను అక్కడికి తీసికెళ్తాను,' అన్నారు.

ఇక ఆయన అమ్మవారి విషయం గురించి మాట్లాడడానికి సుముఖంగా లేరని అనిపించింది. కానీ ఆయన మరిన్ని విషయాలు చెప్పడానికి సిద్ధంగానే ఉన్నారని అర్థమైంది. అందుకే నేను ఆయన్ని అడిగాను, 'స్వామీజీ, మీరు అమ్మని దర్శించారు, ఆమె ఆశీస్సులు అందుకున్నారు. మరి అప్పటి నుంచీ బాల్యచాపల్యం వల్ల చేసే అల్లరి చేసేవారు కాదా? అని అడిగాను.

'అబ్బే, లేదు. ఆ తర్వాత కూడా నేను కొన్నిసార్లు మూర్ఖంగానే ప్రవర్తించేవాడిని. కానీ అమ్మ దర్శనం, ఆ దేవత ఆశీస్సులు మళ్లీ నన్ను ఎలాంటి పొరబాట్లూ చేయకుండా కాసేవి. నా మనసుని నేనే ధిక్కరించేవాడిని. ఈ అనుభవం వచ్చిన తర్వాతే నాకు అర్థమైంది, మా గురువుగారికీ,

ఆ అమ్మకీ నా గురించి తెలియని సంగతి లేదు. అందుకే నాకు వాళ్లు నిరంతరం చేయూతని అందించేవారు, మార్గదర్శన చేసేవారు, సంరక్షించేవారు. ఒకవేళ ఆ క్షణానికి బలీయంగా అనిపించిన మూర్ఖపు పని ఏదైనా నేను చేసినా, అది నాకు శిక్షార్హమైన పాపం కాదని నాకు తెలుసు. ఆ దివ్య దర్శనం నాకిచ్చిన బలం వల్ల మా గురువు గారి దగ్గర నేను అన్నీ చెప్పుకునేవాడిని, నా బలహీనతల గురించి నేను చర్చించేవాడిని.

'నా సమస్యలు, బలహీనతల గురించి మా గురువుగారికి నేనెప్పుడు చెప్పినా, ఆయన 'సరే! నువ్వు ప్రశాంతంగా ఉండు! నీ మనసులో తలెత్తే అనుభూతుల పట్ల నువ్వు నిజాయితీగా ఉండు. నీ మనసుకీ, ఇంద్రియాలకీ బానిసగా మారకు. కానీ నీ సహజ ప్రవృత్తులకు విరుద్ధంగా పనిచేయకు,' అనేవారు. ఈ సలహాతో నా ఆలోచనలు, భావోద్వేగాలను ఎక్కడ నియంత్రించు కోవాలో అక్కడ నియంత్రించేవాడిని, ఎక్కడ సహజ ప్రవాహంగా సాగనివ్వాలో సాగనిచ్చేవాడిని.

చాలాసార్లు నా ఆలోచన సరైనదేనని నమ్మేవాడిని, కానీ అది చాలా తప్పని తేలేది. సత్యాన్వేషణలో నా అంతట నేనే సత్యాన్ని కనుగొనాలనీ అనుభూతి చెందాలనీ గురువుగారు ఎప్పుడూ మరీ మరీ చెప్తుండేవారు. *నేరుగా పొందిన అనుభవం కాక ఇతరుల ద్వారా గ్రహించిన సత్యం కేవలం ఏ ప్రయోగానికీ ఏ పరీక్షకీ నిలబడలేని సమాచారంగానే మిగిలిపోతుంది సుమా* అని హెచ్చరించేవారు. పైగా నన్ను మామూలు మనిషిలాగానే ఉంచడానికి గురూజీ ప్రయత్నించారని నేను గుర్తించాను. నా బాల్యావస్థని భంగపరచాలని ఆయన భావించలేదు. అందుకే నేను 'ఇది చేయాలి', 'అది చేయకూడదు' అని చెప్పిన సందర్భాలు చాలా తక్కువగా ఉండేవి. నాకు తప్పనిసరిగా క్రమశిక్షణ అవసరమైన సందర్భాల్లో ఆయన నన్ను *గురుభాయి* (ఒకే గురువు వద్ద సుశ్రూష చేసినవారు) అయిన స్వామి శివానందజీకి అప్పగించేవారు. ఆయన్ని నేను శివభాయి అని పిలిచేవాడిని.

స్వామీజీ బాబాజీతోనూ ఇతర పరమ గురువుల సాంగత్యంలోనూ ఉంటున్నప్పటికీ యవ్వనంలో వెల్లువెత్తే భావోద్వేగాలను మనమంతా ఎలా ఆనందిస్తామో అదే విధంగా ఆనందించారు. ఆయన కాలేజీ విద్యార్థిగా ఉన్నపుడు ప్రాపంచిక ఆకర్షణలూ, వ్యామోహాల పట్ల ఆకర్షితులయ్యారు. అత్యంత ప్రసిద్ధి గాంచిన అలహాబాదు విశ్వవిద్యాలయంలో ఉన్నపుడు ఆయన చుట్టూ సంపన్న స్నేహితులు ఎంతోమంది ఉండేవారు. వారి సహవాసంలో ఉన్నపుడు వారు కోరుకున్నట్టే స్వామీజీ ప్రవర్తించేవారు. కారు తీసుకోవడం, పార్టీలకు హాజరు కావడం, షాపింగ్ కోసం డబ్బు ఖర్చు చేయడం, ప్రయాణించడం లాంటివి జరిగేవి. సెలవుల్లో తన గురుదేవులతో కలిసి కొండలూ పర్వతాలూ ఎక్కి కష్టపడడం కంటే బొంబాయి వెళ్లి తన స్నేహితులతో గడపడం ఆయనకి నచ్చేది.

బాబాజీకి స్వామీజీ భావాలన్నీ తెలుసు. కానీ ఆయన వాటిని అణిచిపెట్టే బదులు, వాటిని తీర్చేసుకోవడం ద్వారా తన శిష్యుడు తన మనసుని జయించాలని కోరుకునేవారు. అందుకే ఆయన శ్రీనగర్ సరిహద్దుల్లో ఉన్న ధారీ దేవి ఆలయ సమీపంలోని గుహలో నివసించే ఓ అఘోరీ బాబా దయతో భోలే ఇవన్నీ చేయడానికి తగిన అవకాశాల్ని కల్పించారు.

ఆ అఘోరీ బాబా 'సూర్య విజ్ఞాన' మనే మార్మిక శాస్త్రంలో మహాయోగి. ఆయన జీవితమంతా మహత్తులతో నిండి ఉంటుంది. భోలే కావాలనుకునే భౌతికపరమైన వస్తువుల్ని సమకూర్చడానికి అవసరమైన ఆర్థిక సాయం చేయడానికి ఆ మహాయోగి ప్రసాదించే అమితమైన ధన సంపదే కారణం. ఆ రోజుల్లో ఐరోపా యాత్ర అంటే రాజులు, అమిత ధనసంపన్నులకే అవకాశం ఉండేది. కానీ అఘోరీ బాబా 'పనికిమాలిన అశాశ్వతమైన ఈ భౌతిక విషయాల్ని

కోరుకోవడమేమిటీ?' అని నిరాశపరచకుండా భోలేకి ఇటు లౌకిక ప్రపంచంలోనూ, అటు ఆధ్యాత్మిక సామ్రాజ్యంలోనూ ఆయన కోరుకున్న అత్యుత్తమమైన స్థితుల్ని సమకూరేలా చేశారు.

అలహాబాదు విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్లు, స్నేహితులకి భోలే ఓ గొప్ప ప్రతిభావంతుడైన విద్యార్థి అని తెలుసు. కొంతమందికి ఆయన భోలేగా తెలుసు, మరి కొంతమందికి అతడు ఫిలాసఫీలో గొప్ప ప్రజ్ఞావంతుడైన విద్యావేత్త బ్రజ కిశోర్ కుమార్ అనీ, అతడికి ఇంగ్లీషు, హిందీ సాహిత్యాల్లో అసాధారణమైన పట్టు ఉందనీ తెలుసు. అతడి తెలివినీ, వినూత్నమైన భావాలనూ చూసి స్నేహితులు విస్మయం చెందేవారు. అతడి సహవిద్యార్థులకి అతడెప్పుడూ ఓ చిక్కుముడిలా ఉండేవాడు. అతడు దేన్నీ పట్టించుకునేవాడు కాదు. క్లాసులు ఎగ్గొట్టేవారు. కానీ మార్కులు మాత్రం అత్యధికంగా వచ్చేవి. ప్రొఫెసర్లు అతడిని చాలా గౌరవించేవారు. దానికి కారణం, భారతదేశంలోనే గొప్ప పేరు ప్రఖ్యాతులున్న దార్శనికులు ప్రొఫెసర్ ఆర్.డి.రానడే భోలేని తన ప్రియశిష్యునిగా చేసుకున్నారు. ప్రొఫెసర్ రానడే భారతదేశ తత్వశాస్త్రానికి సంబంధించిన ప్రతి సంప్రదాయం, ప్రతి దృక్పథంపై అద్వితీయమైన పట్టు సంపాదించారు. గొప్ప ఆధ్యాత్మిక జ్ఞానిగా ఆయనను అందరూ గౌరవించేవారు. మార్మికత, అధ్యయనశీలత సమాన పాళ్లలో ఉన్న అరుదైన వ్యక్తిత్వం ఆయనది. మనసులో ముందే ఎలాంటి అభిప్రాయం పెట్టుకోకుండా, స్వచ్ఛమైన అంతర్దృష్టి కలవారందరికీ బ్రజ్ కిశోర్‌ది అంతర ప్రకాశంతో భాసించే వ్యక్తిత్వమని అర్థమవుతుంది. భోలేలోని ఈ అంతరజ్యోతిని గుర్తించడం వల్లే ప్రొఫెసర్ రానడే అతడి పట్ల ప్రత్యేకమైన దృష్టితో ప్రేమాభిమానాల్ని కురిపించేవారు.

బ్రజ్ కిశోర్‌లోని ఈ విశిష్టతని గుర్తించినవారిలో హిందీ సాహిత్యంలో తిరుగుబాటు బావుటా ఎగరేసి నిరుపమానమైన కవిగా వెలుగొందిన శ్రీ సూర్యకాంత్ త్రిపాఠీ 'నిరాలా' కూడా ఉన్నారు. 'నిరాలా' అంటే 'అద్వితీయం', 'వింతైన', 'మార్మికమైన' మొదలైన అర్థాలున్నాయి. వారి కవితల్లో ఉండే మార్మిక తత్వాన్నీ, అనేక విధాల అన్వయాన్నీ గుర్తించి ఆయనకి కవితాలోకం ఇచ్చిన విశిష్టమైన బిరుదు అది!

నిరాలా శారీరికంగానూ, మానసికంగానూ కూడా గొప్ప ప్రేరణాత్మకమైన వ్యక్తి. ఆరోగ్యంగా బలంగా ఉండేవారు. కూర్చుని తినడం మొదలుపెడితే ముద్ద తర్వాత ముద్ద చకచకా తినేవారు. వృద్ధాప్యం మీద పడుతున్న కొద్దీ చాలా వింతగా ప్రవర్తించేవారు. ఎక్కువసేపు ఆయన అద్వైతానుభూతిలో ఉండిపోయేవారు, అంటే, 'తనకీ, ఇతరులకీ తేడా తెలియని స్థితి' అన్నమాట. ఆయన ఎదురుగా జరుగుతున్న సంఘటనని చూసి కూడా ఎలాంటి బాధ, సంతోషం అనుభూతి చెందేవారు కాదు. విశ్వ చైతన్యంతో అంతగా రమించిపోయారు. నిజానికి, ఆయన 'నాది', 'నీది' అనే భేదాన్ని కూడా మరిచిపోయారు. ఆయన దగ్గర ఏదీ ఎక్కువసేపు ఉండేది కాదు. చలికాలంలో ఆయన శరీరానికి వెచ్చగా ఉంచుతుందని ఎవరైనా ఆయనకు ఓ ఖరీదైన శాలువా బహూకరిస్తే, అది ఆయన దగ్గర ఎక్కువ కాలం ఉండేది కాదు. దాన్ని ఆయన ఎవరో పేదవాడికి ఇచ్చేసేవారు. ఆయనతో పరిచయం ఉన్నవారందరికీ ఆయన ఉదార స్వభావం, ఉన్నత మానసిక స్థితి గురించి తెలిసిందే. అందరూ ఆయనని తమ స్వంత కుటుంబ సభ్యునిగా ఆదరించేవారు.

నిరాలా ఒక్కొక్క సారి ఒక్కో భావోద్వేగంలో ఉండేవారు. ఆయనకి ఎప్పుడు కోపం వస్తుందో, ఎవరి మీద వస్తుందో తెలియదు. కోపం వస్తే మాత్రం అడ్డూ ఆపూ ఉండేది కాదు. కానీ బ్రజ్ కిశోర్‌తో మాత్రం ఆయన చాలా దయగా, ఉదారంగా ఉండేవారు. కిశోర్ ఏ చర్చ మొదలుపెట్టినా దాన్ని సహృదయంతో కొనసాగించేవారు. నిరాలా అతడిని 'భోలే ప్రభు' అని పిలిచేవారు.

ఒక వేసవి రాత్రి నిరాలా కంపెనీ గార్డెన్‌లో నడుస్తున్నారు. అది బ్రిటిష్ ఆఫీసర్లు, వారి కుటుంబాలు మాత్రమే వెళ్లగలిగే పార్క్. అక్కడ నిరాలా బట్టలన్నీ తీసేసి, ఒక బెంచీ మీద పడుకుని నిద్రపోతున్నారు. తెల్లవారురఝామున కాపలావాళ్లు నగ్నంగా ఉన్న ఈ మనిషిని చూసి, అతడిని కర్రలతో కొట్టి, బయటికి నెట్టారు. కానీ నిరాలా మేల్కొన్న తర్వాత వాళ్లందరినీ తిరిగి కొట్టారు. వెంటనే ఓ లారీ నిండా పోలీసులు వచ్చారు అక్కడికి. వారిలో ఓ పోలీసు ఇన్‌స్పెక్టర్ ఉన్నాడు. అతడికి నిరాలాతో ముందే పరిచయం ఉండడం వల్ల, దెబ్బలు తిన్నది నిరాలా అని తెలుసుకున్న వెంటనే ఆయనకు క్షమాపణలు చెప్పి, గౌరవంగా ఆ పార్కుని విడిచి వెళ్లమని అభ్యర్థించాడు. ఆ పార్కులోకి ప్రజలందరికీ ప్రవేశం లేదని చెప్పాడు. కానీ నిరాలా, 'నేనిక్కడే ఉంటాను! నా ఇంట్లోంచి నన్ను గెంటేసే అధికారం ఎవడికి ఉంది?' గర్జించారు. నిరాలా మీద బల ప్రయోగం చేయడమంటే, గంధకం గనిలోకి నిప్పురవ్వని వదలడమేననీ, అది మొత్తం సిటీని మంటల్లో కాల్చి భస్మం చేస్తుందనీ అధికారులకి తెలుసు. కానీ ఆంగ్ల వనితలు ఉదయం పూట నడకకి వచ్చే వేళ సమీపించింది. వాళ్లు అక్కడి పార్కులో నగ్నంగా ఉన్న ఒక మనిషిని చూడడమనే సంగతి ఊహించుకోవడానికే వీల్లేని సంఘటన!

నిరాలాకి భోలే ప్రభుతో ఉన్న అనుబంధం అందరికీ తెలిసినదే. అందుకే భోలేని తీసుకుని రమ్మని పంపారు ఎవరో. భోలే రాగానే నిరాలా అతడిని చూసి చిరునవ్వు నవ్వుతూ, 'రా, భోలే, రా! వీళ్లు చూడు ఎంత మూర్ఖులో! నా చోటినే నేను వదిలి వెళ్లిపోవాలిట!' అన్నారు.

'మీతో వాళ్లలా ఎందుకు దెబ్బలాడతారు? వాళ్లు మిమ్మల్ని అల్పాహారం తీసుకోవడానికి రమ్మంటున్నారు,' అన్నాడు భోలే ప్రభు.

చిన్న పిల్లాడిలా నిరాలా, 'ఓ, అలాగా! అలా అయితే సరే, పద!' అంటూ బయల్దేరారు.

ఆయనకు బట్టలు అందజేస్తూ భోలే, 'మాయావస్త్రం ధరించండి, మహారాజ్!' అన్నారు. నిరాలా దుస్తులు ధరిస్తుంటే, భోలే ప్రభు ఇన్‌స్పెక్టర్ వైపు తిరిగి, 'ఆయన పోలీస్ స్టేషన్‌కి వెళ్లే లోపు మీరు అక్కడికి అల్పాహారం తెప్పించి ఉంచండి. కొంచెం ఎక్కువ టిఫిన్ తెప్పించండి!' అని సూచించారు.

అతి విలక్షణమైన విద్వాంసుడు, రచయిత రాహుల్ సాంకృత్యాయన్ కూడా బ్రజ్ కిశోర్ కళ్లల్లో కాంతిని గమనించారు. రాహుల్, నిరాలా మంచి స్నేహితులు. ఆధ్యాత్మికంగా ఇద్దరూ బలమైన భిన్న దృక్పథాలు కలిగి ఉన్నప్పటికీ, రాహుల్ బౌద్ధంలోకి మారారు. కానీ ఆయనకు భారతీయ తత్వశాస్త్రం, సాహిత్యంలో అపారమైన జ్ఞానం ఉంది. అలాగే బౌద్ధికంగా ఆయన సంస్కృతం, పాళీ, ప్రాకృతం, టిబెటన్, చైనా గ్రంథాలను నిశితంగా అధ్యయనం చేశారు. తన సైద్ధాంతిక భావనని అనుసరించి హిందూ, బౌద్ధ, క్రైస్తవ, ఇస్లాం భావనలను చర్చించి, విమర్శించి, ఓడించారు. శారీరికంగా కూడా ఆయన చాలా బలంగా ఉండేవారు. తనకు సమ ఉజ్జీగా కుస్తీ పట్టగల వారిని అన్వేషించడానికి ఆయనకి సమయం ఉండేది కాదు. అందువల్ల తన బలమైన భుజాలను తగిన రీతిగా వ్యాయామం చేయించడానికి ఆయన శక్తినంతా ఉపయోగించి వేగంగా పరిగెత్తుతూ వెళ్లి చెట్లకేసి తన భుజాల్ని ఢీకొట్టేవారు. అల్పాహారంగా ఆయన బాగా వేయించిన పూరీలను, స్లయిస్ చేయని బ్రెడ్‌ని కడుపు నిండా తినేవారు. మళ్లీ ఓ డజను అరటిపండ్లు, ఓ లీటరు పాలు త్రాగేవారు. కానీ ఆ ఉదరం కంటే, ఆయన మెదడు వెయ్యి రెట్లు పెద్దదని చెప్పాలి. భారతదేశం, చైనా, టిబెట్ దేశాల్లో పెద్ద పెద్ద లైబ్రరీల్లో ఉన్న విషయమంతా ఆ మెదడులో ఓ మూల సర్దుకుని కూర్చుంది.

కంపెనీ గార్డెన్‌లో జరిగిన సంఘటన తర్వాత నిరాలా, భోలే లక్నోలో ఉన్న రాహుల్‌జీని చూడడానికి వెళ్లారు. జీవితం సాదాసీదాగా జరిగిపోతూ ఉండడం భోలేకి విసుగు తెప్పిస్తోంది.

దానితో అతడికి సహజంగా ఉన్న కొంటె కోణంగి నైజంతో బలం, బుద్ధిబలంగల ఈ ఇద్దరు అద్భుతమైన మహాత్ముల మధ్య కొంచెం ఘర్షణ కల్పించే ప్రయత్నం చేశారు. నిరాలాని రెచ్చగొట్టడం ఎలాగో తెలుసు, కానీ రాహుల్‌జీని రెచ్చగొట్టడం ఎలాగో చూడాల్సి ఉంది. రాహుల్‌జీకి తన చైనీస్, టిబెటన్ భాషా పరిజ్ఞానానికి కొంచెం దర్పం ఉందనీ, లుప్తమైపోయిన బౌద్ధ గ్రంథాల్ని చైనీస్ నుంచి సంస్కృతంలోకి తను గనక తర్జుమా చేసి ఉండకపోతే వాటి ఉనికి ఎవరికీ తెలియదనీ ఆయన అంతరంగం మూలల్లో ఎక్కడో ఉందని భోలేకి తెలుసు. అలాగే నిరాలాకి గల జ్ఞాపకశక్తి అసాధారణమైనదనీ, రవికిరణం సోకలేని చోటిని కూడా ఈ కవికిరణం స్పర్శిస్తుందనీ అతడికి తెలుసు. అందుకే ఓ సాయంత్రం భోలే ఈ ఇద్దరు యోధానుయోధుల్నీ వివాదానికి సిద్ధం చేసేలా ఓ వ్యాఖ్యని వదిలాడు, 'శంకరాచార్య ఎంత అద్భుతమైన వ్యక్తి కాకపోతే, భారతదేశం నుంచి బౌద్ధాన్ని పారద్రోలడానికీ, వైదిక సంస్కృతిని వ్యాప్తం చేయడానికీ ఒకే ఒక్కడై కృషి చేసి ఉంటాడు! అది కూడా పదహారేళ్ల వయసు లోపే పూర్తి చేయడం! అంత నిర్దయగా అణిచివేయబడ్డ బౌద్ధాన్ని పునరుజ్జీవింపజేయడానికి రాహుల్‌జీ లాంటి వారికి పన్నెండు వందల ఏళ్లకి పైనే పట్టింది,' అన్నాడు.

నిరాలా వెంటనే అందుకుని, 'జ్ఞానం ఎవరో తయారుచేసేదీ, మరెవరి ద్వారానో నాశనం చేయబడేదీ, తిరిగి ఉపయోగించబడేదీ కాదు. జ్ఞానం శాశ్వతమైనది. వెలుగులోకి రావడానికీ, తిరిగి అదృశ్యం కావడానికీ దాని మార్గం దానికి ఉంటుంది. జ్ఞానాన్ని 'కనుక్కున్నాను', 'తిరిగి కనుక్కున్నాను' అనుకునేవాడు 'అజ్ఞాని,' అన్నారు.

రాహుల్‌జీ మౌనంగా ఉన్నారు, కానీ భోలేకి అర్థమైంది, ఆయనలో నిప్పు రాజుకుంటోందని. అందుకే అగ్నిలో ఆజ్యం పోస్తున్న చందంగా, 'హిందువులు శంకరాచార్యని బౌద్ధమతం నుంచి భారతదేశాన్ని విముక్తం చేసినందుకు ఎంతో గౌరవిస్తారు. కానీ అలా చేయడంలో ఆయన భారతీయ వారసత్వానికి చేయకూడనంత నష్టం చేశారని వారికి తెలియదు. అది ఆయన సాధుత్వానికి తీరని మచ్చ,' అన్నాడు.

నిరాలాలో నిద్రపోతున్న సింహం వెంటనే గర్జిస్తూ మేల్కొంది. 'ఇవి చిన్ననోటికి పెద్ద మాటలు! జ్ఞానం శంకరాచార్య శరీరంగా రూపు దాల్చింది, తెలుసా! నువ్వు ఈ దివ్యకాంతిని విమర్శించే ముందు నిన్ను నువ్వు ఒక ఆకృతిలో మలుచుకోవడానికి ప్రయత్నించడం మంచిది! ఆయన పదహారేళ్లు రాకముందే తన అధ్యయనం అంతా ముగించారనీ, ఆయన సాధన మొత్తం పూర్తయిందనీ, అన్ని రకాల విశ్వాసాలు, సంప్రదాయాలకు చెందిన పండితులు, విద్వాంసులను చర్చలో పరాజితుల్ని చేశారనీ, ఉపనిషత్తులకు వ్యాఖ్యానాలు రాశారనీ, వేదజ్ఞానాన్ని పున:స్థాపించారనీ, మతస్థాపన పూర్తి చేశారనీ, లక్షలాది మంది జీవితాల్ని సమూలంగా మార్చేశారనీ, ప్రకృతికి దాని సహజమైన ప్రకృతిని దానికి తిరిగిచ్చారనీ తెలుసా నీకు? ఆ వయసుకి మనకి సరిగా ముడ్డి కడుక్కోవడం కూడా రాదు!' అంటూ తీవ్రమైన పదజాలంతో భోలేని ఖండించారు.

సంభాషణ మరో వికృతమైన మలుపు తిరుగుతుందేమోననే బెంగతో భోలే చాలా వినయం, వినమ్రత ఉట్టిపడుతూ, రాహుల్‌జీని ఆశ్రయించే తెలివైన ప్రయత్నం చేశాడు.

రాహుల్‌జీ బరిలోకి దూకారు. 'శిరోముండనం చేసుకుని ఓ పిల్లాడు కొంతమంది జనాన్ని వెంటేసుకుని అజ్ఞానుల మధ్య సంచారం చేస్తూ ఉంటే జరిగేదేమనుకుంటున్నావు నువ్వు? మతం అనేది మత్తుమందు. ఏ సమాజంలో చూసినా అత్యధికులు దాన్ని సేవిస్తూ ఉంటారు. అలాంటి సమాజంలో నాయకుడిగా నిలవాలంటే, ఆ సమాజం సేవిస్తున్న మత్తుమందు చాలా

గొప్పగా ఉందని చెప్పడమే! శంకరాచార్య చేసింది కూడా అదే. అతను అయోమయంలో ఉన్నాడు. అతడికి తన తత్వ సిద్ధాంతం మీదా, మతపరమైన విధానాల మీదా స్పష్టమైన అవగాహన లేదు. తన వ్యక్తిత్వానికి తగ్గట్టుగానే అతడు మాయా సిద్ధాంతాన్ని తీసుకొచ్చాడు. అతడిలాగే అయోమయంలో పడి కొట్టుకునేవాళ్లంతా ఆ సిద్ధాంతాన్ని ప్రేమిస్తారు. అజ్ఞానులైన హిందువులు దీన్ని గుడ్డిగా నమ్ముతారు. వాళ్లు శంకరాచార్య ఓ పక్క నామరహిత, రూపరహితమైన బ్రహ్మని గురించి ప్రతిపాదిస్తూ, మరో వైపు తన ప్రయాణిస్తున్న మార్గంలో ఉన్న ప్రతి దేవాలయాన్నీ సందర్శించాడు. శిథిలమై పోయిన దేవాలయాలైతే ఇంకా ఎక్కువసేపు జపం చేసి శక్తి ధారపోశాడు. ఆశీస్సుల కోసం దేవుళ్లు, దేవతలందర్నీ కొలిచాడు. సంస్కృత పండితులంతా అతడిని పీఠం మీద కూర్చోబెట్టి, అతడికి కీర్తి ప్రతిష్ఠల్ని ఆపాదించడం కోసం ఓ మూలపురుషుడిగా చేశారు. ఆ ప్రాంత పాలకులు, విద్వాంసులు, రైతులు వంటి స్థానిక ప్రజల్ని మెప్పించేందుకు ప్రయత్నించారు. దైవం ఏ రూపంలో ఉన్నా, అంటే, వైష్ణవ ఆలయాలు, శైవాలయాలు ఏవైనా సరే, ఆయన ఆ యా ప్రాంత దేవాలయాలకు అంకితమై ఉన్నట్టు జనం భావించేలా చేశాడు. అతడి గురువుకి గురువు చేసినట్టే అతడు కూడా బౌద్ధ సిద్ధాంతాలను తస్కరించాడు. అదే సమయంలో జనంలో బౌద్ధానికీ, బౌద్ధ సన్యాసులకీ ప్రతికూలంగా ప్రచారం చేశాడు. అతడు వేదాంతి లేదా ఒక ఆధ్యాత్మిక గురువు కంటే కూడా ఓ రాజకీయవేత్త అనిపించుకుంటాడు,' అన్నారాయన.

ఈ మాటల యుద్ధం సాగుతూనే ఉంది. రాత్రి చాలా భాగం గడవవచ్చినా వీళ్లిద్దరి మధ్యా ఇంకా ఇంకా తీవ్రత పెరిగిపోతోంది. భోలే ఎంతో యుక్తిగా రిఫరీ పాత్ర పోషిస్తున్నాడు. వాళ్ల స్వరాలు తీవ్రస్థాయికి చేరుకున్నాయి. చొక్కా చేతులు మడత పెట్టుకుంటున్నారు, తొడలు చరుచుకుంటున్నారు, అక్కడ అందుబాటులో ఉన్న సామాగ్రి ఎత్తి కింద పడేస్తున్నారు. వాళ్లిద్దరూ చల్లబడి పక్కల మీదకి చేరేసరికి దాదాపు తెల్లవారకట్ట అయింది.

ఆ మర్నాడు వాళ్లని ఆచార్య నరేంద్ర దేవ ఇంట్లో అల్పాహారానికి ఆహ్వానం అందింది. అక్కడికి వెళ్లినవాళ్లు గొప్ప విద్వాంసుడైన ఆచార్యజీని న్యాయమూర్తి పాత్ర ఇస్తూ మళ్లీ రాత్రి వివాదాన్ని కొనసాగించారు. సమన్వయం చేస్తున్నట్టు నటిస్తూనే భోలే చాలా చాకచక్యంగా అగ్నికి ఆజ్యం పోస్తున్నాడు. 'కాసేపు రాహుల్‌జీయే బుద్ధుడు, నిరాలాజీయే శంకరాచార్య అనుకుందాం,' అన్నాడు. అప్పుడు వాదం ముదిరి మరింత పాకాన పడింది. ఎంతకీ తెగట్లేదు, ఎవరూ తగ్గట్లేదు. దాంతో 'ఎవరు ఎక్కువ భోజనం చేస్తే, వాళ్లే విజేతలు' అని ప్రకటించాడు. నిరాలా, 'రాహుల్ కంచంలో ఉన్న ఈ బంగాళదుంపల కూర అతడి 'విశుద్ధి మగ్గ' ('విశుద్ధి మార్గ'–ఓ ప్రామాణిక బౌద్ధ గ్రంథం)' కి అంకితం!' అన్నారు.

'ఇదిగో, ఈ అరటిపండ్లు కూడా తిను, నిరాలా, బ్రహ్మసూత్రాలకి శంకరాచార్య వ్యాఖ్యానాన్ని నువ్వు జాగ్రత్తగా అంటిపెట్టుకుని ఉన్నందుకు!' అని రాహుల్‌జీ వేళాకోళం! అలా సరదాగా మాటల తూటాలు పేల్చుకుంటూనే ఆ ఇద్దరు మహానుభావులూ ఎక్కువ భోజనం చేశారు. ఇప్పుడు ఆచార్యజీకి వాళ్లిద్దరిలో ఎవరు ఎక్కువ తిన్నారనేది తేల్చడం కష్టమైంది. మొత్తానికి ఆ వాదాన్ని వాళ్లిద్దరూ అక్కడితో ముగించారనుకోండి! ఆ సందర్భం అలా జరిగింది!

విశ్వవిద్యాలయంలో అలాంటి విద్వాంసులు, స్నేహితుల మధ్య భోలే యువకుడయ్యాడు. ఆయన తన చుట్టూ ఉన్న ప్రపంచంలో సంపూర్ణంగా నిమగ్నమయ్యారు. పరీక్షల సమయంలో ఒత్తిడి అనుభవించారు. తన తోటి స్నేహితులు గడిపే జీవన రీతుల్లో పాలు పంచుకున్నారు. కానీ ఆయన మనసులో నిరంతరం తానొక ఉన్నతమైన లక్ష్యం కోసం, జీవన సార్థకత కోసం పనిచేయాలనే విషయాన్ని గుర్తుంచుకునేవారు. భోలేకి ప్రొఫెసర్ ఆర్.డి.రానడే ఆంతరంగిక బృందం

స్వాగతం పలికింది. అప్పుడు శ్రీ రానడేని దగ్గరగా పరిశీలించే అవకాశం కలిగింది. ఇది తనకు బౌద్ధిక వికాసానికి దోహదం చేస్తుందని భోలే భావించాడు. కానీ ప్రొఫెసర్ రానడే సహవాసం ఎక్కువగా ఆధ్యాత్మికపరమైన ప్రేరణనిచ్చింది. ఈ ప్రపంచంలో జీవిస్తూ కూడా దానికి అతీతంగా ఉండడమంటే దానికి సజీవమైన ఉదాహరణ ఆయనే. రానడే నిరంతరం పుస్తకాలు రాస్తూ, అలహాబాదు విశ్వవిద్యాలయంలోనూ, ఇతర విశ్వవిద్యాలయాల్లోనూ ఉపన్యాసాలిస్తూ, మహారాష్ట్రలో ఉన్న వారి ఆశ్రమం చూసుకుంటూ ఆయన చాలా వ్యస్తతతో జీవితం గడిపేవారు. కానీ అన్ని వ్యవహారాలతో సతమతమవుతున్నా, భోలేకి ఆయనలో ఈ భౌతిక సామ్రాజ్యానికి అతీతంగా ఓ మర్మయోగి కనిపించాడు. రానడేకి అద్భుతమైన అతీంద్రియ జ్ఞానం (దివ్యదృష్టి, క్లెయర్‌వాయన్స్) ఉండేది. ఎదురుగా పడి ఉన్న ఉత్తరాల గుట్టలో ఉత్తరాన్ని తెరవకుండానే ఆయన సమాధానం ఇస్తూ ఉండడం భోలే తరచుగా చూసేవారు. ఒక రోజు ఓ క్షణంలో కలిగిన ప్రేరణతో, ఆయన భోలే జీవితంలో అత్యంత వ్యక్తిగతమైన దృక్కోణం గురించి మాట్లాడసాగారు. బాబాజీతో భోలే అనుబంధం, బాబాజీ భోలేపై చూపే అంతులేని ప్రేమ, బాబాజీ అతని దగ్గర నుంచి ఆశిస్తున్న విషయం–వీటన్నింటి మీదా ఆయన మాట్లాడారు. ప్రొఫెసర్ రానడే చెప్తున్న తీరు చూస్తుంటే, భోలే–బాబాజీల మధ్య జరిగిన సంఘటనల్ని ఆయన స్వయంగా చూసినట్టు చెప్తున్నారు. 'ఈ సంగతులన్నీ మీకెలా తెలిశాయి?' అని అడిగాడు భోలే. అప్పుడు రానడే, 'ఏం, ఎందుకు తెలియవు? నేను ఆయనలో ఉన్నాను, ఆయన నాలో ఉన్నారు. మేమిద్దరం మా ఇద్దరిలోనూ ఉన్నాం!' అని జవాబిచ్చారు.

భోలే అప్పుడు, 'నేను కూడా ఇలాంటి అనుభూతి పొందగలనా? మీకు కనిపించే విధంగానే నాకు కూడా మనుష్యులు, సంఘటనలు కనిపిస్తాయా?' అని అడిగాడు.

దానికి రానడే, 'పరమ గురువు నీ కాలాన్ని జోస్యం చెప్పే వానిలా వ్యర్థం కాకూడదనుకుంటున్నారు. నా మనసుకి తోచింది చెప్పాలనిపించి చెప్పాను. బహుశా నిన్ను నాతో కలపడం కూడా ఆ పరమ గురువు అభిమతమే కావచ్చు!'

లౌకిక ఆకర్షణలు, వికర్షణలు ఎలా ఉన్నప్పటికీ ప్రొఫెసర్ రానడేతో గల సాంగత్యం భోలేకి నిరంతరం అతడి ఉన్నత జీవితాశయాన్ని ఎరుకలో ఉంచేది. ఈ మహనీయుడిని చూస్తూ, భోలే పాండితీ ప్రకర్ష కలిగి ఉంటూ కూడా గొప్ప మార్మిక యోగిగా ఉండవచ్చుననీ, ఈ ప్రపంచంలో విజయం సాధిస్తూ కూడా పావన ఆధ్యాత్మిక జీవితాన్ని గడపవచ్చుననీ తెలిసింది.

తర్వాత భోలే రానడేకి అంతటి ఉన్నత స్థితి ఎలా సంభవించిందో చెప్పమని తన గురువుగారిని అడగగా, బాబాజీ చాలా సూక్ష్మంగా 'సాధన' అని చెప్పారు.

'అసలు ఏం సాధన చేయాలో, ఎలా చేయాలో మీరు నాకు బోధిస్తారా?' అని అడిగాడు భోలే.

'సాధన గురించి నీ దగ్గర నుంచి ప్రశ్న వచ్చే రోజు కోసమే ఎదురుచూస్తున్నా. డార్జిలింగ్ వెళ్లు. సిటీకి బయట ఒక సెలయేరు ఉంది. ఆ సెలయేటి తీరంలో ఓ శ్మశానం ఉంది. నువ్వు అక్కడ నేను చెప్పిన విధంగా నలభై రోజుల దీక్ష చేయాలి. సాధన పూర్తి చేయకుండా మధ్యలో వదలకూడదు. ఏం జరిగినా, ఎన్ని అవాంతరాలు వచ్చినా సరే, దీక్ష మాత్రం మానకూడదు. ఆ చోటిని విడిచి పెట్టకూడదు,' అన్నారు బాబాజీ.

భోలేకి ఇదేదో చాలా ఉత్తేజాన్నిస్తోంది. తూర్పు హిమాలయ ప్రాంతంలో అత్యంత అందమైన ప్రదేశాల్లో ఒకటి డార్జిలింగ్. ఈ సెలవులు అక్కడ గడపడానికి ఎంత మంచి అవకాశం వచ్చిందో గదా అని భోలే సంతోషం లోపల్లోపల. పైగా ఆ నగరం బయట ఉన్న శ్మశానంలోనే

'భవాల్ సన్యాసి' గా ప్రసిద్ధికెక్కిన రాకుమార స్వామిని దహనం చేయగా బాబాజీ అతడిని తిరిగి బ్రతికించారు.

భోలే డార్జిలింగ్‌కి వెళ్లి, శ్మశానం దగ్గర సాధన మొదలుపెట్టాడు. తన గురువు చెప్పిన అన్ని రకాల సంప్రదాయాలు, పద్ధతుల్నీ సాధన చేస్తూ, దీక్ష సాగించాడు. అలా ముప్పైఎనిమిది రోజులు గడిచింది. కానీ ఎలాంటి ఫలితమూ లేదు. ముప్పై తొమ్మిదవ రోజున ఓ ఆలోచన వచ్చింది– 'ఇదంతా కాలాన్ని వృథా చేయడం కాకపోతే మరేమిటీ? ప్రపంచాన్ని వదిలి దూరంగా వచ్చి ఇక్కడ వంటరిగా కూర్చున్నాను. మరి గురువుగారు నేను సాధన పూర్తి చేయగానే నాలో ఏదో విలక్షణమైన శక్తి వికసిస్తుందని అన్నారు. పైగా ఎట్టి పరిస్థితుల్లోనూ నేను నలభై ఒక్క రోజు దాకా దీక్ష వదలకూడదని చెప్పారు. మనసు పరి పరి విధాల ఊహలు, సూచనలు చేస్తుంది, కానీ వాటిని వినకూడదని కూడా చెప్పారు. కానీ నాకు ఆశ్చర్యంగా ఉంది, ముప్పై ఎనిమిది రోజులు జరగనిది, ఇంకో రెండు రోజుల్లో మాత్రం ఏం జరుగుతుందా అని!'

భోలే కొద్దిసేపు ఈ విధంగా ఆలోచించి, ఇక ఈ సాధనపై సమయాన్ని వ్యర్థం చేయకూడదని నిర్ణయించుకున్నాడు. అందువల్ల తను ఓ బక్కెట్టుతో నీళ్లు తీసుకొచ్చి ఆ హోమగుండం మీద పోసేసి, తను ఉంటున్న కుటీరాన్ని ధ్వంసం చేసేశాడు. ఓ ఊలు శాలువా కప్పుకుని, వీథుల్లో తిరగసాగాడు. అకస్మాత్తుగా పైన అంతస్తులోంచి ఓ స్త్రీ పాడుతున్న పాట వినబడింది: 'జీవనపాత్రలో తైలం కొంచెమే మిగిలి ఉంది, రాత్రి అతి దీర్ఘంగా ఉంది!' తబలా వాయిస్తున్న వ్యక్తి 'థక్ థిక్' అంటూ సంస్కృత పదాన్ని పోలినట్టు తాళం వేస్తున్నాడు. ఆ గీతం భోలేని 'నీకు సిగ్గులేదా!' అని అడుగుతున్నట్టు అనిపించింది అతడికి. భోలే మనసంతా నిండిపోయి, అతీత స్థాయికి చేరుకుంది. కొన్నేళ్ల క్రిందట అరవైనాలుగు యోగినుల మందిరంలో తనకి దర్శనమిచ్చిన దేవి తనను మధురమైన, అర్థవంతమైన ఈ పాట ద్వారా మేల్కొల్పుతోంది. ఇది ఆమె నుంచి వస్తున్న సందేశమే. 'థక్ థిక్' మని వినిపిస్తున్న తబలా నాదం తనను అమితంగా నిస్వార్థంగా ప్రేమించే తన గురువుగారు, ప్రొఫెసర్ రానడే, ఇంకా తనను ఆశీర్వదించే ఇతర యోగులందరి సందేశం. అతడికి చాలా సిగ్గనిపించింది. తిరిగి అతడు స్మశానానికి చేరుకుని, సాధన ముగించి, తన గురువు చెప్పిన విధంగా ఫలితాన్ని సాధించాడు.

ఈ అనుభవంతో భోలేకి మనసు ఎంత కిలాడీయో తెలిసొచ్చింది. మనల్ని అది ఎంత తర్కంతో, బురిడీ కొట్టిస్తుందో, లౌకిక ఆకర్షణలకీ, ప్రలోభాలకీ ఎలా లొంగిపోయేలా చేస్తుందో అర్థమైంది.

ఇది సహనశక్తికి గట్టి గుణపాఠం: విశ్వాసంతో మొక్కని వంచవచ్చు, అప్పుడది పరిపక్వమై ఫలాన్నిస్తుంది. దీని ద్వారా భోలే సంకల్పశక్తినీ, నిశ్చయాత్మక బుద్ధినీ ఉపయోగించి పని చేయడం నేర్చుకున్నాడు: ఒకసారి ఒక ప్రయాణం ఆరంభించిన తర్వాత గమ్యం చేరుకునేవరకు త్రోవ తప్పి అటూ ఇటూ చూడకూడదు.

ఆ తర్వాత గురువుగారు ఎప్పటికప్పుడు భోలేని, 'భోలియా, ఆ తల్లి పాడిన పాట ఏమిటి?' అని అడుగుతూనే ఉండేవారు.

'ఈ జీవనపాత్రలో మిగిలిన తైలం కొంచెమే, రాత్రి చూస్తే అతి దీర్ఘం!' అనేవాడు భోలే.

ఆయన 'అబ్బ, ఎంత బాగా అన్నదీ!' అనేవారు.

ఆ మహిళ పాడిన పాట భోలేకి ఓ విస్ఫోటక పదార్థంగా పని చేసింది. ఈ సంఘటన వల్ల స్వామీజీకి తరువాత ఒక రహస్యం అర్థమైంది, ఆయన తన లోపలి గురువుని మేల్కొల్పుకున్నారు, తనని తాను సరైన మార్గంలో ప్రతిష్ఠించుకున్నారు. పాటలోని పదాల్ని గురించి ఆలోచిస్తూ,

ఆయన నిజంగానే జీవితం పాత్రలోని తైలం చాలా కొద్దిగా ఉందని గ్రహించారు. జీవితం చిన్నదనీ, ప్రయాణం సుదీర్ఘమైనదనీ అర్థం చేసుకున్నారు. శరీరం నశించే ముందే మనం లక్ష్యం చేరుకోవాలనీ, లేదంటే చాలా నష్టపోవలసి వస్తుందనీ ఆయనకి తెలిసింది. అప్పుడు అతడి తార్కిక బుద్ధి విశ్వాసానికి గల శక్తికి లొంగింది. అతడు తన ఇప్పటిదాకా ఏం చేశాడో అంచనా వేసుకున్నాడు. ప్రస్తుతం ఏమిటో చూసుకున్నాడు, తను ఇంత గొప్ప గురువు అండదండలతో పెరగడం గురించి ఆలోచించి తాను ఎంత అదృష్టవంతుడో అర్థం చేసుకున్నాడు.

ఈ సంఘటనా, దీనితో బాటు ఇలాంటి వందలాది అనుభవాలతో ప్రేమ అసలు తాత్పర్యం, మన అభివృద్ధిపై ప్రభావం చూపిస్తూ ఆద్యంతం గొప్పగా మలచగల దాని స్వభావాన్ని భోలే అర్థం చేసుకోగలిగాడు. అలాగే నిస్వార్థ ప్రేమకు సాకార రూపంగా నిలిచిన తన గురువే తను దర్శిస్తున్న దైవం. ఇంతకు మించి మరో దేవుడిని చూడాలనే అభిలాష అతనిలో లేకపోయింది.

స్వామీ రామ తన ఉపన్యాసాల్లోనూ, రచనల్లోనూ కూడా 'ప్రేమే జీవన దైవం' అని పదే పదే ఉద్ఘాటించేవారు. ఈ ప్రేమకు ప్రతిరూపంగా ఉన్న బాబాజీయే స్వామీజీ జీవన దైవం. ఎవరైనా తన గురువు గురించి అడిగితే ఆయన ఒకటే చెప్తారు, 'నా గురువే నా తల్లీ, తండ్రీ, స్నేహితుడూ, మార్గదర్శీ, గురువూ...సమస్తమూను. మీ ఎదుట ఉన్న నా ఈ రూపం ఆయన మలిచిన శిల్పమే. ఆయన నాకు ప్రతీదీ ఇచ్చారు. కానీ నా నుండి ఒక గ్లాసుడు మంచినీళ్లు కూడా అడగలేదు. వారిని ఏ పేరుతో పిలవాలో నాకు తెలియదు. అందుకే నేను ఆయనను 'నా గురువు' అంటుంటాను.

స్వామీజీ సాధారణంగా భావోద్వేగానికి గురి కారు, కానీ సంభాషణలో భాగంగా ఎవరైనా స్వామీజీకి వారి గురువుగారిని గురించి గుర్తు చేస్తే, ఆయన ఆ తర్వాత ఒకటీ రెండు వాక్యాలకి మించి చెప్పగలిగే పరిస్థితి ఉండదు. ఆ తర్వాత ఆయన స్మృతి పథంలోకి జారిపోతారు.

1993 లో యునైటెడ్ స్టేట్స్‌ని ఆయన చివరిసారిగా సందర్శించిన సమయంలో స్వామీజీ అన్నారు, 'నా దగ్గర ఉన్నదల్లా నా గురువు నుంచి నేను అందుకున్న ప్రేమ బహుమతి ఒక్కటే. నేనూ నీకు అదే అందిస్తున్నాను.' ఈ ప్రపంచానికి స్వామీజీ అందిస్తున్న ఈ బహుమతిని అర్థం చేసుకోవాలన్నా, అభినందించాలన్నా ముందుగా భోలేపై అంతటి అపురూపమైన ప్రేమని బాబాజీ వర్షించడానికి గల కారణం తెలుసుకోవాలి.

అధ్యాయం 2

# హిమాలయ సాధువు

ఎన్నో రకాల సత్సంకల్పాలు, సాధనలు, శిక్షణలతో భోలే తన గురువు సాన్నిధ్యంలో పెరిగాడు. ఆయనతో కలిసి భారతదేశమంతటా ప్రయాణించాడు. నేపాల్, టిబెట్, సిక్కిం, భూటాన్, బంగ్లాదేశ్ లాంటి విదేశీ యాత్రలు చేసి వచ్చాడు. ఆయనతో కలిసి అధ్యయనం చేశాడు, ఆయన పర్యవేక్షణలో ఆధ్యాత్మిక సాధన చేశాడు.

కానీ భోలేకి బాబాజీకి గల గొప్ప జ్ఞానం వల్లనో, ఆధ్యాత్మిక శక్తుల వల్లనో సాన్నిహిత్యం కలగలేదు. బాబాజీకి భోలే పట్ల గల అసాధారణమైన ప్రేమతో పోల్చి చూసినపుడు భోలేకి ఈ ప్రపంచం, ఈ ప్రాపంచిక ప్రేమలు బహు అల్పంగా కనిపించాయి. కానీ ఖజురహోలోని అరవై నాలుగు యోగినుల ఆలయంలో దేవీ మాత దర్శనం చేసుకున్న తర్వాత భోలేకి తన గురువు, తనకు మిఠాయి పెట్టే వృద్ధ సాధువు ఓ అద్భుతమైన వ్యక్తి అనే విషయాన్ని గుర్తించాడు.

అసలు బాబాజీ ఎవరా అని ఆలోచించాడు భోలే. కానీ అప్పటికి ఇంకా చిన్న పిల్లవాడు కావడంతో అతడికి బాబాజీ ఆధ్యాత్మిక గాఢతని గ్రహించగలిగే శక్తి లేదు.

మెల్లగా యవ్వనంలోకి ప్రవేశించడంతో భోలేకి తన గురువుకి అసాధారణమైన శక్తులు ఎన్నో ఉన్నాయనీ, అవి మామూలు మనిషి బుద్ధికి దాదాపుగా అనూహ్యమైనవనీ అవగతం చేసుకున్నాడు భోలే.

ఉదాహరణకు, ఒకరోజు భోలే, బాబాజీ ఇద్దరూ పర్వతాల మధ్య నడుస్తున్నారు. ఇంతలోనే పర్వతం వాలు మీదుగా హిమసంపాతం (అవలాంచీ) నేరుగా తమ వైపే దూసుకొస్తోంది. 'బాబాజీ, తొందరగా పరిగెత్తండి!' భోలే అరిచాడు.

'ఎందుకు?' బాబాజీ అడిగారు.

'మీరు వినలేదా ఉరుములు, శిలలు జారిపడుతున్న శబ్దం? మనం చచ్చి ఊరుకుంటాం!" అరిచాడు భోలే.

'చింతించకు, భోలే, చావు ఇంకా రాలేదు. అలాంటప్పుడు ఈ జారిపడే పర్వత శిలలు మనకు హాని ఎలా చేస్తాయి?' అతడి గురువు ప్రశాంతంగా జవాబిచ్చారు. ఈ మాటలు అంటూ ఆయన తన చేతిని పైకి లేవనెత్తి, 'ఆగు' అన్నారు. అవలాంచీ ఆకస్మికంగా గాలి మధ్యలో నిశ్చలంగా నిలిచి ఉంది. గురూజీ, భోలే ఆ ప్రమాదభరిత ప్రాంతాన్ని దాటి ముందుకు సాగిపోయారు. అవలాంచీకి ఆవలి వైపు మార్గంలో గురూజీ వెనక్కి తిరిగి, 'ఆ! ఇహ నీ పని కానీ!' అన్నారు. వాళ్లిద్దరూ అలా చూస్తుండగానే, అవలాంచీ పెద్ద హోరుతో వాళ్లు కొన్ని క్షణాల

ముందు నడిచి వచ్చిన మార్గాన్ని పూర్తిగా మూసేస్తూ పర్వతం మీద నుంచి ఒక్కసారిగా విరుచుకుపడింది. ఇలాంటి మరి కొన్ని ప్రత్యక్షానుభవాలతో భోలేకి తన గురూజీకి ప్రకృతి శక్తులన్నీ స్నేహితులేననీ, దైవంతో బాబాజీ విడదీయలేని బంధంతో ఉన్నారనీ అర్థమైంది.

చిన్ననాటి నుంచీ ఆయన తనపై కురిపిస్తున్న నిస్వార్థమైన ప్రేమకు భోలే మనసు కృతజ్ఞతతో నిండిపోయింది. తనలో ఆధ్యాత్మిక జ్యోతిని వెలిగించిన ఆ సాధువు పట్ల భోలే మనసులో గౌరవం పెల్లుభికింది. ఈ మార్మిక ఆత్మ గురించి మరిన్ని విషయాలు తెలుసుకోవాలని భోలే తాపత్రయపడ్డాడు. బాబాజీ ఎక్కడ పుట్టారు, ఆయన తల్లిదండ్రులు ఎవరు, ఆయన గురువు ఎవరు, అంతటి ఉత్కృష్ట స్థితిని ఆయన ఎలా సాధించారు, ఇలాంటి విషయాల గురించి తెలుసుకోవాలని ఆరాటం మొదలైంది భోలేకి.

కానీ సాధువులు తమ పూర్వాశ్రమ జీవితంతో అనుబంధం వదలేస్తారు. సన్యాసం తీసుకున్నాక సాధువులకు ఇక వారి స్వంత కుటుంబంతో గానీ వారు పుట్టిన చోటుతో గానీ సంబంధ బాంధవ్యాలు ఉండవు. వారు గడిచిపోయిన కాలానికి సంబంధించిన జ్ఞాపకాల్ని పూర్తిగా తుడిచిపెట్టేసి, మనసుని నిర్మలమైన స్థితిలో ఉంచుకుంటారు. భోలేకి ఇది తెలుసు. కానీ ఈ మహనీయుని జన్మస్థలి గురించీ, తల్లిదండ్రుల గురించీ తెలుసుకోవాలని భోలే మనసులో కలిగిన సంకల్పం ఎంతో దృఢంగా ఉంది. దానికి ఆయన గురువు దగ్గర నుంచి ఒకే ఒక సమాధానం వచ్చింది– అది కూడా పదే పదే అభ్యర్థించిన తర్వాత! బాబాజీ పశ్చిమ బెంగాల్‌లోని మేదినీ పూర్ గ్రామంలో ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు.

భోలే తన గురువు పుట్టుపూర్వోత్తరాల గురించి తన మనసులో వేధిస్తున్న ప్రశ్న పరంపరకి సమాధానాలు కనుగొనాలని నిర్ణయించుకున్నాడు. ఆయన 1982–1985 మధ్య కాలంలో ఆ పనిని వాయిదాల వారీగా ఎలా చేసుకొచ్చారో నాతో చెప్పారు. బాబాజీ మాటల సందర్భంలో అప్పుడప్పుడూ చెప్పిన చిన్న చిన్న వాక్యాలతో బాటు స్వామీ శివానంద, పాగల్ బాబా, ప్రిన్స్ స్వామి– ఈ ముగ్గురు మహనీయుల నుంచి కూడా భోలే కావలసిన సమాచారం సేకరించారు. ప్రిన్స్ స్వామిని 'భవాల్ సన్యాసి' అని కూడా అంటారు. స్వామీ శివానంద భోలేకి శిష్యకోటిలో అన్నలాంటివారు. ఆయన ఓ అద్వితీయ స్థితిలో ఉన్న యోగి. ఆయన బాబాజీ గురించి వ్యక్తిగతంగా చాలా ముందు నుంచే తెలుసు. ఎందుకంటే, ఆయన కూడా బాబాజీ లాగే మేదినీపూర్‌లో జన్మించారు. అందుకే వారి కుటుంబానికి బాబాజీ కుటుంబం గురించి బాగా తెలుసు. కౌమార దశలో ఉన్న భోలేలో చెలరేగిన కుతూహలం బాబాజీ జన్మస్థలానికి వెళ్లేందుకు పురిగొల్పింది. మేదినీ పూర్ అప్పటికి చిన్న గ్రామం నుంచి ఓ మోస్తరు పట్టణంగా మారినా స్వామీ శివానంద భోలేకి వెళ్లాల్సిన చోటికి ఎలా చేరుకోవాలో చక్కగా వివరించారు. భోలేకి బాబాజీ పెరిగిన ఇంటిని కనుక్కోలేకపోయారు. కానీ అతడక్కడ ఎనభై ఏళ్ల వయసులో ఉన్న ఇద్దరు వృద్ధ మహిళల్ని కలుసుకున్నాడు. వారికి బాబాజీ ఒక హిమాలయ సాధువుతో కలిసి వెళ్లిపోయిన రోజు గుర్తుంది. భోలే వారితోనూ, అలాగే బాబాజీ తల్లిదండ్రుల గురించి తెలిసిన మరి కొన్ని కుటుంబాలతోనూ కలిసి కొద్ది రోజులు గడిపాడు. వాళ్లంతా మంచి విద్యావంతులు, బాగా ధనికులూను. భోలేకి గొప్ప ధార్మిక తేజస్సు కలిగిన కాళీ మాత ఉపాసకులు కూడా కనిపించారు. బాబాజీ తల్లిదండ్రుల్ని ఆధ్యాత్మిక పథంలోకి తీసికెళ్లింది ఆ హిమాలయాల నుంచి వచ్చిన సాధువే. ఆ సాధువే అతి పిన్న వయసులో ఉన్న బాబాజీకి కూడా దీక్ష ఇచ్చారు.

బెంగాలీ బాబా ఉన్నత విద్యని అభ్యసించారు. బ్రిటిష్ పాలనలో గొప్ప హోదాలో పని చేసేవారు. ఆయనకి వివాహమైంది. పిల్లలు కూడా ఉన్నారు. కానీ ఆయన ఈ స్థితిలోనే ప్రపంచాన్ని వదిలిపెట్టి తన గురువు పాదాల చెంత ఉండిపోవాలని నిర్ణయించుకున్నారు. గురువు ఆయన్ని

ఛిన్నమస్త అమ్మవారి ఆలయానికి తీసుకుని వెళ్లారు. ఆ తర్వాత ఏమైందో ఆ ఇద్దరు మహిళలకు గానీ, మేదినీ పూర్‌లో ఉన్న మరెవరికి గానీ తెలియదు. ఆ తర్వాత, తన గురువు జీవితంలో ఇంకా ఏమేం మార్మిక సత్యాలు దాగి ఉన్నాయో, అన్నింటినీ ఒక్కొక్కటిగా వెలికి తీయడానికి భోలే నిర్ణయించుకున్నాడు. భోలేకి తన గురువు అస్సాం అడవుల్లో ఉన్న ఛిన్నమస్తాదేవి ఆలయంతో ఏదో ప్రత్యేకమైన అనుబంధం కలిగి ఉన్నారని గుర్తొచ్చింది. ప్రస్తుతం బీహార్‌లో ఉన్న ఆ దేవాలయంలో ఆ దేవతతో తన గురుదేవులకి ఉన్న అంత గాఢానుబంధం ఏమిటో మరింత బాగా తెలుసుకోగలిగితే అది తనకెంతగానో ఉపయోగిస్తుందని భావించాడు భోలే. ఆ ఆలోచన రావడమే తడవుగా, గంగోత్రిలో నివసిస్తున్న తన గురు భాయి స్వామి శివానందతో మాట్లాడారు. బీహార్‌లోని ఛిన్నమస్తాదేవి బాబాజీ తల్లిదండ్రులకి కులదైవమని భోలేతో చెప్పారు స్వామి శివానంద. ఆ రోజుల్లో ఆ ఆలయం కీకారణ్య ప్రాంతంలో ఉండేది. రాత్రిళ్లు పులుల్లాంటి క్రూర మృగాలు సంచరిస్తూ ఉండేవి. కానీ ఇలాంటి సంఘటనలు ఏం జరుగుతున్నా, బాబాజీ కుటుంబం మాత్రం ఆలయాన్ని తరచుగా దర్శిస్తూ ఉండేది. బాబాజీ గురువైన ఆ హిమాలయ సాధువు అక్కడ ఎక్కువ కాలం గడిపేవారు.

ఛిన్నమస్తాదేవి అద్భుతమైన దేవత. సంప్రదాయం ప్రకారం, ఒక చేతిలో ఖడ్గాన్నీ, మరొక చేతిలో ఖండించబడి ఉన్న తన శిరస్సునీ పట్టుకుని ఉన్న ఛిన్నమస్త శివుని హృదయ స్థానంలో ఉంటుంది. దేవతకి ఇరు వైపులా నిలబడి ఉన్న ఇద్దరు దేవతలు ఆమె కంఠం నుంచి ఎగసి పడుతున్న రక్త ధారల్ని త్రాగుతూ ఉంటారు. ఛిన్నమస్త భక్తులకి ఆమె బంధరాహిత్యానికీ, అహంకారంపై సాధించిన విజయానికీ సాకార రూపం. ఆమె ఉత్కృష్ట చైతన్యమైన శివుడనే సుస్థిరమైన భూమి మీద నిలబడి ఉంటుంది. జ్ఞాన ఖడ్గంతో ఆమె హేతువుకీ, తర్కానికీ నెలవైన తన తలనే ఖండించుకుంది. ఆమె తన శిరస్సుని హృదయ స్థానానికి దిగువ స్థానంలో పట్టుకుని ఉండడం ద్వారా తెలివిపై విశ్వాసానిదే విజయమని తెలియజెప్తోంది. ఆమెకి ఇరువైపులా ఉన్న ఆ ఇద్దరు దేవతలూ ప్రాపంచిక వినోదం, ఆధ్యాత్మిక స్వేచ్ఛకి ప్రతీకలు. వాటిని ఆమె తన నిరంతర జీవ, విజ్ఞాన ప్రవాహానికి ప్రతీకగా కంఠం నుంచి ఉవ్వెత్తున ఎగసి పడుతున్న రక్తధారతో పోషిస్తోంది.

బీహార్‌లోని ఆ ఆలయం ఎన్నో శతాబ్దాలుగా యోగుల్నీ, మర్మ సాధకుల్నీ మహా అయస్కాంతంలా ఆకర్షిస్తోంది. బాబాజీ సన్యసించింది అక్కడే! సన్యాసదీక్షలోకి వచ్చిన ఆయన తన పూర్వాశ్రమంతో బంధం తెంచుకున్నారు. అక్కడ నుంచీ ఆయన సన్యాస నామధేయం బాబా ధరమ్‌దాస్ అయింది. బాబాజీ ఎన్నో ఏళ్ల పాటు తన గురువుతో కలిసి ఉన్నారు, ప్రయాణించారు. తరచుగా తన గురువుకి ఇష్టమైన టిబెట్‌లోని కైలాస పర్వతాన్ని సందర్శించేవారు. శీతాకాలంలో వారు డార్జిలింగ్‌కి వచ్చేవారు. దాన్ని తమ స్థావరంగా ఉపయోగించుకుంటూ, వాళ్లు హిమాలయ సామ్రాజ్యాలైన నేపాల్, సిక్కిం, భూటాన్ ప్రాంతాలన్నీ సందర్శిస్తూ ఉండేవారు.

'అయితే మీరు బాబాజీని ఎప్పుడైనా కలుసుకున్నారా?' అని అడిగాడు భోలే స్వామి శివానందని. దానికి గురుభాయి సమాధానమిస్తూ, 'ఈ సంగతి నువ్వే కనుక్కోవాలి మరి!' అన్నారు. భోలేకి తన గురువు తనని ప్రత్యక్షంగా కూర్చోబెట్టుకుని ఎన్నడూ ఏదీ చెప్పరు కాబట్టే అనేక మార్గాల్లో తనకి కావలసిన సమాచారం రాబట్టాలని తెలుసు. అందుకే ఆయన్ని ఛిన్నమస్తాదేవి గురించి అడిగారు. 'నేను మేదినీపూర్‌కి ఇటీవలే వెళ్లి వచ్చాను. ఛిన్నమస్తాదేవి మా కులదేవత. నాకు ఆ తల్లి గురించి ఏమీ తెలియదు, ఆమె గురించి మీరే నాకు చెప్పగలరు! ఆ దేవత ఎవరు, గురూజీ? ఆమె దయని నేను ఎలా సంపాదించగలను? ఆ మహాసాధకుల అడుగుజాడల్లో నడవడానికి నాకు మార్గం ఉపదేశించండి!' అని అడిగాడు భోలే.

'ఛిన్నమస్తా దేవి యోగులకు రక్షణనిస్తుంది. ఆమె యోగసిద్ధిని కలుగజేస్తుంది. కానీ ఆమె నిన్ను నీ శిరస్సుని అర్పించమంటుంది. నీ శరీరాన్నీ, రక్తాన్నీ తన అనుచరులకు అర్పించమంటుంది. అప్పుడు ఆమె నీకు అమరత్వాన్ని అనుగ్రహిస్తుంది. ఈ సాధనకి నీకు రెండు జీవిత కాలాల సమయం తీసుకుంటుంది.'

భోలే విస్మయానికి అంతులేదు. తల తిరిగిపోతోంది అతనికి. బాబాజీ ఇంకా సాధనలోనే ఉన్నారా? సాధన మధ్యలో ఆయన మరణించి మళ్లీ తిరిగి జన్మించారా? అయితే మేదినీపూర్‌లో జన్మించిన వ్యక్తీ, ఈయనా ఒకరేనా? ఒక జీవితంలో సాధనని మరొక జన్మలో కూడా కొనసాగించడం ఎలా సాధ్యం? ఈ విధంగా సగం పూర్తి చేసిన సాధనలో గత జన్మలో సాధన ఎక్కడ ఆగిందో గుర్తుంచుకుని తర్వాత జన్మలో అక్కడ నుంచి మిగతా సాధనని కొనసాగించడం సాధ్యపడుతుందా ఎవరికైనా? సాధన ముగిసిన తర్వాత వచ్చే అనుభవం, జ్ఞానం, లేదా సిద్ధులు ఎలా ఉంటాయి? భోలే ఈ ప్రశ్నల్ని అడగడానికి ప్రయత్నించాడు. కానీ తన గురువు చుట్టూ ఆవరించుకుని ఉన్న మౌనమనే కంచుకోటని భోలే సందేహాలు ఛేదించలేకపోయాయి.

ఓ రోజు అకస్మాత్తుగా, బాబాజీ భోలేకి పవిత్ర గయా క్షేత్రంలో ఫాల్గు నదీ తీరంలో గులకరాళ్ల గుట్ట మీద నివసించే సాధువు వద్దకు వెళ్లమని చెప్పారు. హైందవ మత విశ్వాసం ప్రకారం ఈ నది అత్యంత పవిత్రమైనది, వర్షా కాలంలో తప్ప ఈ నదీపరీవాహ ప్రాంతంలో నీరు ఉండదు, పూర్తిగా ఎండిపోయి ఉంటుంది. కానీ అక్కడి ఇసుకలో ఒక గొయ్యి తీస్తే, కొన్ని నిముషాల్లో త్రాగడానికి పరిశుభ్రమైన మంచినీరు వస్తుంది.

ఆ సాధువు అక్కడికి వచ్చినపుడు అతడి చేతిలో ఓ కమండలం గానీ, మరో కొల్లాయి బట్టగానీ లేవు. గయ చుట్టుప్రక్కల ప్రాంతంలో ఎవరికీ కూడా ఆ మహా సాధువు ఎక్కడ నుంచి వచ్చిందీ తెలియదు. దూరప్రాంతాల్లో ఉన్న దేవాలయాలను సందర్శించి అక్కడికి వచ్చే యాత్రికుల వద్ద నుంచి ఆయన గులకరాళ్లు, ఇటుక ముక్కలు సేకరించేవారు. వాటితో ఆయన నదీతీరంలో ఓ గుట్టలా పేర్చుకుని దాని మీద కూర్చుని శూన్యంలోకి చూస్తుండేవారు. మొదట్లో అతడిని చూసిన పూజారులు, ఇతరులంతా అతడినొక పిచ్చివాడిగా భావించారు. అందువల్లే అతడి గురించి ఎవరూ పట్టించుకోలేదు. కానీ త్వరలోనే తమ భావన తప్పనే సంగతి వారికి అర్థమైపోయింది. ఆ సాధువు చాలా నెమ్మదిగా, శాంతంగా ఉండేవారు. తన కార్యకలాపాలన్నీ ఒక నిర్దిష్టమైన సమయానికి పూర్తి చేసుకునేవారు. ప్రతిరోజూ మిట్టమధ్యాహ్నం సమయంలో ఆయన ఆ నదీ గర్భంలోకి వెళ్లి తన చేతులతో ఇసుకని త్రవ్వి గొయ్యిగా చేసేవారు. దానిలో నీరు నిండిన తర్వాత ఆ నీటిని సేవించి తిరిగి వచ్చి ఆ గుట్ట మీద కూర్చునేవారు. ఆయన గొయ్యి త్రవ్వక ముందు ఎవరైనా ఆయనకు భోజనం పెడితే, ఆయన దాన్ని నేల మీద ఉంచేవారు, దాన్ని జాగ్రత్తగా ఉంచుకోవాలనే భావన ఆయనకి ఉండేది కాదు. కుక్కలు, కాకులు, లేదా ఇతర జీవులు ఏవైనా ఆ ఆహారం కోసం వచ్చి తిని పోతున్నా ఆయన పట్టించుకునేవారు కాదు. అందువల్ల ఆ సాధువు నీళ్ల కోసం గొయ్యి తీసి, నీరు నిండడం కోసం వేచి ఉన్న సమయంలో భోజనం పెడితే ప్రయోజనం ఉంటుందని ప్రజలకి అర్థమైంది. ఎవరైనా ఎప్పుడైనా మంచిమాటలు చెప్పమని ప్రాధేయపడుతుంటే తప్ప సాధారణంగా ఆయన ఎప్పుడూ మౌనంగానే ఉండేవారు. అలాంటి అరుదైన సందర్భాల్లో ఆయన 'దు, దు, దు, దు, దు...' అనే ధ్వని చేస్తుంటేవారు. ఆయన గులకరాళ్ల మీద కూర్చుంటారు కాబట్టి అక్కడి ప్రజలు ఆయన్ని 'కంకరియా బాబా' (గులకరాళ్ల బాబా) అని పిలిచేవారు. పిల్లలు ఆయన్ని 'పాగల్ బాబా' (పిచ్చి బాబా) అని పిలిచేవారు.

భోలే ఈ సాధువుని కలిసి శిరస్సు వంచి భక్తి ప్రపత్తులతో ప్రణామం చేశాడు. కానీ ఆయన దగ్గర నుంచి ఎలాంటి సమాధానమూ లేదు. భోలే ఓపిగ్గా కూర్చుని నిరీక్షించసాగాడు.

చివరికి నడిరాత్రివేళ 'ఇలా రా నాయనా!' అంటూ ఆ సాధువు పిలిచారు. బాబాజీ గురించి మాట్లాడుతూ, ఆయన భోలేతో, 'శ్రీ మహారాజ్‌జీ ప్రస్తుతం ఉన్న పవిత్ర భూభాగం ఏది?' అని అడిగారు.

భోలే అత్యాశ్చర్యంతో అడిగాడు, 'మీకు మా గురుదేవులు తెలుసా స్వామీ?' అని.

'ఆ...ఎందుకు తెలియదు? ఈ భూమ్మీద జరుగుతున్న విషయాలు గమనించేవారికి ఆయన గురించి తెలియకపోవడమా?' అన్నారు.

భోలేకి సందేశం అందింది– ఈ సాధువు ముఖత: నేను ఆయన గురించి తెలుసుకోవాల్సిన విషయం ఏదో ఉందని నా గురువు భావించారనమాట! అప్పుడాయన తన గురువునీ, గురు భ్రాతల్నీ బాబాజీ గురించి అడగడం, కానీ వాళ్లందరికీ ఆయన మేదినీ పూర్‌లో జన్మించడం, ఆ తర్వాత ఆయన తన గురువర్యులతో కలిసి హిమాలయాలకు వెళ్లడం, దారిలో ఛిన్నమస్తాదేవి ఆలయం వద్ద ఆగడం తప్ప మరే ఇతర విషయాలూ తెలియలేదని ఆ సాధువుతో చెప్పాడు. 'నాకు నా పరమ గురువు గురించిన వివరాలు కావాలి. ఆయన ఎక్కడ నివసిస్తున్నారు? అసలు ఛిన్నమస్తాదేవి మర్మం ఏమిటి? మా గురువర్యుల గురించి తెలుసుకోవాలని ఆర్తిగా ఉంది,' అని అన్నాడు భోలే.

'సమయం ఆసన్నమైనపుడు బాబాజీ తానే స్వయంగా నీకు మీ పరమ గురువు గురించి చెప్తారు. ఆయన దగ్గరకు వెళ్లడానికి సహాయపడతారు కూడా. ఈ రాత్రి నీకు నేను ఛిన్నమస్తాదేవి గురించీ, మీ గురువు గురించీ చెప్తాను,' అన్నారాయన.

'ఛిన్నమస్త' దశ మహావిద్యల్లో (ఉత్కృష్టమైన తంత్ర సాధనలు) ఒకటి. అత్యంత కఠోరమైన దీక్షతో మహోన్నత స్థితికి చేరుకున్న యోగులు మాత్రమే పరమ జ్ఞానాన్ని ప్రసాదించే ఈ సాధన చేయడానికి సాహసిస్తారు. పైగా ఈ సాధనలోకి రావడానికీ, తుదివరకూ కొనసాగించడానికీ మరణభయం జయించిన సాహసికులే ఉద్యుక్తులవుతారు. ఈ అభ్యాసానికి మరణం ఒక ఆటంకం కానే కాదు. పైగా అది శివునిపై నిలబడిన దివ్య మాత ఛిన్నమస్తాదేవిని చేరుకునేందుకు తీసుకుని వెళ్లే అంతరంగ రహస్య మార్గం.

'ఈ సాధన చేస్తూ ఉండగా మరణానికి సంబంధించిన మూడు మార్గాల గుండా ప్రయాణించాల్సి ఉంటుంది. సాధన మాత్రం కొనసాగిస్తూనే ఉండాలి. మొదటిది, మరణం సమీపించక మునుపే నువ్వు శరీరాన్ని స్వచ్ఛందంగా వదిలేయాలి, జనన ప్రక్రియ ద్వారా వేరే శరీరాన్ని ధరించాలి. యోగ సంప్రదాయంలో ఈ పద్ధతిని పరకాయ ప్రవేశం అని అంటారు.

'మరో విధానం మామూలుగా మరణించడం! సర్వసమర్థుడు, పరిపూర్ణ సాధువు నీకు ఈ రూపాంతరణ సమయంలో తోడుగా ఉంటాడు, ప్రాకృతిక బలాల్ని పక్కకు తోసేస్తూ అతడు నీ లక్ష్యానికి నిన్ను చేరువగా తీసికెళ్తాడు. నువ్వు తిరిగి ఎప్పుడు ఎక్కడ ఎవరికి జన్మించాలో నిర్ణయిస్తాడు. గర్భంలో ఉన్న సమయంలో తొమ్మిదవ మాసంలో నువ్వు నిద్రకి ప్రభావితుడివి కాకుండా నిరోధిస్తాడు. అతడు ఇంతకు ముందు జీవితంలో నువ్వు సాధించిన జ్ఞానాన్నంతా భద్రంగా దాచి ఉంచుతాడు. ఈ కొత్త శరీరంలో మెదడు పరిపక్వ స్థితికి చేరుకుంటున్న కొద్దీ అతడు నీ జ్ఞానాన్ని నీకు అందిస్తూ ఉంటాడు. ఈ దశ జరుగుతున్నంత కాలం నీ బదులు నీ గురువు సాధన చేస్తుంటాడు. సరైన సమయం రాగానే అతడు నీకు దీక్ష ఇస్తాడు, నువ్వు సాధన మొదలుపెడతావు.

'మూడవ మార్గం ఏమిటంటే మరణానుభూతి గుండా ప్రయాణిస్తూ కూడా శారీరికంగా జీవించే ఉండడం! అజ్ఞానికి సామాజిక మరణం, భౌతిక మరణం కంటే కూడా ఎంతో బాధాకరమైనది. ఒకడి కీర్తి ప్రతిష్ఠలు నాశనమైనపుడు, సామాజికంగా అవమానాల పాలైనపుడు,

ప్రేమిస్తున్నవారి చేతుల్లోనే అవమానం పొందినపుడు, ఉన్నట్టుండి ప్రజలు నీ గురించి తమ అభిప్రాయాన్ని మార్చుకున్నపుడు, నీది కాని స్వభావాన్ని నీదిగా ఆపాదించినపుడు కలిగే స్థితి మరణం! పాత స్వభావం అదృశ్యం కావడం, కొత్త రూపం కనిపించడం!

'బాబాజీ అత్యంత అరుదైన సిద్ధుల్లో ఒకరు. ఆయన ఆ దేవతలో ఐక్యమై జీవించిన సిద్ధులు! ఆయన చిరంజీవులు. ఆయన మృతుల్ని తిరిగి సజీవులుగా చేయగలిగిన మహానుభావులు. ఆయన తన గురుభ్రాత 'ప్రిన్స్ స్వామి, భవాల్ సన్యాసిని అలాగే పునర్జీవితుల్ని చేశారు.'

ఆ రాత్రంతా భోలే ఆ సాధువు దగ్గరే గడిపారు. బాబాజీ ఛిన్నమస్తాదేవి ఆలయంలో ఛిన్నమస్త సాధన జరుగుతూ ఉండగా బాబాజీ గురువు ఆయనకు సన్యాసం ఇచ్చారనీ, ఆ సమయంలోనే బాబాజీ గతమంతటినీ ఆయన యోగాగ్నిలో దగ్ధం చేశారనీ ఆ సాధువు భోలేకి చెప్పారు. సన్యాస ప్రక్రియలో భాగంగా ఆయన దహన క్రియలు, దహనానంతర క్రియలూ కూడా జరిపారు. దాంతో ఆయన పూర్తిగా 'బాబా ధరమ్ దాస్'గా మారిపోయారు. ఆ తర్వాత నుంచీ బాబాజీ తిరిగి వెనక్కి చూడలేదు. ఆయన ఎక్కువ భాగం డార్జిలింగ్‌లో తన గురువు వద్దనే ఉండిపోయారు. అక్కడ నుంచి ఆయన సిక్కిం వెళ్లారు. చివరగా టిబెట్ వెళ్లి తన గురువుతో బాటు అక్కడే చాలా కాలం ఉండిపోయారు.

భోలే బాబాజీ వద్దకు తిరిగి వెళ్లిన తర్వాత, వెంటనే అడిగాడు, 'ఈ కంకరియా బాబా ఎవరు? ఆయనే నా పరమగురువా? నాతో వేళాకోళం ఆడారా?' అని అడిగాడు. కంకరియా బాబా తన పరమగురువుతో సమానమని అన్నారు బాబాజీ. చాలా కాలం క్రితం రామకృష్ణ పరమహంసకి దీక్షనిచ్చినవారు సుప్రసిద్ధ యోగి శ్రీ తోతాపురీ. ఛిన్నమస్తా దేవి ఆలయంలో బాబాజీకి సన్యాసదీక్ష ఇస్తున్నపుడు తోతాపురీ అక్కడే ఉన్నారు, దీక్ష ఇస్తున్నపుడు ఆయన బాబాజీ గురువు ప్రక్కనే నిలబడి బాబా ధరమ్ దాస్ పేరుతో సన్యాస దీక్ష తీసుకున్న బాబాజీపై ఆశీస్సులు కురిపించారు.

దీక్ష తీసుకున్న తర్వాత తోతాపురి టిబెట్‌లో తమ పరమగురువు వద్ద మరో నలుగురు సాధువులతో కలిసి ఏడు సంవత్సరాల పాటు ఉండిపోయానని బాబాజీ భోలేకి చెప్పారు. ఆ తర్వాత తన గురువు ఆదేశంతో బాబాజీ తోతాపురితో కలిసి భారతదేశంలోని వివిధ ప్రాంతాల్లో గల వందలాది దేవాలయాల్ని సందర్శించారు.

బాబాజీ ఒక మార్మికమైన జీవనం గడిపారు. హిమాలయాలు ఆయనకు బాగా ఇష్టమైన ప్రాంతం అయినప్పటికీ, ఆయన తరచుగా శీతాకాలంలో భారతదేశంలోని మైదాన ప్రాంతాలకు వెళ్తుండేవారు. కానీ జనసమూహాలు తనను కలవడానికి వస్తే తప్పించుకునేవారు. అలాగే ఆయన గృహస్థులతో కలిసి ఉండడం కూడా అత్యంత అరుదుగా జరిగేది.

పాడుబడ్డ దేవాలయాలు, ఏకాంత నదీతీరాలు, చెట్లు, గుహలు లాంటి ప్రకృతిసిద్ధమైన నివాసాల్లో ఉండడం ఆయనకు ఇష్టంగా ఉండేది. భారతదేశంలోనూ, హిమాలయ రాజ్యాల్లోనూ ఉన్న సాధువులందరికీ బాబాజీ పేరు బాగా సుపరిచితమే. కానీ ఆయన శిష్యులు, అనుచరగణంలో అనేకమంది రాజులు, యజమానులు ఉండేవారు. ఆయన సందర్శనకి వచ్చినప్పుడల్లా ఉండడానికి వీలుగా ఆయన శిష్యుల్లో కొంతమంది సంపన్నులు నివాస ప్రాంతాలకు దూరంగా కుటీరాలు, సాధుమఠాలు కట్టించి ఉంచారు. బాబాజీ, బాబా ధరమ్‌దాస్ పేరుతో ఉండే రోజుల్లో ఉత్తర భారతదేశంలో అమర్ గఢ్ రాజు ఆయన కోసం ఒక సాధుమఠం కట్టించారు. ఆ రాజు బాబాజీ నివాసాన్ని అత్యంత సహజంగా ఉంచాలనుకున్నారు. అందుకే పెద్ద జలకుండం, ఒక కొండ, అరణ్యం, అటవీమృగాలు, ఇలా అన్నీ సహజంగా అమరి ఉన్న ప్రాంతాన్ని ఎంపిక చేశారు. అందుకని ఈ సాధుమఠాన్ని 'సాధు కీ కుటియా' అనే పేరుతో పిలిచారు. ఇది మానవ నిర్మిత

సరస్సు పక్కన చుట్టూ ఎత్తైన ప్రాంతం, లోపల అనేక గుహలతో సహా అద్భుతంగా నిర్మింపబడింది. అది ఇప్పటికీ అక్కడ ఉంది. సాధుమఠం సుమారు మూడు వందల ఎకరాల్లో నిర్మింపబడింది. చుట్టూ అతి పెద్ద వ్యవసాయ క్షేత్రం ఉంది. బాబా ధరమ్‌దాస్ అక్కడ ఉన్నా లేకపోయినా, ఆ సాధుమఠం ఆయన గౌరవార్థం సంవత్సరానికి ఒకసారి *భండారా* (సాధువు చేతి ప్రసాదంగా చేసే భోజనం) నిర్వహింపబడుతుంది.

కాలం గడుస్తున్న కొద్దీ అది సాధువులు సంచారానికీ, ఆధ్యాత్మిక శక్తులు కోరుకునే సాధకులకీ ఆశ్రయమిచ్చే రక్షణస్థలంగా మారింది. బాబా ధరమ్‌దాస్ ఆ ఆశ్రమ బాధ్యతల్ని చూసుకోవడానికి తన శిష్యుల్లో ఒకరైన బాబా కరమ్ దాస్‌ని నియమించారు. బాబా కరమ్ దాస్ తర్వాత బాబా ఫూలర్ దాస్ ఆశ్రమ బాధ్యతల్ని తీసుకున్నారు. ఆయన సన్యాస దీక్ష తీసుకోక ముందు అక్కడికి దగ్గరలో ఉన్న ఒక గ్రామంలో నివసించేవారు. అక్కడికి రాక ముందు బాబా ధరమ్ దాస్ ఎవరో, ఆయన పుట్టింది, పెరిగిందీ ఎక్కడో ఆ సాధు ఆశ్రమంలో ఎవరూ ఎరగరు. ఆయన పేరులో చివర 'దాస్' ఉండడం వల్ల ఆ ప్రాంత ప్రజలు బాబా ధరమ్ దాస్‌నీ, ఆయన శిష్యుల్నీ పదిహేనవ శతాబ్దికి చెందిన సంత్ కబీర్ దాస్ పరంపరకి చెందినవారని భావిస్తారు. వారి గురించి మరి కొంత బాగా తెలిసివారు ఆయన నాగ సాధువనీ, ఆయన వైరాగి పరంపరకి చెందినవారనీ అంటారు. ఎందుకంటే పేరులో చివర 'దాస్' చేర్చుకుని ఉన్న సాధు పరంపర వైరాగి సంప్రదాయానికి చెందినవారు. బాబా ధరమ్ దాస్ ఎలాంటి కర్మకాండనీ ప్రోత్సహించలేదు. అరుదుగా బట్టలు ధరించేవారు, నాగా ప్రాంతమైన అయోధ్యలో ఉండేవారు.

తరతరాలుగా మా కుటుంబానికి అమర్ గఢ్‌లో రాచకుటుంబంతో ఎక్కువ సాన్నిహిత్యం ఉంది. మా నాన్నగారు ఈ కుటుంబానికి మంచీ చెడూ చెప్పి, ఆధ్యాత్మిక పథాన్ని నిర్దేశించే రాజ పురోహితులుగా ఉండేవారు. బాబా ధరమ్ దాస్ శిష్యునికి శిష్యులైన బాబా ఫూలర్‌దాస్ సాధుమఠంలో చేరక ముందు నాకు చిన్ననాటి స్నేహితుడు, సహచరుడు. మా నాన్నగారు బాబాజీ ఎక్కడివారు, ఏం చేసేవారనే విషయాలపై బాబా ఫూలర్‌దాస్‌తో తీవ్రంగా వాదించేవారు. మా నాన్నగారు అనేవారు, 'ఫూలర్ దాస్! నువ్వు చాలా తెలివితక్కువగా మాట్లాడుతున్నావు. బాబా ధరమ్ దాస్ స్వామి గురించి నీకు అసలేమీ తెలియదు. ఆయన ఏ సంప్రదాయానికీ, ఏ పరంపరకీ చెందినవారు కాదు. ఆయనకి ఆయనే ఒక సంప్రదాయం, ఒక పరంపర. మన సంస్కృతం మాస్టారు పండిట్ భోలా దత్త తర్వాత నాకు గురువయ్యారు. ఆయన బాబాజీ గురించి ఏం చెప్పేవారో తెలుసా? బాబాజీ అసలు పేరు స్వామీ మధ్వానంద భారతిట! ఆయన ఒక గొప్ప సాధువుట. ఆయన శంకరాచార్య సంప్రదాయానికి చెందినవారట!' దానికి సమాధానం ఇస్తూ బాబా ఫూలర్ దాస్, 'నేను ఆయన ప్రశిష్యుడిని! ఆయన గురించి నాకు తెలుసా, మీకు తెలుసా? నేను కబీర్ పంథీని! కబీర్ సంప్రదాయానికి చెందినవాడిని! బాబా కరమ్ దాస్ నా గురువు. ఆయన గురువు బాబా ధరమ్ దాస్. నా గురువు గానీ, నా పరమ గురువుగానీ ఏ నాడూ మీ సంస్కృత గ్రంథాల్ని ప్రమాణంగా స్వీకరించలేదు,' అని అరిచేవాడు.

'బాబాజీ శాస్త్ర గ్రంథాల్ని ఎన్నడూ పట్టించుకోలేదు. శాస్త్ర గ్రంథాలన్నీ ఒక రూపు దాలిస్తే ఒక బాబాజీ! తెలుసా!' మా నాన్నగారు మళ్లీ అరిచారు. 'అంతే కాదు, ఆయనకు నీలాంటి అజ్ఞానులతో ఎలా వ్యవహరించాలో బాగా తెలుసు. జ్ఞానం ఉన్నవాళ్లెవరూ అనర్ఘ రత్నాల్ని పందుల పాలు చేయరు. ఆయన 'కబీర్ పంథీ' సాధువు కారని నేను అనడం లేదు. ఆయన అంత కంటే ఎక్కువ. నువ్వు, నేను, మరెవ్వరూ ఊహించలేనంత గొప్ప వ్యక్తి. కబీరు పంథీ సాధువులు తెల్లని బట్టలు ధరిస్తారు. కానీ బాబాజీకి అలాంటి బట్టల పట్ల ప్రత్యేకమైన

శ్రద్ధ లేదు. బాబాజీ ధుని ఎదురుగా కూర్చుని ఉంటారు. ఆయన భస్మం పూసుకుంటారు. కబీర్ పంథీలు అలా ఎన్నడూ భస్మం ధరించడం జరగదు.'

'పైగా ఫూలర్ దాస్ అనేది బాబాజీకి గల మరో పేరు. చాలా ఏళ్ల క్రితం నేను వింధ్యాచలాన్ని సందర్శించాను. ఉత్తర ప్రదేశ్‌లోని మీర్జాపూర్ జిల్లాలో ఇది ఒక ప్రముఖమైన శక్తి దేవాలయం. అక్కడ రెండు గదులున్నాయి. నేను స్వయంగా కళ్లారా చూసి వచ్చాను. ఒక గదిలో కృష్ణ, కాళి విగ్రహాలతో ఒక మందిరంగా ఉంది. రెండవది, బాబాజీ కోసం నిర్మింపబడింది. బాబాజీ గదికి దారి తీసే తలుపు మీద తాపడం చేసి ఉన్న ఫలకం కనిపిస్తుంది. దాని మీద ఇలా వ్రాసి ఉంటుంది–

> *ఈ కృష్ణ కుటీ 1917లో జమీందారీ సర్వరీ ఎస్టేట్ ద్వారా గోరఖ్‌పూర్ జిల్లాలో బెంగాలీ బ్రుథా బాబా స్వామి పూర్ణానందజీ కోసం నిర్మించబడింది.*

'ఇదంతా తికమకగా ఉంది. ఇప్పటి వరకు నేను బాబాజీని స్వామి మధ్వానంద అనే పేరుతో విన్నాను. ఆయన పేరు 'పూర్ణానంద' అని వ్రాయబడి ఉంది తాపడం మీద. అప్పుడు నేను మా గురువర్యులు పండిట్ భోలాదత్తని ఆయన అసలు పేరు మధ్వానందా లేక పూర్ణానందా అని అడిగాను,' అన్నారు నాన్నగారు. ఆయన నా మాటకి జవాబివ్వకుండా, 'భగవంతుడికి వెయ్యి పేర్లు ఉంటాయి. బాబాజీకి కనీసం డజను పేర్లయినా ఉండకూడదా?' అన్నారు.

బాబాజీ నిరంతర సంచారులు. ఆయన కోసం ఎన్నో చోట్ల నివాస స్థానాలు ఏర్పాటు చేయబడినప్పటికీ, ఒక చోట ఉన్నవారికి వేరే ప్రదేశాల్లో ఆయనకు గల పేర్లు, ఆయన మెలిగే తీరు వంటి వివరాలేమీ తెలియవు. బాబాజీ ఎన్నడూ తనకంటూ ఒక అనుచర గణాన్ని ఏర్పాటు చేసుకోలేదు. ఎలాంటి సామాజిక, ధార్మిక కార్యకలాపాల్లోనూ ఆయన పాల్గొనేవారు కాదు. ఆయన చుట్టూ జనం చేరడాన్ని అనుమతించేవారు కాదు. ఈ ఐహిక ప్రపంచపు అనిత్యత బోధపడి వైరాగ్యంతో పరిపూర్ణమైన యోగ్యత సాధించిన శిష్యులకే తప్ప బోధించేవారు కాదు ఆయన. వివిధ సమయాల్లో వివిధ ప్రదేశాల్లో ఆయన వేర్వేరు పేర్లతో సంచారం చేస్తుండేవారు. ఆ పేర్లలో ఐదు పేర్లు నాకు తెలుసు– *బెంగాలీ బాబా, బాబాజీ, బాబా ధరమ్ దాస్, స్వామీ మధ్వానంద, స్వామీ పూర్ణానంద.* ఇంకా చాలా పేర్లే ఉండి ఉండొచ్చనడంలో సందేహమే లేదు. ఎందుకంటే బాబాజీ తన గురించి ప్రపంచానికి తెలియకుండా ఎక్కువ జాగ్రత్తలు తీసుకునేవారు. కానీ ఆయన గురించి ప్రపంచానికి తెలియాల్సిన నేపథ్యం ఒకటి వచ్చేసింది.

ఇరవయ్యవ శతాబ్దపు తొలి భాగంలో ఆ సమయం రానే వచ్చింది, అదీ భవాల్ సన్యాసి కేసు రూపంలో! ఈ రోజు వరకూ ఆ కేసు 'భారతదేశంలో సంచలనం రేకెత్తించిన విచిత్రమైన విచారణ'గా పేర్కొనడం జరుగుతోంది. న్యాయస్థానానికి వచ్చిన అత్యంత సంచలనాత్మకమైన కేసు ఇది! 1993లో ప్రముఖ వారపత్రిక బ్లిట్జ్ మేగజైన్ ఈ కేసుపై వరుస వ్యాసాల్ని వెలువరించాయి.

కలకత్తా హైకోర్టు ముగ్గురు జడ్జిల్లో ఒకరైన సర్ ఎల్.డబ్ల్యు.జెకాస్టెలో, భవాల్ సన్యాసి కేసు విచారణ తర్వాత ఇలా తీర్పు ఇచ్చారు–

> *ఈ దేశంలో గానీ మరే ఇతర దేశంలోనే గానీ ఒక న్యాయస్థానం ముందు ఇలాంటి అపూర్వమైన కేసు రావడం ఎంతో ఆసక్తికరమైన, ప్రముఖమైన విషయం. చట్టచరిత్రలోనే ఇదొక అపురూపమైన కేసుగా నిలిచిపోతుందనడంలో ఆశ్చర్యమే లేదు.'* ప్రివీ కౌన్సిల్‌లో సన్యాసి వైపు

వాదనలు జరిపిన డి.ఎన్.ప్రిట్, బార్‌లో ఇప్పటిదాకా సాగిన తన సుదీర్ఘమైన విజయవంతమైన వృత్తి జీవితంలో ఇలాంటి వింత కేసుని ఎన్నడూ వాదించలేదని తెలిపాడు. 'ఇలాంటి వింత కేవలం భారతదేశంలోనే జరగడానికి అవకాశం ఉంది,' అన్నాడు.

ప్రిన్స్ భవాల్ సన్యాసి బాబా ధరమ్‌దాస్ శిష్యుడు, భోలేకి గురుభాయి. అతడు ఈ ఐహిక ప్రపంచాన్ని విడిచి పెట్టడం సన్యాసి కావడం అత్యంత అపూర్వమైన పరిస్థితుల్లో జరిగింది. బ్లిడ్జ్ ఈ కేసుని గురించి ఇలా వ్రాసింది–

*బెంగాల్‌లోని అత్యంత సంపన్నమైన జమీందారీల్లో ఒక జమీందారు వారసుడు మృతుడిగా ప్రకటింపబడ్డాడు. అతడికి శతాబ్ది తొలి దశకం చివరలో సంప్రదాయ విధానంలో దహన సంస్కారాలు జరపబడ్డాయి. పన్నెండేళ్ల తర్వాత, చాలా వింతగా అతడు తిరిగి ప్రత్యక్షమయ్యాడు. అతడి సోదరి, నాయనమ్మ అతడిని గుర్తించారు. కానీ అతడి భార్య అతడిని మోసగాడంటూ తిరస్కరించింది. తన ఆస్తి మీద తనకు హక్కు కావాలంటూ అతడు మూడవ దశాబ్దం చివరలో కేసు ఫైల్ చేశాడు. ఆ కేసుపై చివరికి జూలై 1946 లో ప్రివీ కౌన్సిల్ తీర్పు ఇచ్చింది. ఈ భవాల్ సన్యాసి కేసులాంటి కేసు ప్రపంచ న్యాయ చరిత్రలోనే అద్వితీయమైనదిగా పేర్కొనబడింది.*

ఈ కేసులో చనిపోయిన ప్రిన్స్ (రాకుమారుడు)ని తిరిగి బ్రతికించింది బాబాజీయే కావడంతో అనేకమైన విషయాలపై చర్చలు, ఊహాగానాలూ నడిచాయి. నిజంగానే అలాంటి అద్భుతాలు జరుగుతాయా? అలాంటి గురువులు నిజంగానే ఈ ప్రపంచంలో ఉన్నారా? వాళ్లని గుర్తించడం ఎలా జరుగుతుంది? బాబా దర్శన్‌దాస్, ఆయన శిష్యులు అటార్నీలు సంధించిన కఠినాతికఠినమైన ప్రశ్న పరంపరని తట్టుకుంటూ సాక్ష్యమిచ్చారు. భవాల్ సన్యాసి ఎలా కనుగొనబడ్డారో, ఏ విధంగా ఆయనని బ్రతికించడం జరిగిందో, ఎలా ఆయన సన్యాసి దీక్ష తీసుకున్నారో, ఎలాంటి శిక్షణ పొందారో, మళ్లీ తన ఇంటికి ఎలా పంపబడ్డాడో తెలియజేశారు. కొన్నేళ్ల అనంతరం ఈ కేసు తుది తీర్పు వెలువడింది. ఆ పై రెండు రోజుల తర్వాత భవాల్ సన్యాసి ఆకస్మికంగా మరణించాడు. ఈ సందర్భంలోనే వాస్తవంగా బాబాజీ ఎవరు, ఏమిటి అనే విషయాలు అందరికీ తెలిశాయి.

*బ్లిడ్జ్* పత్రికని అనుసరించి, భవాల్ సన్యాసి, సన్యాసం తీసుకోక మునుపు తూర్పు బెంగాల్‌లోని అత్యంత వైభవోపేతమైన రాజ్యాల్లో ఒకటైన భవాల్ రాజ్యానికి రాజు. ఆయన పేరు రామేంద్ర నారాయణ రాయ్ చౌధరి. ఆయన రాజుగా రికి రెండవ సంతానం. ప్రజలంతా ఆయనను 'మేజో కుమార్' అంటే, 'రెండవ కుమారుడు' అని పిలిచేవారు. ఆయన తన తల్లిదండ్రులు, ఒక అన్న, ఒక తమ్ముడితో కలిసి ప్రస్తుత బంగ్లాదేశ్ ముఖ్య పట్టణమైన ఢాకాకి ఇరవై మైళ్ల దూరంలో ఉన్న జయదేవపూర్‌లో ఒక విలాసవంతమైన భవనంలో ఉండేవారు. ఈ ప్యాలెస్ రాచ వైభవంతో మెరుపులీనేది. డాన్సింగ్ హాల్స్, మ్యూజిక్ రూమ్స్, ఏనుగుశాలలు, అశ్వశాలలు, ఓ చిన్నపాటి జూ కూడా ఉండేది. లెక్కలేనంతమంది సేవకులు, ఇరవై నాలుగు గంటలూ అందుబాటులో ఉండే డాక్టరు! వందిమాగధులు రాకుమారుల చుట్టూ తిరుగుతూ వారి గర్వాన్నీ, స్వీయ ప్రాముఖ్యతనీ గుర్తు చేస్తూ ఉండేవారు. ఇలా ఏం కావాలంటే అది సమకూరే వాతావరణంలో వారికి బోధించడానికి ఎంతోమంది గురువులు రాచమహల్‌కి వచ్చి

వెళ్లేవారు. వీరు ఆ మాస్టర్ల వద్ద బెంగాలీలోనూ, ఇంగ్లీషులోనూ తమ పేర్లతో సంతకం చేసుకోవడం దాకా మాత్రమే నేర్చుకోగలిగారు. రాజు 1901 సంవత్సరంలో చనిపోయినపుడు, రామేంద్రకు కేవలం పదిహేడేళ్లే! తండ్రి మరణంతో రాకుమారుడి మీద అప్పటివరకూ ఉన్న ఏ కొద్దిపాటి ఆంక్షలో అవి కూడా లేకుండా పోయాయి. దాంతో అతడి ఇంద్రియ భోగవిలాసాలకి అడ్డూ అదుపూ లేకుండా పోయింది. రాత్రిళ్లు మద్యపానంతోనూ వేశ్యలతోనూ, ఉదయం పూట అశ్వచాలనం, వేట వంటి వ్యాపకాల్లోనూ గడిపేవాడు.

పద్దెనిమిది ఏళ్లు వచ్చేసరికి రామేంద్ర ఒక అందమైన పదమూడేళ్ల అమ్మాయిని వివాహమాడాడు. కానీ ఈ పెళ్లి అతని సరసన చేరే ఆడవాళ్ల నుంచి తప్పించలేకపోయింది. అతడికి సుఖ రోగాలు పట్టుకున్నాయి. అతడి ఆరోగ్యం దెబ్బతిన్నది. తమ ప్యాలెస్ డాక్టరు దాస్ గుప్తా, బావమరిది సత్యేంద్ర నాథ్ బెనర్జీతో కలిసి వైద్యం కోసం అతడు కలకత్తాకి వెళ్లాడు. ఆ తర్వాత బావమరిది సలహాతో ఆరోగ్యం మెరుగుపరుచుకునేందుకు తూర్పు హిమాలయాల్లో డార్జిలింగ్‌కి వెళ్లాడు. రాకుమారుడి బావమరిది సత్యేంద్ర అన్ని రకాల ఏర్పాట్లూ చేశాడు. ప్రిన్స్ ఆ ప్రఖ్యాత బంగ్లా స్టెప్ ఎసైడ్ (ఆ తర్వాతి కాలంలో ఇక్కడ భారతదేశంలో అత్యంత ప్రముఖుల్లో ఒకరైన డి.బి. చిత్తరంజన్ దాస్ ఇక్కడే ఉన్నారు. మహాత్మా గాంధీ, డా. అనీబిసెంట్ డార్జిలింగ్‌కి వచ్చినపుడల్లా ఇక్కడే ఉండేవారు) లో ఉన్నాడు.

ప్రిన్స్ ఆరోగ్యం క్షీణించసాగింది. ఓ ప్రక్క రక్త విరేచనాలు అవుతున్నాయి. మరో మూడు వారాల్లోపే 8 మే 1909 న ఇరు కుటుంబాల వైద్యులైన దాస్ గుప్తా, డార్జిలింగ్ సివిల్ సర్జన్ అయిన లెఫ్టినెంట్ కల్నల్ కాల్వర్ట్‌లు అతడిని మృతుడిగా ప్రకటించారు. దహన క్రియలు మే 9 న జరపాలని నిర్ణయించడం జరిగింది. ఒక జలప్రవాహం తీరంలో చితి సిద్ధం చేయబడింది. శవాన్ని చితి మీద ఉంచారు. శవం మీద కట్టెలు పేర్చారు. కానీ చితి వెలిగించగానే, కుండపోత వర్షం అందుకుంది. వర్షం ఆగిన తర్వాత మళ్లీ చితి మంట రగిలించమని కొంతమంది నౌకర్లకు పురమాయించి రాకుమారుడి బావమరిది, డాక్టరు, మిగతా బంధువులు, స్నేహితులూ వర్షంలో తడవకుండా ఉండేందుకు స్థావరం వెతుక్కుంటూ అక్కడి నుంచి వెళ్లిపోయారు. కానీ అప్పుడు ఆ వర్షం మరింత విపరీతమై, చితి వర్షంలో కొట్టుకుపోయింది. శవాన్ని కట్టేసి ఉంచిన పాడె ఆ పళంగా నీటి ప్రవాహంలో తేలుతూ తేలుతూ చివరికి కొట్టుకుపోయింది. పరిచారకులు ఉన్మాదుల్లా దాని వెనక పరుగుపెట్టారు, కానీ దాన్ని వెనక్కి తీసుకుని రాలేకపోయారు వాళ్లు. వాళ్లు ఈ సంగతిని ప్రిన్స్ బావమరిదికి చెప్పినపుడు, సత్యేంద్ర మొదట ఈ సమాచారాన్ని నమ్మలేదు. దహన క్రియలు పూర్తి అయ్యాయని ప్రకటించాడు.

ఆ శవం వాలు ప్రవాహంలో ఎన్నో మైళ్లు కొట్టుకుపోయి మరో నలుగురు సాధువులతో కలిసి బాబాజీ ఉంటున్న గుహ దగ్గర తీరంలో నిలిచింది. ఆ సాయంత్రం ఆ సాధుబృందానికి నదీ తీరంలో ఏదో వింత శబ్దం వినిపించింది. బాబాజీ తన శిష్యుల్లో ఇద్దరిని అక్కడికి పంపాడు. బాబా దర్శన్ దాస్, బాబా లోక్ దాస్‌లు అదేమిటో చూడడానికి వెళ్లారు. అది నదీ తీరానికి కొట్టుకుని వచ్చిన పాడె గురించీ, దాని మీద కట్టబడి ఉన్న శవం గురించీ తెలియజేశారు. ఆ వ్యక్తి తన శిష్యుడనీ, ఆ శవాన్ని తీసుకుని రావలసిందనీ బాబాజీ తన శిష్యులతో చెప్పారు. ఆ సాధువులు పాడె కట్లని విప్పి, శవాన్ని గుహలోకి మోసుకుని వచ్చారు. శవంపై తడిసి ఉన్న బట్టల్ని మార్చి, పొడి దుస్తులు వేశారు. ఆ తర్వాత అతడిని దగ్గరలో ఉన్న ఒక గ్రామస్తుడి ఇంటికి చేర్చారు. బాబాజీ అతడి తల వెంట్రుకల్ని పూర్తిగా తొలగించి తల మీద కొన్ని రకాల వనమూలికల్ని కపాల భాగానికి రాశారు. ఆ మనిషి మెల్లగా శ్వాసించడం మొదలుపెట్టాడు. ఒక మనిషిని ఈ విధంగా రక్షించారనే వార్త గ్రామమంతా క్షణాల్లో పాకింది. జన సమ్మర్థాన్ని

తప్పించుకునేందుకు బాబాజీ తన శిష్యులతో స్పృహలో లేని ఆ వ్యక్తిని ఇంకా పర్వతపాద ప్రాంతంలోని మరో గ్రామానికి చేర్చమని చెప్పారు. మరో మూడు రోజుల్లో అతడికి స్పృహ వచ్చింది. కానీ అతడు పూర్తి మతిమరుపు స్థితిలో ఉన్నాడు. మరి కొద్ది రోజుల తర్వాత అతడికి వారితో కలిసి నడిచేంత బలం వచ్చింది. అప్పుడు ఆ సాధువుల బృందం అక్కడి నుంచి వెళ్లిపోయింది.

ఆ విధంగా తిరిగి లేచిన భవాల్‌ని ఇప్పుడు బాబా ధరమ్‌దాస్ చంటి పిల్లాడిని సాకినట్టు సాకుతున్నాడు. బాబాజీ, మిగతా సాధువులు అతడికి జీవితంలో మౌలికంగా ఉండాల్సిన నైపుణ్యాలు, హిందీ అ, ఆ, ల దగ్గర నుంచి అన్ని విషయాలూ మొదటి నుంచీ బోధించారు. అతడు చాలా వేగంగా నేర్చుకునేవాడు. కొద్ది సంవత్సరాల్లోనే అతడు హఠయోగంలో గొప్ప పట్టు సాధించాడు. రసవాదం, ప్రాచీన భారతదేశ వైద్య విధానమైన ఆయుర్వేదం ప్రజ్ఞని సాధించాడు. ఈ విజ్ఞానాన్ని అన్వయించుకుంటూ ఇప్పుడు సరి కొత్తగా అనుశాసనబద్ధంగా నడుచుకుంటున్న ప్రిన్స్ ఎంతో ఆరోగ్యంతో మిసమిసలాడే నందిలా ఉన్నాడు. బాబాజీ సాన్నిహిత్యంలో అతడు విస్తారమైన హిమాలయ పర్వత శ్రేణులు, వింధ్య పర్వత శిఖరాలు, ఉత్తర భారతదేశమం ఇలా అంతటా సంచరిస్తూ ఉండేవాడు. వాళ్లు కాశ్మీరులోని పవిత్రమైన అమరనాథ్ దేవాలయానికి చేరుకునేసరికి సుమారు నాలుగు సంవత్సరాల కాలం పట్టింది. అక్కడ బాబాజీ అతడికి ఒక నియమబద్ధమైన దీక్షనీ, ఆ తర్వాత మంత్ర దీక్షనీ కూడా ఇచ్చారు. మంత్ర దీక్ష పొందిన తర్వాత ప్రిన్స్ తను ఎక్కడ పుట్టాడో, తన తల్లిదండ్రులెవరో ఈ విషయాలన్నీ తెలుసుకోవాలని ఆరాట పడసాగాడు. బాబాజీని అతడు అనేక సందర్భాల్లో అడిగాడు కూడా. కానీ అతడికి బాబాజీ నుంచి ఒకే ఒక సమాధానం వచ్చేది. 'సరైన సమయం రానీ! నేనే నిన్ను మీ ఇంటికి పంపుతాను!'

ఇలా కొన్ని సంవత్సరాలు జరిగిపోయాయి. బాబాజీ నేపాల్‌లోని ప్రిన్స్ స్వామితో కలిసి బ్రచ్ఛత్రలో నివసించసాగారు. అప్పుడు ఆ స్వామికి తన ఇల్లు ఢాకాకి దగ్గరగా తూర్పు బెంగాల్‌లో ఎక్కడో ఉండాలని గుర్తుకొచ్చింది. బాబాజీ ఇది వినగానే, 'వెళ్లు. ఇంటికి వెళ్లే సమయం ఆసన్నమైంది,' అన్నారు. వెళ్లే ముందు బాబాజీ అతడితో, 'నువ్వు మాయావరణాన్ని ఛేదించగలిగితే మళ్లీ తిరిగి వెనక్కి వచ్చి మాతో చేరు!' అని చెప్పారు.

ఇప్పుడు 'ప్రిన్స్' నాగ సాధువు రూపంలో ఉన్నాడు. అతడి తలంతా జడలు కట్టి ఉంది. లాంటి మీద చిన్న లంగోటీ ఉంది. తల నుంచి కాలి గోళ్ల వరకూ శరీరమంతటా భస్మం రాసుకుని ఉన్నాడు. ఇంకా అతడికి తన బంధులెవరో, తన ఇల్లు ఉన్న ప్రదేశమేదో గుర్తుకు రావడం లేదు. కానీ ఆ ఇల్లు మాత్రం ఎక్కడో ఢాకా దగ్గరలో ఉండాలని మాత్రం గుర్తుంది. చివరికి, కొద్ది సంవత్సరాలు అలా గడిచిన తర్వాత, అతడు డిశెంబరు 1920లో ఢాకాకి చేరుకున్నాడు. అతడు ఆ నగర శివారు ప్రాంతానికి వెళ్లి ఒక చెట్టు క్రింద తన ధుని (మంట) రగిలించాడు. నాలుగు నెలలపాటు రాత్రీ పగలూ పద్మాసనం (ఆసనాల్లో వేసే పద్మం లాంటి భంగిమ) లో అగ్ని ముఖంగా కూర్చుని ఉన్నాడు. ఆయన చేతి మీద 'బాబా ధరమ్ దాస్ కా చేలా నాగా' (బాబా ధరమ్ దాస్ నాగా శిష్యుడు) అనే పచ్చబొట్టు ఉంది. ఆ నాగా సాధువుకీ, ప్రిన్స్ రామేంద్రకీ చాలా దగ్గర పోలికలు ఉన్నాయనీ, అతడే ప్రిన్స్ భవాల్ అనీ ప్రజలు కనిపెట్టారు.

ఈ వార్త కార్చిచ్చులా వ్యాపించింది. ప్రిన్స్ రామేంద్ర పాత స్నేహితుల్లో కాశింపూర్ రాజా అతన్ని గుర్తించాడు. జయదేబ్‌పూర్ ప్యాలెస్‌కి వాయవ్యంలో కొద్ది మైళ్ల దూరంలో ఉన్న ఒక చిన్న రాజ్యం కాశింపూర్. ప్రిన్స్ అక్కడే పెరిగాడు. రాజా సాధువుని తన స్వంత రాచభవనానికి తీసుకుని వెళ్లాడు. ఐదు ఆరు రోజుల తర్వాత అతడిని గజారోహణం చేయించి జయదేబ్‌పూర్‌కి గౌరవప్రదంగా పంపాడు. ప్రిన్స్ సాధువు ప్యాలెస్‌కి చేరుకున్న తర్వాత ఏనుగుని దిగి ప్యాలెస్‌కి

దగ్గరలో ఉన్న ఒక దేవాలయంలో కూర్చున్నాడు. అప్పటికీ అతడికి తానెవరో, ఆ ప్యాలెస్‌తో తన అనుబంధం ఏమిటో ఏమీ తెలియకుండా ఉంది. కానీ కొద్దిసేపటికే బంధువులు, సేవకులు, వందలాదిమంది ఆ ప్రాంత ప్రజలు అక్కడికి చేరుకున్నారు, ఆయనను ప్రిన్స్‌గా గుర్తించారు.

ప్రిన్స్ అక్కగారు ఆ వార్త వినగానే, ఎంతో ఆతృతతో సాధువుని ప్యాలెస్‌కి తీసుకుని రమ్మని తన కుమారుడిని పంపింది. అక్కడికి సాధువు వెళ్లగానే అతడు తన అక్కగారినీ, నాయనమ్మనూ గుర్తించాడు. తన తమ్ముడి ఫోటోని చూసి వెక్కిళ్లు పెడుతూ కన్నీరు కార్చాడు. ఈ పన్నెండేళ్ల కాలంలో ఆ తమ్ముడు మరణించాడు. తన అన్నగారు కూడా మరణించినట్టు తెలుసుకున్నాడు. ఇప్పుడు ప్యాలెస్‌లో కేవలం విధవలే ఉన్నారు. ఈ రాజ్యమంతా సంరక్షకుల ఆధ్వర్యంలోనే నడుస్తోంది. *బ్లిడ్జ్* రిపోర్టు ప్రకారం, 'సాధువుగా ఉన్న ఆ వ్యక్తిని 'ఎందుకు ఏడుస్తున్నావు?' అని అడిగితే, ఆ సన్యాసి దానికి 'మాయ నన్ను ఏడిపిస్తోంది,' అని చెప్పాడు.' 'కుమార్ రామేంద్ర నారాయణ్ మీరేనా?' అని అడిగిన ప్రశ్నకు, 'నేను మీకు ఏమీ కాను,' అని చెప్పాడు.

ఆయన తన కుటుంబాన్నీ, ప్యాలెస్‌లో ఉండే ఇతర వ్యక్తుల్నీ కలుసుకున్నపుడు అతడిలో భావోద్వేగాలు తుఫానులా చెలరేగాయి. అతడి జీవితానికి సంబంధించిన భూత, వర్తమాన కాలాలు సంఘర్షించాయి. అతడు మధ్యలో చిక్కుకున్నాడు. తను బాబా ధరమ్‌దాస్ శిష్యుడినని తెలుసు. కానీ తను ప్రిన్స్ భవాల్‌గా గుర్తింపబడుతున్నాడు. ఎలాగో ధైర్యం కూడగట్టుకుని, 'నేను మీకేమీ కాను,' అంటూ అతడు ప్యాలెస్ బయటికి వెళ్లిపోయాడు. ఢాకాకి తిరిగి వచ్చి, ధుని వేసుకుని తన సాధు జీవితాన్ని కొనసాగించాడు. కానీ ప్రజలు అతడిని విడిచి పెట్టలేదు. అతడి అక్కగారు అతడిని అనుసరించింది. ఏదో విధంగా అతడిని మళ్లీ ప్యాలెస్‌కి తిరిగి తీసుకొచ్చింది. ప్యాలెస్‌లో ఉండగా అతడు శరీరంపై భస్మధారణ చేయడానికి అనుమతి లేదు. పైగా అతడు సంప్రదాయబద్ధమైన రాచ వేషధారణలో ఉండాలి. రామేంద్ర చిన్నతనంలో బండి చక్రం వల్ల కలిగిన ప్రమాదంలో ముఖంపై ఒక చారిక ఉండేది. అక్కగారు అతడి ముఖంపై ఆ గుర్తు కోసం వెతికింది. ఇక ఆమెకు సందేహమే లేదు. ఈ సాధువే తన తమ్ముడు! కానీ సాధువు ప్యాలెస్‌కే తన జీవితాన్ని పరిమితం చేయాలని అనుకోవడం లేదు. బాబాజీ బృందంతో గడిపిన రోజుల్లో గల ఆనందకరమైన ఘడియలతో పోల్చుకుంటే ఆయనకు రాచరిక జీవితం నిస్సారంగా తోచింది.

పైగా ఆయనకు తన భార్య, తన బావమరిది 1909లో తనని చంపించడానికి ప్లాన్ చేశారనే సందేహం కూడా కలిగింది. అతనిలో ఉన్న రాకుమారుని ఆంతర్యం ఈ కుట్రని రచించినవారి విషయంలో ఏం చేయాలా అని నిర్ణయించడంలో నిమగ్నమైంది. ఆయనలో ఉన్న సాధువు ఈ విషయాలన్నింటినీ క్షమించి వదిలిపెట్టమనీ, కేవలం వైరాగ్యానికి సంబంధించిన విషయాల్నే ఆలోచించమనీ పోరుతున్నాడు. కానీ సాధువులో ఉన్న రాకుమార నైజం, 'పిరికివాడిగా ఉండకు. నువ్వు నీ కర్తవ్యాన్ని పాటించడానికి సిద్ధం కా! నీ హక్కుల గురించి పోరాడు. నీకు హక్కుగా చెందాల్సినదాన్ని నువ్వు పొందాల్సిందే. ఆ తర్వాత కావాలంటే నువ్వు వదులుకో!' అని ప్రేరేపిస్తోంది. ఈ విషయాల్ని పరిష్కరించడానికి సమయం లేనంతగా ఆయన చుట్టుప్రక్కల జనం ఉంటున్నారు. కానీ చుట్టూ ఎంత మంది ఉన్నా, ఆయన బాబాజీ తను వచ్చేటప్పుడు చెప్పిన 'నువ్వు మాయావరణాన్ని (భ్రాంతి పొర)ని ఛేదించగలిగితే మళ్లీ తిరిగి వెనక్కి వచ్చి మాతో చేరు!' మాటల్ని మాత్రం గుర్తు చేసుకుంటూనే ఉన్నాడు.

'మాయావరణం' అంటే ఏమిటి? అతడికి ఆలోచనల్లో నిద్ర కూడా మాయమైపోయింది. తను ఈ ప్రపంచంలోనే నివసించాలా లేక దీనికి ఆవలగా ఉండాలా? తను లౌకిక జీవనంలోకి రావడానికి తిరస్కరించాలా? ఆ విధంగా దానికి ఆవలగా జీవించాలా? అప్పటికే సాధువుకి తనకు సంబంధించిన జ్ఞాపకాలన్నీ సంపూర్ణంగా గుర్తుకొచ్చాయి. పైగా అతడి జ్ఞాపకశక్తి కూడా

'చనిపోక' ముందు కంటే కూడా చాలా తీక్షణంగా ఉంది. అతడు రెండు ధర్మాలు చూశాడు. ఒకటి సాధు ధర్మం, రెండవది రాకుమార కర్తవ్యం. అతడు ఆ రెండింటిలో ఏదో ఒకటి ఎంచుకోవలసి ఉంది. అతడు తన గుర్తింపుని ప్రకటించుకుని తీరవలసిన పరిస్థితిలో ఉన్నాడు. ఈ ప్రపంచంలో జీవించడమా లేదంటే మడం తిప్పి తన దారిన తాను పోవడమా, ఈ రెండింటిలో అత్యంత సముచితమైన కార్యాచరణని ఎంచుకోవడానికే నిర్ణయించుకున్నాడు.

అతడు నిర్ణయం చెప్తాడని గురించి ఎదురు చూసి చూసీ అలసిపోయిన ప్రిన్స్ అక్కగారు ఒకరోజు, ప్యాలెస్ ఎదురుగా గుమిగూడిన జనాన్ని ఉద్దేశించి తనే రాకుమారుడిననే వాస్తవాన్ని ప్రకటించమని కోరింది. అలా చెప్పడానికి అతడు ఒప్పుకోపోతే, తను ఆమరణ నిరాహార దీక్ష చేస్తానని చెప్పింది. అతడు సాధువుగా ఉన్నప్పటికీ ఉన్న నిజం మాట్లాడమని కోరింది. అందువల్ల 1921 మే 4 వ తేదీ నాటి సాయంత్రం భవాల్ సన్యాసిగా ప్రసిద్ధికెక్కిన ఆ వ్యక్తి జనం గుంపు ముందుకొచ్చాడు. ఎవరో అడిగారు గుంపులోంచి, 'మీ పేరేమిటి?' అని! దానికి అతడు, 'రామేంద్ర నారాయణ్ రాయ్ చౌధరి!' అని సమాధానమిచ్చాడు.

'మిమ్మల్ని పెంచినదెవరు?'

'అలోకా,' ఆయన జవాబిచ్చాడు. ఆయన చిన్నప్పుడు అలోకా పాలిచ్చి పెంచిన దాసి.

తక్షణమే వేలాది గొంతులు రెండవ రాకుమారుడికి జయజయధ్వానాలు పలుకుతూ గాలిలో ప్రతిధ్వనించాయి, 'మేజో కుమార్ కీ జయ్!'

భవాల్ రాజు తిరిగి తన రాజ్యానికి తిరిగి రావడంతో ప్రజలంతా పట్టరాని సంతోషంతో ఉన్నారు. ఆయనకు ఎన్నో రకాల బహుమానాలు తీసుకొచ్చారు. పన్నులు కట్టడం ప్రారంభించారు. ఆయన ప్యాలెస్‌కి వచ్చిన నాటి నుంచీ ఆయన భార్య మాత్రం ఒక్క సారి కూడా ఆయనని చూడడానికి రాలేదు. ఆమె, ఆమె సోదరుడు అతడిని 'ఒక మోసగాడు' గా జమకట్టి తిరస్కారంగా మాట్లాడసాగారు. ఈ నాగా సాధువు నిజంగానే తన రాజ్యాధికారం కోసం న్యాయస్థానం ముందుకు వెళ్లబోతున్నట్టు వాళ్లకి తెలిసింది. ఆమె తమ్ముడు సత్యేంద్ర, సంరక్షకుల ద్వారా అదుపు చేయబడుతున్న రెవిన్యూ బోర్డు సెక్రెటరీ మిస్టర్ హెచ్.బి.లెత్‌బ్రిడ్జ్‌ని కలుసుకుని, డార్జిలింగ్ సివిల్ సర్జన్ డాక్టరు దాస్ గుప్తా, లెఫ్టినెంట్ కల్నల్ కాల్వర్ట్, డార్జిలింగ్ డిప్యుటీ కమీషనర్ మిస్టర్ క్రాఫర్డ్ సంతకాలున్న ప్రిన్స్ డెత్ సర్టిఫికెట్ చూపించాడు. అతడు స్కాటిష్ యూనియన్ ఇన్సూరెన్స్ కంపెనీ నుంచి తన సోదరి, ప్రిన్స్ భార్య తరపున డెత్ బెనిఫిట్ పొందిన పేపర్లను కూడా అతడు చూపించాడు. గవర్నర్ ఎగ్జిక్యూటివు కౌన్సిల్ రెవిన్యూ కమీషనర్ సలహా మేరకు, సత్యేంద్ర తూర్పు బెంగాల్‌లో చదివే ఆంగ్లేయుల స్వంత డైలీ న్యూస్‌పేపర్ ది ఇంగ్లీష్‌మేన్, పత్రిక ఎడిటర్‌కి రెండవ రాకుమారుడు రామేంద్ర చనిపోయిన సంఘటనంతా పూర్తి వివరాలతో ఒక లేఖ రాశాడు.

ఇక ఆనాడు సర్వత్రా భవాల్ సన్యాసి ఎవరనే విషయం మీదే వేడిగా వాడిగా చర్చలు జరిగాయి. అతనికి అనుకూలంగానూ, ప్రతికూలంగానూ సాక్ష్యాలు కోర్టుకి ఇవ్వబడ్డాయి. చివరికి 1921 జూన్ 3 వ తేదీన రెవిన్యూ బోర్డు సాధువుని ఒక మోసగాడిగా తీర్పునిస్తూ ఈ విధమైన నోటీసు జారీ చేసింది– 'పన్నెండేళ్ల క్రితం డార్జిలింగ్ టౌన్‌లో రెండవ రాకుమారుడు భవాల్ దహనం చేయబడినట్టు ఒక తిరుగులేని సాక్ష్యం రెవిన్యూ బోర్డు దగ్గర ఉంది. కాబట్టి, దాన్ని అనుసరించి తనను తాను రెండవ కుమారునిగా చెప్పుకుంటున్న ఈ సాధువు ఒక మోసగాడు. అతడికి ఎవరైనా అద్దెలు లేదా చందాలు, దానాలు చేసేవారు తమ స్వంత రిస్కుతోనే అలా చేయవలసి ఉంటుంది,' అని తెలియజేయడానికి ఈ నోటీసు ఇవ్వబడుతోంది.' ఈ నోటీసుని స్థానిక బజారులో డప్పులు మోగిస్తూ చదివి ప్రజలకు తెలియజేయడం జరిగింది. దాంతో అల్లర్లు మొదలయ్యాయి. పోలీసు కాల్పులు జరిగాయి. వాటిలో ఒక మనిషి చనిపోవడం, అనేక మంది

గాయపడడం కూడా జరిగింది. సన్యాసికి మద్దతు తెలియజేస్తున్న వారందరిపైనా కేసులు నమోదయ్యాయి. కానీ కేసు విచారణకి వచ్చిన తర్వాత మద్దతుదారులపై నేరారోపణ తొలగించబడింది. 1921 ఆగస్టులో పక్కనున్న బర్ద్వాన్ రాజ్యం నుంచి రాజు అభ్యర్థన మేరకు బాబాజీ ఢాకా వచ్చి తన శిష్యుడిని ఎలా కనుగొనడం జరిగిందో, అతడికి ఎలాంటి శిక్షణనివ్వడం జరిగిందో, తిరిగి ఆయనని ఇంటికి ఎలా పంపడం జరిగిందో వివరంగా తెలియజేశారు.

ఈలోపు ప్రిన్స్ గుర్తింపు విషయంగా ప్రిన్స్ అక్కగారు, నాయనమ్మ కూడా క్రియాశీలకంగా పని చేశారు. జూలై 1922లో నాయనమ్మ ప్రిన్స్ భార్య అయిన బిభాబతికి ఒక లేఖ వ్రాసింది, 'నీ కళ్లతో నీవే చూడు. కులీనుడైన నా భర్త ఉన్నత కుటుంబ గౌరవం, కీర్తి ప్రతిష్ఠల్ని కాపాడాల్సిన బాధ్యత న్యాయ ప్రకారం, ధర్మ ప్రకారం నీదే!' కానీ ప్రిన్స్ భార్య ఈ ఉత్తరాన్ని తీసుకోవడానికే తిరస్కరించింది. ఆమె తన తమ్ముడితో కలిసి ప్రిన్స్‌ని చంపడానికి కుట్ర చేసిందనే విషయం నిజమై ఉంటుందనీ, అందువల్లే ప్రిన్స్‌ని మోసగాడిగా నిరూపించడానికి ఎంతకైనా తెగిస్తుందనీ నాయనమ్మ అప్పుడు నమ్మింది. అప్పుడు ఆమె కలెక్టర్ జె.జి.డ్రమ్మండ్‌ని కలిసింది. ఆయన ఢాకా పాలనా విభాగంలో ఉన్నతాధికారి. ఆయనకు విషయమంతా తెలియజేసి దీన్ని పరిష్కరించడానికి ప్రజ్ఞావంతులైన ఆరుగురు లాయర్లని నియమించమనీ, 'వీలైతే భారతదేశంలోని ఆరు హైకోర్టుల నుంచీ ఒక్కో లాయరుని పిలిపించండి' అనీ కోరింది. దీనికి అయ్యే ఖర్చుని తాను తన స్వంత నిధుల నుంచి ఇప్పిస్తానని చెప్పిందామె.

భవాల్ సన్యాసి కూడా తన మనసులో నిశ్చయించుకున్నాడు. ఆయన గెలిచే తీరాలని భావించాడు. తను ఈ ప్రపంచాన్ని వదిలేస్తాడు. కానీ విజయం సాధించిన తర్వాతే! కొన్ని వ్యావహారిక కారణాల వల్ల ఆయన కలకత్తాలో ఉండడం మొదలుపెట్టాడు. మధ్యలో ఢాకాకి రెండు సార్లు వెళ్లి రావలసి వస్తే వెళ్లి వచ్చిన భవాల్ సన్యాసి 1924 నుంచి 1929 వరకు కలకత్తాలోనే ఉన్నాడు. ఆ కాలంలో స్వాతంత్ర్య పోరాటం కీలకమైన దశలో ఉంది. ఆయన బెంగాల్‌లో గొప్ప ప్రముఖుడైనా, ఆయన రాజకీయాల్లో పాల్గొనలేదు. (కానీ ఆయన జాతీయ ఉద్యమం వైపు మొగ్గు చూపేవాడు. అతడి బావమరిది సత్యేంద్ర బ్రిటిష్ అధికారులకి విధేయుడిగా ఉండేవాడు.) అయితే ఆయన పేరు ఎప్పుడూ ప్రజల నోళ్లలో నానుతూ ఉండేది. రాజకీయంగా స్వాతంత్ర లక్ష్యం కోసం ప్రజలు ఎలా సామూహికంగా స్పందన తెలియజేసేవారో, రాజకీయ పరిధిని దాటి భవాల్ సన్యాసి కోసం ఆ ప్రాంత ప్రజలు అలాంటి సామూహిక స్పందన తెలియజేసేవారు.

1929 అక్టోబరులో భవాల్ సన్యాసి ఢాకాకి వెళ్లిపోయారు. అక్కడ ఆయన తన అక్కగారితో కలిసి ఉండూ, భవాల్ రాజ్యానికి బకాయి పడిన అద్దెలు, పన్నులు వసూలు చేయసాగాడు. సత్యేంద్ర ఏదో పట్టాన క్రిమినల్ కోడ్ 144 సెక్షన్ క్రింద సాధువుని జయదేబ్‌పూర్ టౌన్‌లోకి ప్రవేశం లేకుండా నిషేధిస్తూ ఉత్తర్వులు జారీ చేయించగలిగాడు. ఆ తర్వాత ఈ నిషేధాజ్ఞలు మొత్తం భవాల్ రాజ్యానికి కూడా విస్తరించబడ్డాయి. చివరికి, 1930 మొదట్లో ప్రిన్స్ ఎంతోమంది పెద్ద పెద్ద లాయర్లను సంప్రదించి తన రాజ్యంపై తాను అధికారంలోకి రావడానికి ఢాకా సెషన్స్ కోర్టులో కేసు అప్పీల్ చేశాడు.

ప్రిన్స్‌కి లీడింగ్ కౌన్సిల్ బి.సి.చటర్జీ. అతడు అప్పటికే ఎన్నో రాజకీయపరమైన కేసుల్ని విజయాలు సాధించిన దిట్ట. ఈ కేసు 24 ఏప్రిల్ 1930లో కోర్టుకెక్కింది. బ్లిడ్జ్ రిపోర్టు ప్రకారం ఈ కేసుకి 1609 సాక్ష్యాలు, 2,000 ఆధారాలు ఉన్నాయి. అన్ని మతాలు, జాతుల నుంచీ సాక్ష్యం ఇవ్వడం కోసం వచ్చారు. వారిలో 21 ఏళ్ల నుంచి 100 ఏళ్ల వరకు ఎంతో మంది వ్యక్తులు ఉన్నారు. సాక్ష్యం ఇవ్వడానికి వచ్చినవారిలో హిందువులు, ముస్లింలు, సిక్కులు, పార్శీలు,

క్రిష్టియన్లు, బౌద్ధమతస్తులు, జంతుప్రేమికులు, నాగసాధువులు, భుతియాలు (టిబెటన్లు) ఉన్నారు. కొంతమంది ఆంగ్లేయులు, డాక్టర్లు, లాయర్లు, శిల్పులు, ఫోటోగ్రాఫర్లు, జమీందార్లు, రైతులు, వడ్డీ వ్యాపారులు, ప్రొఫెర్లు, పండితులు, జాలర్లు, గుర్రపు బండీ నడిపేవారు, మావటులు, అశ్వపాలకులు ఉన్నారు. కొంతమంది తార్పుడుగాళ్లు, వేశ్యలు కూడా ఉన్నారు. రాకుమారుని విషయంగా విపరీతమైన లైంగిక వాంఛల గురించిన సమాచారాన్ని వారు కోర్టుకి సాక్ష్యమిచ్చారు.

ఈ కేసు చాలా సంక్లిష్టమైనది కావడంతో ఇరువైపులా నిజానిజాలు నిర్ధారించడానికి స్కాట్లాండ్ యార్డ్‌ని పిలిపించాల్సి వచ్చింది. 1905 లో ప్రిన్స్ లైఫ్‌ని ఇన్స్యూర్ చేసిన యూనియన్ ఇన్సూరెన్స్ కంపెనీ మెడికల్ అడ్వైజర్లు, పాలసీలో పేర్కొనబడిన గుర్తింపు చిహ్నాలు సాధువు శరీరంపై ఉన్నాయని నిర్ధారించారు.

బాబాజీ 1921లో ఢాకాకి వచ్చిన ఐదురోజుల పాటు ఉన్నారు. ఆ సమయంలో బాబాజీ స్టేట్‌మెంట్స్ రికార్డు చేయబడ్డాయి, వాటిని కోర్టులో చదవడం జరిగింది. భవాల్ సన్యాసి తనను సాధు బృందం ఎలా రక్షించిందో, వారు తనను ఎలా బ్రతికించారో, తన గురుదేవులు బాబా ధరమ్‌దాస్ తనను తిరిగి తన ఇంటికి ఏ విధంగా పంపారో అంతా వివరంగా తెలియజేశాడు. ఈ సాక్ష్యాన్ని ఆ తర్వాత బాబాజీ శిష్యులు బాబా దర్సనదాస్, బాబా లోకదాస్, బాబా ప్రీతమ్ దాస్ లాంటి వారు బలపరిచారు. ప్రిన్స్ అక్కగారు, నాయనమ్మ, వదిన, చుట్టుప్రక్క రాజ్యాల రాచకుటుంబాల సభ్యులు, వందలాది సేవకులు, ఇంకా తన రాజ్యంలోని ఇతర వ్యక్తుల సాక్ష్యంతో సాధువుని భవాల్ రాకుమారుడిగా గుర్తించడం జరిగింది.

24 ఆగస్టు 1936 న కోర్టు ఆ వ్యక్తి రాకుమారుడేనని తీర్పు ఇచ్చింది. *ఆ తీర్పు ప్రకారం నిర్ధారింపబడిన విషయాలు ఇలా ఉన్నాయి– ప్రిన్స్‌కి విషం ఇవ్వబడింది. అతడి శవాన్ని స్మశానానికి తీసుకుని వెళ్లారు. కానీ భారీ వర్షంతో ఆ మంటలు ఆరిపోయాయి. ప్రిన్స్ బావమరిది సత్యేంద్ర అతడిని హతమార్చడానికి కుట్ర పన్నాడు.* ఈ తీర్పు వినగానే ఢాకా పౌరులు, జయదేబ్‌పూర్ వాసులు, ప్రిన్స్ స్వామి విజయాన్ని మూడు రోజులపాటు జరుపుకున్నారు. ఇప్పుడు ప్రిన్స్ రాజా రామేంద్ర నారాయణ్ రాయ్ చౌదరిగా అధికారికంగా సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఆయన భార్య, తన తమ్ముడి మాటల్ని తలకెక్కించుకుని తన భర్తని గుర్తించడానికి నిరాకరించింది.

5 అక్టోబరు 1936 న రాజా రామేంద్ర భార్య, అతడి తమ్ముడి భార్య, ఆమె దత్తపుత్రుడు, సంరక్షక బృందం అంతా కలిపి కలకత్తా హైకోర్టులో అప్పీలు చేశారు. అందులో వాళ్ల అటార్నీలు ముందు వచ్చిన తీర్పుని ఎగతాళి చేస్తూ ఇలా వాదించారు, *'చనిపోయిన వ్యక్తి శిరస్సుని ముండనం చేసి ఉండీ లేని బట్టల్లో ఉన్న నాగసాధువు ఒకడు ఇక్ష్వాకుల కాలం నాటి ఔషధమేదో రాసినంత మాత్రాన ఈ ప్రజ్ఞావంతుడైన న్యాయమూర్తి అభిప్రాయం ప్రకారం ఒక శవంలోకి ప్రాణం తిరిగి వస్తుందా?'* అని ఉంది అందులో. మరో నాలుగేళ్ల వాదోపవాదాల తర్వాత 25 నవంబరు 1940 న పాత తీర్పే వర్తిస్తుందని తీర్పు చెప్పబడింది. ప్రిన్స్ భార్య, మరదలు ఈ సంగతిని ఇంతటితో వదిలిపెట్టదలుచుకోలేదు. వాళ్లు హైకోర్టు తీర్పుని ఛాలెంజ్ చేస్తూ, లండన్‌లోని ప్రివీ కౌన్సిల్‌కి అప్పీల్ చేశారు. అక్కడ ఇరవై ఎనిమిది బృహత్ గ్రంథాల ప్రింటెడ్ కోర్టు సమాచార రికార్డులు, ఏడువందల ఫోటోగ్రాఫ్‌లను అధ్యయనం చేసిన తర్వాత ప్రివీ కౌన్సిల్ ఈ అప్పీలుని 30 జూలై 1946 న కొట్టేసింది.

రాజా రామేంద్ర సాధించిన తుది విజయం సమాచారం ముందుగా కేబుల్ ద్వారా ఆగస్టు 1 వ తేదీన అతని సొలిసిటర్‌కి అందింది. ఆ సమయానికి కలకత్తా నుంచి ఢాకా వరకు వార్తాపత్రికలన్నీ ఈ వార్తనే ప్రముఖంగా ప్రచురించాయి. ఆయనకు విజయం దక్కుతుందని ప్రతి ఒక్కరూ ఊహించారు. కానీ దక్కిన విజయానికి ఆయనకి ఏ మాత్రం సంతోషం కలగలేదు.

కోర్టు ఆయనని భవాల్ రాకుమారునిగా గుర్తించినా, ప్రజలంతా ఆయనను తమ రాకుమారుడిగా చూస్తూ తన రాకకు ఎంతో ఆనందాన్ని వ్యక్తం చేస్తున్నా ఆయన అంతర్యంలో తానొక నాగా సాధువనీ, తాను బాబా ధరమ్ దాస్ శిష్యుడిననీ తెలుసు. కలకత్తాలో ఉన్న ఆయన నివాస స్థానమంతా ప్రజా సందోహంతో ఇసుక వేస్తే రాలనంత జనంతో నిండిపోయింది. అభినందనలు చెప్తూ వేలాది టెలిగ్రాములు వచ్చి పడుతున్నాయి. కానీ ఆయన లోలోపల గాఢమైన ధ్యానస్థితిలోకి వెళ్లిపోతున్నారు. 'మాయని జయించడం అంటే ఇదేనా? నా పాత్రని నేను బాగా పోషించానా? ఈ పాత్ర పోషణలో చివరగా నేనివ్వాల్సిన కొసమెరుపు ఏదైనా మిగిలిపోయిందా?' ఆయన అంతర్యంలో అనేక ప్రశ్నలు చుట్టుముడుతున్నాయి. ఆయన చుట్టుప్రక్కల ఉన్న జనమంతా ఆయన తన అరవై రెండేళ్ల వయసుని కూడా లెక్క చేయకుండా ఈ అగ్నిపరీక్షకి నిలబడి ముప్పై రెండేళ్ల పాటు ఈ కేసు గురించి తిరగడమేమిటని వాపోయారు. కానీ నిజమేమిటో స్వామీ రామ నాతో చెప్పారు. ఆ సమయంలో డార్జిలింగ్‌లో ముప్పై ఆరేళ్లకి ముందు బాబాజీ తన ప్రియశిష్యుడైన భవాల్ రాకుమారుడి శరీరంలో ఆత్మని పునఃప్రతిష్ఠించిన చోటే నివసిస్తుండేవారు, భవాల్ స్వామి అక్కడున్న స్వామీజీతో నేరుగా సంభాషిస్తూ ఉండేవారట.

కోర్టు కేసు తుది తీర్పు చెప్పే సమయం వచ్చేసరికి ప్రిన్స్ శరీరాన్ని రక్షించి కోర్టులో సాక్ష్యం చెప్పినవారిలో బాబాజీతో ఐదుమంది సాధువులు డార్జిలింగ్‌లో ఉన్నారు. బాబాజీ పూర్తిగా మౌనం వహించారు. ఎప్పుడో ఒకసారి కళ్లు విప్పి చూస్తున్నారు, అప్పుడు చూసే చూపు కూడా ఎక్కడో దూరంగా చూస్తున్నారు. తీక్షణపు చూపులు చూస్తుండిపోయే బాబాజీని చూసి స్వామీజీ, సాధు మండలి ఆయన గతించిన కాలాన్నో, లేదా భావికాలాన్నో లేక సాధారణ స్థితిలో మనసు చేరలేని విషయాన్నో చూస్తున్నారని భావించేవారు. ఈ విషయం గురించి 1983లో స్వామీజీ నాకు ఈ విషయం చెప్తుండగా స్వయంగా ఆయన కూడా అలానే చూసేవారు.

రాజా రామేంద్ర విషయంలో కూడా ఇలాగే జరిగేది. ఆయన సెక్రెటరీలు, అసిస్టెంట్లు ఆయనను ఎన్నో రకాలుగా పట్టించుకునేవారు. కానీ ఆయనకు ఏ వినోదమూ, ఏ సేవలూ అందుకునే మనసు ఉండేది కాదు. ఆయన ఎప్పుడూ ఏకాంతంలో ఉండాలని భావించేవాడు. చాలా కాలం గడిచాక ఆయన తన గదిలోంచి బయటికి వచ్చేవాడు, ప్రపంచానికి కావలసిన ఆకర్షణ, ముసుగు ధరించి! స్నేహితులతో కరచాలనం చేసేవాడు, శ్రేయోభిలాషుల్ని చూసి తల పంకించేవాడు, మళ్లీ తన వ్యక్తిగత ప్రపంచంలోకి వెళ్లిపోయేవాడు. పాతికేళ్లపాటు ఈ ప్రపంచంలో న్యాయపరమైన వ్యూహాలు రచిస్తూ, తన రాజ్యాన్ని పాలించాడు. వ్యాపార వ్యవహారాల్ని తానే చూసుకున్నారు, పార్టీలకు హాజరయ్యారు, బంధువులు, స్నేహితుల పట్ల తనకున్న కర్తవ్యాల్ని నెరవేరుస్తూ కాలం గడిపేవాడు. చివరికి అతడి అక్కగారికి కూడా రాత్రి పూట్ల అతడు ధ్యానంలో గడుపుతున్నాడనే విషయం తెలియరాలేదు. ఆయన పగలు లౌకిక ప్రపంచ వ్యవహారాలు చూసుకుంటూ రాత్రి భాగాల్ని పరమాత్మకి కైంకర్యం చేశాడు. ప్రజలు చుట్టూ ఉన్నపుడు ఆయన భవాల్ రాకుమారుడు (తర్వాత రాజుగా అయ్యాడు), కానీ వ్యక్తిగతంగా అతడు భవాల్ సన్యాసి.

లండన్ నుంచి అతడి సొలిసిటర్లు భవాల్ రాజా రామేంద్ర వద్దకు వచ్చారు. కానీ ఆయనలో ఉన్న సాధువుకి మరో సందేశం కూడా అందింది. ఈ సందేశం అతడి విధిని రాసిన సృష్టికర్త బాబా ధరమ్ దాస్ నుంచి వచ్చింది. ఆ సందేశంలో, 'నువ్వు యుద్ధంలో గెలిచావు. ఈ విజయంతో ఏం చేయాలో ఇప్పుడు నువ్వే నిర్ణయించుకో!' అని ఉంది. అప్పటికి సరిగ్గా ముప్పై మూడు సంవత్సరాల క్రితం తను బాబాజీ నుంచి అమరనాథ్‌లో దీక్ష గ్రహించాడు. తను ఆ సమయంలో తీసుకున్న దీక్ష ముగింపుకి వచ్చింది. చివరగా, ఆ దీక్ష ముగింపుకి పూర్ణాహుతి (చివరగా ఇచ్చే ఆహుతి) కావాలి.

ఆ సాధువు నిర్ణయం తీసుకున్నాడు. తనలో అంతర్గతంగా ఉన్న మాయా పొరని ఛేదిస్తాడు తను. సృష్టికర్త బ్రహ్మ సృష్టించిన జగత్తుకి అతీతమైన స్థాయిలో హోమాగ్నికి తన పూర్ణాహుతినిస్తాడు. తను ఓడించినవాళ్లకే తన విజయ ఫలాన్నిస్తాడు. ఆ విధంగా అతడు మానావమానాల్ని, జయాపజయాల్ని, లాభనష్టాల్నీ, జననమరణాల్నీ వదిలేశాడు. అంతర దీప్తితో భాసించే జగత్తులోకి ప్రవేశించడానికి తనను తాను సమాయత్తం చేసుకున్నాడు.

ముప్పై ఆరేళ్ల ముందు బాబాజీ ప్రిన్స్‌కి జీవం పోశారు. ఈసారి బాబాజీ శిష్యుడైన ఈ రాచసాధువు, తన శరీరాన్ని స్వచ్ఛందంగా వదిలేశాడు. *బ్లిట్జ్* రిపోర్టుని అనుసరించి...

> *లండన్ నుంచి కేబుల్ అందుకున్న రెండు రోజుల తర్వాత ఓ పక్కన వేలాదిగా టెలిగ్రాములు, సందేశాలు వచ్చిపడుతున్న దశలో భవాల్ సన్యాసి అకస్మాత్తుగా శనివారం 1946 ఆగస్టు 3 వ తేదీన మరణించారు. ఆయన దహన క్రియలు మరుసటి ఉదయం 9 గంటలకు నిర్వహించబడ్డాయి. సన్యాసి ఆ చితి నుంచి పద్దెనిమిదేళ్ల యువకుడిగా లేచి వస్తాడని రాత్రి వరకూ నగరమంతా విశ్వసించింది.*

*1909 ఆగస్టు 4 వ తేదీన కూడా ఆనాడు డార్జిలింగ్‌లో వచ్చినట్టు విపరీతమైన ఈదురు గాలి, భయంకరమైన వర్షం వచ్చింది. భవాల్ సన్యాసి రెండవసారి కూడా చితి మీద నుంచి లేచి వస్తారేమోనని వేలాదిమంది గొడుగులు వేసుకుని వచ్చి మరీ చూశారు. అయితే ఈసారి అగ్నికీలలు ఆయన శరీరాన్ని కొన్ని గంటల్లోనే ఆహుతి చేశాయి.*

*హిమాలయ పరమ గురువులతో జీవనం* పుస్తకాన్ని నేను హిందీలోకి అనువదించే సమయంలో స్వామీజీ నాతో రెండు మూడు సార్లు 'బాబాజీ అర్థం కాని ఓ మర్మం' అని అనేవారు. బాబాజీ తన భక్తులకు మధ్య మార్గాన్ని అనుసరించమని సలహా ఇచ్చేవారు, కానీ ఆయన ఒక ఉత్కృష్ట స్థితికి చెందిన యోగిగా ఉండేవారు. ఆయనకి తన ఆశీర్వాదం కోసం వచ్చేవారి పట్ల ఎంతో దయ, ఎంతో కరుణ! కానీ తన అడుగుజాడల్లో నడిచే వారి పట్ల ఎంతో కాఠిన్యం కనబరిచేవారు. తన శిష్యులు తన బోధని అర్థం చేసుకునేందుకు పూర్తిగా సిద్ధంగా ఉన్నారా లేదా అనే విషయాన్ని వారెన్నడూ నేరుగా తెలియబరిచేవారు కాదు. ప్రతి విద్యార్థికీ ఒక పరిస్థితిని కలుగజేసి, వాళ్లు ఆ అగ్నిగుండాన్ని దాటతారా లేక తిరిగి వెళ్లిపోతారా అని పరీక్షించేవారు.

బాబాజీ వారికి తామెంత సంసిద్ధతని కలిగి ఉన్నారో అర్థమయ్యేలా చేసేవారు. ఉదాహరణకి, ఆయన ప్రిన్స్‌కి ఒక కొత్త జీవితాన్నిచ్చారు. ఆయన అతడిని ఒక చంటి బిడ్డని తల్లి ఎలా సాకుతుందో అలా సాకారు. ఆయన ప్రిన్స్ చైతన్యాన్ని ఉన్నత స్థితికి చేర్చి, గత జన్మలో పూర్తి కావాల్సిన ఆయన ఆధ్యాత్మిక ప్రయాణాన్ని పూర్తి చేసేలా చేశారు. బాబాజీ ప్రిన్స్‌కి ఎటువెళ్లాలో ఎంపిక చేసుకునే అవకాశాన్నిస్తూనే శాశ్వత ఆధ్యాత్మిక జీవనాన్నీ, నశ్వర లౌకిక జీవనాన్నీ పూర్తి చేసేలా చూశారు. అతడు ఏది ఎంచుకున్నా రక్షించేందుకు బాబాజీ చేతులు చాచబడే ఉన్నాయి. కానీ ప్రిన్స్ తన వైపు నుంచి నిజాయితీగా ఎంచుకునే అవకాశం ఇవ్వాలనే ఇచ్చారు. పిరికిపందలా తప్పించుకుపోకుండా ప్రిన్స్ తన వద్దకు విజేతగా తిరిగి రావాలని ఆయన కోరుకున్నారు.

ఈ ప్రిన్స్ గత జన్మలో ఎవరై ఉంటారు? ఆయన తన ఆధ్యాత్మిక ప్రస్థానంలో అప్పుడు ఎంతవరకు చేరుకుని ఉంటారు? ఆయన ఈ జీవితంలో అంతటి తీవ్రమైన అనుభూతులు ఎలా పొందాల్సి వచ్చింది? బాబాజీ కాశ్మీరులోని అమరనాథ దేవాలయంలో ఆయనకు ఇచ్చిన దీక్ష ఏమిటి? ఈ విషయాలన్నీ కుతూహలంగా అనిపించి నేను స్వామీజీని అడిగాను. గత జన్మలోనూ,

అంతకు ముందు అనేక జన్మల్లోనూ ప్రిన్స్ ఒక సాధువని స్వామీజీ నాకు చెప్పారు. కానీ ఆయన ఆ యా జన్మల్లో ఎంతో కఠోరమైన ఆధ్యాత్మిక సాధన చేసినా, ఆయన ఎప్పుడూ తన ఆంతర్యంలో సంఘర్షణ పడుతూ ఉండేవారట. డబ్బు, స్త్రీల వల్ల వచ్చే ప్రమాదాలు ఏమిటో ఆయనకు బాగా తెలిసినా సరే, ఆయన మనసులో ఆ రెండింటి మీదా గాఢమైన వాంఛ ఉండేదిట. ఆ వాంఛని జయించేందుకే ఆయన ఏకాంత వాసం చేస్తూ కఠినమైన తపస్సునీ, సాధననీ ఎంచుకున్నారట. ఆయన తరచుగా ఉపవాసం చేస్తుండేవారట. ఎప్పుడూ పంచాగ్నుల (నాలుగు వైపులా రగులుతున్న మంటలు, పైన సూర్య తాపం– మొత్తం ఐదు అగ్నులు) మధ్య ఉండేవారట. అలాగైనా తన శరీరం బలహీనపడి, ఇంద్రియాలు నీరసించి, ఆధ్యాత్మిక సాధనకి ఆటంకం కలిగించకుండా ఉంటాయని అలా చేసేవారట! ఆయనకు తన గురువుపైనా, దేవునిపైనా అచంచలమైన విశ్వాసం ఉంది. ఆయన ఒక క్రమశిక్షణ కలిగిన సాధకుడు. ఆయన సంకల్పశక్తి అచంచలమైనది.

కానీ ఆయనకు డబ్బుపైన, స్త్రీలపైనా గల వాంఛ ఒక ఆటంకంగా ఉండేది. దాన్ని ఆయన మార్చుకోవలసిన అవసరం ఏర్పడింది. ఆయన తనకు ఆ విధమైన కోరికలు ఉన్నాయనే సత్యాన్ని గుర్తించాలి. ఆయన ఆ కోరికల్ని అణచివేసుకునే బదులు, వాటిని నెరవేర్చుకోవడం ద్వారా వాటి నుంచి విముక్తి పొందాలి లేదా వాటిని సంపూర్ణంగా వదిలివేయాలి. ఆ విధంగా ఆయన పుట్టుకతోనే ఒక రాకుమారునిగా జన్మించాడు. ఆయనకు సౌకర్యాలు అందుబాటులోకి వచ్చేసరికి వాటి అనుభవంలో పూర్తిగా మునిగిపోయారు. ఐశ్వర్యం, అధికారం, సుఖాల్ని సొంతం చేసుకునేందుకు తన భార్య, బావమరిది, ఫ్యామిలీ డాక్టర్ కలిసి తనను చంపడానికి కుట్ర చేయడంతో ఆయన ఈ ప్రపంచ నైజాన్ని కళ్లారా చూశాడు. అతడి గురువే అతడిని చితి మంటలపై నుంచి రక్షించడమే కాక, ఈ లౌకిక తత్వంలోని అయోమయంలో కొట్టుకు పోకుండా కాపాడారు. అలాగే సాధు సంప్రదాయంలో ఉత్కృష్ట స్థితికి చెందిన సాధువుల నిర్మోహ స్థితిని సాధించేందుకు బాబాజీ తన శిష్యునికి తోడ్పడ్డారు. ఆ విధంగా ప్రిన్స్ లౌకికమైన సకల మోహ బంధాల్నీ అధిగమించాడు. అన్ని ఆకర్షణల్నీ, మాయావరణాన్నీ, కుటుంబం, సంతానం, అధికారం, కీర్తిప్రతిష్ఠలు, ప్రాపంచిక ఆకర్షణల్నీ ఛేదించాడు.

స్వామీజీని నేను ప్రిన్స్ తీసుకున్న దీక్ష ఏమిటి, ఆయన చేసిన సాధన ఎలాంటిదో సరిగ్గా చెప్పమని అడిగాను. కానీ ఆయన నా ప్రశ్నకి సరైన సమాధానం ఇవ్వలేదు. గంభీరమైన స్వరంతో ఆయన ఇలా చెప్పారు, 'అది ఛిన్నమస్త సాధన!' అన్నారంతే. ఆయన ముఖ కవళికలు చూసి, ఆయన ఆ విషయం గురించి ఇక మాట్లాడాలని అనుకోవడం లేదని నాకు అర్థమైంది. అయినా నాకు అంతకు ముందు అనేక సందర్భాల్లో ఛిన్నమస్తాదేవి గురించి ఎన్నో విషయాలు స్వామీజీ చెప్పారు. *శక్తి సంగమ తంత్ర* లాంటి ప్రామాణిక తాంత్రిక గ్రంథాల్లో కూడా నేను ఛిన్నమస్త సాధన గురించి చదివి ఉన్నాను.

కోర్టు వెలువరించిన తుది తీర్పులో విజయం వరించిన తర్వాత బాబాజీ, భవాల్ సన్యాసి, ఇద్దరూ గాఢమైన ధ్యానంలో నిమగ్నమయ్యారు. భవాల్ సన్యాసి రెండు రోజుల తర్వాత ఆకస్మికంగా మరణించాడు. ఈ సంగతి వినగానే నా మనసుకి ఒక విషయం మెరుపులా తాకింది– బాబాజీ భవాల్ సన్యాసికి ఇచ్చిన ఛిన్నమస్త దీక్షని ఆయన తన తుది శ్వాస వరకు అంటే ముప్ఫై మూడేళ్ల పాటు చేస్తూనే ఉన్నారు. ఆయన రాకుమారునిగా గుర్తింపబడిన తర్వాత ఆయన ఐహిక బంధాలకైనా పరిమితమై ఉండవచ్చు, లేదా వాటి నుంచి పారిపోయి ఉండొచ్చు. కానీ ఆయన తనకి కోరికలు ఉన్న సంగతిని గుర్తించి, వాటిని జ్ఞానాగ్నిలో దగ్ధం చేయడం ద్వారా వాటిని శాశ్వతంగా అధిగమించదలుచు కున్నారు. ఆయన తన శరీరం, శ్వాస, మనసు, బుద్ధి, ఇంద్రియాలు, ఇలా అన్నిటిపైనా గొప్ప అనుశాసన, సంయమం కలిగి ఉన్నారు. బాబాజీ ఆయన్ని

దూరం నుంచి గమనిస్తూనే ఉన్నారు. ఆయనకు బాహ్యంగానూ, ఆంతరిక ప్రపంచంలోనూ విజయం చేకూరగానే ఆయన సాధన ముగిసింది.

బాబాజీ యువకునిగా ఉన్నపుడు ఆయనకి వారి గురుదేవుల నుంచి లభించిన దీక్షా సాధన ఇదే. బాబాజీ ఆ దీక్షని బీహార్ రాష్ట్రంలోని ఛిన్నమస్త ఆలయంలోనే పూర్తి చేశారు. ఆ సమయంలోనే ఆయన గురువు బాబాజీకి శ్రాద్ధకర్మలు నిర్వహించి, ఆయన పూర్వాశ్రమంతో ఆయనకు సంబంధ బాంధవ్యాలు తెంచేశారు. ఆయనకు బాబా ధరమ్ దాస్ పేరుతో సన్యాస దీక్షని ఇచ్చారు. సన్యాసం తీసుకోవడమంటే, అది పునర్జన్మ క్రిందే లెక్క. భవాల్ సన్యాసి కూడా అదే చేశారు. ఆయన తన శరీరాన్ని యోగులు విడిచినట్టే విడిచిపెట్టారు. రాజా రామేంద్ర నారాయణ్ దహన సంస్కారాలకు హాజరైన అశేష ప్రజానీకం ఎదురు చూసినట్లు మళ్లీ ఆయన మృతుల్లో నుంచి తిరిగి జీవించలేదు. స్వామీజీ మాటల్లోనే చెప్పాలంటే, 'ఆయన ఇంకా హిమాలయాల్లోనే సంచరిస్తున్నారు. దారితప్పిన అధ్యాత్మ సాధకులకు దారి చూపే మార్గదర్శకులుగా సంప్రదాయ బద్ధమైన బాధ్యతలు నిర్వర్తిస్తున్నారు.'

హిమాలయ పరమగురువులతో నా సహజీవనంలో 'నా గురుదేవులు–ప్రిన్స్ స్వామి'లో స్వామీజీ ఒక గొప్ప విషయం చెప్పారు: 'ఆయన (బాబాజీ) ప్రిన్స్ స్వామి తన సోదరిని కలుసుకుని పాత విషయాల్ని జ్ఞాపకం చేసుకుంటానని చెప్పారు. 'ఆ విషయాలు నాకు చాలా సమస్యలు తెచ్చిపెడతాయి. కాబట్టి నేను ఇంకా ఉన్నత హిమాలయ ప్రదేశాలకు వెళ్తాను,' అని కూడా అన్నారు. ఆయన హిమాలయాల్లో ప్రాచీన గుహలోనే ఉన్నారు. అక్కడ ఆయన చాలా కాలం ఉండిపోయారు.'

ఒకరోజు సాయంత్రం అవకాశం చూసుకుని స్వామీజీని ఆ ప్రాచీన గుహ ఎక్కడ ఉందని అడిగాను. ఆయన అది కైలాస పర్వతం వద్ద గంగా నది దగ్గర ఉందని చెప్పారు. ఆ గుహని పశ్చిమ కైలాస పర్వతంలో ఉన్న లోయలో నైనీ పర్వత పాద ప్రాంతంలో భగవాన్ సనత్కుమారుల ఆదేశంతో అంగీరస మహర్షి నిర్మించారు.

ఆ తర్వాత పదహారు సంవత్సరాల వరకు నేను స్వామీజీ చెప్పిన మాటల ప్రకారం ఆ ప్రాచీన గుహని ఊహించుకుంటూ గడిపాను. కానీ ఊహల్లో కొలువు తీరిన ఆ గుహని చూడాలనే ప్రబలమైన ఆకాంక్ష నన్ను టిబెట్‌కి తీసుకుని వెళ్లింది. ఆ గుహ ద్వారం, లోపలికి దారి తీస్తున్న ఓ సన్నటి దారి! లోపల ఎన్నో గదుల్లాంటి విభాగాలు, కొన్నింటిలో నాగ సాధువులు ధుని వేసుకుని ఉన్నారు. ఆ పొగ ఎక్కడికి పోతుందా అనిపించింది. కొన్ని సార్లు ఆ గుహ భౌతికంగా కళ్లకి కనబడేది కాక, అతీంద్రియ ప్రజ్ఞతో చూడగలిగే దివ్యమైన గుహ అయి ఉంటుందని అనిపించేది. అక్కడ ఉండే పరమగురువుల అనుగ్రహం ఉంటే, కొంతమంది ఆ గుహని చూడగలిగే వారు, మిగతా ఎవరికీ ఆ గుహ కనిపించేది కాదు. అయితే స్వామీజీ చెప్పిన వివరాల ప్రకారం అది నిజమైన గుహే. అది గంగా నదీ తీరంలో ఉంది. నేను మ్యాప్‌లను అధ్యయనం చేస్తూ వెళ్లాను. కానీ నాకు కైలాస పర్వతం దగ్గర గానీ, ఆ చుట్టూ గానీ ఎక్కడా గంగా నది కనిపించలేదు. కానీ స్వామీజీ సమాధానం చెప్పాలని భావించకపోతే, ఆ ప్రశ్నని దాటేసే విధానం ఏమిటో నాకు బాగానే అనుభవంలో ఉంది. కానీ ఆయన అబద్ధం చెప్పరు. అలాగే ఆ గుహ గంగ ఒడ్డున ఉందని ఆయన చెప్పినప్పుడు అది ఖచ్చితమైన విషయమే అయి ఉంటుంది.

ఒక రాత్రి, నేను దాదాపు పుస్తక అనువాదం ముగిస్తూ, 'పవిత్ర టిబెట్‌లో మా పరమగురువులు' అనే అధ్యాయాన్ని ఆయనకు చదివి వినిపిస్తున్నాను. అప్పుడు కూడా ఆయన నాతో, 'మా ప్రాచీన గుహ హిమాలయాల్లో ఉంది,' అన్నారు.

'అది లాసా దగ్గర ఉన్న టిబెట్‌లో ఉందా, స్వామీజీ?' అని అడిగాను.

'అహ, లేదు. మా పరమగురువులు సందర్శించిన చోటు నేను చూశాను. అది ప్రాచీన గుహ కైలాస పర్వతం దగ్గర ఉన్నది. ఓ రోజు నిన్ను నేను అక్కడికి తీసుకుని వెళ్తాను,' అని చెప్పారు.

బాబాజీ తమ శరీరాన్ని 1982లో తుంగనాథ హిమాలయ శిఖరం వద్ద విడిచి పెట్టారు. కానీ స్వామీజీ వారి గురించి ఎప్పుడు మాట్లాడినా, భూతకాల క్రియని ఉపయోగించరు. 'మా గురుదేవులు తమ శరీరాన్ని వదిలినప్పుడు' అనే అధ్యాయాన్ని నేను అనువదించే సమయంలో నేను ఆయన్ని, 'స్వామీజీ, బాబాజీ ఇప్పుడు ఎక్కడున్నారు?' అని అడిగాను. 'ఒకరోజు నిన్ను అక్కడికి తీసుకుని వెళ్తానులే,' అన్నారు ఆయన.

1996లో స్వామీజీ తమ శరీరాన్ని విడిచి పెట్టారు. కానీ 'ఒకరోజు నిన్ను అక్కడికి తీసుకుని వెళ్తానులే,' అంటూ ఆయన నాకిచ్చిన మాట గుర్తుంది. 1998 సంవత్సరం డిశెంబరు నెలలో ఒకనాటి రాత్రి, నా మనసంతా స్వామీజీ జ్ఞాపకాలతో నిండిపోయి ఉంది. సాధారణంగా నేను పడుకునే ముందు గురుమంత్రాన్ని జపిస్తాను. కానీ ఆ రాత్రి నేను ఆయన గురించి ఆలోచిస్తూ ఉండిపోయాను. ఎప్పుడు పడుకున్నానో గుర్తు కూడా లేదు. ఆ తెల్లవారుకట్ట నాకు స్వామీజీ కలలోకి వచ్చారు. ఆయన పక్కన నాకు బాగా పరిచయం ఉన్న మరో సాధువు కూడా ఉన్నారు. వాళ్లు నా లివింగ్ రూంలోకి వచ్చారు. నేను లేచి వారి కాళ్లకి నమస్కరించాను. స్వామీజీ నన్ను చేతుల్లోకి తీసుకోగానే నేను, 'స్వామీజీ! మీరెప్పుడూ నాతోనే ఉన్నారని నాకు తెలుసు. కానీ మీరు లేరనే చింత నన్ను బాధిస్తోంది,' అన్నాను. దానికి ఆయన, 'అయితే రా!' అన్నారు. దానర్థం బహుశా నేను చనిపోయిన తర్వాత ఆయన్ని కలుసుకోవడం గురించి మాట్లాడుతున్నారేమోనని అనుకున్నాను. నేను కలలో ఉన్నాను కాబట్టి అప్పుడు నాకనిపించింది. కానీ ఆయన అలా అనడానికి కారణం సరిగ్గా అడిగి తెలుసుకోవాలని అనిపించి, 'ఎక్కడికి?' అని అడిగాను. ఆయన 'నచికేత తాల్‌కి!' అన్నారు.

నాకు చాలా ఆనందం కలిగింది. అక్కడికి వెళ్లే ప్రయాణ సమయాన్ని లెక్కగట్టాను. ఢిల్లీకి చేరుకోవడానికి ఒక రోజు పడుతుంది. మరునాడు ఢిల్లీ నుంచి ఉత్తర కాశీ వెళ్లాలి. ఉత్తర కాశీ నుంచి నచికేత తాల్‌కి మరో రోజు ప్రయాణం ఉంటుంది. నేను చాలా ఉత్సాహం వచ్చేసింది. ఇంతలో స్వామీజీ నా భార్య వైపు చూసి, 'మీరా బేటీ, నా కోసం 'సూపర్ టిల్క్' తయారు చేస్తావా?' అని అడిగారు. 'సరే, స్వామీజీ!' అంటూ మీరా వాటిని తయారు చేయడానికి సిద్ధమైంది. స్వామీజీ ప్రక్కన ఉన్న సాధువు, 'ఈ టిల్క్ ఏమిటో?' అని అడిగాడు ఆయన్ని. దానికి స్వామీజీ నవ్వుతూ, 'మీకు చాలా నచ్చుతాయవి. మీకు హిమాలయాల్లో ఇది దొరకవు! ఇవి చాలా స్పెషల్. నేను టిల్క్ మీదే ఎన్నో ఏళ్లు జీవించాను. మీరు పాలల్లో టీ పొడి వేసి మరిగిస్తే, అది దాన్ని 'టిల్క్' అంటాము. దాంట్లో కుంకుమపువ్వు, యాలకులు కూడా వేస్తే దాన్ని 'సూపర్ టిల్క్' అంటాము' అన్నారు. వాళ్లిద్దరూ నవ్వుకున్నారు.

టిల్క్ త్రాగిన తర్వాత వాళ్లు అన్ని రకాల ఆధ్యాత్మిక, ప్రాపంచిక విషయాలపైనా చర్చించుకున్నారు. ఆ తర్వాత వాళ్లు వెళ్లిపోవడానికి లేచి నిలబడ్డారు. స్వామీజీ, 'నచికేత తాల్‌లో శీతాకాలంలో చాలా చలిగా ఉంటుంది. పైగా నీకు చేయాల్సిన పనులు చలా ఉన్నాయి. కైలాస పర్వతానికి వేసవి కాలంలో వచ్చి చూద్దువుగానీలే!' అన్నారు. అప్పుడు కొంటెగా నవ్వుతూ, 'నేను నిన్ను మా ప్రాచీన గుహకి తీసుకుని వెళ్లాలి. అది గంగానదీ తీరంలో ఉంది. నిన్ను, మీరానీ తీసుకుని వెళ్లడానికి నేను అన్ని ఏర్పాట్లూ చేశాను. ఇషాన్‌ని కూడా తీసుకుని రండి!' అని చెప్పారు.

ఇది జరగడానికి చాలా రోజుల ముందు, న్యూయార్క్, బఫాలో నుంచి బోనీ ఆల్బర్ట్ అనే ఒక ఆర్కిటెక్ట్ నాకు ఫోన్ చేయడానికి ప్రయత్నించింది. కానీ ఆ సమయంలో నేను అందుబాటులో లేను. కాల్ చేసిన విషయం గమనించి, మళ్లీ నేను ఆమెకి కాల్ చేయాలనుకున్నాను. అందువల్ల మర్నాటి ఉదయం నేను మెడిటేషన్ పూర్తి చేసుకుని వెంటనే ఆమెని ఇంటికి పిలిచాను. ఆమె నన్ను మొట్టమొదటగా అడిగిన ప్రశ్న ఏమిటో తెలుసా? 'మీరు కైలాస పర్వతం ఎప్పుడు వెళ్తారు?' అని! చాలా ఏళ్ల క్రితం స్వామీజీ గంగోత్రికి వెళ్లిన సమయంలో ఆమె కూడా ఆయనతో కూడా వెళ్లిందట. స్వామీజీ ఆమెకి కైలాస పర్వతం వద్దకు తీసుకుని వెళ్తానని మాట ఇచ్చారట. అప్పుడు నేను గత రాత్రి నాకు వచ్చిన కల గురించి ఆమెకు చెప్పాను. ఆ తర్వాత మరి కొంతసేపు మాట్లాడుకుని, స్వామీజీ చూపిస్తానన్న గుహని చూడడానికి వచ్చే వేసవిలో కైలాస పర్వతానికి మేం తప్పకుండా వెళ్లాలని నిర్ణయించుకున్నాం.

మా ప్లాన్స్‌ని నేను చాలా సీక్రెట్‌గా ఉంచాను. కానీ ఇక్కడ హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్‌లో ఏ విషయమూ ఎక్కువ కాలం దాచడం సాధ్యం కాదు. శక్తినీ, ఉత్సాహాన్నీ కూడగట్టుకున్నాము. మెల్లగా ఓ ఇరవై మందితో కూడిన యాత్రా బృందం నాతో బయల్దేరింది. హిమాలయ టూర్స్‌కి ఇన్‌స్టిట్యూట్ హెడ్ వాయిస్ అయిన షెల్లీ క్రాయిగో ఈ ట్రిప్‌కి బాధ్యత వహించాడు. నేపాల్, టిబెట్ ప్రభుత్వాలతో పేపర్ వర్క్ అంతా ముగించాడు.

చివరికి జూన్ 10 న మేమంతా బయల్దేరాము. జూన్ 12 కి మేము నేపాల్ చేరుకున్నాము. 15 వ తేదీన మేము ఖాట్మండూ నుంచి లాసాకి వెళ్లే ఫ్లైట్ ఎక్కాము. ప్రాచీన బౌద్ధారామాల్ని సందర్శించి దలైలామా పోటాల ప్యాలెస్‌కి వెళ్లాము. ఏడవ రోజు జూన్ 18 న మేము కారులో లాసా నుంచి కైలాస పర్వతానికి బయల్దేరాము. జూన్ 23 న పవిత్రమైన మానసరోవరం సరస్సుకి చేరుకున్నాము. మేము సరస్సు దగ్గరే రెండు రోజులు క్యాంప్ చేశాము. చివరికి జూన్ 25 న కైలాస పర్వత పాద ప్రాంతం దగ్గరికి చేరుకున్నాము. దర్చన్ చేరి అక్కడ క్యాంప్ చేశాము. పవిత్ర పర్వతం చుట్టు ప్రక్కల మూడు రోజుల సంప్రదాయబద్ధమైన పర్వతారోహణకి వీలు కల్పించడానికి ఏర్పాటు చేయబడ్డ ఓ చిన్న యాత్రా స్థావరం అది!

మా గ్రూప్ అందరికీ ప్రదక్షిణం చేయడం ప్రధాన లక్ష్యంగా ఉంది. కానీ నా చూపు మా గురుదేవులు చెప్పిన ప్రాచీన గుహ మీద ఉంది. లాసా నుంచి కైలాస పర్వతానికి వెళ్లే దారిలో నేను ఎక్కడ ఒక నదిని చూసినా, ఎలాంటి సెలయేటిని చూసినా, దానికి గల టిబెట్ పేరు ఏమిటో తెలుసుకోవడానికి ప్రయత్నించాను. ప్రతి సెలయేటికీ గల అసలు పేరుని అడుగుతూ వెళ్లేవాడిని. అది ప్రవహించి ఏ నదిలో కలుస్తుందో తెలుసుకునేవాడిని. భౌగోళికంగా కైలాస పర్వత ప్రాంతంలో గంగా నది లేదని నాకు తెలుసు. కానీ అది నిజంగానే అక్కడ ఎక్కడైనా ఉంటే బాగుండుననీ, ఆ విధంగా నేను మా ప్రాచీన గుహని కనుగొనవచ్చుననీ ఆశించాను. స్వామీజీ, ఆయన గురువుగారు అక్కడ మా కోసం నిరీక్షిస్తూ ఉంటారని నా భావన. స్వామీజీ నన్ను అక్కడకి రమ్మనీ, అక్కడ మనిద్దరం కలుసుకుందామనీ అన్నారంటే, అదే కదా అర్థం! పైగా ఆయన అందుకు తగ్గ అన్ని ఏర్పాట్లూ చేశానని కూడా నాకు స్పష్టంగా చెప్పారు.

జూన్ 26 వ తేదీ ఉదయాన్నే మేము మా సామానంతటినీ ఇరవై యాక్‌లపై వేసేశాము. ఒక టిబెట్ గైడ్, పదిమంది షేర్పాలు, యాక్‌మెన్ గ్రూప్ అంతా కలిసి బయల్దేరాము. మేము బాహ్య కోరా (ప్రదక్షిణ మార్గం) మీద నడవడం మొదలుపెట్టాము. ఈ ప్రయాణానికి ప్రారంభ స్థానం దార్చన్. అది 16,000 అడుగుల ఎత్తున ఉంది. లాసా 12,000 అడుగుల ఎత్తునే ఉంది. పదకొండు రోజుల నుంచీ నడుస్తుండడంతో ఇంత ఎత్తులో నడవడానికి మేము అలవాటుపడ్డాము. అయినప్పటికీ, చిన్నపాటి ప్రయాసకే మాకు ఎగవూపిరి వచ్చేసేది. అత్యవసరమైన

వస్తు సామాగ్రి ప్యాక్స్, అందులోనూ ముఖ్యంగా మంచినీళ్లు కూడా పెట్టుకుని మేము చాలా మెల్లిగా నడుస్తూ వెళ్లేవాళ్లం. మూడు గంటల తర్వాత మేము కైలాస పర్వతానికి పడమటి దిశలో ఉన్న లచ్చూ వ్యాలీలోకి ప్రవేశించాము. కాంతివంతమైన మేఘాలు హిమాలయ శిఖరాలకు కిరీటాల్లా అమరిన ఆ దృశ్యం ఎంతో మనోహరంగా ఉంది. ఆకాశం నిర్మలంగా ఉంది. మా సహచరుల్లో కొంతమంది బాగా ముందుకు వెళ్లిపోయారు, మరి కొంతమంది బాగా వెనకబడ్డారు. కానీ మా బృందంలో ప్రతి ఒక్క వ్యక్తికీ ఎంత శారీరిక సామర్థ్యం ఉందో అప్పటికే షేర్పాలు ఒక అంచనాకి వచ్చేశారు. ఆ అంచనా మేరకు ఎవరికి ఎక్కడ సహాయం చేయాల్సి ఉంటుందో నిర్ధారించుకుని ఆ ప్రకారం వారు ఎవరు ఎక్కడ ఉండాలో నిర్ణయించుకున్నారు. షేర్పాల నాయకుడు థిన్లే, టిబెట్ దేశానికి చెందిన గైడ్ భూఛుంగ్ ఈ ప్రయాణాన్ని అప్పటికే పది పదిహేను సార్లు చేసి ఉంటారు. వారు హిందీ, ఇంగ్లీషు, టిబెటన్, నేపాలీ భాషలు మాట్లాడతారు. వాళ్లకి ఈ పర్వతాల మధ్య నడవడమంటే, వాళ్ల స్వంత ఇంటి ముంగిలిలో నడిచినట్టే ఉంటుంది. వాళ్లు వెనక్కీ ముందుకీ సునాయాసంగా పరిగెడుతూ అందరూ సురక్షితంగా ఉన్నారో లేదో చూసుకుంటూ ఉండేవాళ్లు.

మేము లచ్చూ వ్యాలీలో ప్రయాణం చేస్తున్నపుడు నా కలలు, కోరికలు, ఊహాగానాలతో కూడిన ఒక అద్భుతమైన ప్రపంచంలో మునిగి తేలాను. ఇది 'పడమటి లోయ. మా ప్రాచీన గుహ ఇక్కడే ఎక్కడో దగ్గరలోనే ఉంటుంది. కానీ గంగా నది ఎక్కడ? ఈ లోయ గుండా ప్రవహిస్తున్న ఈ నది పేరు ఏమై ఉంటుంది? ఇంకా ఇది మొదటి రోజే. రేపు గానీ, ఆ మర్నాడు గానీ చూడాలి ఎక్కడుందో అది...' ఇలా నాలో నేనే ఆలోచించుకుంటూ నడుస్తున్నాను. ఇంతలో అకస్మాత్తుగా నదికి ఒక మైలు దూరంలో పడమటి తీరంలోని ఆ పర్వతపు వాలులో ఒక చిన్న నిర్మాణం కనిపించింది. 'ఇదే ఆ ప్రాచీన గుహ ప్రవేశద్వారమై ఉంటుందా?' అని నా మనసులో బలంగా అనిపించింది. మా టిబెట్ గైడు భూచుంగ్ కూడా అప్పుడే మా దగ్గరకి వచ్చాడు, మేమేం చేస్తున్నామో చూడడానికి! నేను ఆ నది పేరు ఏమిటని అడిగాను అతడిని. అతడు 'లచ్చూ నది!' అన్నాడు.

'దీనికి 'లచ్చూ' అనే పేరు ఎందుకు వచ్చింది? ఏమిటి దానర్థం?' అడిగాను నేను.

'ల' అంటే 'దేవుడు', 'చు' అంటే నీరు. ఆ విధంగా ఇది 'దేవతా జలం', 'దేవతల నది', 'దివ్యనది' అయింది. ఈ వ్యాలీని 'లచ్చూ వ్యాలీ' అని కూడా అంటారు.

'ఏమిటి ఆ కనిపించే నిర్మాణం?' అడిగాను నేను, ఆ నది మీదుగా చూపిస్తూ.

'అది చోకు గుంపా (చోకు బౌద్ధమఠం)', అని బదులిచ్చాడు అతడు.

'ఆ పర్వతం పేరేమిటి?'

'దేవ పుత్ర భవనం.' దీన్ని టిబెట్ భాషలో 'నైన్రీ' పర్వతం' అంటారు.'

'ఈ బౌద్ధారామాన్ని ఎవరు స్థాపించారు? ఇంకా ఇప్పటికీ ఎవరైనా ఇక్కడ ఉంటున్నారా?' నేను అడిగాను.

భూచుంగ్ జవాబిచ్చాడు, 'నాకు తెలియదు. కానీ యాక్ కాపరులు ఈ ప్రాంతంలోనే ఉంటారు. వాళ్లకి ఈ పర్వతాల గురించి బాగా తెలుసు. దీని గురించి వాళ్లు ఏమైనా చెప్పగలిగే అవకాశం ఉంది.'

యాక్ కాపరులు తమ యాక్ మందల్ని తోలుకుంటూ వస్తున్నారు. వాళ్ల వెంట కుక్కలు కూడా ఉన్నాయి. భూచుంగ్ అనువాదకుడిగా వ్యవహరించాడు. వాళ్లందరిలో పెద్దగా కనిపిస్తున్న వ్యక్తిని నేను ప్రశ్నలు అడిగాను. అతడి కళ్లు ఆనందంగా మెరవసాగాయి. కనీసం ఈ

మార్మిక విషయ సంపదని ఎవరో తెలుసుకోవాలని కోరుతున్నారనే సంగతి అతడికి ఆనందం కలిగిస్తోంది.

'అవును, ఈ పర్వతం పేరు 'దేవపుత్ర భవనం!' అన్నాడతడు.

"వేలాదిమంది దేవతలు, దేవుళ్లు కొలువుంటారు ఇక్కడ. ఆయన పేరు సనగ్వా. ఆయన తండ్రి డెమ్‌చోక్, తల్లి పార్వతి. ల్ఛాచ్చు కూడా అతడి తల్లే.'

'ఆయన చాలా నిదానంగా ఉంటాడు, కానీ చాలా శక్తివంతుడు, అద్వితీయమైన యోధుడు. ఆయనకు ఈ పర్వతశ్రేణిలో ఒక దానిపై చాలా కోపం వచ్చింది. వందలాది బాణాల్ని దాని పైకి వదిలాడు. అందుకే అది జల్లెడలా కనిపిస్తుంది. నైన్రీ పర్వతంలో ఎన్నో గుహలున్నాయి. అక్కడ దివ్యపురుషులు ఎంతోమంది సనగ్వా అతిథులుగా ఉంటారు. వాళ్లంతా ఎంతో కరుణామయులు. వారు మా యాక్‌లనీ, గొర్రెల్ని కాపాడతారు. వాటికి రోగాలొస్తే నయం చేస్తారు.'

బౌద్ధారామం వైపు చూపిస్తూ నేను అడిగాను, 'ఆ చోటు గురించి చెప్పండి? అది ఏదో ఒక గుహలా కనిపించడం లేదు. ఆ గుహని ఎవరు నిర్మించి ఉంటారు? అక్కడ ఎవరైనా ఉంటున్నారా?'

'అవును. అప్పుడెప్పుడో చాలా కాలం క్రితం, మనుష్యులెవరూ ఇక్కడికి రాక మునుపు, దేవదూత అయిన ఒక లామా, ఈ వ్యాలీకి వచ్చారు. ఆయన పేరు నైన్. ఆయన చాలా తెలివైనవాడు. ఆయన అగ్నిని రాజేశాడు. దేవపుత్రుడికి ఆయన పట్ల చాలా ఆత్మీయత ఏర్పడింది. ఆయనతో తన భవంతిలో ఒక గొంప (బౌద్ధారామం) నిర్మింపజేస్తానని చెప్పాడు. ఆ విధంగా, సనగ్వా అనుమతి, ఆశీస్సులతో, కాలం మొదలైన సమయంలో ఈ గొంప నిర్మింపబడింది. ఇది అనంత కాంతిని ప్రసరించే అమితాభ మూర్తి కోసం కట్టబడిన దేవాలయం.'

ఇలా మాట్లాడుతుండే సరికి అతడి యాక్‌లు కనుచూపు మేర దాటిపోయాయి. వాటిని అందుకోవడానికి అతడు పరిగెత్తవలసి వచ్చింది. భూచుంగ్ కూడా ముందు నడుస్తున్న జనాన్ని చెక్ చేసుకోవడానికి వెళ్లిపోయాడు. మా గ్రూపులో ఎక్కువమంది మాతోనే ఉండిపోయారు. ఆ మనోహరమైన వాతావరణంలో ఎవరికీ మాట్లాడ బుద్ధి కూడా కావడం లేదు. ఆ పర్వతాలు, లోయ, నది, ఆకాశం, మేఘాల అద్భుతమైన అందాల్ని చూడడానికి కళ్లు రెండూ చాలడం లేదు.

నా మనసులో ప్రశ్నలు మెదులసాగాయి. టిబెటన్లు భావిస్తున్న కరుణామయుడు, శక్తివంతుడు, అసమాన యోధుడు అయిన ఈ దేవపుత్రుడు ఎవరు? టిబెటన్ల పురాణ గాథల ప్రకారం డెమ్‌చోక్ అతడి తండ్రి, పార్వతి అతడి తల్లి. లచ్చు నది కూడా అతడికి తల్లే అవుతుంది. ఆ యాక్ కాపలాదారు అన్నట్టు, ఈ దేవపుత్రుడికి ఒక పర్వతం మీద క్రోధం వచ్చింది. దాంతో అతడు ప్రయోగించిన బాణాల వల్ల ఒక జల్లెడని పోలిన రంధ్రం పర్వతంలో ఏర్పడింది. వేద పరంపరలో కూడా శివుని కుమారుడు ఎంతో కోపంగా ఉంటాడనీ, అతడు క్రౌంచ పర్వతం మీద బాణాలు వేశాడనీ ఉంటుంది. టిబెటన్లు అనే ఈ దేవపుత్రుడి పేరు సనగ్వా. వేద పరంపరలో సనత్కుమారుడనే ముని ఉన్నారు. ఆయన శివునికి కుమారుడిగా జన్మించాడు. అతడి తండ్రి, పార్వతి అతడి తల్లి. టిబెటన్ల పరంపరలో ల్ఛాచ్చు నది కూడా అతడి తల్లి అని చెప్పబడింది కదా! వేద పరంపరలో గంగా నది కూడా సనత్కుమారుడికి తల్లి. బహుశా ఈ సనగ్వా, సనత్కుమారుడే అయి ఉండాలి. ఎందుకంటే, సనత్కుమారుడి పేరు సనక్వాదుడు. భారతదేశంలోని తూర్పు భాగంలో మాట్లాడబడే భాషల్లో ఇలాగే ఉంటుంది. టిబెట్ భాషలో చివరి అక్షరాన్ని వదిలేస్తారు. ఆ విధంగా 'సనకపాద' కాస్తా 'సనక్వా' అయింది. టిబెటన్ భాషలో సనగ్వాని 'కోర్వా' అని కూడా అంటారు. దానికి సంస్కృత భాషలో సమాన పదం 'కుమార పాద' (సనత్‌కుమార). 1983లో

స్వామీజీ, 'మా సంప్రదాయాన్ని ఆరంభించిన సనత్కుమార మహర్షి అమరుల'ని చెప్పారు నాతో. కాబట్టి ల్హచ్చు నదే దివ్యపావన గంగా నది. ఈ పర్వతమే ఆమె కుమారుడైన సనగ్పా భవంతి.

'సనగ్పా' యే 'సనత్కుమారులు', ఆయనే దేవపుత్రులు. మరి ఈ దేవదూత 'నైన్' ఎవరు? అయితే ఆ మహర్షి స్వామీజీ చెప్పిన అంగీర మహర్షి అయి ఉండాలి. ఎందుకంటే ఆ ప్రాంతపు యాక్ కాపలాదారు చెప్పినదాన్ని బట్టి చూస్తే, నైన్ అగ్నిలా వెలిగిపోయేవాడు. వేదాలు అంగీరస మహర్షి గురించి ఇలాగే వర్ణిస్తాయి. ఆయన తపోబలంతో అగ్నిలా ప్రజ్వరిల్లేవాడు. అందుకే ఆయన పేరు 'అంగీరస, 'అగ్నిలా ప్రకాశించేవాడు' అని వచ్చింది. అలాగే ఉపనిషత్తులు, పురాణాలు, అంగీరస మహర్షి సనత్కుమారుడితో కలిసి ఏ విధంగా అధ్యయనం చేసేవాడో వర్ణించాయి. ఇదే మనం వెళ్లాలనుకుంటున్న ఆ ప్రాచీన గుహ ఇదే' అనే స్పష్టత నాకు వచ్చేసింది.

మనసంతా భావోద్వేగం కమ్మేసింది. నేను నా భార్యతో హిందీలో అన్నాను, 'మీరా, ఈ ప్రదేశం ఎంత అందంగా, ఎంత ప్రశాంతంగా ఉంది. ఇక్కడ కొంత కాలం ఉండి, సాధన చేసుకుంటే ఎంత బాగుంటుంది!'

అందుకు ఆమె, 'మనకి ఆ బయటి ప్రపంచంలోకి వెళ్లి చేయాల్సింది కూడా ఏముంది గనుక! సాధనలో ప్రారంభ దశ అక్కడ చేసుకుని, ఇక్కడికి వచ్చి ముగించండి,' అంది.

మేమిలా మాట్లాడుకుంటూ ఉండగానే మా కుడి వైపుగా ఉన్న కైలాస పర్వత ప్రధాన శిఖరాన్ని చూశాను. నా కళ్లను నేనే నమ్మలేకపోయాను. అక్కడ ఆర్చి ఆకారంలో గేటు ఉంది. నేను మీరాతోనూ, మిగతా బృంద సభ్యులతోనూ శిఖరం వైపు చూడమని చెప్పాను.

వాళ్లు మ్రాన్పడిపోయారు. 'దీన్ని ఓ ఫోటో తీసుకోవచ్చా?' అని అడిగారు ఎవరో. 'ఏం? ఎందుకు తీసుకోకూడదు?' అన్నాను నేను. మా అబ్బాయి ఇషాన్, టీనేజిలో ఉన్న మరి కొంతమంది బృంద సభ్యులు అప్పటికే పైకి వెళ్లి, బౌద్ధారామం దగ్గర విశ్రాంతిగా కూర్చున్నారు. వాళ్లని వెనక్కి వచ్చి ఈ దివ్యాకృతిని కళ్లారా చూడమని కేకేశాను.

'ఇది మనకి కనబడిందంటే, ద్వారాలు తెరిచే ఉన్నాయని అర్థం. ఇక మనం సాధన చేయాలి. అమరత్వం సిద్ధిస్తుంది,' అన్నాను నేను.

మేము సింబాలిజం గురించి చర్చించుకుంటూ ఉంటే, ఆ గేటు మరింత కాంతివంతంగా గోచరించసాగింది. ప్రవేశద్వారం దగ్గర ఎవరో ధవళాకారంలో నిలబడి ఉన్నారు. అది ఎవరి ఆకారమై ఉంటుంది? స్వామీజీయా? ఆయన గురూజీయా? ఎవరైతేనేం? ఆ ఆకారం మేమున్న చోటికి కనీసం 5,000 అడుగుల ఎత్తున ఉంది. ఆ పర్వతం కనీసం ఒక మైలు దూరంలో ఉంది. మేం దర్శిస్తున్న ఆ ఆకారం భౌగోళికమైనది కాదు, అలాగే అది భ్రాంతి కూడా కాదు. ఎందుకంటే అక్కడున్న అందరూ దాన్ని చూడగలుగుతున్నారు. మేమంతా ఆ ఆకృతికి కృతజ్ఞతాపూర్వకంగానూ, భక్తిప్రపత్తులతోనూ శిరసు వంచి నమస్కరించాము.

మరోసారి నేను మా బృందంతో, 'మనల్ని ఇక్కడికి తీసుకుని వచ్చినవారే తమ వాగ్దానాన్ని నిలబెట్టుకుంటూ అక్కడ దర్శనమిస్తున్నారు! ఆయన మనకు తమ ప్రాచీన గుహని చూపించారు. మనం మన లక్ష్యాన్ని చేరుకున్నాము. మన యాత్రని ఇక్కడితో ముగించాలనుకున్నా, కొనసాగించాలనుకున్నా, అంతా ఆయన చిత్తమే,' అన్నాను.

మా బృంద సభ్యుల్లో శాండీ ఆండర్సన్ గట్టిగా అరిచాడు, 'చూడండి ఇక్కడోసారి!' అంటూ. అతడు ఓ అందమైన శిలా ఫలకం మీద చేయి వేసి పట్టుకున్నాడు. దాని మీద హిందీ భాషలో ఏదో రాసి ఉంది. దాని మీద 'ఇషాన్' అని వ్రాసి ఉంది. మేము లాసా నుంచి కైలాస పర్వతానికి వెళ్లే దారిలో వందలాదిగా మణిశిలలు కనిపించాయి. వాటిలో చాలా వాటిపై 'ఓం మణి పద్మేహం' అని చెక్కబడి ఉంది. అన్నిటిపైనా టిబెట్ భాషే ఉపయోగించబడింది తప్ప

సంస్కృతం గానీ, హిందీ గానీ కనబడలేదు. దానితో మేము బాబాజీ ఉండే ప్రదేశాన్ని కనుక్కున్నామని నిర్ధారించుకున్నాము. మా గురుదేవులు, వారి గురుదేవులూ కూడా ఇక్కడ సజీవంగా ఉన్నారని నాకు అచంచలమైన విశ్వాసం కుదిరింది. శివుని ఎనిమిది రూపాల్లోనూ ఇషాన్ రూపం 'సూర్య' దేవుని రూపం. ఇషాన్ ప్రకాశ స్రోతస్సు. టిబెట్ బౌద్ధ పరంపరలో ఇషాన్‌ని 'అమితాభు'నిగా, అనంతమైన ప్రకాశరూపంగా భావిస్తారు. యాక్ కాపలాదారు చెప్పిన విషయం ఇదే!

మేమింకా ఆ గేట్‌ని చూసిన ఆనందంలోనే ఉన్నాం. ఇంతలో ఆ యోగి 'ఇషాన్' అని చెక్కబడి ఉన్న శిలాఫలకం వద్ద నిలబడ్డాడు. అక్కడ ఆయనని చివరిసారిగా చూశాము. కైలాస పర్వతం మూడు నేత్రాలుగా మారిపోయింది. ఈ త్రినేత్ర రూపం గురించి నేపాల్, సిక్కిం, భూటాన్‌లలో అనేక గ్రంథాల్లో వ్రాయబడి ఉంది. బౌద్ధారామాల్లోనూ, టిబెటన్ పెయింటింగ్స్‌లోనూ వర్ణించబడిన త్రినేత్ర రూపాన్ని మేము అక్కడ చూశాము. కళకి, వాస్తవ రూపం ఆలంబన ఎక్కడో అక్కడ ఉండాలి. ఆ వాస్తవ రూపమే కైలాస పర్వతం.

ఆ త్రినేత్ర రూపం వైపు కెమేరాలు తిప్పడానికి ఎవరికీ ధైర్యం చాలలేదు. మనసులో ఒక ఆలోచన మెరుపులా మెదిలింది. ఈ దర్శనం మా అందరికీ ఇవ్వబడింది. అంటే, వారిని చూడడానికి వచ్చిన సాధకులందరికీ వారు దర్శనమిచ్చి ఆశీర్వదించారు. ఒకవేళ నా మనసు కల్మషమైతే, అప్పుడు కెమేరాలో ఆ దివ్యరూపాన్ని బంధించడం కుదరదు. అందువల్ల నేను ప్రతి ఒక్కరినీ ఫోటోగ్రాఫ్ తీయమని అడిగాను. అవి డెవలప్ చేయించబడినపుడు, అన్ని ఫోటోగ్రాఫ్‌లోనూ గేటు దాటి లోపలికి వెళ్తుంటే తలుపు దగ్గర సాధువు అన్నీ స్పష్టంగా కనిపిస్తున్నాయి.

కైలాస పర్వతాన్నీ, పవిత్ర సరోవరాన్నీ చూడకముందు (స్వామీజీ తమ గురువులు, పరమ గురువుల గురించి అనేక కథలు చెప్పినప్పటికీ) నాకు ఆ విషయాల్లో చాలా పరిమితమైన అవగాహన ఉంది. కానీ నేను కైలాస పర్వతానికి వెళ్లి వచ్చిన తర్వాత స్వామీజీ మాటలు జీవితంలో నిజమయ్యాయి. నేను పశ్చిమ లోయలో లచ్చూ నదిని చూసినపుడు స్వామీజీ 'గంగా నది' అనడంలోని ఆంతర్యాన్ని అర్థం చేసుకున్నాను. ఆయన లచ్చూనదినే 'గంగా నది' గా సంబోధించారు. గంగానది పుణ్యనది అనీ, 'ఆకాశ గంగ' అనీ వేదాలు ఘోషిస్తున్నాయి. శిఖరాగ్రాల నుంచి గ్లేసియల్ ప్రవాహాలు ప్రవహించగా వచ్చిన నీరు టిబెట్, నేపాల్, భారతదేశంలో ప్రవహిస్తూ, చివరికి సముద్రంలో కలిసిపోతుంది. ఈ మహర్షుల నుంచి ప్రవహిస్తున్న జ్ఞాన గంగ దేశ ప్రజలందరికీ కులమతాతీతంగా అన్ని విశ్వాసాల వారినీ తరింపజేస్తుంది. ప్రస్తుతం ఆ గుహ బౌద్ధ పరంపరకి చెందిన 'ఛోకు బౌద్ధారామం'గా ఉంది. అంటే బాబాజీ బౌద్ధులా? హైందవ భావన ప్రకారం, కైలాస పర్వతం శివుని నివాసం. బాబాజీ ఇక్కడే నివసించారు, ఆధ్యాత్మిక దీక్ష తీసుకున్నారు. అయితే ఆయన హిందూ సంప్రదాయంలో శైవ మతస్థులా? ఆయన గంగోత్రిలో నివసిస్తున్న సమయంలోనే ఆయన ఎక్కువ సమయం 'భైరవ ఘాటీ' గా పేరొందిన భైరవ ఆలయంలోనే గడిపేవారు. భైరవుడు శివుని శుద్ధ తాంత్రిక రూపం. అయితే బాబాజీ ఒక తాంత్రిక యోగి అయి ఉంటారా? బాబాజీ నేరుగా వేద పరంపరకి చెందిన మహర్షులకు వారసులనే సంగతి తథ్యం. శ్రీ శంకరాచార్య సంప్రదాయంలో సన్యాస దీక్ష తీసుకున్నారు. ఆ విధంగా నేరుగా శంకరాచార్య సంప్రదాయంతోనే వారికి అనుబంధం ఉంది.

ఈ ప్రశ్నలకి సమాధానాలు మనకి తరుచుగా స్వామీజీ పరిశీలనల్లోనే లభిస్తాయి. 'మహర్షులు ఎలాంటి సంప్రదాయం, మతం, జాతికి చెందినవారు కారు. వారు భగవదంశకి చెందినవారు. వారు వాయురూపంలో చరిస్తుంటారు. వారు ఎవరికీ వశీభూతులు కారు. వారి మతం ప్రేమ మతం. వారు పరస్పరం సాంధ్య భాషలో సంభాషించుకుంటారు.'

మనం విశ్వసనీయంగా చెప్పుకోదగిన విషయం ఒకటే– బాబాజీ ఒక హిమాలయ నుంచి వచ్చిన 'ఉన్నత శిఖరం' లాంటి సాధువు. ఆయన హృదయం హిమాలయాల్లోని హిమం కంటే ధవళం. ఆయన అమరులు. అధ్యాత్మిక సాధనలో ఉన్నత శిఖరాగ్రంలో ప్రతిష్ఠితులైన మహర్షి, తన బోధని సంపూర్ణంగా అర్థం చేసుకోగల భవాల్ సన్యాసి, స్వామీ రామ తీర్థ, స్వామీ శివానంద, సర్ జాన్ వుడ్రోఫ్, స్వామీ రామ లాంటి శిష్యపరమాణువుల కోసం వెతుక్కుంటూ అప్పుడప్పుడూ ఆయన భౌతికంగా మనుష్యుల మధ్యకి వచ్చేవారు.

స్వామీజీ తమ గురువుల వద్దకు నన్ను తీసుకుని వెడతానని 1976 ప్రారంభంలో అనేకమార్లు చెప్పారు. కానీ 1982లో గఢ్వాల్ ప్రాంతంలోని తుంగనాథ్‌లో బాబాజీ శరీరం వదిలేశారని తెలియడంతో నేను మోసపోయాననని అనిపించి నిరాశ కలిగింది. అయితే నాకు 1983లో అనువాదం చేస్తున్న సమయంలో పరమగురువుల అమరతత్వం గ్రహింపుకి వచ్చింది. వీరి జననం, మరణం ఓ భ్రాంత స్వభావంతో మెలుగుతుంటాయి. 1983లో అనువాదం చేస్తున్న సమయంలో స్వామీజీ నన్ను తమ గురువుల వద్దకు తీసుకుని వెడతానని చెప్పారు. కానీ నవంబరు 1996లో స్వామీజీ తమ శరీరాన్ని విడిచిపెట్టారు. మరి ఆయన నాకిచ్చిన మాటని ఎలా నిలబెట్టుకుంటారో నాకు అర్థం కాలేదు. రెండేళ్ల తర్వాత ఆయన ఈ వాగ్దానమే మళ్లీ చేశారు కలలో! అందులో నన్ను స్వామీజీ కైలాస పర్వతానికి నన్ను రమ్మన్నారు. నేను వెళ్లాను. ప్రధాన శిఖరం వద్ద ఆర్చిగేటు వద్ద నిలబడిన సన్యాసి ఈయనే! నేను కైలాస పర్వతం దగ్గర కలుసుకున్నది స్వామీజీయే కావచ్చు లేదా బాబాజీ కావచ్చు. ఈ ప్రశ్నకి సమాధానం నాకు నేనే చెప్పుకోవాలి. అర్థం చేసుకోవాలి. బహుశా నాకు ఎప్పటికీ ఈ ప్రశ్నకి సరైన సమాధానం దొరక్కపోవచ్చు కూడా.

కానీ కైలాస పర్వతం వద్ద శాశ్వత నివాసం ఉంటూ, స్వామీజీని అనంతమైన ప్రాపంచిక జీవనంలోకీ, ఆధ్యాత్మిక అనుభూతుల్లోకీ నడిపించి, తద్వారా జీవితంలో ఏ ఘట్టంలోనైనా, ఏ స్థితిలోనైనా ఆనందంగా ఉండేలా వ్యావహారిక శిక్షణనిచ్చిన మహనీయులు ఎవరైనా ఉన్నారా అనేది నాకు తెలియదు.

ఓసారి నేను నా అజ్ఞానంలో స్వామీజీని, 'మీరు బాబాజీతో ఎక్కువ సమయం గడిపారా!' అని అడిగాను. దానికి స్వామీజీ అనంగీకారాన్ని సూచిస్తూ తల అడ్డంగా ఊపి, 'భగవంతుడికి తప్ప వేరెవ్వరికీ సమయం ఇవ్వడానికి మన దగ్గర లేనపుడు ఎవరితోనైనా ఎలా గడుపుతాం?' అన్నారు. బాబాజీ వ్యర్థమైన ప్రశ్నల్ని అడగనిచ్చేవారు కాదు, అలాగే చెప్పిన విషయాన్ని శిష్యుడు సరిగా అర్థం చేసుకుని, జీర్ణం చేసుకుని తన తత్వంలో భాగం చేసుకునేవరకూ మళ్లీ ఏమీ బోధించేవారూ కాదు. ఆయన స్వామీజీని తరచూ ఇతర సాధువుల వద్దకు పంపేవారు. వారి పాదాల వద్ద కూర్చుని నేర్చుకోమనేవారు. ఆ విధంగా స్వామీజీకి వినయం, నిజాయితీ, స్వీయప్రేరణ, అంకితభావం లాంటి మౌలిక భావనల్ని అలవడేలా చేశారు. బాబాజీ స్వామీజీని ఎన్నడూ తనని గానీ, వేరే ఏ ఇతర సిద్ధాంతాన్ని గానీ, దైవాన్ని గానీ విశ్వసించమని బలవంత పెట్టేవారు కాదు.

కానీ స్వామీజీని తనంతట తానుగా ఉన్నత సత్యంలో విశ్వాసం ఉంచమని చెప్పేవారు. స్వామీజీ తన విశ్వాసాన్ని తర్కం, హేతువు అనే అగ్నిలో వ్రేల్చేందుకు ప్రేరేపించేలా ఆయన కొన్ని పరిస్థితుల్ని సృష్టించేవారు. ఆ విధంగా తన శిష్యుడు తన స్వీయానుభవానికి విలువనిచ్చుకునేలా చేశారాయన. బాబాజీ స్వామీజీకి తనకిష్టమైన ఎంపికల్ని ఎంచుకునేందుకు తగిన అవకాశాన్ని కల్పించారు. స్వామీజీని సన్యాసులు (నిజమైన సాధువులు, సాధువర్తన లేని కృత్రిమ సాధువులు, ఇద్దరి వద్దకూ), రాజకీయనాయకులు, వ్యాపారవేత్తలు, పండితులు, కళాకారులు, వక్తలతో కలిసి

ఉండేందుకు పంపారు. ఆయన స్వామీజీకి సన్యాస జీవితంలో ఉండే కష్టాలు, సంపదల్లో ఉండే వైభవమూ స్వయంగా అనుభవానికి వచ్చేలా చేశారు.

ఈ ప్రాపంచిక జీవనంలో సుఖాలుగా భావింపబడేవి నిజానికి ఎంత అశాశ్వతమో, అనాసక్తికరమో స్వామీజీ స్వయంగా అర్థం చేసుకుని విరక్తి చెందేలా చేశారు బాబాజీ. ప్రాపంచిక జీవనం నుంచి పారిపోయి ఆధ్యాత్మికతలో ఆశ్రయం పొందడం మరో రకమైన విషాద పరిష్వంగంలో చేరడమే. లౌకికం నుంచి పారమార్థిక జీవనశైలిలోకి ప్రవేశిస్తే ఇప్పటిదాకా ఉన్న లౌకిక దాహం తీరుతుందని ఆశించడం, ఐహిక పొరలో ఉన్న సమస్యలు ఆముష్మికంలోకి ప్రవేశిస్తే ఉండవని భావించడం పెద్ద భ్రమ. అలాగే మన గురుదేవులు గొప్పవారనీ, మనం విశ్వసిస్తున్న దైవం గొప్పదనీ తెలుసుకున్నంత మాత్రాన సరిపోదు. మనసు మర్మం కనుగొంటేనే, ఐహిక ఆకర్షణల పట్ల మనిషిని లాక్కుని వెళ్లడానికి అది చేసే ప్రయత్నాల్ని కనిపెట్టగలిగితేనే మనకి శాంతి, సంతోషం! ఒక ప్రక్క ఈ ప్రయత్నం సాగించాలి, మరో ప్రక్క ఆముష్మిక చింత ఉండాలి. ఈ మార్మిక యవనిక (తెర)ని మనం ఏకాంతంలో ఉంటూనో లేక గొప్ప ఆధ్యాత్మిక ప్రజ్ఞ, శక్తి గల మహనీయుని సమక్షంలోనో తొలగించలేము. ముందుగా మనం మన మనస్సుకి శిక్షణ ఇవ్వాలి. మన అలవాట్లని మెల్లగా మార్చుకోవాలి. ఎందుకంటే మనం ఈ ప్రపంచంలోనే ఉండాలి, కానీ దానివల్ల ఏ మాత్రం ప్రభావితం కాకూడదు.

బాబాజీ ఆధ్యాత్మికతని ఒక స్వీయ రూపాంతరణ ప్రయాణంగానూ, ఆంతరిక విజయంగానూ గుర్తించారు. ఈ ప్రయాణాన్ని మనమంతా చేసి తీరాల్సిందే, ముందో, వెనకో! ఆయన స్వామీజీకి జీవితమనే ఈ అల్లకల్లోలమైన జీవన నదిలో వెళ్తుండగా వచ్చే సుఖదుఃఖాలనే సుడిగుండాల్లో పడకుండా ఎలా తరించాలో ఉద్బోధించారు. ఉన్నత కైలాస పర్వత శిఖరాలకు వెళ్తూ సంతోషంగా, శాంతిగా ఎలా ఉండాలో చెప్పారు. టోక్యో లేదా న్యూయార్కు వీధుల్లో రణగొణధ్వనుల మధ్య ఎలా నడవాలో నేర్పించారు. బాబాజీ స్వామీజీకి సన్యాసులు వర్షించే అపార ప్రేమలోనూ, అలాగే ఆయనను ప్రేమిస్తున్నట్టు నటించేవారి కృత్రిమత్వంలోనూ కూడా దివ్యసంగీతాన్ని ఆనందించడం నేర్పించారు.

బాబాజీ బోధలు, శిక్షణ స్వామీజీని రచనా వ్యాసంగంలోకి దించాయి. ఒకరోజు ఆయన తమ గురుదేవుల గురించి ఇలా రాసుకున్నారు, *'మీలా ఎవరున్నారు? మీలా నా జీవనగీతిలో ఆనందం, విచారం, ఉద్విగ్నతల్ని ఎవరు మేళవించి పెట్టారు? బాధాపద్మంలో ఇంకా గూడుకట్టుకుని ఉన్న ఆనందాన్ని నేను గుర్తించేలా ఎవరు చేశారు? ఆ ఆనందమంతా మట్టిలో కలిపేస్తూ పోతున్నా సరే, ఆ సంగతి లేశమాత్రం కూడా తెలియని అజ్ఞానాన్ని నాచే గుర్తింపజేసింది ఎవరు? మీ సందేశాన్ని అర్థం చేసుకోగలిగిన వారికి ఈ ప్రపంచంలో ఏ భయమూ లేదు. అందుకే, మీ చరణారవిందాలకు నా అమర కృతజ్ఞతాంజలి!'*

అధ్యాయం 3

# పరమగురువులతో జీవనం

స్వామీజీ బోధల్లో తరుచుగా 'నువ్వు ఇప్పటికే దైవత్వం సాధించావు. ఇక నువ్వు చెయ్యాల్సిందల్లా మానవుడిగా మారడం!' అని చెప్పేవారు. ఈ అవగాహన సాధించడానికి ఇరవై సంవత్సరాలుగా నేను అనేక పర్యాయాలు ప్రయత్నిస్తూనే వచ్చాను. కానీ ఇప్పటికీ ఈ విషయంగా నేను అసంపూర్ణంగానే ఉన్నాననే విషయం అర్థమైంది. స్వామివారి అంతిమ దినాల్ని గమనించినపుడే నాకు ఆ బోధసారం ఒక్కసారిగా స్ఫురించింది. తనలోని దివ్యత్వాన్ని మాయావరణానికి లొంగకుండా ఎంతో ఒడుపుగా సంరక్షించుకునేవారు ఆయన. తనలోని దివ్య ప్రకాశం చూపే వెలుగులో ఆయన నిరంతరం స్వేచ్ఛావిహంగంలా విహరిస్తూ అమితానందంలో ఉండేవారు.

స్వామీజీ తన దేహాన్ని త్యజించడానికి తొమ్మిది సంవత్సరాల ముందు హిమాలయ పర్వత సానువుల వద్ద వైద్యశాల, వైద్య కళాశాల, నర్సింగ్ స్కూల్‌ను అదేరకంగా రూరల్ డెవలప్‌మెంట్ ప్రాజక్ట్‌ను నిర్మించాలనే బృహత్తరమైన కార్యక్రమాన్ని చేపట్టారు. ఈ పథకాలన్నీ 1994-96 సంవత్సరాలలో కీలకమైన దశకి చేరుకున్నాయి. ఆరోజుల్లో భారత క్యాబినెట్ మంత్రులు, ఉత్తరప్రదేశ్ గవర్నరు, ఇతర రాష్ట్రాల గవర్నర్లు, అనేక మంది వి.ఐ.పి.లు స్వామివారిని కలిసి పూలమాలలతో సత్కరిస్తూ జ్ఞానసంపన్నతనీ, నిస్వార్థంగా మానవాళికి చేస్తున్న సేవనీ ఎంతగానో కొనియాడేవారు.

కానీ అక్కడ ప్రాంతీయంగా ఉండే ఛోటా మోటా రాజకీయ నాయకులు ఆయన సి.ఐ.ఎ., ఏజంట్ అనీ, పాశ్చాత్య దేశాల నుంచి నిధులు తీసుకొస్తున్నారనీ, విదేశీ శాస్త్ర పరిజ్ఞానానికి లొంగిపోయారనీ ఆరోపించేవారు. స్వామీజీ తమ మాతృదేశ గౌరవానికీ, దాని ఔన్నత్యానికీ ఎలాంటి భంగం కలిగించడంలేదనీ అక్కడి గ్రామాలలోని వివిధ ప్రజా సమూహాల ముందు ఋజువు చేసుకోవలసిందిగా వారిపై తీవ్రమైన ఒత్తిడి తెస్తుండేవారు. నేను గమనించినంత వరకూ స్వామీజీ వ్యక్తిత్వం రెండు భిన్నధృవాలకి చెందింది. ఆయన ఏ పరిస్థితిని అయినా స్థిరచిత్తంతో సమభావంతో ఎదుర్కొనేవారు. అలాంటి సందర్భాల్లో చూసినపుడు మాత్రమే నాకు ఆయన తరచుగా చెబుతుండే, 'సన్మానాలకీ, అవమానాలకీ అతిశయించకుండా నిశ్చలంగా ఉండేవారే దివ్య జ్యోతిని చైతన్యవంతంగా ఉంచగలుగుతారు' అనే సూక్తికి సరైన అర్థం నాకు అవగతమైంది.

ఏ సంస్కృతిలో చూసినా దానికి చెందిన గొప్ప పురాణాలూ, ఇతిహాసాల్లో రాక్షసులకూ భాగవతోత్తములకూ నడుమ యుద్ధాలు జరుగుతూ ఉంటాయి. తరచుగా ఆ పోరులో

దైవస్వరూపులైన భాగవతోత్తములు ఓడిపోతుంటారు. భారత పురాణ గాథలలో తేజోవంతులయిన ఈ ఋషులు ఓడిపోయినపుడు తమకన్నా శక్తివంతులైన వారి ఆశ్రయం పొంది గానీ లేదా రహస్య ప్రాంతాల్లోనో సుదూర పర్వత గుహల్లో తమ దైవోపాసనను తీవ్రతరం చేసి దైవకృపని పొందేవారు. ఆ విధంగా వారు తమ అంతర్గత శక్తిని పెంచుకుని చివరకు తమ ప్రత్యర్ధిని సవాలు చేసి ఓడించి తమ పూర్వపు వైభవాన్ని తిరిగి పొందేవారు. ఇలాంటి 'దైవ విపత్తులు' సంభవించిన సమయాలలో ప్రాజ్ఞులు, జ్ఞానులు ముందుకి వచ్చి ఓడిపోయినవారికి వారి స్వశక్తినీ, నిర్భీతి, ఆత్మస్థైర్యం, అచంచలమైన విశ్వాసం, సంకల్పశక్తి, లక్ష్యఛేదన వంటి విశేష లక్షణాలను అందించి ఎంతో సహాయపడుతూ ఉంటారు. స్వీయ నైపుణ్యం అనివార్యంగా ఈ లక్షణాలన్నిటినీ సమగ్రంగా అభివృద్ధి చేస్తుంది. ఈ స్వీయ నైపుణ్యం మనలోని బలహీన మనస్తత్వాలను జయించి మనల్ని సంపూర్ణ మానవులుగా తీర్చిదిద్దుతుంది. మనమీద మనం ఆధిపత్యాన్ని సాధించటం అనేది క్రమానుగతంగా నిరంతరాయంగా కొనసాగాల్సిన ప్రక్రియ. అప్పుడే ఈ స్వీయ పరివర్తనా మార్గంలో మనం పయనించగలం. తరచూ స్వామీజీ, 'దైవాన్ని బాహ్యంగా దర్శించటం కాదు, మనం దైవంగా రూపాంతరం చెందాలి! అంతరంగంలో నిరంతరాయంగా ఆ దైవాన్ని తెలుసుకుంటూ ఉండాలి! ఆ దృష్టే మనకు మన జీవిత మౌలిక స్వభావాన్ని పరిచయం చేస్తుంది,' అని చెప్తుండేవారు.

స్వామీజీ చిన్ననాటి విషయాల గురించి నేను ఎక్కువ సమాచారం సేకరించాను. అప్పుడు నాకు బాబాజీ తన ప్రియతమ శిష్యుడు భోలేని ఒక పరిపూర్ణమైన మానవుడిగా తీర్చిదిద్దేందుకూ, అతనికి తనలోని దివ్యజ్యోతిని నిరంతరం కాపాడుకునే సామర్థ్యాన్ని ప్రసాదించడానికి ఎంత కృషి చేశారో అర్థమైంది. కానీ ఇదేమంత తేలికగా జరగలేదు, ఎందుకంటే భోలే ఆయన దగ్గరకు ఒక సాధకుడిగా నేర్చుకునేందుకు రాలేదు. అసలు వారిద్దరి మధ్యా ఉన్న బంధం కూడా గురుశిష్య సంబంధానికే పరిమితం కాదు. చెప్పాలంటే భోలేకి తండ్రీ స్నేహితుడూ అయిన 'బాబాజీ' భోలే బాల్యాన్ని నియంత్రించదలచుకోలేదు. జీవితాన్ని పరిపూర్ణంగా అనుభవించాలంటే అతడు మిగతా అందరి పిల్లల్లాగానే పెరగాలి, కౌమారదశ గడపాలి, తప్పిదాల నుంచి నేర్చుకోవాలి. ఆ పైన తనకి బాగా అర్థవంతంగా ఉన్న దిశలో తన జీవన గమనాన్ని నడుపుకోవాలని భావించారు బాబాజీ. అందుకే ఆయన భోలేలో అంతర్గతంగా నిద్రాణ స్థితిలో ఉన్న తుంటరితనం, అసహనం వంటి ప్రతికూల ధోరణులను వెలికి వచ్చేలా చేసి వాటిని కరుణ, ఓర్పు, విధేయత లాంటి ఉపకార భావనలుగా మార్చడానికి ఒక వాతావరణాన్ని ఏర్పరిచారు.

తరచూ భోలే బాబాజీని ఆట పట్టించడానికి ప్రయత్నం చేస్తుంటే, బాబాజీకి భోలే వేషాలన్నీ తెలిసుండీ అతడినే గెలవనిచ్చేవారు. అలాంటి ఒకానొక సందర్భం చూడండి! నరేంద్రనగర్ శివార్లలో ఋషీకేష్ దగ్గరలో ఉన్న ఒక పట్టణంలో ఉన్నపుడు బాబాజీ 'భోలియా, వెళ్దాం పద' అన్నారు. ఒకసారి బాబాజీ బుర్రలోకి వెళ్లాలనే ఆలోచన వచ్చిందంటే ఆయన్ని అక్కడ ఆపడం ఎవరి తరమూ కాదనే విషయం భోలేకి తెలుసు. కానీ ఎముకలు కొరికే ఇంతటి చలిలో భోలేకి ఈ వెచ్చని చలిమంటని వదిలివెళ్లాలని లేదు. అయినా, బాబాజీకి దుప్పటి చుట్టి అది ఊడిపోకుండా ముళ్లు గుచ్చారు. ఇద్దరూ నగరంలోని ట్రాఫిక్ సర్కిల్ వచ్చేవరకు నడవడం మొదలుపెట్టారు. బాబాజీ మనసు మనసులో లేదని తెలిసి భోలే చాలాసార్లు బాబాజీని ఆ ట్రాఫిక్ సర్కిల్ చుట్టూ తిప్పి చివరికి వాళ్లు వచ్చిన దారి వైపే మళ్లించాడు. మళ్లీ వాళ్లు చలిమంట దగ్గరకు రాగానే ఆశ్చర్యంగా బాబాజీ, 'అరే! చూడిక్కడ! చలిమంట ఉంది, కాస్త చలి కాచుకుందాం, రా!' అని, క్రింద కూర్చుండి పోయారు. ఉదయాన్నే లేచి కళ్లు తెరచి, 'భోలియా, మనం రాత్రంతా నడిచినా ఇక్కడే ఉన్నామేమిటి?' అని ప్రశ్నించారు.

'నేను మిమ్మల్ని మాయ చేశాను!' అని భోలే అనగానే బాబాజీ నవ్వేవారు. కానీ ఇతర సందర్భాలలో బాబాజీ స్థిరంగా ఉండేవారు. ఉదాహరణకి, ఒకరోజు ఉదయం బాబాజీ ఋషీకేశ్‌లోని గంగానదిలో స్నానం చేయడానికి బయల్దేరారు. మామూలుగానే భోలే ఆయన్ని అనుసరించాడు. దార్లో వాళ్లు ఓ మిఠాయి దుకాణం దాటి వెళ్తున్నారు. అక్కడ జిలేబీ తయారవుతోంది. జిలేబీ అంటే భారతదేశం అంతటా ప్రజలు బాగా ఇష్టపడే స్వీటు. ముందుగా దాన్ని నూనెలో వేయించి, పంచదార లేదా బెల్లం పాకంలో ముంచి తీస్తారు. దాన్ని చూడగానే భోలే 'జిలేబీ! నాకు జిలేబీ కావాలి!' అని ఒక్కసారిగా అరిచాడు. 'నువ్వు స్నానం చేసి సూర్య భగవానుడికి అర్ఘ్యం వదిలిన తరువాత నువ్వు జిలేబి తినవచ్చు!' అని గురువు బాబాజీ బదులిచ్చారు. కానీ భోలే అంతవరకూ అగదలుచుకోలేదు. నేలమీద పొర్లుతూ జిలేబీ కోసం ఏడ్చాడు. బాబాజీ మళ్లీ స్థిరంగా, 'నేను ఒకసారి 'కాద'ని చెప్పాక ఇక అది 'కాదు' అంతే! ఎలా ప్రవర్తించాలో నేర్చుకో!' అన్నారు. ఇదంతా చూసి జాలితో దుకాణదారుడు జిలేబీని ఇవ్వజూపాడు. కానీ బాబాజీ జోక్యం చేసుకున్నారు మధ్యలో. 'లేదు, వాడికి ఇవ్వకు!' అని అడ్డుపడ్డారు. 'నువ్వు నాలుకని అదుపు చేసుకోకపోతే లాభంలేదు,' అన్నారు ఆయన భోలేతో. 'అంతే కాదు, జాలితో ఇచ్చే జిలేబీ తినే దయనీయ స్థితిలో నిన్ను నేను చూడదలచుకోలేదు. రా, వచ్చి స్నానం చెయ్యి. తరువాత నీకు ఏం కావాలన్నా తినవచ్చు!' అన్నారు భోలేతో. కానీ భోలే ఆయన మాట వినలేదు. రోడ్డు మధ్యలో మట్టిలో పొర్లాడుతునే ఉన్నాడు.

భోలే ఏడుస్తుంటే బాబాజీ రోడ్డు ప్రక్కనే కూర్చుని గమనిస్తూ ఉన్నాడు. ఇంతలో పెద్దగా హారన్ కొడుతూ ఒక లారీ అతని ఎదురుగా నిలబడింది. ఇలాంటి స్థితిలో రోడ్డు మీదే వుంటే తన పంతం నెగ్గించుకోవచ్చునని భోలే అనుకున్నాడు. కానీ బాబాజీ, 'డ్రైవర్! ఈ అల్లరి పిల్లాడి మీదకి బండి తోలేశాయ్!' అన్నారు డ్రైవర్‌తో. దాంతో డ్రైవర్ లారీని అడ్డదిడ్డంగా తోలుతూ భోలేకి దగ్గరగా పోనిచ్చి చెవులు చిల్లులు పడేటట్టు హారన్ కొట్టడం మొదలుపెట్టాడు. చివరికి భోలే లేచి పరుగెత్తాడు. 'నీ ఏడుపు అయిపోతే వచ్చి స్నానం చేయి!' అన్నాడు, చివరికు భోలే స్నానం చేసి జిలేబీ తీసుకున్నాడు.

బాబాజీ భోలేకి నేరుగా బోధించడం గానీ క్రమశిక్షణలో పెట్టిన సందర్భాలు గానీ చాలా అరుదు. ప్రేమగా ఆప్యాయతగా చూసుకునేవారు భోలేని. అయితే గంగోత్రీలో నివసించే స్వామి శివానంద ఎక్కువగా భోలేని క్రమశిక్షణలో పెట్టే బాధ్యత తీసుకున్నారు. స్వామి శివానంద గొప్ప విద్యావేత్త, పండితుడు, పూర్వాశ్రమంలో అంకిత భావంతో పనిచేసిన వైద్యులు. సంస్కృతంలో మంచి ప్రావీణ్యం ఉంది, మంచి హిందీ మాట్లాడగలరు, బెంగాలీలో వ్రాయగలరు. హిందీలో తర్జుమా చేయబడి ప్రఖ్యాతిగాంచిన వీరి పుస్తకం *'సుగమ్ సాధన పంథ్'* వీరి ఉత్కృష్ట తాత్విక స్థాయినీ, వైరాగ్యాన్నీ తెలియజేస్తుంది.

సంస్కృతం, తాత్విక ధర్మ సూత్రాలు నేర్చుకోవడానికీ ఎప్పటికప్పుడు బాబాజీ భోలేని గంగోత్రిలోని స్వామీ శివానంద దగ్గరికి పంపుతుండేవారు. అక్కడి కఠినమైన ఆధ్యాత్మిక జీవనానికి సంబంధించిన నియమ నిబంధనల్ని మొదట్లో భోలే తట్టుకోలేక పోయేవాడు. స్వామీ శివానందకి భోలే పూర్తిగా అదుపు తప్పాడనే భావన ఉండేది. ఆయన తరచూ 'వీడు మాట వినడం లేదంటూ' భోలేని తిరిగి బాబాజీ దగ్గరకి పంపుతుండేవారు. కానీ వయసు పెరుగుతున్నకొద్దీ స్వామీజీ శివానందజీ తనను క్రమశిక్షణలో ఉంచడంలోని విలువ, తనపట్ల ఆయనకున్న అంతర్లీనమైన ప్రేమ భోలేకి అర్థమైంది. అందుకే 1965లో స్వామీజీ పర్యవేక్షణలో ప్రచురించబడిన 'సుగమ్ సాధన్ పంథ్' పుస్తక పరిచయంలో స్వామీజీ నుండి నేర్చుకున్న ఎన్నో విషయాలకు వారికి తాను ఎప్పటికీ కృతజ్ఞుడినై ఉంటానని తెలియజేశారు.

స్వామీ శివానందకి చాలామంది శిష్యులున్నారు. ఇప్పుడు పాకిస్థాన్‌లో భాగంగా ఉన్న పంజాబ్ నుండి ఎక్కువమంది మహిళా శిష్యులుండేవారు. శీతాకాలంలో గంగోత్రిలో చలి తీవ్రంగా ఉన్నపుడు స్వామీ శివానంద వాళ్లని చూసి రావడానికి వెళ్లేవారు. అప్పట్లో (ఆర్యసమాజ స్థాపకుడైన స్వామీ దయానంద సరస్వతి, వారి శిష్యుల ప్రేరణ వల్ల) పంజాబ్ వేద పండితులకు పుట్టినిల్లుగా ఉండేది. అలాగే పంజాబ్‌తో బాటు కాశ్మీర్, అందులోనూ ముఖ్యంగా అప్పట్లో 'సింధ్'గా పిలవబడే ప్రాంతం, సూఫీ సంత్‌లతోనూ, ముసల్మాన్ ఫకీర్లతోనూ విరాజిల్లుతూ ఉండేది. భారతదేశంలోని ఈ ప్రాంతాలలో స్వామీ శివానందతో చేసిన ప్రయాణం భోలేకి ఎన్నో విషయాల్లో కనువిప్పు కలిగించింది. ఉత్కృష్ట స్థాయిలో ఉండే స్వచ్ఛమైన సాధువులు వారి వారి సామాజక నేపథ్యానికి, విద్యాస్థాయికీ, మతాలతోనూ సంబంధం లేకుండా ఎలా ఉంటున్నారో ప్రత్యక్షంగా చూశాడు భోలే. ఉదాహరణకి 'షహన్‌షా' (రాజులకే రాజు) అనే సూఫీ సాధువు గురించి స్వామీజీ నాకు ఓసారి చెప్పారు. ఆయనకి ఆ పేరు రావడానికి కారణం, తరచుగా అతడు చక్రవర్తిలాగా వస్త్రధారణ చేసుకోవడం! అతడి పరిస్థితి ఏమిటో ఎవరికీ అర్థమయ్యేది కాదు. ఆయనకి ఒక స్థిర నివాసం ఉండేది కాదు. కానీ ఆయన దగ్గరకు సాధారణంగా వ్యాపారులు, ఉపాధ్యాయులు, న్యాయవాదులు, వైద్యులు, సన్యాసులు, ప్రభుత్వాధికారులు రావాలని తహతహలాడేవారు. వాళ్లు ఇతడి కోసం వెతుక్కునే వాళ్లు కానీ ఫలితం ఉండేది కాదు. ఎందుకంటే, ఆయన కావాలంటే మాయమై పోయేవారు లేదా అందరికీ కనబడాలనుకుంటే, ఉన్నట్టుండి ప్రత్యక్షమయ్యేవారు. ఉన్నట్టుండి కొన్ని సమయాల్లో వీథుల్లో సాధారణ వ్యక్తిగా నడుస్తూ కనబడేవాడు. ఒకసారి లాహోర్ (ఇప్పటి పాకిస్తాన్‌లోని ఒక నగరం) నుంచి రైల్లో తిరిగి వస్తూ ఉండగా స్వామీ శివానంద, భోలే ఆగ్రాలో దిగిపోయారు. సుమారు అర కిలోమీటరు నడిచిన తరువాత స్వామి శివానంద ఉన్నట్టుండి ఆగి, 'ఇప్పుడు 'షెహన్‌షా' ఎక్కడున్నాడో ఏమో!' అని అన్నారు.

అలా అనుకోగానే దగ్గరలోనే ఉన్న ఓ చెట్టు దగ్గర నుంచి, 'శివా, ఇక్కడున్నాను,' అంటూ చిన్నగా పిలుపు వినబడింది. షెహన్‌షా చెట్టు వారగా అచ్చం భారతీయ పురాణాల్లో కృష్ణుడు ప్రత్యక్షమయినట్లు అయ్యాడు. ఇద్దరి మధ్యా పరస్పర గౌరవాభినందనలూ, కుశల ప్రశ్నలూ అయిన తరువాత షెహన్‌షా, 'అయితే మీరిప్పుడే వచ్చారన్నమాట? భోలే పసిపిల్లాడు! ఆకలిగా ఉండి ఉంటుందే? చూడు, భోలే! కొద్ది నిమిషాల క్రితం ఎవరో మిఠాయి పొట్లం తెచ్చి ఇచ్చారు! ఆ! నీకిష్టమైన రసగుల్లాలు!' అంటూ లేవకుండానే చెట్టు మొదలు దగ్గరికి వెళ్లి పొట్లాన్ని బైటికి తీశారు. మతిపోగొట్టే ఈ చిత్రవిచిత్రమైన విద్యలన్నీ భోలేకి సుపరిచితాలే! బాబాజీ, ఇతర గురువులు ఎన్నోసార్లు ఇలాంటి వింతలు చూడడంతో అతడికి మెదడు మొద్దుమారిపోయింది. అందుకే ఎలాంటి ప్రశ్నలూ లేకుండా వినయంగా మిఠాయి తీసుకున్నాడు. కొన్ని గంటలు షెహన్‌షాతో గడిపి 'టుండాలా'కి వెళ్ళే రైలు ఎక్కారు. అక్కడి నుంచి వాళ్లు గంగా నదీ తీరాన 'గఢ్ ముక్తేశ్వర'లో ఇతర సాధు పరివారంతో ఉంటున్న బాబాజీని కలవడానికి వెళ్లారు.

గఢ్ ముక్తేశ్వరలో బాబాజీతో ఉన్నపుడు భోలే ఎక్కువ సమయం అతీంద్రియ యోగ శక్తులైన 'సిద్ధుల' క్రియాశక్తుల గురించి ఆలోచిస్తూ ఉండేవాడు. బాబాజీతోనూ, ఇంకా సిద్ధులతోనూ జరిగే పర్యటనల్లో అన్ని రకాల మార్మిక సంఘటనల్నీ చూశాడు భోలే. షెహన్‌షా ఆకస్మిక దర్శనమివ్వడం, మాయం కావటం కూడా వాటిల్లో భాగమే! ఉదాహరణకి, కొంతమంది సాధువులు దేనికోసమూ చింతించరు కానీ వాళ్లకి కావలసినవన్నీ ఒనగూడతాయి, మరి కొంతమంది అన్నిరకాల విద్యల్నీ ఉపయోగించి కూడా కావలసిన ఆహారాన్ని కూడా సమకూర్చుకోలేరు. అయినా వాళ్లకి సరైన పోషణ ఉండదు, దారుణమైన ఆకలితో ఉంటారు. భోలే బాబాజీలో ఎన్నడూ దేనికోసమూ ఆందోళన పడడం చూడలేదు. ఎక్కడికి వెళ్లాలి, ఎప్పుడు వెళ్లాలి అనే ప్రణాళికే

ఆయనకి ఉండదు. అయినా ఆయన ఎక్కడికి వెళ్లినా ఆ ప్రదేశంలో ఆయన కోసం ఎవరో ఒకరు నిరీక్షిస్తూ కనబడతారు. ఆరాత్రికి 'ధుని' (అగ్ని) దగ్గర ఆయన ఉంటారు. అక్కడి ప్రజలు అక్కడికే ఆహారం తెస్తారు. ఒకసారి గంగోత్రికి కొన్ని మైళ్ల దూరంలో ఉన్న భైరవ ఘాటీలో వారు నడుస్తుండగా, బాబాజీని దర్శించుకుని వెళ్తున్నాయా అన్నట్లు ఎలుగుబంట్లు, పర్వత ప్రాంతంలో ఉండే సింహాలు ఆయనకు తారసపడి వెళ్తూ ఉండేవి.

సోన్‌ప్రయాగలో ఉంటున్నప్పుడు ఉన్నట్లుండి ఒకనాటి మధ్యాహ్నం బాబాజీ కేదార్‌నాథ్ వెళ్లాలని నిర్ణయించారు. బయలుదేరి మేం చిర్‌బాస వెళ్ళేటప్పటికి రాత్రి పది గంటలు అయింది. ఎముకలు కొరికే చలి! నెలపొడుపు చంద్రుడు వెళ్లిపోతున్నాడు. మేం వెళ్తున్న దారిలో ఓ ప్రక్కన చిన్న 'చిర భైరవ' గుడి కనబడింది. మహా అయితే ఆ గుడి 5 చదరపు అడుగుల వైశాల్యం ఉంటుంది. వాళ్లు అక్కడికి వెళ్లారు. బాబాజీ స్వామీజీతో, 'భోలే, ఈయన కేదారనాథ్‌కి ద్వారపాలకుడు. ఈయనకి ప్రణామం చేయి. ఆయన కోరుకుంటే మన ప్రయాణం కొనసాగుతుంది లేదా ఈ రాత్రికి ఇక్కడే ఉందాం' అన్నారు.

బాబాజీ బెంగాలీ హిందీ కలగలుపు యాసతో ఆ పుణ్యక్షేత్రాన్ని ఆవహించి ఉన్న మహిమాన్విత శక్తితో మాట్లాడుతున్నారేమో అన్నట్లు అనిపించింది, ఆయన చిరభైరవుడికి శిరసు వంచి నమస్కరించారు. అలా మాట్లాడుతుండగా మార్గానికి ఆవలి వైపు అకస్మాత్తుగా ఓ నెగడు కనిపించింది. దాంతో చిర భైరవుడు వాళ్లకి అక్కడ ఆ రాత్రి విశ్రాంతి కోసం ఏర్పాట్లు చేసినందుకు బాబాజీ కృతజ్ఞతలు చెప్పుకున్నారు.

ఇద్దరూ నెగడు దగ్గర కూర్చున్నప్పుడు భోలే బాబాజీని, 'మన కోసం ఈ మంటను రాజేసింది ఎవరు?' అని అడిగాడు. దానికి బాబాజీ, 'అనాదిగా వస్తున్న మన సంప్రదాయంలో భాగంగా, భగవాన్ సనత్కుమారులు 108 ధునులను హిమాలయాల చుట్టూ వెలిగించారు. ఈ ధునులు శాశ్వతమైనవి, ఈ ధుని చిర భైరవుడి అధీనంలో ఉంటుంది. ఇది నిరంతరాయంగా వెలుగుతుంది. చిర భైరవుడు సంకల్పిస్తేనే ఇది చూసేవాళ్లకి కనబడుతుంది. చూశావా! ఈ ధునికి ధూమం లేదు. మన సంప్రదాయంలో సాధువులు ఈ అగ్నినే తమ శిరస్సున ధరిస్తారు' అని సమాధానమిచ్చారు.

అక్కడ నుంచి ఉదయం బయలుదేరి మధ్యాహ్నానికల్లా కేదారనాథ్ చేరుకున్నారు. గొప్ప సిద్ధుడైన గుడారీ బాబాని కలుసుకున్నారు. ఈ మహనీయులు భోలేని తన సొంత బిడ్డలా సాకేవారు. భోలేకి ఆయనతో మాట్లాడడంలో ఎలాంటి సంకోచం ఉండేది కాదు. బాబాజీతో మాట్లాడుతున్నట్లే ఆ సాధువుతో మాట్లాడగలిగాడు. ఒక సాయంత్రం సందర్భం కుదిరినప్పుడు, భోలే గుడారీ బాబాని, 'అందరూ బాబాజీ లాంటి సిద్ధులంటే ఎందుకు ఇష్టపడతారు? ప్రజలకి ఆయనపై అంత విశ్వాసం ఎలా ఏర్పడింది? ఆయనకి ఏవైనా అవసరాలు ఉంటే అప్పటికప్పుడు తీరతాయి గానీ ఇతరుల విషయంలో అలా జరగదు. కారణం ఏమిటి?' అని అడిగాడు.

దానికి గుడారీ బాబా సమాధానం చెప్తూ, 'అంతటా నిండి ఉన్న కారుణ్య మూర్తి ప్రకృతిమాతతో బాబాజీ తనని తాను ఐక్యం చేసుకున్నారు. ప్రకృతిని నిర్లక్ష్యం చేసినవారికి ప్రకృతి చేతనత్వంతో కూడిన సజీవ శక్తిగా కనబడదు. కానీ వీక్షించగలిగే నేత్రం కలవారికి ప్రకృతిమాత ప్రత్యక్ష, పరోక్ష బహుమతుల్ని సమకూర్చే దైవీశక్తిగా కనబడుతుంది. ప్రకృతితో మమేకమై జీవించడం మొదలుపెడితే దానితో కలిసి జీవించగలిగే సంవేదనశీలత మనలో పెంపొందుతుంది. అప్పుడు ఆమె మనల్ని ఎంతగా పట్టించుకుంటుందో, మనకి కావలసిన వాటిని ఎలా సమకూరుస్తుందో, మనం సాధించిన వాటిని మనతోనే స్థిరంగా ఎలా ఉంచుతుందో మన అనుభవంలోకి వస్తుంది. మన పరిసరాలను ప్రకృతి స్వభావానికి విరుద్ధంగా లేకుండా సర్దుకోగలిగితే ప్రకృతే మనల్ని

పోషిస్తుంది. మన శ్రేయస్సుకూ, మన పెరుగుదలకు అవసరమయ్యే అన్ని విషయాల్నీ ప్రకృతే మనకు ప్రసాదిస్తుంది,' అన్నారు.

భోలేకి ఈ విషయం చాలా అర్థవంతంగా కనిపించింది. దేవుడి పూజ కోసం తప్ప బాబా ఎప్పుడూ కనీసం పూవుని కూడా కోసేవారు కాదు. పందుంపుల్ల కావాలన్నా చెట్టు ముందు నించుని ముందుగా ఏదో గొణుగుతూ మాట్లాడేవారు.

భోలే ఉత్సుకతతో ఓరోజు బాబాజీతో, 'చెట్టుతో ఏం మాట్లాడుతున్నారు గురూజీ? దాంతో మాట్లాడగలరా? నన్నూ మాట్లాడమంటారా?' అని అడిగేవాడు.

దానికి బాబాజీ, 'వెళ్లు, మనిద్దరం పళ్లు తోముకోవడానికి పందుం పుల్లలు కోయి. కానీ కోసే ముందు కొమ్మను నీ చేతుల్లోకి వంచుకుని అనునయంగా, 'ఇషే త్వ ఊర్జే త్వ' అని అను' అని సమాధానం చెప్పేవాడు.

'దానర్థం ఏమిటి?' భోలే అడిగేవాడు.

'నా పళ్లను శుభ్రపరచుకోవడానికీ, బలపరుచుకోవడానికీ నిన్ను తీసుకోవచ్చా!' అని ప్రార్థనాపూర్వకంగా అడగడం!'

ఎలాంటి క్రతువులోనైనా సమిధలను ఉపయోగించేటప్పుడు 'యజుర్వేదం'లో చెప్పబడిన ఈ రెండు మంత్రాలనే ఉచ్చరిస్తారు. వాటినే బాబాజీ పందుంపుల్లని విరిచేటప్పుడు భోలేని ఉచ్చరించమని చెప్పారు. బాబాజీ పైకి ఎంతో సామాన్యంగా ఉంటారు. ఆయన్ని చూస్తే అయనకి వేద విషయాల్లో అంతటి ప్రావీణ్యం వుందని ఎవరూ ఊహించను కూడా ఊహించలేరు. అతని వద్ద ఏ గ్రంథాలూ ఉండవు, బోధ చేస్తున్నప్పుడు కూడా ఆయన ఏ గ్రంథం నుంచీ ఉదహరించరు. కానీ వారి ఆలోచనల్లో, మాటల్లో, దినచర్యల్లో వేద సారమంతా ఇమిడి ఉంటుంది. ఆయన నరనరాల్లో వేదం ప్రవహిస్తోంది. బాబాజీ వేదరూపులు. బాబాజీ దృక్పథంలో, *భగవంతుడు ఈ సువిశాల ప్రకృతి ప్రాంగణంలో జీవితమనే ఘనమైన ఓ ఉత్సవం జరుపుతున్నాడు!* ప్రాపంచిక, ఆధ్యాత్మిక సంబంధంగా జరిగే అన్ని రకాల పనులూ, అవి అత్యల్పమైనా, బృహత్తరమైన కార్యాలైనా, అన్నింటికీ ఈ ఘనమైన ఉత్సవంలో సముచితమైన స్థానం ఉంటుంది.

ఒకరోజు బాబాజీ, భోలే ఒక పర్వత మార్గంలో నడుస్తుండగా తల్లిని కోల్పోయిన గువ్వ పిల్లని చూశారు. అది చాలా బలహీనంగా ఉంది. కనీసం దాని తలను కూడా ఎత్తలేక పోతోంది. దాన్ని చూడగానే బాబాజీ అప్రయత్నంగా '*విష్ణోర్ బాహుభ్యాం*' అని ఉచ్చరించి దాన్ని తన దోసిట్లోకి తీసుకుని దానివైపు మరోసారి చూసి, దాన్ని గాల్లోకి ఎగరేసారు. ఆ పక్షిపిల్ల ఎగిరిపోయింది! ఈ విషయాన్ని భోలే గుదారీ బాబాకి చెబుతూ, 'అసలు చనిపోవడానికి సిద్ధంగా ఉన్న పక్షి...అదీ పిల్లపక్షి...అంతలోనే అంత శక్తితో ఎలా ఎగురగలిగింది?' అని అడిగాడు. దానికి గుదారీబాబా, బాబాజీ ఆ పిట్టని ఆంతటి దీనస్థితిలో చూడగానే, జీవుల్ని సంరక్షించి శక్తిని ఒనగూర్చే విష్ణు భగవానుని స్ఫురణ వారి మనసులో మెదిలింది. ఆ రకంగా విష్ణుమూర్తి ఆయన్ని ఆవహించాడు. ఆ స్థితిలో బాబాజీ 'విష్ణోర్ బాహుభ్యాం' అని అసంకల్పితంగా అన్నారు. అది వేద మంత్రం, '*విష్ణు బాహువులతో*' అనే అర్థం దానికి ఉంది. అలా అనగానే బాబాజీ విష్ణు భగవానుడి జీవత్వానికీ శక్తికీ సంధానకర్తగా మారారు. ఆయన బాహువులే విష్ణువు బాహువులయ్యాయి. తక్షణమే ఆ పిట్టకి బలం, శక్తి చేకూరింది. ఆ విధంగా ఆ గువ్వ పిట్ట ప్రాణాలు దక్కించుకుని శక్తి పొంది ఎగిరిపోయింది.

హిమాలయాల్లోని గొప్ప సాధువుల్లో గుదారీ బాబా ఒకరు. ఆయన కూడా ప్రకృతితో అద్భుతమైన సామరస్యాన్ని కలిగి ఉంటారు. బాబాజీలాగానే ఆయనకి కూడా ఆకలి దప్పులు, వేడి, చలి బాధలు ఉండవు. ఆయన అనుమతితోనే నిద్ర, అలసట ఆయన దరి చేరతాయి.

ఆయన వద్ద అద్భుతమైన బొంత ఒకటి ఉంటుంది. దాని నిండా వందలాది అతుకులుంటాయి. బయట పడేసిన ప్రతి ఊలుముక్కనీ, గుడ్డపేలికనీ దాంట్లో దోపి ఆయన కుట్టేసేవారు. ఏళ్లు గడిచే కొద్దీ అది ఆయన తప్ప మరెవరూ మోయలేనంత భారంగా తయారైంది. ఆయనకి బాగా సన్నిహితంగా ఉండేవారికి ఆయనబొంత ఒక జీవం ఉన్న ప్రాణి అని అర్థం అవుతుంది. ఆయన ఎక్కడికి వెళ్లినా ఆ బొంత ఆయనతోనే ఉండేది. అందుకే భక్తులు అయన్ని 'గుదారీ బాబా' (బొంత బాబా) అని పిలుస్తారు.

తరచూ గుదారీ బాబా, బాబాజీ పర్వత సానువుల్లో కలసి తిరుగుతూ ఉండేవారు. వారితో కలిసి ఉండటం ఒక అనిర్వచనీయమైన అనుభూతి. స్వామీజీ నాతో ఒకసారి, 'కేదార్‌నాథ్‌లో మా గురువుగారు, గుదారీ బాబాతో కలిసి ఉన్న రోజుల్ని నా జీవితంలో ఎన్నటికీ మరిచిపోలేని రోజులు. అవి నాలో అంతటి దివ్యానుభూతిని నింపాయి. వారిద్దరూ ఒకరి కోసం ఒకరు తమ సిద్ధుల్ని ప్రకటీకృతం చేసేవారు. ఆ క్రమంలో వారు నాకు 'ప్రకృతి ప్రేమ' అనే దివ్య ప్రబోధం చేశారు,' అని అన్నారు. ఒక వారం తరువాత అత్యంత ఆకర్షణీయమైన ఆ కేదారనాథ్ లోయ నుండి, బాబాజీ తనకిష్టమైన 'తుంగనాథ్'కి వెళ్లిపోయారు. గుదారీబాబా, భోలే పుష్ప లోయకి వెళ్లారు.

అనాదిగా పుష్ప లోయ ఎందరో సిద్ధులకు నిలయం. అదో అద్భుతమైన ప్రదేశం. ఈ లోయని అలంకరిస్తున్నట్లుగా ఉన్న శిఖరాన్ని 'గంధమాదన' అని వ్యవహరిస్తారు. ఉత్కృష్ట స్థాయికి చెందిన మత్తుగొలిపే సుగంధాన్నీ, అలాగే ఆధ్యాత్మిక పారవశ్యాన్నీ కూడా అందించే ప్రాంతం ఇది. స్థల పురాణాలు, పురాతన గ్రంథాలను బట్టి ఈ పుష్పలోయకి ఆవలి శిఖరాలు మానవ సంచారం నిషిద్ధం. అవి కొన్ని దివ్య శక్తుల పహారాలో ఉంటాయి. ఈ లోయని చేరుకోవడానికి ముందుగా మేము 'హేమకుండ్'గా ప్రసిద్ధి చెందిన పవిత్రమైన ప్రదేశం మీదుగా వెళ్లాలి. ఇక్కడ సిక్కు మతస్థుల పదవ గురువు గురు గోవింద్ సింగ్ తపస్సు చేశారు. అందుకే ఇది సిక్కుల తీర్థస్థలి.

చాలా రోజుల ప్రయాణం చేసి గుదారీబాబా, భోలే హేమకుండ్ చేరుకున్నారు. వాళ్లు అక్కడ నుంచి పుష్ప లోయకి చేరుకోవడానికి ఇంకా చాలా రోజులు ప్రయాణం చేయాల్సి ఉంది. ఆ సందర్భంలో అక్కడికే వెళ్లడానికి తయారవుతున్న 'జపాన్' దేశపు సాధువు ఒకరు తారసపడ్డారు. దాంతో ఆ సాధువు, గుదారీ బాబా, భోలే, వారితోపాటు జపాన్ సాధువుకి సంబంధించిన ఆహార పదార్థాలు, సరంజామా తీసుకుని రావడానికి ఇద్దరు మనుషులు, ఇలా అంతా కలిసి ఒక బృందంగా బయలుదేరారు. పర్వత శిఖరాలని అధిరోహించే నేర్పు, ప్రయాణానికి కావలసిన సరంజామా అంతా తన వద్ద వుందని జపాన్ సాధువు కాస్త మిడిసిపడేవాడు. కానీ ఇలాంటి ఎత్తైన కొండ శిఖరాల్ని ఎక్కుతున్నపుడు గుదారీ బాబా బొంత గొప్ప ఇబ్బందిని కలిగిస్తుందని అతడు భావించాడు. మరి అది మోయలేనంత బరువుగా ఉంది! భోలే నడకలో అలసిపోయినపుడు గుదారీ బాబా పైగా, భోలే అలిసిపోయినట్టు ఉన్న సమయాల్లో, గుదారీ బాబా ఆబొంతను భోలే భుజాలపై పెట్టి మోయమన్నప్పుడు క్షమించరాని చర్యగా భావించేవాడు. ఓ సారి అతడు తనతో ఈ బొంత విషయం ముందే చెప్పి ఉంటే దాన్ని మోయడానికి తాను మరొక కూలీని పెట్టి ఉండేవాడినని కూడా చెప్పాడు. కానీ భోలే కాసేపు ఆ బొంతని మోసిన తరువాత అలసట పోయి తిరిగి శక్తిని పొందేవాడనీ, అప్పుడు బాబా దాన్ని తిరిగి తీసుకునేవారనీ ఆయన ఎప్పుడూ గమనించనేలేదు.

వాళ్లు చేరవలసిన పుష్ప లోయకి ప్రయాణం ఇంకా ఒక రోజు ఉందనగా జపాన్ సాధువు చలిజ్వరంతో వణికిపోసాగాడు. తనకి భారత మైదాన ప్రాంతాల్లో మలేరియా సోకి

ఉండొచ్చని భయపడ్డాడు. అన్ని రకాల మందులూ వాడాడు. అయినా తగ్గలేదు. అనామకంగా హిమాలయాలలో చనిపోవడం అతనికిష్టం లేదు. దాంతో అతని స్లీపింగ్ బ్యాగ్‌లో దూరి తనవద్ద ఉన్న రగ్గులన్నింటినీ కప్పుకుని పడుకున్నాడు, అయినా చలి తగ్గలేదు. దాంతో తను కప్పుకున్న రగ్గులు చాలక గుడారీ బాబాని అతడి బరువైన బొంతను కూడా పైన కప్పమన్నాడు. గుడారీ బాబా ఈ బొంత ప్రకృతి మాత చేత కుట్టబడిందనీ, దీనికి రోగాలను నయం చేసి స్వస్థతనిచ్చే శక్తి ఉందనీ, కనుక సాధువు బ్లాంకెట్లూ, రగ్గులూ తీసేసి దీన్ని కప్పుకుంటే అన్ని రోగాలూ పోతాయనీ చెప్పాడు. అలాగే అతన్ని బొంతతో కప్పిన కొద్ది నిముషాలకే అతని జ్వరం మాయమై పోయింది, అతడికి మళ్లీ శక్తి చేకూరింది.

మర్నాటి ఉదయం ఈ బృందం తమ ఆఖరి గమ్యం చేరడానికి బయలు దేరింది. కానీ కొన్ని గంటల నడక తరువాత అక్కడి పుప్పొడి వాసన మరింత గాఢంగా మారింది. దాంతో కూలీలు తాము ఇంకెంతమాత్రమూ ముందుకు కదలలేమని తెగేసి చెప్పారు. ఆ సాధువు కాస్త దూరంలో ఉన్న గొర్రెల కాపర్లనీ, పచ్చిక మేస్తున్న గొర్రెల్నీ చూపిస్తూ, 'వాళ్లు నడుస్తుండగా లేనిది మీకేమైంది?' అని అడిగాడు. దానికి కూలీలు, 'గొర్రెలూ, గొర్రెల కాపర్లూ ఇక్కడి వాతావరణంలో భాగం, కానీ మేము అలా కాదు. ఇంకా ముందుకి వెడితే ఈ ఘాటైన సువాసనలకి మెదడు మొద్దుబారడమో లేక చనిపోవడమో జరుగుతుంది. స్వర్గధామంలాంటి ఈ లోయ అందాలను కేవలం దూరం నుండి మాత్రమే చూసి ఆనందించగలం,' అని బదులిచ్చారు. గుడారీ బాబా ఆ జపాన్ సాధువుతో ఇక్కడి నుండి మనం ముందుకి వెళ్లే ముందు ఇక్కడే ఉండి కాసేపు ధ్యానం చేసి ఈ ప్రాంతాన్ని సంరక్షించే దైవశక్తినీ, పర్వత శ్రేణినీ ప్రార్థించుదామనీ, అప్పుడు ఆ దైవిక శక్తి ముందుకి కదలడానికి అనుమతిస్తుందనీ చెప్పారు.

గుడారీ బాబా సలహాని జపాన్ సాధువు పెడచెవిన పెట్టాడు. అతని లక్ష్యం ఎంతసేపటికీ ఈ లోయదాటి ఆవతలి వైపుకి వెళ్లాలి, అక్కడ గుడారం వేసి పర్వతాల్లో నిగూఢంగా దాగి ఉన్న ప్రదేశాలన్నీ శోధించి మహాభారతంలోని భీముడు ఆంజనేయస్వామిని కలిసిన ప్రదేశాన్ని కనుక్కోవాలి! అంతే! ఆయన అనుకుంటున్న ప్రదేశాన్ని ఓ గంటలోపు నడకతో చేరుకోవచ్చు. దాంతో కూలీలను అక్కడే వదిలి సాధువు ఒక్కడే బయల్దేరాడు. ఆయనతోపాటు గుడారీబాబా, భుజాల చుట్టూ బొంత కప్పుకుని భోలే బయలుదేరారు. కానీ కొంత దూరం వెళ్లగానే ఆయన తల తిరిగి అయోమయానికి గురయ్యారు. మతి స్థిమితం తప్పుతోంది. అయినా అతడు అప్పటికీ భయపడలేదు కానీ ఎప్పుడైతే తాను అయోమయానికి గురై దారి తప్పుతున్నాడని అర్థమైందో అతనిలోని దిగులు భయంగా మారింది. అకారణంగా ఈ పర్వతాల మధ్య పిచ్చివాడిలా తిరగాలని అతడు అనుకోవడం లేదు. దాంతో ఏం జరుగుతోందో చెప్పమని అతడు గుడారీ బాబాని అడిగాడు. కుశాగ్రబుద్ధి గల బాబా అతన్ని వెంటనే వెనక్కి తిరిగి అతనికోసం ఎదురుచూస్తున్న కూలీల దగ్గరికి వెళ్లమన్నాడు. ఓ పక్క భయం, మరోపక్క అయోమయం! వింత పరిస్థితిలో ఇరుక్కున్న ఆ సాధువు తక్షణం హేమకుండ్‌కి తిరిగి వెళ్లిపోయాడు. గుడారీ బాబా, భోలే ఒంటరిగానే ముందుకు సాగారు. ఆ పుష్ప లోయను దాటి తమ ప్రయాణాన్ని కొనసాగిస్తూ పర్వతాల్ని దాటి వెళ్లసాగారు.

స్వామీజీ నిష్ణాతులైన గుడారీ బాబాలాంటి సాధువులతో మాత్రమే మామూలు మనుషులు పుష్పలోయను దాటగలరని ఒకసారి నాతో అన్నారు. 'అక్కడ స్వర్గానికీ భూమికీ మధ్య దూరం చెరిగిపోతుంది. అలాగే భూత, భవిష్యత్, వర్తమాన కాలాలు తమ ఉనికిని కోల్పోతాయి. ఎవరైనా అలాంటి ప్రదేశాలకి వెళ్లి అనుభూతి చెందితేనే దేవతలు నిజంగానే ఉన్నారనీ, వారితో కలిసి ఉండటం సాధ్యమేననీ నమ్ముతారు' అన్నారు. చివరకు అక్కడ భోలేకి జ్ఞానులు రెండు ప్రపంచాలకూ సంబంధించిన వారనీ, వారు ఏక కాలంలో ఇక్కడా అక్కడ ఉండగలరనీ, వారు తమ దివ్య

నేత్రాలతో భూమి మీద నుంచే దివ్య లోకాలను చూడగలరనీ అర్థమైంది. మనకి బాగా అర్థమయ్యేలా చెప్పుకోవాలంటే, ఆ ప్రదేశంలో ఆశ్రమాలు గానీ మనుషులు గానీ లేరు. అయినా అక్కడ అన్నీ ఉన్నాయి!

లోతైన ఆ పర్వత లోయల్లో ఒక రాయిమీద గుడారీ బాబా కూర్చుని భోలేతో మాట్లాడుతూ, 'ప్రాచీన కాలంలో ఇక్కడ 'ఆర్షిత్‌సేన' అనే సాధువు తన ఆశ్రమంలో నివసిస్తుండేవారు. కేవలం నీరు త్రాగి గాలిని మాత్రమే పీల్చి బ్రతికే గొప్ప గొప్ప సాధువులు నిండు పౌర్ణమి రోజూ, ఆ తరువాతి రోజూ ఇక్కడికి వచ్చేవారు. వారి గౌరవార్థం ప్రకృతి దివ్యమైన సంగీతాన్ని వినిపించేది. ధ్యానం చేసి నీ కర్ణేంద్రియాలతో నువ్వు ఆ సంగీతాన్ని వినగలవు. అయితే అది ఎక్కడి నుంచి వస్తుందో ఆ మూలాన్ని చేరుకోవడానికి ప్రయత్నించకు!' అని చెప్పారు.

'ఖచ్చితంగా ఆ సంగీతం ఎక్కడినుండి వస్తోందో కనీసం మీరన్నా విన్నారా?' అని ఆయన్ని అడిగి చూశాను. అప్పుడు తన జ్ఞాపకాల ఒడిలో దృష్టి సారించి తనని తాను మరచిపోయి గాఢమైన అనుభవాన్ని దర్శిస్తున్న జ్ఞానిని చూశాను.

లోయ నుండి క్రిందికి దిగుతున్నప్పుడు బాబా, భోలే మరోసారి పుష్ప లోయను దాటాల్సి వచ్చింది. దాంట్లోకి ప్రవేశించే ముందు గుడారీ బాబా, 'ఓయ్ పిల్లాడా! ఈ సారి లోయ దాటేటప్పుడు నీకు ఈ బొంత సహాయం అవసరం లేదనుకుంటా!' అంటూ తీసేశారు. దాంతో ఆశ్చర్యంగా ఈసారి భోలే జ్ఞాపకశక్తి దాదాపుగా కోల్పోయాడు. లోయ నుండి బైట పడిన తర్వాత కూడా అతని సహజ ఆలోచనాశక్తి, విచక్షణా జ్ఞానం అన్నీ ఆగిపోయాయి. ఏమీ మాట్లాడలేక పోతున్నాడు. ఏమైనా మాట్లాడినా దానికి అర్థం ఉండటంలేదు. ఇదంతా గుడారీ బాబా భోలేని ఆట పట్టించడానికి చేసిందే! చివరికి బాబా బొంతని తిరిగి భుజాలపై కప్పినప్పుడు భోలే మామూలుగా అయ్యాడు.

మామూలుగా స్థితికి చేరుకోగానే, భోలే తాను మాత్రమే పూల వాసనకి ఎందుకు వశీభూతుడయ్యాడో బాబాపై ఎలాంటి ప్రభావం ఎందుకు లేదో తెలుసుకోవాలని బాబాని అడిగాడు. అందుకు బాబా, 'నీకు శరీరమూ, మనసూ బలహీనంగా ఉండడం వల్ల అలా జరిగింది. చూడూ, ఒక వైపు నువ్వు గొప్ప ఆనందాన్ని పొందావు. మరోవైపు నీ జ్ఞాపక శక్తినీ, స్పృహనీ కోల్పోయావు. పుష్పాలు నీలో నింపిన ఇలాంటి ఆనందం వల్ల నువ్వు ఏ గమ్యాన్నీ చేరుకోలేవు. ఇది అచ్చం మాదక ద్రవ్యాలు తీసుకోవడం లాంటిదే. ప్రజలు మార్జువానా, గంజాయి లాంటి మత్తు మందులను సేవించినప్పుడు మత్తులోకి వెళ్లి దాన్నే 'ధ్యానం' అనో లేక 'సమాధి' అనో అనుకుంటారు. ఆ స్థితి శరీరంలో రసాయనిక చర్య వల్ల జరిగింది, అలాగే పుష్పగంధం వల్ల నీకు కూడా అదే జరిగింది. లోయ నుండి బైటికి వచ్చినపుడు నీ మనసు విపరీతంగా అదే అనుభూతిని కోరుకుంటుంది. కానీ భౌతిక ప్రేరణ అయిన ఆ పుష్పగంధం లేనందువల్ల శరీరం దాన్ని అందించలేదు. కానీ నీ శరీరంలో దాగి ఉన్న అనంతమైన ఆనందాన్ని ఉధృతం చేసి నీలోనే నిక్షిప్తం చేస్తే నువ్వు ఇలాంటి సహజ పూపరిమళాలు కలిగించే బాహ్య ప్రేరణ లేకుండానే నీకు ఆనందం కలుగుతుంది,' అని వివరించారు.

వాళ్లు ఆ పుష్ప లోయలో ఒక వారంపాటు ఉన్నారు. ఆ వారమంతా గుడారీబాబా భోలేకి మనిషి శారీరికంగానూ, మానసికంగానూ శక్తివంతంగా ఉండడం ఎంత అవసరమో బోధించారు. దేహమనే నావలో నిక్షిప్తమై ఉన్న సంతోషాన్ని ఆనందాన్ని ఎలా కనుక్కోవాలో, ఐహిక ప్రపంచపు బాహ్య ప్రేరణలకీ, అకర్షణలకీ లొంగకుండా ధ్యానం ద్వారా ఎలా అప్రమత్తంగా వుండాలో భోలేకి బోధించారు.

ఇంకా ముఖ్యంగా, బాబా, 'మానవ శరీరం దేవుడు కొలువు ఉన్న పవిత్ర దేవాలయం. కానీ మనం దీనిని నిర్లక్ష్యంతో చెడు అలవాట్లతో చెత్తకుప్పలా చేస్తున్నాం. శరీరంలో నిండి ఉన్న

అనంతానందం అణగార్చబడుతోంది. అందువల్లే మనం ఆనందం మనశ్శాంతీ లేకుండా బాధపడుతున్నాం. ఈ భౌతిక దేహం అదృశ్యమైన శక్తివంతమైన ప్రాణశక్తి కిరణాలతో కొనసాగుతోంది. అయితే మనం దానిని అపవిత్ర కార్యకలాపాలతో బలహీనపరుస్తున్నాం. దాంతో ఈ జీవశక్తి అండదండలు బలహీనపడి దేహం గుల్లబారి శక్తినీ సత్తువనూ కోల్పోతోంది. మన శరీరంలో శక్తి సామర్థ్యాలు క్షీణించడంతో వాతావరణ మార్పులకీ, బాక్టీరియాలకీ, వైరస్‌లకీ, మందులకీ, మన దేహం అనారోగ్యానికి గురవుతుంది, మానసిక స్థిరత్వాన్నీ భౌతిక శక్తినీ కోల్పోతుంది,' అన్నారు.

'జీవితాన్ని అనందించాలంటే నువ్వు దృఢంగా ఆరోగ్యంగా వుండాలి. అప్పుడు మాత్రమే ఆరోగ్యవంతమైన దేహంలో దృఢమైన మనసు ఉంటుంది. నీ ఆధ్యాత్మిక చైతన్య స్థాయి ముఖ్యం కాదు. నువ్వు ఆరోగ్యంగా లేకపోతే నీ ఆధ్యాత్మిక మానసిక శక్తంతా దేహంలోని అనారోగ్యాన్ని ఎదుర్కోవడంలో ఖర్చవుతుంది. ఎప్పుడైతే నీ శక్తి దేహంలోని రుగ్మతల్ని ఎదుర్కోవడంలో ఖర్చవుతుంటే నువ్వు జీవన సాఫల్యాన్నీ, జీవిత పరమార్థాన్ని ఎలా కనుగొంటావు? కనుక మొదట దేహం పట్ల శ్రద్ధ వహించి బాధ్యతగా ప్రవర్తించు!' అని బాబా భోలేకి ఉద్బోధించారు.

గుడారీబాబా భోలేకి కష్టపడే తత్వాన్ని అలవాటు చేశారు. వారి దృష్టిలో మనిషిని ఆవరించే భయంకరమైన భూతాలలో బద్ధకం ఒకటి. ఆయన సోమరిపోతుల్ని ఎప్పుడూ గౌరవించేవారు కారు. ఆయనతో ఉండడమంటే వేగంగా నడవాలి, వేగంగా ఆలోచించాలి, వేగంగా పనిచేయాలి. భోలే బద్ధకస్తుడు కాదు. అందుకే భోలే అంటే ఆయనకు ఇష్టం. అయినా భోలే ఇంకా గుడారీ బాబా ప్రమాణాలను చేరుకోలేదు.

వాళ్లు పుష్ప లోయలో ఉన్న వారం రోజుల్లో గుడారీ బాబా భోలేకి మెత్తనిబొంత తప్పనిసరి అయితే తప్ప ఇచ్చేవారు కారు. పూల వాసనలకి చెక్కుచెదరకుండా ఉండేందుకు భోలే చేత ధారాపాతంగా చెమటలు కారే వ్యాయామం చేయించేవారు. కొండ ప్రాంతాల్లో ప్రవహించే మంచునీటిలో స్నానం చేయించేవారు. ఆధునిక విజ్ఞానశాస్త్రం ప్రకారం అలాంటి ఎత్తైన కొండ ప్రాంతాలలో ధారాపాతంగా చెమటలు పట్టేటట్లు వ్యాయామం చేయడం, మంచు నీటిలో స్నానం చేయడం ఆరోగ్యానికి మంచిది కాదు. కానీ గుడారీ బాబా అదే చేయించారు. అదే విషయాన్ని స్వామీజీని అడిగినప్పుడు, స్వామీజీ 'ఆ విధంగానే నన్ను సామాన్య మానవుని శారీరక, మానసిక పరిధుల్నీ దుర్బలత్వాన్నీ అధిగమించేటట్లు చేసి గొప్ప సాయం చేశారు. అంతా సవ్యంగానే ఉంటుందని నాకు తెలుసు. ఎందుకంటే నాకేం కాకుండా చూసుకోవడానికి ఆయన అక్కడే ఉన్నారు, ఆయన బొంతా ఉంది!' అన్నారు.

అప్పటికి గుడారీ బాబా వయస్సు తొంభై సంవత్సరాలు అయినప్పటికీ ఆయన శక్తి మన అంచనాలకు మించి ఉంది. 20,000 అడుగుల ఎత్తులో పచార్లు చేస్తూ ఛలోక్తులు విసరగలరు, అలసట లేకుండా పకపకా నవ్వగలరు. నడకలో వారిని మించిన వారు లేరు. ఈ వయసులో ఎలాంటి యోగాసనాలూ ప్రాణాయమాలూ చేయకపోయినా యోగులు తమ నాభి దగ్గర అగ్నిని ప్రజ్వలింపజేయటానికి చేసే జఠరాగ్నిని ప్రేరేపించే అగ్నిసార క్రియని క్రమం తప్పకుండా చేసేవారు. భోలేకి ప్రాణాయామంలోని కొత్త పద్ధతులను ముద్రలనూ భంగిమలు, బంధాలనూ నేర్పి ప్రతిరోజూ వాటిని తీవ్రంగా సాధన చేయించేవారు.

అంతే కాదు, గుడారీబాబా గొప్ప రసవాద నిపుణులు. మనకి మన స్నేహితులూ బంధువులూ ఎంత బాగా తెలుసో ఆయనకి మొక్కలూ ఖనిజాలూ అంత బాగా తెలుసు. హిమాలయాలలో పెరిగే వందలాది ఔషధ మొక్కల గురించీ, వాటికి గల రోగ నివారక ఔషధ లక్షణాల గురించి వివరించారు. శరీరంలోని విషాన్ని తీసి చైతన్యాన్ని నింపే కొన్ని ప్రత్యేక

మొక్కలను ఎలా సేకరించాలో ఆయన భోలేకి నేర్పారు. నిగూఢమైన హఠయోగ, ప్రాణాయామ, ధ్యాన పద్ధతులను రసవాదంలోని మార్మిక విధానాలతో ఎలా అనుసంధానించాలో ఆ సూక్ష్మ రహస్యాలను కూడా బోధించారు.

అయితే ఎప్పుడూ గుడారీ బాబా వీటిని ఉపయోగించటం భోలే చూడలేదు. యోగుల శక్తికీ జ్ఞానానికీ ఇవేనా మూలం అని భోలే ఆశ్చర్యపోతూ ఉండేవాడు. వీళ్లు తపస్సు ద్వారా, యోగ విద్య ద్వారా అతీంద్రియ శక్తులు పొందుతారని భోలేకి తెలుసు. గుడారీ బాబా కూడా ఖచ్చితంగా ఏదో తపస్సు చేస్తుంటారనీ ఇప్పటికీ అలాంటి సాధన ఏదో చేస్తూనే ఉన్నారనీ భోలే విశ్వసించాడు. దానివల్లే ఆయన మానవమాత్రులు ప్రయాణించలేని ఈ దుస్తరమైన లోయగుండా పర్వతాల గుండా నడుస్తున్నారు. దేవతలతో మాట్లాడటంలాంటి అతీంద్రియ జ్ఞానం ద్వారా అసాధ్యమైన పనులు చేస్తున్నారు. ఆకలి, దాహం, అలసట, నిద్ర వంటి ప్రాణాంతక సమస్యలు కూడా ఆయన్ని ఏమీ చేయలేవు. బహుశా ఆయన సొంత భగవత్ ప్రసాదమై ఉంటుందని భోలే అనుకున్నాడు. ఒకసారి భోలే 'అద్భుతమైన ఫలితాన్ని పొందాలంటే అందుకు సరిపడే కఠోర నియమాలను సాధన చేయాలి. మీ బోధ ఫలించాలంటే నేను ఎలాంటి కఠోర నియమాల్ని పాటించాలి?' అని బాబాజీని అడిగాడు.

గుడారీ బాబా భోలేని ఆటపట్టించడం పూర్తి అయిన తర్వాత కఠోర నియమాల సాధనలో తనకు తానుగా ఎంతో జాగ్రత్తగానూ నియమ నిష్ఠలతో వుండాలో అతడికి తెలిపారు. 'సంస్కృత పదమైన **'తపస్'** అంటే **వేడి** లేదా **ప్రకాశం**. నిన్ను తేజోవంతంగా వుంచే ప్రతి సాధనా తపస్సే. అనారోగ్యకరమైన జీవనం నీలోని జీవ శక్తిని నిర్వీర్యం చేస్తుంది. బద్ధకాన్నీ జడత్వాన్నీ దహించి బూడిద చేసి శరీరాన్ని పోషణతో పరిశుద్ధంగా ఉంచితే అది నీలో తపస్సు చేయడానికి కావలసిన జ్వాలను అనుమతిస్తుంది. నీలో ఉన్న అవరోధాలను అధిగమించటానికి నేచెప్పిన వాటినన్నిటినీ క్రమం తప్పకుండా సాధన చేస్తుంటే నువ్వు తపస్సు చేస్తున్నట్టే!' అన్నారాయన.

భోలే గుడారీ బాబాతో నెలరోజులు పైగా తిరిగి చివరికి తుంగ్‌నాథ్‌లో ఉన్న తన గురువు దగ్గరికి చేరుకున్నారు. తుంగనాథ్ అంటే శిఖరాల్లోకెల్లా నాయక శిఖరం. ఇది కూడా సుప్రసిద్ధమైన కేదారనాథ్ పుణ్యక్షేత్రం లాగానే మహిమాన్వితమైన దేవభూమి. దీనికి 12,000 అడుగుల ఎత్తులో ఒక పురాతనమైన గుడి ఉంది. ఆ మందిరంలోకి వెళ్లి కూర్చుంటే పట్టుమని పదిమంది పట్టగలరు, అంతే! దీని చుట్టూ రకరకాల దేవుళ్ల కొలువు తీరిన పన్నెండు గుళ్లు ఉన్నాయి.

స్థల పురాణం ప్రకారం, యోగుల కథనాల ఆధారంగానూ ప్రధాన గుడి గుహ ప్రవేశ ద్వారంలోనే ఉంటుంది. కానీ అది ఈ చీకటి యుగారంభంలో మూసుకు పోయిందనీ, అది మానవుడి కంటికి కనబడదనీ చెప్తున్నారు. గుడి వెనుక భాగం పర్వతంలోనే కట్టబడి ఉందనీ అనుకుంటారు. అతి కొద్దిమంది యాత్రికులు మాత్రమే ఈ మందిరాన్ని సందర్శిస్తారు, అదీ కేవలం వేసవి కాలంలోనే. సంవత్సరంలో ఆరునెలలు ఈ ప్రాంతాన్ని కొద్దిమంది సాధువులు తప్పించి అందరూ సందర్శించడానికి వీలు ఉండదు. శీతాకాలం రోజుల్లో చప్టా మీద కనీసం ఒక్క కారు కూడా కనిపించదు.

తుంగనాథ్‌కి పైన కొద్ది దూరంలో చంద్రశిల ఉంటుంది. ఇది ప్రఖ్యాతి గాంచిన అమ్మవారి శిఖరం. ఇక్కడే శ్రీరామచంద్రుడు ధ్యానం చేశాడు. దీనికి దగ్గరలో ప్రఖ్యాతి గాంచిన లంకానగర రాజైన రావణాసురుడు పర్వతరాజైన శివుడి కోసం ధ్యానం చేసిన రావణశిల కూడా ఉంది. ఇప్పటికీ ఈ పర్వత ప్రాంతాల మధ్యలో ధ్యానం చేసే సాధకులకు ఆ ఉత్కంఠభరితమైన అనందం నిశ్శబ్ద సంగీతం అనాయాసంగా వినిపిస్తుంది. హిమాలయాలలోని తుంగనాథ దాని

చుట్టు ప్రక్కల పర్వతాలు బాబాజీకి ఎంతో ఇష్టమైన రహస్య ప్రదేశాలని కొంతమంది యోగులకి మాత్రమే తెలుసు. గుడారీ బాబాను పుష్ప లోయలో వదిలిన తరువాత ఇక్కడే భోలే బాబాజీని కలిసాడు. గుడారీ బాబాతో గడిపిన అనుభవం ఇప్పటికీ తాజాగా ఉంది.

గుడారీ బాబా వల్ల ప్రేరేపించబడ్డ కఠోర నియమ సాధన చేయాలనే కోరిక రోజురోజుకీ తీవ్రమవుతోంది. పుష్ప లోయలోకి వెళ్లక ముందు భోలేకి యోగ సిద్ధి పొందాలంటే కఠినమైన ఉపవాసాలతో ఇతరులకు దూరంగా ధుని ముందు కూర్చుంటే చాలనే అభిప్రాయం ఉండేది! కానీ గుడారీ బాబా ఈ అవగాహనను పటాపంచలు చేశారు. దాంతో భోలే దీని గురించి మరింత వివరంగా సరైన సమయంలో తన గురువుని అడిగి తెలుసుకోవాలని భావించాడు. సరైన సమయం కోసం భోలే కాచుకుని కూర్చున్నాడు. ఆ సమయం రాగానే తన గురువును 'మీ సిద్ధులకి బలం, సామర్థ్యం ఎక్కడ నుంచి లభిస్తుంది?' అని అడిగేశాడు. తన సహజ ధోరణిలోనే బాబా 'అదే...కఠోర నియమ సాధనతోనే...!' అని బదులిచ్చి కళ్లు మూసుకున్నారు.

ఈ సమాధానంతో భోలేకి ఏమీ అర్థం కాలేదు, మనసు సంతృప్తి చెందలేదు. అదృష్టవశాత్తూ అయితే బాబాజీ శిష్యుల్లో పెద్దవాడు, అనుభవజ్ఞుడైన శిష్యుడు స్వామి శివానంద భోలే ప్రశ్నకు సమాధానం చెప్పడానికి సిద్ధపడ్డాడు.

'మీరు ఉపవాసం వుండి అగ్నికి ఎదురుగా కూర్చుని శరీరాన్ని ఎండగట్టుకుంటే ఏ రకంగా ఆరోగ్యంగానూ, దృఢంగానూ ఉండగలుగుతారు?' అని భోలే స్వామీ శివానందను అడిగాడు.

స్వామీ శివానంద దానికి, 'ఇలాంటి కఠోరమైన దీక్షలు మన శరీరాన్నీ, చిత్తాన్నీ బలహీనపరుస్తాయే తప్ప సంస్కారహీనమైన మనస్సు రేకెత్తించే కోరికలకు అనుగుణంగా నడుచుకోలేవు. బలహీనమైన శరీరం, చిత్తము అలోచనలను కోరికలను ఎగదోసే మనసును ఎదుర్కోలేవు. ఇలాంటి వాటిని ఎదుర్కోవాలంటే అనంతమైన శక్తిని సంతరించుకున్న ధృడ చిత్తము, సంకల్ప బలం, జ్ఞానము, తనకు తానుగా సమర్పించుకునే తత్వంలాంటి వాటిని సాధించే కఠోర సాధనలతో ప్రయోజనం ఉండదు. నిజానికి మనసుకీ శరీరానికీ ఆరోగ్యకరమైన జీవన విధానాన్ని అలవరచుకోవటమే 'తపస్సు.' విపరీతంగా తినడం లేదా పస్తులు ఉండడం, విపరీతంగా నిద్రపోవడం లేదా జాగారాలు చేయడం, విపరీతంగా వ్యాయామం చేయడం లేదా మొద్దులా కదలకుండా ఉండడం, విపరీతంగా అలోచించడం లేదా అసలు మెదడును ఉపయోగించకుండా ఉండడంలాంటి పనులన్నీ మనస్సుకీ శరీరానికీ ఆధారంగా వుండి సుస్థిరంగా వుంచే జీవశక్తులను ఆందోళనకు గురిచేయడమే. చెడు అలవాట్లతోనూ నిర్లక్ష్యంతోనూ ప్రజలు అదే చేస్తున్నారు,' అని బదులిచ్చారు.

'అలాంటి అలవాట్లను వదిలేసి స్వీయ క్రమశిక్షణతో నిర్లక్ష్యాన్ని అధిగమించాలి. తనకు తానుగా సంస్కరింపబడాలనే లక్ష్యం నీకు లేకపోతే క్రమశిక్షణ విలువ తెలియకపోగా అది ఒక చిత్రహింసగా మారుతుంది. స్వీయ ప్రేరణ మాత్రమే స్వయంసంసిద్ధతను సాధించే భూమికను సిద్ధం చేస్తుంది. అప్పుడు మాత్రమే నువ్వు చేపట్టే అనేక శిక్షణలను అనందించగలవు. ఆ శిక్షణలే కఠోర నియమాలుగా పిలవబడతాయి. నువ్వు వాటిని ఆనందించలేకపోతే అదో నరకంగా మారుతుంది.'

అప్పుడు భోలే, 'స్వీయ క్రమశిక్షణ స్వభావం ఏమిటి? ఎవరు శిక్షణనిస్తారు, ఎలా ఇస్తారు? స్వయంనిబద్ధత అంటే ఏమిటి? వీటన్నిటినీ ఆచరించడానికి ఆసక్తి లేకపోతే మనం ఎలా ఆచరిస్తాం? అలసిపోవడాన్ని ఇష్టం లేనపుడు పర్వతాలపై గంటల తరబడి ఎలా నడవగలం?

కావలసినంత ఆహారం ఎదురుగా ఎంతో రుచిగా ఉన్నపుడు మనల్ని మనం ఎలా నిగ్రహించుకోగలం?' అనడిగాడు.

సామీ శివానంద 'జీవిత పరమార్థాన్నీ, దాని ఆవశ్యకతనీ అర్థం చేసుకోవడం మొదలుపెట్టినపుడే నీ జీవితంలోని విలక్షణమైన మధురక్షణాల విలువను అర్థంచేసుకోగలవు. అవగాహన మొదలైతే ఇంక తుచ్ఛమైన విషయాలపై అర్థంలేని అనుభవాలపై నీ సమయం వృథా చేయనవసరం ఉండదు. జీవితంలో మరణం ఒక అనివార్యమైన వాస్తవం. నువ్వు ఆరోగ్యంగా దృఢంగా ఉన్నపుడే నువ్వు మరణిస్తున్నావనీ, దాన్ని ఎవరూ ఆపలేరనీ ఒకసారి ఊహించుకో. అలాంటి సమయంలో నీ వెంట ఏం వస్తోందో, ఏది నీకు బాసటగా నిలుస్తోందో చూడు! మృత్యుముఖంలో ఆనందంగా ఉండగలిగావా? అలా కానప్పుడు...నీతో పాటు తీసుకెళ్లడానికి ఏమీ లేనప్పుడు, హీనమైన ఈ స్థితికన్నా హైన్యం ఇంకేముంది చెప్పు? ఈస్థితేనా నువ్వు కష్టపడి సంపాదించింది? చనిపోయిన తరువాత ఈ దు:ఖాన్నీ భారాన్నీ మోసుకుని వెళ్లడానికేనా జన్మంతా కష్టపడింది? మానవ జన్మకి సార్థకత ఇదేనా? ఈ విషయాలన్నింటి పైనా పరధ్యానం వహిస్తూ సాధ్యమైనంత తక్కువగా అలోచించేటట్టు చేయగలిగే వాతావరణ పరిస్థితుల్ని కలగజేయటమే 'ఆధ్యాత్మిక జీవనం.' మానసికంగా, శారీరకంగా, పంచేంద్రియాల ద్వారా, ప్రతి ఉచ్ఛ్వాస నిశ్వాసలోనూ ఈ ప్రశ్నలకు సమాధానం సాధించేటట్లుగా దేహానికి శిక్షణనివ్వడమే 'సాధన లేదా ఆధ్యాత్మిక ప్రక్రియ.' ఆధ్యాత్మిక జీవనానికి అంకితం కావడం ఎంతో కష్టమైన ప్రక్రియ. ఎందుకంటే ప్రపంచంలోని తళుకు బెళుకు అందాలకూ వాటి ప్రేరణలకూ, స్వతహాగా మనలో ఉండే దుర్గుణాలు వాటి ఒత్తిళ్లూ మనల్ని ఐహిక సుఖాల వెంట పరుగెత్తేటట్లు చేస్తాయి. అందుకే ఆధ్యాత్మిక ప్రక్రియని 'కఠోరమైన సాధన' అని అంటారు. నీకు చేయాలని లేకపోయినా దాన్ని ఆచరించేటట్లు నిన్ను నువ్వు ఒప్పించుకోవలసిందే!'

'అయితే మన మనసులో ఉండే స్వాభావికమైన ప్రశ్నలకు సమాధానం చెప్పే ఆధ్యాత్మిక ఆచరణ ఎలా ప్రారంభించాలి?' భోలే అడిగాడు.

ఇది మామూలు ప్రశ్న కాదు. అయితే గుడారీబాబా, మరి కొంతమంది ఋషులు భోలేలోని జ్ఞాన తృష్ణను ప్రేరేపించి వదిలారనీ, ప్రస్తుతం ఇతను ఆధ్యాత్మిక ఆచరణకు సిద్ధంగా ఉన్నాడనీ బాబాజీ, స్వామీ శివానందలకు అర్థమైంది. దాంతో వారు హిమాలయాలలో తమ గురువు వద్ద ఉన్నపుడు నేర్చుకున్న విద్యనూ, తరువాత వారు తమ విద్యార్థులకు తమ బోధలు, ఆచరణాత్మక ప్రదర్శనల ద్వారా నేర్పిన జ్ఞానాన్ని క్రమంగా బొట్టుబొట్టుగా భోలేకు ప్రసాదించారు. దాని సారాంశాన్ని హిమాలయ పరమగురువులతో జీవనం లోనూ, వీరి బోధలు, ఉపన్యాసాలు అలాగే రచనల నుంచీ కూడా మనం తెలుసుకోవచ్చు:

'నిజమైన, ఎప్పటికీ నిలిచిపోయే శాశ్వతమైన పరివర్తన కోసం మనం ఒక క్రమపద్ధతిలో స్వీయ క్రమశిక్షణతో స్వీయ శిక్షణలో సాధన చేయాలి. అవసరమైనప్పుడు కేవలం తత్వశాస్త్రం, మేధోపరమైన జ్ఞానం లాంటి వాటిని నమ్ముకుంటే పని జరగదు. నీ జిజ్ఞాస కోసం, ఆనందం కోసం కావాలంటే రకరకాల తాత్విక సిద్ధాంతాలను చదువుకోవచ్చు. అయితే ఆ సిద్ధాంతాలు నీకు నువ్వుగా ఆచరణలోకి తెచ్చుకున్నపుడే పనిచేస్తాయి. దైనందిన జీవితానికి సైద్ధాంతిక జ్ఞానాన్ని అనువర్తించడమే 'ఆచరణ!'

'సాధారణంగా ప్రజలు ఇతరులపై ఆధారపడడం అలవాటు చేసుకున్నారు. వారికెప్పుడూ ఇతరులు ఏం చేయాలో ఏం చేయకూడదో చెబుతూ ఉండాలి. ఎల్లవేళలా ఇతరుల సహాయం కావాలి. నువ్వు ఒక మనిషివి. నీ పట్ల నువ్వే బాధ్యత వహించాలి. ఇతరులమీద ఆధారపడడం వల్ల నీలోని స్వీయ ప్రేరణ అణగిపోతుంది. అది లేకపోతే నువ్వేదీ సాధించలేవు. ఓటమి పట్ల

భయాన్ని పక్కకి నెట్టు. నీ దృఢ సంకల్పాన్ని మేల్కొలుపు. త్వరలో గెలుపే స్వయంగా వచ్చి నీ పాదాభివందనం చేస్తుంది.'

'దేహాన్నీ మెడనీ తలనీ నిటారుగా పెట్టి కూర్చోవడం అనేది ఒక క్రమపద్ధతిలో అభ్యసించు. అలా కూర్చోవడం ఎంతో ఆరోగ్యకరం, అత్యంత సౌకర్యవంతం కూడా! అలా కూర్చున్నప్పుడు వెన్నెముక అడుగు భాగంలో ఒత్తిడి పెరిగి నీలోని జీవశక్తులు విస్తరించి పైకి పెరుగుతాయి. ఎందుకంటే వెన్నెముక నిటారుగా వుండి నాడీ వ్యవస్థ సడలింపబడటం వల్ల జీవశక్తి సులభంగా ఊర్ధ్వముఖంగా వెన్నుపూస ద్వారా తల వైపు ప్రయాణిస్తుంది. ఇలాంటి భంగిమలో నువ్వు సోమరితనం, స్తబ్ధతకు దూరంగా వుంటావు. సరైన భంగిమ లేకపోతే లెక్కలేనన్ని అడ్డంకులు నీ ఆచరణకు శిక్షణకూ అడ్డుపడతాయి.'

'గుర్తుంచుకో, ఎలాంటి శిక్షణకైనా ఆచరణకైనా బలమైన, ఆరోగ్యవంతమైన దేహం వుండాలి. ఒకే భంగిమలో ఎక్కువసేపు కూర్చోవడం అనేది సాధన చేసినప్పుడు నీ శరీరం నిశ్చలమై శ్వాస, నిర్మలమై మనసు ప్రశాంతంగా ఉంటుంది. అప్పుడు నీకు *దేహం ఉంది కానీ నువ్వు దేహం కాదు అనే విషయాన్ని గ్రహిస్తావు. అంతే కాక దేహం అనేది ఒక అద్భుతమైన సాధనం అనీ దీన్ని జాగ్రత్తగా వుంచుకోవాలనీ* అర్థం చేసుకుంటావు.

అనారోగ్యంగా ఉండే శరీరం మనస్సుతో విభేదిస్తుంది. నీకు సంబంధించిన ఇతర విషయాలపై నువ్వు పని చేయలేవు. అందుకే శారీరిక ఆరోగ్యాన్ని కొనసాగించడం అనేది ఆధ్యాత్మిక ఆచరణలో అంతర్భాగమైనది.

'ఏ ఆచరణనైనా మొదలుపెట్టాలంటే ముందుగా నీకు తీవ్రమైన కాంక్ష ఉండాలి. ఆ కాంక్షే నిన్ను నిబద్ధీకరిస్తుంది. ఈ నిబద్ధత నిర్ణయాత్మక శక్తి ద్వారా సంరక్షింపబడాలి. ధ్యానంలో కూర్చోవాలని నువ్వు నిర్ణయించుకున్నప్పుడు ఎవ్వరికీ నిన్ను భంగపరిచే శక్తి ఉండదు...

'ప్రారంభంలోనే ఎక్కువగా ఆశించకు. తక్షణం ధ్యానం చేయగలిగే విధానాలేవీ లేవు. మితిమీరిన అంచనాలు ఊహల్లో, భ్రమల్లో, కలల్లో విహరించేటట్లు ఒత్తిడి చేస్తాయి. అనవసరమైన అంచనాలు నిన్ను ఆందోళనకు గురిచేస్తాయి, ఆందోళనతో ఎప్పుడూ ధ్యానం చేయలేవు. చివరకు విసుగు చెంది నీ సాధనని ఆపేస్తావు.'

'ఇక నైపుణ్యానికి సంబంధించి మొదట దేహాన్నీ మనసునూ విశ్రాంతిగా వుంచు. నిశ్శబ్దంగా శ్వాస తీసుకో. బాహ్య ప్రపంచం నుండి నీకు నువ్వు దూరమై నీ శ్వాసను గమనించు.'

'నీ మీద నమ్మకముంచు! నీ సాధన మీద, నీతోనే ఎప్పుడూ వుండి విద్య నేర్పుతున్న గురువు మీద, నమ్మకం ఉంచు. నిజమైన సాధన, రగిలే నీ ఆకాంక్ష, దేవుని కృప అన్నీ కలిసి నీకు మార్గాన్ని నిర్దేశిస్తాయి. అంతేకాదు, నువ్వెప్పుడైనా ఏదన్నా తప్పు చేస్తే అవే శక్తులు నిన్ను రక్షిస్తాయి.'

భోలే జీవితంలో కీలకమైన పాత్ర పోషించిన మరో గొప్పయోగి, 'అఘోరీ బాబా.' ఆయన గఢ్వాల్ హిమాలయాలలోని శ్రీనగర్‌కి ఆవల వైపున్న 'ధారీదేవీ' గుడివద్ద గల గుహలో నివసిస్తూ ఉండేవారు. ఈ బాబా శవాలను భక్షిస్తారనీ, తన మలాన్నే తాను భుజిస్తారనీ ఒక పుకారు ఉండేది. కానీ ఇంతవరకూ ఆయన అలాంటి పనులు చేస్తుండగా ఎవరూ చూడలేదు. అలాగే ఆయనకు ఎలాంటి రుగ్మతనైనా నయం చేయగలిగే శక్తి అనంతంగా ఉందని కూడా చెప్పుకునేవారు. మరి కొంతమంది ఆయన ఆధ్యాత్మిక శాస్త్రంలో కొన్ని ప్రత్యేకమైన విద్యలపై పట్టు సాధించాడనీ, దానివల్ల ప్రకృతి శక్తులను తనకి అనుగుణంగా ఆదేశించగలడనీ అనుకుంటూ ఉంటారు.

అఘోరీ బాబా గురించి భోలేకు చాలా చిన్నతనంలోనే తెలుసు. ఎందుకంటే భోలేకి ఏ అవసరం వచ్చినా ఆయన ఎంత డబ్బు అడిగితే అంతా ఇచ్చేవారు. అప్పట్లో అఘోరీ బాబా ఎంతో ఔదార్యం, దయగల స్వామీజీగానే భోలేకు తెలుసు. కానీ ఆ ప్రాంత ప్రజల దృష్టిలో ఆయన దెయ్యం, భూతాలను పూజించే శక్తివంతుడు మాత్రమే. ఈ రెండు విరుద్ధ సమాచారాల వల్లా భోలేకి ఆయన దగ్గర అభ్యసించడం ఒక ప్రశ్నార్థకం అయింది. కానీ బాబాజీ, ఇంకా ఇతర యోగుల అభిప్రాయాన్ని బట్టి అఘోరీ బాబా గొప్ప జ్ఞాని అనీ, ఎప్పుడూ ఇతరులకు సహాయం చేసే యోగి అనీ, ఆయన కూడా బాబాజీ అంతటి అద్భుతమైన యోగి అనీ భోలేకి కూడా తెలుసు.

తన గురువుతోటి సాటి సోదర శిష్యులతోటి ఉన్నపుడు, తనని దహించి వేస్తున్న ప్రశ్నలకు సమాధానాలు రాబట్టటానికి భోలే అఘోరీబాబాను కలిశాడు. సంగ్రహంగా చెప్పాలంటే ఇంతవరకూ భోలే బాబాజీ, గుడారీబాబా, స్వామీ శివానంద ఇంకా ఇతర గురువుల నుండి నేర్చుకున్నది 'యోగసాధన' మాత్రమే. కానీ ఇంతకన్న ఎక్కువ ఏదో ఉందని భోలేకి అనిపించింది. ఒకసారి తన గురువుని 'శక్తికీ బలానికీ మూలం ఏమిటి?' అని అడిగితే అని అడిగిన గుడారీ బాబాకి బాబాజీ 'కఠోరసాధన' అని బదులిచ్చారు. దానికి మరి కొంచెం జోడిస్తూ స్వామీ శివానంద శరీరాన్ని జాగ్రత్తగా చూసుకోవలసిన ఆవశ్యకత, క్రమశిక్షణ గురించి మాట్లాడారు. ఆయన చాలా బాగా చెప్పారు. కానీ అది పూర్తి సంతృప్తిని ఇవ్వడం లేదు. అన్ని సంప్రదాయాలలోనూ సాధకులూ జ్ఞానులూ 'కష్టపడనిదే ఫలితం ఉండదు' అనే భావాన్ని ప్రబోధిస్తూ 'కఠోర సాధన' నే మార్గంగా పేర్కొంటున్నారు. అయినా స్వయంగా మనకు మనమే మనశ్శరీరాల్ని కష్టపెట్టుకుంటూ కఠోరమైన సాధన చేయడం ఎందుకా అని భోలేకి అనిపించేది.

ఇంతవరకూ భోలే కలిసిన గురువులందరూ వాళ్లు బోధించిన విషయాలపై కొన్ని పరిమితులు విధించారు. కానీ అఘోరీ బాబా అవధులు లేని దాతృత్వాన్ని ప్రదర్శించారు. భోలే చాపల్యంతో ఏదన్నా అడిగినా వెంటనే ఇచ్చేవారు. భోలే ఒకసారి 'నేను మీ సమయాన్నీ, మీలాంటి సాధువులైన బాబాజీ, గుడారీ బాబా మరి కొంతమంది విలువైన కాలాన్ని వృధాచేశానని ఆలస్యంగానైనా గుర్తించాను. ఇంక ఇలా చేయను. ఆచరణ అనేది యోగసాధనకి ఎంతో ముఖ్యమని నాకు తెలుసు. కానీ నాకు అర్థం కానిది ఏమిటంటే యోగసాధన దృష్టి దేని మీద ఉండాలి? అంచనాలు ఆందోళనకు దారితీస్తాయనీ, ఆందోళనలు యోగసాధనకు అడ్డంకులు సృష్టిస్తాయనీ నాకు తెలుసు. కానీ సాధన నుండి ఏదైనా ఆశించాలి గదా, లేకపోతే సాధన అనేది లక్ష్యం లేనిదవుతుంది. నేను దేనికోసమూ ఎదురు చూడకపోతే నాలో యోగసాధన పట్ల ప్రేరణ ఎలా కలుగుతుంది?' అని అన్నాడు భోలే అఘోరీ బాబాతో.

దానికి అఘోరీ బాబా, 'సాధన ద్వారా శరీరాన్ని ఆరోగ్యంగా వుంచి శక్తిని పొందడం నీ భావోద్వేగాలను సమతూకంలో ఉంచగలిగి స్వీయ నియంత్రణా కౌశలం సాధించడమే యోగ సాధన! అలాంటి సాధన మాత్రమే అహర్నిశలూ జీవన సాఫల్యాన్నీ దాని పారమార్థాన్నీ, తెలుసుకోవాలనే కోరిక పట్ల కలిగే నిర్లక్ష్య స్వభావాన్ని అధిగమించగలదు. ఇలాంటి సాధన నీ దేహం పైనా, మనసుపైనా, భావోద్వేగాలపైనా ఆధిపత్యం వహించేటట్లు చేసి, అంతిమంగా నీ కర్మ ప్రపంచాన్ని నిర్మించటానికైనా, నాశనం చేయటానికైనా సహాయపడుతుంది కూడా. అయితే ఏ సాధనైనా తపస్సుతో బలోపేతం కానంతవరకూ ఫలించదు' అని సమాధానమిచ్చారు.

భోలే 'మా గురుదేవులు కూడా ఇదే చెప్పారు...! కానీ మా గురుభ్రాత చెప్పిన ప్రకారం, 'శరీర ఆరోగ్యాన్ని పెంపొందించి శక్తినీ దృఢత్వాన్నీ కలుగజేసే సాధనే తపస్సు. బద్ధకాన్నీ, జడత్వాన్నీ జయించి ఎట్టి పరిస్థితులలోనూ లొంగని సంకల్ప శక్తినీ, ఉత్సాహాన్నీ, స్వీయ ప్రేరణనీ ప్రకాశింపజేసే

సంకల్పశక్తే తపస్సు' అని అన్నారు. అయితే నిర్దిష్టంగా తపస్సు అంటే ఏమిటి? సాధనను తపస్సుతో బలోపేతం చేయడం ఎలా?' అని అడిగాడు.

'తపస్సు' అంటే బ్రహ్మచర్య ఆచరణే! 'బ్రహ్మచర్యం' పదం పట్ల జనాల్లో చాలా గందరగోళం ఉంది. సాధారణంగా ప్రజలు పెళ్లిచేసుకోక పోవడమే బ్రహ్మచర్యం అనుకుంటారు, కానీ అది పాక్షిక సత్యం. 'బ్రహ్మచర్యం' అంటే శ్రేష్ఠమైన (మహత్తరమైన) చైతన్యాన్ని ఆనందించడమే. ప్రాథమిక ప్రేరణలైన ఆకలి, నిద్ర, కామం ఇంకా స్వీయ రక్షణలాంటివి ఈ చైతన్యాన్ని దాని ఆఖరి మెట్టుకు జారవిడుస్తాయి. దాంతో అది దాని దివ్య స్వభావాన్ని ఎన్నటికీ అనుభవించదు. అయినా ఆ కాంక్ష ఇంకా మిగిలే ఉంటుంది. అది కోరికల రూపంలో అభ్యర్దిస్తునే ఉంటుంది. దాన్ని సంతృప్తిపరచడం కోసం తమ శక్తినంతా ఖర్చుపెడుతూనే వుంటారు. దాంతో ఒకానొక సమయంలో వారి మనసూ, శరీరమూ బలహీనమైపోయి ఖాళీ అవుతుంది. బలహీనమైన మనసూ, శరీరమూ తుఫానులా దాడిచేసే రోగం వృద్ధాప్యం, మరణం వంటి సంభవాలను తట్టుకోలేవు. బ్రహ్మచర్యమంటే మనసూ ఇంద్రియాలూ కోరుకునే కోరికలను జయించి శక్తిని సంరక్షించుకుంటూ మనసునీ దేహన్నీ బలోపేతం చేయడం అని అర్థం. అప్పుడు మాత్రమే మనశ్శరీరాలతో ఉన్నత స్థాయి చైతన్యాన్ని అందుకోగలవు. అదే నీ జీవితంలో అత్యుత్తమమైన దశ.

'తపస్సుకి మూలంగా భావించబడే బ్రహ్మచర్యాన్ని పాటించడానికి ఒక దివ్యమైన క్రమశిక్షణని నేను ఖచ్చితంగా పాటించి తీరవలసిందే. కానీ నేను ఎలాంటి క్రమశిక్షణ పాటించాలో ఎవరూ నాకు చెప్పరు. నా ఇంద్రియలోలత్వంలో నేను ఇరుక్కోకూడదని నాకు తెలుసు. కానీ నేను ఏ విషయం గురించీ, ఏ వ్యక్తి గురించీ ఆలోచించకుండా, నన్ను నేను గుహలో బంధించుకుని, అన్ని ఆలోచనలనూ పారద్రోలి, అతి తక్కువ ఆహారం, నీటితో ఉంటూ నిరంతరం జ్ఞానజ్యోతి గురించి అలోచిస్తూ ఉంటే ఇవన్నీ నా శక్తిని సంరక్షిస్తూ ఉచ్చస్థితిలో ఉన్న చైతన్యాన్ని దర్శించటానికి ఉపకరిస్తాయా?' అంటూ సందేహం వ్యక్తం చేశాడు భోలే. అఘోరీబాబా తన వ్యాఖ్యానాన్ని కొనసాగిస్తూ, 'ఔను, నిజమే ఈ సాధన నువ్వన్నట్లు ఇంతకన్నా ఎక్కువే ఉంది!' అన్నాడు. ఆరోజుకి మా సంభాషణ ముగిసింది.

కొన్నిరోజుల తరువాత అఘోరీబాబా భోలేకి డబ్బులిచ్చి కిరాణా సామానులు కొనుక్కుని రమ్మన్నారు. అలాగే వచ్చేటప్పుడు అగ్నికి ఆర్ఘ్యం ఇవ్వటానికి కావలసిన పూజా సామాగ్రినీ కొనమన్నారు. దాంతో భోలే దగ్గరలో ఉన్న శ్రీనగర్‌కి వెళ్లాడు. దారిలో ఒక పండితుడు కలిశాడు. అఘోరీబాబా ఆధ్యాత్మికంగా గొప్పవాడైనా మనిషి మాంసం తినే క్రూర సాధువని అతడు విశ్వసిస్తున్నాడు. ఈ పండితుడు 'ధారీదేవి' మందిరంలో ప్రొద్దున్న సాయంత్రం ఆరాధన చేస్తూ ఉంటాడు. అఘోరీబాబాను ఎప్పుడూ దూరం నుండే చూశాడు. ఎందుకంటే అఘోరీబాబా ఎప్పుడైనా దగ్గరికి వస్తుంటే ఆయన ధారిదేవి విగ్రహం వెనక దాక్కునేవాడు.

పండితుడికి భోలే తండ్రి తెలుసు. అందుకే భోలే అఘోరీబాబాతో ఉంటున్నాడని తెలిసినప్పటినుండీ కలత చెందుతున్నాడు. భోలేకి చెడ్డవాళ్లతో స్నేహం చేయకూడదని సలహా ఇచ్చాడు. దానికి భోలే, అఘోరీబాబా బెంగాలీ బాబా స్నేహితులనీ, సున్నితమైన ప్రేమాస్పదమైన సాధువనీ బదులిచ్చాడు. 'అఘోరీబాబా శుద్ధ శాఖాహారి. ఆయన ఎన్నడూ ఎలాంటి మత్తు పదార్థాలూ తీసుకోరు. సూర్యభగవానుణ్నీ, అగ్ని దేవుడినీ పూజిస్తారు' అని కూడా చెప్పాడు భోలే. పండితుడు భోలేతో కలిసి మార్కెట్ అంతా కలియదిరిగాడు. ప్రతి సందర్భంలోనూ అఘోరీ బాబా పట్ల తమ అభిప్రాయమే సరైనదని ఒకరినొకరు ఒప్పించేందుకు ప్రయత్నించారు. ఎందుకంటే ఆ పండితుడు అఘోరీబాబా తన అవసరాలను మంత్రశక్తి ద్వారా తీర్చుకుంటాడనీ, ఆహారమూ ఇతర అవసరాలు గాలి నుండి సాధిస్తాడనే నమ్ముతున్నాడు. కానీ భోలే, అఘోరీ బాబా కోసం

వెన్న, పంచదార, బియ్యం, సాధారణ ప్రజల్లాగానే పూజ చేయడానికి అవసరమైన పూజా ద్రవ్యాలూ అవీ కొనడం చూసి ఆశ్చర్యపోయాడు. దాంతో భోలే పండితుడిని తనతో వచ్చి సాధువుకి సంబంధించిన అన్ని విషయాలనూ తన కళ్లతోనే ప్రత్యక్షంగా చూడమని చెప్పాడు. అందుకు పండితుడు ఒప్పుకున్నాడు. ఎందుకంటే ఈ పండితుడికి భోలే, అతని తండ్రీ కూడా తెలుసు. దాంతో అఘోరీబాబా తనకి ఏ హానీ చేయడని నమ్మాడు.

వారిద్దరూ గుహలోకి వెళ్లగానే భోలే బాబాతో, 'ఆలస్యమవుతుంటే ఈ పండితుడి సాయం కోరాను. వీరే గుడిలో దేవతను పూజించేది. వీరు చాలా మంచివారు,' అన్నాడు.

పండితుడు అఘోరీ బాబాకి సాష్టాంగపడి దండం పెడుతుంటే అఘోరీ బాబా ఒక్కసారిగా 'ఏం పండితుడా! నా గుహలోకి వచ్చి నా కాళ్లు పట్టుకుంటావు, నా వెనుక నా గురించి చెడు మాట్లాడతావు. లే, లేచి ఆ గొడ్డలి తీసుకో!' అన్నారు. పండితుడు భయపడుతూనే గొడ్డలి తీసుకున్నాడు. 'వెళ్లు! వెళ్లి నదిలోంచి శవాన్ని బైటికి తీసి దాని తొడ నుండి కొన్ని ముక్కలు కోసి ఇక్కడికి తీసుకురా!' అని రౌద్రంగా గర్జించారు.

పండితుడిలో వణుకు మొదలైంది అయినా, బాబా ఆజ్ఞ ప్రకారం గొడ్డలి తీసుకున్నాడు. 'నది దగ్గరికి వెళ్లు! ఒక శవాన్ని బైటికి తీయ్, దాని తొడ నుండి కొన్ని ముక్కలు కోసి ఇక్కడికి తీసుకురా!' అని అఘోరీబాబా హూంకరించారు.

నది ఈ గుహ క్రిందే ఉంది కానీ భోలే ఎప్పుడూ దాంట్లో శవాలను చూడలేదు. భోలే అఘోరీ బాబా పక్కనే గుహ ద్వారం వద్ద నుంచుని పండితుడు నది నుంచి శవాన్ని బైటికి లాగడం చూశాడు. పండితుడు భయకంపితుడైపోయి శవం మీద తుళ్లి పడ్డాడు. అలానే శవం నుండి కొన్ని మాంసం ముక్కలను కోసి అఘోరీ బాబా చెప్పినట్లు వాటిని కుండలో వేసి నీళ్లుపోసి, మరిగించాడు.

అఘోరీబాబా ఎవరితోనైనా ఇలా ప్రవర్తించడం భోలే ఎప్పుడూ చూడలేదు. చూస్తుంటే పండితుడు దిక్కులేనివాడయ్యాడు. ఆ కంగారులో తన వేలు తెగేసుకున్నాడు. గాయం నుండి రక్తం తీవ్రంగా కారుతోంది. 'ఆ రక్తం ఏమిటి?' మళ్లీ అరిచారు బాబా. పండితుడికి భయంతో నోటమాట రావట్లేదు. తీవ్రంగా వణికిపోతూ అఘోరీబాబా వైపు చేయి చాస్తుండగానే అతడు మోకాళ్లు వంగి క్రిందపడిపోయాడు. అఘోరీబాబా క్రిందకి చూస్తూ, 'ఇంతకీ మనం బ్రాహ్మణుడి మాంసం తినం కదా ఇప్పుడు? తింటామా భోలే?' అన్నారు. సున్నితంగా పండితుడు చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు, గాయం పూడుకుపోయి నయమైంది. అఘోరీబాబా ప్రేమగా 'ఇంక నా గురించి తప్పుగా ఆలోచించకు. నేను మాంసం తింటానని అనుకుంటున్నావా? ఇక్కడి వాళ్లలాగే నేను అశుభ్రంగా జీవిస్తున్నానని అనుకుంటున్నావా? నేనూ మీలాగానే శుద్ధ శాకాహారిని' అన్నారాయన.

దాంతో కాస్త తేరుకున్నాడు ఆ పండితుడు. కానీ అతనికి బాబా తనతో బలవంతంగా వండిస్తున్న ఈ శాకాహార వంటకం ఏమిటో అర్థం కావడం లేదు. పది నిమిషాల తరువాత బాబాజీ కుండలో వండిన ఆహారాన్ని వడ్డించమన్నారు. వడ్డించడానికి పండితుడు కుండలోకి చూశాడు. భోలే, పండితుడు ఇద్దరూ ఆశ్చర్యపోయేలా దాంట్లో శవ మాంసం లేదు, సరికదా, తీపి రసగుల్లాలున్నాయి. అఘోరీబాబా నవ్వుతూ, 'అరే! ఈ మిఠాయిలో మాంసం లేదు' అన్నాడు.

వాళ్లు సుష్టుగా రసగుల్లాలు తిన్నారు. అయినా కుండలో ఎంత రసగుల్లాలు పడతాయో అంతకంటే ఎక్కువే మిగిలి ఉన్నాయి. వాటన్నిటినీ మిగతా వాళ్లతో పంచుకోమని అఘోరీబాబా పండితుడుకి ఇచ్చేశారు. ఆయన వెళ్తుంటే బాబా, 'నా గురించి ఇతరులతో చెడుగా మాట్లాడకూడదని

అలా చెప్పాను. అట్లా అని నా గురించి గొప్పగా మాట్లాడమనీ చెప్పడం లేదు. అప్పుడప్పుడూ ఇక్కడికి రావచ్చు కానీ నీతో పాటు స్నేహితులను తీసుకురావలసిన అవసరం లేదు,' అన్నారు.

పండితుడు వెళ్లిన తరువాత భోలే 'ఎందుకివన్నీచేశారు? ఆ శవం సహజమైనదేనా? ఐతే అ మాంసం గులాబ్‌జామ్‌లుగా ఎలా మారింది? మీరు ఈ విధంగా ఎందుకు జీవిస్తున్నారు?.'

అఘోరీబాబా సమాధానమిస్తూ, 'ఎందుకు దాన్ని శవమంటావు? అదిప్పుడు మనిషి కాదు. కేవలం ఒక పదార్థం...ఎవ్వరికీ ఉపయోగపడని పదార్థం! దాన్ని నువ్వు మనుషులలో కలుపుతున్నావు. ఎవ్వరూ ఆ శరీరాన్ని ఉపయోగించరు! నేను ఉపయోగిస్తున్నాను. పదార్థం, శక్తి అంతర్గత చలన సూత్రాలను పరిశోధిస్తున్న శాస్త్రజ్ఞుణ్ణి. నేను ఒక రూపంలో ఉన్న పదార్థాన్ని మరో రూపంలోకి మారుస్తున్నాను. నా గురువు ప్రకృతి మాత! అమె చాలా రూపాలను ఉత్పన్నం చేస్తుంది! నేను కూడా ఆమెనే అనుసరిస్తూ నా పరిసరాలలో అనేక పదార్థ రూపాలను మారుస్తూ వుంటాను. ఆ పండితుడి కోసం ఈసారి అలా చేశాను. అతను నా విషయంలో మారాడు. కానీ మిగతా వాళ్లకి తన నుంచి దూరంగా ఉండమని హెచ్చరిస్తాడు. నేను ఈ గుహలో పదమూడు సంవత్సరాల నుంచీ ఉంటున్నాను. ఎవ్వరూ నన్ను కలవలేదు. అదే నాకు కావలసింది! బైటికి నా రూపం భీతిగొలిపేదిగా ఉంటుంది. నేను అసహ్యంగా ఉంటాననీ చేపల్నీ, శవాలనీ తింటాననీ అనుకుంటారు. నా పని నేను ప్రశాంతంగా చేసుకోవడానికీ, ఏ సమస్యా రాకుండా ఉండడానికీ వాళ్లపై రాళ్లు విసురుతాను. ఐతే ఎవ్వరినీ గాయపరచను. నా పని నేను ప్రశాంతంగా చేసుకుంటాను.

హిమాలయ పరమగురువులతో ఉన్నపుడు వాళ్లలో అఘోరీబాబా ప్రత్యేక ఆధ్యాత్మిక మార్గం గురించి స్వామీజీ ఈ భాగంలో వివరించారు. అఘోరీబాబా విస్తారమైన గ్రంథ జ్ఞానం గల ప్రజ్ఞావంతుడైన తాంత్రికవేత్త. ఆయన అసాధారణమైన ప్రజ్ఞాపాటవాలు గల మహిమాన్విత సాధువు. ఆయన నిరంతరం పదార్థం, శక్తి చలనాలు, వాటి గతి తర్కాల గురించీ, అంతర్గత మార్పుల గురించీ, అవి ఏ రకంగా మానవుడి ఆత్మ చైతన్యంతో ప్రత్యక్ష సంబంధంలో ఉంటాయి అనే విషయం గురించీ ఎన్నో ప్రయోగాలు చేసే ఆధ్యాత్మిక శాస్త్రవేత్త. అఘోర మార్గానికి సంబంధించిన గ్రంథాలలో మానవ చైతన్యం నుండి ఎలా ఈ పదార్థమూ, శక్తీ వివిధ రూపాలలో మనగలుగుతోందో, చైతన్యం ద్వారా ఈ విశ్వమంతా ఎలా సృష్టింపబడిందో, భగవంతుడి లీలలో చైతన్యం, శక్తినీ పదార్థాన్నీ ఎలా వేదికగా చేసుకుందో ఎరిగినవాడే నిజమైన జ్ఞాని. ఈ విషయంలో ప్రత్యక్షానుభవం గలవారే విజ్ఞులు!

అఘోరీ బాబా అన్నా, ఆ గుహ అన్నా స్వామీజీకి ప్రత్యేక అభిమానం వుందని నేను చాలా సార్లు గమనించాను. అఘోరీ బాబా చనిపోయిన తర్వాత కూడా కొంతమంది శిష్యులను తీసుకుని తరచూ ఆ గుహని సందర్శిస్తూ ఉండేవారు ఆయన. 1983లో '*అఘోరాల రహస్య సౌర తాంత్రిక జ్ఞానం- వారి సంస్కృతి*' అనే ఉపన్యాసంలో గురువుతో స్వామీజీ సంబంధం లీలామాత్రంగా కనమడింది.

ఇంక దాంతో స్వామీజీ సౌరశాస్త్ర జ్ఞానసముపార్జనలో అఘోరీబాబా ఒక ప్రధాన కారకుడని నాకు నిర్ధారణయింది. వీరితో చేసిన సంభాషణల్లోనూ, జి.కె. కవిరాజ్ అనే గొప్ప రచయిత వ్రాసిన వ్యాసాల్లోనూ ఈ నిగూఢ శాస్త్రాలలో నిష్ణాతులైతే ఏ అస్వస్థతనైనా నయం చేయగలిగే, పదార్థాన్ని శక్తిగా శక్తిని పదార్థంగా మార్చగలిగే అసాధారణ శక్తిని కలిగి ఉంటారని నాకర్థమైంది. నా మనసుకి స్వామీజీ ఈ విద్యలో భారతదేశంలోనే కాక విదేశాలలో కూడా నిష్ణాతులని అనిపించింది. వారు అనేకమంది రుగ్మతలను నయం చేశారనీ, అలాగే శివలింగంలాంటి ఎన్నో వస్తువులను గాలి నుండి సృష్టించారనీ డజన్ల కొద్దీ కథల్ని నేను విన్నాను.

కాన్పూర్‌లోని స్వామీజీ టాండన్ కుటుంబానికి సంబంధించి ఇలాంటి కథే వినిపిస్తూ ఉంటుంది. వీళ్లు చాలా కాలంగా స్వామీజీ శిష్యులు. ఒకసారి వాళ్ల ఇంట్లో పెళ్లి జరుగుతుండగా కుటుంబ సభ్యుల్లో ఒకరు అనారోగ్యానికి గురయ్యారు. డాక్టర్ కూడా ఏమీ చేయలేని పరిస్థితి! ఆ పిల్లవాడు ఇక చనిపోతాడని భావించారు. ఈ విషయం స్వామీకి తెలిసి అక్కడికి వచ్చారు. ఒక గ్లాసుడు నీళ్లు తెప్పించుకోని ఆ గ్లాసు నీళ్లని చేతిలో వుంచుకుని పిల్లవాడి పక్క చుట్టూ తిరిగి ఆ నీళ్లను తాగి వెళ్లిపోయారు. అప్పటికప్పుడు పిల్లవాడి జ్వరం తగ్గిపోయింది, పూర్తిగా కోలుకున్నాడు. తరువాత మేము అమెరికాలో కూడా స్వామీజీ ప్రజల రోగాలను నయం చేసిన అనేక సంఘటనలను చూశాం.

ఈ కథల్లోని వాస్తవాల పట్ల నాకు ఎలాంటి అనుమానమూ లేదు, కానీ ఒక ప్రత్యేక సాధన వల్ల ఇతరుల రోగాలను నయం చేయగలగటం లేదా పదార్థాన్ని ఒక రూపం నుండి మరో రూపంలోకి మార్చడం లాంటి అసాధారణమైన సామర్థ్యాల గురించి నాకు తెలియదు. ఆరోజు రాత్రి నేను హిందీలోకి అనువాదం చేసిన '*హిమాలయ పరమగురువులతో జీవనం*' అనే పుస్తకాన్ని చదివి వినిపిస్తుండగా బాగా రాత్రయింది. స్వామీజీ పొద్దునే రమ్మని నన్ను పంపించేశారు. పొద్దున్నే వారిని చూడటానికి ఉదయం 6.30 గంటలకి వెళ్లాను. సామాన్యంగా వారు చిన్న భోజనాల గదిలో ఒకమూల పడుకునేవారు. కానీ ఆరాత్రి వారు దాని పక్కనున్న మీటింగ్ హాల్లో తన దుప్పటి మీద కూర్చుని ఉన్నారు. ప్రొద్దెక్కినా అలా కూర్చోవడం నాకు కొత్తగా అనిపించింది. గదిలోకి వెళ్లిన వెంటనే తూర్పు వైపు మూలగా ఉన్న రబ్బరు చెట్టును చూడగా అదికాస్త పొట్టిగా కనబడింది. అసలు ఆ మొక్క బాగా పెరిగి సీలింగు తగిలి వంగిపోతూ ఉండేది. దాన్ని సూర్యరశ్మి తగిలేటట్లు సీలింగ్ ఎత్తుగా ఉన్న అద్దాల గదిలోకి మార్చాలని కూడా అనుకున్నాము. కానీ ఇప్పుడు అది సీలింగ్‌కి కనీసం రెండడుగులు దిగువన ఉంది. మొదట దాన్ని ఎవరన్నా చిన్న తొట్టెలో పెట్టి ఉండాలి లేదా కొంత భాగం తొలగించి అయినా ఉండాలనుకున్నాను. కానీ నేను మరింత దగ్గరగా చూస్తే అదే తొట్టెలో మొక్క చివరి భాగం కూడా ఏ మాత్రం చెక్కు చెదరలేదు. దాంతో స్వామితో 'స్వామీజీ ఈ మొక్కకి ఏం జరిగింది? ఇది చిన్నదిగా ఎలా మారింది?' అని అడిగాను.

దానికి స్వామీజీ, 'నేనే పెద్దవాటిని చిన్నవిగా ఎలా మార్చాలో ప్రయోగాలు చేస్తున్నాను!' అని బదులిచ్చారు.

'ఎలా చేశారు మీరు?'

'చాలా సులభం, దాంట్లో ఉన్న కొంత పదార్థాన్ని (ద్రవ్యరాశి) శక్తిగా మార్చి మరో చోటుకి రవాణా చేస్తున్నా.'

'మొక్క పదార్థాన్ని శక్తిగా ఎలా మార్చారు? దాన్ని ఎక్కడ మార్చారు?'

'ఏం నేనెలా చేశానో చూడాలనుకుంటున్నావా?'

దాంతో తన చూపుడు వేలుని మొక్క వైపు చూపుతూ నా చేతిని మొక్కకీ తన చేతికీ మధ్యన పెట్టమన్నారు. అప్పుడు మొక్కకీ నాకూ మధ్యన సుమారు మూడడుగుల దూరం ఉంది. కానీ అప్పుడు నమ్మశక్యం కాని విధంగా విద్యుత్ శక్తి ఆయన వ్రేలి నుండి మొక్క వైపు ప్రయాణించింది. నేను భరించలేక నా చేయి తీసేశాను. స్వామీజీ తన శరీరం నుంచి కొంత శక్తిని మొక్కలోకి పంపిస్తున్నానని నాదృష్టిని మొక్క మీద ఉంచమని అన్నారు. నిమిషాల్లో చిన్న దీపాలు మొక్కంతా కనిపించాయి. మొక్క కాండం మీద పెద్ద దీపం కనిపించింది. రబ్బరు మొక్క త్వరగా పెరిగేదైనా స్వామీజీ పంపుతున్న వేగానికి ఆ శక్తి పరిమాణాన్ని గ్రహించలేకపోతోంది.

అందుకే ఆ శక్తి దీపాలుగా కనబడుతున్నాయని అన్నారు. తన వేలుని దింపుతూ 'ఇప్పుడు మొక్క బరువు రెండు పౌండ్లు పెరిగింది. నేను రెండు పౌండ్లు తగ్గాను' అన్నారాయన.

మళ్లీ ఆయన వ్రేలును పైకెత్తి అదే ప్రక్రియను త్రిప్పి చేశారు. నేను నా చేతిని రబ్బరు చెట్టుకీ ఆయన వేలుకీ మధ్యన పెట్టినప్పుడు బలమైన విద్యుత్ శక్తి రబ్బరు చెట్టు నుండీ ఆయనవైపు ప్రయాణించటం నేను అనుభూతి చెందాను. ఐదు నిమిషాల్లో మొక్కపైనున్న అన్ని దీపాలూ మాయమై పోయాయి. అంతటి ద్రవ్యరాశి మానవ శరీరం నిముషాల్లోనే ఎలా దాచుకుంటుందోనని ఆశ్చర్య పోయాను, 'మీ ఒంట్లో దీపాలున్నాయా ఇప్పుడు?' అని అడిగాను.

'లేవు' అని అన్నారు.

'ఐతే ఈ శక్తినంతా ఎలా పోగుచేస్తున్నారు? ఎక్కడ దాస్తున్నారు?.'

'నేను నా కడుపులో దాచుకుంటున్నాను. ఈ శక్తిని జీర్ణం చేసుకుని నా శరీరానికంతటికీ తగిన సమయంలో సరఫరా చేసే జఠరాగ్నికి ఇస్తున్నాను.'

అదే సమయంలో స్వామీజీ సెక్రటరీ కమల గదిలోకి వచ్చింది. స్వామీజీ ఆమెను చూసి నవ్వాపుకుంటూ 'హే పొడుగమ్మాయ్, నిన్ను పొట్టిదాన్ని చేయమంటావా!' అనడిగారు.

ఆమె చిన్నగా నవ్వుతూ 'సార్, ధన్యవాదాలు' అంటూ అ ఉదయం చేయాల్సిన పనిలో నిమగ్నమయింది.

స్వామీజీతో జరిపిన అనేక చర్చల ద్వారా చదివిన ఆధ్యాత్మిక పుస్తకాల వల్ల అగ్ని ద్వారా సమస్తమూ ప్రసరిస్తాయనీ వ్యాప్తి చెందుతాయని నాకు తెలుసు. 'అగ్నిని శరీరంలో జీర్ణం చేసుకుని దాన్ని శరీరమంతటా సరఫరా చేసే జఠరాగ్నికి ఈ అగ్నిని ఇస్తున్నాను' అని స్వామి అన్నారు. ప్రసన్నవదనంతో ఉన్న స్వామి నుంచి అగ్నికి సంబంధించి మరింత సమాచారం తెలుసుకోవడానికి ఇదే మంచి సమయమని 'స్వామీజీ ఈ అగ్ని ఏమిటి? అది ఎక్కడ నివసిస్తుంది? దాని విధులేమిటి? పదార్థం నుండి శక్తినీ, శక్తినుండి పదార్థాన్నీ మార్చి ప్రసరింపజేసేది అగ్నేనా? లేక అగ్ని సహాయంతో యోగి చేస్తాడా? సాధన ద్వారా అగ్నిని మన ఆధీనంలో ఉంచుకుంటామా, లేక సాధన ద్వారా అగ్ని కృప సాధించి మన ఆధీనంలో ఉంచుకుంటామా? చివరికి ఏ ఖచ్చితమైన సాధనద్వారా అగ్ని రహస్యాలన్నీ తెలుసుకోని నిష్ణాతులమవుతాం?' అని అడిగాను.

స్వామీజీ 'అఘోరీ బాబా ఈ శాస్త్రంలో నిష్ణాతులు. యోగసాధనకు అగ్నే మూలసాధనమని ఎప్పుడూ చెబుతుండేవాడు. అగ్ని ప్రమేయంతో మాత్రమే యోగి ప్రకాశవంతమైన దేహమూ, జ్ఞానవంతమైన మనసూ సాధించుకోగలడు. యోగి అగ్నిని తన నాభి మధ్యలో వుంచి ధ్యానిస్తాడు. కానీ మన సాంప్రదాయ నిపుణులు దాన్ని కటివలయం మధ్యలో వుంచి ధ్యానిస్తారు. ఈ అగ్నిని 'సంవార్తాగ్ని' అని అంటారు. ఈ అగ్ని పదార్థాన్ని శక్తిగా మార్చి ప్రసరింపజేస్తుంది, దీని నుంచి విడదీయలేని అగ్ని 'సామ్యాగ్ని'. ఇది శక్తిని పదార్థంగా మార్చుతుంది. భౌతిక పరివర్తనలు, మానసిక, ఆధ్యాత్మిక, అంతర్గత, బాహ్య మొదలైన అన్ని రకాల పరివర్తనాలూ పూర్తిగా విడదీయలేని ఈ రెండు అగ్నుల మీదే ఆధారపడతాయి. కొంతమంది యోగ సాధనను అనుసరిస్తే, మరి కొంతమంది కర్మకాండలతోనూ, బలులతోనూ, మంత్రోచ్చాటనతోనూ వీటికి సంధానకర్తలుగా వ్యవహరిస్తుంటారు,' అని అన్నారు.

'నేనీ శాస్త్రాన్ని నేర్చుకోని సాధన చేయవచ్చా?' అభ్యర్థించాను.

'ఎందుకు చేయకూడదు! నిజానికి ఈ విషయంగా 'జ్యోతిపథం– ప్రకాశం' అనే పేరుతో ఒక ఇంటెన్సివ్ కోర్సును అందించాల్సి ఉంది!' అది ప్రజలకెంతో సహకరిస్తుంది!' అన్నారాయన.

ఆ రకంగా స్వామీజీ అదే పేరుతో ఆ కోర్సును ప్రారంభించారు. తరువాత పుస్తకాలలోనూ ఉపన్యాసాలలోనూ ఇదే పేరుతో ప్రచురింపబడింది.

స్వామీజీ గుర్తు పెట్టుకున్న మరో గొప్ప సాధువు 'సోంబారీ బాబా.' ఆయన హిమాలయాలలోని కుమావూ జిల్లాలోని అల్మోరాకి పదిహేను మైళ్లకి ఆవల నివసిస్తూ ఉంటారు. ఈయన కఠోర నియమాలకీ, ఉదారతకీ పెట్టింది పేరు. ఆయన ఎక్కడ పుట్టాడో, అసలు పేరేమిటో ఎవరికీ తెలీదు, దాంతో ప్రజలు అతన్ని 'సోంబారీ బాబా' అని పిలుస్తారు. ఎందుకంటే ప్రతి సోమవారం తన ఆశ్రమంలో ప్రజలకి విందు భోజనం ఏర్పాటు చేస్తారు ఆ బాబా. (హిందీలో 'సోంబార్' అంటే సోమవారం అని అర్థం). సోంబారీ బాబా తన ఆధ్యాత్మిక ఆచరణని ప్రారంభించిన తొలి రోజుల్లో కఠోరమైన 'పంచాగ్ని సాధన'కి వారు అంకితమయ్యారు. 'పంచాగ్ని సాధన' అంటే చుట్టూరా నాలుగు దిక్కులా మంటలు పెట్టుకుని పైన నడినెత్తిన సూర్యుడు ఉండగా అంటే ఐదు దిక్కులా అగ్నిని పెట్టుకుని మధ్యలో తనలోని అగ్నిని కుండలినీ శక్తితో ధ్యానం చేసేదే పంచాగ్ని సాధన.

అతని దినచర్యలో భాగంగా సూర్యోదయానికి ముందే లేచి, దగ్గరలో ఉన్న నదిలో స్నానం చేసి కొన్ని గంటలు ధ్యానం తరువాత మధ్యాహ్నం వరకూ అగ్ని సమర్పణ సాగిస్తారు. తరువాత గుడారీ బాబా సమాధి మందిరం వరకూ నడుచుకుంటూ వెళ్తారు. (ఆ సమాధి స్థలం ఒక గౌరవ స్మారక మందిరంగా మారింది, అక్కడే గుడారీ బాబా తన దేహాన్ని స్వచ్ఛందంగా త్యజించారు). ఇక్కడ గుడారీబాబా వెయ్యి సంవత్సరాల ధ్యానాన్ని తనలో నిక్షిప్తం చేసుకున్నారని సోంబారీ బాబా భావిస్తారు. ఇక్కడ సమాధి వద్ద గుడారీ బాబాకి నివాళి చెల్లించిన తరువాతే సోంబారీ బాబా తన భౌతిక అవసరాలను తీర్చుకోవడం మొదలుపెడతాడు.

సోంబారీ బాబా ఆహారం విషయంలో చాలా నిష్ఠగా ఉంటారు. అపరాహ్ణం వేళ 'టీ' తాగుతారు. సాయంత్రం ఒకరికి సరిపడా అన్నం వండుకుంటారు. మళ్లీ దాన్ని మూడు భాగాలు చేస్తారు. ఒక భాగం చేపలకి ఆహారంగా వేస్తారు. ఇంకో భాగం ఒక పక్కకి పెడతారు, అది ఎవరికోసమో ఎవ్వరికీ తెలీదు. ఇక మూడో భాగాన్ని ఆయన తింటారు. రాత్రి ఏకాంతంగా గడుపుతారు. ఎక్కువగా కనబడని ఈయన్ని మొదటిసారిగా ఎవరైనా పట్టుకోవాలంటే ఆయన అగ్నికి నైవేద్యం అందిస్తున్నపుడు మాత్రమే సాధ్యమవుతుంది.

ఏ రోగాన్నయినా ఇట్టే నయం చేయగలిగే శక్తి ఆయనకి ఉందని గొప్ప పేరు ప్రసిద్ధులు ఉన్నాయి. వైద్యం కావలసిన వాళ్లందరూ ప్రతి మధ్యాహ్నం ఆయన చుట్టూ చేరుతారు. మందు ఉచితంగా ఇవ్వబడుతుంది. సామాన్యంగా ఆ ప్రాంతంలో దొరికే సుగంధ ద్రవ్యాలూ వనమూలికలూ మందుగా ఇస్తారాయన. అప్పుడప్పుడూ అగ్నిగుండంలోని భస్మాన్ని కూడా ఇస్తుంటారు. మినహాయింపు లేకుండా వచ్చిన ప్రతి ఒక్కరూ నయం చేయబడతారు. కానీ అక్కడికి దగ్గరలో అల్మోరా నయనతాల్‌లో ఉన్న  డాక్టర్లకి ఈయన పెద్ద శత్రువు. ఎందుకంటే ఈయన నిస్వార్థ సేవ వారి వ్యాపారాన్ని నాశనం చేస్తోంది. ఆయనకి ఎలాంటి డాక్టర్ పట్టాలూ లేవు. దాంతో అయన చట్ట విరుద్ధంగా వైద్యం నిర్వహిస్తున్నాడని దూషిస్తూ ఉండేవారు. ఈ వేధింపులు తట్టుకోలేక అతను చివరికి వనమూలికలతో, సుగంధ ద్రవ్యాలతో ప్రజలకి సహాయపడడం మానేస్తాడని వాళ్ల ఆశ. అయినా కూడా కాస్త పద్ధతి మార్చి వైద్యం చేయడాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు. అందరికీ ప్రతి సోమవారం భండారా (సామూహిక భోజనం) మొదలు పెట్టారు. ప్రతివారం సుమారు మూడువందల నుంచి ఐదు వందల మంది దాకా విందుకు హాజరవుతూ ఉండేవారు. అవసరం ఉన్న వారందరికీ ఔషధ వంటకాలు ఆయన చేత్తో వడ్డించబడుతూ ఉంటాయి. ఆ విధంగా అది శక్తిని ప్రవహింపజేసే ఒక వాహకంగా ఉపయోగపడేది.

స్వామీజీ భోలేగా పిలువబడుతున్న తొలినాళ్లలో తన గురువులతోనూ లేదా ఇతర సాధువులతోనూ వచ్చి తరచుగా సోంబారీ బాబాను కలుస్తుండేవారు. కానీ ఆ రోజుల్లో తాత్విక

విషయాలను చర్చించటానికి తగిన జ్ఞానం లేకపోవడం వల్లనో లేదా అనేక యోగ విద్యలలో నిష్ణాతులైన గురువుల సమక్షంలో చర్చించటం సరైనది కాదనో ఆయన ఆధ్యాత్మిక విషయాలు చర్చించేవారు కారు.

ఏమైతేనేం, అఘోరీ బాబాతో నివసిస్తున్నప్పుడు భోలే యోగుల యోగ సాధనకు అగ్ని అతి ముఖ్యమైన అంశమని విశ్వసించాడు. తన పరిశీలన ద్వారా వ్యక్తిగత అనుభవం ద్వారా బాబాజీ, గుదారీబాబా, అఘోరీ బాబా వంటి యోగులు వారిలో అంతర్గత అగ్నిగా ఉన్న కుండలినీ శక్తిని ధ్యానిస్తున్నారే తప్ప అరుదుగా మాత్రమే బాహ్యాగ్నిని వెలిగించే ఆచారాన్ని నిర్వహిస్తున్నారని అర్థం చేసుకున్నాడు. అంతర్గత అగ్నిని మేల్కొలిపి ఏ రకంగా ధ్యానించాలో నేర్పినందుకు అఘోరీ బాబాకు తాను ఎంతో ఋణపడి ఉన్నాననీ, కానీ అఘోరీబాబా ఈ రహస్యాన్ని తనకు సగమే బోధించారని కూడా భోలే భావించేవాడు. అఘోరీబాబా, సోంబారీ బాబా వంటి జ్ఞాన యోగ సాధకులను కలిసిన తరువాత బాహ్యాగ్ని సాధన జ్ఞానం కూడా ఎంతో విలువైనదని భోలే అభిప్రాయపడ్డాడు. ఈ జ్ఞానానికి సంబంధించి సోంబారీ బాబానే కీలకమని భోలే గ్రహించాడు. ఆ రకంగా అఘోరీ బాబా గుహను వదిలిన తరువాత ఈసారి ఒంటరిగా భోలే సోంబారీ బాబా గుహకి వెళ్లాడు.

ఏ ఉద్దేశ్యంతో వెళుతున్నారో ఎవరైతే వెళుతున్నారో వారికి హిమాలయ గ్రామాలలోని ఆల్మోరా ప్రాంతంలో సోంబారీ బాబా సామర్థ్యం గురించి ప్రచారంలో ఉన్న వందలాది కథలు ముందుగానే తెలుసు. భోలే అక్కడికి చేరడానికి ముందే సోంబారీ బాబా సాధారణంగా అతను సమర్పించే అగ్నిగుండం కంటే కూడా విస్తృతమైన అగ్ని సమర్పణని మొదలుపెట్టారు. ఇప్పుడు ఆ హోమం ప్రతి ఉదయం సుమారు నాలుగు నుండి ఆరుగంటలు కొనసాగుతోంది. యువ సాధువు భోలే వచ్చిన తరువాత హోమానికి కావలసిన కట్టెలను ఇతర పదార్థాలను, హోమ గుండంలో వేయడానికి తనకి సహాయంగా ఉండడానికి అంగీకరించాడు. అంతేకాక తనకి ఏమైనా మధ్యలో కావలసి వస్తే తీసుకుని రావడానికి భోలేను అక్కడే దగ్గరలో ఉండమని చెప్పారాయన. దీంతో ఈ హోమ క్రతువులో అప్పటికప్పుడు సోంబారీ బాబా చుట్టూ ఆవిష్కరించబడుతున్న ఒక అద్భుతమైన దృగ్విషయాన్ని సాక్షీభూతంగా తిలకించే అవకాశం భోలేకి లభించింది. ఒక్కొక్కసారి హోమ జ్వాలలు సోంబారీ బాబా చుట్టూ ఎగజిమ్ముతూ ఉండేవి. అయినా అతనికేమీ అయ్యేది కాదు. ఒక్కొక్కసారి కాలుతున్న కట్టెలు పేలి దాని నుండి బొగ్గు ముక్కలు వచ్చి ఆయన ఒళ్లో పడుతుంటాయి. వాటిని తన చేతులు ఖాళీగా ఉన్నపుడు అగ్నికి నైవేద్యం ఇవ్వనపుడు వేళ్లతో తీసి హోమగుండంలో వేసేవారు. ఎలాంటి ఆటంకం లేకుండా ఆయన సాధన కొనసాగిస్తూనే వుంటాడు. ఒక్కొక్కసారి హోమగుండంలోని వేర్వేరు మూలాల నుండి రకరకాల రంగులతో మంటలు ఎగజిమ్మటాన్ని కూడా భోలే చాలాసార్లు గమనించాడు.

ఒకసారి మధ్యాహ్నం హోమగుండం కార్యక్రమం అయిన తరువాత భోలే 'మిమ్మల్ని మంటలు ఎందుకు కాల్చటంలేదు?' అని ఆశ్చర్యంగా అడిగాడు. 'అగ్ని దానంతట అదే మనల్ని ఎందుకు కాలుస్తుంది?' అని అడిగి, 'నేనే అగ్నిని, అగ్నే నేను! ఈ విశ్వమంతా అగ్ని వ్యాపించి ఉంది. మరి ఏదైనా అగ్ని వల్ల తగలబడుతోందా? అగ్ని వల్లే జీవ చైతన్యం సుస్థిరంగా కొనసాగుతోంది. అగ్ని దివ్య స్వభావాన్ని తెలియనివారు మాత్రమే భయపడతారు,' అని బదులిచ్చారు.

భోలేకి సోంబారీ బాబా చెప్పిన చిక్కు సమాధానాలన్నీ అర్థం కాలేదు. కానీ అగ్ని అనేది మనలాగే మేధస్సుతో కూడిన దివ్య స్వభావం కలదనీ, కనీసం ఈ విశ్వమంతా అగ్ని నిండి

ఉంది. కాంతి ద్వారా వేడిద్వారా వ్యాపించి వుందనే విషయం అతనికి అర్థమైంది. కానీ సోంబారీ బాబా అన్నట్లు 'నేనే అగ్నిని, అగ్నే నేను!' అన్న మాట అర్థం కాలేదు.

మొత్తానికి విషయం అర్థమైందనే ఆశతో భోలే మరో ప్రశ్నను సంధించాడు. 'ఒక్కొక్క సమయంలో జ్వాలలు ఒక్కొక్క రంగుతో ఎందుకు ఎగజిమ్ముతూ ఉంటాయి?'

'జ్వాలలు అగ్ని నాలుకలు. అవి ఏడు. ప్రతి నాలుకకీ దాని ప్రత్యేకమైన రంగు ఉంటుంది. నువ్వు అగ్ని కర్మ మొదలుపెట్టే ముందు అగ్ని నాలుకలన్నిటినీ అవాహన చేస్తావు. ఆ తర్వాతే నువ్వు నీ హవిస్సులు వేయడం మొదలుపెడతావు. నీవు అర్పించే హవిస్సుల వెనక ఉన్న లక్ష్యాలు, వాటి లక్షణాల్ని అనుసరించి వాటిని స్వీకరించడానికి ఒక విశిష్టమైన నాలుక ముందుకి వస్తుంది. నేను అగ్నికి సమర్పించే హవిస్సులన్నీ ఒకే లక్ష్యంతో ఒకే లక్షణంతో ఉన్నా వేర్వేరు సమయాలలో వేర్వేరు ప్రకృతి శక్తులను బలోపేతం చేయడానికి అగ్నికి హవిస్సులు వేస్తూ వుంటాను. అందుకే అప్పుడప్పుడూ అగ్ని జ్వాలల రంగు మారుతూ ఉంటుంది.

'అగ్నికి సమర్పించే పదార్థాలు మన కర్మ చిహ్నాలనీ, వాటిని అగ్నికి బలి ఇవ్వడం ద్వారా మనకర్మలు అగ్నిలో సంస్కరింపబడుతున్నాయనీ, ఆ రకంగా అగ్ని క్రతువు మన ఆధ్యాత్మిక ఆచరణను బలోపేతం చేస్తోందనీ నేను అనుకున్నాను. అగ్నికి హవిస్సులు వేయడం ద్వారా ప్రకృతిని బలోపేతం చేస్తున్నామని నేనెన్నడూ అనుకోలేదు. నాకు అర్థం కానిది ఏమిటంటే ప్రకృతి మనకన్నా శక్తివంతం సర్వవ్యాపితం. అలాంటి ప్రకృతి మనమీద ఆధారపడుతుందా?'

'ఈ సాలెగూడులాంటి జీవ ప్రపంచంలో ప్రతిదీ ఒకదానితో ఒకటి మొత్తంగా సంబంధంలో వుంటాయి. ఇతరుల ఆరోగ్యానికీ సంతోషానికీ విడిగా మన ఆరోగ్యం సంతోషం మనజాలదు. మన అంతర్గత శక్తీ ఆధ్యాత్మిక జ్ఞానం బాహ్య ప్రపంచాన్ని ప్రభావితం చేస్తుంది. అలాగే బాహ్య ప్రపంచానికి మనం కూడా ప్రభావితులమవుతాము. మన భౌతిక అవసరాలన్నిటి కోసం ఈ ప్రకృతి శక్తులపై ఆధారపడతాం. గాలి, జలం, అగ్ని వంటి నిరంతరం మనకి అవసరమైన బలాన్ని సమకూర్చే శక్తులు. ఈ శక్తులు కనుక బలహీనపడితే మనం ఆరోగ్యంగా ఉండలేం. అలాగే ఈ ప్రకృతిలో సామూహిక మేధస్సు ఉంది. ఈ సామూహిక మేధస్సు బలహీనపడితే మన వ్యక్తిగత మేధస్సు కూడా గందరగోళానికీ అయోమయానికీ గురై దిక్కు లేనిదై పోతుంది. నువ్వు ఈ ప్రకృతిలో భాగం, ఈ ఆపద నుండి నిన్ను నువ్వు రక్షించుకోవాలంటే ప్రకృతిని బలోపేతం చేయడమే ఉత్తమమైన మార్గం.

ఈ కాలం పిల్లలు మీ జ్ఞానానికి బానిసలయ్యారు. సత్యాన్ని నేరుగా అనుభవంలోకి తెచ్చుకోవడం కన్నా దానిలోని సంకేతార్థాన్ని చూడడానికే ఇష్టపడతారు. అగ్ని ఒక సజీవ సత్యం. భూమికీ స్వర్గానికీ ఒక అనుసంధానం. ప్రతి వ్యక్తిలోనూ ప్రతి పదార్థంలోనూ ఈ దివ్యమైన అగ్ని కొలువుతీరి ఉంటుంది. అది మన శరీరంలోని ప్రతి కణంలోనూ ఉంటుంది. మన ప్రతి చర్యకూ ఇది సాక్షీ భూతం. మన ఆలోచనలకూ మన మాటలకూ మన చర్యలకూ అగ్నే మూలకారణం. ఇదే అగ్ని మన దేహానికి బాహ్యంలో కూడా ఉంటుంది. ఈ సృష్టిలో ఉన్న అగ్ని ప్రతి పదార్థంలోని ప్రక్రియలనూ, మార్పులనూ ప్రోత్సహిస్తుంది, నిర్వహిస్తుంది. మీరు మీ మానసిక రుగ్మతలను జ్ఞానాగ్ని ద్వారా నాశనం చేయగలరు. కానీ స్పష్టంగా కనబడే భౌతికమైన రుగ్మతల్ని భగభగలాడే మంటలోనే నాశనం చేయగలరు. అగ్ని అనేది దేనికో సంకేతం కాదు–మానవుడి స్వీయ సాక్షీభూత ఆధారిత వాస్తవం. మనం అనేక నామాలతో నిరాకారిగా ఉన్న దేవుడిని ప్రేమించడం ద్వారా పూజించడం ద్వారా ఆత్మకూ శరీరానికీ భావోద్వేగాలకీ బలాన్ని చేకూర్చుకున్నట్టే దేవుడు భూమిపై అవిష్కరించిన అగ్నికి నైవేద్యాన్ని సమర్పించడం ద్వారా మన ప్రేమని తెలియజేస్తాము.

విశ్వమంతా వ్యాప్తి చెంది పరిణామ సూత్రాలను అమలు చేస్తున్న అగ్ని దివ్యానుభూతిని పొందడమంటే దైవత్వాన్ని అర్థం చేసుకోవడమే! అదే అగ్నిని నేరుగా హోమగుండంలో ప్రత్యక్షానుభూతి పొందడమంటే మనల్ని మనం అర్థం చేసుకోవడమే! మనలోనే అగ్నిని సాక్షాత్కారం చేసుకుని ఆకస్మికంగా దాని ప్రకాశం నుండి వెలువడిన పరమానందాన్ని పొందడం యోగ సాధన. బాహ్య ప్రకృతిలో అగ్నిని వెలిగించి దానికి నైవేద్యాన్ని సమర్పిస్తూ ప్రకృతి శక్తులను బలోపేతం చేయడమే 'యజ్ఞం.' నీ స్వీయ సంతృప్తి కోసం 'యోగం' ఆచరించు. కానీ నీలోనూ నీకు బాహ్యంగా ఉన్న ఉన్నతమైన నీ ఆత్మ కోసం చైతన్య దీప్తి కోసం యజ్ఞాన్ని ఆచరించు. పరమాత్ముడు నిత్యం శివుని రూపంలో కైలాస శిఖరంపై యోగ సాధన ఆచరిస్తూ, ఇంద్రుని రూపంలో త్రిలోకాలైన భూమి, స్వర్గం వీటి మధ్యలోని ఆకాశంలో యజ్ఞాలనూ నిర్వహిస్తున్నాడు. నువ్వు దేవునితో ఉండాలనుకుంటే యోగసాధన చేస్తూ దానితోపాటు యజ్ఞాలను కూడా ఆచరించు.

భోలే ఒక్కసారిగా ఉలికిపడ్డాడు. తరువాతి రోజుల్లో సోంబారీ బాబా మళ్లీ మళ్లీ చెప్పిన విషయాలు అతని మనసులో మారుమ్రోగటం వల్ల మారిపోయాడు. అతడు చారిత్రకమైన శివుడు కైలాసంలో నివసిస్తుంటాడని అనేక కథల్లో చదివాడు కానీ వాటన్నిటినీ యోగుల జీవితానుభావాలను వ్యక్తీకరించే పురాణాలుగా మాత్రమే భావించాడు. అలాగే బహు దేవతలున్న వేద పురాణ గోపురంలో ఇంద్రుడు ఉన్నత స్థాయిలో ఉండే రాజనుకున్నాడు. ఇంద్రుడు రథం మీద కదులుతూ మెరుపులూ, ఉరుములూ సృష్టిస్తూ వర్షాన్ని కురిపిస్తాడని అనుకున్నాడు. కానీ గ్రీకు పురాణాలు మన పురాణాలతో పోల్చుకుని చదివిన తరువాత ఇంద్రుణ్ణి గ్రీకు దేవుడు 'జీయాస్'తో పోల్చుకున్నాడు. ఇంతవరకూ ఇంద్రుడు సకల జీవుల చైతన్యానికీ మనసుకీ కర్త అనీ ఆ రకంగా అందరి దేవుళ్ల మీదా అతడికి ఆధిపత్యం వుందనీ అతడే సకల శక్తుల అంతరాత్మలకీ ప్రాతినిధ్యం వహిస్తాడనే అభిప్రాయాన్ని దృఢంగా నమ్ముతున్నాడు. అలాంటి ఇంద్రుడు నిత్యం ముల్లోకాలలో యజ్ఞం చేస్తున్నాడనే విషయాన్ని తనలో ఇముడ్చుకోలేక పోతున్నాడు.

భోలే అవకాశం చూసుకుని 'యజ్ఞం అంటే ఏమిటి? ఇంద్రుడెవరూ? అతని యజ్ఞం ఎలా చేస్తాడు? మనం భాగంగా ఉన్న ఈ సృష్టిని అతనెలా ప్రభావితం చేస్తాడు?' అని అడిగాడు.

'స్వార్థాన్ని వదిలి వేయడమే యజ్ఞం' అన్నారు సోంబారీ బాబా. ఇంకా 'ఇతరుల శ్రేయస్సు కోసం పని చేయడమే యజ్ఞం. దయతో నిస్వార్థంతో ఇతరులకు సేవచేసే మార్గాలు కోకోల్లలు. కానీ బృహత్తరమైన ఈ సృష్టిని శాశ్వతంగా ఉంచేటట్లు దానికి సేవ చేయడం ఎంతో ఉత్తమమైన మార్గం. ఈ ప్రకృతి దానిలోని పొందిక, సుస్థిరత, సమతూకం స్థిరంగా ఉండేటట్లు చేయడమే ఈ సృష్టికి మనం చేసే గొప్ప సేవ. సృష్టి సమతూకం దెబ్బ తినేసరికి అన్నిరకాల జీవులూ బాధల్లో చిక్కుకుంటాయి. పురాణ గ్రంథాల ప్రకారం పర్యావరణ సమతూకాన్ని దెబ్బ తీస్తూ ఈ సృష్టికి విఘాతం కలిగించేవాళ్లే రాక్షసులు. ప్రకృతికి సేవచేస్తూ దాని పర్యావరణాన్నీ సంరక్షిస్తూ ఈ సృష్టికి సేవ చేసేవారే దేవతలు!' అన్నారు బాబా.

సోంబారీ బాబా ఇంకా చెప్పసాగారు, 'జీవులన్నీ అహారం మీద ఆధారపడతాయి. తిరిగి ఈ ఆహారగొలుసు వర్షం మీద ఆధారపడుతుంది. వర్షం ఉనికి మేఘాల మీద ఆధారపడుతుంది. మేఘాలు వాతావరణంలో వాటిని బలోపేతం చేసే అంశాలపై ఆధారపడతాయి. వాతావరణంలో బలోపేతం చేసే అంశాలన్నీ అగ్నిపై ఆధారపడతాయి. మన లోపలా వెలుపలా కూడా ఇదే చక్రం కొనసాగుతుంది. అంతిమంగా అన్ని రకాల జీవుల ఆరోగ్యం, శ్రేయస్సూ అగ్నిపై ఆధారపడుతుంది. ఆ కారణం వల్లే అగ్ని అన్నిటికీ కేంద్ర బిందువు,' అన్నారు.

భగవత్ గీత, ఉపనిషత్‌లలో యజ్ఞం గురించి భోలే తెలుసుకున్నాడు కానీ వాటన్నిటినీ మామూలు వర్ణనలుగానే తీసుకున్నాడు. అతని ప్రాధాన్యత ఎప్పుడూ అగ్ని గుండంలోని అగ్నిని

ధ్యానంచేసి దాని ద్వారా తాత్విక, ఆధ్యాత్మిక అనుభవాలు పొందడమే. నిజానికి అతడు అన్ని ఆచార క్రతువులనూ అంగీకరించాడు. వాటిలో అగ్ని సాధన కూడా ఒకటి. అది కేవలం ఆధ్యాత్మిక సార్థకత లోపించిన మతపరమైన వేడుకగానే తోచిందతనికి.

ప్రస్తుత సంభాషణల ద్వారా భోలేలో గూడుకట్టుకున్న లేనిపోని ఊహాగానాల్నీ, మిథ్యా విశ్వాసాల్నీ సోంబారీ బాబా తొలగించేశారు. భోలేకి సోంబారీ బాబా పట్ల నమ్మకం ఉంది. ఆయన చెప్పేదే విశ్వసించేవాడు. కానీ అతని జ్ఞానం మరింత విశ్లేషణని కోరుకుంటోంది. ఎవరన్నా వాతావరణాన్ని పోషించడం ద్వారా మొత్తం ఆహార ఆవరణాన్నీ దాని గొలుసునీ అగ్నికి నైవేద్యం సమర్పించడం ద్వారా ఎలా పోషిస్తారో ఖచ్చితంగా తెలుసుకోవాలని ఉంది. అందుకే ఒక రోజు 'అగ్ని ఆరాధనే ఈ ప్రకృతి సేవకి అత్యుత్తమమైన మార్గం ఎందుకనే విషయం నాకిప్పటికీ అర్థం కాలేదు. అగ్నికి అంకితమిస్తున్న ఈ ధాన్యం గింజల్ని అవసరమైనవారికి ఎందుకు ఇవ్వకూడదు? సమయాన్ని మొక్కలు పెంచడానికీ హాస్పిటల్స్‌లో ఉన్న రోగులకు సేవ చేయడానికీ కాకుండా గంటలకి గంటలు ఈ అగ్నికి నైవేద్యం చేయడం ఎందుకు? ప్రజలకు ప్రకృతి, పర్యావరణ రక్షణ ప్రాముఖ్యతను తెలియజేయకుండా అగ్నికి నైవేద్యం సమర్పించడం ద్వారా ఎక్కువ ఉపయోగం ఉంటుందని ఎలా చెప్పగలం?

'మానవులు తెలివైనవారే కానీ స్వయంవినాశకారులు!' మిగతా జంతువులలాగే వాళ్లూ బహుమతులకి శిక్షలకి అణుగుణంగా నడపబడేవారే, పైపెచ్చు వాళ్లు స్వార్థపరులు. సంతోషాలు సాధించాలనే కోరికలతో గ్రుడ్డివాళ్లు క్షణికమై ఆనందం వాళ్లకి శాశ్వతమైన వ్యధ కలిగిస్తుందనే విషయాన్ని గమనించరు. అందుకే వాళ్లు దేవుడి సలహాను పెడచెవిన పెట్టారు,' అని సోంబారీ బాబా వివరించారు.

'కొన్ని నగరాలు ప్రజలు గాలి పీల్చలేనంతగా విపరీతమైన కాలుష్యంతో నిండి పోయాయని విన్నాను. ఆ నగరాలకి దూరంగా ఉండే ప్రజలు ఇదేం పట్టించుకోరు. ఎందుకంటే వాళ్లకేం కాదని నమ్ముతారు. కానీ ఈ భూమి ఏకీకృత జీవావరణ సముదాయం. ఈ కాలుష్య మూలకాలు వాతావరణంలో పోగుపడిపోవడం వల్ల మొట్టమొదట గాలి మేఘాలు కలుషితమవుతాయి. అవి కాలుష్యమవడం వల్ల వాటి జీవత్వం పోతుంది. దీనివల్ల వీటి మీద ఆధారపడే అన్నిరకాల జీవులు మొక్కలూ, జంతువులూ, ఖనిజాలూ అన్నీ నాశనమౌతాయి. గాలి, మేఘాలు భూగోళాన్నంతా ఆవరించి ఉండటంవల్ల ఏదో ఒక ప్రాంతం కాక మొత్తం భూమి చెడు ప్రభావానికి లోనవుతుంది. ఇక్కడ హిమాలయ పర్వతాలలో కూడా దెబ్బతిన్న ప్రకృతి సమతుల్యం స్పష్టంగా కనబడకపోయినా ఇక్కడి ధాన్యాల వనమూలికల జీవత్వం క్షీణించడం మొదలైంది. కారణం భారత మైదాన ప్రాంతాలకీ, హిమాలయాలకీ వర్షాన్ని తెచ్చే మేఘాలు బంగాళాఖాతం నుండి వచ్చేవి. ఉదాహరణకి కోల్‌కతా లాంటి నగరాల కాలుష్యంతోనూ బంగాళాఖాతం హిమాలయాల మధ్య ఉన్న ప్రజల అంతర్గత పేదరికం వల్ల కాలుష్యం పెరిగి వాటి వల్ల కురుస్తున్న వర్షం కాలుష్యంతో కురవడం వల్ల ఇక్కడి పర్వత ప్రాంతాల నేలలోని సూక్ష్మ పోషక విలువలు క్షీణిస్తున్నాయి. దీనివల్ల ఇక్కడ పెరుగుతున్న కూరగాయల నాణ్యత తగ్గుతోంది. అలాగే ప్రజల ఆరోగ్యం కూడా తగ్గుతోంది.

'ప్రపంచం మొత్తానికీ గాలినీ, మేఘాల్నీ రసాయన ఇంకా మానసిక విషపదార్థాలతో కలుషితం చేయొద్దని ఎలా చెప్పగలం? ఎవరు నీ మాట వింటారు? నువ్వు పిచ్చివాడివి కాదని ఎలా చెప్పగలవు? ప్రకృతి సమతుల్యాన్ని సంరక్షించాలంటే ప్రకృతి కాలుష్యాన్ని దాని శక్తులను పునరుజ్జీవింప చేసే కార్యక్రమంతో మట్టి, నీరు, గాలి, అగ్ని కాలుష్యాలను నిర్వీర్యం చేయాలి. దీనికోసం పూర్వకాలంలో సాధువులు ఒక వ్యవస్థను కనుగొన్నారు. ఆ వ్యవస్థే యజ్ఞం.

'యజ్ఞంలో ప్రకృతి కాలుష్యాన్ని నిర్వీర్యం చేసి దాన్ని బలోపేతం చేసే పదార్థాలు ఉన్నాయి. అగ్ని మంత్రోచ్చారణ ద్వారా వాటిని సూక్ష్మశక్తిగా మార్చి మనం అనుకున్న ప్రాంతంలోకి పంపగలదు. అగ్ని ప్రక్రియ, సాధువుల దృఢ సంకల్పం, మంత్రం ద్వారా ఉత్పత్తి అయిన సూక్ష్మ గ్రాహ్య శక్తి, అలాగే యజ్ఞం చేసే వ్యక్తి స్వభావం, అన్నీ కలిసి ప్రకృతికి కొత్త జీవశక్తినిస్తాయి. యజ్ఞం ద్వారా ఉత్పత్తి అయిన శక్తి మేఘాలకు ఒక టానిక్‌లాగా పనిచేస్తుంది. దాంతో అవి స్వచ్ఛమైన వర్షాన్ని కురుస్తాయి. స్వచ్ఛమైన వర్షం ఆరోగ్యకరమైన పంటలనిస్తుంది. ఆ పంటలని వినియోగించే వారి ఆరోగ్యం బాగుంటుంది. ఆరోగ్యకరమైన వ్యక్తులు ఆరోగ్యకరమైన సమాజాన్ని నిర్మిస్తారు. నువ్వు ఆరోగ్యకరమైన సమాజంలో వుంటే నీ ఉన్నత లక్ష్యాలను చేరుకోవటానికి అడ్డొచ్చే అడ్డంకులు చాలా తక్కువగా వుంటాయి. గీతలో ఏం చెప్పారో గుర్తుంచుకో! యజ్ఞ సూత్రాలను అనుసరించి కర్మని ఆచరించనివారు నిస్సారమైన జీవితం గడుపుతారు. వారి పనులకు ఒక లక్ష్యమూ ఉండదు, వాటికి కోరుకున్న ఫలితాలూ లభించవు.'

భోలే సోంబారీ బాబాతో ఒక నెల ఉన్నాడు. ఈ నెల రోజుల సమయంలో ఇంద్రుడిని 'దేవతలరాజ'ని ఎందుకంటారో తెలుసుకున్నాడు. ఇంద్రుడు వర్షాలకి ఆధిపత్యం వహిస్తాడు, ఈ భూమ్మీద ఉన్న జీవం పూర్తిగా వర్షం మీద ఆధారపడి ఉంటుంది. అతని చైతన్యంతోనే అన్ని శక్తులూ సమాహారమై భూమిపై వర్షాలు పడతాయి, జీవులకు ప్రాణాధారమైన నీరు అందుతుంది. ఇతర దేవతామూర్తుల ముందు నిలచి వాళ్ల అంతర్గతాన్ని సఫలీకృతం చేసే దళనాయకుడు ఇతనే. ఇంద్రుడిని రుద్రుడనే పేరుతో కూడా పిలుస్తారు. రుద్రుడంటే బాధల సంతోషాల జల్లులను వెదజల్లేవాడు. యజ్ఞాలు జరుగుతుంటే అతను సంతోషాల జల్లులను కురిపిస్తాడు. ప్రజలు బద్ధకంతో నిర్లక్ష్యంతో కుటిలత్వంతో వ్యవహరించడం మొదలుపెట్టినపుడు ప్రజలను బాధల జల్లులతో తడుపుతాడు. అందుకే కొంతమందికి ఇంద్రుడు కరుణాంతరంగుడుగానూ మరికొంతమందికి భయంకరుడుగానూ కనబడతాడు.

సోంబారీ బాబాతో భోలే ఉండడంవల్ల సామాజిక ఆచారాలూ, మూఢ నమ్మకాలూ, పిడివాదాలూ అన్నీ శాస్త్రీయ యజ్ఞ ప్రక్రియల్లో కలిసిపోయాయనీ, దాంతో వేదకాలంలో ఋషులు చెప్పిన శాస్త్రీయ యజ్ఞయాగాదులు అంతరించి పోయాయనీ తెలుసుకున్నాడు. నిస్సారమైన జ్ఞానంతో బ్రాహ్మణులు వేద మూలాలలో తెలియజేసిన యజ్ఞకర్మని విడదీశారనీ హిందూత్వం కేవలం దాని శవాన్ని మాత్రమే మోసుకుని వెళ్తోందనీ అందుకే వేద ఋషుల సంతానం తీవ్ర బాహ్యాభ్యంతర దారిద్ర్యంతో కలత చెందుతున్నారనే విషయం తెలుసుకున్నాడు.

వేదసారమే సోంబారీ బాబా రూపమని భోలే గ్రహించాడు. ఆయన దేన్నీ బోధించరు. కేవలం చేసి చూపిస్తారు. అతని దగ్గరికి వచ్చే వాళ్లలో చాలామంది అమాయకులు, రైతులు, చిన్న వ్యాపారస్తులు, చేతివృత్తి పనివారు వస్తుంటారు. అప్పుడప్పుడూ కవులు, రచయితలు, ఉపాధ్యాయులూ కూడా వస్తుంటారు. ఆయన చేతిలో కనీసం ఒక్క పుస్తకం కూడా ఉండదు. ఆయన ఎలాంటి ప్రసంగాలూ చేయరు. ఒక్క విద్యార్థి కూడా ఆయన దగ్గర చదువుకోవడానికి ఏనాడూ రాలేదు.

సోంబారీ బాబా వెళుతున్న రోజు 'లోపల అగ్నిని సేకరించు, వెలుపల అగ్నిని పూజించు' అని దీవించాడు.

కృతజ్ఞతతో భోలే శిరసు వంచి 'నా అంతట నేను యజ్ఞం నిర్వహించవచ్చా?' అని అడిగాడు.

దానికి సోంబారీ బాబా, 'మొదట నీలోని అగ్నిని మేల్కొల్పుకో! నువ్వు పరివర్తన చెందు. ఉపనిషదగ్నిని సాధువు తన తలపై ఎలా అవధరిస్తాడో, ఆ విధం నేర్చుకో. నీలో నిద్రాణమై ఉన్న

అగ్నిని బాబాజీ అగ్నిరవ్వలతో మేల్కొలుపుతారు. ఒక గుహ నుండి మరో గుహకు ఆ అగ్నిని ఎలా తీసుకెళ్లాలో బాబాజీ నేర్పుతారు. లక్షలాది గుహలూ మానవ హృదయాలూ చీకటిలో మునిగిపోయి ఉన్నాయి' అని బదులిచ్చాడు.

అపార జ్ఞాన సంపదతో కూడిన ఈ ఆశీర్వచనంతో భోలే గఢ్వాల్ హిమాలయాలలో పేరొందిన చంద్రబాబానీ శక్తి మందిరంలో ఉన్న తన గురువునీ కలుసుకోవడానికి తిరిగి వెళ్లాడు.

సమయం చూసుకుని భోలే సోంబారీ బాబాతో తన అనుభవాల గురించి బాబాజీకి వివరించాడు. ఆయన భోలే పురోగతి చూసి సంతృప్తిగా నవ్వారు. తనేం నేర్చుకున్న విషయాన్ని ఆచరణలో పెట్టమని ఆయన భోలేతో చెప్పారు. ఎక్కడి నుంచి మొదలుపెట్టాలి? అనే మీమాంసలో ఉండిపోయాడు భోలే. ఎందుకంటే అతడు బాబాజీ దగ్గరా మరికొంతమంది సాధువుల దగ్గరా ఎన్నో విషయాలు చాలా నేర్చుకున్నాడు. గుదారీ బాబా దగ్గర నేర్చుకున్న ఆధునిక శ్వాస పద్ధతులతో కూడిన హఠయోగం, తన గురుభ్రాత స్వామి శివానంద నుండి వేదాంత పద్ధతిని అనుసరించిన 'స్వీయ ప్రతిబింబ యోగం', అఘోరీ బాబా నేర్పిన 'నాభీ ధ్యాన యోగం', సోంబారీ బాబా నేర్పిన 'అగ్ని కర్మ యోగం'...ఇన్ని ఉన్నాయి. సాధన మొదలు పెట్టాలంటే వీటిల్లో ఎక్కడి నుండి ప్రారంభించాలి? వాటన్నిటినీ ఎలా సాధన చేయాలి? ఈ ప్రశ్నలన్నీ భోలేని చుట్టుముట్టాయి.

అదే విషయాన్ని భోలే బాబాజీని అడిగాడు, దానికి బాబాజీ నాభిని కేంద్రంగా చేసుకుని ధ్యానం చేయమన్నారు. సాధన పూర్తయిందని తాను చెప్పేవరకూ కుమావూ హిమాలయల్లో హల్ద్వానీ ప్రాంతంలో గల సితాబనీ గుహలో ఉండమన్నాడు. 'ఎక్కువ సామాగ్రీ తీసికెళ్లకు. రెండు జతల బట్టలు, ఒక దుప్పటి, నీటికుండ, భిక్షాపాత్ర, గుహలో హోమం కోసం ఓ గొడ్డలి ఉండాలి. ఎవరితోనూ స్నేహ సంబంధాలు పెట్టుకోకు. వేకువ సమయంలో లే! కూర్చుని శరీరంలో అగ్నికి కేంద్రస్థానమైన నాభిపై దృష్టి కేంద్రీకరించి ధ్యానం మొదలుపెట్టు. నీ నాభి మధ్య భాగంలో అగ్ని వుందనే స్పృహ తప్పుతుంటే ఆ సమయంలో మెల్లిగా కళ్లు తెరు. ఎదురుగా ఉన్న హోమ గుండంలోని అగ్నిని చూడు. కళ్లు మూసుకో. ఆ దృశ్యాన్ని నీ నాభి కేంద్రంలో ప్రతిక్షేపించు. ఇదీ మంత్రం.......! నీ ధ్యాన సమయంలో ఈ మంత్రాన్ని గుర్తుంచుకో. ప్రతిరోజూ మధ్యాహ్నం నీ భిక్షాపాత్రతో దగ్గరలో ఉన్న గ్రామానికి వెళ్లు. దొరికిన భిక్షతో తృప్తిపడు. సాధన కాలమంతా ఎవరిమీదా దేనిమీదా అధారపడకుండా ఉండాలి!' అని బాబాజీ భోలేకి చెప్పి సీతాబని గుహకి పంపించారు.

భోలే గుహకి వెళ్లినపుడు ఎన్నో సంవత్సరాల నుంచి అది ఖాళీగా ఉన్నట్టే ఉంది. ఆ గుహ ఎంత మాత్రం సౌకర్యంగా లేదు. అక్కడున్న చెత్తంతా తీసి పారేసి హోమం వెలిగించటానికి చాలా రోజులు పట్టింది. అంతేకాక ప్రతిరోజూ కర్రలూ మొద్దులూ పోగు చేయడానికి చాలా సమయం పట్టేది. ఆ కర్రలు విపరీతమైన పొగతో మండేవి. ఆ పొగ, గుహ మొత్తం కమ్మేసేది. ఎవరిమీదా ఆధారపడవద్దని బాబాజీ చెప్పారు. ఆ మాట గుర్తున్నా సరే, ఎండు కట్టెల కోసం గ్రామ ప్రజలమీద ఆధారపడక తప్పింది కాదు భోలేకి. అందుకే గ్రామస్తులే కావలసిన కట్టెలను సరఫరా చేసేవారు.

చివరికి ఒక వారం తరువాతే భోలే తన దిన చర్యలను మొదలు పెట్టగలిగాడు. మొదట్లో వీలయినన్ని కట్టెలు అడవినుండి పోగు చేసుకుని గ్రామస్తుల నుండి కొద్ది కట్టెలు మాత్రమే తీసుకునేవాడు. కానీ క్రమంగా గ్రామస్తుల ఉదారంగా తనకు కట్టెలు తెచ్చిపెట్టసాగారు. దాంతో అతడు తానే స్వయంగా కట్టెలను పోగుచేసుకునే పని నిలిపివేసాడు. ఇక ప్రతిరోజూ గ్రామంలోకి భిక్షాపాత్రతో వెళ్లి గ్రామస్తుల నుండి భిక్షాటన చేసుకుంటే సరిపోయేది. రెండు వారాల్లోనే అతని సాధన ఒక క్రమంలో సాగిపోసాగింది.

ఇలా ఉండగా ఒకరోజు బైటికి వెడుతుండగా గుహలో నుండి ఓ గొంతు 'నీ విధేయతకి మాకెంతో ఆనందంగా ఉంది!' అనే స్వరం వినిపించింది. 'నువ్వు ఆహారం కోసం ఇకపై భిక్షాటన చేయనవసరం లేదు. నీకు కావలసినంత ఆహారం ఇక్కడే తిను,' అని అంటుండగానే ఒక కంచం నిండా ఆహారం కనబడింది. ఈ అతీంద్రియ చర్యకి భోలే పులకించిపోయాడు. గుహలో నివసిస్తున్న దేవతా మూర్తుల అభిమానాన్ని చూరగొన్నందుకూ తనని ఒక నిజాయతీపరుడైన సాధకుడిగా వాళ్లు గుర్తించినందుకూ కాస్త గర్వించాడు. మనసంతా పులకిస్తూ ఉండగా ఈ గుహకు పంపించినందుకు తన గురువుకి మదిలోనే కృతజ్ఞతలు తెల్పుకున్నాడు. వాళ్లిచ్చిన అహారాన్ని స్వీకరించి, ఆనాటి నుంచీ ఆహారం కోసం గ్రామంలోకి వెళ్లి భిక్షాటన చేయడం మానుకున్నాడు. హోమ గుండానికి కావలసిన కట్టెలను గ్రామస్తులు సరఫరా చేస్తున్నారు. ఎలాంటి ప్రయత్నం చేయకుండా గుహలోనే అహారం దొరుకుతోంది. ఆ రెండు వారాల తర్వాత అతని సాధన క్రమపద్ధతిలో కొనసాగడం మొదలైంది.

సాధన పూర్తయిన తరువాత గురువుగారి దగ్గరకి వెళ్తూ ఆయన తనను చూసి తప్పక గర్వపడతాడని భోలే అనుకున్నాడు. కానీ అతన్ని చూసిన వెంటనే బాబాజీ, 'సోమరిపోతా! వెళ్లు, వెళ్లి గుహలో బ్రతుకు! నీకు నాతో ఉండాల్సిన అవసరం లేదు. నువ్వు స్వతంత్ర జీవిగా ఉండాలనుకున్నాను, పరాన్నజీవిగా కాదు,' అంటూ గద్దించారు.

ఈ సంఘటన జరిగిన తరువాత భోలే, *'సాధన, మందబుద్ధులకీ, బద్ధకస్తులకీ అన్వయించే విషయం కాదు!'* అన్న సాధువుల మాటలలోని అర్థాన్ని గ్రహించాడు. అలాగే గురుబోధను జాగ్రత్తగా ఎంతో నైపుణ్యంతో తన సాధనలో ప్రతిబింబించేటట్లు చేయాలే తప్ప తన సౌకర్యం కోసం సౌలభ్యం కోసం వాటిని వక్రీకరించకూడదని గ్రహించాడు. గుహలోని అనుభవం ద్వారా మానవ మెదడుకీ ఇంద్రియ జ్ఞానానికీ ఆవల ఒక అత్యున్నతమైన వాస్తవికత వుందనేది భోలే గ్రహించాడు. మనకి అర్థమైనా కాకపోయినా నిస్సందేహంగా మహర్షులు అమరజీవులుగా ఉన్నారని అతడికి తెలుసు, ఆ జీవితం జననమరణాల సరిహద్దులకి ఆవల విస్తరించిందనీ, ఆ అమరత్వాన్ని తనకు తానుగా గుర్తించడమే జీవిత పరమార్థమనీ, అంతే తప్ప శారీరక అవసరాలనూ ఇంద్రియ అనుభవాలనూ పొందడం వాస్తవ జీవన లక్ష్యం కాదనీ గ్రహించాడు.

మరోసారి భోలే తన జీవితాన్ని తరచి చూసుకున్నాడు. తన చిన్ననాటి జ్ఞాపకాలను మననం చేసుకుని తనకు తానుగా ఈ ప్రాపంచిక శూన్యతను గుర్తు తెచ్చుకున్నాడు. అతని తండ్రి ఎలా చనిపోయాడో తన తల్లి ఎలా గుడ్డిదైందో తన గురించి తన వదిన తప్ప ఇంకెవరూ ఎలా పట్టించుకోలేదో శారీరకంగా తన కుటుంబం నుంచి తాను ఎలా విడిపోయాడో గుర్తు చేసుకున్నాడు. కానీ ఈ విషయాలతో సంబంధం లేకుండా బాబాజీ ఇతర సాధువులూ తనను ఎలా పెంచి పెద్ద చేశారో తన బాల్యంలో ఇంకా పసివాడిగానే ఉన్నపుడు ఖజురహోలోని దేవీ మాత తన దృష్టిపథాన్ని విస్తారం చేసే చూపు తనకి ఎలా ప్రసాదించిందో గురువులు ప్రేమతో అనుగ్రహించిన దీవెనలు తనని లక్ష్యం వైపు ఎలా నడిపిస్తున్నాయో మనసులో ఆలోచిస్తున్న కొద్దీ ఈ ప్రపంచం సారహీనమైనదనే భావన అతనిలో నిర్ధారితమవసాగింది. ఇలాంటి ప్రపంచంతో మిళితం కాకూడదనీ పరిపూర్ణమైన స్వేచ్ఛను ప్రసాదించే ఋషుల మార్గాన్ని మాత్రమే అనుసరించాలనీ కడసారిగా నిర్ణయించుకున్నాడు.

దైవానుగ్రహాన్ని ఎప్పుడు గౌరవించాలో ఎప్పుడు దాన్నించి దూరంగా వుండాలో భోలేకి ఇప్పటికీ అర్థం కాలేదు. *సితాబనీ గుహలో గాలి లోంచి పళ్లెం నిండా అహారం రావడం దైవానుగ్రహం కాకపోతే మరేమిటి? నేనడగలేదే? నాకు దాన్ని ఆపగలిగే శక్తిలేదే?* అనుకున్నాడు భోలే. అయితే

నేను ఇతరులమీద ఆధారపడటం మాత్రం నిజమే! అంతేకాదు ప్రతిరోజూ భిక్షాటన చేయమని చెప్పిన గురువుగారి మాటలను ధిక్కరించింది కూడా వాస్తవమే. దైవ కృపను వ్యతిరేకిస్తూ కేవలం గురువుగారి ఆజ్ఞలను శిరసా వహిస్తూ ఉండే పరిస్థితిని ఎలా నిర్వహించగలను? అని అంతర్మథన చెందసాగాడు.

అలాంటి పరిస్థితిని అప్పటి విచక్షణా జ్ఞానానికి వదిలేయమనీ జరిగిపోయిన విషయాలను అంత లోతుగా ఆలోచించడమంటే కాలాన్ని వృథా చేయడమేననీ అని బాబా వివరించారు. ఇంకా 'గుహల్లో నివసించే ఋషులను గౌరవించడం ఆ అదృశ్య శక్తుల ఆచారం!' అని కూడా చెప్పారు. నువ్వు మొదటిరోజు ఆహారాన్ని అంగీకరించిన తర్వాత మర్నాడు సున్నితంగా 'నా గురువుగారి ఆదేశానుసారం నేను ప్రతిరోజూ మీ దాతృత్వాన్ని అంగీకరించలేను!' అని చెప్పాల్సింది. అలాగే 'మీ దీవెనలు నాకు ఉన్నాయి. కనుక నాకు కావలసినపుడు వాటిని సాధించుకోగలను. కనుక నాకు కావలసింది ఆహారం కాదు, మీ దీవెనలు! వాటిని పొందితే నా సాధన విజయవంతంగా పూర్తవుతుంది!' అని అనాల్సింది' అన్నారు బాబాజీ.

భోలే ఇలాంటి తప్పులు చేయకుండా ఉండటానికి విచక్షణా జ్ఞానాన్ని ఎలా పెంపొందించుకోవాలని అడిగాడు బాబాజీని. ఎవరైనా గాయత్రీ మంత్ర జపం ద్వారా మనసును ప్రకాశింపజేసి బుద్ధికి పదునుపెట్టవచ్చు. వేద ఋషులు, సాధకులు ఈ సంప్రదాయాన్ని ఆచరించేవారు. ఆ తరువాతే ఉన్నత స్థాయి సాధనా ప్రక్రియ ద్వారాలు తెరుచుకునేవి!

'కానీ నేను గనక సన్యాసం తీసుకుంటానని ప్రమాణం చేస్తే ఈ ప్రాపంచిక అందాలకూ వాటి ప్రేరణలకూ దూరంగా ఉండనా? అప్పుడు ఎలాంటి అడ్డంకులూ లేకుండా నా సాధన విజయవంతంగా కొనసాగుతుంది కదా!' అని భోలే వాదించాడు.

బాబాజీ నవ్వి, 'వేల రకాల పరిత్యాగాలూ, సన్యసించడాలూ ఉన్నాయి! వాళ్ళేమన్నా ఇతరులకన్నా తక్కువ కష్టాలనుభవిస్తున్నారా? ఓ పూజారి తన ఆధ్వర్యంలో ఓ క్రతువు జరిపి నిన్ను అన్ని బాధలనుండి విముక్తం చేసి స్వామిని చేసేస్తే నీకు నువ్వే గురువన్నమాట! నీకింక వేరే గురువు అక్కర్లేదు! నువ్వు ఏ సాధనా చేయనవసరం లేదు! చాలామంది ఇలాంటి స్వాముల వ్యాపారంతో మోసగింపబడుతున్నారు. కర్మకాండల ద్వారా క్రతువుల ద్వారా సత్వర మోక్షం, పరివర్తన ప్రసాదిస్తామని చెప్పే పూజారుల దగ్గరికి అమాయకులు వెళ్తుంటారు. ఇది ఆత్మ ఘోష నిరంతరం తెలియజేసే స్వీయ పరిశోధనని తప్పించుకోవడానికి చేసే ప్రయత్నం. అలాగే పూజా కార్యక్రమాల ద్వారా, క్రతువుల ద్వారా తక్షణ పరివర్తన, సన్యాసత్వం లభిస్తుందని చెప్పే గురువుల దగ్గరకి అమాయకులు తమ గతం నుండి తప్పించుకోవడానికి పరుగులు తీస్తుంటారు. అంటే శిరోముండనం చేయించుకుని కాషాయ రంగు బట్టలు ధరించి ఓ కొత్తపేరు తగిలించుకుంటే మనిషి పవిత్రుడైపోతాడని చెప్పడమా అది?' అన్నారు.

'ఈ సమస్యలనుండి దూరంగా వెళ్లే బదులు, వాటిని ఎదుర్కోవడం కోసం సాధన చెయ్యి. నువ్వు ఆధ్యాత్మికంగా పెరుగుతున్న కొద్దీ నీకు నువ్వు నిష్ణాతుడివవుతావు, సాధువుగా రూపాంతరం చెందుతావు. ఎవరో వచ్చి నీకు సన్యాసి దీక్ష ప్రసాదించి నిన్ను స్వామిని చేస్తారనే భ్రాంతి నుంచి బైటపడు. నాతో కాశీకి రా! అక్కడ గాయత్రీ మంత్రాన్ని ఎక్కడ ఎలా జపించాలో నేర్పుతాను. అది నీలోని నిన్ను ముఖాముఖి చూసుకోవడానికి సహాయపడుతుంది. అప్పుడు నీలోని ఏ భాగాన్ని పరిత్యజించాలీ ఏ భాగాన్ని మరింతగా పెంపొందించుకోవాలీ అనే విషయాన్ని నీకు నువ్వే నిర్ణయించుకోగలవు,' అన్నారు.

బాబాజీ తోడు రాగా భోలే బెనారస్ చేరుకున్నాడు, అక్కడ శివుడికి ప్రణమిల్లిన తరువాత గంగకి అవతలి పక్కన నిర్మించిన కుటీరం దగ్గరికి భోలేని తీసుకుని వెళ్లారు. కుటీరం చూరు

క్రింద అవతలి వైపున హోమాన్ని వెలిగించి కుటీరం చుట్టూ వృత్తాకారంలో గీత గీసి, తాను విడుదల చేస్తే తప్ప సాధన పూర్తి అయ్యేవరకూ అందులోనే ఉండాలని ఆజ్ఞాపించారు బాబాజీ. రోజుకి ఒకసారి ఆహారం, హోమానికి కావలసిన నూనె, దీపం, కట్టెలు వంటివి తీసుకురావడానికి బాబాజీ ఒక పండితుడుని నియమించాడు.

వెళ్లే ముందు బాబాజీ భోలేతోటి 'గంగా నదీ, ఈ హోమగుండంలోని అగ్ని సమక్షంలో 24 లక్షలసార్లు గాయత్రీ మంత్రాన్ని జపిస్తూ నీ సాధనను పూర్తిచేయి. నిశ్చలంగా వుండి సమతుల్యాన్ని పాటించు. నేను గీసిన వృత్తం బైటి ప్రపంచాన్ని ఏమాత్రం పట్టించుకోకు!' అని చెప్పి వెళ్లాడు.

భోలే తన సాధనను మొదలుపెట్టాడు. అతి త్వరలోనే నగరంలోని ప్రజలు అతనిగురించి మాట్లాడటం మొదలుపెట్టారు. 'ఆ యువ సాధువు గంగానదికి ఆవలి వైపున కఠోరమైన సాధన చేస్తూ ప్రకాశిస్తున్నాడు. ఇంత చిన్నవయసులోనే అభివృద్ధి చెందాడు. ఆశ్చర్యంగా ఉందే! ఇతను ఏ దేవుడి అవతారమై వుంటాడు?' అని అనుకోసాగారు. క్రమంగా అతని కుటీరం చుట్టూ ప్రజలు గుమిగూడడం మొదలు పెట్టారు. భోలే వాళ్లతో కలవలేదు కానీ సాధనపై మనసు లగ్నం చేయడం చాలా కష్టంగా ఉంది. ఎంత తక్కువగా మాట్లాడితే వాళ్లు అంత ఎక్కువగా పొగవుతున్నారు. కానీ త్వరలోనే అతనిపై వికారమైన పుకార్లు మొదలయ్యాయి. 'అతను దొంగ స్వామి, అతనికేం తెలియదు, అందుకే ఏమీ మాట్లాడటం లేదు, యువకుడు అందమైనవాడు అంతకన్నా ఏం లేదు, కానీ తెలివిగలవాడు నగరంలోని గొప్ప వాళ్లని ఆకర్షించటానికి ప్రయత్నం చేస్తున్నాడు. వాళ్ల దగ్గర నుండి డబ్బులు వసూలవగానే ఇక్కడినుండి బిచాణా ఎత్తేసి మాయమైపోతాడు.'

ఒకరోజు పండితుల సమూహం అక్కడికి వచ్చి తమతో వేదాంత, తాత్విక చర్చలు చేయాల్సిందిగా సవాల్ చేశారు. వాళ్ల ప్రశ్నలకు చిరునవ్వుతోనే సమాధానం చెబుతూ కాసేపు మౌనంగా ఉన్నాడు భోలే. వాళ్ల ప్రవర్తన వల్ల తను చెదిరిపోకుండా తన మనసుని హోమం పైనా మంత్రం పైనా కేంద్రీకరించాడు. కానీ అతని మౌనాన్ని చూసి పండితులు మరింత రెచ్చిపోయారు. వాళ్లు ఇతని సాధనను అపహాస్యం చేస్తూ 'ఇతనొక కపటి సన్యాసి' అని దూషించారు. దాంతో అప్పటిదాకా మౌనంగా ఉన్న భోలే తన సహనాన్ని కోల్పోయాడు. ఒక్క ఉదుటున లేచి అప్పటికే చెరిగిపోయిన వృత్తాన్ని దాటి ఒక పండితుడి మెడను పట్టుకుని నది వైపు తోశాడు. ఇంతలో చూడడానికి వచ్చినవారు కూడా 'మీతో వాదించటానికి ఎలాంటి ఆసక్తీ చూపనివాళ్లతో మీకేం పని? అతన్ని వంటరిగా వదిలేయండి' అని పండితులపై అరిచారు. భోలే నిశ్శబ్దంగా తన కుటీరంలోకి వెళ్లిపోయాడు, జనం కూడా అక్కడ నుంచి వెళ్లిపోయారు. కొన్ని గంటలు తరువాత అతనికి ఆహారం ఇతర సరంజామా తెచ్చే పండితుడు బాబాజీ నుంచి ఒక టెలిగ్రామ్ కూడా తెచ్చాడు. దాంట్లో 'భోలే, నీ సాధనను నువ్వే భగ్నం చేసుకున్నావు, మళ్లీ మొదలుపెట్టు!' అని ఉంది.

భోలే తన ప్రవర్తన మూలాన్ని అలోచిస్తూ నెరవేరని కోరికలు కోపం కలిగిస్తాయని గుర్తుచేసుకున్నాడు. మనసులో ఎక్కడో ప్రజల గౌరవానికి సముఖంగా, పరాభవానికి విముఖంగా ఉన్నాడనే విషయం గ్రహించాడు. తనలో అంతర్లీనంగా ఉన్న ఈ దోషాలను తాను అధిగమించడానికి సహాయం చేయాల్సిందిగా మనసులో గురువుగారిని ప్రార్థించి మళ్లీ తన సాధన మొదలుపెట్టాడు.

కొన్ని నెలలవరకు అతని సాధన సజావుగానే సాగింది. మొత్తానికి భోలే ప్రజలనుకునేంత శాంత స్వభావంగల యోగి కాదని మాత్రం నిరూపితమైంది. దాంతో కొద్దిమంది సందర్శకులు మాత్రమే వస్తుండేవాళ్లు. ఏమయితేనేం, ఓ అసాధారణ అతిథి ఊహించని సమయంలో

వస్తుండేవాడు. అతను ఓ మరుగుజ్జు. మొదట్లో కొన్నిసార్లు మధ్యాహ్నంవేళ ఆకాశంవేపు చూపించేవాడు. భోలే పెద్దగా పట్టించుకునేవాడు కాదు. తరువాత అతడు అర్థరాత్రి రావడం మొదలుపెట్టాడు. అదృశ్యంగా ఉన్న వృత్తం ఆవలి నుండి గౌరవపూర్వకంగా వందనం చేసి మాట్లాడకుండా వెళ్లిపోయేవాడు. ప్రతిరోజూ అదే పనిచేసేవాడు. అతని సున్నితమైన శాంతియుతమైన ప్రవర్తన చూసి భోలే ఒకరాత్రి అతన్ని లోపలికి వచ్చి హోమగుండం దగ్గర కూర్చోమన్నాడు. మరుగుజ్జు లోపలికొచ్చి మంటకి కాస్త దూరంగా కూర్చున్నాడు. భోలే క్లుప్తంగా అతని పేరు, ఎక్కడ నివసిస్తుంటాడు, ఏం చేస్తుంటాడని అడిగాడు. ఆ ప్రశ్నలకు అతను క్లుప్తంగా సమాధానాలు చెప్పి వెళ్లిపోయాడు. తరువాతి రోజు అదే సమయానికి అతను మళ్లీ వచ్చి హోమానికి సమీపంగా కూర్చున్నాడు. భోలే వీలయితే మర్నాటి రాత్రికి అతను వచ్చేటప్పుడు కాస్త జిలేబి, పాలు తీసుకురాగలడేమోనని అడిగాడు. అతను ఒక్క ఉదుటున ఎగిరి వెంటనే తెస్తానన్నాడు. భోలే ఓ పక్కన, 'ఇది అర్థరాత్రి, దుకాణాలు మూసి ఉంటాయి. అదీ గాక నది దాటటానికి పడవలు కూడా ఉండవ'ని వారించాడు. దానికి ఆ మరుగుజ్జు సంవత్సరాల నుంచీ నగరంలో ఉంటున్నాననీ, పాలు, జిలేబి ఖచ్చితంగా ఎక్కడ దొరుకుతాయో తనకి తెలుసనీ, నావలు నడిపే వాళ్లకి తాను బాగా తెలుసని నొక్కి చెప్తూ భోలేకి ఎలాంటి అవకాశమూ ఇవ్వకుండా వెళ్లాడు. ఓ గంట తరువాత తిరిగొచ్చాడు, భోలే తనకిష్టమైన విందుని ఆరగించాడు.

రోజూ ఇది మామూలైపోయింది. ఆ మరుగుజ్జు ప్రతిరోజూ అర్థరాత్రి జిలేబి, పాలూ తెచ్చి కాసేపు గడిపి వెళ్లిపోయేవాడు. ప్రతిరోజూ ఆహారం తెచ్చే పండితుడు భోలే ఆహారం తగ్గటం గమనించి కారణం ఏమిటని అడిగాడు. భోలే మరుగుజ్జు సంగతంతా తెలియజేశాడు. దానికి పండితుడు అతను ఉండే చోటు తెలుసుకుంటే వెళ్లి డబ్బులిస్తానని చెప్పాడు. ఆ మర్నాడు మరుగుజ్జు రాగానే భోలే అతను తెచ్చిన జిలేబీకీ, పాలకీ పండితుడు డబ్బులిచ్చేస్తాడనీ, డబ్బు అందజేసేందుకు వీలుగా అతను ఉండే చోటు చెప్పమనీ అడిగాడు. ఎంతో బలవంతం మీద మరుగుజ్జు భోలేకు తను ఎక్కడ ఉంటున్నదీ చెప్పాడు. మర్నాడు పండితుడు అతని ఇల్లు వెతుక్కుంటూ అతని గురించి వాకబు చేయగా, ఆ అడ్రస్‌లో 90 సంవత్సరాల క్రితం ఒక మరుగుజ్జు ఉండేవాడనీ, అతను ఓ గొప్ప సంస్కృత పండితుడనీ తెలిసింది.

ఈసారి భోలేను చూడడానికి వచ్చిన పండితుడు 'బ్రహ్మచారి మహరాజ్! ఏం జరుగుతోందో చెప్పండి బాబూ! మీ ఆకలి ఎందుకు తగ్గిపోయింది?' అని వ్యంగ్యంగా అడిగాడు.

'చెప్పాను గదా, ఓ మరుగుజ్జు రోజూ రాత్రి జిలేబీ, పాలు ఇస్తున్నాడని!'

'నువ్వు నాకు ఇబ్బందులు కొని తెస్తున్నావు, చెబుతున్నా! నువ్వు నాకు నిజం చెప్పకపోతే ఇబ్బందుల్లో పడతావు! రోజంతా అతని కోసం నువ్విచ్చిన అడ్రస్‌లో వెతికాను. వాకబు చేయగా అతను 90 సంవత్సరాల క్రితం చనిపోయాడని తెలిసింది. మంచిది, ఒకవేళ నీకు ఆ చనిపోయిన మరుగుజ్జే పాలూ, జీలేబీ ఇచ్చాడంటే నేను మాత్రం అతనికి డబ్బులు ఇవ్వలేను,' అన్నాడు పండితుడు.

భోలే దిగ్భ్రమకి లోనయ్యాడు. మర్నాడు మరుగుజ్జు పండితుడు వచ్చినప్పుడు 'మీరు ఎక్కడ ఉంటారు? అసలు ఇలా అర్థరాత్రి పూట మీరు ఎందుకు వస్తున్నారో చెప్పండి!' అని అడిగాడు.

'నేను చెప్పాను గదా, మీరు మీ పని చేస్తున్నారు! నేను నా పని చేస్తున్నాను. నేను మిమ్మల్ని ఎన్నడూ ఇబ్బంది పెట్టలేదు. నాకు ఇవ్వబడిన ఆదేశానుసారం మీకు సేవ చేస్తున్నాను,' అన్నాడతడు.

'ఈయన ఎవరు? ఎందుకు ప్రతిరోజూ సరిగ్గా అర్ధరాత్రి నా దగ్గరికి వస్తున్నారు? నాకు నిజంగా సహాయం చేస్తున్నారా లేక నన్ను సాధన చేయకుండా భంగపరుస్తున్నారా? అతను మనిషేనా, కాదా? ఇతను నిజమేనా లేక నా మానసిక భ్రాంతా? నేను నిజంగా జిలేబీ తింటున్నానా, పాలు తాగుతున్నానా, లేక ఇదంతా మాయా?' అని ఆలోచించసాగాడు భోలే.

హటాత్తుగా మరో ఆలోచన అతని మెదడులో మెదిలింది. అసలు జిలేబీ అర్ధరాత్రి ఎవరూ చేయరు. బనారస్‌లో గానీ, ఆ మాటకొస్తే యావత్ భారతదేశంలోనూ జిలేబీ పగలే చేస్తారు, అప్పటికప్పుడే అక్కడికక్కడే వేడివేడిగా తినేస్తారు. ఒకవేళ అర్ధరాత్రి జిలేబీ చేసినా దాన్ని నది దాటి తెచ్చేటప్పటికి చల్లబడిపోతుంది కానీ ఇతను తెస్తున్న జిలేబీ వేడిగా ఉంటుంది. ఇతను చెప్తున్నట్లు తనేమీ మామూలు వ్యక్తి కాదు. అని ఆలోచిస్తూ కోపంగా కమండలంలోని నీళ్ల చేతిలో తీసుకోని పైకెత్తి గట్టిగా, 'చెప్పు ఎవరు నువ్వు, ప్రతిరాత్రి ఎందుకొస్తున్నావు! చెప్పకపోతే నిన్ను నాశనం చేస్తా' అని అరిచాడు భోలే.

ఆ మరుగుజ్జు మౌనంగా ఉన్నాడు. దాంతో భోలే సహనం కోల్పోయి మనసులో గాయత్రీ మంత్రాన్ని జపిస్తూ, నీళ్లను అతనిపై చల్లగానే అదృశ్యమయ్యాడు. అతను కూర్చున్న చోట భోలేకి ఒక ఎముక కనబడింది.

భోలే తన మనసులో మరోసారి తాను తప్పుచేశానని తెలుసుకున్నాడు. అనుకున్నట్లుగానే పండితుడు మరుసటి ఉదయం బాబా నుంచి ఒక టెలిగ్రాం తెచ్చాడు. దాంట్లో 'భోలే, నువు మళ్లీ సాధనను భగ్నం చేశావు. దృఢంగా ఉండు. నేచెప్పిన ఆదేశాలను జాగ్రత్తగా పాటించు!' అని ఉంది.

రాత్రి నుండీ జిలేబీ, పాలు అక్కడే ఉండడం చూసి పండితుడు ఆశ్చర్యపోయాడు. హోమానికి పక్కన ఉన్న ఎముకను చూసి అయోమయంలో పడిపోయాడు. ఇదెక్కడి నుంచి వచ్చిందని అడిగినప్పుడు భోలే, 'ఇప్పుడు దాని గురించి అనవసరం. ముందు నన్ను మణికర్ణిక ఘాట్ దగ్గరికి తీసుకుని వెళ్లు' అని అన్నాడు. పండితుడు సహాయంతో భోలే ఆ ఎముకను ఖననం చేశాడు. కానీ అలా ఎందుకుచేశాడో ఎన్నడూ చెప్పలేదు. తన సాధనను తిరిగి ఆ రాత్రి ప్రారంభించాడు. ఈసారి తన సాధనను విజయవంతంగా పూర్తిచేశాడు.

బాబాజీని తిరిగి కలుసుకున్నపుడు ఆయన 'నువ్వు త్యజించాల్సింది నీలో ఉన్న అనవసరమైన భాగం, అంతేకానీ ఈ లోకాన్ని కాదు. నువ్వు నీ సాధన చేసినందుకు సంతోషంగా ఉంది. జరిగిన సంఘటనల సమూహాలను కాకుండా పాఠాలన్నీ గుర్తుంచుకున్నావని అనుకుంటాను. వైఫల్యం విజయం కన్నా గొప్ప బహుమానం, వాటి నుంచే నేర్చుకోవడానికి అవకాశం ఉంటుంది. ఎంతో సూక్ష్మమైన విషయాలే మన భావోద్వేగాలకు ఎలా కారణమైతాయో చూశావా? అవి మన అహం నుంచే పెరుగుతాయి. నీలోని స్పృహ దాన్ని నాశనం చేయడానికి ఇష్టపడదు. ఈ అహం నుంచే అనుబంధాలూ, విముఖతలూ, కోరికలూ, కోపం అన్నీ జనించి నిన్ను భ్రాంతికి గురిచేస్తాయి, భ్రాంతి జ్ఞాపకశక్తినీ విచక్షణా శక్తినీ నాశనం చేస్తుంది. అనుబంధాలూ, విముఖతలూ, కోరికలూ, కోపం, భ్రాంతి, జ్ఞాపకశక్తి కోల్పోవడం, విచక్షణా జ్ఞానాన్ని కోల్పోవడం ఇవన్నీ **అహం** సంతానం. ఇవన్నీ అంతర్గత ఆత్మజ్ఞానాన్ని కమ్మేస్తాయి. ఇప్పుడు నువ్వు అన్నీ పరిత్యజించే సన్యాసి మార్గంలో నడిస్తే చూడాలని ఉంది,' అన్నారు.

ఆ రకంగా బాబాజీ భోలేను అధికారపూర్వకంగా సన్యాసిగా ప్రకటించి 'సదాశివ' అనే పేరు పెట్టారు. అయితే ప్రజలు అతన్ని ప్రేమతో 'భోలే' అని పిలుచుకునేవారు.

అధ్యాయం 4

# ఆత్మోన్నతి సాధన

సన్యాసిగా దీక్ష తీసుకునే ముందు భోలే మనసు ఎంతో ఉత్సాహంతో నిండిపోయింది. తన సాధనకు ఇక ఆకాశమే హద్దు! తన మాయావరణాన్ని బాబాజీ తొలగిస్తే తాను మహత్తరమైన జ్ఞానంతో నిరంతరం ఆహ్లాదకరంగా ఉండవచ్చు! ఈ సన్యాస దీక్షా క్రతువులో భాగంగా తన కర్మలన్నింటినీ బాబాజీ హోమగుండంలో ఆహుతి ఇచ్చేస్తారు. తన గత జీవితానికి చరమగీతం పాడతారు. తన అంత్యక్రియలు జరిగే సమయంలో తాను ఎలాంటి భయమూ, ఆందోళనా పడనవసరం లేకుండా తనకు సహాయకారిగా ఉంటారు. ఎలాంటి కోరికలూ, బంధనాలూ లేని ఒక విశుద్ధమానవుడిగా తను ఉద్భవించటానికి అన్ని రకాలా దోహదం చేస్తారు. భోలే ఇలా ఊహించుకుంటూ ఉన్నాడు.

అనుకున్నట్లుగానే క్రతువు మొదలయింది. ఆచారం ప్రకారం ముందు రోజు ఉపవాసం ఉండి ఏమీ తినకుండా కేవలం గంగాజలం మాత్రమే తాగి తన శరీరాన్నీ ఇంద్రియజ్ఞానాన్నీ పరిశుద్ధం చేసుకున్నాడు భోలే. ధ్యానంతో తన మనసునీ, ప్రాణాయామంతో తన నాడీవ్యవస్థనీ పునీతం చేసుకున్నాడు. ఇప్పుడు కర్మకాండలో ప్రధానమైన ఘట్టాలు మొదలయ్యాయి. పూర్వాశ్రమం వదలడానికి గుర్తుగా శిరోముండనం, పరిశుద్ధతకి ప్రతీకగా స్నానం, భవబంధనాల నుండి విముక్తికి ప్రతీకగా కాషాయ వస్త్రం, క్రమశిక్షణకి ప్రతీకగా దండం, కఠోర దీక్షకి ప్రతీకగా చెక్కతో చేసిన పావుకోళ్లు, పునర్జన్మకి సూచనగా కొత్తపేరు వచ్చాయి. పవిత్రాగ్నినిని ధరించటమే జీవిత పరమావధిగా సూచించే పవిత్ర శిలని తలమీద పెట్టుకోవడం ఇవన్నీ మొదలయ్యాయి.

క్రతువు రోజు పండితులు మంత్రాలు చదువుతుండగా బాబాజీ తల మీద జుత్తులోని ఒక పాయను కత్తిరించారు. మిగతా కేశాలను మంగలి ఖండనం చేశాడు. తరవాత భోలే తన పవిత్ర గంగా స్నానాన్ని ముగించాడు. అఘోరీబాబా అందమైన పట్టు కాషాయ వస్త్రాన్ని అందించారు. గంగోత్రి నుండి వచ్చిన భోలే గురుభ్రాత స్వామీ శివానంద భోలేకు దండం బహుకరించారు. గుడారీ బాబా పుష్పలోయ నుండి వచ్చి భోలేకి పావుకోళ్లు బహుకరించారు. బాబాజీ భోలేకు మంత్రాన్నీ ఉపదేశిస్తూ కొత్త నామమైన 'సదాశివ' అనే పేరును ఉచ్చరించారు. ఋషీకేశ్ నించి వచ్చిన నిర్వాణజీ అనే గంభీరమైన స్వామి భోలే తలచుట్టూ పూలదండను కట్టగా బాబాజీ పవిత్రమైన శాలిగ్రామాన్ని (దేవుని ప్రతీకగా సూచించే గుండ్రని శిల. దీన్ని పవిత్ర గంగా నదీ ప్రవాహం నుండీ గండకీ నది నుండీ తెస్తారు) పూలదండ మధ్య నిలిపారు.

సన్యాసి దీక్ష ముగిసేసరికి సాయంత్రం అయింది. సాధువులందరూ ఈ యువ సాధువుకి

ఆశీర్వచనాలు ఇచ్చి 'భోలేబాబా' అని పిలిచారు. బాబాజీ తన వంతు క్రియ నిర్వహిస్తూ పవిత్ర గంగా జలంలో తులసి ఆకులు వేసి ఇచ్చారు. తరవాత భోలేని బ్రహ్మ జాగరణ సాధనకి పంపారు.

'బ్రహ్మ జాగరణ' అంటే రాత్రంతా మేల్కొని పరమోన్నత యదార్థాన్ని పరికించడం! కొత్తగా సన్యాసత్వాన్ని స్వీకరించిన వాళ్లు ఈ అభ్యాసాన్ని మొదటి బ్రహ్మ జాగరణని సామాన్యంగా ఒంటరిగా పర్వత శిఖరం మీద గానీ, నది ఒడ్డున గానీ, స్మశానంలో గానీ గడుపుతారు. అఘోరీ బాబా గుహ బయట సన్యాసం స్వీకరించడం వల్ల భోలేబాబా గంగానది ఒడ్డున తన మొదటి బ్రహ్మ జాగరణని గడిపాడు.

తనపట్ల అవ్యాజ్యమైన ప్రేమను చూపే సాధువుల ప్రవర్తనలో మర్నాటికల్లా చెప్పుకోతగ్గ మార్పు రావడాన్ని భోలే గమనించారు. సన్యాసం తీసుకోవడంలో భాగంగా కొన్నిరోజుల నుండీ ఆహారం తీసుకోవడం లేదు. దాంతో గుహ నుండి బయటికి వచ్చిన మర్నాటి నుంచీ విపరీతమైన ఆకలిగా ఉంది. వచ్చిన వాళ్లందరూ వెళ్లిపోయారు. బాబాజీ, అఘోరీబాబా మాత్రమే మిగిలి ఉన్నారు. వాళ్లు కళ్లు మూసుకుని ప్రొద్దెక్కిన దాకా ధ్యానం కొనసాగిస్తున్నారు. ఖాళీ దొరికిన తర్వాత భోలేబాబా భోజనం గురించి అడిగాడు.

'నువ్విప్పుడు సన్యాసివి. నీ గమ్యాన్ని నువ్వు ఏర్పరచుకో. నీ జీవితాన్ని ప్రణాళికాబద్ధంగా కొనసాగించు. నీ దినచర్యనూ, నీలోని తీవ్రమైన కోరికలనూ ఎలా నిర్వహించుకోవాలో, నీ అవసరాలను ఎలా తీర్చుకోవాలో ఈ ప్రపంచంతో ఏ మేరకు సంబంధ బాంధవ్యాలలో ఉండాలో ఇలాంటి విషయాల్లో నీకు నువ్వుగా నిపుణత సాధించు' అన్నారు బాబాజీ.

'నాకు గమ్యాన్ని ప్రసాదించిన సృష్టికర్తలు మీరే. దయచేసి నాకు ఖచ్చితమైన మార్గదర్శకాలను సూచించండి. నేనెలాంటి ప్రక్కదారుల్లోనూ పోకుండా అనుసరిస్తాను!' అన్నారు భోలేబాబా.

బాబాజీ 'పరివ్రాజకత్వం అనేక రకాలుగా ఉంటుంది! కొంతమంది ఆశ్రమాల్లో నివసిస్తూ ఆశ్రమ నియమాలు పాటిస్తూ వాళ్ల సాధనని కొనసాగిస్తుంటారు. ఆశ్రమం కోసం పని చేస్తుంటారు. ఆశ్రమం వాళ్ల కనీస అవసరాలైన తిండి, బట్ట, నివాసం వాళ్లకు కల్పిస్తుంది. ఆశ్రమానికి ఏమైనా అవసరాలు ఉంటే వాటి కోసం భిక్షాటనలో చెప్తారు. వాళ్లకి వచ్చినదంతా అది ఆశ్రమానికే చెందుతుంది. మరో రకమైన సర్వసంగ పరిత్యాగులు నిరంతరం ప్రయాణం చేస్తూ ఎవరైనా స్వాగతిస్తే అక్కడ కొంత సమయం ఉంటారు. వీరు ఆశ్రమాల్లో గానీ ఆలయాల్లో గానీ సమయానుకూలంగా ఎక్కడైనా ఆగుతూ ఉంటారు. కానీ ఆయా ప్రదేశాలపై వాళ్లకి ఎలాంటి బాధ్యతా ఉండదు. వాళ్లకేమిచ్చారో అదే వాళ్ల భిక్ష. ఖచ్చితమైన నియమాలతో భిక్షాటన చేసే మరో సమూహం ఉంది. వాళ్లు మూడు చోట్ల మాత్రమే ఆగి భిక్ష కోసం చేతులు చాస్తారు లేదా ఎనిమిది ముద్దల ఆహారాన్నే అంగీకరిస్తారు. మరి కొంతమంది పరిత్యాగులు భిక్షాటన చేయరు. అడక్కుండానే వాళ్ల దగ్గరికి ఏం వస్తుందో అదే తీసుకుంటారు. కొంతమంది బిక్షాపాత్రని వదిలేసి కేవలం తమ దోసిళ్లతోనే భిక్షాటన చేస్తారు. కానీ గుర్తుంచుకో! ఆత్మ సాక్షాత్కారమే నీ అసలైన లక్ష్యం! అంతేకానీ ప్రత్యేకమైన జీవన విధానం కాదు,' అని బోధించారు.

'దయచేసి మరింత ఖచ్చితంగా నేను దేన్ని ఎంచుకోవాలో మీరే సెలవియ్యండి' అడిగాడు భోలేబాబా.

బాబాజీ ఆదేశపూర్వకంగా 'ఒక ఇంటి గడప వద్ద ఆగు. వాళ్లు ఇచ్చినదానితో తృప్తి పడు. ఇవాళే నీ సాధన ప్రారంభించు,' అన్నారు.

దాంతో భోలేబాబా తన భిక్షాపాత్రను తీసుకుని ఇంకా కొత్తగానే ఉన్న తన పట్టు కాషాయవస్త్రాలతో బయల్దేరారు. గ్రామంలో ఓ ఇంటి ముందు ఆగి ఆనవాయతీగా 'నారాయణా హరి' అని ఉచ్చరించాడు. అదే సమయంలో ఓ స్త్రీ ఆవు పాలు పితుకుతుండగా ఆవు హఠాత్తుగా 'నారాయణా హరి' అనే మాటకి తుళ్లి పడింది, దాంతో ఆ స్త్రీ చేతిలో పాలకుండ జారి క్రిందపడింది.

'పనికిమాలిన సన్నాసీ! ఇక్కడ్నించి వెళ్లు! కొత్తబట్టలే వేసుకున్నావు. దానికి డబ్బుంది కానీ తిండికి లేదా ఏం! అడుక్కుంటున్నావు! నీ వల్ల నా బంగారంలాంటి పాలకుండ పాడైంది,' అని అరిచింది. భోలే ఆమెను బుజ్జగించబోగా 'ఇది మా తాత ముత్తాతల నాటి పాలకుండ. దీన్ని మా అత్తగారు నాకిచ్చారు! దీన్ని కాస్తా పగలగొట్టించావు. నా కళ్ల ముందు నుంచి ఫో అవతలికి!' అని అరిచింది.

భోలేబాబా వట్టి చేతులతో తిరిగొచ్చాడు. ఆ ఇద్దరు సాధువులూ మౌనంగా మిగిలిన రోజంతా గడిపేశారు. సాయంత్రం 'నేను ఆహారం తీసుకున్నానో లేదో నన్ను ఇవాళ మీరడగలేదు!' అన్నాడు భోలే.

'నువ్విప్పుడు సన్యాసివి. గుర్తుంచుకో! ఒకే ఇంటి ముందు ఆగుతానని ప్రమాణం చేశావు! దానిమీదే నిలబడు! పరిత్యాగ మార్గం బలహీనులకీ, పిరికి హృదయం కలవారికీ అక్కరకి రాదు,' అన్నారు బాబాజీ.

దాంతో ఓ బలమైన సంకల్పం భోలే మనసులోకి ప్రవేశించింది. ఈ లోకంలో ప్రతివాడూ భిక్షకుడే. ఎవరైనా పరమాత్మ కృప లేనిదే ఆలోచించగలడా? శ్వాసించగలడా? ప్రతిరోజూ ఎవరో ఇళ్ల ముందు ఆగడం ఎందుకు? ఒకే ఇంటిముందు ఎందుకు ఆగకూడదు! అదీ ఈ ప్రపంచం మొత్తానికీ అన్నీ అందించే దేవతా మూర్తి ద్వారం వద్ద ఒకేసారి ఎందుకాగకూడదు?

బాబాజీ ఎన్నడూ సులువైన మార్గాన్ని ఎంచుకోరు. సవాలుగా ఉండే మార్గాన్నే ఎంచుకుంటారు. ఆయన ఆశీర్వచనాలు తనకున్నాయి గదా! ఈ ఆలోచన రాగానే భోలేబాబా వాళ్ల అనుమతి అడక్కుండానే ఒకసారి ప్రణమిల్లి తనదారిని తను ఎంచుకున్నాడు. దాంట్లో భాగంగా పూర్తిగా దేవీమాత మీదే భిక్షకై ఆధారపడి జీవనోపాధిని సాధించాలనుకున్నాడు. ఇంకెవరినీ భిక్షం అడగకూడదని తీర్మానించుకుని గంగా తీరానికి వెళ్లాడు. మొదట్లో ఎవ్వరూ అతన్ని గమనించలేదు. క్రమంగా భక్తులు అతన్ని గమనించడం మొదలుపెట్టినప్పటి నుంచీ పూలు, పూలమాలలూ తీసుకు రావడం మొదలుపెట్టారు, ఆహారం మాత్రం ఎవరూ తెచ్చేవారు కాదు. ఆ రకంగా ఆయన పదమూడు రోజుల పాటు ఏమీ తినలేదు. 'ఏమైనా తిన్నారా స్వామీ?' అని ఎవ్వరూ అడగలేదు. ఆయన చాలా నీరసించిపోయారు, నడవడం కూడా కష్టమైంది.

1983 సంవత్సరంలో ఒకరోజు రాత్రి '*హిమాలయ పరమగురువులతో జీవనం*' లోని 'స్వామిగా నా తొలిరోజులు' అనే అధ్యాయాన్ని నేను తర్జుమా చేస్తుండగా, సుమారు రెండు వారాలపాటు ఆహారం లేకుండా తమరెలా ఉండగలిగారు స్వామీజీ! మానసికంగా అది మీమీద ఎలాంటి ప్రభావాన్ని చూపింది?' అని అడిగాను.

స్వామీజీ 'నేను గంగా జలాన్ని తాగుతుండేవాణ్ణి' అన్నారు. 'మొదటివారం చాలా కష్టంగా గడిచింది. నా ఆలోచనలన్నీ ఆకలితో నిండిపోయింది. ప్రతి క్షణం ఆహారం కోసం ప్రార్థించే వాణ్ణి. అన్నిరకాల కల్పనలూ, ఊహలూ నా మనసులో మెదులుతుండేవి. ఎవరో ఒకరు దేవీమాతతో ప్రేరణ పొంది ఆహారం తీసుకుని వచ్చి తినమని అడుగుతారని అనుకునేవాణ్ణి. సందర్శకులు పూల మాలలతో రావడం చూసి దేవీమాతే మారువేషంలో వస్తోందనుకునేవాణ్ణి. నా మెడ చుట్టూ పూలమాల వేయడం ద్వారా ఆమె నన్ను ఆకలి నుండి విముక్తం చేస్తోందని భ్రమించేవాణ్ణి. సితాబనీ గుహలో పళ్లెం నిండా ఆహారం వచ్చిన విషయం గుర్తు తెచ్చుకుని అదే

విధంగా ఇక్కడ కూడా ఆహారంతో నిండిన పళ్లెం ఆకాశమార్గాన రావడమో లేదా దగ్గరలోని కొండరాళ్లపై ఎక్కడైనా పెట్టి ఉందేమోననే ఊహల్లో ఉండేవాణ్ణి.

'ఇంక ఆకలేయడం అనే పరిమితి దాటిపోయింది. నా స్పృహ ఉదరం నుంచి శిరసుకి చేరుకుంది, దాహార్తి కూడా కోల్పోయాను. సందర్శకులు కేవలం అద్దంలోని ప్రతిబింబాల్లా కనబడుతున్నారు. నా మెదడు గురువుగారి నామజపంతో నిండిపోయింది. యాదృచ్ఛికంగా దేవీమాతతో నన్ను తన పాదాల చెంత చేర్చుకుంది. ఆ రకంగా అప్రయత్నంగా లోయ నుండి పొగమంచు వ్యాపించినట్లు నాకు పరువు ప్రతిష్టలు, కీర్తి, డబ్బు, స్థానం, శక్తి, హోదాలాంటి అన్ని రకాల ఆకలి బాధల నుంచీ సౌఖ్యాల నుంచీ ఆనందం నుంచీ స్వేచ్ఛ ప్రసాదించమని నా హృదయాంతరాళం నుంచి ప్రార్థన వెల్లువెత్తింది. గురువుగారు దగ్గరలోనే ఉన్నారని నాకు తెలుసు. కానీ వారు నాలోనూ నాచుట్టూ ఉన్నట్లు నిరంతరం భావించేవాణ్ణి. ఆయనకు నాపై జాలి కన్నా అనంతమైన కరుణ ఉందని నేను చాలాసార్లు అనుకుని ఆనందిస్తుండేవాణ్ణి,' అన్నారు.

పదమూడు రోజుల తరువాత స్వామీజీ 'హిమాలయ పరమగురువులతో జీవనం' అనే పుస్తకంలో వ్రాసినట్లు 'హఠాత్తుగా ఒక చేయి నీళ్లలోంచి బైటికి రావడం చూశాను. కేవలం చేయి మాత్రమే కనిపించింది. ఆ చేతిలో పూర్తిగా ఆహారంతో నిండిన ఓ పాత్ర ఉంది. అది నావైపే వస్తోంది. అంతలో ఓ స్త్రీ స్వరం 'ఇదిగో, ఇది నీకోసమే!' అంది. నేను ఆ పాత్ర తీసుకుని తిన్నాను. నేను ఆహారం తిన్న తరువాత కూడా ఆ పాత్ర ఖాళీ కాలేదు. అదీ అసలు విషయం,' అన్నారు.

భోలేబాబా ఆ పాత్రను మూడేళ్లు ఉంచుకుని వేలాది మంది ఆకలిని తీర్చారు. ఎవ్వరూ దాన్ని ఆహారంతో నింపేవారు కారు. ప్రజలు గాలన్ల కొద్దీ పాలను దాంట్లో పోసేవాళ్లు కానీ అది నిండేది కాదు ఒక్క చుక్క ఒలికేది కాదు. ఆయన దగ్గరి నుంచి ఏమైనా నేర్చుకుందామా? అని ఎవ్వరూ వచ్చేవారు కారు. కేవలం ఆ అద్భుతమైన పాత్రను చూడడానికే వచ్చేవాళ్లు. వింత ఏమిటంటే ఆ పాత్ర నుండి వచ్చిన పదార్థాల్ని తినడం కన్నా, దాంట్లో ఎంత పడుతుందో చూడడానికే ప్రజలు ఎక్కువ ఇష్టపడేవాళ్లు. డబ్బు ఖర్చుపెట్టి పళ్లు, పాలు, మిఠాయిలూ దాన్నిండా నింపి దాని సామర్థ్యాన్ని పరీక్షించేవారు. ప్రజలు ఆయన్ని కటోరి బాబా ('కటోరి' అంటే గిన్నె అని అర్థం) అని పిలిచేవారు. దాంతో ఒకరోజు బాబాజీ ఆ పాత్రను తిరిగి గంగా మాతకి ఇచ్చేయమన్నారు. మరో ఆలోచన లేకుండా భోలే దాన్ని గంగా నది నీళ్లలో వుంచగానే అది మాయమైపోయింది.

'ఇప్పుడు నువ్వు దైవ కృపను ప్రత్యక్షంగా అనుభూతి చెందావు. దైవకృపతో నిండి ఉన్న ఈ పాత్ర ఈ రూపంలో కాకపోతే మరో రూపంలో ఎప్పుడూ నీ వెంటే ఉంటుంది. నీకు గుర్తుండకపోవచ్చునేమో గానీ, చాలా రోజుల క్రితం నీ చిన్నప్పుడు నీ మధ్యాహ్న భోజనాన్ని నువ్వు ఒక ఆకలిగొన్న సాధువుకి ఇచ్చేశావు. ఆయన 'నీ దగ్గరికి ఆహారం వచ్చేంత వరకూ నువ్వు ఆకలి బాధను అనుభవించవు!' అని దీవించారు. ఈ ఆకలీ, ఆకలి బాధా...మొత్తం ఈ పరిస్థితి అంతటినీ నేనే సృష్టించాను. మొత్తం ఈ శిక్షణాభ్యాసాల గొలుసులో కేవలం ఆహారం మాత్రమే కాదు. నీకు కావలసినవన్నీ నీకు దక్కేటట్లుగా దీవించబడ్డావు. ఇప్పుడు నువ్వు ప్రజాకర్షణకు లోను కాకుండా ఎలా జీవించాలో నేర్చుకో. స్వాముల కోసం పన్నబడే బాహ్య ఆకర్షణ ఉచ్చుల వలలో పడకు!' అని వివరించారు.

'ఇక నువ్వు సంచారం చేయాలి. సంచారం చేస్తూ ఇతరులతో వ్యవహరించడం ద్వారా నీ అనుభవాన్నీ, విజ్ఞానాన్నీ హరాయించుకోవాలి. సమదృష్టే ఆధ్యాత్మిక తత్వంలో ప్రాథమిక సూత్రం. సాధువులతో, కష్టజీవులు, ధనికులు, పేదవారు, పండితులు, పామరులు, జ్ఞానులు,

అజ్ఞానులతో వ్యవహరించేటప్పుడు ఎలాంటి పక్షపాతమూ లేకుండా నిష్కల్మషమైన మనసుతో వ్యవహరిస్తూ ఉండు. సమాజంలోని ఏ సమూహంతో ఉన్నా వాళ్ల దగ్గర నుంచి నేర్చుకోవడానికి వెనుకాడకు. అవసరమైనప్పుడు ఈ కాషాయ వస్త్రాలు వదిలేయడానికి వెనకాడకు. మానవ సేవ కోసం రాజకీయాలలో పనిచేస్తున్న మహానుభావులతో కాసేపు సమయం గడపడానికి వెనకాడకు,' అని చెప్పారాయన.

ఈ ఉపదేశం తర్వాత ఇద్దరూ విడిపోయారు. బాబాజీ పర్వత శిఖరాల వైపు ప్రయాణం కాగా, భోలేబాబా హృషీకేష్‌కి బయల్దేరారు.

వింత ఆహార పాత్ర వల్ల భోలేబాబా కీర్తి ప్రజల్లో ఇంకా తాజాగా ఉంది. అతను ఆకలికి గురవటంలేదు కానీ సమస్య మాత్రం అంత తేలిగ్గా పరిష్కారం కావడం లేదు. గంగా నదికి ఐదు మైళ్ల దూరంలో గడ్డితో కప్పిన కుటీరంలో నివాసం ఏర్పరచుకున్నారు భోలేబాబా. రోజంతా ప్రజలు అతన్ని సందర్శించుకునే ఉన్నారు. వాళ్లు వచ్చేటప్పుడు పళ్లు ఫలాలు, తినుబండారాలు, డబ్బులూ అన్నీ తెస్తున్నారు. ఆయన చుట్టూ మూగి తిరిగి సాధనను ప్రారంభించమని పదే పదే చెప్తుంటే ఆయన దుప్పటి ముసుగు వేసుకుని కూర్చుండేవారు. కొన్నిసార్లు ఆయనకు విసుగుపుట్టి వెళ్లిపోమని కసిరేవారు. కానీ భక్తులు ఆయన కోపాన్ని దీవెనలుగా తీసుకునేవారు. భోలేబాబా తమ జీవితాల్లో అదృష్టాన్ని తీసుకొచ్చే స్వామిగా వారు భావిస్తుండే వారు. 'ఆయన గంగా మాత దీవెనలతో పుట్టినవారు. ఆయనకి నిజంగా కోపం లేదు. కేవలం కోపం నటిస్తున్నారు, అంతే!' అనేవాళ్లు. వాళ్లని వదిలించుకోవడానికి ఆయన ఎప్పుడైనా పరుషంగా మాట్లాడితే, 'స్వామీ, మీ పరుష పదజాలం మాకు పూలవానలాంటిది, మాకు అవి దీవెనలు!' అనేవారు.

'*హిమాలయ పరమగురువులతో జీవనం*' పుస్తకంలో వ్రాయబడిన కొన్ని విషయాల్ని కూడా ఇక్కడ గుర్తు చేసుకోవాలి. 'సన్యాసుల జీవితం నిత్యం వేదనలతో వెంటాడబడుతుంది. స్వామి అంటే సామాన్య మానవుడి కన్నా ఎంతో ఎత్తులో ఉంటాడు. ఇక భారతదేశంలో అయితే 'స్వామీజీ' అంటే శక్తి గలవాడు. దేన్నయినా నయం చేసేవాడు. బోధకుడు, వైద్యుడు ఇంకా ఇంకా వీటన్నిటికన్నా ఎంతో గొప్పవాడు. సాధారణ ప్రజలు వేలంవెర్రిగా చూసే పరిస్థితిలోకి స్వామీజీలు నెట్టబడతారు. ప్రజలు ఈ స్వాములలో కొంతమంది ఇప్పుడే తమ ప్రయాణాన్ని మొదలుపెట్టి ఉంటారనీ, మరి కొంతమంది తమ ప్రయాణంలో కొంతదూరం మాత్రమే ప్రయాణించి ఉంటారనీ, చాలా కొద్దిమంది మాత్రమే తమ లక్ష్యాన్ని చేరుకుంటారనీ తెలుసుకోరు, అర్థం చేసుకోరు. ఈ తేడాలను అర్థం చేసుకోకపోవడంతో అంతవరకు ఉన్న అంచనాల వల్ల అటు సన్యాసులూ ఇటు ప్రజలూ ఇద్దరూ గందరగోళానికి గురి అవుతారు.'

'తమంతట తాముగా ఇలాంటి గందరగోళం నుండి బయటపడడం అంత తేలిక కాదు. ఎప్పుడైనా 'నేను ఇంకా సాధన మొదటి దశల్లోనే ఉన్నాను. నా దగ్గర ఏమీ లేదు. దయచేసి వెళ్లండి!' అని నిజం చెబితే పెడచెవిన పెట్టి వాళ్లకి ఇష్టం వచ్చిన రీతిలో నా మాటలని అర్థగించి నా దగ్గరికి ఇంకా ఇంకా వస్తుండేవాళ్లు. దీంతో నాకు ఒక్కొక్కసారి ఈ సన్యాసి దీక్ష పట్ల విసుగొచ్చేది.

'జ్ఞానాన్ని సంపాదించడానికి రక్షణగా సర్వసంగ పరిత్యాగిలా వేషం ధరించాల్సిన అవసరం లేదు. నిజానికి మనసుని క్రమశిక్షణామార్గంలో ఉంచుకోవడానికి కావలసింది, నిరంతర తాత్విక చింతన, దాని సాధన, ఆచరణ, బోధ. సన్యాస జీవితం ఎంత అద్భుతమైందో అంత కష్టమైంది కూడా,' అనేవారు స్వామీజీ. హృషీకేష్‌లో కొద్దిరోజులు గడిపిన తరువాత భోలేబాబా బాబాజీకి ఇష్టమైన వింధ్య పర్వతాల్లోని వింధ్యాచలానికి ప్రయాణమయ్యారు. పేరొందిన వింధ్యవాసిని పవిత్ర క్షేత్రానికి దగ్గరగా ఉన్న ఈ ప్రదేశాన్ని 'గేరువా తలబ్' అని పిలుస్తారు

(1917 లో బాబాజీ కోసం గోరక్‌పూర్ గౌరవ న్యాయాధికారీ జమీందారూ కట్టిన రెండు గదుల కట్టడాన్ని ఇప్పటికీ అక్కడ మనం చూడవచ్చు). చాలా సంవత్సరాలైంది. భోలేబాబా గేరువా తలబ్‌కి వచ్చి, ఇక్కడ కాస్త ప్రశాంతత లభిస్తుందనుకున్నారు. కొంతవరకూ లభించింది కూడా. ఆయన అక్కడ ఉన్నవారిలో చాలా కొద్దిమందికి మాత్రమే తెలుసు. అది కూడా బాబాజీకి తోడుగా ఉండే చిన్న పిల్లాడైన భోలేగా మాత్రమే తెలుసు! ఏమైతేనేం, అక్కడికి కొంతదూరంలో చిత్రకూట్‌లో ఉంటున్న బాగా పేరొందిన సిద్ధసాధువుకీ, తనకీ కాస్త దూరంలోనే భోలేబాబా ఉంటున్నాడని తెలిసిపోయింది. అతనికి బాబాజీ, భోలేబాబా బాగా తెలుసు. అంతేకాదు, భోలే అపూర్వ అక్షయపాత్ర గురించి కూడా తెలుసు.

ప్రతి సంవత్సరం సిద్ధ బాబా తన ఆశ్రమంలో ఉత్సవం నిర్వహిస్తూ ఆ ఉత్సవంలో వేలాది మందికి భోజనాలు పెడుతుంటారు. ప్రజలు ఈ స్వామి అన్నపూర్ణా దేవి కృపను పొందాడనీ అందుకే వేలమంది భక్తులకు తన కుటీరంలో భోజనం పెడుతుంటారనీ చెప్పుకుంటారు. భోలేబాబా వింధ్యవాసినీ మందిరం పరిసరాలలో నివసిస్తున్నాడని తెలుసుకున్నప్పటి నుంచీ అతడిని సందర్శించి గౌరవ పురస్సరంగా తన ఆశ్రమంలో జరిగే విందుకు రమ్మని ఆహ్వానించారు. అలాగే తనతో పాటు ఎవరినైనా తీసుకురమ్మని కూడా ఆయన చెప్పారు.

సిద్ధ బాబా ఆశ్రమానికి వెళ్దామని భోలేబాబా అనుకుంటూ ఉండగా అంత క్రితం కొద్దిరోజుల ముందు తాంత్రిక యోగంలో బలమైన పట్టుగల ఓ యువ సాధువు ఆయన్ని కలిసాడు. భోలేబాబా ఆయన్ని తనతోపాటు సిద్ధబాబా విందుకి రమ్మని కోరారు. బెంగాలీ సాధువు అందుకు ఒప్పుకోవడంతో ఇద్దరూ కలిసి వెళ్లారు. వాళ్లు ఆశ్రమం దగ్గరికి రాగానే ప్రజలందరూ వెంటరాగా సిద్ధబాబా మేళతాళాలతో, శంఖానాదంతో ఇతర వాయిద్యాలతో వాళ్లని అహ్వానించటానికి ఎదురు వెళ్లారు. వీళ్లందరూ ఆశ్రమాన్ని చేరుకోగానే మరో పెద్దగుంపు 'భోలేబాబా కీ జై!' అంటూ వీళ్లతో కలిసిపోయారు. అందరూ ఆయన కాళ్లను తాకటానికి తోసుకుంటున్నారు. ఈ గందరగోళంలో బెంగాలీ బాబా, భోలేబాబా నుంచి దూరమైపోయారు. గుంపు కాస్తా ఆయనను మింగేసింది.

ఈ భక్త కోటి భక్తి పారవశ్యంతో చేసిన గందరగోళం ముగిసిన తరువాత సిద్ధ బాబా భోలేను సౌకర్యంగా ఉండే గదిలోకి తీసుకెళ్లారు. దాంతో భోలేబాబా, బెంగాలీ బాబా ఇతర సాధువులతోనూ అతిథులతోనూ కలిసిపోయి ఉంటారని అనుకున్నారు. కానీ భోలేబాబా లోపలికి వెళ్లిపోయిన తర్వాత మిగతా ఆశ్రమ వాసులందరూ తమ తమ పనుల్లో తిరిగి నిమగ్నమై పోయారు. ఎవరూ బెంగాలీ బాబాకి నీళ్లు గానీ ఆహారం గానీ ఇవ్వలేదు. సరి కదా, అతిథిగా గౌరవించాల్సిన ఆయనకు అతిథులు భక్తులు ద్వారం దగ్గర వదిలిన పాదరక్షలకు కాపలా ఉండమని పని పురమాయించారు. ఆయన పని ఏమిటంటే అతిథులు వదిలిన పాదరక్షలను, చెక్కతో చేసిన పావుకోళ్లను ఎవరూ ఎత్తుకుని పోకుండానూ కుక్కలు లాక్కుని వెళ్లకుండానూ చూడటం! అప్పటికే చాలా ఆలస్యమైంది. అల్పాహారం ఏమీ తినకుండా భోలేబాబాతో మైళ్లకొద్దీ దూరం నడిచి వచ్చి చాలా ఆకలిగా ఉన్న ఆ యువ బెంగాలీబాబా కాస్త మంచినీళ్లు, ఆహారం అడిగినా ఎవ్వరూ ఆయనని పట్టించుకోలేదు.

మధ్యాహ్నం కొద్దిసేపట్లో భోజనాలు మొదలవుతాయనగా ఆశ్రమవాసులు భోజనశాలలో ఊడుస్తుండగా మరి కొద్దిమంది దుమ్ము లేవకుండా నీళ్లు జల్లుతున్నారు. ఇంకొంతమంది భోజనాలకి అరిటాకులు వేస్తున్నారు. అప్పుడు ఆకలితో నకనకలాడుతున్న బెంగాలీ సాధువు ఆశ్రమ నిర్వాహకుడిని కలిసి నిన్నటినించి భోజనం చేయలేదనీ, ఎవరినైనా పాదరక్షలదగ్గర పెడితే వెళ్లి భోంచేస్తాననీ అభ్యర్థించాడు. దాంతో నిర్వాహకుడు 'సిగ్గులేదా, నీకు ఆ మాత్రం

సహనం లేదా? నువ్వు సాధువుగా ఎందుకు మారావు? ఎక్కడినుంచి తెచ్చుకున్నావు ఈ కాషాయబట్టల్ని!' అన్నాడు.

'దయచేసి ఎగతాళి చేయకండి. నేను భోలేబాబాతో వచ్చిన అతిథిని. ఆయన సిద్ధబాబాతో లోపల ఉన్నారు,' అని అన్నారు. ఆయన మాటలు అక్కడున్న వాళ్లు ఎవరూ నమ్మలేదు సరికదా, పైపెచ్చు నవ్వారు. ఆశ్రమ నిర్వాహకుడు, 'ఈ రోజుల్లో జనాలు హాయిగా బతకడం కోసం సన్యాసులుగా మారుతున్నారు' అని అన్నాడు. దాంతో బెంగాలీ బాబా కోపంతో నిగ్రహం కోల్పోయాడు. విసవిసా నడుచుకుంటూ ఆశ్రమం ముందు పారుతున్న మందాకినీ నది దగ్గరికి వెళ్లి ఓ చిన్న చేపను పట్టి తిరిగి ఆశ్రమ ద్వారం దగ్గరకి వచ్చి చేపను క్రింద పెట్టి దానిపై కూర్చుని కళ్లు మూసుకుని తన తాంత్రికవిద్యను ప్రదర్శించడం మొదలుపెట్టారు.

లోపల సిద్ధబాబా, భోలేబాబా ఇంకా ఇతర ముఖ్యమైనవాళ్లు అప్పటికే కూర్చుని ఉన్నారు. ఆచారం ప్రకారం పెద్దమొత్తంలో భోజనం సిద్ధబాబా దగ్గరకు తీసుకుని వచ్చారు. ఆయన దాన్ని దేవతా నైవేద్యం పెట్టి తర్వాత తనతో కూర్చున్న ప్రముఖులు కొంతమందికి ఒడ్డించిన తరువాత దాన్ని తిరిగి ఇంట్లోకి తీసుకెళ్లారు. సరిగ్గా అదే సమయంలో ఆ యువ బెంగాలీ బాబా తన తాంత్రిక ప్రక్రియను పూర్తిచేశాడు. దాంతో అప్పటికప్పుడు మొత్తం భోజనమంతా కుళ్లిన చేప దుర్గంధంతో నిండిపోయింది. సాధువులందరూ ఒకరి ముఖం ఒకరు చూసుకుంటూ తికమకపడిపోయారు. కొద్దిక్షణాల నిశ్శబ్దం తరువాత భోలేబాబా హఠాత్తుగా 'హరి దేవుడా! బెంగాలీ బాబా ఎక్కడ?' అని అరిచారు. 'మహారాజా మీతో మరొకరు ఉన్నారనే విషయమే మాకు తెలీదే!' అని జవాబిచ్చారు. 'అవును, నాతో కలిసి వచ్చిన సన్యాసే ఆయన. ఆయనకు భోజనం వడ్డించారా?' అని అడిగారు. ఎవ్వరూ మాట్లాడలేదు, ఎవ్వరికీ ఆయన ఎవరో తెలీదు. భోలే లేచి బయటికి నడవగా, మిగతా వాళ్లు ఆయనను అనుసరించారు. బయట ఆ కుర్ర బెంగాలీ సాధువు కళ్లు మూసుకోని ఇంకా ధ్యానిస్తూనే ఉన్నాడు. భోలేబాబా ఒక్క తన్ను తన్ని, 'లే నీచుడా! చూడు నువ్వేం చేశావో! ఎందుకు చేశావు ఇదంతా?' అని అడిగాడు.

బెంగాలీ సాధువు పైకి లేచి, 'నేను ఆకలిగా ఉన్నాను, ఎవ్వరూ నామాట వినటంలేదు,' అన్నాడు.

'నువ్విలా చేయాల్సింది కాదు. అసలు నిన్ను ఇప్పుడు తన్నాలి! ఎంతో దూరం నుంచి ఈ సాధువులందరూ భోజనం చేయడానికి వచ్చారు. ఆశ్రమంలోని ఆహారం మొత్తం నీ వల్లే పాడై పోయింది. ఇప్పుడు వాళ్లందరికీ భోజనం ఎలా?' అని బదులిచ్చారు భోలేబాబా.

బెంగాలీ సాధువుకి తన తాంత్రిక విద్యలను వక్రమార్గంలో ఉపయోగించానని అర్ధమైంది.(ఈ పశ్చాతాపంలో భాగంగా ఆయన పదకొండు నెలలు ఆకులపై నివసించాడు) ఈ లోపల ఆ కంపు వాసన భరించలేనంతగా పెరిగిపోయింది. సిద్ధ బాబా వంటగదికి వెళ్లి అన్నపూర్ణాదేవిని అన్ని రకాలుగా ప్రార్థించాడు. కానీ ఎలాంటి ఫలితం దక్కలేదు. దాంతో తన తలని భోలే ఒడిలో పెట్టి రోదించాడు. 'మహారాజా, ఆ బెంగాలీబాబా నా సిద్ధులన్నింటినీ నాశనం చేశారు. నేను మిగిలిన కాలమంతా ఆకలితో జీవించాలని శపించాడు. ఆకలితో వెళ్లిపోతే ఈ సాధువులంతా కూడా నన్ను శపిస్తారు. వాళ్లు నా అతిథులు. నాకు సహాయం చెయ్యి. నా సమస్తం నీ కాళ్ల దగ్గర ఉంచుతాను,' అంటూ విలపించారు.

'దేవుడిపై నమ్మకం ఉంచండి!' అంటూ భోలేబాబా సముదాయించాడు. 'దీనికి పరిష్కారం చూడమని దేవీమాతను పూజిస్తాను,' అంటూ చేతులు జోడించి గుండె దగ్గర పెట్టుకోని శిరసు వంచి ప్రార్థించారు. అప్పటికప్పుడే ఆహారం నిండిన పాత్ర అతని చేతిలో ప్రత్యక్షమైంది. దాంట్లోంచి కొంచెం తీసి సిద్ధబాబాకి ఇచ్చారు. ఆయన దాన్ని తీసుకెళ్లి వంటింట్లోని మిగతా ఆహారపదార్థాలలో

కలిపారు. మరుక్షణంలో మొత్తం ఆహారం కుళ్లిన చేపకంపు పోయి ఘుమఘుమలాడుతూ విందుకు సిద్ధంగా తయారయింది. అనుకున్న ప్రకారం విందు సాగిపోయింది.

ఈ సంఘటన అక్కడికొచ్చిన చిత్రకూట్ సాధువులందరినీ ఎంతో ఉత్సాహపరిచింది. దాంతో భోలేబాబాను తమతో మూడు రోజులుండి ఉపనిషత్ బోధ చేయవలసిందిగా ఆహ్వానించారు. సాధారణంగా భోలేబాబా ఇలాంటి ఆహ్వానాలను అంగీకరించరు. కానీ ఈసారి ఒప్పుకున్నారు. భోలేబాబా బోధ చేసిన ఆ మూడు రోజుల్నీ, ప్రశ్న-సమాధానాల పర్వాన్నీ, యోగపద్ధతుల ప్రదర్శనల్నీ ఇంకా ఇప్పటికీ కొంతమంది గుర్తుంచుకున్నారు.

పురాతన కాలంనుండీ స్వచ్ఛమైన సాధువులకు, అంటే శ్రీరామచంద్రుని ధ్యానించే వైష్ణవితి సాధువులకు చిత్రకూట్ ప్రసిద్ధి చెందింది. ఇక్కడ బ్రహ్మచర్య అభ్యాసం ముఖ్యమైన సాధనగా ఉండేది. మరికొన్ని కూడా నేర్చుకునేవారు. భోలేబాబా చేతిలో అక్షయపాత్ర ప్రత్యక్షమైనపుడు అక్కడ లేని కొంతమంది సాధువులూ, అలాగే కేవలం పేరుప్రతిష్ఠల కోసం గౌరవ మర్యాదల కోసం ప్రాకులాడే సాధువులు భోలేబాబా ఉపన్యాసాలను, తాత్విక ఆధ్యాత్మిక వివరణల ద్వారా వివరించమని ఆటంకపరుస్తూ వాటి చర్చల కోసం సవాళ్లు విసురుతుండేవారు. ఏమైతేనేం, మొదటి రెండు రోజులూ భోలేబాబా గ్రంథాలను ఉదహరిస్తూ బోధ చేసేవారు కాదు. దాంతో ఆయనంటే పడని సాధువులు ఈయనకు తాత్విక గ్రంథాలతో పెద్దగా పరిచయం లేదనే అభిప్రాయానికి వచ్చారు. దాంతో మూడో రోజు వాళ్లు తమ గ్రంథాలతో సభకి వచ్చారు. అవన్నీ వ్రాతప్రతులే! సాధువులు భోలేబాబాపై దాడిచేయటం మీదే దృష్టి కేంద్రీకరించారు. తమ ప్రశ్నలను నేరుగా సంధించడం కన్నా తర్కాన్ని ఒక సాధనంగా చేసుకుని గ్రంథాల్లో విషయాలను మెలితిప్పి వాఖ్యానించి తమ వాదనను సమర్థించుకునేవారు. అలా నాలుగు గంటలు వాళ్ల పాండితీ ప్రకర్షను ప్రదర్శించారు.

భోలేబాబా వాటన్నిటినీ ప్రశాంతంగా విన్నారు. చివరికి వాళ్ల ఆర్భాటాలతో కూడిన సుదీర్ఘ ఉపన్యాసాలను విన్న తరువాత 'ప్రత్యక్షానుభవంలేని జ్ఞానం చిత్రపటంలో ఉన్న బొమ్మను పెళ్లాడి జీవించటం లాంటిది. ప్రత్యక్షానుభవం రావాలంటే ముందు నువ్వు సాధన చెయ్యాలి. నువ్వు మొదట సరిగా పద్మాసనంలో కూర్చోవడం సాధన చేయి, సరిగా శ్వాసించటం సాధన చేయి, సరిగా ధ్యానించడం సాధన చేయి. తత్వగ్రంథాల్లోని విషయాలను సాధనచేసేవారు మౌనంగానే ఉంటారు. వాటిని ఆరాధించేవారే కేవలం వాదనల కోసం వెంపర్లాడతారు. మీ వ్రాత ప్రతుల్లో ఉన్న ఏ సాధన గురించైనా ప్రశ్నించండి. దానికి సమాధానం చెప్తాను. కానీ ఒక షరతు! మీరు ప్రశ్నించేటప్పుడు సావధానంగా అటూ ఇటూ కదలకుండా కూర్చుని అడిగితే నేను సమాధానం చెబుతాను' అని సమాధానమిచ్చారు.

ఇదే సమయంలో భోలేబాబా ప్రక్కన కూర్చున్న ఓ విశిష్ట సాధువు ఆ సాధు సమూహానికి గుర్తుచేస్తూ 'మీరు గమనించారా? నాలుగు గంటల నుండీ భోలేబాబా కదలకుండా పద్మాసనంలోనే కూర్చుని ఉన్నారు. కమలంలాగా మట్టి అంటకుండా భూమికి కాస్త ఎత్తులో ఉన్నారనే సంగతి మీరు గమనించారా?'

బాబా ఆయన వైపు చూస్తూ 'మహారాజ్! వాళ్లు తమ గ్రంథ సాహిత్యాన్నీ దాని తత్వభారాన్నీ నాపై మోపుతారని భావిస్తున్నాను. తద్వారా వాళ్ల మెదళ్లూ, ఆత్మలూ ఈ పవిత్రమైన భూమిలోని ప్రతి రేణువు నుంచీ వెదజల్లబడుతున్న దివ్యకాంతిలో ఓలలాడనీయండి. గొప్ప గొప్ప సాధు పుంగవులు ఋషులు, భగవాన్ శ్రీరామచంద్రమూర్తి, సీతమ్మతల్లి తమ జీవశక్తితో దీవించిన ఈ ప్రదేశంలో నివసిస్తున్న వాళ్లు ఎంత అదృష్టవంతులు! ఇప్పటికీ ఈ ప్రదేశంలో

భగవాన్ దత్తాత్రేయ, పరశురాముడు, గోరఖ్‌నాథుడు, చిరంజీవి ఆంజనేయస్వామీ ఆదృశ్య రూపాల్లో ధ్యానిస్తునే ఉన్నారు,' అన్నారు.

దీంతో వాదన చేసిన సాధువులందరూ తమ వ్రాత ప్రతుల్ని భోలేబాబాకి సవినయంగా అందించారు. దానికి ప్రతిగా భోలేబాబా ఏ విధంగా కూర్చోవాలో ధ్యానం చేయాలో శ్వాస తీసుకోవాలో వారికి నేర్పారు. అలాగే పవిత్రమైన ప్రేమ, మానవత్వం, నిస్వార్థ సేవ గురించి బోధించారు. ఆ తరవాత రోజు వారి వ్రాతప్రతులను గుర్రాలపై వేసుకునివారు అలహాబాద్‌కి వెళ్లిపోయారు.

నేను ఈ కథను1987 లో కాన్పూర్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా పనిచేసి రిటైరైన డాక్టర్ శుక్లాగారిని కలిసినప్పుడు వారు చెప్పగా విన్నాను. శుక్లాజీ అప్పుడు జరిగిన మూడురోజుల ఆధ్యాత్మిక వాద-ప్రతివాద జరిగే సభకి హాజరయ్యారు. ఎందుకంటే ఒక సంస్కృత పండితుడిగా అరుదైన విలువైన సంస్కృత గ్రంథాల సంరక్షణ పట్ల ఆయనకు ఎంతో మక్కువ. వారు ఇదంతా చెప్పిన తరువాత 'ఆ గ్రంథాలన్నీ ఎక్కడున్నాయి? అవన్నీ కాపీ చేయబడ్డాయా?' అని అడిగారు. నాకు తెలియదు, కానీ ఒక సందర్భం వచ్చినపుడు ఆ గ్రంథాల గురించి స్వామీజీని అడగ్గా ఆ గ్రంథాలలో కొన్ని ఇంకా అలహాబాద్‌లోని బేనీబాబా వద్దే ఉన్నాయని చెప్పారు. కొన్ని రోజుల తర్వాత స్వామీజీ ఆ గ్రంథాల వ్రాతప్రతుల పెద్ద కట్టని నాకు అందించారు. ప్రతి గ్రంథం రెండు పలకల మధ్యన భద్రంగా ఉంది. ఒక గ్రంథాన్ని తీసి చూడగా దాని పేజీ అంచు సూక్ష్మచిత్రాలతో చిత్రింపబడి ఉంది, ప్రతి విభాగం చివర బొమ్మలు ఉన్నాయి. పై అట్ట గంధం చెక్కతో చేయబడిన పొర అంటించి ఉంది. పసుపు కాషాయ రంగులు పూయబడి ఉండడంతో అది పూజింపబడిందని తెలుస్తోంది. చిత్రకూట్‌లో ఉన్న సాధువులు వీటిలో ఉన్న విషయాలను సాధన చేయడానికి బదులు వీటిని పూజించారు. వాళ్లకున్న ఆ అంతరార్థాన్నే ఈ పుస్తకాలు బహిర్గతం చేస్తున్నాయనన్నారు. 'వీటిని తీసుకోవడం ద్వారా ఈ గ్రంథాలకి బానిసలు కాకుండా వాళ్లను విముక్తుణ్ణి చేశాను,' అని అన్నారు. అలా అంటున్నప్పుడు ఆయన కళ్లలో చిన్న మెరుపు చూశాను.

భోలేబాబా సన్యాసత్వం తీసుకున్న తరువాత సంచార జీవితాన్ని ప్రారంభించారు. ఆ సమయంలో మహాత్మాగాంధీ, శ్రీ అరబిందో, రమణ మహర్షి, ఠాగూర్, మాతా ఆనందమాయి, మాతాజీ (అస్సాంలోని కామాఖ్య గుడిలోని సన్యాసిని), బ్రహ్మానంద సరస్వతీ, దక్షిణాదిలో శంకరాచార్య లాంటి ఎంతోమంది ప్రముఖులను కలిశారు. స్వామీజీ ఈ ప్రముఖులతో తన హిమాలయ స్వాముల సాన్నిహిత్యంలో గడిపిన జీవితానుభవాలను పంచుకున్నారని తెల్పారు. తర్వాత మహాత్మాగాంధీ, ఠాగూర్‌లతో గడపిన అనుభవాలు తన మీద ప్రగాఢమైన ముద్ర వేశాయనీ, తన జీవన పర్యంతమూ చేయదలచిన ప్రతి పనిలోనూ వారి ప్రభావం ప్రతిఫలిస్తుందనీ ఆయన చెప్పారు.

భోలే సన్యాసం స్వీకరించడానికి చాలా సంవత్సరాల క్రితమే బాబాజీ ఆయనతో, 'నువ్వు ఎప్పుడైనా మహాత్మా గాంధీని సందర్శించే అవకాశం వస్తే ఆయనెలా నడుస్తున్నారో ఆయన దృఢవిశ్వాసాలు, ఆయన ఉపన్యాసాలలో ఆయన చేతలలో ఎలా ప్రతిఫలిస్తున్నాయో చూసి అర్థం చేసుకో. ఠాగూర్‌తో ఉన్నపుడు ఆయన ఎలా కూర్చుంటున్నారో, నడుస్తున్నారో, మాట్లాడుతున్నారో, ఎలా పడుకుంటున్నారో గమనించు. ఆయన చేసే ప్రతి పనిలోనూ ఆయన ప్రతి లక్ష్యంలోనూ ఆయన వైఖరి ఎలా ఉందో, ఇతరులతో వ్యవహరించేటప్పుడూ, ప్రకృతితో అనుబంధం ఏర్పరచుకునేటప్పుడూ ఆయన స్వభావం ఎలా ఉంటుందో అర్థం చేసుకో' అని చెప్పారు.

మహాత్మా గాంధీ ఆశ్రమానికి వెళ్లినప్పుడు భోలేబాబా స్వామీజీ చిహ్నాలేవీ ధరించకుండా క్రింద కూర్చుని మామూలుగా ధ్యానించడం మొదలుపెట్టారు. ప్రతి వ్యక్తికీ ఉన్న వ్యక్తిగత

సాంప్రదాయ జీవితం అప్రధానమైనదనీ, నిస్వార్థమైన కర్మయోగ జీవన విధానం మాత్రమే ప్రధానమైనదనే విషయం ఆచరణలో ఆశ్రమమంతా అణువణువునా ప్రతిధ్వనిస్తోంది. ప్రతి ఒక్కరూ పడుచువాళ్లు, ముసలివాళ్లు, పేదలూ ధనవంతులూ, ఆడ మగ, చదువుకున్నవాళ్లూ, చదువుకోనివాళ్లూ అందరూ శ్రమ చేస్తున్నారు. అక్కడ ఒక పని తక్కువా, మరో పని ఎక్కువా కాదు! మరుగుదొడ్లను శుభ్రపరచడం, గొఱ్ఱెలను మేపడం, పుస్తకాలు వ్రాయడం, సమావేశాలకి హాజరై జాతీయ సమస్యలను పరిష్కరించడం వంటి పనులన్నీ సమానమైన ప్రాధాన్యత కలిగినవే. హిందూ, ముస్లిం, సిక్కు, క్రిష్టియన్ అనే భేధం లేకుండా అందరూ ఒకేచోట ప్రార్థనలు చేస్తారు. అక్కడ భోలేబాబాకి గృహ నిర్వహణ ఇచ్చారు, దానితోబాటు ఆశ్రమ పత్రిక 'హరిజన్'కి సహాయ సంపాదక బాధ్యతలు కూడా అప్పగించారు.

మహాత్మాగాంధీ ముక్కుసూటి స్వభావం, డాంబికాలు లేని నిగర్వి కావటం వల్ల ప్రతివాళ్లూ ఆయనకు తమ పట్ల ప్రత్యేకమైన గౌరవం ఉందని భావించి ఆయన పట్ల ఎలాంటి సంశయాలు లేకుండా తమ అభిప్రాయాలను వెల్లడించేవారు. ఉదాహరణకి ఒకరోజు గాంధీగారు పత్రిక సంపాదక సిబ్బందిని సందర్శించినప్పుడు ఆ గొప్ప వ్యక్తి 'ఏమోయ్, ఎప్పుడొచ్చావు?' అని భోలేబాబాని అడిగారు. భోలేబాబా తన పేరు మిగతా విషయాల గురించి చెప్పబోతుండగా, మధ్యలో మహాత్మా కలగజేసుకోని 'ఔనౌను, నువ్వు బాబా ధర్మదాస్ గారి శిష్యుడివి, నీ పేరు భోలే కదా!' అన్నారు. అది విని భోలేబాబా కి ఆశ్చర్యం, పులకింత రెండూ ఒక్కసారిగా కలిగాయి.

భోలే నోట మాట రాలేదు. గాంధీ గారు చాలా సంవత్సరాల క్రితం బాబాజీని ఠాగూర్ ఆశ్రమంలో కలిశారు, అప్పుడు భోలే కూడా ఉన్నారు. ఇన్ని సంవత్సరాల తర్వాత గాంధీజీ బాబా ధరమ్‌దాస్‌జీ దగ్గర పెరిగిన ఆ పిల్లాడిని గుర్తు పట్టడమే కాదు, అతని పేరును కూడా గుర్తుంచుకున్నారు.

ఈ సంఘటన తరువాత గాంధీజీ అనేక వేలమందిని తీసుకున్నట్లే భోలేబాబాని కూడా తన సమూహంలోకి తీసుకున్నారు. అక్కడున్న మూడునెలలూ భోలేబాబా తరచుగా గాంధీగారితో అప్పటి విషయాలను చర్చించేవారు. చాలావరకు చర్చలు మతం, రాజకీయాల చుట్టూ జరుగుతుండేవి. కానీ కొన్ని ప్రశ్నలు అడగడానికి భోలేబాబా సంశయించేవాడు. ఎందుకంటే ఆ ప్రశ్నలు వారిని అవమానిస్తున్నట్లు ఉంటాయేమోనని ఆయన భావించేవారు. ఉదాహరణకి, బాబా సంచారం చేస్తున్నప్పుడు చాలామంది సాధువులు, మేధావులు గాంధీ హిందూ మతానికీ తగిన గుర్తింపు ఇవ్వటం లేదనే విమర్శ చేసేవారు. దీన్ని తరచూ గాంధీజీ పుత్రుల్లో ఒకరైన రాందాస్, భోలేబాబా నర్మగర్భంగా చర్చిస్తుండేవారు. గాంధీజీ ఈ ఇద్దరి యువకుల మనసుల్లో ఉన్న భావాల్ని గ్రహించగలిగారు. అందుకే ఒకరోజు భోలేతో 'భారతదేశంలో ఉన్న సన్యాసులను వివిధ రకాలుగా ఎలా వర్గీకరిస్తారు?' అనడిగారు.

భోలే 'నాలుగు రకాల సన్యాసులు ఉన్నారని చెప్పగలను. మొదటివారు మీకు విధేయులుగా ఉండి బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా పోరాడుతున్న స్వాతంత్ర్య యోధులు. వారు కేవలం సన్యాసి వస్త్రాలు వేసుకుంటారు. వాళ్లకి ఎలాంటి సాధనా లేదు. గురువులూ ఉండరు. ఆధ్యాత్మిక స్వేచ్ఛ కన్నా భౌతిక లేదా బాహ్య స్వేచ్ఛే వాళ్ల లక్ష్యం. ఇంకొంతమంది సన్యాసులు ఉన్నారు. వారికి మీరన్నా, బ్రిటిష్ వారన్నా కూడా ఇష్టంలేదు. కానీ స్వాతంత్ర్యోద్యమంలో చురుగ్గా పాల్గొంటారు. వాళ్లకి కూడా ఎటువంటి సాధనా లేదు. వారికి కావలసింది ఈ బాహ్య ప్రపంచంలో స్వేచ్ఛ. ఈ రెండు వర్గాలకి చెందినవారూ తమ తమ రాజకీయ లక్ష్యసాధనకు స్వామీజీల రూపాన్నీ పేరునూ ఉపయోగించుకుని హిందూత్వ మనోభావాలను వినియోగించుకుంటారు.

'ఇంక మూడో రకం సన్యాసులు కేవలం స్వీయ సాధన ద్వారా ఉన్నత స్థితిని సాధించే లక్ష్యం కలిగి ఉన్న సమూహం. వీరు అంతర్గతంగా స్వేచ్ఛను సాధించినవారు. తాము మాత్రమే బాహ్య ప్రపంచంలో స్వేచ్ఛా వాతావరణాన్ని సృష్టించగలమని నమ్మేవాళ్లు. వీళ్ల లక్ష్యం స్వీయ పరిశోధనా మార్గాన్ని తెలుసుకోవడం! వాళ్ల స్థితి ఏమిటీ, ఈ ప్రపంచంతో భగవంతుడితో వాళ్లకి ఉన్న సంబంధం ఏమిటీ వంటి విషయాలను అర్థం చేసుకోవడం. ఇంక నాలుగో వర్గానికి చెందిన సన్యాసులు నిరాశా నిస్పృహలతో ఈ ప్రపంచంలోని కష్టాలకు దూరంగా పారిపోయి ఎలాంటి లక్ష్యమూ లేకుండా తిరగడం. వీళ్లకి సన్యాసం ఒక జీవనోపాధి.

అప్పుడు గాంధీజీ 'మీరు ఏ వర్గంలోకి వస్తారు?' అని అడిగారు. భోలేబాబా కాస్త దిగులు పడ్డారు. ఎందుకంటే గాంధీ ఆశ్రమంలో తనకు తానుగా స్వామీజీగా ఎవరితోనూ పరిచయం చేసుకోలేదు. అలాగే ఎవరూ అతన్ని స్వామీగా గుర్తిస్తారని అనుకోలేదు. 'బహుశా నేను మూడో తరగతికి చెందిన వాడిని అయి ఉంటాను' అని అన్నారు భోలే.

'ఆ వర్గంలో స్వామీజీగా వుండాలనే కోరికే ఓ గొప్ప విషయం! నిస్వార్థంగా, అహింసాయుతంగా ఉంటూ నిరాశా నిస్పృహలతో సమస్యల నుండి తప్పించుకుని స్వామిగా జీవిస్తుంటే అదేం చెడు పని కాదు. కానీ మొదటి రెండు వర్గాలకు చెందిన స్వాములతోనే చాలా ఇబ్బంది. అంతర్గతంగా ఉన్న వీరి స్వార్థభావన వీళ్లను నిజాయతీని తుడిచిపెట్టి, కుయుక్తులుగా మారుస్తుంది. తరచూ వాళ్లు న్యాయనిర్ణేతలుగా మారతారు. వాళ్ల హృదయాలు ద్వేషాగ్నుల్ని ప్రజ్వరిల్లేలా చేస్తాయి. బాహ్యంలో వీళ్లు అహింసావాదుల్లాగే కనబడినా వారి అంతర్గతంగా వారిలో హింసావాద బీజాలు నాటబడి ఉంటాయి. ఇలాంటి స్వేచ్ఛావాదులు బాహ్యంగానూ ఆంతర్గతంగానూ కూడా శాశ్వత బానిసలుగా వుంటారు. బాబా ధర్మదాస్ గురువుగా ఉండటం మీ అదృష్టం. ఆ మహానుభావులైన సాధువుల మహనీయ తత్వజ్ఞానాన్ని సేకరించి ప్రపంచానికి అందించండి,' అన్నారు గాంధీ.

కొన్ని ప్రశ్నలకు మరో సమయం కన్నా ఇప్పుడే స్పష్టపరచటం ఉత్తమమనే భావనలో గాంధీజీ ఉన్నారనే విషయాన్ని భోలేబాబా గుర్తించారు. దాంతో ఆయన, 'బాపూ! మీరు అన్నట్టే మతం, రాజకీయాలూ రెండూ చెట్టాపట్టాలు వేసుకుని నడవవనే విషయం నాకర్థమైంది. కానీ స్వాతంత్రోద్యమం అనేది రాజకీయతత్వంతో కూడుకున్నదనే అందరూ భావిస్తారు. 'ఇది స్పష్టంగా తాత్విక భూమికపై మాత్రమే నిలబడగలదు' అనే వైపుకే మీ వాదన దారితీస్తోంది. తమకు ఇంగ్లీషువారిని ద్వేషించరని ప్రజలకు తెలుసు. కానీ మీరు హిందూత్వం పట్ల ఉపేక్ష వహించడం, మీరు స్వయంగా హిందువు అయి ఉండి ఇతర మతాలను సమర్థించడాన్ని నేరంగా భావిస్తారు,' అన్నారు.

దానికి గాంధీజీ, 'ఎందుకంటే నేనొక మానవుణ్ణి. నేను హిందువుగా గానీ ఇంకెవరిగానైనా ఉండే హక్కు నాకుంది. మతం మన మానవత్వం నుండి ఉద్భవించింది. మానవత్వంతో బలోపేతం అవుతున్నంత వరకూ మతం విరాజిల్లుతుంది. మానవత్వం అనేది మృత్తికలాంటిది. మతం ఆ మట్టిలో పెరిగే చెట్టు. కొంతమంది మట్టి గురించి పట్టించుకుంటారు. మరి కొంతమంది చెట్టును గురించి పట్టించుకుంటారు. ఇంకొంతమంది దాని ఫలాలను స్వాధీనం చేసుకుంటారు,' అని సమాధానం ఇచ్చారు.

'నేను హిందువు అనే వృక్షానికి పుట్టడం జరిగింది. ఈ చెట్టూ దీని ఫలాలు ఈ మట్టిలో జీవం పోసుకుంటున్నాయని అర్థమయ్యాక నేను మట్టి గురించి పని చేయడం మొదలుపెట్టాను. అదే మట్టి క్రైస్తవాన్నీ, ఇస్లాంనీ, సిక్కు మతాన్నీ పెంచుతుంటే దాన్ని తప్పంటామా?'

'బ్రిటిష్ ప్రభుత్వం క్రిస్టియన్ మిషనరీల ద్వారా హిందువులను మతమార్పిడి చేసి తన అధికారాన్ని దుర్వినియోగం చేస్తోంది. మీ ఎజెండాలో ఈ విషయాన్ని పొందుపరచలేదు. దాంతో మతనాయకులు మీరు క్రిస్టియన్ మతాన్ని సమర్థిస్తారని నమ్ముతున్నారు,' అన్నారు భోలే.

గాంధీజీ, 'నేను ఏ మతాన్నీ ఆమోదించిందీ లేదు, వ్యతిరేకించిందీ లేదు. తనకి నచ్చిన మతాన్ని స్వీకరించే హక్కు, ఆచరించే కనీస హక్కు ప్రతి మానవుడికీ ఉంది. యూరప్‌లో చర్చిని రాజ్యపాలన నుండి విడదీసింది మొట్టమొదట బ్రిటిష్ వారే. బ్రిటిష్ పరిపాలన మొత్తం ఇష్టం వచ్చిన మతం గురించి మాట్లాడుకోవడం ప్రార్థించడం అనే మతస్వేచ్ఛను పూర్తిగా కొనసాగించింది. ఈరోజు మీరూ, మీలాంటి అనేకమంది సాధువులూ ధైర్యంగా మతం గురించి బహిరంగంగా మాట్లాడుతున్నారంటే దానికి కారణం బ్రిటిష్ వాళ్లు ఇచ్చిన మతస్వేచ్ఛ. సుమారు నాలుగు నుండి ఐదు వందల సంవత్సరాల భారతదేశ చరిత్రని ఒకసారి గుర్తు తెచ్చుకోండి! రాజులు తమకి ఇష్టమైన మతాన్ని బలవంతంగా ప్రజలపై రుద్దేవారు. మరి బ్రిటిష్ వారు న్యాయాన్ని పరిరక్షించడానికి 'కోర్టు' అనే వ్యవస్థను ప్రపంచానికిచ్చారు. కనుక మీరిప్పుడు కోర్టులో ప్రభుత్వాన్ని సవాలు చేయగలుగుతున్నారు. ఈ భావన, ఈ పరిస్థితి బ్రిటిష్ పరిపాలనకు ఇంతకు ముందు లేదు.'

'క్రిస్టియన్‌లకు వేరే మతస్తులను మత మార్పిడి చేసే హక్కుందా?' భోలే అడిగారు.

'మతమార్పిడికి ఇష్టపడినవారికి వారి మతాన్ని మార్చే హక్కు క్రిస్టియన్‌లకి ఉంటుంది. అయితే మతమార్పిడి చేసుకోవడానికి ఇష్టంలేని వారి మతం మార్చే హక్కు క్రిస్టియన్‌లకు లేదు. మతమార్పిడి సమస్యను ఇంకా లోతుగా అర్థం చేసుకోవలసి ఉంది. ఎక్కువగా పేదలు మతమార్పిడికి గురవుతున్నారు. వాళ్లకి కనీసం తాము ఎలా ఉన్నారో ఏమవుతారో కూడా తెలీదు. తిండి, బట్ట, నివాసం, విద్య ఇవన్నీ జీవితానికి కావలసిన ప్రాథమిక అవసరాలు. ఇవి కల్పించబడితే పేదలు వారి చైతన్యాన్ని పెంచుకుని మతం, తాత్విక చింతనలలో అంతర్లీనంగా దాగున్న సూక్ష్మ విషయాలను తెలుసుకుంటారు. తిండి, బట్టలు, వైద్యంలాంటి తక్షణ సహాయాలు వాళ్లని తమ పేరుని ఇంగ్లీషు పేరుగా మార్చుకునేటట్లు చేస్తోంది. అలా చేయడం ద్వారా వాళ్లు క్రిస్టియన్‌లుగా మారిపోయామనుకుంటారు. ఇది వారికి అదృష్టాన్ని తెస్తుందని అనుకుంటున్నారు. మతం మారిన పేదలు మీ ప్రేమను కోరుతున్నారు. మీ విమర్శలను కాదు.'

భోలేబాబా మహాత్మాగాంధీ గారి దృఢత్వంలోని మూలాలను అర్థం చేసుకోవడం ఆరంభించారు. గాంధీగారి మాటల్లో చేతల్లో ఆలోచనల్లో ఖచ్చితమైన సామరస్యం ఉన్నట్టు భోలేబాబాకి అర్థమైంది. ఆయన మాటలు వారి ఆలోచనలకు ప్రతిబింబం. వారి చేతలు వారి మాటల అభివ్యక్తీకరణ. ఆయన నమ్మకాలను ఇతరులమీద రుద్దరు. కానీ ఆయన తన నమ్మకాలకి అనుగుణంగా తన జీవితంలోని ప్రతి అంశాన్నీ ఆచరిస్తారు. ఆయనకు శత్రువులు లేరు కానీ నిత్యం సిద్ధాంతాల కోసం పోరాడతారు. గాంధీగారిని చూసిన తరువాత భోలేబాబా కర్మయోగం నిస్వార్థసేవ అనీ, అది సన్యాస ధర్మంతో సమానమైందనీ భావించారు. అంతకన్నా ఎక్కువగా ఆయన అర్థం చేసుకున్న సత్యం ఒకటి ఉంది. కర్మయోగాన్ని నిస్వార్థసేవగా ఆచరిస్తున్న వ్యక్తికీ సన్యాసాన్ని స్వీకరించిన వ్యక్తికీ మధ్య ఉన్న తేడా కేవలం వాళ్లు ఎంచుకున్న మార్గం మాత్రమే. కర్మయోగి ఇతరులకి సేవచేస్తూ సమయం దొరికినప్పుడు తన అంతరంగాన్ని శోధిస్తూ ఉంటాడు, సన్యాసి తన అంతరంగాన్ని శోధిస్తూ మిగతా సమయాన్ని ఇతరుల సేవ కోసం వెచ్చిస్తూ ఉంటాడు.

కొద్ది కాలానికి భోలేబాబా ఆశ్రమం నుంచి నిష్క్రమించారు. వారితో పాటుగా గాంధీ కుమారుడు కూడా బయల్దేరారు. ఈ యువకులిద్దరూ హిమాలయాల వైపు ప్రయాణమై

కొద్దివారాలపాటు కుమావూ హిమాలయ ప్రాంతంలోని రమణీయమైన కౌసానీ ప్రాంతాన్ని సందర్శించారు. అక్కడి నుండి ఇద్దరూ విడిపోయి రాందాస్ గాంధీ అల్మోరా ప్రాంతానికి వెళ్లగా భోలేబాబా వారి గురువుగారి సోదరుడైన స్వామీ శివానందని కలవడానికి గంగోత్రి వైపుకి పయనించారు.

బాబాజీ, స్వామీ శివానంద ఇద్దరూ బెంగాల్ నుంచే వచ్చారు. వీరిద్దరూ రవీంద్రనాద్ ఠాగూర్‌కి స్నేహితులు. ఆయన కూడా బెంగాల్ వాస్తవ్యులు. ఒకరోజు స్వామీ శివానంద భోలేబాబాతో ఠాగూర్ ఉన్నత ఆదర్శాల గురించీ, ఆయన ఆత్మానుభూతుల గురించీ చెబుతూ ఠాగూర్ ఈ కాలంలో పుట్టిన మునీశ్వరుడనీ, తిరిగి వైదికజ్ఞానాన్ని ప్రతిష్ఠించడానికి జన్మించాడని తాను నమ్ముతాననీ అన్నారు. ఆ మునీశ్వరుడు ఆధ్యాత్మికతకీ ప్రాపంచిక జీవితానికీ మధ్య అడ్డుగోడ నిర్మించడని అన్నారాయన. వాళ్ల దృష్టిలో ఈ ప్రపంచం మొత్తం దేవుని అభివ్యక్తీకరణ. దైవసృష్టిని అర్థం చేసుకోవాలంటే దీని నుండి దూరం వెళ్లాల్సిన అవసరం, ఒంటరిగా ఉండాల్సిన అవసరం లేదని చెప్పారు. వారిలో సాగే ఆంతర్మథనంతో వారు తమ స్థితినీ, అందమైన ఆనందమైన ప్రపంచంతో తమకి గల సంబంధాన్నీ అర్థం చేసుకోగలుగుతారని ఆయన అన్నారు. ఆ సందర్భంలో శివానంద స్వామీ భోలేతో భారతీయ తాత్విక చింతనలో 'మోక్షచింతన' తరువాతి దశల్లో చేరిన భావన అని తెలియజేశారు.

స్వామీ శివానంద 'నువ్వు గాంధీ నుండి చాలా నేర్చుకున్నావు. నీ పరిత్యాగాన్ని మరింత ఉన్నత స్థితికి తీసుకుని వెళ్లడానికీ, నీ నిస్వార్థ సేవా తత్పరతను మరింత మెరుగుపరచుకోవడానికీ నువ్వు కొద్ది రోజులు మహామునీశ్వరుడైన ఠాగూర్ దగ్గర ఉండు' అని చెప్పారు.

తన చిన్నతనంలో భోలేబాబా, బాబాజీతోపాటు కొద్ది రోజులు ఠాగూర్ ఆశ్రమం శాంతినికేతన్‌లో ఉన్నారు. ఠాగూర్ తన సమయాన్ని బాబాజీ, శివానంద స్వాములతో గడుపుతుంటే భోలే ఆశ్రమంలో ఊరికే తిరుగుతుండేవారు. అప్పటికి ఠాగూర్ జ్ఞానాన్నీ, బహుముఖ ప్రజ్ఞలనూ అభినందించి అంచనా వేయగలిగేటంత అంతర్దృష్టి, జ్ఞానదృష్టి భోలేకి లేదు. కానీ ఇప్పుడు భోలేబాబా ఠాగూర్‌ని విభిన్నంగా చూడగలరు. అద్వితీయమైన కవి, సంగీతకారుడు, నర్తకుడు, చిత్రకారుడు, అన్నిరకాల సాంప్రదాయ కళలకి గురువు, మునీశ్వరుడైన ఠాగూర్ శాంతినికేతన్ ఆశ్రమానికి స్వామీజీ ఓ ఖచ్చితమైన ఉద్దేశ్యంతోనే వచ్చారు. ఎందుకంటే ఈ వేదజ్ఞాని దివ్యదృష్టి నుండి ఏ కళా దాటి పోలేదు. ఈ యువ సన్యాసి ఎందుకొచ్చారో ఠాగూర్‌కి తెలుసు. ఆయన్ని ప్రేమతో గౌరవంతో ఆహ్వానించారు.

స్వామీజీ (భోలేబాబా) తన గతం గురించి ఎక్కువగా మాట్లాడేవారు కాదు. కానీ అప్పుడప్పుడు ఠాగూర్ పట్ల తనకున్న కృతజ్ఞతను, ప్రత్యేకమైన ప్రేమను తెలియజేస్తూ ఉండేవారు. ఒకటికి రెండుసార్లు తన తాత్విక చింతనలో ఠాగూర్ పాత్ర ఎంతో ప్రాముఖ్యమైందని తెలియజేశారు. ఉదాహరణకు ఒకసారి 'గోల్డెన్ బుక్ ఆఫ్ ఠాగూర్' పుస్తకాన్ని తిరగేస్తున్న క్రమంలో స్వామీజీ 'ఈయన అంతులేని లోతైన మహా సముద్రం. అందులో నువ్వు ఎక్కడ దూకినా అమూల్యమైన నవరత్నాలని ఏరుకోగలవ'న్నారు.

స్వామీజీ ఠాగూర్ గురించి ఎక్కువగా చెప్పలేదు. దాంతో స్వామీజీ అక్కడున్నపుడు వారితో పాటున్న వాళ్లెవరైనా కలుస్తారేమోనని చాలారోజులు ఆశించాను. చివరికి 1993 వేసవికాలంలో నా ఆశ ఫలించింది. ఆగస్టు మూడో వారంలో స్వామీజీ అమెరికాని వదిలి భారతదేశానికి వెళ్లారు. స్వామీజీ విమానం న్యూయార్క్ నుండి వెళ్లిన మర్నాడు పెద్దమనిషి ఒకరు 'హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్'కి వచ్చి స్వామీ రామ గురించి అడిగారు. స్వామీజీ లేరని తెలిసి ఆయన చాలా నిరాశపడి హాల్లోంచి నడుచుకుంటూ ఇన్‌స్టిట్యూట్‌లో ఉన్న పుస్తకాల షాప్‌లోకి

వెళ్లారు. నేను అటువైపే వెళ్తూ తారసపడి నన్ను నేను పరిచయం చేసుకున్నాను. మాటల్లో తనపేరు హరరాయ్ దేశాయ్ అని చెప్పారు. ప్రతి పదాన్నీ ఎంతో బరువుగా పలుకుతూ, 'నేను కళాశాలలో చదువుతున్నప్పుడు ఆయన నాకు తెలుసు' అన్నారు. 'ఎప్పుడు? ఎక్కడ?' అని ఆత్రంగా అడిగాను నేను. గద్గదమైన స్వరంతో నీరునిండిన కళ్లతో 'శాంతినికేతన్' అన్నారు. ఆయనను చూస్తుంటే నాకు స్వామీజీ అక్కడే ఉన్నట్లుగా ఒక అరుదైన అనుభూతి కలిగింది. ఆయనకు స్వామీజీతో కొన్ని అమూల్యమైన అనుభవాలు ఉండి ఉంటాయని అనిపించింది.

ఆయన భావోద్వేగంతో ఎంతగా మునిగిపోయారంటే కనీసం ఒకమాట కూడా పూర్తి చేయలేకపోతున్నారు, దాంతో ఆయనను ప్రత్యేక అతిథిగృహానికి తీసుకుని వెళ్లాను. ఈయనకు స్వామీజీతో గాఢమైన అనుబంధం ఉండే ఉంటుందని అర్థమైంది. అయితే ఈ సమయంలో ఆయన్ని మరింతగా ప్రశ్నించడానికి పూనుకోలేదు. దాంతో ఈ సంస్థ గురించి మీరెలా తెలుసుకున్నారని అడిగాను. న్యూజెర్సీలో ఉన్న అల్లుడిని కలుసుకోవడానికి వచ్చినప్పుడు '*హిమాలయ పరమగురువులతో జీవనం*' అనే పుస్తకాన్ని చూడడం సంభవించిందనీ దాంట్లో 'పవిత్ర టిబెట్‌లో నా ప్రధాన గురువులు' అనే అధ్యాయం చదువుతున్నపుడు తాను తన అనుభవాలే చదువుకున్నాననీ అదీకాక ఆ పుస్తక రచయిత శాంతినికేతన్‌లో తనతోపాటు తన గది పక్కనున్న తనకెంతో ఇష్టమైన భోలేబాబా అని అర్థమైందనీ ఆయన బదులిచ్చారు. 1946 నుంచి ఆయన భోలేబాబాను చూడలేదు, ఆయన ఎక్కడున్నారు, ఆయనని తెలుసుకోవడం ఎలా అనేవి ఆ పుస్తకం వెనక హిమాలయన్ ఇనిస్టిట్యూట్ చిరునామా చూడనంతవరకూ ఆయనకు తెలీదు. మా మాటల్లో శాంతినికేతన్‌లో స్వామితో గడిపిన సమయాన్ని చాలా తక్కువగానే చెప్పారు, కానీ వెళ్తున్నప్పుడు 'చాలారోజుల తరువాత ఆయన గురించి విన్నాను, దైవఘటన ఎలావుందో చూడండి! నేను ఆయన్ని చూడడానికి వచ్చిన ముందురోజే ఆయన ఇక్కడ నుంచి వెళ్లారు' అని అన్నారు.

మూడు సంవత్సరాల తర్వాత నవంబర్‌లో స్వామీజీ తన దేహాన్ని త్యజించారు. ఆరువారాల తర్వాత ఇక్కడి సంస్థలో ఆయన గౌరవార్థం నూతన సంవత్సర వేడుకలను నిర్వహించాం. హరరాయ్ దేశాయ్ ఇక్కడే ఉండడంతో ఆయనను గౌరవ అతిధిగా పిలిచి ప్రారంభంలో స్వామీజీ గురించి కొన్ని విషయాలు మాట్లాడమన్నాను. ఆయన హాజరయారు. కానీ వచ్చినవారి ముందు స్వామితో ఆయన అనుభవాల గురించి మాట్లాడమని అడిగేసరికి మళ్లీ ఈసారి కూడా ఆయన్ని జ్ఞాపకాల వరద ముంచెత్తింది. దాంతో ఆహ్వానితుల ముందు ఆ మహనీయ ఆత్మ గురించి మాట్లాడలేనని తన అశక్తతను వెలిబుచ్చాడు. ప్రజల ముందు వ్యక్తపరచలేని ఎంతో విలువైన జ్ఞాపకాలు అవి! కానీ ఎంతో దయతో స్వామీజీ గురించి విడిగా వ్యక్తిగతంగా నాతో మాట్లాడటానికి అంగీకరించారు.

తరవాత మేం విడిగా మాట్లాడుతున్నప్పుడు ఆయన నోటివెంట మాట రావడం బహు కష్టమైపోయింది. మాటల్లో 'మాటలకి అందని వ్యక్తి గురించి ఎవరైనా ఏం మాట్లాడగలరు?' అని అన్నారు. చివరికి హిందీ ఇంగ్లీష్ కలగలుపు భాషలో మేం మాట్లాడుకోవడం మొదలుపెట్టాం. ఆ సంభాషణ నుంచే చాలా సమాచారం సేకరించడం జరిగింది.

భోలేబాబా శాంతినికేతన్‌కి రాగానే ఠాగూర్ ఆయనను సమావేశంలో ప్రజలముందు హాజరుపరిచారు. అక్కడే ఈ యువ సాధువును ఆశ్రమాన్ని చూసుకుంటున్న శ్రీ మల్లిక్‌జీకి పరిచయం చేశారు. మల్లిక్‌జీ ఎంతో ప్రజ్ఞావంతుడు, భక్తుడు కూడా. ఠాగూర్ ఆదేశం మేరకు భోలేబాబా విద్యాభ్యాసం ఆధ్యాత్మిక అవసరాలు సౌకర్యవంతంగా సాగటానికి ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకున్నారు. ఠాగూర్ ఎక్కువ సమయం రచనలలోనూ, చిత్రలేఖనంలో గడుపుతున్నప్పటికీ భోలేబాబాకి ప్రత్యేక సమయం శ్రద్ధగా కేటాయించగలిగారు.

ఒకరోజు *'హిమాలయ పరమగురువులతో జీవనం'* హిందీ అనువాదంలోని 'త్యాగం కాదు విజయాన్ని సాధించు' అనే భాగాన్ని వ్యాఖ్యానిస్తూ స్వామీజీ, 'ఠాగూర్ నన్ను ఆయన సమక్షంలో వుంచుకుని చేసిన ఆలోచనలూ, చెప్పిన ఉపన్యాసాలూ, జరిపిన చర్చల్లో బోధించింది ఇదే. ఆయన కష్టపడి పనిచేసేవారు, ఎప్పుడూ సంతోషంగా పని చేసేవారు. రాత్రి కొద్ది గంటలసేపు పడుకునేవారు. పగలు అసలు పడుకునేవారే కారు. ముసలితనం ఆయనలో శ్రమించే తత్వాన్నీ సంతోషంగా ఉండే లక్షణాన్నీ ఏ మాత్రం మార్చలేదు. నా జీవితంలో ఇంతవరకూ నేను చూసిన సాధువులు, ఋషులందరి కంటే ఈయన పూర్తిగా భిన్నమైన వారు. ఆయన్ని గమనించడం ద్వారా నేను నా గురువుగారి గురించి మరింతగా అర్థం చేసుకున్నాను. చాలామంది స్వాముల మాదిరి ఆయన చుట్టూ నిష్క్రియగా ఉండే శాంతి కన్నా శక్తివంతమైన ప్రశాంతత ఆవరించి ఉండడం చూశాను. నా గురువుగారు కూడా ఇలానే ఉండేవారు.

అప్పటికి భోలేబాబా విభిన్న సంప్రదాయాలను ఆచరించే వందలాది మంది స్వాములూ, ఋషులతో గడిపారు. వాళ్లలో చాలామంది తమ ఆత్మ సంయమనం అలవరచుకొనే సన్యాసి జీవితం పట్ల, భక్తిమార్గం పట్ల ఎంతో ఆరాధనా భావం కలవారు. ఈ మహానుభావులలో కొంతమందికి సంబంధించి ఓ విషయం ఆయన్ని ఎప్పుడూ బాధిస్తుండేది. అదేమిటంటే వారి మానసిక శక్తినంతా అవిశ్రాంతంగా తమ ప్రశాంతతని సంరక్షించుకోవడానికి అధికంగా వినియోగించేవారు. మెల్లిగా నడవడం కోసం, నిదానంగా మాట్లాడడం కోసం, చివరికి తమ భావ వ్యక్తీకరణను సైతం సౌమ్యంగా ప్రకటించడానికి కొంతమంది నిత్యం ఎంతో శక్తిని వెచ్చించి సాధన చేస్తుంటారు. కొన్ని మత నియమ నిబంధనలు తెలిపే పుస్తకాలు నవ్వడం, పాడడం, చిత్రలేఖనం వంటి క్రియల్ని కూడా నిషేధించాయి. దీంట్లో నృత్యం గురించి చెప్పలేదు. ఠాగూర్ భిన్నమైనవారు. ఎప్పుడూ క్రియాశీలకంగా ఉండేవారు. ఆయన జీవితాన్ని ఒక ఉత్సవంలా గడిపారు. ఆయన పాడారు, ఆడారు, కవి, రచయిత, చిత్రలేఖనం చేశారు. నాటకాలకు దర్శకత్వం వహించారు. ఆయన నృత్య బోధకులు, నర్తకులూ కూడా. అయినప్పటికీ వేద జ్ఞానులు వేదమంత్రాలకు సూత్రధారులైనట్టు ఠాగూర్ జ్ఞాన సూత్రధారి.

ఒకరోజు భోలేబాబా, 'ఈ ప్రపంచం నుంచి మనకు మనంగా విడిపోయి ఏమైనా సాధించగలమా?' అని ఠాగూర్‌ని అడిగితే ఆయన. 'అవును, నీలో నీకు అవసరంలేని అంతరంగం నుండీ నిన్ను నువ్వు దూరం చేసుకోవడం ద్వారా నీకు స్వేచ్ఛ లభిస్తుంది. అంతకన్నా ఎక్కువేమీ లేదు. నా మార్గం ఈ ప్రపంచం నుంచి దూరం జరిగి స్వేచ్ఛావాయువులు పీల్చుకోవడం మాత్రం కాదు. నీకేం కావాలో దాని కోసం ప్రయాణించేటట్లుగా మారడమే ఉన్నతమైన మార్గం,' అన్నారు.

హిమాలయ పరమగురువులతో జీవనం పుస్తకంలో స్వామీ రామ ఒకచోట ఇలా అన్నారు, *'ఠాగూర్ భావనలో మనిషి పరిణామం అంటే మనిషి సృజనాత్మక వ్యక్తిత్వ పరిణామమే. జీవ నియమాలకు వ్యతిరేకంగా నిలబడే ధైర్యం ఉన్నది మనిషికొక్కడికే. గొప్ప దేశాల వెనుక ఉన్నదీ ప్రపంచంలో జరిగిన అనితర సాధ్యమైన పనుల వెనుక ఉన్నదీ అత్యంత విలువైన ఆలోచనలే. సృజనాత్మకతకి మూలాధారం మనిషి ఆలోచనే. జీవితం దురదృష్ట సంఘటనలమయం. కానీ అదృష్టవంతుడు ఆలోచనల ద్వారా సృజన చేస్తాడు. కాలం అన్నిటినీ వడపోస్తుంది కానీ ఆలోచనలు అన్ని సంపదలలోకన్నా ఉత్తమోత్తమమైన సంపద. సరైన సమయంలో ఆలోచనలను, సామర్థ్యాలను వెలిబుచ్చే అవకాశం ఆవిర్భవించేందుకు అరుదుగా దోహదపడేదే అదృష్టం!'*

శాంతినికేతన్ వాతావరణంలో కొన్నిరోజులు సంతోషంగా గడిపిన తరువాత భోలేబాబా సృజనాత్మక స్వభావం గురించి ఆలోచించడం మొదలుపెట్టారు. ఆచారాలతోనూ, పిడివాదాలతోనూ, మూఢవిశ్వాసాలతోనూ, మత భావనా దాని ఆచరణా ఎలా కలిసిపోయాయో సర్వసంగ పరిత్యాగ

ప్రపంచం కూడా అలానే కలిసిపోయిందని అర్థమైంది ఆయనకి. మనం ఈ ప్రపంచంలో నివసించినా లేక దీన్ని పరిత్యజించి జీవించినా లక్ష్యం ఒకటే! అంతరంగ ఆశయం సఫలీకృతం కావడం! సర్వసంగ పరిత్యాగంపై వ్రాసిన పుస్తకాలు మనిషి సృజనాత్మకశక్తిని చంపేస్తాయని ఎలా వాదిస్తాయి? సృజనాత్మకత అనేది పరిణామ ప్రక్రియకు వెనక ఉన్న ప్రాథమిక శక్తి. మనిషి చేసిన అర్థరహితమైన నియమాలు సన్యాసి జీవితంలోకి ఎలా ప్రవేశించాయి? శక్తిస్వరూపిణి సమేతంగా ఉండి మునీశ్వరులకు సకల శాస్త్రాలనూ కళలనూ బోధించే పరిత్యాగి మహాశివుడి కన్నా గొప్ప పరిత్యాగి ఎవరన్నా ఉన్నారా? మహా అతిశయమైన తాండవ నృత్యాన్ని గణేశుడి వాయిద్యానికి అనుగుణంగా శక్తిమాతతో నర్తిస్తున్నప్పుడు ఆయనకున్న స్వాభావికమైన కీర్తి అపహాస్యమవుతుందా? ఇతరుల నుండి తాను లేదా తనలోని అనవసరమైన భాగం నుండి తాను దూరంగా ఉండడం కన్నా ఇంకా ఉన్నతమైన లక్ష్యాలతో కొనసాగేది పరిత్యాగం. పరిత్యాగం అనేది కనీసం పనికిరాని లక్ష్యాలపై సమయం వృథా చేయకుండా ఎలా ఉండాలీ, సర్వశక్తులనూ, సృజనాత్మకతనూ సత్యాన్వేషణలో తెలియని మూలాలను శోధించడానికి ఎలా వినియోగించాలీ అనే విషయాలకు సంబంధించిన మార్గదర్శకాలను స్థాపిస్తుంది. కొంతమంది సన్యాసులు చేసినట్లు భోలే తన జీవితాన్ని బంజరు ఎడారిగా మార్చదలుచుకోలేదు. ఇవే ఆలోచనలు ఠాగూర్‌తో పంచుకున్నప్పుడు ఆ మహామనిషి సర్వకళలలో గల వైవిధ్యభరితమైన అంశాలను అన్వేషించాల్సిందిగా ప్రోత్సహించారు.

శాంతినికేతన్‌లోని ఆశ్రమవాసులు భోలేబాబా ఏ విషయాన్నయినా సరే ఎంతో వేగంగా చదివి నేర్చుకోవడాన్ని చూసి ఆశ్చర్యపోయేవారని శ్రీదేశాయ్ చెప్పారు. ఒక వారంలోనే సంగీతంలో ప్రావీణ్యత సంపాదించిన విద్యార్థులలో ఆయన ఒకరు. అంతేకాక, ఆశ్రమంలోని గొప్ప సంగీత విద్వాంసులలో ఒకరని చెప్పవచ్చు. ఆ తర్వాత చిత్రలేఖనం విషయం వచ్చేసరికి ఆయన చిత్రించిన అమూర్తమైన, నిగూఢమైన చిత్రాలపై ఆశ్రమంలో చర్చ జరిగింది. అలాగే ఒకరోజు నృత్య తరగతిలో చేరి త్వరలోనే పరిపూర్ణమైన నృత్య కళాకారులయ్యారు. ఇంత అంకితభావంతో పనిచేస్తున్నప్పటికీ, ఈ యువకుడు ఆశ్రమవాసులతో ఎంతో సమయం గడుపుతూ అందర్నీ నవ్విస్తూ ఎంతో ఆహ్లాదకరంగా ఉండేవారు.

దేశాయ్‌జీ భోలేబాబా పక్క గదిలోనే ఉండేవారు. దాంతో ఆయనతో ఎక్కువసేపు గడిపే అవకాశం దేశాయ్‌కి కలిగింది. కానీ ఈయనకు ఒక ప్రత్యేకమైన సమస్య ఉండేది. ఈయనకు చన్నీళ్ల స్నానమంటే భయం. భోలేకి ఇది తెలుసు. దాంతో ఒక రోజు ఈయన గదికి వెళ్లి 'హర రాయ్ మీకో బహుమతి తెచ్చాను నాతో రండి!' అని వాళ్ల గది దగ్గర ఉన్న బావి దగ్గరకు తీసుకెళ్లి దేశాయ్‌గారిని కళ్లు మూసుకోమన్నారు. అప్పుడు ఓ బకెట్టు నీళ్లు బావి నుంచి తోడి ఆయన తలమీద భళ్లున పోశారు. దేశాయ్ గారు మొత్తం తడిసి నానిపోయి ఉన్నప్పుడే తిరిగి తనమీద కూడా ఏడు బకెట్ల నీటిని తోడి కుమ్మరించమన్నారు. దేశాయ్ అట్లాగే చేసిన తరువాత కొంతసేపటికి తనకి చన్నీళ్ల స్నానమంటే ఉండే భయం మాయమైందని తెలుసుకున్నాడు. శాంతినికేతన్‌లో ఉన్న మిగతా రోజుల్లో కూడా అదే విధంగా దేశాయ్ స్నానం చేసి ఏడు బకెట్ల నీళ్లతో భోలేబాబా కి స్నానం చేయించేవారు.

క్రమంగా భోలే మామూలు విద్యార్థి కాదని ఆశ్రమవాసులు అర్థం చేసుకున్నారు. ఈయన మరణించిన 'భవాల్' రాజకుమారుణ్ణి తిరిగి బ్రతికించిన గొప్ప యోగి బాబా ధర్మదాస్ అనుంగు శిష్యుడనే వార్త ఆశ్రమమంతా వ్యాపించింది. ఒకప్పటి భోలేబాబా గురుభ్రాత, ప్రస్తుత కాలంలో రాజు అయిన భవాల్ ఠాగూర్ ఆశ్రమానికి వచ్చారు. దాంతో ఆశ్రమవాసులంతా ఆశ్చర్యంలో మునిగిపోయారు. భోలేబాబాని భవాల్ కౌగలించుకోగా ఆశ్రమవాసులు ఆశ్చర్యంతో

చూడసాగారు. ఠాగూర్, రాజును ఒక యోగిగా గౌరవిస్తున్నప్పుడు వారు మరింత ఆశ్చర్యపోయారు. భోలేబాబా రాజు తరవాత వేసిన ఆసనాన్ని అంగీకరించి కూర్చున్నారు. ఠాగూర్ వారిని విద్యార్థిగా కాక ఒక సాధువుగా చూడటం మొదలుపెట్టేసరికి ఆశ్రమవాసులంతా కొయ్యబారిపోయారు.

దీంతో భోలేబాబా వయసునీ ఆయన ప్రదర్శించే వినయాన్నీ చూసి ఆశ్రమవాసులు ఆమాయకంగా మోసపోదలుచుకోలేదు. ఇంకా ఆయన గురించి వారి గురువు గురించీ తెలుసుకోవడానికి ప్రయత్నించసాగారు. ఈ విషయంలో భోలే మౌనంగా ఉండటాన్ని వారు గమనించారు. అదే సమయంలో టిబెట్‌లో ఉన్న వారి పరమగురువు (గురువుగారి గురువు) గురించి కాస్త మాట్లాడడానికి సంసిద్ధంగా ఉన్నట్లు వాళ్లకి అనిపించింది. దీన్ని అర్థం చేసుకుని హరరాయ్ దేశాయ్‌తో పాటు మరి కొంతమందీ, వారి స్నేహితులూ టిబెట్‌లోని వారి గురువుగారి దగ్గరకు తీసుకెళ్లమని అభ్యర్థించారు. వారి సంతోషం కోసం భోలే ఆంగీకరించారు.

ఈ ప్రయాణంకోసం వాళ్లు సిద్ధమౌతుండగా, భోలేబాబాకి ఓ నిగూఢమైన టెలిగ్రాం వాళ్ల గురువుగారి నుంచి వచ్చింది. దాంట్లో 'భోలే, వెంటనే రా. సమయం ఆసన్నమైంది' అని ఉంది. స్నేహితులు ఎవరికీ దాంట్లోని విషయాన్ని తెలియజేయకుండా 'నేను ఇక వెళ్లాలి' అని అందరికీ చెప్పాడు. ఠాగూర్ దగ్గరికి వెళ్లి ఏం జరిగిందో వివరించాడు. అప్పుడు భోలేబాబా 'నేను వెళ్లటానికి మీరు అనుమతించే ముందు నాకు ఇప్పటికీ మరెప్పటికీ నిలిచిపోయే సుసంపన్నమైన సందేశాన్ని బహుమతిగా ఇస్తే ధన్యుడిని అవుతాను!' అని అభ్యర్థించారు.

వినయంతో భోలేబాబా నేలమీద కూర్చున్నాడు. ఠాగూర్ 'ఈ ప్రపంచం మొత్తం ఒకే జీవ చైతన్యంతో నిండి ఉంది. దీనిలో మనుగడ సాగిస్తున్నది ఏదైనా దీని ప్రతిరూపమే. సత్యం, శివం, సుందరం దీని సహజ గుణాలు. మత తత్వంలో ఈ సర్వ ప్రపంచ మనుగడకీ మూలమైన చైతన్యాన్ని దేవుడు అని అంటారు. దేవుడి కోసం బాహ్యంగా పరితపించేవారు నిరర్థకంగా జీవిస్తుంటారు. దేవుడిని తమలోనే అన్వేషించేవారు త్వరలో దేవుడు తమలోనే ఉన్నాడని అనుభూతి చెందుతారు. దేవుని ప్రతిరూపమైన *శివం, సత్యం, సుందరం* భావనని అలలుగా ప్రసరింపజేసేదే ఆత్మ. దేవుడికీ ఆత్మకీ మధ్య సంబంధం సముద్రమూ దానిలో లేచే అలల వంటిదే. సముద్రంలోంచే అలలు ఎగజిమ్మి సముద్రంలోనే కలిసిపోతాయి. ఒకసారి ఇది అర్థమైతే మనమే దేవుడు, దేవుడే మనం అని భావించి మనుషులు దేవుణ్ణి వెతకడం మానేస్తారు. అచ్చం సముద్రం అలల మాదిరే. వ్యక్తి ఈ అనుభవం ద్వారానే మరణం పట్ల ఉన్న భయాన్ని అధిగమిస్తాడు, ఎందుకంటే సముద్రంలాంటి చైతన్యంలో అలలు కనిపించి మాయమవుతున్నట్లు వారికి పుట్టుక చావు రెండూ సహజ పరిణామాలే! దేవుణ్ణి తమకి బాహ్యంగా సందర్శించాలని భావించేవారికి ఈ ప్రపంచం ఒక బంధిఖానా అనే విషయాన్ని గుర్తుంచుకోమని ఠాగూర్ భోలేబాబాకి గుర్తుచేశారు. వాళ్లకి ఈ భూప్రపంచం ఏదో గ్రహాంతరవాసంగా తోస్తుంది, వాళ్లు తమకి తామే గ్రహాంతరవాసుల్లా భావిస్తారు. బాహ్యప్రపంచంలో భగవంతుడిని చూడటానికి ప్రయత్నించే వారి దృష్టి అంధకారబంధురమై దైవవిరచిత మార్మిక సృష్టి సౌందర్యాన్నీ ఆనందాన్నీ సందర్శించడంలో విఫలమవుతారు. తమ అంతరంగంలోనే దేవుడిని సందర్శించటానికి ప్రయత్నించేవారు, దైవ కృపతో దీవించబడి దేవునితో ఐక్యత చెందగలరు,' అని చెప్పారు.

తన సందేశాన్ని ముగిస్తూ ఠాగూర్, 'పదార్థ పరిణామం అంటే అచ్చంగా సముద్రంలో దీవి ఏర్పడటం లాంటిది. సముద్ర తరంగాలు ఈ దీవిని కడిగి జీవశక్తితో నింపుతుంది, అది చైతన్యంతో స్పందించడం మొదలుపెడుతుంది. దీన్నే 'పుట్టుక' అంటారు. మళ్లీ అలలు వెనక్కి వెళ్లి సముద్రంతో కలిసినపుడు దాన్ని 'మరణం' అంటారు. కానీ సారంలో సముద్రం ఎప్పుడూ నిలిచే ఉంటుంది. నిరంతరం సాగే చావు–పుట్టుకల ద్వారా మార్పు చెందని సముద్ర చైతన్యం

తనలో నిరంతరాయంగా మారుతూ కొనసాగుతున్న సృజనాత్మక శక్తితో ఆనందిస్తూ ఉంటుంది. మీరు మీ ప్రత్యక్షానుభవం ద్వారా శాశ్వతమైన, నిరంతరం మారుతున్న ప్రకృతి ముఖారవిందాన్ని దర్శించవచ్చు. ఆధ్యాత్మిక ఉన్మత్తత కలిగించే ఆమె సంగీతాన్నీ, సృజనాత్మక నృత్యాన్నీ తనివితీరా వీక్షించవచ్చు'నని అన్నారు.

ఈ దివ్య సందేశాన్ని మనసులో పదిల పరుచుకుని భోలేబాబా డార్జిలింగ్‌లో ఉన్న బాబాజీని చేరుకోవడానికి ప్రయాణమయ్యారు.

భోలేబాబా జీవితంలో నిగూఢమైన, ఎంతో సాహసంతో కూడిన ప్రయాణాలు ఇప్పుడు మొదలయ్యాయి. హరరాయ్‌దేశాయ్ మరో పదిమందితో కలిసి శాంతినికేతన్ నుండి బయల్దేరారు. భోలేబాబా తన గురువుని కలవడానికి బయల్దేరారనే విషయం వాళ్లకి తెలీదు. వాళ్లవరకు వాళ్లకి ఈ ఉత్సాహభరితమైన టిబెట్ ప్రయాణంలో డార్జిలింగ్ తొలి మజిలీ అని మాత్రమే అనుకున్నారు. భోలేబాబా భవాల్ రాజు రాక గురించి ఆలోచించసాగారు.

తన గురువు సోదరుడు భవాల్ రాజు శాంతినికేతన్‌లో కలిసినపుడు భోలేబాబాకి అతని రాకలో ఎలాంటి వింతా అనిపించలేదు. ఠాగూర్ తనని చూసిన పద్ధతి కూడా మామూలుగానే అనిపించింది. కొన్ని వారాల తర్వాత ఈ విధమైన బాబాజీ నుంచి మార్మిక సందేశంతో కూడిన టెలిగ్రాం వచ్చేసరికి ఈ టెలిగ్రామ్‌కీ, గురుభ్రాత భవాల్ రాజు రాకకీ ఏమైనా సంబంధం ఉందేమోననే ఆలోచనలో పడ్డారు భోలేబాబా. రాజు ఠాగూర్‌ను చూడడానికే వచ్చారా లేక భోలేని చూడడానికి వచ్చారా? మామూలుగానైతే రాజు భోలేబాబాను కలకత్తాకు రావలసిందిగా ఆహ్వానించేవారు. కానీ ఈసారి అలాంటి ఆహ్వానమేదీ లేదు. వాళ్లు విడిపోయేటప్పుడు ఎప్పుడైనా ఖర్చుల కోసం చేతినిండా పైకం ఇచ్చే వీరి పెద్ద సోదరుడు ఈసారి గాఢంగా ఆలింగనం చేసుకుని ఆయన కళ్లలోకి నిగూఢంగా చూసి వెళ్లిపోయారు.

ఠాగూర్ భోలేని ఆశీర్వదిస్తూ జనన మరణ వాస్తవికత గురించి వివరించినప్పుడు భోలేబాబా ఉత్సాహానికి అంతులేదు. ఠాగూర్ లోతైన కారణం లేకుండా ఒక చిన్న పదమైనా ఉచ్చరించరని భోలేకు బాగా తెలుసు. ఒకవేళ ఆయన తన మహాభినిష్క్రమణ గురించి గానీ, భవాల్ రాజు లేక బాబాజీ మహాభినిష్క్రమణ గురించి గానీ ఈ మాటల ద్వారా ఏమైనా సూచిస్తున్నారా! ఏమో! సంవత్సరం క్రితం బాబాజీ తన దేహాన్ని త్యజిస్తానని అన్నమాట గుర్తొచ్చింది. అప్పుడు అలా బాబాజీ అన్నప్పుడు భోలే 'మూర్ఖపు శిష్యులింకా ఉన్నప్పుడు ఏ గురువైనా వెళ్లిపోతే వాళ్లు దుర్గతిని పొందుతారని గ్రంథాల్లో రాసి ఉంది' అని వాదించాడు. అప్పుడు బాబాజీ 'సరే, నేను నా దేహాన్ని వదిలి వెళ్లనులే! ఎందుకంటే నువ్వింకా ఓ మూర్ఖుడిగా అమాయకంగానే ఉన్నావు కదా!' అని సమాధానమిచ్చారు.

టెలిగ్రాంలో 'సమయం ఆసన్నమైంది,' అనే వాక్యం అతని మెదడును తొలుస్తోంది. ఇది భరించలేకపోతున్నాడు. ఎందుకంటే దీన్ని ఆయన ఎవ్వరితోనూ పంచుకోలేరు. డార్జిలింగ్ చేరిన వెంటనే భోలేబాబా వారందరినీ అతిథి గృహంలో ఉంచి బాబాజీని కలవడానికి బయటికి వెళ్లారు. తన గురుదేవులు ఎక్కడుంటారో భోలేబాబాకి బాగా తెలుసు. నదీ తీరంలో కర్మకాండలు పాటించే స్థలం నుంచీ మైలు దూరంలో 36 సంవత్సరాల క్రితం బాబాజీ భవాల్ రాకుమారుని దేహాన్ని స్వాధీనం చేసుకున్న ప్రదేశంలో ఉన్న గుహలోనే ఆయన తప్పనిసరిగా ఉంటారు. అనుకున్నట్లుగానే బాబాజీ ఆ గుహలో ఉన్నారు. బయట ఐదుగురు సాధువులు కూడా ఉన్నారు. గత కొద్దిరోజుల నుంచీ బాబాజీ మౌనంగా ఉన్నారని అప్పుడప్పుడు మాత్రమే కళ్లు తెరుస్తున్నారని చెప్పారు. ఆయన పిలవకుండా లోపలికి వెళ్లడం సరైంది కాదని భోలేబాబా బయటే ఉన్నారు.

కానీ ఆయన వచ్చిన కొద్ది నిముషాలకే గుహలో నుంచి, 'భోలియా, లోపలికి రా!' అని పిలుపు వినిపించింది. ఆయన లోపలికి వెళ్లిన వెంటనే బాబాజీ 'సాధూ భవాల్ ఎలా ఉన్నాడు' అనడిగారు.

'నేను చూసినప్పుడు బాగానే ఉన్నారు, కానీ నిజానికి అతనెలా ఉన్నారనే విషయం మీకే తెలుసు,' అన్నారు భోలే.

బాబాజీ ముందు కూర్చున్నారు భోలేబాబా. కొన్ని గంటల నిశ్శబ్దం తరువాత బాబా కళ్లు తెరిచి 'అతను గెలిచాడు,' అన్నారు.

'ఈ రహస్యాన్ని మరి కాస్త అర్థం చేసుకునే అవకాశం ఏమైనా ఉందా?' అభ్యర్థించాడు భోలే.

'ఉంది. అందుకే నిన్ను పిలిచింది. అతను తన అసలు నివాసానికి వెళ్లిపోయి, నా గురువుగారి పర్యవేక్షణలో ధ్యానంలో నిమగ్నమై ఉన్నారు. నువ్వు నీ పరమ గురువుని కలిసే సమయం ఆసన్నమైంది. ఆయన నీ కోసం నిరీక్షిస్తున్నారు. నీకు ఏది కావాలంటే అది నేర్పుతారు,' అన్నారు బాబాజీ

'ఆయన ఉంటున్న కైలాస పర్వతానికి వెళ్లమంటారా?'

'వద్దు. నువ్వు అక్కడికి చేరుకునేటప్పటికి టిబెట్‌లో శీతాకాలం ప్రవేశిస్తుంది, శీతాకాలంలో ఆయన మధ్య టిబెట్‌లోని లాసా దగ్గరి మఠంలోకి రావచ్చు.'

పరమగురువు దర్శనార్థం తనతోపాటుగా పదిమంది శాంతినికేతనం నుండి వచ్చారని భోలేబాబా బాబాజీతో అన్నారు. బాబాజీ ఒకసారి 'హు!' అని నిట్టూర్చారు. ఇది చాలా క్లిష్టమైన స్పందన, బాబా ధ్యానంలో ఉన్నపుడు ఎవరైనా ప్రశ్న వేస్తే బాబాజీ 'అవును' అని గానీ, 'కాదు' అని గానీ అనకుండా ఇలానే అంటారు. భోలేబాబాకి దాన్నెలా అర్థం చేసుకోవాలో బాగా తెలుసు. ఈ సారి ఈ 'హు!' అంటున్న సందర్భాన్ని చూసి 'అవును' 'కాదు'కి మధ్యస్థంగా ఎక్కడో అర్థం చేసుకున్నారు.

దారిలో ఉన్న కాంలింగ్ పాంగ్‌లో భోలేబాబా తన చిన్నప్పుడు అంధుడైన ఓ సాధువు దగ్గర కుంగ్‌ఫూ నేర్చుకున్నారు. ఇప్పుడు ఆ సాధువు దగ్గర సిక్కిం వెళ్లడానికి ముందు కొన్ని రోజులు విడిది చేశారు. సిక్కింలో ఉన్న బ్రిటిష్ ఆధికారులు ఈ సమూహాన్ని కాంగ్రెస్ పార్టీ గూఢచారి వ్యవస్థగా భావించి (అప్పట్లో కాంగ్రెస్ స్వాతంత్ర్యం కోసం పోరాడుతోంది) వీరి సామాన్లను సోదా చేసి చూశారు. పండిట్ జవాహర్‌లాల్ నెహ్రూ నుండి ఒక ఉత్తరం, గాంధీజీ నుండి వచ్చిన ఉత్తరాన్ని చూసి ఈ ప్రయాణీకులను అక్కడిక్కడే నిర్బంధించారు. దాంట్లో ఎలాంటి రాజకీయ భావాలు లేకున్నా ఆ లేఖలు భారతదేశంలోని ముఖ్యమైన నాయకుల నుండి వచ్చినవి కనుక వీరికి ఖచ్చితంగా కాంగ్రెస్ పార్టీతో సంబంధం ఉండి ఉంటుందనీ, అందువల్ల వీరు కూడా చాలా ముఖ్యమైన వ్యక్తులు అయి ఉంటారనే విషయం ధృవీకరించబడింది. దాంతో అధికారులు వీళ్లని ముఖ్యులుగా భావించి వాళ్లకు సౌకర్యవంతంగా చూడటం మంచిదని భావించారు. ఆ రకంగా వాళ్లు గవర్నరు బంగళాలో ఉన్నపుడు ఒక్క స్వేచ్ఛ తప్ప సకల సౌకర్యాలూ అమర్చబడిన నిర్బంధంలో ఉంచబడ్డారు.

అధికారులు తమ పరిశోధన మొదలుపెట్టారు. అందులో భాగంగా అహమ్మదాబాద్, కలకత్తాలోని తమ ప్రత్యర్థులకు విచారణలు వివరాలు పంపుతూ, మహాత్మాగాంధీ, జవహర్‌లాల్ నెహ్రూలకు వివరణ కోరుతూ తాఖీదులు పంపారు. వారాలు గడుస్తున్నాయి, వీళ్లకి సహనం నశిస్తోంది. రెండు నెలలుగా నిర్బంధంలో ఉండడంతో భోలేబాబా ప్రమాదాన్ని ఎదుర్కోవడానికి సిద్ధమవుతూ ఒక పాత మురికి కోటును ఒక గార్డు నుంచి కొన్నాడు. అది చాలా పొడవుగా ఉండి మారువేషధారులకు బాగా అనుకూలంగా ఉంది. ఒకరోజు రాత్రి కాపలాదారు బాగా తాగి

మత్తుగా పడుకున్నప్పుడు భోలేబాబా ఆ కోటు కప్పుకుని బైటికి వెళ్లారు. వెళ్తున్నప్పుడు తాను ఢిల్లీకి వెళ్తున్నట్లు తన స్నేహితులకు ఉత్తరంలో వ్రాసి ఢిల్లీకి వెళ్లకుండా టిబెట్ వైపు ప్రయాణమయ్యారు. మూడురోజులు నడిచిన తరువాత సిక్కిం–టిబెట్ సరిహద్దును చేరుకున్నారు. అక్కడ ఒక గూర్ఖా సైనికుడు గుర్తింపు పత్రాన్ని అడగగా ఆయన ధారాళంగా నేపాలీ భాషలో మాట్లాడేసరికి ఆ సైనికుడు ఆయన్ని అనుమతించాడు.

సుదీర్ఘమైన శ్రమతో కూడుకున్న టిబెట్ ప్రయాణాన్ని తాను హిమాలయ పరమగురువులతో గడిపిన జీవితాన్ని పునశ్చరణ చేసుకుంటూ కొనసాగించారు. మాంసమూ చేపలూ తప్ప శాకాహారం దొరకటం బహు కష్టమైపోయింది. పాడి పదార్థాలను తినడం కూడా మానేశారు. ఎందుకంటే అవి పాడైపోయి వాసన వస్తున్నాయి. అప్పుడప్పుడు బలవంతంమీద గొఱ్ఱెల కాపరులనుంచీ, యాక్(హిమాలయాల్లో పెరిగే ఎద్దు) సమూహాల కాపలాదారుల నుంచీ అప్పటికప్పుడు తీసిన పాలు త్రాగేవారు. వాళ్ల పాలగిన్నెలు ఎప్పుడూ శుభ్రంగా ఉండేవి కావు. అతనికున్న హస్తసాముద్రికం, జ్యోతిష్య శాస్త్రం ఇప్పుడు ఉపయోగపడింది. ఎలా అంటే టిబెట్‌లోని సంచార తెగలకు జ్యోతిష్యం చెప్పేవారన్నా, భవిష్యవాణి చెప్పేవారన్నా ఎంతో ప్రేమ. అయినప్పటికీ భవిష్యవాణి చెప్పడం అనేది భోలేబాబా మనసుకి నచ్చలేదు, కానీ దానివల్ల ప్రజల్లో ఎంతోమంది ఆయనకు స్నేహితులయ్యేవారు. ఆ విధంగా ఆయన అవసరాలన్నీ తీరేవి.

టిబెట్ నుండి లాసాకు సాగుతున్న సుదీర్ఘ ప్రయాణంలో దారి పొడవునా పెద్ద సమతలమైన శిలాఫలకాలు వేలకొద్దీ ఉన్నాయి. ముఖ్యంగా ఎత్తయిన కొండ ప్రాంతాల దారులలో 'ఓం మణి పద్మేహం' అనే ప్రముఖమైన మంత్రం చెక్కి ఉంది. అయినప్పటికీ చాలామంది టిబెట్ రైతాంగానికి దాన్ని చదవడం తెలీదు. కేవలం ఆ మంత్రాలు చెక్కిన శిలల ముందు సాష్టాంగపడి దణ్ణం పెట్టేవారు. ఎందుకలా చేస్తున్నారని భోలే అడిగితే 'మణి, మణి' అని అందమైన చిరునవ్వుతో సమాధానం చెప్పేవారు. వాళ్లు ఎంతో అమాయకులు. కానీ నమ్మకమున్నవాళ్లు. వాళ్లకి బుద్ధుడి పేరు తెలుసు. కానీ బౌద్ధ తత్వం గురించి గానీ, దాని ఉత్కృష్టమైన సాధన గురించి గానీ తెలీదు.

భారతదేశం మాత్రమే కాక భోలేబాబా చూసిన నేపాల్ వంటి మిగతా దేశాల్లో రైతులు, గిరిజనులు, తెగలు, సంచారజాతుల జీవితాలకన్నా టిబెటిన్ రైతుల జీవితాలు చాలా దుర్భరంగా ఉంటాయి. వాళ్లకేమీ లేదు. చివరికి కనీస అవసరాలు కూడా తీరవు. అయినా వాళ్లు సంతృప్తి అనే సమృద్ధవంతమైన ఆశీర్వాదంతో సంతోషంగా వుంటారు. వాళ్లు ఆకలిగా ఉన్నపుడు యాక్ వెన్నతో చేసిన 'టీ' తాగుతారు, వేయించిన బార్లీతో చేసిన సంకటిని వాళ్ల గుంపులో ప్రయాణిస్తున్న అతిథికి ఇచ్చి తరువాత తింటారు. వీళ్ల ప్రపంచంలో 'కాలాని'కి అర్థంలేదు. ప్రజలు అరుదుగా మాత్రమే నెలలను గుర్తుపెట్టుకుంటారు. వాళ్లతో ప్రయాణించే వాళ్లలో ఎవరో ఒకరు మాత్రమే రోజులనూ వారాలనూ గుర్తు పెట్టుకుంటారు. భోలేబాబా కూడా రోజులను లెక్కించడం మర్చిపోయారు. మనసంతా పరమగురువును చూడాలనే ఆత్రంగా ఉండడంతో భోలేబాబా హిమానీ నదాలను దాటి నదీ జలాలను దాటుకుని, కొండ శిఖరాలపై ప్రయాణించి చివరకు 'లాసా' చేరుకున్నారు.

టిబెట్‌లోని ఈప్రాంతంలో భోలేబాబా ఎప్పుడూ ఉండలేదు. అయితే పశ్చిమ ప్రాంతంలో భోలే, గురూజీ, పరమగురువు అంతా కలిసి ఎక్కువ సమయం గడిపేవారు. హిమాలయాలలో వీరు సంచరించిన ఈ ప్రాంతాన్ని ఇప్పుడు 'ఇండో టిబెటిన్ ప్రాంతం' అని అంటారు. అక్కడి నుండి వాళ్లు టిబెటిన్ పీఠభూమిలో ముఖ్యంగా మానస సరోవరం సరస్సు దగ్గర కైలాస పర్వత ప్రాంతాలలో సంచరించేవారు. 'దేవతల నగరం' అయిన లాసా పట్టణం గురించి పశ్చిమ

టిబెట్‌లోనూ, భారతదేశంలోనూ ఎన్నో ప్రశస్తమైన కథలను విన్నారు. ఆధ్యాత్మిక జ్ఞానంతో నిండిన ఈ పట్టణాన్ని గొప్పగా అంచనా వేస్తూ భోలేబాబా చేరుకున్నారు.

లాసాకి వెళ్లిన తర్వాత భోలే సన్యాసుల మఠాలూ, మఠాలకు సరఫరాలు చేయటానికి స్థిర నివాసం ఏర్పరచుకున్న పల్లెలనూ చూశారు. భిన్నత్వాలతో కూడిన ఆధ్యాత్మిక ప్రపంచం, లౌకిక ప్రపంచం రెండూ పక్క పక్కనే ఉండటం చూశారు. ఉన్నత స్థాయి లామాలు తప్ప కొంతమంది లామాలు ప్రభుత్వంలో పాలనాపరమైన స్థానాలలో ఉండటం చూశారు. అయితే ఈ రెండింటి మధ్యా సంబంధం లేదు. విదేశీయులు దేశంలోకి ప్రవేశించకుండా ఉండటానికి ప్రభుత్వ నిర్వహణ వ్యవస్థ వాళ్లనుండి ఎక్కువ పన్నులు వసూలు చేస్తుంటుంది. సన్యాసి మఠాలకు బైట ఉన్న ప్రపంచం పేదరికం, అజ్ఞానం, నిరక్షరాశ్యతతో మగ్గిపోతున్న జన సముద్రం. ఆధ్యాత్మిక చింతన అంటే పర్వతాల క్రింద, సరస్సులలో నదులలో ఉన్న దయ్యాలూ, రాక్షసూలూ, సర్పాల వంటి వాటి చుట్టూ తిరిగి పూజించడమే. మిగతా అన్ని దేశాలలో మాదిరిగానే టిబెట్‌లో కూడా ఆకలీ, అతిసార వంటి వ్యాధులు, అనిశ్చిత పరిస్థితుల మధ్య ప్రజలు నిరంతరం బాధలకు గురవుతుంటారు. ఇక్కడకూడా ఈ పరిస్థితులన్నిటికీ దేవతల కోపం లేదా దెయ్యాలు లేదా తమ పూర్వీకుల శాపాలే కారణంగా భావిస్తారు.

మఠ జీవనం ఇందుకు పూర్తిగా భిన్నంగా ఉంటుంది. ఇక్కడ జీవితం సౌకర్యవంతంగానూ, సురక్షితంగానూ ఉంటుంది. ఎందుకంటే మఠాల్లో లామాలు ప్రభుత్వంలో కీలక పాత్ర నిర్వహిస్తారు. అటు ప్రభుత్వంలోనూ ఇటు ఆధ్యాత్మిక రంగంలోనూ వాళ్ళే ప్రముఖులు. సన్యాసులకి పాఠశాలకి వెళ్లడం ఒక ప్రత్యేకమైన సదుపాయం. నిజానికి టిబెట్‌లో స్కూలుకి వెళ్లడమంటే మఠంలో చేరి సన్యాసిగా మారవలసి ఉంటుంది. వాళ్ల వాళ్ల కుటుంబ స్థాయిని బట్టి ప్రవేశం దొరుకుతుంది. పాఠశాలలో ప్రవేశించిన తరువాత వాళ్లకి టిబెట్ భాషలో చదవడం, వ్రాయడం నేర్పుతారు. తర్వాత ఉన్నతవిద్యలో భాగంగా బౌద్ధ గ్రంథాలను చదవడానికి 'పాళీ' భాషను చదువుతారు లేదా లౌకిక పరిపాలనా నిర్వహణలో భాగమౌతారు.

భోలేబాబా స్వామీజీ అయినప్పటికీ టిబెటన్ విషయంలో కావలసిన పరిజ్ఞానం ఉన్నప్పటికీ, లామా సంప్రదాయానికి చెందినవారు కాకపోవడం వల్ల ఆయనకు అక్కడి మఠాల గురించి పెద్దగా తెలీదు. కొన్నిరోజులు లాసాలో వెతగ్గా ఒక క్రిస్టియన్ సంస్థ కనబడింది. అక్కడ ఆయనకు ఆహారం వసతి లభ్యమయ్యాయి. ఆ క్రిస్టియన్ సంస్థ సహాయంతో భోలేబాబా ఒక లామాని కలిసి తాను భారత్‌నించి వచ్చిన ఆధ్యాత్మిక చింతనాపరుడినని పరిచయం చేసుకున్నారు. తాను సారనాథ్, గయలో చదువుకున్నాననీ, తనకి సంస్కృతం, పాళీ భాషలు వచ్చుననీ ఆయనకు చెప్పారు. ఆ విధంగా భోలేబాబా టిబిటన్‌లో ఉన్న పురాతనమైన అతి ప్రసిద్ధమైన జోకంగ్ ఆశ్రమాన్ని సందర్శించగలిగారు. ఇది దలైలామా పోటల ప్యాలెస్‌కి దగ్గరగానూ, డ్రూపాంగ్ సన్యాసి మఠానికీ కొన్ని మైళ్ల దూరంలోనూ ఉంది.

ఆక్కడి మఠంలో వేలకొద్దీ సన్యాసులు ఉన్నారు. ఒక్క జోకంగ్ మఠంలోనే సుమారు ఏడు వేలమంది సన్యాసులు ఉన్నారని తెలిసి భోలేబాబా ఆశ్చర్యపోయారు. ప్రతి గదీ, ప్రతి హాలూ, ఖాళీగా ఉన్న ప్రతిచోటా దేవుళ్లు, దేవతలు, దేవదూతలు, రాక్షసుల విగ్రహాలు, రకరకాలైన బుద్ధావతారాలకు సంబంధించిన శిల్పాలు, దలైలామా విగ్రహంతో సహా ప్రఖ్యాత లామాల విగ్రహాలతో నిండిపోయాయి. అతి కష్టంమీద కూర్చుని ధ్యానం చేయడానికి స్థలం దొరుకుతుంది. ప్రతిచోట వెన్నతో వెలిగించిన దీపాలు కనబడతాయి. నేలంతా యాక్ వెన్నతో జారుడుగా ఉండి నడవడం ఓ పెను సవాలుగా మారుతుంది. ప్రతి గదిలో తేనె తుట్టెల మాదిరి పై కప్పుకు గుడ్డలో

చుట్టిపెట్టిన వ్రాత ప్రతులు వ్రేలాడుతూ వుంటాయి. సంవత్సరాల తరబడి వాటినెవ్వరూ తెరవక పోవడంతో అవన్నీ దుమ్ము కొట్టుకుపోయాయి.

ఈ పెద్దపెద్ద మఠాలతో పాటు భోలేబాబా లాసాకి బైట ఉన్న ఓ చిన్న మఠాన్ని కూడా సందర్శించారు. ఎందుకంటే ఇక్కడి మఠాధిపతి లామా గొప్ప తాంత్రికోపాసకుడు అని విన్నారు. ఈ విషయాన్ని స్వామీజీ హిమాలయ పరమగురువులతో జీవనం పుస్తకంలో వ్రాశారు.

'నేను లామాని కలిసినప్పుడు ఆయన చెక్కలతో నిర్మించిన గదిలో కూర్చుని చుట్టూ ఏడుగురు మహిళలు ఉండగా ఆందరూ కలిసి మంత్రాలు జపిస్తున్నారు. కొన్ని మంత్రాలు జపించిన తరువాత కారం, మసాలా చల్లిన మాంసం ముక్కను కాస్త తిని మళ్లీ మంత్రాలను ఉచ్చరిస్తున్నారు.

పదిహేను నిమిషాలైన తరువాత లామా తన మంత్రోచ్చారణ ఆపి నేనెందుకొచ్చానో ఆడిగారు. నేను చిరునవ్వు నవ్వి వారిని చూడటానికి వచ్చానని చెప్పాను. 'లేదు, లేదు, అది నిజం కాదు, నువ్వు ఫలానా వ్యక్తివి. ఫలానా వ్యక్తివైన నువ్వు మారువేషంతో ఉన్నావు! సిక్కిం పోలీసులు నీ కోసం తిరుగుతున్నారు,' అని అన్నాడు. అతను చాలా కోపంగా ఉన్నాడని అతని మాటలే చెప్తున్నాయి. నేను ఈ తాంత్రికోపాసనలోని ఈ మార్గాన్నీ, పచ్చి మాంసం తినడాన్ని నిరసిస్తాననీ అతనికి తెలుసు. అతను నా ఆలోచనలను చదివాడని తెలిసి భయమేసింది. అయితే అతనలా చేసినందుకు నేనేమీ ఆశ్చర్యపోలేదు. ఎందుకంటే అప్పటికే ఎదుటి వాళ్ల ఆలోచనలు చదివే వాళ్లు చాలామంది నాకు తెలుసు. అలాగే ఎదుటివారి అలోచనలు చదివే పద్ధతి మొత్తం నాకు తెలుసు. నేను నమ్రతగా ప్రవర్తిస్తూ కేవలం మరింత తాంత్రిక విద్యలు నేర్చుకోవడానికే మీ దేశం వచ్చానని చెప్పాను. తాంత్రికుడైన ఆ యోగి ప్రార్థన చేసే పుస్తకాన్ని ఇచ్చి చూడమన్నాడు. కానీ ఆ పుస్తకాన్ని ఆంతకుముందే నేను చదివేశాను.

లామా తన మఠంలో ఉండడానికి అంగీకరించాడు. ఇక్కడ భోలేబాబా అద్భుతమైన అనుభవాన్ని పొందారు. ప్రధాన లామాతో సహా చాలామంది లామాలు పట్టు వస్త్రంతో చుట్టి గ్రంథాన్ని మందంగా పూసి ఉన్న సంస్కృత గ్రంథాన్ని పూజిస్తుంటారు. దాన్ని ఎవ్వరూ తెరవరు. ఎందుకంటే ఎవరన్నా తెరిస్తే వెంటనే కుష్ఠువ్యాధి సోకి మరణిస్తారని నమ్ముతారు. భోలేబాబా ఇలాంటి మూఢనమ్మకాల్ని నమ్మరు. 'చదివిన వారికే రచనా సౌందర్యం సొంతం. దాంట్లో ఏముందో కూడా తెలియని మూర్ఖులకు ఆ సౌందర్యం విలువ ఏనాటికీ తెలియదు' అనే నానుడి ఆయనకు బాగా గుర్తుంది. ఆయనకు ఆ గ్రంథాన్ని చదవాలనే కోరిక బాగా ఉంది. ఒకరోజు రాత్రి ఆయన గ్రంథం ఉన్న గదిలోకి వెళ్లి దాన్ని చుట్టిన గుడ్డను తీసి క్రొవ్వొత్తి కాంతిలో చదివారు. అక్కడక్కడ కాస్త చదవగానే ఆ రచనని అంతకుముందే తాను చదివానని అర్థమైంది. అది పద్దెనిమిది భాగాలైన శివలింగ పురాణాలలోని ఒక పురాణ భాగం. ఈ భాగం స్వర్గాన్నీ నరకాన్నీ వివరిస్తూ చనిపోయిన తరువాత ఆత్మ ఏ విధంగా అక్కడికి ప్రయాణిస్తుందో వివరిస్తుంది. భోలేబాబా దీన్ని చుట్టేసి యథా స్థానంలోనే మళ్లీ పెట్టేశారు.

ఆ పుస్తకం ఉండాల్సిన స్థానాన్ని కదపడమే కాకుండా దానికి చుట్టిన వస్త్రాన్ని అచ్చం లామాలు ఎలా చుట్టే విధంగా చుట్టకపోవడం వల్లా దీపాలను కదపడం వల్లా ప్రొద్దునే ఆ సన్యాసికి ఈ గ్రంథాన్ని ఎవరో తెరిచారని అర్థమైంది. దాంతో ఓ పెద్ద ప్రళయమే వచ్చినంత పనైంది. అక్కడ భోలేబాబాయే ప్రధానమైన అనుమానితుడు. కొన్ని నిమిషాల పాటు అక్కడి పరిస్థితిని చూస్తే ఆ లామా భోలేబాబాని అక్కడే చంపేస్తాడేమో అనిపించేలా ఉంది. వాళ్లు అతని చుట్టూ చేరగానే భోలేబాబా వాళ్లను చూస్తూ బిగ్గరగా, 'ఈ వ్రాతప్రతిని చదవడానికి వెళ్లమని నన్ను హిమాలయ గురువుగారు పురమాయించారు. మీరు నన్ను బాధిస్తే కష్టాల్లో చిక్కుకుంటారు'

అన్నారు. అతని వాలకం అతని బెదిరింపూ చూసి వాళ్లు వెనకడుగు వేశారు. అంతేకాక భోలేబాబాకి ఎలాంటి కుష్ఠువ్యాధీ సోకిన ఆనవాళ్లు కనబడపోయేసరికి నిజంగానే అతనికి ఈ గ్రంథాన్ని చదివే అధికారం వుందని వాళ్లు నమ్మారు.

త్వరలోనే ఈ విషయమంతా ఓ పుకారుగా ఆశ్రమం అంతా వ్యాపించింది. దాంతో ప్రతి ఒక్కరూ అనంత జ్ఞానశక్తిసంపన్నుడైన ఓ యువ లామా బుద్ధగయ నుండి వచ్చాడని అనుకోవడం మొదలుపెట్టి లామాలూ సామాన్య జనాలూ అతనిని చూడటానికి వచ్చి సాష్టాంగ నమస్కారాలు చేయడం మొదలుపెట్టారు. కానీ భోలేబాబాకి మూఢ విశ్వాసాలు, భావావేశాలూ (సెంటిమెంట్) తెచ్చి పెట్టే గౌరవం త్వరలోనే ఇక్కట్లను తెచ్చిపెడుతుందని తెలుసు. దాంతో ఆయన తన తుది గమ్యం చేరుకునే సమయం వచ్చిందని ప్రకటించారు. దాంతో లామాలు అతని ప్రయాణానికి కావలసినవన్నీ సిద్ధం చేసి ఒక గైడ్‌ని కూడా ఇచ్చి భోలేబాబాను అతని పరమగురువు నివసించే మఠానికి సాగనంపారు. భోలేబాబా ఈ మొత్తం అనుభవాన్ని లాసా మఠంలో ఒకే ఒక వాక్యంతో ఇలా అన్నారు– 'ఒక్కొక్కసారి ఆధ్యాత్మిక మార్గంలో శుద్ధ అజ్ఞానం నిగూఢమైన జ్ఞానంగా అమోదింపబడుతుంది. ప్రజలు దానిని పరీక్షించడానికి ఒప్పుకోరు.'

భోలేబాబా తన గమ్యాన్ని చేరుకోగానే అతని పరమగురువు కౌగలించుకుని 'నువ్వు చాలా అలసిపోయావు. చాలా కష్టాలనుభవించావు. జ్ఞానమార్గం చాలా క్లిష్టమైంది, దాన్ని పొందాలనుకోవడం దుర్లభమైన లక్ష్యం.' భోలేబాబా అప్పటికే అలసిపోయారు. కొన్ని మాసాల నుంచీ ఎలాంటి యోగసాధనా చేయడంలేదు. ఆరోగ్యం క్షీణించసాగింది. కానీ పరమగుర్యుల ఆలింగనంతో నొప్పీ అలసటా మాయమైపోయాయి. *హిమాలయ పరమగురువులతో జీవనంలో* స్వామీజీ వివరించినట్లు, పరమగురుదేవులు వృద్ధులే గానీ చాలా ఆరోగ్యంగా ఉన్నారు. ఆయన కూర్చున్న చోటు నుంచి ఉదయం ఒకసారి సాయంత్రం ఒకసారి లేస్తారు, అంతే. ఆయన ఎత్తు ఐదడుగుల తొమ్మిదీ లేక పది అంగుళాలు ఉంటుంది. సన్నగా ఉన్నా చాలా చురుగ్గా వుంటారు. దుబ్బుగా ఉండే కనుబొమలతో ముఖం ప్రశాంతంగా ఉంటుంది. ఎప్పుడూ చిరునవ్వుతో వుంటారు. ఆయన యాక్ పాలపైనే ఎక్కువగా ఆధారపడతారు. అప్పుడప్పుడు బార్లీ జావ త్రాగుతారు. తరచూ కొంతమంది లామాలు ఆయన దగ్గరికి వచ్చి చదువుకుంటూ ఉంటారు. వీరు సహజమైన గుహలోనే వివసిస్తుంటారు. ఆ గుహముందు విద్యార్థులు చెక్క మంటపాన్ని చేసి ఉంచారు. అక్కడి నుంచి దూరంగా ఉన్న పర్వత శ్రేణుల్నీ, విస్తారమైన దిగంతాలనూ చూడొచ్చు.

గురువర్యుల వెంట మరో ఐదుగురు యోగులు ఉన్నారు. వారంతా ఎంతో ప్రేమాస్పదంగా ఉన్నారు. వాళ్లు హిందీ, నేపాలీ ఈశాన్య భారతంలో మాట్లాడే మాండలికాలతో కలిపి ఎంతో హృద్యంగా తేనెలు చిలకరిస్తూ మాట్లాడుతున్నారు. కానీ ఎవ్వరూ భవాల్ రాజు ఉన్నట్టు సూచన ప్రాయంగానైనా చెప్పట్లేదు. తన స్పృహకి గురుభ్రాత భౌతికంగా అక్కడే ఉన్నాడని తోస్తోందా లేక కేవలం వాయు రూపంలో తన పరమగురువుతో నివసిస్తున్నారా అని భోలేబాబా ఆశ్చర్యపోతున్నారు.

అప్పుడప్పుడూ కొంతమంది టిబెటిన్ లామాలు చదువుకోవడానికి వస్తుంటారు. వారు భారతీయ గురువుల, ఋషుల, సన్యాసుల కథలు వినడానికి వస్తుంటారు. కానీ వాళ్లు చాలావరకు మంత్రతంత్రాలు, భూతవైద్య పద్ధతులు నేర్చుకోవడానికే ఇష్టపడుతూ ఉంటారు. ఏమైనప్పటికీ భోలేబాబాకి ఈ యోగులూ, ముఖ్యంగా తమ పరమగురువులు చావుపుట్టుకల రహస్యాన్నీ, భూప్రపంచంలోనూ ఆ తరవాత కొనసాగే జీవిత నిగూఢత్వాన్నీ బాగా ఎరిగి ఉన్నారనే విషయం తెలుసు. దాంతోపాటు ఎన్నో ఉన్నత స్థాయి తాంత్రిక పద్ధతులు, ఉదాహరణకి, తాము బ్రతికి ఉండగానే తమ దేహాన్ని భద్రపరుచుకుని వేరొకరి దేహంలో ప్రవేశించే పరకాయ

ప్రవేశ విద్య వాళ్లకు తెలుసు. ఈ సిద్ధులు ఎంత సునాయాసంగా లామాలను సందర్శించే స్థాయికి వచ్చారో తలుచుకుని స్వామీజీ ఆశ్చర్యపోతుంటారు. ఈ ఐదుగురు సిద్ధులూ కేవలం టిబెటిన్‌ల పశువుల్ని వారు నమ్మే క్షుద్రశక్తుల నుంచి రక్షించి, వారి ఈతిబాధల్ని తొలగించి ఈ టిబెట్‌ను చల్లగా చూస్తూ లోయలనూ, పర్వతాలనూ పాలించే అతీంద్రియ శక్తులు గల సన్యాసులుగా మాత్రమే కనబడుతున్నారు. ఈ సాధువులు లామాలకు విద్యలు నేర్పటం చూస్తూ భోలేబాబా కూడా దెయ్యాలన్నా, చీకటన్నా భయం లేకుండా ఉండడం, జలుబు, దగ్గు లాంటి సామాన్యమైన అనారోగ్యాలను నయం చేయడం, గొఱ్ఱెలు వేరే మందలో వుంటే పిలవడం, మీదకి విరుచుకుపడుతున్న  కుక్కలను నియంత్రించి చెప్పుచేతల్లో ఉంచుకోవడం, సంచార సమూహాలకీ, రైతుకీ ఉపయోగపడే అనేక తాంత్రిక  విద్యలనూ, పద్ధతులనూ నేర్చుకున్నారు. ఆ సిద్ధులు నేర్పుతున్న విద్యకు బదులుగా ఈ లామాలూ, వారి అనుచరులూ వారికి కావలసిన ఆహారం, దుప్పట్లూ, దీపాలు వెలిగించుకోవటానికి కావలసిన నూనె, ధునికి కావలసిన కట్టెలూ తీసుకొచ్చి  ఇస్తుండేవారు.

పరమగురువుగారి సాంగత్యంలో ఉండడమంటే ఎంతో సంతోషంగా భోలేకి. ఆయనకి తన గురువుగారు బాబాజీతో ఉన్నట్టే అనిపిస్తుంది. బాబాజీ లాగానే వీరు కూడా అడగకుండానే ప్రశ్నలకు సమాధానాలు చెప్పేవారు. కానీ  సామాన్యంగా ప్రశ్నలకి చాలా తక్కువగానే మాట్లాడుతూ సమాధానాలు చెప్పేవారు లేదా ఒక చిరునవ్వు నవ్వి ఊరుకునే వారు, కొన్నిసార్లు అది కూడా ఉండేది కాదు. మొత్తానికి ఒక రోజు ఆయన భోలే బాబాతో కాస్త ఎక్కువగానే మాట్లాడారు. ఆయన, 'నీకేం కావాలో చెప్పడం లేదేం?' అని భోలేబాబాను అడిగారు. దానికి సమాధానం స్వామీజీ ఇలా వ్రాశారు, 'వణుకుతున్న గొంతుతో నేను, 'దయచేసి నాకు పరకాయ ప్రవేశ విద్యలోని మెళకువలను నేర్పండి,' అన్నాను.

భోలేబాబా  తన చిన్నప్పుడు ఈ విద్యను గురించి విన్నాడు. అతని పదహారేళ్ల వయసులో 'బూఢే బాబా' (వృద్ధ సాధువు) అనే సాధువును కలిసారు. ఆయన తూర్పు హిమాలయాలలోని నాగా పర్వతాలపై నివసిస్తూ అప్పుడప్పుడూ బాబాజీని కలవడానికి వస్తుండేవారు. వాళ్లిద్దరూ పరకాయ ప్రవేశం గురించి మాట్లాడుకుంటూ ఉండేవాళ్లు. బాబా చిన్నవారవటం వల్ల వాళ్లేం మాట్లాడుకుంటున్నారో అర్థమయ్యేది కాదు.

కొన్ని రోజుల తర్వాత బూఢే బాబా వెళిపోతుండగా బాబాజీ భోలేను అతనితో కలిసి వెళ్లమన్నారు. అలసటతో కూడిన సుదీర్ఘమైన ప్రయాణం తరువాత వాళ్లు అసోంలో స్వామీ నిగమానందగారు నివసించిన గుహలో ఆగారు. అక్కడ బూఢేబాబా మర్నాడు తన దేహాన్ని వదిలి మరో దేహంలోకి ప్రవేశిస్తానని అన్నారు. ఆశ్చర్యపోవడం భోలే వంతైంది. బూఢే బాబా చనిపోవాల్సిన అవసరం వుందా? ఇంకొకరి దేహంలోకి ప్రవేశించడం అంత తేలికా? ఒకవేళ అలా చేయాలనుకున్నా వేరొకరు తమకు తాముగా ఈ ముసలి సాధువుకు తమ దేహం ఇస్తారా? అని భోలే ఆశ్చర్యపోయాడు. భోలే తనకున్న అనుమానాలను వ్యక్తీకరించాడు. బూఢేబాబా, 'నాకిప్పుడు తొంభై సంవత్సరాలు  ఈ దేహంతో ఎక్కువకాలం సమాధిలో ఉండటానికి వీలుపడదు. అవకాశం తనంతట తానే వెతుక్కుంటూ వచ్చింది. రేపు మంచి స్థితిలో ఉన్న మృతశరీరం  ఒకటి రాబోతోంది. ఆ యువకుడు పాముకాటు వల్ల చనిపోయాడు. ఇక్కడికి పదమూడు మైళ్ల దూరంలో నది ఒడ్డున అతన్ని వదిలేస్తారు' అని అన్నారు. రేపు ఉదయాన్నే బయల్దేరాలనీ, అలాగైతేనే సూర్యాస్తమయం లోపల అక్కడికి చేరుకుంటామని అన్నారు ఆయన.

వాళ్లిదరూ ప్రొద్దునే లేచేసరికి గుహ ద్వారం ఒక ఏనుగుతో మూసుకుపోయి ఉంది. దాని తల, తొండం, ముంద కాళ్లు రెండూ గుహ లోపలికి ఉన్నాయి. దాన్ని ఒక తేలు కుట్టింది.

ఏనుగు అక్కడికక్కడే చనిపోయింది. బూధే బాబా ఆ తేలుని తన వొట్టి చేతులతో పట్టుకోని 'ఓసి దుర్మార్గురాలా, ఎంత భయంకరమైన పనిచేశావు?' అని కోప్పడ్డాడు.

భోలే 'ఆ తేలు మిమ్మల్ని కుడుతుంది, వదిలేయండి' అనరిచాడు.

కానీ బూధేబాబా ప్రశాంతంగా 'దానికలా చేసే ధైర్యం లేదు' అన్నారు. భోలే దాన్ని చెక్క పావుకోళ్లతో చంపాలని చూశారు. బూధేబాబా ఆపి 'ఎవ్వరికీ ప్రాణాలతో ఉన్న ఏ జీవినీ చంపే అధికారం లేదు, ఈ రెండూ ఒకదానికొకటి తారస పడ్డాయి. కర్మా– దాని పర్యవసానం ఎలా ఉంటుందో నీకు తెలిస్తే ఇక్కడ ఏం జరిగిందో అర్థం చేసుకుంటావు,' అంటూ బూధేబాబా ఆ తేలుని పోనిచ్చారు. తరువాత ఇద్దరూ కలిసి రెండు గంటలు కష్టపడితే కానీ బైటికి ప్రాకి వెళ్లటానికి ఖాళీ దొరకలేదు. బైటికి రాగానే వాళ్లు ఉత్తర దిక్కుగా నది వైపు సాగి అక్కడ గుడారం వేసుకున్నారు.

ఉదయం నది ఒడ్డున కూర్చుని భోలే రెండు గంటలు ధ్యానాన్ని కొనసాగించారు. కళ్లు తెరచి చూడగా అక్కడ బూధే బాబా లేరు. బూధేబాబా కోసం చుట్టూ చాలా సేపు వెతికి చేసేదేమీ లేక భోలే అక్కడే కూర్చున్నాడు, సాయంత్రం దాకా ఆయన రాకపోయేసరికి వెనుదిరిగి తన గురువుగారి దగ్గరకి వెళ్లిపోదామనుకున్నాడు. కొన్నిరోజులు నడిస్తే ఆక్కడికి దగ్గరలో గౌహతీ రైల్వే స్టేషన్ ఉంది. ఒకసారి భోలే అక్కడ రైలు ఎక్కి హరిద్వార్‌లో దిగి, అక్కడి నుంచీ నదుచుకుంటూ తన గురువుగారు హిమాలయాలలో నివసించే ప్రదేశమైన గుప్త కాశీ పవిత్ర పుణ్య క్షేత్రం గఢ్‌వాల్‌కి చేరుకున్నారు.

ఆ ప్రసంగం గురించి స్వామీజీ ఇలా వ్రాశారు, 'నేనక్కడికి చేరుకోగానే మా గురువుగారు, 'బూధేబాబా నిన్న రాత్రి ఇక్కడున్నారు. వారు నీ గురించి వాకబు చేశారు' అని చెప్పారు. కొన్ని రోజుల తర్వాత ఒక యువ సాధువు మా గుహకి వచ్చారు. అతడు నాతో ఎంతో పరిచయం ఉన్నట్టు మాట్లాడడం మొదలుపెట్టారు. అస్సాంకి సాగిన మా ప్రయాణ వివరాలన్నీ చెబుతూ 'నన్ను క్షమించు. నేను పరకాయ ప్రవేశం చేసినపుడు నాతో నువ్వు లేవు' అంటూ అంతా చెప్పుకొచ్చారు. వీరి ఈ కొత్త భౌతిక పరికరం ఆయనను ఏ మాత్రం ఇబ్బంది పెట్టినట్లు లేదనిపించింది. అతని పూర్వపు సామర్థ్యాలు, లక్షణాలూ అన్నీ అలానే ఉన్నాయి. ఆయన తన తెలివి, ప్రజ్ఞా పాటవాలూ, జ్ఞాపకాలూ, జ్ఞానం, ప్రతిభలూ, బూధే బాబా పాత అలవాట్లూ అన్నీ ఆలానే ప్రదర్శించగలుగుతున్నారు.

ఈ అనుభవంతో భోలేబాబా తన గురుదేవులు, పరమ గురువర్యుల వంటి అతీత స్థాయికి చెందిన యోగులు పరకాయ ప్రవేశ విద్యని ఆచరించగలరనీ కానీ దాని గురించి మాట్లాడరనీ అర్థం చేసుకున్నారు. ఇప్పుడు తన పరమగురువు తన కళ్లెదుట కూర్చుని తన మనోభీష్టాన్ని వ్యక్తీకరించడానికి వెనకాడొద్దని చెప్తున్నారు. దాంతో ఆయన ఈ విద్యను ఎలా ప్రయోగిస్తారో చెప్పమన్నారు. అందుకు ఆయన అంగీకరించి మర్నాడు ఉదయం ఈ ఐదుగురు నిపుణులు, కొంతమంది లామాల సమక్షంలో తాను ఈ దేహాన్ని వదిలి మరి కాసేపట్లో తిరిగొస్తానని చెప్పారు. అది వినగానే క్షణకాలం భోలేబాబా మనసులో 'బహుశా ఈయన తన దేహాన్ని త్యజించిన తరువాత దాన్ని మేము పాతి పెట్టడమో లేదా నీటిలో ముంచటమో చేయాలి కాబోలు' అని అనుకున్నాడు. ఆ తర్వాత గురువుగారు భోలేబాబాను గుహలోకి వెళ్లి ఎక్కడైనా ద్వారం గానీ బైటికి వెళ్ళే మార్గంగానీ వుందేమో చూసుకోమన్నారు. ఆయన గత నెల రోజులుగా అక్కడ ఉంటున్నారు. ఆ గుహకి ప్రవేశ ద్వారం తప్ప వేరే ద్వారం లేదని బాగా తెలుసు. అయినా గురువుగారి ఆజ్ఞను అనుసరించారు. ఆయన లోపలికి వెళ్లి ఆంతా చూసి వచ్చేసరికి గురువుగారు అందరికీ తన ఎదురుగా ఉన్న చెక్క పళ్లాన్ని చూపుతూ, 'ఇది అందరూ చూస్తున్నారా?' అని

అడిగారు. అందరూ చూస్తున్నామని చెప్పారు. అప్పుడు ఆయన, 'నన్ను చూస్తున్నారా? అని అడిగారు. అందరూ, 'అవును, చూస్తున్నాం!' అని చెప్పారు. అప్పుడు భోలేబాబానీ, లామానీ ఆ చెక్క పళ్లేన్ని పట్టుకోమన్నారు. వాళ్లిద్దరూ ఆయన చెప్పినట్లే చేశారు.

ఈ సంఘటనని స్వామీజీ వివరిస్తూ. 'ఆయన శరీరం అస్పష్టంగా పొగమంచులా మారడం మొదలైంది. ఆ పొగమంచు మనిషి ఆకారంలో ఉన్న మబ్బులాగా ఉంది. మనిషి ఆకారంలో ఉన్న మబ్బు మా వైపు కదలడం మొదలైంది. కొన్ని క్షణాల తర్వాత ఆ మబ్బు మాయమై పోయింది. మా చేతిలో ఉన్న చెక్కపళ్ళెం బరువుగా మారడం మొదలు పెట్టింది. మరి కొన్ని క్షణాల తర్వాత మా చేతిలోని పళ్ళెం అంతకు ముందులాగా తేలిగ్గా అయ్యింది. పది నిముషాల వరకూ నేనూ లామాలు ఆ పళ్లాన్ని అలాగే పట్టుకుని నుంచున్నాము. చివరికి కూర్చుని ఏదో సంభ్రమాశ్చర్యాలకు గురిచేసే సంఘటన ఏదైనా జరుగుతుందేమోనని ఆత్రుతగా చూస్తున్నాం. పది నిమిషాల తర్వాత మా పరమగురువర్యుల గొంతు వినబడింది. నన్ను ఆ పళ్లేన్ని పట్టుకుని లేచి నుంచోమంటోంది ఆ స్వరం. మేము పళ్లేన్ని పట్టుకుని నుంచోగానే అది మళ్లీ బరువెక్కడం మొదలైంది. మళ్లీ ఆ మబ్బు మా ఎదుట ప్రత్యక్షమయ్యింది. ఆ మబ్బు తిరిగి కనబడే వారి శరీరంగా మారింది. ఈ అద్భుతమైన, నమ్మలేని అనుభవంతో నేను పరకాయ ప్రవేశం నిజమేననే నిర్ధారణకి వచ్చాను. అదే ప్రక్రియను వారు మరోసారి మా ముందు ప్రదర్శించారు.

కొంతమంది ప్రాజ్ఞులు చావు పుట్టుకల రహస్యాలను ఛేదించడమే కాకుండా కేవలం వాళ్ల శక్తివంతమైన మనసును ఉపయోగించి పదార్థాన్ని శక్తిగానూ, శక్తిని పదార్థంగానూ మార్చగలరని '*హిమాలయ పరమగురువులతో జీవనం*' లో స్వామీజీ తెలిపారు. స్వామీజీ ఏ విషయాన్నైనా సంపూర్ణంగా తెలుసుకోనిదే సంతృప్తి చెందేవారు కారనే విషయం నాకు బాగా తెలుసు. అందుకే కేవలం ఆయన పరమగురువు చేసిన ఆ అద్భుతాన్ని చూసి మిన్నకుండి పోయారంటే నేను నమ్మలేకుండా ఉన్నా. ఈ పరకాయ ప్రవేశ విద్యను తనకు చెప్పమని ఆయన ఖచ్చితంగా అడిగే ఉంటారని నేను భావించాను. నేను వారి పుస్తకాలను హిందీలోకి అనువదిస్తున్నపుడు 'ఆయన భోధనా మార్గం ఎంతో ఆచరణీయమైనది, ముక్కు సూటిగా ఉండేది' అనే మాట చదివినట్లు నాకు హఠాత్తుగా గుర్తొచ్చింది. ఈ పదానికి ముందుగానీ వెనకగానీ ఏమీ లేదు. మిగతా విషయాలన్నిటినీ చదివితే ఇది సందర్భానికి తగినట్లుగా లేదు. కానీ ఈ మాట స్వామీజీని ఓ ముఖ్యమైన విషయం అడగడానికి అవకాశమిచ్చింది. 'స్వామీజీ అంత ఆచరణాత్మకంగానూ, సూటిగానూ తమరికి ఏ విషయం బోధించారు?' అని అడిగాను.

ఎప్పటిలాగే నా ప్రశ్నని వినీ విననట్లుగా ఉండే విలక్షణమైన ప్రవర్తనతో తన ఆలోచనా స్వామాజ్యంలోకి జారిపోయారు. ఒక నిమిషం తరువాత కూర్చుని కళ్లార్పకుండా కాలానికీ శూన్యానికీ ఆవల మన అనుభవంలో లేని అవగతం కాని విషయాన్ని తదేకంగా చూస్తూ వుండిపోయారు. కాసేపటికి తిరిగి వచ్చి 'ఏమన్నారూ?' అని సౌమ్యంగా అడిగారు.

ఆ సమయంలో ఆయన చుట్టూ ఉన్న కాంతిపుంజం పూర్తిగా మారిపోయింది. అది అంతకు ముందున్నట్లు లేదు. ఆయనలో '*హిమాలయ పరమగురువులతో జీవనం*' రచయిత అదృశ్యమయ్యాడు. ఆ ప్రదేశంలో ఈ ప్రపంచం పొందగలిగినంతగా తనలో ఇముడ్చుకో గలిగినంతగా దేన్నైనా సరే ఇవ్వటానికి సిద్ధంగా ఉన్న సున్నితమైన కారుణ్యమూర్తీ పరమయోగీ దర్శనమిచ్చారు. నాకు అడగగలిగే స్థాయి ఉందో లేదో అనే విషయం పక్కన పెట్టి, 'వారు సూటిగా ఆచణాత్మకంగా తమరికి ఏమి బోధించారు? మీరు వ్రాసినట్లు జనన మర్మం కంటే మరణ మర్మం ఏ విధంగా వేరుగా ఉంటుంది? నాలాంటి సామాన్యుడు జీవంతోనే దేహాన్ని

వదిలి మళ్లీ తిరిగి రాగలిగే విద్య ఎలా నేర్చుకోగలడు? చావు భయం నుంచి స్వేచ్ఛని పొందగలగడం ఎలా?' అని అడిగాను.

స్వామీజీ వివరించారు– 'అది చాలా సులభం. మొదటి విషయం నువ్వు నీ దేహంతో గుర్తింపబడే స్పృహ నుండి బైటపడాలి. 'ఈ శరీరమే నేను లేదా ఈ శరీరమే నాది' అనే భావమే నిన్ను ఈ శరీరంలో బంధిస్తుంది. నీ శరీరంతో నిన్ను నువ్వు గుర్తించుకునే స్పృహ నుండి బైటపడు. అప్పుడు నీ చర్యలకు బాధ్యుడిగా నిన్ను నువ్వు భావించవు లేదా నీ చర్యల పర్యవసానాలు నిన్ను ప్రభావితం చేయవు.

'శరీరమూ మనసూ, ప్రకృతి అంతర్గత చర్యల కారణంగా ప్రేరేపించబడి తన చర్యలు కొనసాగిస్తున్నాయని తెలుసుకున్నాక నీ నుంచి నీ కర్మ బంధాలూ విడిపోతాయి. శరీరమూ, శ్వాస, మనసూ, ఆత్మ ఇవన్నీ కర్మ అనే తీగతో వ్రేలాడుతూ ఉంటాయి. వీటిల్లో చాలా బలమైన బంధం శరీరంతో ఉండే సంబంధం. అందుకే ఎంతో వేధించే బాధ ఉన్నా సరే జనాలు శరీరాన్ని వదలడానికి ఇష్టపడరు. ఈ బంధమే ఆంతర దృష్టికి మబ్బు తెరలుగా కమ్మి తను ఈ దేహాన్ని వదిలిన తరువాత కూడా మరో దేహం ఉంటుందనే విషయాన్ని తెలుసుకోవడంలో విఫలమవుతాడు.

'దేహానికీ ఆత్మకీ ఉన్న తేడాని తెలుసుకోవడమే విచక్షణా జ్ఞానం. తన దేహానికి అతీతంగా, స్వేచ్ఛగా ఉనికిలో ఉండటాన్ని తనకు తానుగా అనుభూతి చెందడమే 'స్వీయ పరిపూర్ణత' ఒకసారి నువ్వు పూర్తిగా స్వయం పరిపూర్ణతని నీలో ప్రతిష్ఠించుకుంటే రెండుమార్గాలను ఎంచుకోగలవు. రెండూ నిన్ను మరణ ఖేదం నుండి విముక్తి కలిగించగలవు. ఒకటి నీకు నువ్వుగా లొంగిపోయే మార్గం, రెండోది యోగ సాధనా మార్గం. లొంగిపోయిన మార్గంలో నువ్వెప్పుడూ దేవుడు నీలోనే ఉన్నాడు లేదా దేవుడిలో నువ్వున్నావు అనే విశ్వాసంతో ఉంటావు. భగవత్ సంరక్షణలో ఇప్పటి జీవితం ఏ రకంగా గడుస్తుందో మరణానంతర జీవితం కూడా ఆయన సంరక్షణలోనే గడుస్తుందని అనుకుంటావు. దేవుని మీద నమ్మకం నిన్ను మరణ ఖేదం నుంచి విముక్తుణ్ణి చేస్తుంది.

'ఈ ప్రక్రియ యోగ సూత్రాల్లోని మూడవ ఆధ్యాయంలో వివరించబడింది. ఏదో ఒకరోజు మీకు క్రమపద్ధతిలో నేర్పుతాను' అన్నారు.

నేను నాకు అర్థం కాని విషయాల్ని తెలుసుకోవాలనే ఆతృతతో, 'పరమ గురుదేవులు తమ దేహాన్ని ఎక్కడ వదిలారు, ఆయన ఎక్కడికి వెళ్లారు? ఆయన ప్రవేశించిన మరో శరీరం ఏది? మీరు లామా చెక్క పళ్లాన్ని పట్టుకోవడంలో అర్థం ఏమిటి? ఆ మేఘం ఏమిటి?' అని అడిగాను.

దానికి ఆయన, 'వేరే శరీరంలోకి ప్రవేశించలేదు. ఎందుకంటే అక్కడ ఖాళీగా దేహమేదీ లేదు. మొదట తన దేహంలో నుంచి బైటికి వచ్చారు. తరువాత తన దేహపదార్థంలోని కాస్త నీటిని తప్ప మిగతా దాన్నంతటినీ పదార్థరహితంగా చేశారు. తరువాత ఆ నీటిని తాత్కాలికంగా తన ఎరుక కోసం ఒక మేఘంగా మార్చారు. మిగిలిన పదార్థమంతా శక్తిగా మారింది. అదే ఆ పళ్లెం వైపు వెళ్లింది. అందుకే ఆ పళ్లెం బరువెక్కింది. తరువాత ఆ శక్తిని ఆయన పళ్లెం నుండి ఉపసంహరించి వెనక్కి తీసుకున్నారు. క్రమంగా ఆ మేఘం మళ్లీ ఆవిర్భవించింది. అది ఘనీభవిస్తున్నకొద్దీ ఆయన దేహంగా మారింది. పరకాయ ప్రవేశానికి సంబంధించినంత వరకూ సరైన దేహం వుంటే వారు దాంట్లో ప్రవేశించి దాన్ని కదిలించేవారు. ఇది పునరుత్థాన భ్రమను సృష్టించడం మాత్రమే' అని వివరించారు.

'పరకాయ ప్రవేశం వల్ల ప్రయోజనం ఏమిటి?' అని అడిగాను.

'మన దేహాన్ని వదిలి మరో దేహంలోకి ప్రవేశించడం ద్వారా జనన మరణ గతిని తెలుసుకుంటావు. అప్పుడు నువ్వు మరణమంటే పాడైపోయిన ఇంటిని వదలడం, పుట్టుక అంటే

ఖాళీగా ఉన్న ఇంటిలోకి చేరడం అని అర్థమవుతుంది. ఈ ప్రక్రియ ద్వారా నువ్వు స్వచ్ఛమైన చైతన్యం మాత్రమే అనే విషయాన్ని అర్థం చేసుకునే అవకాశం వస్తుంది. ఇక ఆ శరీరంలో వుండాలా వద్దా అనేది నీ ఇష్టం. కర్మను గౌరవిస్తూ నువ్వు ఆ శరీరంలో కాసేపు ఉండి నీ బాధ్యతలు కానీ నీ విధులను కానీ పూర్తిచేసి ఆ తరువాత వెళ్లిపోవచ్చు. శరీరంలోకి ప్రవేశించేటప్పుడు లేదా బైటికి వచ్చేటప్పుడు నీకు ఎలాంటి బాధా ఉండదు. ఈ ప్రక్రియను నేర్చుకోవడం ద్వారా నువ్వు ఇతర ఆధ్యాత్మిక లక్ష్యాలను సాధించవచ్చు. నువ్వు నీ ప్రాణం నుండీ స్పర్శేంద్రియాల నుండీ శరీరం నుండీ ధ్యానం ద్వారా విడిపోవడాన్ని 'లఘు సమాధి' అని అంటారు. నీ సూక్ష్మ దేహాన్ని ఉపయోగించి నువ్వు ఇతరులతో సంబంధం ఏర్పరచుకొని వాళ్లకి సహాయం చేయవచ్చు, వాళ్ల రోగాలు నయం చేయవచ్చు, వాళ్లకు మార్గం చూపవచ్చు. తిరిగి నీ శరీరంలోకి ప్రవేశించవచ్చు' అని చెప్పారు స్వామీజీ.

'నువ్వు ఈ విశ్వంలోని ప్రతి భాగంలోనూ ప్రయాణించవచ్చు. భగవంతుని విరాట్ స్వరూపాన్ని తెలుసుకుని జ్ఞానాన్ని పొందవచ్చు. ఇది శాస్త్రీయమే. ఆధ్యాత్మిక శాస్త్రవేత్తగా నువ్వు ఈ విశ్వానంతా అన్వేషించి అది ఈ మానవ శరీరంతో ఎలా సమతూగుతుందో తెలుసుకోవచ్చు.'

'ఈ ప్రక్రియ సాధనలో అతి ముఖ్య విషయం ఏమిటంటే నీ మూలాధార మధ్యంలో ఉన్న శక్తి నీకు పూర్తిగా సహకరించాలి. ఈ శక్తిని ఉపయోగించుకోలేని యోగులు శరీరం నుండి బైటికి వెళ్ళే ప్రయత్నంలో మానసిక సమతుల్యాన్ని కోల్పోతారు.

స్వామీజీ ఈ విషయం గురించి మాట్లాడే ఉద్దేశ్యంలో ఉన్నారు, అయినా కూడా ఈ విషయానికి సంబంధించిన మెళకువల్ని బైటికి లాగడం కష్టంగానే ఉంది. దాంతో నేను మళ్లీ 'స్వామీజీ మీ అడుగు జాడల్లో నడవడానికి నేను ఎక్కడినుండి మొదలుపెట్టాలి,' అని అడిగాను.

'గణపతిని ఆరాధించు' అని అన్నారు.

'నేను గణపతి విగ్రహాన్ని నీళ్లు, పూలు, చందనం, ధూపం ఇలాంటి వస్తుసామాగ్రితో కర్మ కాండలలో సూచించినట్లు పూజించాలా?'

'అది పూజారుల పూజావిధానం. నమ్మకంతో నిజాయతీతో చేస్తే కాస్త ఉపయోగ పడుతుంది. కానీ యోగ సంప్రదాయంలో మూలాధార చక్రంలో కాంతి రూపంలో ఉన్న గణేశుని ధ్యానించాలి. అది సరిగా ఎలా చేయాలో ఒక రోజు నీకు చెప్తాను,' అంటూ ఆ రాత్రి నన్ను పంపించేశారు.

నేను హిందీలోకి తర్జుమా చేసిన 'పవిత్ర టిబెట్‌లో మా గురువర్యులు'ని స్వామీజీ చాలా వరకు చదివేసారు. అయినా నేను మర్నాడు సాయంత్రం ఆయన గురువు ఏ విధంగా పదార్థాన్ని శక్తిగా మార్చి తిరిగి శక్తిని పదార్థంగా మార్చిన ఘట్టాన్ని కావాలనే మళ్లీ చదివాను. నిన్న రాత్రి ఇదే ఘట్టాన్ని చదివిన విషయం స్వామీజీ మర్చిపోయినట్లున్నారు. దాంతో ఈ విషయం తిరిగి చర్చించే అవకాశం నాకు దొరికినట్లయింది. నిన్న రాత్రి లాగానే నేను ఈ పేరాను చదువుతూ ఆయన కళ్ల ప్రపంచంలోకి చూడగా వారు ఎక్కడో సుదూర తీరాలకు వెళ్లినట్లు కనిపించారు. వారు వినడం లేదని తెలిసినా నేను కావాలనే గట్టిగా చదువుతున్నాను. ఎందుకంటే ఒకవేళ నేను చదవడం ఆపేస్తే అమాంతం ఆయన తిరిగి వచ్చేస్తారేమోననే భయం. కొన్ని నిమిషాల తర్వాత కనురెప్పలను వాల్చి 'ఏమైనారూ?' అని అడిగారు.

నేను వెంటనే వెనక్కి వెళ్లి మళ్లీ చదవడం మొదలుపెట్టాను. చర్చను ప్రేరేపించే చోటికి రాగానే ఆపి 'యోగ శక్తిని సాధించడానికి యోగ సూత్రాలు మంత్రాలు, మూలికలు, తపస్సు, సమాధి లాంటి అనేక మార్గాలను సూచిస్తుంది. మరి పరమ గురువులు శక్తిని నాశనం చేయడానికి ఏ పద్ధతిని ఉపయోగించారోనని ఆశ్చర్యంగా ఉంది,' అన్నాను.

'ఆయన మంత్ర శక్తి ద్వారా చేశారు' అని వెంటనే అన్నారు. 'తనని తాను పదార్థరహితంగా చేసుకునే ముందు నా కళ్లల్లోకి చూశారు. నన్ను వశీకరణ చేయడానికే ఆలా చూస్తున్నారనుకుని 'దయచేసి నన్నలా చూడకండి, నన్ను మాయచేయకండి. నేను మీ కళ్లలోకి చూడలేను,' అన్నాను. ఆయన వివిధ రకాల ప్రక్రియల ద్వారా దేహాన్ని ఎలా త్యజించాలో చూపిస్తానని అన్నారు. ఈ సారి ఆయన మంత్రశక్తిని ఉపయోగిస్తే మరోసారి ఇంకో ప్రక్రియను ఉపయోగిస్తారు.'

'తరువాతి ప్రదర్శనలో ఒక శరీర భాగాన్నీ లేదా ఒక అవయవాన్నీ ఎలా ఉపసంహరించుకోవాలో చెప్పారు. వారికి తన మనసు మీద జీవత్వం మీద ఎంతో గొప్ప నియంత్రణ ఉంది. ఒకసారి వారి పాదాల నుండి వారిని ఉపసంహరించుకున్నారు. దాంతో వాది పాదాల్లో జీవం పోయి నిశ్చలంగా ఉన్నాయి. మొత్తం దేహాన్ని ఉపసంహరించుకునేసరికి అది ఒక శవంలాగా పడి ఉంది. నాదగ్గర ఎలాంటి ఆధునిక పరికరాలు లేకున్నా వారి నాడి కొట్టుకోవడం లేదనీ, శ్వాస క్రియ జరగడంలేదనీ గమనించాను.

'ఆయన తన దేహాన్ని వదిలే ముందు ఒక లామాని విడిగా కేవలం కదలికలు మాత్రం ఉండేటట్లుగా ఉంచారు. ఆయన తన శరీరం నుండి పూర్తిగా ఉపసంహరించుకున్న తక్షణం వారు లామా శరీరాన్ని ఒక శబ్ద పరికరంగా ఉపయోగించుకుని తన శరీర భాగాల గురించి వారి దేహ స్థితి గురించి  మాట్లాడారు. తర్వాత తన సొంత శరీరం తన మనసుతో సంబంధాన్ని ఏర్పరచుకుని ఏ విధంగా శ్వాసిస్తుందో వివరించారు. ఈ ప్రదర్శన తరువాత వారు పతంజలి సూత్రాలతో కూడిన పరకాయ ప్రవేశ విధానాల గురించి వివరించారు.

'భౌతిక శాస్త్రవేత్తలు తమ ప్రయోగశాలలో ప్రయోగాలు చేసి వివరించినట్టు యోగులు ప్రదర్శనల ద్వారా బోధిస్తారు. నువ్వు సజీవంగా ఉంటూనే నిర్జీవంగా మారతావు. అప్పుడు మాత్రమే నీకు చావు పుట్టుకల చలనసూత్రాలు అర్థమౌతాయి!'

నేను తిరిగి నా హిందీ అనువాదం చదివి వినిపిస్తూ, 'నా పరమ గురువుని కలవడం ద్వారా ఈ జ్ఞానాన్ని తెలుసుకోవడం వల్ల నేను టిబెట్‌కి వచ్చిన కార్యం నెరవేరింది,' అని ఉన్నంత వరకూ చదివి ఆపాను. నా మనసులో తలెత్తిన సందేహం అడగకుండా ఉండలేకపోయాను. 'మీ సోదర శిష్యుడు రాజా భవాల్‌ని కలుసుకోవడానికి కాదా మీరు వెళ్లింది?' అని అడిగాను.

'అవును, పైకి అలానే కనబడుతుంది. కానీ నన్ను మా పరమగురువర్యుల వద్ద పరకాయ ప్రవేశ విద్య నేర్చుకోవడానికి పంపినట్లు అనిపిస్తోంది. అయినా నేను నా గురుభ్రాత గురించి అడిగాను.'

'వారేమన్నారు?'

ఆయన భవాల్ రాజు గురించి చెప్పారు– 'భవాల్ రాజు మన సంప్రదాయంలో ఒకరుగా ఎన్నో జన్మల నుంచీ కొనసాగుతూ వస్తున్నారు. ఈ జన్మలో భవాల్ రాజవంశంలో పుట్టి హత్యకు గురై, మళ్లీ మరణం నుండి పునర్జన్మ ఎత్తి ఛిన్నమస్తా దేవి ఆవాహన కొరకు వినియోగింపబడ్డారు. ఈ ఆవాహన ప్రక్రియ పూర్తి కాగానే ఆయన అదే శరీరంలో ఉండాల్సిన అవసరం ఏమీ లేదు. కనుక నేను డార్జిలింగ్ దగ్గరి గుహలో నా గురువుగారితో కూర్చున్నప్పుడు ఆయన తన శరీరాన్ని వదిలి వెళ్లిపోయారు. ఒక ప్రాజ్ఞుడిలా చావు పుట్టుకల ఆవలి తీరానికి వెళ్లిపోయారు. కైలాస పర్వతం వద్ద ఉన్న మా ప్రాచీన మహర్షులు ఉంటూ వచ్చిన గుహలోనే ఆయన నివసించేవారు. అయితే దేశ కాలాల ఉనికి ఆయనను ఏమాత్రం అడ్డగించదు. హిమాలయాల్లో సంచరిస్తూ సాంప్రదాయాల మార్గంలో వెనకబడ్డ సాధకులకి మార్గనిర్దేశం చేస్తూ వుంటారు.'

ఈ మాటల సందర్భంలోనే స్వామీజీ ఆ ప్రాచీన మహర్షుల గుహ గురించి ప్రస్తావించారు. ఆంగీరస ముని ద్వారా ఇక్కడ ఒక ఆశ్రమం నిర్మింపబడింది. అక్కడే శ్రీకృష్ణపరమాత్మ పన్నెండేండ్లు తపస్సు నిర్వహించాడు. ఈ విషయం హరివంశ పురాణంలో ఉంది. టిబెటన్స్ ఈ గుహను 'ఛోకూ గొంఫా' అంటారు.

నా జీవితంలో ఈ అధ్యాయం గురించి స్వామీజీ నాకు చెప్పిన విషయాలు నా జీవితంలో ఎంతో అమూల్యమైన క్షణాలు. తమ పరమగురువుకి సంబంధించిన ఓ అనుభవాన్ని నాకు బోధించారు. అది సాధన చేయడానికి నాకు ఒక యుగం పట్టవచ్చు. కానీ ఆ వేసవి సాయంత్రాలలో ఆయన నా మనోక్షేత్రంలో వేసిన బీజాలు నిరంతరాయంగా పెరిగే జ్ఞాన భాండాగారాలు. 1999 లో మేము ఆ ప్రాచీన మహర్షుల గుహ దగ్గర నుంచున్నప్పుడు అక్కడ భూమికీ స్వర్గానికీ మధ్యన ఉన్న గోడ అదృశ్యమైందేమో అని అనిపిస్తుంది. భోలేబాబా తమ పరమ గురువర్యులతో రెండున్నర సంవత్సరాలు ఉన్నారు. భోలేబాబా ఈ సమయంలో గుడారీ బాబా, అఘోరీబాబా, సోంబారీబాబా, స్వామీ శివానంద, తన గురుదేవులు బాబాజీ వద్ద నేర్చుకున్న ఆధునిక యోగ పద్ధతులన్నింటినీ ఒకే త్రాటి మీదికి తీసుకురావడానికి పరమగురువు ఎంతగానో సహాయ పడ్డారు. ఆయనకు పరకాయ ప్రవేశ ప్రక్రియ మాత్రమే కాదు, సౌర శాస్త్రం మీదా, శ్రీ విద్య మీదా కూడా మంచి పట్టు ఉంది.

స్వామీజీ తన పుస్తకంలో వ్రాసినట్లు వారు భారతదేశానికి తిరిగి వెళ్లిపోవడానికి కొద్దిరోజుల ముందు తన పరమ గురువుగారితో ఓ చిన్న విషయాన్ని పంచుకున్నారు. 'నేను గుహ బైట కూర్చుని నా అనుభవాలన్నీ వ్రాసుకునే డైరీ గురించి ఆలోచిస్తున్నాను. మెరుపులా ఒక్కసారిగా నా మదిలో నా డైరీయే ఇక్కడ ఉండి ఉంటే నా అనుభవాలలో కొన్నింటిని వ్రాసుకునేవాడిని కదా అని అనిపించింది. నా పరమగురువు నవ్వి నన్ను తన వద్దకి రమ్మని సైగ చేశారు. 'నీకోసం ఆ డైరీ తీసుకు రాగలను. నీకది కావాలా?' అని అడిగారు. ఇలాంటివి నాకు గొప్ప అద్భుతాలేమీ కావు. ఇలాంటి విషయాలెన్నో నేను చవిచూసాను.

నేను 'సరే, గురూజీ, వీలైతే కొన్ని పెన్సిళ్లు కూడా ప్రసాదించండి!' అని బదులిచ్చాను. ఉత్తర భారత దేశంలోని నైనిటాల్‌లో భావాలీ దగ్గరలో ఉన్న ఒక శానిటోరియంలో నా డైరీ వదిలేసి వచ్చాను. హఠాత్తుగా 475 పేజీలు గల పొడవాటి డైరీ నా ముందు ప్రత్యక్షమైంది. నా మనసు ఆనందంతో నిండిపోయింది. ఈ సంఘటన ఆశ్చర్యం కలిగించలేదు. వారి విషయంలో ఇవన్నీ సర్వసాధారణం. 'మీ నుంచి ఏదైనా ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పొందడానికే ప్రాముఖ్యతనిస్తాను' అని విన్నవించాను. దానికి వారు నవ్వి 'నేనది ఎప్పుడో అందజేశాను నీకు. నువ్వు చేయాల్సిందల్లా దానికి ఎలాంటి అడ్డంకులూ లేకుండా నిర్లక్ష్యం లేకుండా దక్కించుకోవడమే! నా దీవెనలెప్పుడూ నీకు ఉంటాయి. లాసా వెళ్లి అక్కడి నుండి భారత దేశానికి తిరిగి వెళ్లు.' అని అన్నారు.

ఆ రకంగా భోలేబాబా తన పరమ గురువుగారితో ప్రయాణాన్ని ముగించి తిరిగి తన గురువు బాబాజీ దగ్గరకి వచ్చేశారు.

## అధ్యాయం 5

# శంకరాచార్య

భోలేబాబా 1947 సెప్టెంబరు నెల మధ్యలో భారతదేశానికి తిరిగి వచ్చేశారు. తూర్పు ఉత్తరప్రదేశ్‌లోని గోరఖ్‌పూర్ జిల్లాలో ఆయన తన గురువుగారిని కలుసుకున్నారు. బాబాజీ నేపాల్‌లోని ముక్తినాథ్‌కి బయలుదేరారు. బాబాజీ ఆయనతో కొద్దిరోజులు ఉండి ఇటీవల జరిగిన సాహసోపేతమైన సంఘటనలను సంక్షిప్తంగా చెప్పారు. బాబాజీ, భోలే తన గురువుగారిని కలుసుకున్నందుకు సంతోషపడ్డారు. కానీ పైకి ఏమీ ప్రత్యేకంగా చెప్పలేదు.

తన శిష్యుడు సంతృప్తిగా ఉన్నాడని అర్థమైంది. చెప్పాలంటే చాలా సంతృప్తిగా ఉన్నాడు. అయితే ఈ సంతృప్తి నిర్లక్ష్యంగా మారకూడదు. తెలుసుకోవడం అనేది ఒక విషయం. కానీ ప్రత్యక్షజ్ఞానం మరో విధమైనది. బాబాజీ దృష్టిలో సాధకుడు ఎప్పుడూ తను నేర్చుకున్న దానిని ప్రత్యక్షంగా అనుభవించిన తరువాత మాత్రమే తృప్తి చెందాలి. ప్రత్యక్ష జ్ఞానం వచ్చిన తరువాత కూడా సాధకుడు దిగజారిపోతాడనే విషయం కూడా బాబాజీకి తెలుసు. ఒక్క నిరంతర సాధన మాత్రమే సాధకుణ్ణి పరిపక్వంగా స్థిరంగా ఉంచుతుంది. అది ఎంత గొప్ప, ఎంత లోతైన అనుభవమైనా సరే, అది వైరాగ్యమనే పాత్రలో మాత్రమే నిలుపుకోగలం! లేకపోతే సాధకుడు ఎంతో గొప్ప పరిపూర్ణతను సాధించినా, యోగంలో ఉచ్ఛ స్థితికి చేరుకున్నా తన ఆధారాన్ని కోల్పోవచ్చు. సాధకుడికి ప్రణాళికతో కూడిన అభ్యాసమూ, సంపూర్ణమైన నిష్పాక్షికతా అనే రెండు బలమైన రెక్కలుంటేనే అనంతమైన ఆధ్యాత్మిక జగత్తులో విహరించగలుగుతాడు.

దాంతో బాబాజీ తన శిష్యుడు భోలేని దగ్గరకు పిలిచి, 'ఇప్పుడు నువ్వు తీవ్రమైన సాధనకు అంకితమవ్వాలి. నీ హృదయాన్ని పరిశీలించుకో! నీ సాధన నుంచి నువ్వు పొందిన ఆ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ఎలాంటి కష్టమూ లేకుండా ఎక్కడ వెచ్చిస్తావో పరిశీలించుకో. నిరపేక్షమైన ప్రశాంతమైన సమతా స్థితిలో నిన్ను నువ్వు ప్రతిష్ఠించుకోకపోతే పేరు ప్రఖ్యాతుల కోసం ఇతర ప్రాపంచిక విజయాల కోసం నీ ఆధ్యాత్మిక సంపద వెచ్చించబడి నువ్వు విపరీతమైన ఒత్తిడికి లోనవుతావు. నా దీవెనలు ఎప్పుడూ నీకు ఉంటాయి. వెళ్లు! నర్మాదా నది ఒడ్డున నివసించు. సాధనకి అంకితమవ్వు. అప్పుడప్పుడూ గ్రామాలనూ పట్టణాలనూ సందర్శించు. ప్రజలకు సేవ చేస్తూ మార్గం చూపు,' అంటూ కొన్ని ఆదేశాలిచ్చి బాబాజీ నేపాల్ వెళ్లిపోయారు.

నర్మదా నది మధ్య భారతదేశం గుండా ప్రవహిస్తూ ఉంటుంది. ఆ వైపుగా ప్రయాణిస్తూ బాబాజీతోనూ ఇతర సాధుసత్సంగంలోనూ భోలే పవిత్రమైన ఖజరాహోలో ఎన్నో శీతాకాల సమయాలు గడిపారు. తన ఏడేళ్ల ప్రాయంలో ఖజరాహోలో దేవీమాత దర్శనమిచ్చి దీవించిన పవిత్ర స్థలంలో, అరవైనాలుగు యోగినులు ఉన్న ఆ ప్రాంగణంలో భోలేబాబా కొద్దిరోజులు

ఉండదలిచారు. అక్కడి నుంచి ఆయన మహాకాలుని పవిత్ర పుణ్యక్షేత్రమైన ఉజ్జయినీకి చేరి మళ్లీ అక్కడ ప్రయాణాన్ని నిలిపివేశారు. ఎందుకంటే ఆయన తన బాల్యంలో ఒకసారి బాబాజీతోనూ మరోసారి అఘోరీ బాబాతోనూ ఈ క్షేత్రాన్ని ఆయన సందర్శించారు. ఇప్పుడు ఆ ప్రదేశాలన్నిటినీ మరోసారి దర్శించుకుని మరోసారి ఆ పాత రోజుల్ని గుర్తు చేసుకోదలిచారు.

ఉజ్జయినీకీ, మన సంస్కృతికీ ఒక ప్రత్యేకమైన అనుబంధం ఉన్నదనే విషయం నాకు అప్పటివరకూ తెలీదు. ఏడు పవిత్ర పుణ్య క్షేత్రాల్లో ఉజ్జయినీ ఒకటనీ, ప్రఖ్యాతిగాంచిన పన్నెండు మహాశైవ క్షేత్రాలలో మహాకాలుని క్షేత్రం కూడా ఉందనీ మాత్రమే తెలుసు. కానీ 1992 వేసవిలో అనుకోని రీతిగా దొర్లిన సంభాషణలో స్వామీజీ దూర్వాస మహర్షి చిరంజీవి అనీ, ఆయనకి మహాకాలుని పవిత్ర క్షేత్రంతోనూ ఉజ్జయినీ చుట్టూ ఉన్న మిగతా వందలాది పుణ్య క్షేత్రాలతోనూ గొప్ప అనుబంధం ఉందనీ, ఆ ఆలయాలను ఆయన సంరక్షిస్తుంటారనీ తెలిసింది.

పెన్సిల్వేనియాలో స్వామీజీ ప్రఖ్యాతి గాంచిన రామాయణాన్ని సంస్కృతం నుంచి ఆంగ్లంలోకి తర్జుమా చేసినప్పుడు మా మధ్య ఈ సంభాషణ చోటు చేసుకుంది. పుస్తక పరిచయంలో శ్రీరామచంద్రుని జన్మస్థలమైన ఆయోధ్య నుంచి శ్రీలంక వరకూ ఆయన చేసిన తీర్థయాత్ర అనుభవాల గురించి వ్రాశారు. సంస్కృత పదాల విషయంలో నన్నడిగి సరిచేసుకోమని ఎడిటర్ కె. జెన్‌డ్రాన్‌కి సూచన చేశారు. అన్నీ సరిగ్గానే ఉన్నాయి కానీ ఒక సంస్కృత పదం దగ్గర నేను ఆగిపోవలసి వచ్చింది. స్వామీజీ దూర్వాస మహామునిని 'దురుసుగా మాట్లాడే' అనే విశేషణంతో ఉదహరించారు. మన ప్రాచీన సాహిత్యం ప్రకారం దూర్వాస మహాముని పరమశివుని ఆంశతో జన్మించినవారు. ఆ మహామునిని ఇలాంటి విశేషణంతో ఉదహరించడం సరికాదని ఎర్ర పెన్సిల్‌తో సున్నా చుట్టాను.

నేను స్వామీజీ గదిలో ఉన్నప్పుడు డాక్టర్ జెన్‌డ్రాన్ వచ్చి సరిచేసిన దాన్ని చదవగా అలాంటి మార్పు అవసరం లేదని అనడం నేను విన్నాను.

స్వామీజీ ఆదే పదాన్ని ఉపయోగించమని చెప్పగా ఆమె 'స్వామీజీ పండిట్ గారు 'దురుసు నోరు గల' అనే విశేషణం మునీశ్వరునికి సరికాదని అన్నార'ని చెప్పారు. స్వామీజీ నా వైపు చూస్తూ ఉన్నట్టుండి, 'ఏం? అందులో తప్పేముందీ?' అన్నారు.

నేనేం మాట్లాడకపోయేసరికి, 'లేదు, లేదు, నీకు వచ్చిన ఇబ్బందేమిటో చెప్పు?' అని అడిగారు.

'దూర్వాసుడు బ్రహ్మర్షి. మహానుభావులు, గొప్ప ఋషి. అలాంటి మహర్షి కోపిష్టి నోరుగల వారెలా అవుతారు?' చెప్పాను ప్రశాంతంగా.

'మరి చిన్న చిన్న విషయాలకే పిచ్చివాడై పోయి ప్రజల్ని శాపాలకు గురిచేసిన కథల సంగతేంటి?' అని ఆరిచారు స్వామీజీ.

'దూర్వాసుల వారికి జాలితో పాటే కోపం వచ్చేది, వ్యక్తిగత కారణాల వల్ల కాదు. కొంత మందిని శపిస్తున్నట్లుగా తిట్టినట్లుగా పైకి కనబడినా వారు తమ చర్యల ద్వారా కర్మాచరణను వేగవంతం చేసి తాము ప్రేమించే వారిని విముక్తం చేసేవారు. ఇంకా చెప్పాలంటే పేదలనూ, అమాయకులనూ, నిస్సహాయుల మీద ఆయన ఎన్నడూ తన కోపాన్ని ప్రదర్శించలేదు. ఆయన కోపానికి గురైనవారు కూడా ఆ కోపాన్ని శాపంగా కాక వరంగా భావించేవారు!'

ఆయన కళ్లలోని ఎఱ్ఱజీరలు తగ్గినప్పటికీ స్వామీజీ ఇంకా కోపంగానే ఉన్నారు. 'కానీ ఆయన ఎక్కువగా తినేవారు, యోగులు ఎక్కువగా తినడం మంచి లక్షణం కాదు,' అని అన్నారు.

నేను మృదువైన స్వరంతో 'స్వామీజీ ఆయనెప్పుడూ దూర్వాస గడ్డి తప్ప మరేమీ తినలేదు. అందుకనే ఆయనను 'దూర్వాసుడు' అని అంటారు. ఆయన బుధుడి అవతారం. దయతో ఎవరింట్లోనైనా ఏమైనా తిన్నా దాన్ని తనలో ఉన్న అంతరాగ్నికే ఆహుతి చేసేవారు. ఈ క్రియ తన భక్తుల మంచి కోసం ఈ సర్వ సృష్టి సంక్షేమం కోసం చేసేవారు. ఈ సత్యం పురాణాల్లో చక్కగా చెప్పారు' అన్నాను.

అప్పుడు స్వామీజీకి కోపం పూర్తిగా మాయమయింది. 'అయితే అక్కడ ఆ సంస్కృత పదానికి బదులు ఏ పదం వాడదాం?' అని అడిగారు.

'బహుశా 'క్షణికావేశపరుడు' అని వ్రాయవచ్చు' అన్నాను.

డాక్టర్ జెంద్రాన్ వైపు తిరిగి 'పండిట్‌జీ గారు ఆ పదాన్ని క్షణికావేశపరుడుగా మార్చమని చెప్పారు. అలాగే మారుద్దాం!' అన్నారు. నాతో 'దూర్వాస మహాముని తమరికి ఒక ఆరాధకుడు ఉన్నాడని చెబుతాను. ఆయన తప్పకుండా చాలా సంతోషిస్తారు' అన్నారు. డాక్టర్ జెన్‌ద్రాన్ వైపు తిరిగి నేనింకా ఏమైనా సవరణలు చేశానా అని అడిగి, లేదని ఆమె చెప్పిన తరువాత 'మంచిది, అన్ని మార్పులనూ సరిచేసి పూర్తి చేయండి!' అని అన్నారు.

స్వామీజీతో ఉన్న ఈ పదహారేళ్ల సాంగత్యంలో వారి మనో భావాలను చదవడం నేర్చుకున్నాను. ఇప్పుడు నాకు స్పష్టంగా వారు దుర్వాస మహాముని గురించి మాట్లాడడానికి సుముఖంగానే ఉన్నారని అర్థమైంది. దాంతో 'స్వామీజీ! దూర్వాస మహాముని శ్రీరాముని మరణానికీ, వారి తమ్ముల మరణానికీ ఒక నిమిత్తంగా మారారు. అలాగే శ్రీకృష్ణ పరమాత్మకీ, ఆయన సమస్త వంశావళి మరణానికీ కూడా ఒక నిమిత్తంగా ఎందుకు మారినట్టు?' అని అడిగాను.

స్వామీజీ 'దూర్వాసులు అనంత కాలంలో ఎప్పుడో కలిసిపోయారు. పరిశోధకులకు మార్గం చూపడానికి ఆయన మునిగా ప్రత్యక్షమౌతారు. ఆయన శివునితో కలిసి విశ్వాంతరాళాలలో వ్యాపించిన అగ్నిలాగా విధ్వంసాన్ని కొనసాగిస్తారు. ఆయన త్రికాల స్వామాజ్యానికి అతీతంగా వుంటారు. ఆయన చావును జయించి కాలానికి అతీతంగా ఉన్నారు. రాముడూ కృష్ణుడు వంటి వారిని మృత్యువు తాకను కూడా తాకదు. ఈ దేహాన్ని త్యజించడానికి వారికి ఒక సాకు కావాలి. దాన్ని దూర్వాస మహాముని అందించారు. మరణానికీ, ఈ దేహాన్ని విసర్జించడానికీ మధ్య తేడా తెలుసుకోవాలి. రాముడూ కృష్ణుడూ మరణించకుండానే తమ దేహాన్ని వదిలారు. అలా చేయడం పైకి అజ్ఞగా కనబడినప్పటికీ వారు దూర్వాస మహాముని కోరికను తీర్చారు.'

'దైవ ఆచార్యులైన నారదులు హిమాలయాలలోని బదరీనాథ్ పుణ్యక్షేత్రంలో ఉన్నట్టే ఉజ్జయినీలో దూర్వాస మహర్షి ప్రధానంగా నివాసం ఉండేది. ఉజ్జయినీలో దూర్వాసులవారు ప్రధానాచార్యులు. ఉజ్జయినీలో ప్రాజ్ఞులూ సాధకులూ అనేకమంది వుంటారు. వీళ్లలో దూర్వాస మహామునిని తెలిసిన వారికీ తెలియని వారికీ కూడా ఆయనే సంరక్షకుడు.

అప్పుడు స్వామీజీ తాను నర్మదా నదివెంట వెళ్తున్నప్పుడు తన ప్రయాణం ఉజ్జయినీలో కొంతకాలం ఎందుకు ఆపవలసి వచ్చిందో చెప్పడం మొదలుపెట్టారు. షిప్రా నది ఒడ్డున పధ్నాలుగు వందల సంవత్సరాల క్రితం భర్తృహరి రాజు తాను తన రాజ్యాన్ని వదిలేసి గోరఖ్‌నాథ్‌కి శిష్యుడిగా చేరినప్పుడు భూగృహంలో ఓ గుహను నిర్మించాడు. అది బాబాజీకి ఎంతో ఇష్టమైన ప్రదేశం. ఇప్పుడు అది హరిద్వార్‌లో ఉన్న సాధుసమూహం ఆధీనంలో ఉంది. వాళ్ల ప్రధాన కార్యాలయం హరిద్వార్‌లో ఉంది.

భోలే బాబా అక్కడికి దగ్గరలో గుళ్లలో ఉన్న స్వామీజీలను కలవడానికి ఈ గుహలో సుమారు ఒక వారం ఉన్నారు. ఇక్కడి యోగులు భోలేబాబా పుట్టకముందు నుంచీ ఉన్న అఘోరీ

బాబా మార్గాన్ని ఆచరిస్తూ వుంటారు. ఈ యోగులు వాళ్ల రాత్రి సమయాన్ని నదీ తీరంలోని స్మశానానికి దగ్గరగా ఉన్న వికారనాథ భైరవ అనే చిన్న గుడిలో మనిషి అంతర జ్వాల గురించి నిగూఢమైన సౌర శాస్త్ర జ్ఞానం గురించి చర్చిస్తుండేవారు. వాళ్లతో భోలే బాబా కూడా జతగూడేవారు.

స్వామీజీ చెప్పినట్లు యోగ, తాంత్రిక సంప్రదాయాలలో అఘోరా సంప్రదాయం చాలా వింతగా ఉండేది. ఈ ప్రపంచంలోని రహస్య నగరాలలో ఉజ్జయినీ ఒకటి. యాత్రికులు మహాకాల మందిరాన్ని సందర్శించుకుంటారు. ఇప్పుడు దాని చుట్టూ నగరం అల్లుకుపోయింది. కానీ దీనికి దూరంగా నగర పొలిమేరలో ఉన్న వికారనాథ భైరవ ప్రదేశం, రాత్రిపూట సిద్ధులు కలుసుకోవడంతో జీవం పోసుకుంటుంది. అక్కడ చేరి వాళ్లు చేసే చర్చలన్నీ కొంతమందికి కల్పనగానూ, మరి కొంతమందికి అర్థంలేని మాటలుగానూ అనిపిస్తాయి. కానీ కొంతమందికి అవి అసాధ్యమైన తాత్విక రహస్యాలుగా కనిపిస్తాయి. ఈ సిద్ధులు వివిధ రకాలైన లోకాల గురించి మాట్లాడుకుంటారు. స్వర్గం గురించి నరకం గురించి, మరణం తరువాత ఆత్మ స్థితి గురించీ బలహీనమైన ఆత్మలను భూమిపైకి లాగి వాటితో మానవులు లేదా మానవేతర మాధ్యమాలతో ఏ విధంగా మాట్లాడాలీ అనే విషయాలు మాట్లాడుకుంటూ ఉంటారు. కొంతమంది సాధువులు ఇతరుల మెదళ్లను చదవగలుగుతారు కానీ తమ స్వంత మెదడును చదవలేరని అంగీకరిస్తారు.

ఇక్కడే వికారనాథ్ భైరవ గుడి దగ్గరే భోలేబాబా ఒక తాంత్రిక ఆచార్యుణ్ణి కలిశారు. వారు ఒక్క తాత్విక సంబంధమైన ప్రశ్నకి తప్ప మరే ప్రశ్నకైనా సమాధానం చెప్పగలిగేవారు. అతని దగ్గర ఎప్పుడూ సారా ద్రవం ఉండేది. తరచూ గంజాయిని కూడా పీలుస్తుండేవాడు. చెవిటివాడు. చాలా మురికిగా ఉండేవాడు. చాలామందికి అతను అర్థం కాడు. అయినప్పటికీ అతడంటే అందరికీ ఎంతో ఆకర్షణ! కారణం, అతడు భవిష్యత్తునూ, ప్రాపంచిక విషయాలనూ అద్భుతంగా చెప్పానే, ఇన్ని ప్రజ్ఞలున్నప్పటికీ తాను చాలా నికృష్టుణ్ణని ఒప్పుకునేవాడు.

ఆయనను కలిసే అజ్ఞానులు ఆయనకు తాంత్రిక ఆచరణవల్ల వచ్చే బాధను అర్థం చేసుకోలేరు. కానీ ఒకరోజు రాత్రి స్వామీజీతో కొన్ని సంవత్సరాల క్రితం అతను ఒక అల్ప స్థాయికి చెందిన తాంత్రికాచార్యుడి ద్వారా 'కర్ణ పిశాచి' విద్యను నేర్చుకున్నానని చెప్పాడు. తాంత్రిక అభ్యాసంలో కర్ణపిశాచినీ అంటే దాన్ని సాధన చేసే వ్యక్తికి అడిగిన ప్రతి ప్రశ్నకూ చెవిలోకి వచ్చి గుసగుసగా సమాధానం చెప్పే శక్తి. ఈ శక్తిని సాధన చేసి సాధించగలిగాడు. కానీ దానివల్ల కష్టాలను కొని తెచ్చుకుంటున్నానని అతను గ్రహించలేక పోయాడు.

మొదట్లో ఇది చాలా అద్భుతంగా ఉండేది. అడిగిన ప్రతిదానికీ సమాధానం చెప్పడంతో ప్రజలు ముగ్ధులయ్యేవారు. అయితే ఆ శక్తి నిలుపుకోవాటంటే ప్రతిరోజూ సాధన చేయాల్సిందే. దాంట్లో భాగంగా శక్తిని తన చెవిలోకి ఆవాహన చేస్తూ ఆ పిశాచికి మద్యం, మాంసం అందించాలి, అదీ తాను వాటిని సేవించడం ద్వారా! ఆకలిగా లేనప్పుడు మాత్రమే ఆ శక్తి పని చేస్తుంది. ఎంత ఎక్కువగా ఆ శక్తిని ఉపయోగిస్తే అంత ఎక్కువగా అది ఇతని దేహాన్ని వాడుకుంటుంది. మొదట్లో ఆ పిశాచశక్తి ఇతడి ఆధీనంలో ఉండేది. కానీ క్రమక్రమంగా అతడిపై ఆధిపత్యం వహించడం మొదలుపెట్టింది. దాంతో ఆమెని తృప్తిపరచడానికి వేరే దారిలేక ఆమె కోరికని అనుసరించి త్రాగటం, గంజాయి పీల్చడం, మాంసం తినడం చేయాల్సి వచ్చేది. పైపెచ్చు ఎవరూ ఎలాంటి ప్రశ్నలూ అడగకపోయినా దానికదే వచ్చేసి ఇతరుల గురించి ఊరికే చెవిలో అరుస్తూ ఉండేది. ప్రొద్దుగూకులా చెవిలో జరిగే ఈ రొదకు అతనికి నిద్ర పట్టేది కాదు. అంతే కాకుండా ఇతరులు చెప్పేదీ బైట నుంచి వచ్చే శబ్దాలూ సరిగా వినపడేవి కావు. ఇతనికి కానీ ఇతనికి నేర్పిన గురువుకి గానీ ఈ శక్తిని ఎలా నిరోధించాలో తెలియదు.

ఈ దురదృష్టవంతుడైన సాధువు కనబడిన ప్రతి సాధువునీ సహాయం కోసం అభ్యర్థించడం మొదలుపెట్టాడు. అతని మీద జాలితో వాళ్లందరూ ఒక పథకం వేశారు. వాళ్లతో ఉన్న 'దైతావాలా' మహారాజ్ అనే గొప్ప తాంత్రికోపాసకుడు ఈ ప్రక్రియకి నాయకత్వం వహించాడు. ఒకరోజు ఉదయం వీళ్లందరూ కలిసి బలవంతంగా ఇతని జీవితాన్ని నియంత్రిస్తున్న ఆ శక్తి అభీష్టానికి వ్యతిరేకంగా ఇతని శిరస్సుకి క్షవరం చేశారు. ఇంకా ఆ శక్తి అభీష్టానికి వ్యతిరేకంగా ఇతన్ని బలవంతంగా షిప్రా నదిలోకి లాగి స్నానం చేయించి దగ్గరలోఉన్న కాలభైరవస్వామి గుడికి లాక్కుని వెళ్లారు. అక్కడ దైతావాలా మహారాజ్ అతని శరీరం నుండి ఆ శక్తిని బైటికి లాగి కాలభైరవుని పాదాల చెంత పడేశారు. అదే సమయంలో భోలేబాబా ఒక ప్రత్యేకమైన అగ్ని సంస్కారం 'విరాజహోమం' (శరీరం, మనసూ, చైతన్యం అన్నిటినీ అగ్నికి అర్ఘ్యంగా సమర్పించే సంస్కారం) మొదలుపెట్టారు. అది పూర్తవగానే ఆ తాంత్రికుడు తన భయంకరమైన బాధ నుండి బయటపడ్డాడు. అయినప్పటికీ దాని నుండి కోలుకోవడానికి కొన్ని నెలలు పట్టింది.

చాలా రోజుల తరువాత భోలేబాబా మరో ఆసక్తికరమైన విషయాన్ని ఎదుర్కొన్నారు. ఉజ్జయినీ లోపల బైట ఉన్న దేవాలయాలను సందర్శిస్తుండగా ప్రతిచోట ఒక సాధువు పదేపదే కనబడుతున్నారని గమనించారు. రెండు మూడుసార్లు ఈ విషయం గమనించిన తరువాత భోలేబాబా అక్కడున్న పూజారులనూ, సాధువులనూ, గుడిని ఊడ్చేవాళ్లనూ, భిక్షాటన చేసేవాళ్లనూ ఆ సాధువెవరని అడిగారు. అందరూ తెలీదని చెప్పారు. చివరికి భోలేబాబా సాధువునే అడిగేసరికి 'నేనిక్కడ నివసిస్తున్నాను, పనిచేస్తున్నాను' అని సమాధానమిచ్చారు.

ఒకరోజు గుహలో రాత్రి విశ్రాంతి తీసుకుంటుండగా భోలేబాబా తీవ్రంగా ఆలోచించసాగారు. 'ఈ సాధువు ప్రతిచోటా ఎలా ఉండగలరు? ఆయన సాధువే అయి ఉంటే ఎక్కడో అక్కడ నివసిస్తూ సాధన చేస్తూ వుండాలి. అతను బిచ్చగాడైతే ఏదో ఒకచోట బిచ్చమెత్తుకుంటూ వుండాలి. ఎందుకంటే అతడు వేరే చోటికి వెళ్తే అక్కడి వాళ్లు ఒప్పుకోరు లేదా కొడతారు. ఉజ్జయినీలోని ప్రతి గుడీ అతనికి తెలిసినట్లుగానే ఉంది కానీ ఎవ్వరికీ ఇతనెవరో తెలీదు. ప్రతి గుడిలో జరుగుతున్న కార్యక్రమాలను చూస్తున్నాడే తప్ప వాటిల్లో పాల్గొనడం లేదు. ఇలా ఆలోచిస్తుండగా వెంటనే వారికి ఒక మెరుపులాంటి ఆలోచన వచ్చింది. ఒకవేళ ఆయన మారువేషంలో ఉన్న దూర్వాస మహాముని అయి ఉండవచ్చేమో! బాబాజీ ఒకసారి ఉజ్జయినీ దూర్వాస మహాముని ప్రధాన నివాసమనీ, పురాణాల్ని బట్టి చూస్తే ఈ సాధువులెవరూ ఆయనని గుర్తించనంతవరకూ మారువేషంలోనే వుంటారనీ చెప్పారు. రేపు కూడా ఆయన నాకు తారసపడొచ్చు. అప్పుడు ఆయన దూర్వాసులవారే అయితే సరిగ్గా నేను గుర్తిస్తాను అనుకున్నారు భోలేబాబా.

హఠాత్తుగా మరో ఆలోచన భోలేబాబా మనసులో, 'ఆ వృద్ధ సాధువును ఈ గుహ దగ్గర తప్ప ప్రతి దేవాలయం దగ్గరా చూశాను. బహుశా నేను ఆ దేవాలయాలన్నింటి దగ్గరికీ ఒక భక్తుడిలాగా వెళ్లాను. కానీ ఈ గుహని మాత్రం నేను పుణ్యక్షేత్రంగా కాకుండా నివాసప్రాంతంగా భావించి వస్తున్నాను. కానీ ఈ గుహ కనబడుతున్నట్లుగా ఒక ఆవాస ప్రాంతం మాత్రమే కాదు, అంతకన్నా ఎక్కువ. గురు గోరఖ్‌నాథ్, భర్తృహరి, ఇంకా ఎందరో సిద్ధులు ఇక్కడ చేరి వారి సాధనని కొనసాగించారు. ఇక్కడి గుహలో ఒక గది నుండి వందల మైళ్ల దూరంలో ఉన్న హరిద్వార్‌లోని గంగానది ఒడ్డుకి వెళ్లే రహస్య మార్గం వుందని పురాణాల్లో ఉంది. సంప్రదాయంలో భాగంగా నేను ఈ గుహని వదిలి వెళ్లి గురువులకీ, సాధకులకూ పరమగురువైన దూర్వాస మహర్షి అనుమతితో మళ్లీ గుహలోకి ప్రవేశించాలి' అనే ఆలోచన తట్టింది.

అలా అనుకుని భోలే తన ఫ్లాష్ లైటు తీసుకుని గుహ బైటికి వచ్చారు. అక్కడ గుహ బయట దగ్గరలోని చెట్టు క్రింద ఆ వృద్ధ సాధువు కూర్చుని ఉన్నారు. ఆయన దగ్గరకి వెళ్లి భోలేబాబా 'హే కరుణా మూర్తీ! ఆర్తత్రాణ పరాయణా! మీకివే నా ప్రణామాలు' అని స్తుతించారు. ఆయన ఈ పదాలు వినగానే వారి చేతులు వాటంతటవే ఒక యోగి కూర్చున్న భంగిమలోకి మారిపోయాయి. వారి సాధారణ చూపులు కాస్తా దివ్య ప్రకాశంతో నిండిపోయాయి. రాత్రి కాస్తా నల్లటి కారుచీకట్లతో కమ్మేసింది. కారుమబ్బులు చుట్టూ కమ్ముకుపోయాయి. వారి వెనక చక్ర కాంతి వెలుగుతోంది. కానీ గాలి చల్లగా మృదువుగా వీస్తోంది. ఆయన ఖచ్చితంగా దూర్వాస మహాముని. భోలేబాబా పులకించిపోయారు కానీ ఆశ్చర్యపోలేదు. ఆయన ఎంతోమంది దేవతల్ని ఇలా తన గురువు సమక్షంలోనూ పరమగురువుల సమక్షంలోనూ అనేకమార్లు దర్శించారు.

భోలేబాబా 'ఈ పరిస్థితుల్లో తమరినెలా పూజించాలో తెలియట్లేదు. దయచేసి నా కృతజ్ఞతనూ గౌరవాన్నీ ఎలా తెలియజేయాలో తెల్పండి' అన్నారు.

మహాముని దూర్వాసులు 'ఫరవాలేదు, తమ జీవితాన్ని భగవంతుడి సేవకై కైంకర్యం చేసినవారికి సహాయపడటం నా కర్తవ్యం. చెప్పు నా నించి నువ్వేం కోరుతున్నావో?' అన్నారు.

'మహానుభావులైన నా గురుదేవులకీ, వారి గురుదేవులకీ కూడా స్వచ్ఛంద దేహత్యాగం చేసి కూడా సజీవంగా ఉండగల సామర్థ్యం ఉందని నాకు తెలుసు. ఇక మీరు చిరంజీవులు. మీకు జీవితంలో రెండు తీరాలూ తెలుసు. దేశకాలాలు మీకు ఎలాంటి ఆటంకాల్నీ కలుగజేయలేవు. నాకు ఆ ఆవలి తీరం గురించి తెలుసుకోవాలని ఉంది. హిమాలయ గ్రామాలలో అనారోగ్యాల్ని నయం చేసి, చనిపోయిన వారినెవరినైనా ఒకే ఒక్క నిమిషంలో వెనక్కి మామూలు జీవితంలోకి ఆత్మల సహాయంతో తీసుకుని రాగలిగే గురువులను చాలామందిని చూశాను. నా గురుదేవులు ఒక ఆత్మతో దాని జీవనాధారం కోసం రావిచెట్టు రసాన్ని పీల్చమని చెప్పటం నేను విన్నాను. నాకు ఈ ఆత్మల గురించి సరిగా తెలియాలి. వాటికి ఆకలిగానీ, దాహంగానీ ఉంటుందా? వాటికి ఇతరుల దేహాన్ని ఆక్రమించాల్సిన అవసరం ఉంటుందా? ఈ విషయమే మా గురుదేవులని అడిగినప్పుడు నా ప్రశ్నను త్రోసిపుచ్చుతూ, 'అవన్నీ మనసులోనే!' అని చెప్పారు. స్వర్గం గురించీ, నరకం గురించీ గ్రంథాలలోనూ వర్ణించబడి ఉంది, సాధుపుంగవులూ మాట్లాడుకుంటూ ఉంటారు. అక్కడ నివసించటం అనేది మనమిక్కడ మాట్లాడుకున్నట్లుగా నిజమైనదేనా?' అని అడిగారు భోలేబాబా.

'మన మనసు నిజాన్ని సృష్టిస్తుంది, మన చర్యలు దానితో సంబంధాన్ని ఏర్పరచు కుంటాయి' అన్నారు ఆ మహాముని.

'కానీ కర్మలనీ కర్మ ఫలాలనీ పరిత్యజించటం ముఖ్యం కదా!' ఆడిగారు భోలే. ఇంకా 'పరిత్యాగంలో ఉన్నా కూడా మనం చేయాల్సిన కర్తవ్యాలు ఏమైనా ఉన్నాయా?' ఆడిగారు.

'ధార్మిక సేవ! ఇవ్వడం అనేది సృష్టి రచనలో ఉన్న ప్రధాన ప్రక్రియ. కోరికలు లేకపోవడం అనేది వివేక స్థాయిలో మాత్రమే సంతృప్తినిస్తుంది. ప్రదానం అంటే ఇవ్వడం. ఇది వివిధ రూపాల్లో ఉంటుంది. దానం చేయడం, నిస్వార్థంగా ఇవ్వడం, సేవ చేయడం ఇలాంటివన్నీ దాని రూపాలే. ఇవే నిజమైన ప్రశాంతతనూ ఆనందాన్నీ అందించే మూల కారకాలు. గొప్ప సన్యాసులూ, నియమనిష్ఠాపరులే అయినా ధార్మిక సేవ లేకపోవడం వల్ల ఎంతో అసంతృప్తిగా ఉంటారు. నాతోపాటు అగస్త్యముని ఆశ్రమానికి రా. అక్కడ నీ ప్రశ్నకు మరింత వివరణ లభిస్తుంది' అని యోగి బదులిచ్చారు.

భోలేబాబాకి స్వప్నావస్థ కలిగింది. స్వప్నంలో ఆయన దూర్వాస మహామునితో కలిసి ఒక అందమైన ఆశ్రమంలోకి ప్రవేశించారు. ఆక్కడి పర్ణశాలలు వెదురుబొంగులతోనూ చెరకు ఆకులతోనూ నిర్మించబడి ఉన్నాయి. పూపరిమళంతో సహజంగా గుబాళించిన గాలి, పొదల్లో పక్షుల కిలకిలారావాలు, చెట్లమీద అటూ ఇటూ ఎగురుతున్న పిట్టల రెక్కల చప్పుళ్లతో ఆ పర్ణశాల శోభాయమానంగా ఉంది. భోలేబాబా, దూర్వాస మహాముని అగస్త్య మహాముని నివాసాన్ని చేరుకునేంత వరకూ నడుచుకుంటూ వెళ్లారు. అక్కడ విద్యార్థులూ మరికొంతమంది మునులూ శ్రీరాముని చుట్టూ ఉండగా అగస్త్యులవారు రాముని వద్దకు వెళుతున్నారు. ఆయన ఒక బహుమతిని తీసుకోమని శ్రీరామచంద్రుణ్ణి మరీ మరీ అభ్యర్థిస్తున్నారు. శ్రీరాముడు దానిని నిరాకరిస్తూ ఒక ఋషిపుంగవుడి నుండి బహుమతిని ఆశించడం ఒక రాజుకు సముచితం కాదని వాదిస్తున్నాడు. దైవతేజస్సు రాజులో నిలిచి ఉన్నంతకాలం రాజుకి బహుమతి ఇవ్వడం ద్వారా గౌరవిస్తామని అగస్త్యులవారు వాదిస్తున్నారు.

దాంతో రాముడు ఆ బహుమతిని అంగీకరించాడు. దాన్ని తెరిచి చూడగా ఆ ఆభరణం నుంచి వచ్చే కాంతిలో రాముడు మెరిసిపోతున్నాడు. ఆ మహామునితో 'ఇలాంటి ఆభరణాన్ని నేనింతవరకూ చూడలేదు. ఆఖరికి శ్రీలంకలో రావణుడి దగ్గర కూడా చూడలేదు. దీన్ని తయారు చేయడానికి ఉపయోగించిన బంగారం వజ్రాలూ ఈ ప్రపంచంలో ఎక్కడా దొరకవు. ఇంతకీ ఇదేమిటి? దీన్ని ఎక్కడినించి తెచ్చారు?' అని అడిగాడు. సమాధానంగా అగస్త్యులవారు ఈ కథ చెప్పారు.

ఒకసారి చిట్టడవిలో తిరుగుతుండగా అందమైన సరస్సు తీరంలో ఓ ఆశ్రమాన్ని చూశారు. దాంట్లో ప్రవేశించగానే చాలాకాలంగా ఎవ్వరూ అక్కడ ఉంటున్నట్లు లేరని అర్థమైంది. రోజు ముగిసిపోవడంతో వారు ఆరోజుకి అక్కడే విశ్రమించారు. తెల్లారి సూర్యోదయానికి ముందు లేచి కొలను దగ్గరికి స్నానానికై వెళ్తుండగా ఒక పెద్ద ఆజానుబాహుడైన మానవ కళేబరాన్ని దాటాల్సి వచ్చింది. దానిని పరిశీలించగా రోగం, గాయం, విషంలాంటి ఛాయలేమీ కనిపించలేదు.

'ఏమిటీ ఈ వింత?' అని ఆలోచిస్తూ ఉండగా, ఆకాశం నుంచి ఓ బంగారు రథం క్రిందకి దిగింది. అది ఆ సరస్సు తీరంలో ఆగింది. అగస్త్యులవారు చూస్తుండగా, దాని నుండి ఓ ఆజానుబాహుడైన దేవతా పురుషుడు క్రిందకు దిగి కొలనులో స్నానం చేసి నేరుగా పడి ఉన్న దేహం దగ్గరికి వెళ్లి దాన్ని చీల్చి తినడం మొదలుపెట్టాడు. అలా తినడం ముగియగానే లేచి వెనుదిరిగి వెళ్లసాగాడు, ఆ కళేబరం మళ్లీ మామూలుగానే అయింది. కొద్ది క్షణాలలోనే అది అంతకుముందు దాన్ని ఎవ్వరూ తాకనైనా తాకనట్లుగా మారిపోయింది. ఆ మనిషి మరోసారి సరస్సులో స్నానంచేశాడు.

ఆయన రథాన్ని ఎక్కబోతుండగా, అగస్త్య మహాముని అతణ్ణి ఆపి, 'నాయనా, దయచేసి కొంచెం ఆగు. నువ్వు ఎవరో తెలియజేయి. నీకు భౌతిక దేహం ఉన్నట్లు కనబడడం లేదు. నీ చుట్టూ ఉన్న ఆ ప్రకాశవంతమైన కాంతిపుంజం నువ్వు సామాన్య మానవుడివి కావనీ దేవతవనీ తెలియజేస్తోంది. కానీ నీ వ్యవహారం చాలా వింతగా ఉంది. నీ ఆహారం అనాగరికంగానూ, నీచంగానూ ఉంది. ఎవరు నువ్వు? ఇలా ఎందుకు నివసిస్తున్నావు?' అని అడిగారు.

'మీరు సామాన్యులు కారు. మనిషిగానీ, ఏ విధమైన జంతువుగానీ జీవి గానీ ఈ ప్రదేశానికి రాలేదు. బాధాకరమైన గతంతో నివసిస్తున్న స్వర్గలోకవాసిని!' అన్నాడు ఆ పురుషుడు.

ఆ దేహం వైపు చూపిస్తూ ఆ దివ్య పురుషుడు 'నేను ఆ దేహంలో నివసిస్తున్నపుడు, విదర్భకు రాజుగా ఉండేవాడిని. ఒకరోజు నా సోదరుడికి రాజ్యాన్ని అప్పజెప్పి నా జీవితాన్ని

ఆధ్యాత్మిక సాధనలో గడపడం కోసం వెళ్లిపోయాను. దీర్ఘాయువుగా ఉండే పద్ధతిని సాధన చేసి తీవ్రమైన తపస్సు ఆచరించి దీర్ఘాయువును పొందాను. నా జీవితం చివరి అంకంలో నాకున్న జ్ఞానం, స్వచ్ఛత కారణంగా నా ఆధ్యాత్మిక సాధన వల్ల నేను నా దేహాన్ని వదిలి యోగ పద్ధతిలో నేరుగా స్వర్గానికి వెళ్లాను.

'ఆశ్చర్యకరంగా అక్కడ నేను ఆకలితోనూ దాహంతోనూ పరితపించిపోతున్నాను. ఇదే విషయాన్ని స్వర్గాధిపతితో ప్రస్తావించగా నేను మహారాజుగా ఉన్నపుడు కానీ, యోగిగా సాధన చేస్తున్నపుడు కానీ ఎప్పుడూ ఎవరితోనూ దేన్నీ పంచుకోలేదనీ, నేనెంతో స్వార్థపూరితంగా ప్రవర్తించి నా సొంత ఆరోగ్యం గురించీ ఆనందం గురించీ మాత్రమే పట్టించుకున్నాననీ, ఆఖరుకి నా రాజ్య త్యాగాన్ని కూడా నా ఆనందం కోసమే చేశాననీ వివరించారు. 'రాజ్య పరిపాలన' అనే శిరోభారం వదిలించుకోవడం కూడా ఎవ్వరి నుంచీ నాకు ఆటంకాలు ఎదురుకాకుండా ఉండడానికీ, నా ఆధ్యాత్మిక ఆశయాలను తీర్చుకోవడానికే చేశానని స్వర్గాధిపతి వివరించారు. ఈ కారణంగానే నేను అతిగా వాంఛించిన నా దేహాన్నే తినాలనీ, అది ఎప్పటికీ కుళ్లి పోకుండా నాకు ఆహారాన్ని అందిస్తుందనీ హామీ ఇచ్చారు. అలాగే ఈ దుర్గతి నుంచి నాకు అగస్త్య మహాముని మాత్రమే విముక్తి ప్రసాదిస్తారని కూడా చెప్పారు. సంవత్సరాలు గడుస్తున్నాయి. నేను నా కళేబరం మీదే ఆధారపడి బతుకుతున్నాను. ఆ మహాముని కోసం ఎదురు చూస్తున్నాను!' అని వివరించాడు.

'నువ్వు ఎదురుచూసేది నా కోసమే! చెప్పు, నీకు ఏ విధంగా విముక్తి కలిగించగలను' అన్నారు అగస్త్యులు.

ఆ స్వర్గవాసి, అగస్త్యులవారి పాదాలపైబడి తన శరీరాన్ని అలంకరించిన ఆభరణాల్ని తీసుకోమని అభ్యర్థించాడు. అగస్త్యులవారు అందుకు అంగీకరించి తమ హస్తాన్ని చాపారు. ఆయన చేతుల్లో వాటిని ఉంచగానే అతని కళేబరం వెంటనే మాయమైపోయి అతడు స్వర్గారోహణ చేశాడు.

ఆక్కడితో భోలేబాబా తన స్వప్నావస్థ నుండి బైటపడి తాను రావిచెట్టు క్రింద దూర్వాస మహాముని ముందు కూర్చున్నానని గమనించాడు. మరోసారి ఆ మహాముని నిస్వార్థ సేవ గురించి నొక్కి వక్కాణిస్తూ, 'ఇతరులకి నిస్వార్థంగా సేవ చేయడం ద్వారానే దేవుడి పట్ల ప్రేమని వ్యక్తం చేయగలవు' అని వివరించారు. 'దేవుణ్ణి మన సొంత పరికరాల్లాంటి ఆచార వ్యవహారాలతో పూజిస్తే అది చిన్నపిల్లవాడు ఇసుకలో కోట కట్టడం లాంటిది. దైవం సర్వవ్యాపితం. ఆ ప్రకాశం ప్రతి హృదయంలోనూ కొలువై ఉంటుంది. నీకు నువ్వు గుళ్లలో పూజలు చేసుకుంటూ, ఒంటరిగా సాధన చేసుకుంటుంటే దేవునితో ఉన్నట్లు కాదు, ఇంకా వీటితోటే నువ్వు కొనసాగుతుంటే నీ చైతన్యం కుంచించుకుపోతుంది. ఈ గుళ్ళూ గోపురాలూ, యోగ సాధనలూ మరో పవిత్ర తీరాలకి ద్వారాల్లాంటివి. అవి నీకు అంతిమ గమ్యస్థానాలు కావు. తరువాతి తీరాలకు సాగిపోతూ ఉండాలి. అక్కడి ద్వారాలు నిన్నెక్కడికి తీసుకెళ్తాయో చూడు,' అన్నారు.

మర్నాటి ఉదయం భోలేబాబా తన తుది గమ్యానికి బయలుదేరారు. నర్మదానది పవిత్రత విషయంలో గంగానదితో పోల్చుకుంటే రెండవ స్థానంలో ఉంటుంది. ఇది అమరకంటక్‌లో పుట్టింది, దీని తీరం వెంబడి బారులు తీరిన దేవాలయాల్లో ఎక్కువగా శివాలయాలే ఉన్నాయి. వీటిల్లో ఓంకారేశ్వర క్షేత్రం ఎంతో పేరుగాంచింది. ఇది నర్మదా, కావేరీ నదుల సంగమం వద్ద సుదూర తీరంలో ఎంతో అందమైన ప్రదేశంలో ఉంది. పడవ లేదా పాద వంతెన ద్వారా మాత్రమే దాన్ని చేరుకోగలం. భోలేబాబా ఈ ద్వీపానికి బయలుదేరారు.

భోలేబాబా ఓంకారేశ్వర సన్నిధికి చేరగానే, ఎవ్వరూ విసిగించకుండా తాను తపస్సు చేసుకోవడానికి కావలసిన స్థలం కోసం వెతకసాగారు. కానీ ఆ ద్వీపంలోని ప్రధాన దేవాలయం, అలాగే మిగిలిన దేవాలయాలూ విపరీతంగా భక్తులను ఆకర్షిస్తుండడం వల్ల ఆయన ఆశయం నెరవేరలేదు. నర్మదా నది ఒడ్డునున్న మిగతా వందలాది దేవాలయాల్లో కూడా ఇదే పరిస్థితి. నదీ ప్రవాహానికి పడమటి తీరంలో కొన్ని మైళ్ల తరువాత ఆయన ఒక ఏకాంత ప్రదేశాన్ని చూశారు. అక్కడే ఆయన గుడిసెను నిర్మించుకున్నారు. అక్కడికి గ్రామం ఆరు మైళ్ల దూరంలో ఉంటుంది. భోలేబాబా తన సాధనను మొదలుపెట్టడానికి ముందే వాళ్లతో తనకి రోజుకి ఒకసారి పాలూ, రొట్టె పంపించే ఏర్పాట్లు చేసుకున్నారు. ఒక నీటికుండ, దుప్పటీ రెండు పులిచర్మాలూ ఇవే ఆయన సామాన్లు. స్వామీజీ తన 'హిమాలయ పరమగురువులతో జీవనం' లో వ్రాసినట్లు 'ఆ ఆరునెలల తపస్సాధనా కాలం నా జీవితంలో ఎంతో అమూల్యమైనది,' అనేవారు.

భోలేబాబా అక్కడ కుటీరం వేసుకున్నప్పుడు నదిలో మొసళ్లు ఉండటం గమనించలేదు. సెప్టెంబర్ నెలలో ఆక్కడికి వచ్చారు. ఇంకా మధ్యాహ్న సమయంలో ఎండ బాగా ఉంటోంది. మొసళ్లన్నీ ఉదయం, మధ్యాహ్నం బైటికొచ్చి ఒడ్డున సేదదీరుతూ ఉండేవి. అదే సమయంలో భోలేబాబా తన కుటీరంలో సాధన చేస్తూ ఉండేవారు. ఆయన ఏకాంతాన్ని గ్రామస్తులు భగ్నం చేసేవారుకారు. పశువుల కాపరులు, గొఱ్ఱెల కాపర్లూ ఆడవికి వెళ్లే సమయంలో అటువైపుగా వెళ్ళేవాళ్లు కారు. గ్రామస్తులు, 'అతను దొంగ సాధువైతే మొసళ్లు అతన్ని తినేస్తాయి. మంచి సాధువైతే అవి అతన్ని రక్షిస్తాయి, ఆయన తపస్సు ఫలిస్తుంది' అని అనుకునేవారు.

భారత పురాణాల ప్రకారం మొసలి గంగాదేవి వాహనం. కొన్ని వారాల తరువాత మొసళ్లన్నీ తన కుటీరం బైట ఉండటం గమనించారు. అంతలో ఒక ఆధ్యాత్మిక వ్యాఖ్యానం అతని మనసులోకి మెదిలింది. గంగాదేవి తనను చూడడానికి వచ్చినట్టూ, తను ఎక్కడ సాధన చేసినా పోషణ, రక్షణ అందిస్తానని ఆమె అన్నట్లుగా అర్థం చేసుకుని ఆయన ఉప్పొంగిపోయారు. ఇక్కడ ఈ మొసళ్లు ఉండడం కూడా ఆయన తన సాధన సిద్ధికి సూచనగా భావించారు.

శీతా కాలం మొదలైంది. ఈ యువ సాధువు బైట ఉన్న సూర్యుని వెచ్చదనాన్ని ఆస్వాదిస్తూ, సాధన చేద్దామని నది ఒడ్డున మంచి ప్రదేశాన్ని ఎన్నుకున్నారు. అది ఎండకీ గాలికీ అనుకూలంగా ఉంది. మొసళ్లకి కూడా అది నచ్చింది. అతను కళ్లు మూసినపుడు అవి ఆయన పక్కకి పాకి ఎండలో సేద తీరుతుండేవి.

ఒకరోజు భోలేబాబా కళ్లు మూసుకుని ధ్యానం చేస్తున్నప్పుడు సరదాకి జంతువుల్ని వేటాడే గుంపు ఒకటి అటు వైపుగా వచ్చింది. వాళ్లు ఆ యువ సాధువు నది ఒడ్డున మొసళ్ల మధ్యలో ధ్యానం చేస్తుండటం చూసి ఆశ్చర్యపోయారు. ఆయనకు తెలీకుండా ఒక ఫొటో తీసుకున్నారు. ఆ ఫొటో త్వరలోనే స్థానిక దినపత్రికలన్నిటిలో ప్రముఖ వార్తగా పెద్ద పేపర్లలో సైతం అచ్చయింది. అయితే అంతకు ముందే ఈ విషయం బాగా ప్రచారంలోకి వచ్చింది. ఈ వార్త మహారాష్ట్రలో వందల మైళ్ల దూరంలోఉన్న కార్వీర పీఠం శంకరాచార్యులకీ, జగద్గురు కుర్ట్‌కోటికీ చేరింది. ఈ మహాపండితుడు అంతకుముందే చాలాకాలం క్రితం ఇలాంటి సాధన చేశారు. ఇప్పుడు అర్హత గల వారసుడి కోసం  చూస్తున్నారు. దాంతో ఆయన భోలేబాబా రోజువారీ సాధననూ దినచర్యలనూ గమనించవలసిందిగా ఒక పండిత సమూహాన్ని నియమించారు. వీళ్లలో కొంతమంది ఆయనకు దగ్గరలో ఉన్న గ్రామానికి వెళ్లి ఉండగా మరి కొంతమంది ఈ యువసాధువు గురించి తెలుసుకోవడానికి హృషీకేశ్ వెళ్లారు. అప్పటికి భోలేబాబా తన ఆరునెలల

సాధననూ పూర్తి చేశారు. జగద్గురు శంకరాచార్య ఈ యువ సాధువే తన వారసునిగా తన స్థానంలో ఉండవలసిన వ్యక్తిగా భావించారు.

జగద్గురు శంకరాచార్యులవారు తనను కార్వీర పీఠంలో కలవవలసిందిగా భోలేబాబాకు ఆహ్వానాన్ని పంపారు. ఎంతో గాఢమైన చర్చ జరిగిన తరువాత ఈ యువ సాధువుని తన వారసుడిగా చేర్చుకున్నారు. ఈ పీఠాధిపత్యాన్ని అంగీకరిస్తే రెండు విధాలా ఫలితముంటుందనీ అటు ధర్మ ప్రచారంతో పాటు మానవ సేవ కూడా చేయవచ్చని భావించారు. కానీ బాబాజీ అంగీకారం లేనిదే వారు దీన్ని ఆమోదించరు. అందుకే ముందుగా భోలే బాబా, బాబాజీకి ఈ విషయమై టెలిగ్రాం ఇచ్చారు. దానికి సమాధానంగా ఆయన, మిగతా గురువులందరూ 'నీకెలా అనిపిస్తే అలా చేయి. మా దీవెనలు ఎప్పుడూ నీ వెన్నంటే ఉంటాయి' అని సమాధానం పంపారు. ఈ బాధ్యతను తాను స్వీకరించడం వారికి అంగీకారమేనని భావించి ఆయన ఆ పదవిని స్వీకరించారు.

హిందూ సమాజంలో శ్రీశంకరాచార్యని క్రైస్తవ సమాజంలోని పోప్‌తో పోల్చవచ్చు. మొట్టమొదటి శంకరాచార్యులవారు క్రీస్తు శకం ఎనిమిదవ శతాబ్దంలో పుట్టారు. ఆయన ఒక గొప్ప తాత్వికవేత్త, యోగి, సంఘ సంస్కర్త. ఆయన భారతదేశంలో తనదైన ముద్ర వేసిన ఆధ్యాత్మిక నాయకులు. ఆయన జీవిత కాలంలో ఐదు మఠాలను నిర్మించారు. భారతదేశం నాలుగుమూలలా నాలుగు ఉన్నాయి. ఐదవది భారతదేశం మధ్యన దక్షిణ భారతదేశంలోని కార్వీర పీఠం. పురాణాల ప్రకారం నాలుగు పీఠాల్లో నలుగురు శిష్యులను అధిపతులుగా నియమించి, తాను తన జీవిత శేషాన్ని ఐదవ పీఠంలో గడిపారు. అప్పటి నుండి ఈ ఐదు స్థానాల నాయకత్వ బాధ్యతలకి అప్పుడప్పుడూ అవాంతరాలు సంభవించినా ఒక తరం నుండీ మరోతరానికి సంక్రమిస్తూ ఉండేది. ఎవరైనా ఈ పీఠాధిపత్యాన్ని తీసుకుంటే వాళ్లను శంకరాచార్య నామధేయంతో శంకరాచార్య వారసునిగా గౌరవించేవారు. హిందూ భక్తులు ఈ పీఠాధిపతిని గొప్ప జ్ఞానిగా, శక్తిసంపన్నునిగా, భక్తులకు తన దీవెనలతో మేలు చేకూర్చే మహనీయునిగా చూసేవారు. ఈ విశ్వాసంతోనూ, ఆకాంక్షలతోనే భారతీయులు శంకరాచార్య స్థానంలో ఉండేవారికి 'జగద్గురువు' బిరుదును కూడా ఇచ్చారు. అంటే భారత దేశంలో ఇతర ఆధ్యాత్మిక శాఖలకు కూడా వారే గురువు.

భోలేబాబానూ కార్వీర పీఠంలో శంకరాచార్య దీక్ష ఇచ్చే వేడుక సంప్రదాయబద్ధంగా సుమారు పద్దెనిమిది రోజులు కొనసాగింది. ఆ క్రమంలో వారి పేరు కొత్తగా జగద్గురు శంకరాచార్య భారతిగా మారింది. అధికారికంగా వారికి పేరున్నా సరే, చాలామంది వారిని 'జగద్గురు' లేదా తేలిగ్గా 'భోలేబాబా' అని పిలిచేవారు.

ఆ రకంగా ఒంటరిగా జీవించే ఈ సాధువు కొద్ది వారాల్లోనే దేశంలోనే ఎంతో ప్రతిష్ఠాకరమైన ధార్మిక సంస్థకి అధిపతిగా జగద్గురు శంకరాచార్యులుగా అయ్యారు. ధ్యానంలో ఉన్నప్పుడు చుట్టూ మొసళ్లు ఎండ కాచుకుంటూ ఉంటే భోలేబాబా గంగామాత సమక్షంలో ధ్యానం చేసుకునే అనుభవం నుంచి బయటపడి ఇప్పుడు తన చుట్టూ ఉన్న మనుషుల్లో దేవుణ్ణి దర్శించే మార్గాన్ని అన్వేషించవలసిన స్థితిలోకి వచ్చారు. ఇదంత తేలికైన విషయమేమీ కాదు. డా. కుర్ట్‌కోటి చాలా చురుగ్గా రోడ్లు ఊడ్చడం లాంటి సాంఘిక, మత సంస్కరణ కార్యక్రమాలలో పాల్గొనడం, ఆయన శిష్యుల సాంఘిక, సాంస్కృతిక, మత, తాత్విక జీవిత కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొనడంలాంటివి చేస్తున్నారు. ఈ యువ వారసుడి పట్ల కూడా వాళ్ల అంచనాలు చాలా హెచ్చు స్థాయిలో ఉన్నాయి. డా. కుర్ట్‌కోటి సంస్కర్త. కానీ భోలేబాబా విప్లవకారుడు.

అప్పుడే కొత్తగా భారతదేశం బ్రిటిష్ వారి నుండి స్వాతంత్ర్యాన్ని సాధించుకుంది. మొత్తం దేశం అల్లకల్లోలంగా ఉంది. ప్రజాస్వామ్య స్ఫూర్తి, మార్పు కోసం ఎలుగెత్తి చాలుతుంటే సాంప్రదాయికవాదం తన శక్తినంతా ఉపయోగించి దీన్ని అడ్డుకోవాలని చూస్తోంది. వందల సంవత్సరాల నుండీ భారతదేశంలో రాజకీయ, మతపర, సాంస్కృతిక అణచివేత కొనసాగుతోంది. బ్రిటిషు బానిస పరిపాలన ముగియడంతో భావోద్వేగాల సంకెళ్లు తెగి స్వేచ్ఛ కోసం సమాజం భిన్నత్వాన్ని ఆశ్రయించింది. బ్రాహ్మణులు తమ ప్రాచీన గౌరవప్రతిష్ఠల్ని తిరిగి చేజిక్కించుకోవాలని ప్రయత్నిస్తున్నారు. రాజవంశాలు తమ రాజరికాన్ని కొనసాగాలని కోరుకుంటున్నారు. సమాజంలో అట్టడుగు స్థితి నించి వచ్చినవారు ప్రజాస్వామ్యంలో సమానమైన వాటాను కోరుకుంటున్నారు. హిందూ ముస్లింల మధ్య ఉద్రేకాలు పెరిగిపోతున్నాయి. సనాతన హిందూ సమాజం కొంతమందితో తిరిగి బలం పుంజుకుంటుంటే మరి కొంతమందితో విచ్ఛిన్నానికి గురవుతోంది. కొన్ని దేవాలయాల్లో అన్ని కులాలవారికీ మతాలవారికీ ప్రవేశార్హత ఉంటోంది, మరికొన్నింటిలో కేవలం బ్రాహ్మణులకీ ఇతర అగ్ర కులాలకే ప్రవేశం ఉంటోంది.

ఇలాంటి సమయంలో ప్రజలు సహజంగానే తమ మతాల, ఆధ్యాత్మిక తత్వాలకి సంబంధించిన నాయకుల వైపు మార్గదర్శకత్వం కోసం చూస్తుంటారు. ఈ విషయంలో మిగతా నలుగురు శంకరాచార్య పీఠాధిపతులు సనాతన హిందూ ధర్మాన్నే బలపరిచారు. కానీ భోలేబాబా కార్వీర మఠ శంకరాచార్య పీఠాధిపతిగా తన శక్తిని ఆధునిక సంస్కరణల మార్పుకే ఉపయోగించారు. మరోమాటలో చెప్పాలంటే అధిక సంఖ్యాక హిందూ మత నాయకులు కుల కట్టుబాట్లనూ, మహిళలపై పురుషాధికారాన్నీ సమర్థిస్తూ నిరాశ్రయులైన పేదల దయనీయ స్థితిని వారి ఖర్మగా పరిగణించారు. మరోవైపు భోలేబాబా ఇదే అదనుగా భావించి మహాత్మాగాంధీ, రవీంద్రనాథ్ ఠాగూర్ సాంగత్యంలో పెంపొందిన నమ్మకాలనూ ఆశయాలనూ ఆచరణలోకి తీసుకుని రావడానికి ప్రయత్నించారు. ప్రతి పురుషుడూ ప్రతి స్త్రీ, గొప్ప–బీద, అక్షరాస్యులూ నిరక్షరాస్యులూ అందరూ దేవుడి గుళ్లోకి వెళ్లడానికి అర్హులే అని ఆదేశాలు జారీ చేశారు. విద్య మానవ చైతన్యాన్నీ, స్పృహనీ పైకి తీసుకొచ్చి పరివర్తన దిశలోకి మళ్లిస్తుందనీ సమర్థించారు. వాటితో పోల్చుకుంటే డా. కుర్ట్‌కోటి గారి సంస్కరణలు గొప్ప మార్పుగా ఏమీ ఉండవు.

అదే సమయంలో భోలేబాబా సాంప్రదాయ ఆచారాలకి అవసరమైన కర్తవ్యాలను కూడా శంకరాచార్యులుగా ఆయన నెరవేర్చారు. అంటే మొదటి స్థానంలో ఉన్న కార్వీర పీఠాధిపతి శంకరాచార్యులుగా ఆయన వాటి నియమ నిబంధనల్నీ విలువల్నీ గౌరవాల్నీ పాటించారు. ఆచారాల ప్రకారం ఆయన నిరంతరం తన శిష్యులచేత పరమపూజితునిగా పూజింపబడుతూ ఉండాలి. ఆయన ప్రజల మధ్య సింహాసనం లాంటి దానిమీద కూర్చుని సాంబ్రాణీ అగరబత్తులు, పూలమాలలతో వారిచేత పూజింపబడుతూ ఉండాలి. నిరంతరం రాత్రనకా పగలనకా అతన్ని కలిసే భక్త సమూహాన్ని దీవిస్తూ వుండాలి. భోలేబాబాకీ ఈ ఆచారాలన్నీ బోలుగానూ, సమయాన్ని వ్యర్థం చేసేవిగానూ కనబడ్డాయి.

శంకరాచార్యగా వారు ఆధ్యాత్మిక సమావేశాలలో బోధించే సమయంలో *నిరంతరం ఆధ్యాత్మిక గురువును పూజించడం మంచిదే అయినా మీ గురించి మీరు శ్రద్ధ వహించి మీలో ఉన్న అంతర్గత శక్తిని వెలికి తీసుకువచ్చి మీరు ఒక తేజోమయమూర్తిగా మారి ఆ వెలుగులో మీరు ఉన్నత స్థితిలో ఉండాలి.* ఇతరులకు కూడా ఆ వెలుగును పంచాలి అని చెప్పేవారు. మీరు నిజాయతీగా నమ్మకస్తులుగా ఉన్నపుడే మా దీవెనలు మీకు పనిచేస్తాయని చెప్పేవారు. గుడ్డిగా

నమ్మే శిష్యపరమాణువులు ఇది విని నిరాశ చెందేవారు. అంతేకాక తమ గురువు శంకరాచార్యుల వారిలో ఏమైనా దోషం ఉందా అని ఆశ్చర్యపోయేవారు.

భోలేబాబా ఆశ్రమానికంతటికీ అధిపతి. అయినప్పటికీ అంతకు ముందున్న శంకరాచార్యులుగా ఉన్నవారి కన్నా పదవీ కాలంలోగానీ వయసులోగానీ చిన్నవారు. ఆశ్రమంలోని వృద్ధ స్వాములు అంతకు ముందు గురువైన డా. కుర్ట్‌కోటి అందించిన ప్రేమ, శ్రద్ధని ఈ కొత్త పీఠాధిపతి నుంచి కూడా ఆశించారు. వారంతా ఎంతో గౌరవింపదగ్గ ఆధ్యాత్మిక గురువులే కాక ఈ యువ సాధువు కన్నా అనుభవరీత్యా ఎన్నో సంవత్సరాలు పెద్దవాళ్లు కావడంతో వీరు ఈ విషయంలో భంగపడ్డారు. వాళ్లు గత శంకరాచార్యులతో కలిసి పనిచేస్తున్నపుడు ఏనాటికో ఒక నాటికి ఆ నాయకత్వం తమనే వరిస్తుందని ఆశించారు. ఇప్పుడు ఈ ఉన్నతస్థాయి నాయకత్వ బాధ్యత బయటి వ్యక్తిని వరించింది. ఇప్పుడు వీళ్లందరూ ఆయన దగ్గర పనిచేయాలి. ఇది వాళ్లకి చాలా కష్టంగా ఉంది. భోలే బాబా ఈ పదవిని అంగీకరించినప్పుడు ప్రేమ, పరస్పర సహకారం, నిస్వార్థం, ప్రబలమైన స్వీయ పరివర్తనా ఉండే లక్షణాలతో ఒక కార్య సమూహాన్ని నిర్మించాలనే దృష్టి ఉండేది. కానీ ఇది ఎంతవరకూ వాస్తవరూపం దాల్చుతుందనేది ఆయనకు తెలిసేది కాదు. స్వీయ పరివర్తన సాధించడానికి శ్రద్ధతో చేసే సాధన, ఆధ్యాత్మక ధ్యాన ప్రక్రియలే ప్రబలమైన శక్తులని ఎప్పుడైనా ఆయన సందేశం ఇవ్వబోతే ఆశ్రమంలోని వృద్ధ సన్యాసుల దగ్గర నుంచీ అందరూ చిరచిరలాడే ముఖాలతో వ్యక్తం చేసే ప్రతికూల వైఖరిని ఎదుర్కోవలసి వచ్చేది. వారికి 'ఈ యువ శంకరాచార్య తమకన్నా తక్కువ స్థాయికి చెందిన జ్ఞాని' అనే భావం ఉండేది.

అక్కడ నివసిస్తున్న వారు తమ ఇళ్లు, ప్రాపంచిక సంబంధాలనూ వదిలేశారు. వాళ్లతో పాటు ఆధికార తృష్ణనీ కీర్తి ప్రతిష్ఠల్నీ తెచ్చుకున్నారు. స్వీయ క్రమశిక్షణ, స్వీయ శిక్షణ అనేవి వ్యక్తి పరివర్తనకు ఎంతో ముఖ్యం. కానీ వారి దృష్టిలో వీటికి ఎలాంటి ప్రాముఖ్యతా లేదు. భారతదేశంలోని విశ్వవిద్యాలయాల్లో కళాశాలల్లో అధ్యాపకులు కేవలం సీనియారిటీ మీదే పై స్థాయికి ఎలా వెళుతున్నారో అలానే ఈ మత సంస్థలలో కేవలం ఎక్కువకాలం సంస్థలో ఉన్న వాళ్లు అధిక జ్ఞానసంపన్నులుగా గుర్తింపబడుతున్నారు.

ఎప్పుడైనా భోలేబాబా సంస్థాగత మార్పుల కోసం ప్రయత్నిస్తే తీవ్రమైన నిరోధాన్ని ఎదుర్కొనేవారు. శంకరాచార్యగా మారక ముందు ఎన్నో ఆశ్రమాలకూ ఆధ్యాత్మిక సంస్థలకూ వెళ్ళేవారు. కానీ ఎప్పుడూ ఒక అతిథిగా లేదా కొద్ది కాలం నేర్చుకునే విద్యార్థిగానే వెళ్ళేవారు. అక్కడి వాతావరణానికీ, వాళ్ల విద్యాబోధనకీ, వాళ్ల పద్ధతులకీ ఎప్పుడూ సంతృప్తి చెందేవారు కారు. అయినా కూడా వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకుని అక్కడి పద్ధతులను మార్చాల్సిన అవసరం ఆయనకు కనిపించేది కాదు. తనకేం కావాలో అది నేర్చుకుని వెళ్లిపోయేవారు. ఇప్పుడు తన సొంత ఆశ్రమంలో తన చుట్టూ చేరి శంకరాచార్యులుగా గౌరవించే శిష్య పరమాణువులకి వాళ్ల మనోభావాలకీ, వారి చాపల్యాలకీ అనుగుణంగా జ్ఞానబోధ చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఆశ్రమ విద్యార్థుల శక్తి అంతా గురువుగారిని లొంగదీసుకోవాలని ప్రయత్నిస్తున్నా కూడా ఆయన తమ మనోభీష్టానికి వ్యతిరేకంగా ఎన్నడూ ప్రవర్తించేవారు కారు. మానవ ప్రవృత్తిలోని ఈ అంశాన్ని భోలేబాబా తన బెంగాలీ బాబా శిక్షణలో నేర్చుకోలేదు. దాంతో తాను ఈ సమాజం చుట్టూ కమ్ముకున్న సాంప్రదాయాలనూ నిష్ఫలమైన నమ్మకాలనూ మార్చగలనని అతిగా అంచనా వేసకున్నానేమోననే విస్మయానికి గురయ్యారు.

అయినా సరే, ఆయన అనేకమంది సాధువులూ గురువుల వద్ద పొందిన జ్ఞానాన్ని వాళ్లకి అందించదలిచారు. దాంతో తనకు తానుగా ఎడతెరిపి లేకుండా ఉపన్యాసాలు,

మతగురువుల, రాజకీయ నాయకుల సమావేశాల్లో తలమునకలై ఉండేవారు. కొద్దిమంది తప్ప చాలామంది మతగురువులు ఆయన అభ్యుదయ భావాలను సమర్థించలేదు. రాజకీయనాయకులు అతని వీక్షణానికీ, ధైర్యానికీ మెచ్చుకున్నారు. ఉదాహరణకి 'దేవదాసి' సంప్రదాయాన్ని అంతం చేయడానికి భోలేబాబా అంకిత భావంతో పనిచేశారు. దేవదాసి ఆచారమంటే బలవంతంగా స్త్రీలను ఆలయాల్లో ఉంచి పూజారులకు సేవకురాలిగా ప్రతిరోజూ దైవారాధన సమయంలో నర్తకిగా గాయనిగా సంగీత విద్వాంసురాలిగా ప్రదర్శనలు ఇవ్వాలి. దక్షిణాది మొత్తం ఈ దురాచారం విస్తరించింది. ఇక్కడి అన్ని అవసరాలకూ ఈ మహిళలే బానిసలుగా ఉపయోగపడుతున్నారు. వాళ్లు పూజారుల వల్లా ఇతర ఆలయ అధికారుల వల్లా గర్భం దాల్చుతున్నా వాళ్లకు పెళ్లి చేసుకునే హక్కులేదు. వాళ్లకు పుట్టిన పిల్లలకు సంఘంలో స్థానం లేదు, వాళ్లు అనాథలుగా బికారులుగా పెరిగేవాళ్లు. భోలేబాబా ఈ దురాచారాన్ని నిర్మూలించాలని తీవ్ర సంకల్పం చేశారు. ప్రజా సమావేశాలు ఏర్పాటు చేసేవారు. ప్రభుత్వాధికారులనూ రాజకీయ నాయకులనూ కలిసేవారు. సుదీర్ఘకాలం పోరాడిన తరువాత ఈ దురాచారాన్ని విజయవంతంగా నిర్మూలించారు. అయితే ఈ కార్యాచరణతో తన సొంత అనుచరుల నుంచే అసంతృప్తిని ఎదుర్కొనవలసి వచ్చింది.

సనాతన భారతీయ సంస్కృతికి ఇదే కాక ఇలాంటి మరి కొన్ని సాంఘిక సంస్కరణలూ మూర్ఖాచారాలూ ముప్పుగా పరిణమించాయి. యువ శంకరాచార్య చుట్టూ ఉన్న వారిలో చాలామంది ఆయన భావాలతో విభేదించేవారు. పైకి మాత్రం వారిని దేవునితో సమానంగా పూజించేవారు. ఎంతో ఇబ్బందిగా ఉన్న ఇలాంటి వాతావరణంలో భోలేబాబా శంకరాచార్యగా మానవత్వానికి సేవ చేయడానికి తనలో ఉన్న ఆకాంక్షల మంచీ చెడులనూ, సాధ్యాసాధ్యాలను ఒకసారి అంచనా వేసుకున్నారు. సుదీర్ఘమైన విశ్లేషణ తరువాత ఆయన ప్రజలు సమూహంగా, వ్యక్తిగతంగా వారి సొంత విషయాలతో మమేకమయ్యారు, సమూహంగా వారు ఆచారాలకీ, పిడివాదాలకీ, మూఢనమ్మకాలకీ, పరిశీలనా జ్ఞానం లేకుండా ఉండే పక్షపాత వైఖరులకీ కట్టుబడి ఉన్నారు. వీటిని అధిగమించడం అంత తేలిక కాదు. ముఖ్యంగా ఎంతో సద్గుణ సంపన్నమైనవిగా భావిస్తున్న బంధాలివి.

బాబాజీ లేని లోటును భోలేబాబా బాగా కలత పెడుతోంది. ఏదో రకంగా ఆయన ఎప్పుడూ తనని కలుస్తూ సముదాయిస్తూ ఉండేవారు. భోలేబాబా తనని కలిసి ఉంటే తన శిష్యుడు కార్యశీలతని చూసి ఎంతో ముచ్చటపడేవారని భావించారు. కానీ వారి నుంచి రెండు సంవత్సరాలుగా ఎలాంటి కబురూ లేదు. గురువుగారి మాటలు ఆయన గుండెల్లో మారుమ్రోగుతున్నాయి– 'నీ ఆధ్యాత్మిక పరిణామ క్రమంలో నువ్వు ఎంతదూరం ప్రయాణించావనేది ముఖ్యం కాదు. నువ్వు నీ సాధనను ఆపకుండా ప్రయాణించడం ముఖ్యం!' అయితే అదే సమయంలో భోలేబాబా ఆదుపు చేయలేని ఈ వాతావరణంలో ఇతరులకు బోధించడంలో మునిగిపోయి తాను సాధన చేసే సమయం కోల్పోయానని గుర్తించారు. ఇది ఒక డాంబికాచారంగా, పటాటోపంగా భావించి అసంతృప్తికి లోనయ్యారు భోలేబాబా.

తన ఆధ్యాత్మిక స్వేచ్ఛను పణంగా పెట్టి ఇతరులకు సేవ చేయడమా లేక నిస్వార్థ సేవా లక్ష్యాలనూ ఆలోచనలనూ వదిలేసుకుని తన ఏకాంతవాసంలోకి తిరిగి వెళ్లడమా అనే మీమాంసకు భోలేబాబా గురయ్యారు. భోలేబాబా వేదఋషులు నిర్మించిన ఉన్నతమైన సంస్కృతిలో ప్రవేశించిన ఈ మూర్ఖత్వాన్ని ఎలాంటి రాజకీయ జోక్యం లేకుండా ఏ విధంగా ప్రక్షాళన చేయగలమా అని ఆశ్చర్యపోతున్నారు. బాబాజీ తన జ్ఞానాన్ని సువిశాల మానవ సముదాయానికి ఎందుకు పంచడం లేదని తాను చాలాసార్లు అడగడం ఆయనకు గుర్తుకొచ్చింది. దానికి వారి వద్ద నుండి ఓ

చిరునవ్వే సమాధానంగా వచ్చింది. ఇప్పుడు భోలేబాబా బాబాజీ గడుపుతున్న ఏకాంత జీవిత పరమార్థాన్ని అర్థం చేసుకోవడం ప్రారంభించారు. ఎంతో లోతైన ఆంతరంగ మథనం తరువాత తాను ఈ శంకరాచార్య పదవిని త్యజించాలనీ అలా కాకపోతే జీవితంలో భగవంతునితో తనకున్న సంబంధ బాంధవ్యాలను కోల్పోతాననీ నిర్ణయించుకున్నారు. బాబాజీయే ఇతరులకి సేవచేసే మార్గాన్ని నిర్ణయిస్తారని అనుకున్నారు.

ఇప్పుడు గనుక తాను ఈ పదవిని వదిలేస్తున్నానని ప్రకటిస్తే మొత్తం ఆశ్రమంతోపాటు ఈ మఠాన్ని అనుసరించే ప్రజలందరూ గందరగోళానికి గురవుతారని భోలేబాబాకి తెలుసు. తాను వెళ్లిపోయే ముందు తన వారసుణ్ణి నియమించకపోతే అది బాధ్యతారాహిత్యం అవుతుంది. అయితే వారసుణ్ణి నియమించడం ఎంతో బాధ్యతతో కూడిన పని. ఎందుకంటే ఈ పని ఇక్కడ ఎంతో కాలంగా ఉంటున్న సన్యాసుల మధ్య వైరాన్ని ప్రేరేపిస్తుంది. దాంతో ఎవరికీ తెలియజేయకుండా నిశ్శబ్దంగా ఆశ్రమాన్ని విడిచివెళితే వాళ్లే తగిన సన్యాసిని తమ నాయకుడిగా ఎంచుకుంటారని భోలేబాబా నిర్ణయించుకున్నారు.

కానీ ఎలా వెళ్లడం? నిరంతరం అతని చుట్టూ ప్రజలు ఉంటూనే ఉన్నారు. అతను పడుకున్నప్పుడూ లేదా బాత్‌రూంకి వెళ్లినప్పుడు మాత్రమే ఒంటరిగా ఉండడం జరుగుతోంది. కొంత ఆలోచించిన తరువాత ఆయన ఎవ్వరికీ తెలియకుండా అక్కడ నుంచి జారుకునే పథకాన్ని ఆలోచించారు. ప్రతిరోజూ ఉదయం నడవడాన్నే మొదలుపెట్టారు. ఆయనకి ఇష్టం ఉన్నా లేకపోయినా ఆశ్రమవాసులు కొంతమంది ఆయనతోబాటే ఉండేవారు. అలాగే శంకరాచార్య చిహ్నాలైన దండాన్నీ పతాకనీ, కాషాయ వస్త్రాన్నీ, పావుకోళ్లనూ (సన్యాసులు ధరించే చెక్క చెప్పులు) ధరించాల్సి వచ్చేది. అతని కారు డ్రైవరు వారిని ఒకచోట వదిలేస్తే వారు ఎంతో దూరం నడిచి చాలాసేపటికి తిరిగి వచ్చేవారు. తనతోపాటు వచ్చే మనుషులను తగ్గించడానికి నడకదూరాన్ని పెంచి తరచూ దిశలను మారుస్తూ ఉండేవారు. ఒక రోజు అందరినీ ఆశ్చర్యానికి గురి చేస్తూ కారు ఎలా డ్రైవ్ చేయాలో చూపిస్తానని డ్రైవర్ దగ్గర ఉన్న కారు తాళం చెవులను ఆడిగారు. ఇంతటి ఉన్నత స్థాయిలో ఉన్న ఆధ్యాత్మిక గురువు కారు స్టీరింగ్ మీద చేయి పెడతారని ఎవరూ ఊహించలేదు. ఈ రోజుల్లో కూడా స్వామీజీలు కారు నడుపుతారంటే ఎవ్వరూ నమ్మరు. ఆ రోజుల్లో ఇలాంటి విషయాలను ఎవరూ కలలో కూడా ఊహించరు. డ్రైవర్ ప్రక్కన కూర్చోగా భోలేబాబా కారు డ్రైవ్ చేయడం మొదలుపెట్టారు. ఆయన తరచుగా నడకకి వెళ్లే చోటికే కారును తీసుకెళ్లారు. ఆయన తన నడకను పూర్తి చేసుకుని తిరిగి వచ్చి కారును వెనక్కి ఆశ్రమానికి తానే నడుపుకుంటూ వెళ్లారు. కొన్నిరోజులు ఈ దినచర్యను ఇలాగే కొనసాగించారు. ఒకరోజు డ్రైవర్‌ని ఆశ్రమంలోనే ఉండమని తాను కారు నడుపుకుంటూ వెళ్తానని బయల్దేరారు.

ఒకసారి ఒంటరిగా కారును దగ్గరలోని పోలీస్ స్టేషన్ దగ్గరికి తీసుకుని వెళ్లారు భోలేబాబా. ఆ కారు కార్వీర పీఠంకి సంబంధించినదనీ దాన్ని అక్కడే వదిలేయమనీ ఒక చీటీ రాసి దాంట్లో పెట్టి వెళ్లారు. ఆక్కడి నుండి దగ్గరలోని రైల్వే స్టేషన్‌కి వెళ్లి అలహాబాద్ వెళ్లే రైలులో మూడవ తరగతిలోకి ఎక్కి కూర్చున్నారు. వారి దగ్గర టికెట్టు లేదు. కానీ గంభీరమైన వారి వదనాన్ని చూసి చాలామంది తాము కూర్చునే సీటును ఇవ్వజూపారు. ఆయన ఒక సాధువుగా ఎంత ఉత్కృష్టమైన స్థితిలో ఉన్నారో తెలియజేయడానికి ఈ ఉదంతం చాలు. వారు ఒక సీట్లో కూర్చునేసరికి పక్కనున్నవారు కాస్త ఇబ్బంది పడ్డారు. వారితో సమానంగా కూర్చోవడానికి మొహమాటపడి అందరూ కలిసి ఎదుటి సీటులో సర్దుకుని కూర్చున్నారు. భోలేబాబా తనను ఎవరైనా ప్లాట్‌ఫారం మీద నుంచి చూసి గుర్తుపడతారేమోనని పక్కనే ఉన్న కిటికీ రేకు తలుపును

మూసేసి ప్రశాంతంగా కూర్చున్నారు. మిగతా ప్రయాణికులు ఆయన ఎక్కడికి వెళ్తున్నారో తెలుసుకోవాలని ప్రశ్నలు అడగసాగారు. తాను హిమాలయాలకి వెళ్తున్న సాధువునని ఆయన బదులిచ్చారు. స్వామీజీ అనేకమార్లు తన పక్కన కూర్చోమని ప్రయాణీకుల్ని కోరినా ఎవరూ కూర్చోకపోవడంతో ఆ వరస మొత్తం ఖాళీగా ఉంది. అదృష్టవశాత్తూ ఎవరూ ఆయనను గుర్తించకుండానే రైలు బయల్దేరింది.

ఓ అరగంట తరువాత టికెట్ కలెక్టర్ వచ్చాడు. గొప్ప తేజస్సుతో వెలిగిపోతున్న ఈ సాధువు మూడవ తరగతిలో ప్రయాణించడమేమిటని ఆయన ఆశ్చర్యపోయారు. తర్వాత తల వంచి వందనం చేసి ఇతర ప్రయాణీకుల టికెట్లను పరిశీలించడానికి వెళ్లిపోయాడు. తన పని పూర్తి చేసుకుని మళ్లీ అతడు స్వామీజీ వద్దకి వచ్చి మర్యాదగా, 'తమరెవరు? ఎక్కడికి వెళ్తున్నారు?' అని అడిగాడు. తాను ఒక సాధువుననీ తనని మిగతా ప్రశ్నలేవీ అడగవద్దనీ స్వామీజీ చెప్పేశారు. అంతేకాక తనవద్ద టికెట్ లేదనీ, కొనడానికి డబ్బులు లేవనీ, టికెట్ లేకుండా ప్రయాణం చేయడం అనే తప్పును ఇదే మొదటిసారిగా చేయడమనీ చెప్పారు. దాంతో ఆ టి.సి. ఆట పట్టించే ధోరణిలో, 'ఒకవేళ నేను తరువాతి స్టేషన్‌లో దిగిపోవాలని అంటాననుకోండి...పోనీ లేకపోతే మీరు ఎవరో చెప్తేనే ప్రయాణం చేయనిస్తానని అంటాననుకోండి, ఏం చేస్తారు?' అని అడిగాడు.

దానికి భోలేబాబా 'దయచేసి అలా చేయకండి. మీ సహాయం నాకెంతో ముఖ్యం. అలహాబాద్‌లో నా శిష్యులు నా కోసం ఎదురు చూస్తుంటారు. వాళ్లు నా టికెట్ డబ్బులూ ఇంకా ఆదనపు రుసుమూ మీకు చెల్లిస్తారు. అలహాబాద్ చేరగానే నేనెవరినీ ఎందుకు టికెట్ లేకుండా ప్రయాణం చేస్తున్నదీ అన్నీ వివరంగా చెబుతానని ప్రమాణం చేస్తున్నాను,' అన్నారు.

కానీ ఆ టి.సి. తన డ్యూటీ అలహాబాద్ కన్నా చాలా ముందుగా నాగపూర్ స్టేషన్‌లోనే అయిపోతుందని అనగానే భోలేబాబా నవ్వి, 'అయితే నాతో బాటు అలహాబాద్‌కు నా అతిథిగా రండి' అన్నారు.

టి.సి. భోలేబాబా ఆహ్వానాన్ని అంగీకరించి ఆయనతో కలిసి ప్రయాణమయ్యారు. రాత్రి ప్రయాణమంతా టి.సి. స్వామీజీకి మంచినీళ్లూ, పండ్లూ, టీ, బిస్కట్లూ ఇస్తూ ఉన్నాడు. అలహాబాద్ జంక్షన్‌లో భోలేబాబాను తీసుకుని వెళ్లేందుకు బేనీ ప్రసాద్ టాండన్ కుటుంబం వచ్చింది. అప్పుడు మాత్రమే ఆ టి.సి.కి ఈ ప్రయాణీకుడెవరో అర్థమైంది. తాను ఎవరికీ ఈ సంఘటన గురించి చెప్పనని ప్రమాణం చేసి ఆయన తన ఇంటికి తిరిగి వెళ్లారు. భోలేబాబా కొద్దిరోజులు టాండన్ కుటుంబంతో ఉండి అటు తరువాత తన గురువు బాబాజీని కలవడానికి హిమాలయాలకి వెళ్లారు.

ఆయన గురువు చూడగానే వారి కాళ్ల మీద పడి భోలే బాబా 'నన్నెందుకు ఆ పదవిని స్వీకరించమన్నారు?' అని అడిగాడు దీనంగా.

బాబాజీ చిరునవ్వుతో 'నేనేమీ ఆదేశించలేదు. నీకు ఆ కోరిక ఉంది. నా అనుమతి కోరావు. నువ్వు వెనక్కి తిరిగి వచ్చినందుకు చాలా సంతోషం. ఈ ప్రాపంచిక ప్రభావాలు ఒక స్వామి వెంటపడి అధ్యాత్మిక చింతనాపరుణ్ణి తనలో ఎలా ఇముడ్చుకోవాలని ప్రయత్నిస్తుందో చూశావు. ఇప్పుడు నిన్ను ఏదీ ప్రభావితం చేయలేదు. ఎందుకంటే నువ్విప్పుడు ఒక స్థానాన్నీ, ఆధికారాన్నీ అనుభవించి వాటిని వదిలేయడంలో అనుభవం సాధించావు. ఇప్పుడు నిన్ను ప్రాపంచిక విషయాలేవీ ప్రభావితం చేయలేవు.

'ప్రజలు ఆధ్యాత్మిక గురువుల నుండి ఎంతో ఆశిస్తుంటారు. వాళ్ల జ్ఞానాన్ని పెంచి పైకి తీసుకురా. కానీ నీ దారిని ఎన్నడూ విడనాడకు!' అన్నారు బాబాజీ.

కొన్నిరోజుల తర్వాత బాబాజీ ఒక కొత్త విషయాన్ని సంభాషించడం ప్రారంభించారు. అంతకు ముందెన్నడూ దాని ప్రస్తావన రాలేదు. 'చాలామంది పెళ్లి చేసుకుని పిల్లల్ని కంటారు,' బాబాజీ కొనసాగిస్తున్నారు. 'ప్రపంచంలోని చాలా సమస్యలు మానవ సంబంధాల చుట్టే తిరుగుతూ ఉంటాయి. కుటుంబ శ్రేయస్సూ, ఉద్యోగం, వ్యాపారం ఇలాంటి వాటి చుట్టే సమస్యలు తిరుగుతూ ఉంటాయి. నీకు ఇలాంటి వాటితో అనుభవం లేనప్పుడు ఏ విధంగా వారి సమస్యల్ని పరిష్కరిస్తావు? వారికెలా మార్గదర్శిగా ఉండగలవు? ఎలా సేవ చేయగలవు? నువ్వు పెళ్లి చేసుకో. అప్పుడే ఈ ప్రపంచంలో ఎలా ఉండాలో తెలుస్తుంది? అది నీకు ఈ సంసార బంధం అనే సాలెగూడులో చిక్కుకున్న వారి పట్ల నిజమైన ప్రేమ జాలి కలుగుతుంది.

'ఇంకా చెప్పాలంటే ఆధ్యాత్మిక జీవితంలో నీకున్న ఆ కాస్త గర్వం కూడా మాయమైపోతుంది. నువ్వు శంకరాచార్య పీఠం ఆధారంగా నడవకూడదు. నువ్వు నీ హక్కులను సాధించుకుని ఆత్మగౌరవంతో వుండాలి. ఆత్మగౌరవం కలవారు ఎవరైనా పొగిడితే ఉబ్బిపోవడం, తెగిడితే తలక్రిందులవడం చేయరు,' అన్నారు.

మరో ప్రక్క కార్వీర పీఠంలో తమ శంకరాచార్యుల జాడ కనుక్కోవడానికి ప్రయత్నిస్తున్నారు. ఆశ్రమంలో నివసించలేక చాలామంది అనుచరులు పూర్తిగా అదృశ్యమయ్యారు. కొంతమంది ఆశ్రమంలోనే ఏదో సమస్య ఉందని అనుకున్నారు. మరి కొంతమంది అసలు సమస్య భోలేబాబాలోనే వుందన్నారు. కొంతమంది అతను పిరికివాడనీ సంప్రదాయాన్ని నాశనం చేశాడనీ అన్నారు. మరి కొంతమంది అతనికున్న నిరాసక్తత, నిర్భీతి గురించి మాట్లాడుకున్నారు. కొంతమంది అతని కోసం మళ్లీ వెతికి తీసుకొద్దామనుకున్నారు. మరి కొంతమంది ఇష్టంలేని పని నుండి బైటికి వెళ్లిన అతని నిర్ణయంలో మనం కలగజేసుకోకూడదని అనుకున్నారు. ఈ గందరగోళ పరిస్థితిలో ఎవరూ ఇంకొకరి మాట వినే స్థితిలో లేరు. ఎవరికి వారు తమకి ఇష్టమైన పద్ధతుల్లో పని చేసుకుపోతున్నారు. కొంతమంది ఆయన కోసం వెతుకుతుండగా మరి కొంతమంది ఆయన వెళ్లిపోవడంతో ఏర్పడిన ఖాళీని భర్తీ చేయాలని భావించారు.

జరిగిన మొత్తం సంఘటన పట్ల ఆందోళన వెలిబుచ్చినప్పుడు బాబాజీ నవ్వి, 'మనిషి జ్ఞాపకశక్తి కుక్క జ్ఞాపకశక్తి కన్నా హీనం. ప్రజలకు చాలా సమస్యలున్నాయి. ఎవరు చూడొచ్చారు నువ్వు శంకరాచార్య కిరీటానికి మెరుగులు దిద్దుతున్నావో లేక నీ ఉపేక్షతో ఇబ్బందులకు గురి చేస్తున్నావో? మతగురువుల లేదా రాజకీయనాయకుల పట్టాభిషేకాలు కానీ రాజీనామాలు గానీ అప్పటికప్పుడు క్షణికమైన ఉత్సాహాన్ని సృష్టిస్తాయి. అమాయక ప్రజలకి ఈ ప్రపంచం గురించి తెలీదు. గుంపులో గోవిందలాగ ఉంటారు. అందరూ ఏమంటే అదే అంటారు. కొన్ని రోజులు గడిస్తే చక్కగా వెనక్కిపోయి తమ దైనందిన జీవితంలో మునిగిపోతారు. వాళ్ల గురించి తప్ప ఎవ్వరికీ దేనిగురించి అలోచించే సమయం ఉండదు. కార్వీర పీఠంలోని వాళ్లకు కూడా వారి స్వంత కార్యక్రమాలున్నాయి. పదవి పట్ల వాళ్లకి ఉన్న ఆశలూ, కీర్తికాంక్ష, ప్రతిష్ఠ నీ జ్ఞాపకాలను మెహమాటం లేకుండా తుడిచివేస్తాయి. ఆ పీఠాన్ని వదిలి సంవత్సరం దాటింది. వెళ్లు. వెళ్లి నీ కార్యక్రమంలో నిమగ్నమవ్వు,' అన్నారు.

బాబాజీ ఆయనను ఉత్తర భారతదేశంలో లక్నో, అలహాబాద్, కాన్పూరులాంటి ప్రదేశాల్లో తిరగమన్నారు. అలానే చేశారు భోలేబాబా. తిరుగుతున్నప్పుడల్లా వివాహం చేసుకోమన్న బాబాజీ మాటలు ఆయనకు గుర్తొస్తుండేవి. కానీ ఎలా? భారత దేశంలో ఎవరన్నా తమ కూతుర్ని

చూస్తూ చూస్తూ ఒక సన్యాసికి ఇవ్వగలరా? అయినా బాబాజీ తనను వివాహం చేసుకోమన్నారు. తన వివాహం కోసం బాబాజీ ఖచ్చితంగా తనదైన పద్ధతుల్లో రహస్యంగా ఏదో ఏర్పాట్లు చేసే ఉంటారని ఆయనకి బాగా తెలుసు. అంతా దేవుడి మీదే భారం వదిలారు. ఆయన గృహస్థ జీవితంలోకి ప్రవేశించడానికి తన వైపు నుంచి ఎలాంటి ప్రయత్నం చేయలేదు.

బాబాజీ మాటలు ఎలా కార్యరూపం దాలుస్తున్నాయో భోలేబాబా తన 'హిమాలయ పరమగురువులతో జీవనం'లో వ్రాశారు. 'నేను ఉత్తరప్రదేశ్‌లో ఉండగా ఉత్తర ప్రాంతంలో ఒక రాష్ట్రమైన ఉత్తర ప్రదేశ్‌లోని కొంతమంది నన్ను రోజూ సాయంత్రం కలుస్తుండేవారు. వాళ్లకి నేను ఉపనిషత్తులపై ఉపన్యాసాలు ఇచ్చేవాడిని. ఒకరోజు ఇంగ్లీష్ లిటరేచర్‌లో డిగ్రీ పూర్తిచేసిన ఒక అమ్మాయి నా ఇంటర్వ్యూ ఆడిగింది. మాటల్లో నేను ఆమెకు పోయిన జన్మలో భర్తనని బలంగా చెప్పసాగింది. రెండు గంటల తరువాత అది నిజమే కావచ్చు అనే స్థితికి నేను చేరుకున్నాను. ఇంతవరకూ నాతో అలా ఎవరూ వ్యక్తిగతమైన రీతిలో మాట్లాడేవారు తారసపడలేదు. ఆమే ఈ జన్మలో కూడా మనం వివాహం చేసుకుందామని ఒప్పించడానికి ప్రయత్నించింది. దాంతో నేను ఆమెతో జీవితం ఎలా ఉంటుందో ఆలోచించడం మొదలుపెట్టాను. 'మా గురువుగారు ఈ పెళ్లికి ఒప్పుకుంటే నాకు సమ్మతమే' అని అన్నాను. ఆ అమ్మాయి పేరొందిన కుటుంబం నుంచి వచ్చింది. ఆమె సోదరులూ, ఇతర బంధువులూ ఉన్నతమైన ప్రభుత్వ ఉద్యోగాలలో ఉన్నారు.'

ఆ రకంగా భోలేబాబా ఈ లౌకిక ప్రపంచ వ్యవహారంలోకి ప్రవేశించారు. తాను గతంలో సన్యాసాశ్రమంలో ఉన్నాననే విషయం ఆమె తరఫు వాళ్లకి తెలియనిదేమీ కాదు. ఇప్పుడు ఆయన పేరు బ్రజ్ కిషోర్ కుమార్. కానీ చాలా మంది ఆయన్ని ఇప్పటికీ భోలేబాబా అనే అంటారు. కొంత సొమ్ము బాబాజీ నుండి తీసుకుని ఆగ్రాలో చిన్న వ్యాపారం మొదలుపెట్టారు ఆయన. వ్యాపారవేత్తగా ఆయనపేరు కుమార్ సాహెబ్. కానీ లోతుగా ఆయనను పరిశీలిస్తే తన మానసిక ప్రవృత్తిలో ఆయన ఇంకా సాధువే. తన కుటుంబ పోషణార్థం కష్టపడి పనిచేయడానికి ఆయన ఏమాత్రం వెనుకాడలేదు. అప్పటికే ఆయనకి ఒక కుమారుడు జన్మించాడు. అతడి పేరు మోహిత్. అనతికాలంలోనే ఆయన వ్యాపారం మూడుపువ్వులు ఆరుకాయలుగా వర్ధిల్లింది.

ఉత్తర భారతదేశంలోని భోలేబాబా భక్తులు పుకార్లతో ఎంతో కోలాహలంగా ఉన్నారు. కేవలం ఈ అమ్మాయిని పెళ్లిచేసుకోవడానికే భోలేబాబా కార్వీర పీఠాన్ని వదిలేసి వచ్చాడని అందరూ అనుకోసాగారు. అలహాబాద్ విశ్వవిద్యాలయంలో నా పరిశోధన సలహాదారుడు డా.ఎం.పి.లఖేరా స్వామీజీ జన్మించిన గఢ్వాల్ హిమాలయ ప్రాంతం నుండి వచ్చారు. స్వామి వారి వివాహం తరువాత వారిని పూజించిన చాలామంది ఆయన భక్తులు ప్రస్తుతం ఆయనకు శత్రువులుగా మారారని చెప్పారు. ఆయన పతనాన్ని చూసి ఎంతో గాభరా పడిపోయారనీ అలాంటి సాధువుకి తాము శిష్యులమని చెప్పుకోవడానికి ఎంతో సిగ్గుపడుతున్నారనీ ఆయన తెలియజేశారు. మరోవైపు స్వామీజీ ఆధ్యాత్మిక విజయాలను కాకుండా, ఆయనకు అలహాబాద్ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ ఆర్.డి.రనడేకి ఒక ప్రధాన శిష్యుడిగా ఉన్నందుకు డా. లఖేరా ఎంతో మెచ్చుకుంటున్నారు. స్వామీజీ విమర్శలకి ఏమాత్రం భయం లేకుండా ఈ పరిస్థితి అనివార్యం చేసేవాస్తవాన్ని గౌరవించినందుకు ఆయన స్వామీజీని ఎంతో కొనియాడారు.

స్వామీజీ జీవితంలో ఆ రోజులు ఎంత క్లిష్టంగా ఉన్నాయనేది వారి శిష్యుల ద్వారా వారితో బహువిధాల సంబంధాలు ఉన్న వ్యక్తుల ద్వారా నాకు తెలిసింది. అలా తెలిసిన వారిలో కల్నల్ ఖైరా ఆయన పిల్లలు, రవి, పీకూలు కూడా ఉన్నారు. వీళ్లు ఆ రోజుల్లో ఆయనతో

ఉన్నారు. 1980 లో వాళ్లు ఆయనతో కెనడాకి వెళ్లారు. అప్పటి నుండీ వాళ్లు పెన్సిల్వేనియాలో ఉన్న హిమాలయన్ సంస్థలో ఎంతో చురుగ్గా పాల్గొన్నారు. వాళ్లు పిల్లలుగా ఉన్నప్పుడు ఆయన్ని 'మామయ్యా' అని పిలిచేవారు. పెరిగి పెద్దయిన తరువాత కూడా వాళ్లు ఆయనతో ఆడుతూ ఉంటే స్వామీజీ వారితో చిన్నపిల్లవాడిగానే ప్రవర్తించేవారు. స్వామీజీ 'హోనేస్ డాల్'లో ఒకసారి కుక్కతో ఆడుతుంటే రాజా, రవీలు, 'మామయ్యా, మీలాగా ఎవరూ కుక్కకి ట్రైనింగ్ ఇవ్వలేరు' అని అన్నారు.

స్వామీజీ గర్వంగా నవ్వి, 'ఓసారి నా కుక్క దొంగని పట్టుకుంది గదా, ఆ విషయం నీకు గుర్తుందా?' అని అడిగారు.

'గుర్తుంది మామయ్యా, ఎంత అద్భుతమైన దృశ్యం అది!' అన్నారు ఆ పిల్లలు.

అప్పుడు భోలేబాబా ఆగ్రాలో చుట్టూ గడ్డితో పెద్ద సరిహద్దు గోడతో ఉన్న మంచి బంగళాలో ఉంటుండేవారు. భోలేబాబా తనకు తానుగా శిక్షణ ఇచ్చిన రెండు భయంకరమైన కుక్కలు ఆ బంగళాకు కాపలా ఉండేవి. ఒకరోజు రాత్రి ఆయన భార్య లేనప్పుడు భోలే బాబా ధ్యానంలో ఉండగా ఒక దొంగ ఇంట్లోకి ప్రవేశించాడు. ఆ కుక్కలు అతన్ని కిందకి పడదోసి ఒకటి అతని మీదకెక్కి అతని ముఖంలోకి వాసన చూస్తూ ఉండగా ఇంకో కుక్క ధ్యాన మందిరానికి వెళ్లి భోలేబాబా చుట్టూ తిరుగుతూ తన తోకను ఆయన వీపుకి రాస్తూ హెచ్చరించింది. ధ్యానానికి ఇబ్బంది కలిగించకుండా ఉండేటట్లు భోలేబాబా వాటికి శిక్షణ ఇచ్చారు. ఆయన కళ్లు తెరిచాడో మళ్లీ ఆ కుక్క ఏదో జరుగుతోందన్నట్లు సైగలు చేయడం మొదలుపెట్టింది. భోలేబాబా వాటిని అనుసరించగా ఆ కుక్కలు భయపడుతున్న ఆ దొంగ చుట్టూ ఆరుస్తూ గెంతడం మొదలుపెట్టాయి. ఈ కుక్కలు ఏ మాత్రం దొంగను గాయపరచకుండా కేవలం పట్టుకునేటట్లు మాత్రం ఇచ్చిన శిక్షణకు పోలీసులు ఆశ్చర్యపోయారు.

ఇంట్లో మొదట్నించీ భోలేబాబా జీవితం చాలా సంక్లిష్టంగా ఉండేది. దానికి కారణం సనాతన ఆచారపరాయణులైన ఆ హిమాలయ బ్రాహ్మణ కుటుంబం పాత్ర ఎక్కువగా ఉండడమేనని డా॥ లఖేరా అన్నారు. బ్రాహ్మణులందరూ అగ్రవర్ణమే కానీ ఆ వర్ణంలోనే మళ్లీ హెచ్చుతగ్గుల తారతమ్యాలున్నాయి. సామాన్యంగా ఉన్న ఆచారం ఏమిటంటే బ్రాహ్మణకులంలోని అమ్మాయిని అదే కులంలోని పైస్థాయి కుటుంబానికి చెందిన పిల్లవాడికి ఇవ్వాలి. అలా చూసుకుంటే స్వామీజీ కుటుంబం ఘర్వాల్‌కి చెందింది, అది ఆయన భార్య కుటుంబం కన్నా క్రింది స్థాయిలో ఉన్న కుటుంబం. 'వాళ్ల అమ్మాయిని స్వామీజీ పెళ్లిచేసుకోవడం ద్వారా కుటుంబానికి వచ్చే అవమానాన్ని వాళ్లు మర్చిపోలేకపోతున్నారు' అని డా॥ లఖేరా అన్నారు.

భోలేబాబా తండ్రివైపు వాళ్లు ఈ సమస్యలకి మరి కాస్త తోడయ్యారు. వాళ్లు దాదాపుగా ఈయన్ని మర్చిపోయారు. కానీ ఊహించని రీతిగా ఈయన వివాహం చేసుకోవడంతో వాళ్లంతా చాలా ఆశ్చర్యపోయారు. ఆయన భార్య వైపు వాళ్లలాగానే వీళ్లు కూడా సమాజాన్ని ప్రభావితం చేయగల ఉన్నత స్థాయిలో ఉన్నవాళ్ళే. వాళ్లు పండగలకీ పబ్బాలకి అందరూ కలిసి విందులూ, పూజలూ చేసుకుంటూ ఉండేవాళ్లు. ఎప్పుడూ భోలే బాబాని రమ్మని ఎన్నడూ అడిగేవారు కాదు. కానీ ఇప్పుడు వాళ్లు అతన్ని కూడా వచ్చి తమ సమూహంలో చేరమనేవాళ్లు. కానీ భోలేబాబా భార్య వైపు బంధువులు, వాళ్లతో కలవడమంటే తమ గౌరవాన్ని పోగొట్టుకోవడమేననీ, వాళ్లకు తలవంచడమేనని అనుకునేవాళ్లు. భోలేబాబా తమ గౌరవాన్నీ, ఆధిక్యతనీ నిలబెట్టాలనీ వారి ఉద్దేశ్యం. ఈ పోకడతో కనీసం వాళ్లు కుటుంబాలను కలవనిచ్చేవాళ్లు కూడా కాదు. మెల్లగా

అయనలో పెంపొందిన 'అందర్నీ ప్రేమించడం, ఎవరినీ ద్వేషించకపోవడం అనే లక్షణం' వల్ల భోలేబాబా ఈ విషయాన్ని పెద్దగా పట్టించుకోకుండా అందరితో సఖ్యతగా ఉంటూ వచ్చేవారు.

అయితే ఆయనకి ఈ పరిస్థితుల్లో ఆయన ధ్యానానికి నిరంతరం అంతరాయం కలుగుతూ ఉండడం వల్ల ఇబ్బంది పడేవారు. ఆయన వ్యాపారంలో కష్టపడి పనిచేస్తున్నప్పటికీ, అందరి అవసరాలూ తీరుస్తున్నప్పటికీ, కుటుంబ బాధ్యత నిర్వహిస్తున్నప్పటికీ ఎవ్వరిలోనూ తగినంత సంతృప్తి ఉండేదికాదు. అది కూడా ఆయన్ని బాధించేది కాదు, కానీ ఆయన చేసే యోగ ధ్యానాన్నీ, సాధననూ వాళ్లంతా ఓ అనవసరమైన కార్యక్రమంగా చూసేవారు. ఆయన అలా గంటల తరబడి ధ్యానంలో వుంటే ఆయన తన కుటుంబంతో గడపడానికి సమయం ఎక్కడ నుంచి వస్తుందో వాళ్లకి అర్థమయ్యేది కాదు. క్రమేపీ వివాహ బంధంలో ఉండే మాధుర్యం కాస్తా త్వరలోనే అంతర్ధానమై పోయింది.

1978 లో నేను అలహాబాద్ విశ్వవిద్యాలయంలో నా డాక్టరేట్ పరిశోధనపై పనిచేస్తున్నపుడు, భోలేబాబా తన కుటుంబాన్ని వదలి తిరిగి స్వామీజీగా మారడాన్ని విమర్శిస్తూ సున్నితంగా డా. లఖేరాని ఆట పట్టించాను. నిజానికి ఆయనెంతో గంభీరంగా ఉంటారు. ఆయన స్థితప్రజ్ఞులు. ఎవరిపట్ల అయినా వారికుండే వ్యక్తిగత అభిప్రాయాన్ని తెలుసుకోవాలంటే చాలా కష్టం. ఆయన నాతో ఏకీభవించకపోతే వెంటనే ఒక సిగరెట్ వెలిగించి, దాన్ని గాఢంగా పీల్చి అప్పుడు మాట్లాడతారు. ఇప్పుడు సరిగ్గా అలాగే చేశారు.

'ఈ మహనీయుని జీవితంలో ప్రతి దశా తీవ్రమైన భావోద్వేగాల మధ్య ప్రయాణించింది', డా. లఖేరా చెప్పసాగారు. 'వారి తల్లిదండ్రులు పిల్లల్ని కనే సమయం దాటిపోయిన తరువాత ఆయనను కన్నారు. చిన్నతనంలో ఆయన ఒకరి ప్రేమను చవి చూస్తే మరొకరి ద్వేషాన్ని ఎదుర్కొన్నారు. తప్పని పరిస్థితులలో, స్థిరనివాసం లేని సన్యాసులు పెంచారు. ఆయన అలహాబాద్ విశ్వవిద్యాలయానికి అనుబంధమైన ముస్సోరీలో ఉన్న వుడ్ స్టాక్, ఆక్స్‌ఫర్డ్ స్కూళ్లలో చదువుకున్నారు. మహాత్మాగాంధీ, రవీంద్రనాథ్ ఠాగూర్ వంటి మహానుభావులతో కలిసి నివసించారు. అతి చిన్న వయసులోనే ప్రతిష్ఠాత్మకమైన శంకరాచార్య పీఠం అలంకరించి దాన్ని వదిలేశారు. సాంసారిక జీవనంలో వారి కొత్త బంధువులు మంచం మీద కూర్చుని 'మీరెంత అనాగరికులు!' అని ఎగతాళి చేసి అవమానం చేస్తుంటే సహించారు.

'కానీ తన దారిలో ఏదైనా అడ్డం వస్తే దాన్ని సమూలంగా తుడిచి పారేసి తన దారిన తాను పోగలిగే అదృశ్య తుఫాన్ ఆయన. ఇప్పుడు ప్రజలు ఆయనని 'రామా' అని పిలుస్తారు. కానీ ఆయనలో నాకు కేవలం *లక్ష్యం తప్ప మరేమీ చూడని పరాక్రమశాలి హనుమంతుడు* కనిపిస్తాడు. మీరు మర్యాదస్తులే అయితే ఆయన గురించి ఎప్పుడూ అలా మాట్లాడవద్దు. అవి మీ నోటికి సరిపోవు,' అని ముగించారు డా. లఖేరా.

ఎపుడైనా కుటుంబ విషయాలకు సంబంధించి బాబాజీని ఏదైనా సలహా అడిగితే భోలేకి ఆయన ఇచ్చే సమాధానం ఒకటే, 'ఓపికగా ఉండడం నేర్చుకో!' కానీ చివరికి ఆయన భరించలేని స్థితికి చేరుకున్నారు. వారి గురువుగారి దగ్గరికి వెళ్లినప్పుడు ఆయన ఎలాంటి ప్రశ్నలూ, విచారణలూ చేయకుండా 'నీకొక లక్ష్యం ఉంది. నువ్వు ఇంతవరకూ దాన్ని పూర్తి చేయలేదు. ఈ ప్రాపంచిక అనుబంధాలనూ ఆధ్యాత్మిక విజయాలనూ పరీక్షించి బేరీజు వేసుకోని సర్వసంగ పరిత్యాగ మార్గాన్ని ఎంచుకో! ఇప్పుడు నీకు నువ్వే ఆ ప్రపంచంలోకి ప్రవేశించడానికి సన్నద్ధమవుతున్నావు. అలా కాకుండా ఇదే వాతావరణంలో దీని ప్రభావంలోనే ఉంటే గనుక తిరిగి సన్యాస మార్గానికి రావడానికి చాలా జన్మలు పట్టవచ్చు' అన్నారు బాబాజీ.

తర్వాత స్వామీజీ ఇలా వ్రాశారు, 'నిర్ణయం నాకు వదిలేయబడింది. నా గురువుగారి మాటలు విన్న తరువాత ఈ బంధనాన్ని తెంచుకుని తిరిగి సన్యాస మార్గాన్ని స్వీకరించాలని భావించాను.'

భోలేబాబా తన భార్యకూ పిల్లలకీ అన్నీ సమకూర్చారు. సంసార జీవితాన్ని గడుపు తున్నపుడు ఆయన సంపాదించి ఉంచినదంతా వాళ్లకిచ్చేశారు. వాళ్లు ఏ లోటూ లేకుండా గడపగలరని నిర్ధారించుకున్న తరువాత ఆయన తన గురువు దగ్గరికి వెళ్లిపోయారు.

చివరికి తన ఆత్మికపుత్రుడు అనుభవపూర్వకంగా నేర్చుకున్న ఆధ్యాత్మిక స్వాతిశయంతోనూ ఇంకా ఈ ప్రపంచంలో అనుభవించిన సుఖదుఖా:లతోనూ తన వద్దకు తిరిగి రావడాన్ని బాబాజీ గమనించారు. అప్పుడు బాబాజీ భోలేకి, 'మానవ నిర్మిత ఆచారాలు మన చైతన్యానికి దోహదపడేంతవరకూ మనం వాటిని పాటించాలి. అవి జీవితాన్ని సులభసాధ్యం చేయడానికే తప్ప, సంక్లిష్టం చేయడానికి కాదు. ఈ ప్రపంచంలో అన్నిటికన్నా ప్రమాదమైనది బంధనం. నువ్విప్పుడు పరిపూర్ణమైన మానవుడివి, సంతోషం–దు:ఖం, గెలుపు–ఓటమి, చావు–పుట్టుక ఇవేవీ నీ ఛాయలకు రాలేవు' అని బోధించారాయన.

బాబాజీ మళ్లీ భోలేబాబాకు సన్యాస దీక్ష ఇచ్చారు. ఈసారి సన్యాస దీక్ష తీసుకుంటున్నపుడు చేసే ధార్మిక ఆచార సంప్రదాయాలేవీ లేకుండానే తీసుకున్నారు. ఈ సన్యాస దీక్షతో భోలేబాబా మళ్లీ 'స్వామీ రామ'గా జన్మించారు. మొదట్లో సన్యాస దీక్ష స్వీకరణ, దాన్ని వదిలేసి గృహస్థాశ్రమాన్ని స్వీకరించడం, మళ్లీ దాన్ని వదిలి, సన్యాసిగా మారడం ఇదంతా కొంతమందికి గందరగోళంగా అనిపించింది. మరికొంతమంది ఆయన మొత్తం యోగీశ్వరుల ఆధ్యాత్మిక సంప్రదాయాలనూ విలువలనూ నాశనం చేశారని అన్నారు. కానీ పరిశీలనా జ్ఞానం ఉన్నవారు మాత్రం వేద సంప్రదాయ తత్వం స్వామీ రామ జీవితంలో ప్రవేశించగా ప్రయోగాత్మక అనుభవ జ్ఞానంతో సత్య మార్గంలో నిర్భయంగా వెళ్లిపోవడాన్ని చూశారు.

హిమాలయ పరమగురువులతో జీవనంలో స్వామీజీ దీని గురించి సోదాహరణగా వివరించారు. 'రెండు ప్రసిద్ధ మార్గాలున్నాయి; 1. సర్వసంగపరిత్యాగం. 2. లౌకిక మార్గం. నా దారి సర్వసంగ పరిత్యాగ మార్గం. ఎవరూ ఈ రెండింటినీ ఒకదానితో మరొకదాన్ని పోల్చి ఒకటి గొప్పదనీ మరొకటి తక్కువదనీ మాట్లాడకూడదు. సంసారంతో కూడి ఈ ప్రపంచంలో నివసిస్తూ పనిచేయడం అనే దారిని నేను ఖండించను గాక ఖండించను. ఆ దారి జీవితావసరాలను సమకూరుస్తుంది. కానీ ఆ దారిలో ఎంతో సమయం వెచ్చించాలి. సర్వసంగ పరిత్యాగ మార్గంలో ఆధ్యాత్మిక సాధనకు ఎంతో సమయం ఉంటుంది. కానీ జీవితావసరాలైన తిండి, బట్ట, నివాసంలాంటివి పరిమితంగా వుంటాయి. ఇలాంటి ఆవసరాలకి సర్వసంగ పరిత్యాగి గృహస్థుల మీద ఆధారపడాలి. ఎవరైనా ఏ దారిలో వెళ్తున్నారనేది ముఖ్యం కాదు. నీతి, నిజాయితీ, విధేయత, సత్యశీలత, విశ్వాసం–ఇవే ముఖ్యం. ఈ రెండు మార్గాల్లోనూ కూడా అవే ముఖ్యమైనవి.

'ఈ నిర్దిష్ట సంఘటన నా జీవితానికి కొంత అపఖ్యాతి తెచ్చిపెట్టింది. ఎందుకంటే ప్రజలు స్వామీజీ అంటే ఎంతో ఉన్నత స్థానంలో అధిష్ఠించి ఆరాధనాభావంతో కొలుస్తారు. వాళ్లని దివి నుండి భువికి దిగి వచ్చిన దేవతలుగా భావిస్తారు. భారతదేశంలో 'స్వామి' అంటే ప్రపంచానికి ఆవల ఉండే మహనీయుడనీ, అతనికి ప్రాపంచిక స్వాధీనత ఏమీ ఉండకూడదనీ, లౌకిక ప్రపంచ బంధాలకి అతడు అతీతంగా ఉండాలనీ కోరుకుంటారు. ఇలాంటి అంచనాల వల్లే స్వాతిశయంతో ఇలాంటి దారుల్లో నివసించే వారిని ఎంతోమందిని చూశాను. పాశ్చాత్య మనస్తత్వ శాస్త్రవేత్తలు, సన్యాసం ముఖ్యంగా బ్రహ్మచర్యం అనేది సన్యాసంలో ఓ పిచ్చిచేష్ట అనడం

అధ్యాయం 6

# శ్రీరామ పథంలో పయనం

శంకరాచార్యగా ఉండే స్వాముల పేర్ల చివర ఉత్తరాదిలో అయితే 'ఆనంద' అని, దక్షిణాదిలో అయితే 'ఇంద్ర' అని ఉంటుంది. కొత్తగా సన్యాసదీక్ష తీసుకున్న స్వామీ రామకి బాబాజీ 'స్వామీ రామానంద' లేక 'స్వామీ రామేంద్ర' అనే రెండుపేర్లలో ఏదీ పెట్టకపోవడం కొంచెం వింతగా తోచింది. బాబాజీ శంకరాచార్య క్రమానికి తనని పరిమితం చేయలేదని వారికి తెలుసు. రామానుజాచార్యుల వర్గానికి చెందిన స్వాములు కూడా ఆయనను తమ సంస్కృతికి చెందినవారిగానే పేర్కొన్నారు. వాళ్ల సంప్రదాయంలో 'ఆనంద' 'దాస' 'దేశిక' లేదా 'ఆచార్య' అని పేర్లను చివర ఉంచుతారు. ఆచార్యుల సమూహంలో బాబాజీ అనీ, బాబా ధర్మదాస్ అనీ వ్యవహరించేవారు. ఈ పద్ధతులను అనుసరించినట్లయితే బాబాజీ భోలేకి, 'స్వామీ రామ దాస్' అని గానీ, 'బాబా రామదాస్' అని గానీ తోటి సోదరగురువులకు పెట్టినట్టే స్వామీజీకి కూడా పేరు పెట్టేవారు.

*తన సన్యాస ప్రస్థానాన్ని ఋషీకేశ్ ఉత్తరాన ముప్ఫై మైళ్ల దూరంలో గంగానది రెండుపాయలైన అలకనంద, భాగీరథీ కలిసే చోట ఎందుకు ప్రారంభించారా!* అని స్వామీజీకి కూడా ఆశ్చర్యంగా ఉంది. ఇక్కడ రామాలయం ఉంది. అంతకు మించిన ప్రత్యేక పవిత్రత ఇక్కడ మరేదీ లేదు. లోతైన హిమాలయాలలోని బదరీనాథ్, కేదారనాథ్ వెళ్ళే యాత్రికులు దారిలో ఇక్కడ ఆగి తమ పితృదేవతలకు తర్పణాలు వదిలి, పిండ ప్రదానాలు చేసి శ్రీరాముల వారిని దర్శించుకుని వెళ్తారు. అయితే బాబాజీ చేసే ప్రతి పనిలోనూ ఒక అర్థం ఉంటుందని ఆయనకు తెలుసు. తనకు 'స్వామీ రామ' అనే పేరును ఎందుకు పెట్టారో, తనకు 'స్వామీ రామ' అనే పేరు పెట్టడం ద్వారా ఏం బోధించదలుచుకున్నారో, తనను దేవప్రయాగ దగ్గర సన్యాసిగా తిరిగి అవతరింపజేయడానికి గల కారణమేమిటో అర్థం చేసుకోవడానికి ప్రయత్నించారు.

ఒకరోజు ఆయన బాబాజీని 'నేను ఏ సంప్రదాయంతో బాహ్య ప్రపంచంలోకి అడుగుపెట్టాలి? నన్ను నేనెలా పరిచయం చేసుకోవాలి?' అనడిగారు.

బాబాజీ, 'నీ అంత్యక్రియలు దేవ ప్రయాగలో నిర్వహించాను. నీ గతం గతించిపోయింది. ప్రపంచంలో నీ గుర్తింపూ, నీ మతం, నీ ఆధ్యాత్మిక గుర్తింపూ అన్నీ గతించిపోయాయి. అన్ని సాంప్రదాయాల దృష్టిలో నువ్వు చనిపోయావు. నీదృష్టిలో అన్ని సాంప్రదాయాలూ గతించి పోయాయి. సాంప్రదాయాలన్నీ మతమనే మత్తును తాగుతున్నాయి. చూడలేదా అవి నిన్ను ఎంత ఇబ్బంది పెట్టాయో?' అన్నారు.

'సంప్రదాయమన్నా...ఆచారమన్నా...అది నీ స్వంత విషయంకాదు. నీటిలో ఉండే చేపకి నీరు సొంతం కాదు. అది దాని జీవనాధారం. సంప్రదాయం నుండి ఆధ్యాత్మిక శక్తినీ,

జ్ఞానాన్నీ పొందుతావు. అది ఒక జ్ఞాన ప్రవాహం. అనేక ప్రవాహాల కలయికతో ఏర్పడ్డ ఈ ప్రవాహం అనంత ప్రాణికోటికి తన జ్ఞానాన్ని అందిస్తుంది. ఎంతోమంది ఋషుల, సాధువుల కృషి వల్ల ఏర్పడిన జ్ఞాన ప్రవాహానికి విడిగా స్వతంత్రంగా ఒక సంప్రదాయం అంటూ ఏదీ లేదు. ఒక సంప్రదాయం మరో సంప్రదాయం నుండి విడిపోయినపుడు అది ఆరాధించే వ్యవస్థగానైనా మార్పు చెందుతుంది లేదా విలుప్తమై పోతుంది. నువ్వు అన్ని సంప్రదాయాలనూ ఆచరించాలి, అయినా ఏ సంప్రదాయానికీ బానిసవు కాకూడదు.'

'కైలాస పర్వతం నీ నివాసం. రాముడికి సేవ చేయడానికీ, ఈ రాముని ప్రపంచానికి సేవ జేయడానికీ, శ్రీరామచంద్రునిలా పనిచేయడానికి నువు పుట్టావు. రాముని అడుగుజాడల్లో నడిచి రామునిలాగా త్యాగపూరితమైన మార్గంలో ప్రయాణాన్ని పూర్తి చేసేంతవరకూ నీ నివాసానికి వెళ్లే హక్కు నీకు లేదు. 'రామరాజ్యం' భారతదేశానికో లేక భారతీయల కోసమో పరిమితమైనది కాదు. మొత్తం ప్రపంచం కోసం ఆయన పరితపించాడు. మానవులనీ మానవేతరులనీ ఒకే రకంగా ప్రేమించాడు. పెద్దలు–పిన్నల మధ్యా, ధనిక–పేదల మధ్యా, మనుషులు–జంతువుల మధ్య వారధిని నిర్మించి శిథిలమైన మనసులకు సాంత్వన చేకూర్చాడు రాముడు.'

ఇది చెబుతూ స్వామీజీ తన కథనాన్ని ఆపి, 'ఆ ఉద్దేశ్యంతో తిరిగి రావడం వల్ల నేను అనిర్వచనీయమైన స్వేచ్ఛానుభూతిని పొందాను. నాలో భోలేబాబా చనిపోయాడు, సదాశివ భారతీ చనిపోయాడు, జగద్గురు శంకరాచార్య చనిపోయాడు, నేనిప్పుడు ఎలాంటి ముద్రా లేని స్వామీ రామగా జన్మించాను. ఇది తెలిసి నేనెంతో ఆనందించాను. జన్మించిన తరువాత కూడా ఈ రామ, తనని సృష్టించిన జగజ్జనని వరపుత్రుడైన బాబాజీ అంతరంగంలో ఆయన మానసపుత్రునిగానే ఉండిపోతాడు. ఈ సృష్టికర్త ఈ రామాని బాహ్య ప్రపంచంలోకి పంపినపుడు అతని మనసులో ఒకే ఒక భావం ఉంటుంది. పెద్దలు–పిన్నలు, సంపన్నులు–బీదలు, మనుషులు–మృగాల మధ్య వారధి నిర్మించిన శ్రీరాముడు, భగ్న హృదయాలకు ప్రశాంతతని ప్రదర్శించిన చారిత్రక పురుషుడైన శ్రీరామచంద్రుని అడుగుజాడల్లో ఆయనకు ఉత్పన్నమైన ఈ రాముడు నడుస్తాడు. ఇప్పటి నుండీ నేను ద్విలోక సంచారిని. అటు నా గురువుగారిలో ఉండే ప్రపంచంలోనూ ఉంటాను. ఇటు బయటి ప్రపంచంలోనూ సంచరిస్తుంటాను.

అయోధ్య నుంచి శ్రీలంక దాకా శ్రీరాముని మార్గాన్ని అనుసరించమని బాబాజీ, స్వామీజీకి చెప్పారు. అలాగే ఏ దేవాలయానికి వెళ్లాలో అక్కడ ఎలా సాధన చేయాలో కూడా చెప్పారు. చివరగా ఈ మాటలతో ఆయన తన ఆదేశాలను అందజేశారు. 'ప్రస్థానం ప్రారంభించే ముందు అన్ని గ్రంథాల్లోకీ ఎంతో ముఖ్యమైన ఆచరణీయమైన రామాయణాన్ని చదువు. దానిలో ఉన్న తాత్విక సూత్రాలను చదివి అచరించేవారికి శోకం ఉండదు. భయం ఉండదు. జ్ఞానులకు జ్ఞాని అయిన హనుమ ఇలాంటి తాత్విక అంశాలు ఎన్నింటినో రామునికి నేర్పారు. ఆయనను చూస్తే చాలు, సాధకులు ఆశీస్సులు పొంది రామ తత్వం తెలుసుకుంటాడు. అన్ని సందర్భాలలోనూ అన్ని పరిస్థితుల్లోనూ ఎంతో గంభీరంగా సంతులిత స్థితిలో ఉండేవాడు రాముడు. నా రామా! మేల్కో, ఇప్పుడే నీ ప్రయాణాన్ని అయోధ్య వైపు ప్రారంభించు. నీ అన్వేషణ రాముణ్ణి కనుగొను గాక!' అన్నారు ఆయన.

భారతీయ సాంప్రదాయం ప్రకారం, ఈ విశ్వసంరక్షకుడూ, పోషకుడూ అయిన శ్రీరాముడు మహా విష్ణువు అవతారం. నీతి నియమాలూ సహజ సూత్రాలూ దిగజారుతున్నప్పుడు, సద్గుణ సంపదనీ, సహజ జీవ సూత్రాల్నీ పునరుద్ధరించడానికి మహావిష్ణువు అవతరించి సృష్టి సమతుల్యాన్ని ఏర్పరుస్తాడు. విష్ణువు అవతారాలు ఇరవైమూడు ఉన్నా వాటిల్లో రామావతారం ఎంతో ప్రాముఖ్యమైనది. ఆయన తండ్రి దశరథరాజు ఉత్తర భారతదేశాన్ని సుసంపన్నంగా

పాలించాడు. ఆయనకు ముగ్గురు భార్యలూ, నలుగురు కుమారులు. వారిలో రాముడు పెద్దవాడు. రాజ కుమారులు ఎంతో సఖ్యతగా ఉండే వాళ్లు. కలిసి పెరిగారు, కలిసి ఆడుకున్నారు, కలిసి చదువుకున్నారు. ఒకే సమయంలో వివాహం చేసుకున్నారు. దశరథ మహారాజు శ్రీరామునికి తన స్థానంలో చక్రవర్తిగా పట్టాభిషేకం చేస్తానని ప్రకటించిన రోజు రాముని సవతి తల్లి కైక ఘర్షణపూరితమైన వాతావరణం తీసుకొచ్చింది. అనేక సంక్లిష్ట పరిస్థితుల పర్యవసానంగా దశరథ మహారాజు బలవంతంగా రాముణ్ణి పధ్నాలుగు సంవత్సరాలపాటు సింహాసనానికి దూరం చేసి అడవులకి పంపాల్సి వచ్చింది. ఇంత పని చేయించిన కైక తన సొంత కొడుకు భరతుడికి పట్టాభిషేకం చేసే ఏర్పాటు చేసింది. ఇది జరుగుతున్నపుడు దూరంగా ఉన్న భరతుడు తిరిగి వచ్చి శోకంతో చనిపోయిన తన తండ్రిని చూశాడు. తన అన్న రాముడు ప్రవాసానికి వెళ్లాడని తెలుసుకుని బాధపడ్డాడు. ఎందుకంటే రాముడు కిరీటధారణకు సరైన వారసుడు. దాంతో భరతుడు మొదట్లో రాజ్యపాలనకు ఒప్పుకోలేదు. చివరికి రాముని అంగీకారంతో తన తండ్రి ఆజ్ఞ మేరకు చక్రవర్తి కిరీటాన్ని అంగీకరించాడు. అదీ కేవలం తన సోదరుడు ప్రవాసంలో ఉన్నంత వరకే!

దాంతో శ్రీరాముడు పుణ్యక్షేత్రాలను సందర్శించడానికీ, అరణ్యాలలో ఏకాంతంగా ఉన్న దివ్య ఋషులను సేవించడానికీ ప్రయాణమయ్యాడు. ప్రయాణం అయోధ్యా నగరం నుండి ఉత్తర భారతదేశం, అక్కడి నుండి మధ్య భారతావనిలో విస్తరించిన దండకారుణ్యం గుండా సుదూరంగా ఉన్న దక్షిణ భారతదేశం వరకూ సాగింది. అక్కడ రాముని భార్య సీతను శ్రీలంకాధీశుడైన రావణాసురుడు అపహరించాడు. వెంటనే రాముడు ఆమెను వెతకటంలో భాగంగా మహా బలశాలి శ్రీరాముని భక్తుడూ అయిన హనుమంతునీ, వానర జాతి రాజు సుగ్రీవులనీ కలిశారు. వారి సహాయంతో తన వానర సేనను ఇక్కడినుండి శ్రీలంకకు మళ్లించడానికి మహాసముద్రం గుండా వారధి నిర్మంచారు. భీకర యుద్ధంలో శ్రీరాములవారు రావణుని జయించిన తరువాత తన ప్రియమైన సీతను కాపాడాడు. ఆయోధ్యను వదిలి శ్రీలంకకు చేరేవరకు శ్రీరాముడు సాగించిన ప్రయాణం 'శ్రీరామయానం' అయింది.

మానవ జీవన గమనంలోని ఉన్నత విలువల కోసం ప్రకృతి కోసం అన్ని జీవరాసుల సంక్షేమం కోసం వ్యక్తిగత ఆనందాలను త్యాగం చేసిన ఒక ఆదర్శవంతమైన పురుషుడి కథ రామాయణం. ఎంతో కష్టకాలంలో కూడా ఏమాత్రం కలవరపాటులేని వదనంతో విషమ పరిస్థితులన్నింటినీ – చక్రవర్తి ప్రకటననూ, దేశబహిష్కరణనీ రెంటినీ సమానమైన భావోద్వేగంతో తీసుకున్నాడు. ఆయన ప్రేమకు అతని సోదరులు ఎలా పాత్రులయ్యారో అలానే పేద ప్రజలు కూడా ఆయన ప్రేమను పొందారు. ఆయన చేసిన మరో గొప్ప పని రెండు సంస్కృతుల మధ్య, రెండు జాతుల మధ్య, రెండు ఆచారాల మధ్యా వారధిని నిర్మించారు. ఈ అదృశ్య యోధుడు ఒకానొకప్పుడు తాను జయించిన శత్రువులను సైతం మిత్రులుగా మార్చుకుని వారికి శాంతినీ, శ్రేయస్సునూ కలుగజేయడానికి శ్రమించేవాడు. ఆయన రాజాధిరాజు అయినా అయోధ్య వీథుల్లో నిరుపేదల కష్టాలను పట్టించుకోవడానికి సమయాన్ని కేటాయించేవాడు. ఆయన ప్రవాసంలో ఉన్నా రావణాసురుడిలాగా శత్రువులను జయించగల బలశాలి. కానీ ఆయన రాజ్యసభలో ప్రజల ముందు నిస్సహాయుడిగా కూర్చుని వాళ్ల కోరిక ప్రకారం సీతను ఆడవికి పంపాడు. ప్రతిక్షణం ఆయన ధర్మాన్ని నిలబెట్టాడు. ఉన్నతమైన సమాజాన్ని నిర్మించడానికి కావలసిన విలువలను కాపాడాడు.

శ్రీరామ కార్యాలు దోషరహితం. అందుకే ఆయన జీవితకాలంలోనే ఆయన్ని అందరూ దేవుడి అవతారమని శ్లాఘించారు. ఆయన సంచరించిన ప్రదేశాలను పుణ్యక్షేత్రాలుగా పరిగణిస్తున్నారు. ఆయన ఆయోధ్య నుండి శ్రీలంక దాకా నడిచిన మార్గం ఆధ్యాత్మిక ఆచరణలకీ,

# THE TRAIL OF RAMA

శ్రీరాముడు వెళ్లిన మార్గం



తపస్సాధనలకీ ఎంతో ముఖ్యమైన ప్రదేశాలుగా పరిగణింపబడుతున్నాయి. గ్రంథాలలో చెప్పబడినట్లు పుణ్యక్షేత్రాల సందర్శనం వల్ల భక్తునికి శోకం, భయం తొలగి స్వేచ్ఛ లభిస్తుంది. తద్వారా తీర్థయాత్రికులకు శాంతమూ, మనోధైర్యమూ, సాంత్వనా చేకూరుతాయి.

ఆధునిక అయోధ్య సరయూ నది ఒడ్డున ఉంది. బెనారస్ లాగానే ఇక్కడ కూడా వందలాది దేవాలయాలు ఉన్నాయి. కొన్ని దేవాలయాలు తప్ప చాలావరకూ శ్రీరామచంద్రమూర్తి, సీతాదేవి, హనుమంతుని ఆలయాలే. బెనారస్‌ని గణేశ మహరాజ్, భైరవమూర్తి పరిరక్షిస్తున్న రీతిగా ఆంజనేయస్వామి ఈ పవిత్ర నగరానికి రక్షకులుగా ఉన్నారు. దీని అంతర్ముఖ ప్రవేశానికి హనుమంతుని దయతోనే అనుమతి లభించాలి. బాబాజీ సూచనల ప్రకారం స్వామీజీ లక్ష్యం, అయోధ్య కనక్ భవన్‌లో ప్రత్యేక పుణ్యక్షేత్రంగా వెలసిల్లిన సీతాసమేత శ్రీరాముడికి తన భక్తి ప్రణామాలను సమర్పించడం. వారక్కడికి హనుమంతులవారి మార్గనిర్దేశంతో మాత్రమే వెళ్లగలరు.

బాల్యంలోనూ యవకుడిగా ఉన్నప్పుడు చాలాసార్లు తన గురువుగారితో స్వామీజీ అయోధ్యను సందర్శించారు. దాంతో అక్కడున్న ఆశ్రమంలోని సాధువులందరూ వీరికి బాగా తెలుసు. అంతేకాక వారికి స్వామీజీ హఠయోగంలోనూ, ప్రాణాయామంలోనూ నిష్ణాతులని కూడా బాగా తెలుసు. దాంతో వీటిని నేర్పమని వారెక్కడ అడుగుతారోనని స్వామీజీ భయపడి ఆశ్రమాలకు దూరంగా వుండి సాధ్యమైనంత వరకూ ఎలాంటి సందడీ లేకుండా ఉన్నారు. ఆ మేరకు అయోధ్యను చేరగానే నిశ్శబ్దంగా సరయూనది ఒడ్డున జీవిస్తూ అప్పటికప్పుడు ఎవరు ఏ ఆహారం ఇచ్చినా సరిపెట్టుకుని సడీ సందడీ లేకుండా తన సాధనను కొనసాగించారు. తన గురువుగారు చెప్పినట్లు రాముని వద్దకు చేరడానికి అయోధ్యాపురి రక్షకుడూ, నిర్దేశకుడూ అయిన హనుమంతుని గురించి తీవ్రంగా ధ్యానించడం మొదలు పెట్టారు. అది ముప్పై రోజులపాటు చేయాల్సిన ధ్యానం, ఈ స్వామీజీ నామజపంతో పాటు ప్రతిరోజూ స్వామీజీ హనుమాన్ ఘర్ అనే హనుమంతుని మందిరానికి వెళ్తుండేవారు.

ఆ ముప్ఫయ్యవరోజు ధ్యానాన్ని పూర్తి చేసే నాటికి ఆగస్టు మాసం వచ్చేసింది. భారతీయ క్యాలండర్ ప్రకారం అది శ్రావణ మాసం. ఋతుపవనాలు తీవ్రంగా ఉండే నెల. ముఖ్యంగా ఆ రోజు వర్షం మొత్తం నగరాన్ని ముంచేస్తుందా అన్నట్లు కురుస్తోంది.

రాత్రి గాలి ఉధృతంగా వీచడం మొదలెట్టింది. స్వామీజీకి ఉన్న ఒకే ఒక దుప్పటి కాస్తా తడిసిపోయింది. దాంతో వారికి ఈ కుంభవృష్టీ, పెనుగాలీ కలిసి ఎముకలను కొరికేస్తాయేమోనన్నంత చలిగా ఉంది. రక్షణ కోసం ఆ చీకటి రాత్రిలో ఆయన దగ్గరలోఉన్న గుడికి వెళ్లారు. అక్కడంతా నిశ్శబ్దంగా ఉండడాన్ని గమనించిన స్వామీజీ ఆశ్రయం కోసం ఎలాంటి అనుమతీ అడగకుండానే లోపలికి వెళ్లారు. అయినా ఆ గుడి నిర్మానుష్యంగా ఉంది. మొత్తం చిమ్మ చీకటిగా ఉంది. పెనుగాలి నుంచి రక్షణ కోసం ప్రధాన చావడి అనుకూలంగా ఉంది. దాంతో స్వామీజీ చావడిలోకి వెళ్లి కూర్చున్నారు. కానీ ఆ గుడి నిర్మానుష్యంగా లేదు. ఆ గుడిని కాపలా కాస్తున్న వ్యక్తి ఒక మూల కూర్చుని మెరుపు వెలుగులో స్వామీజీని చూసి ఆయన దగ్గరకి వెళ్లి, 'మీరు ఎవరు? ఇక్కడికి ఎందుకు వచ్చారు?' అని అడిగాడు. స్వామీజీ మాట్లాడటం ద్వారా తన వ్రతాన్ని భగ్నం చేయదలచుకోలేదు. సైగల ద్వారా చెప్పదలిచారు. కానీ వాళ్లిద్దరూ చీకట్లోనే ఉన్నారు. దాంతో ఆ కాపలాదారుడు ఎలాంటి సమాధానం రాకపోయేసరికి స్వామీజీని దొంగగా భావించి గట్టిగా అరుస్తూ ఆయన్ని తన దగ్గరున్న లాఠీతో కొట్టసాగాడు. దాంతో గుడి దగ్గరలోఉన్న పూజారీ, మరి కొంతమంది లాంతరు తీసుకుని గుడిలోకి పరుగెత్తారు. నదీ తీరంలో తపస్సు చేస్తున్న స్వామీజీ వీరేనని వాళ్లు గుర్తుపట్టి జోక్యం చేసుకుని కాపలాదారుణ్ణి ఆపారు. కానీ అప్పటికే స్వామీజీ తీవ్రంగా గాయపడ్డారు.

కాపలాదారుడు, పూజారీ జరిగిన సంఘటనకు క్షమాపణ చెప్పగా స్వామీజీ చేతి మూడువేళ్లను పైకి చూపారు కానీ ఎవరూ అర్థం చేసుకోలేదు. వారి గాయాలు తుడిచి కట్లు కట్టి ఆయనపై పొడి దుప్పటితో కప్పారు. తెల్లారి వాతావరణం ప్రశాంతంగా మారినప్పుడు వారు తిరిగి నది ఒడ్డుకు చేరుకున్నారు.

మూడు రోజుల తరువాత స్వామీజీ తన ధ్యానాన్ని పూర్తి చేశారు. కాకతాళీయంగా ఆ రోజు మహా మంగళవారం అయింది. ఆ రోజు లక్షలాదిమంది భక్తులు ఆంజనేయుని ఆలయానికి వెళ్లి పూజలు చేస్తారు. అలాగే స్వామీజీ రోజూ వెళ్ళే హనుమాన్ ఘర్ కూడా భక్తులతోటి కిటకిటలాడిపోతోంది. ఈ భక్త సమూహాన్ని చూసి ఆయన 'ఎంతో భక్తిశ్రద్ధలతో నమ్మకంతో ఇక్కడికి వచ్చిన వాళ్లందరూ ఆంజనేయుని దీవెనలతో భక్తులుగా మారినవారు. నిజానికి ఆంజనేయుడు భగవంతుడిని ఆరాధించడానికి వచ్చే భక్తుల రూపంలో వ్యక్తమవుతున్నారు' అని అనుకున్నారు. దాంతో ఆ దివ్యస్వరూపుణ్ణి పూజించటానికి దేవాలయంలోకి వెళ్లాల్సిన అవసరం లేదనీ, వారి శక్తి నగరమంతా వ్యాపించి అందరికీ మార్గాన్ని చూపిస్తూ రక్షిస్తోందనీ ఆయన అనుకున్నారు. ఈ రకంగా అనుకుని ఆనందిస్తుండగా పూజారిలాగా ఉన్న వ్యక్తి ఎవరో వారి దగ్గరకి వచ్చి 'నాతో కనక్ భవన్‌కి రండి! మిమ్మల్ని ప్రధాన ఆలయానికి తీసుకెళ్తాను, అక్కడ సీతాసమేత శ్రీరామచంద్రమూర్తినీ, ఆంజనేయునీ సేవించుకుందురుగానీ!' అన్నాడు.

తన తపోదీక్ష ముగిసిందనడానికి ఈ పూజారి ఆహ్వానమే సూచనగా భావించారు స్వామీజీ. కనకభవన్ అక్కడికి కాస్త దూరంలో ఉంటుంది. ఆ పూజారి ఆ స్థల ప్రాముఖ్యతని గురించి ఆయనకు తెలియజేశారు. అక్కడి విశేషాల గురించీ చెప్తూ ఒకసారి ఆ ఆలయాన్ని సందర్శిస్తే సమస్త భయాలూ, శోకాలూ తొలగిపోతాయని వివరిస్తున్నాడు. దారిలో పూజారి కొనవలసిన పూజా సామాగ్రి జాబితా చెప్తున్నాడు. తన వద్ద డబ్బు లేదని చెప్పగానే ఆయన కాస్త నిరాశ చెంది వేరే విషయం మాట్లాడటం మొదలెట్టారు.

పశ్చిమ దేశాలలో ఉండే చర్చిలలోని పూజారీ వ్యవస్థలాగా హిందూ దేవాలయాల వద్ద పనిచేసే పూజారులకు ఒక పటిష్టమైన నిర్మాణవ్యవస్థ, నిర్దిష్టమైన పని విధానం ఉండదు. పెద్ద పెద్ద గుళ్లలో అధికారికంగా నియమింపబడిన పూజారులు ఆలయాలకి వచ్చే భక్తుల, యాత్రికుల పూజా కార్యక్రమాలలో సహాయపడుతూ ఉంటారు. కానీ ప్రధాన ఆలయం చుట్టూ ఎన్నో మందిరాలు ఉంటాయి. అక్కడున్న పూజారులు వాళ్లకు వాళ్లు పరిచయం చేసుకుని ప్రధాన దేవాలయానికి తీసుకెళ్తూ దారిలో పూజా సామాగ్రిని కొనడానికీ, ఆలయ ప్రవేశాన్ని సులభతరం చేయడానికీ సహాయపడుతుంటారు. ఈ విషయంలో యాత్రికులు ప్రేమతో ఏవైనా సమర్పించుకుంటారు గానీ, స్థానిక భక్తులూ, స్వామీజీలూ ఏమీ ఇవ్వరు. ఎందుకంటే సన్యాసుల వద్ద ఎక్కువ డబ్బు ఉండదు. స్థానికులకు గుడికి వెళ్ళే దారులు ఎలాగూ తెలుసు.

తనతో వస్తున్న ఈ పూజారిని వాళ్లలో ఒకరిగా భావించారు స్వామీజీ. దాంతో ఆయన సహాయంతో వెళ్లడానికి కాస్త మొహమాటపడ్డారు. అయితే ఆ పూజారి వాగుడు ఏ స్థాయిలో ఉందంటే ఆయన ఏం చెబుతున్నారో అర్థం చేసుకోవడానికి స్వామీజీకి బొత్తిగా సమయం చిక్కడం లేదు. ఆయన మాట్లాడుతూ మాట్లాడుతూ మధ్యలో హఠాత్తుగా విషయాన్ని మార్చేస్తున్నాడు. బహుశా ఆయనకు మతి స్థిమితం లేదేమోనని స్వామీజీ భావించాల్సి వచ్చింది. రాముడి గురించి మాట్లాడుతున్నపుడు స్వామీజీ అతడిని, 'మీరు ఎపుడైనా అయోధ్యలో ఉన్నారా?' అని అడిగాడు. అప్పుడు ఆయన తనని తానే ప్రశంసించుకోవడం మొదలు పెట్టాడు. తనకు ఈ నగరమంతా కొట్టిన పిండి అని చెప్పాడు. తాను స్వామీజీని రాముని సన్నిధికి ఎలా చేర్చగలడో చెప్పాడు.

స్వామీజీ ఆక్కడికి చేరగానే తాను అడిగింది ఇవ్వాలనీ, సీతాదేవి దగ్గరకు తీసుకెళ్లినప్పుడు తనకెవ్వరూ ఏదో ఒకటి ఇవ్వకుండా వెళ్లలేదనీ, ఇలా ఏవేవో విషయాలు చెప్పుకుంటూ పోతున్నాడు. ఇతనితో కలిసి వెళ్లడంలో నేనేమైనా తప్పుచేశానా? ఇతన్ని వదిలేస్తే బాగుండేదేమో అని స్వామీజీ అనుకుంటుండగానే వాళ్లు కనక్ భవన్ ఆలయానికి చేరుకున్నారు.

బైట ఉన్న చిన్న హనుమాన్ విగ్రహాన్ని చూపిస్తూ 'మీరు ఇక్కడ పూజచేస్తూ ఉండండి. నేను లోపలికి వెళ్లి పరిస్థితి ఎలా ఉందో చూసి వస్తా' అన్నాడు. స్వామీజీ దగ్గర ఎలాంటి పూజా సామాగ్రీ లేదు. ఆయనకి అలాంటి పూజలు పెద్దగా అలవాటు కూడా లేదు. దాంతో భక్తిశ్రద్ధలతో హనుమాన్ విగ్రహం ముందు నించున్నారు. ఆ పూజారి గుడి ముఖద్వారంలోంచి లోపలికి వెళ్లాడు. చూస్తుండగానే అక్కడున్న కొద్దిమంది భక్తుల్లోనూ కలిసిపోయాడు. అది చూసి స్వామీజీ ఆ పూజారి స్వయంగా ఆంజనేయుడే తప్ప వేరే కాదని గ్రహించారు. ఎంతో విస్మయంతో భక్తితో వారు గుడిలోకి ప్రవేశించి సకల చరాచర సృష్టికీ కారకమైన శ్రీరామునికీ సీతమ్మవారికీ భక్తి శ్రద్ధలతో ప్రణమిల్లి, శ్రీరాముడు నడిచిన బాటలో ప్రయాణం మొదలెట్టారు.

ఈ సంఘటన గురించి స్వామీజీ 1992లో కుమావు హిమాలయాలలో ఎక్కువకాలం గడిపే మార్మికవాదీ తన గురుభ్రాత అయిన 'నాన్తిన్' బాబాతో తన అనుభవాలు వివరిస్తున్నప్పుడు నాకు ఈ విషయం చెప్పారు. నాన్తిన్ బాబా శ్రీ సీతారాముల్ని మిక్కిలి భక్తిశ్రద్ధలతో కొలిచే భక్తుడు. హఠయోగ రహస్యాలు తెలిసిన నిష్ణాతుడు. వారు ఎండాకాలాన్ని హిమాలయాలలోనూ, చలికాలాన్ని చిత్రకూట్, దక్షిణ భారతదేశంలోనూ గడుపుతారు. వీరికి తీర్థయాత్రలంటే ఎంతో ప్రీతి. ముఖ్యంగా రాముని పుణ్యక్షేత్రాలంటే ఎంతో మక్కువ. తన ప్రయాణాలలో ఈక్షేత్రాలుంటే ఆగి హిందీలో ఉన్న రామాయణాన్నీ, కొన్నిసార్లు సంస్కృత రామాయణాన్నీ పారాయణ చేసి కానీ వెళ్లరు. నాన్తిన్ బాబా చెప్తుండేవారు, మనం శ్రీరామాయణ పారాయణ మొదలు పెట్టిన క్షణాన ఆంజనేయస్వామి సూక్ష్మరూపంలో అక్కడికి వచ్చి కూర్చుని వింటారట.

ఆయోధ్యాపురిని వదిలినపుడు రాముడు నడచిన మార్గంలో వెళ్లడమంటే నాన్తిన్ బాబా గారికి ఎంతో ఇష్టమైన తీర్థయాత్ర. తనతో ఆ ప్రయాణం చేయడానికి స్వామీజీని ఆయన చాలాసార్లు అడిగారు. కానీ స్వామీజీకి ఆ విషయం పట్ల ఎన్నడూ ఉత్సాహం చూపలేదు. బాబాజీ గారి సూచన ప్రకారం అయోధ్యకు వెళ్లి ఈ పుణ్యక్షేత్రంలో ఆంజనేయస్వామి, సీతారామచంద్రుల దీవెనలు పొందిన తర్వాతే వారికి దీని ప్రాముఖ్యత అర్థం కావడం ప్రారంభించింది. పూజారి వేషధారణలో ఉన్న ఆంజనేయ స్వాములవారిని కలవడంవల్ల వారి హృదయం ఎంతో ఉత్సాహంతో శ్రీరాముని మార్గంలో వెళ్లాలనే పట్టుదలతో నిండిపోయింది. అది కూడా తాను నాన్తిన్ బాబాతో వెళ్లగలనని ఆశించారు. నాన్తిన్ బాబా ఈ శ్రావణమాసంలో శ్రీరాముడు అయోధ్య నుండి అడవులకి వెళ్లేటప్పుడు మొట్టమొదట సందర్శించిన చిత్రకూట్‌లోనే శ్రావణమాసం వర్షఋతువు పూర్తయ్యేవరకూ ఉండి అప్పుడు దక్షిణ భారతదేశానికి వెళ్తారని స్వామీజీకి బాగా తెలుసు. స్వామీజీ రైల్లో, బస్సులో కాలినడకన ప్రయాణించి వెళ్తే చిత్రకూట్‌ని ఒకరోజులో చేరుకోగలరు. కానీ వారు అలా వెళ్లదలుచుకోలేదు, ఎందుకంటే శ్రీరాములవారు ఆ దారంతా పాదరక్షలు లేకుండానే నడిచారు. ఆంతేకాక శ్రీరాములవారు ఆగిన చోటల్లా తాను కూడా ఆగి ప్రయాణించాలనుకున్నారు స్వామీజీ. దాంతో దేవుడి మీద భారం వేసి ఆయన చేయగలిగిందల్లా నాన్తిన్‌బాబా చిత్రకూట్ నుంచి వెళ్ళే లోపల ఆక్కడికి చేరుకోగలగడమే!

ఆయన మొట్టమొదట ఆగిన నందిగ్రామ్ గురించి చెప్తూ స్వామీజీ, 'ఇక్కడి గాలిలో కూడా వంచనకి స్థానం లేదు. ఎలాంటి కపటం లేకుండా పధ్నాలుగు రోజులు ధ్యానం చేస్తే

దురాశ నుంచీ స్వార్థం నుంచీ తప్పనిసరిగా స్వేచ్ఛ లభిస్తుంది. అదృష్టవంతుడైన యోగసాధకుడికి బలమైన ఆంతరంగం ఏర్పడి నిస్వార్థంతో ప్రేమతో తమ కర్తవ్యాలను నెరవేరుస్తాడు' అని చెప్పారు.

అప్పటిదాకా స్వామీజీ ఒక పవిత్ర స్థలం గురించి గానీ, దాన్ని సందర్శించాల్సిన ప్రాముఖ్యత గురించి గానీ, అక్కడ చేయవలసిన సాధన గురించి గానీ ఇంత బలంగా చెప్పినట్లు నేను వినలేదు. అప్పటికి పదమూడేళ్ల నుండీ నేను పశ్చిమ దేశాల్లో నివసిస్తున్నాను. దాంతో స్వామీజీ విలక్షణమైన గుర్తింపు పట్ల నాకు అంతగా ఆవగాహన లేదు. పాశ్చాత్యదేశ ప్రజల్లో చాలామంది ఆయన్ని సంపూర్ణ ఆరోగ్యం విషయంలో మార్గదర్శకత్వం వహించే ఒక ఉన్నతమైన వ్యక్తిగా చూస్తారు. నేను అమెరికాకి వచ్చినప్పటినుండీ ఆయన తన నాడీ వ్యవస్థ  మీద, గుండె మీద అసాధారణమైన నియంత్రణగల యోగి అనీ, ఆరోగ్యం దేహ నిర్మాణ వ్యవస్థకి సంబంధించీ, శ్వాస, మెదడూ మొదలైన వ్యవస్థలపై ఆయన ఇచ్చే ఉపన్యాసాలను పదే పదే వినాలనిపిస్తుందనీ, ఎక్కువ జీవితకాలం హిమాలయాలలో ధ్యానిస్తూ గడిపిన స్వామీజీగా ఆయనకు గుర్తింపు ఉందనీ నా జ్ఞాపకాల్లో లేవు. పశ్చిమాన ఆయనిచ్చిన సందేశం– 'నీ ఆంతరంగంలోకి వెళ్లు. నిన్ను నువ్వు దర్శించుకో. ప్రాణికోటి మూలాధారమైన భగవంతుడు నీ హృదయంలోనే ఉదయిస్తాడు'. హిమాలయన్ ఇనిస్టిట్యూట్ ఆధ్వర్యంలో హిమాలయాలలోని పవిత్ర ప్రదేశాలకి స్వామీజీ పర్యవేక్షణలో ప్రతి సంవత్సరం కనీసం ఒకసారన్నా నిర్వహించే యాత్రలో ఆ యా పవిత్ర స్థలాల గురించి నేరుగా నాతో ఏనాడూ మాట్లాడలేదు.

1983 లో కైలాస పర్వతం గురించి స్వామీజీ నాతో చెబుతున్నప్పుడు స్వామీజీ, వారి గురుదేవులు, వారి పరమగురువులు అక్కడ ఉండడం వల్ల అది ఆయనకి ఎంతో ప్రత్యేకమైందని నేను అనుకున్నాను. 1985లో అరవై నాలుగు యోగినులున్న ఖజురహో దేవాలయంలో ఆయనకు దేవత ప్రత్యక్ష దర్శనమిచ్చిన విషయాన్ని నాతో పంచుకున్నప్పుడు ఆయన తన ఉద్వేగాన్ని నాతో పంచుకుంటున్నారనుకున్నాను. అప్పట్లో ఆయన అక్కడ ఉండడం వల్లా, స్వామీజీకి దేవి దర్శనం కావడం వల్ల మాత్రమే వారికి అదెంతో ప్రత్యేకమైందని మాత్రమే నేను అనుకున్నాను. కానీ 1992లో దూర్వాస మహాముని గురించీ, ఉజ్జయినీ రక్షణలో ఆ ముని పాత్ర గురించీ స్వామీజీ నాతో చెప్పిన విషయాల్ని తరచి చూస్తుంటే ఈ ఆధ్యాత్మిక ప్రదేశాల పట్ల నాకున్న అవగాహనలో కొత్త కోణాలు  సంతరించుకుంటున్నాయి.

దూర్వాస మహామునిని కలిశానని చెప్పిన తర్వాత కొన్ని రోజులకు స్వామీజీ శ్రీరాముని దారిలో తన ప్రయాణం గురించి చెప్పారు. అయోధ్య తరువాత మొట్టమొదటి మజిలీ అయిన నందిగ్రాం నేను పుట్టిన గ్రామానికి యాభై మైళ్ల లోపు దూరంలో ఉంటుంది. ప్రాచీన వ్రాతప్రతులూ, పురాణాల్ని బట్టి చూస్తే రాముడు వనవాసానికి వెళ్లిన తర్వాత సోదరుడు భరతుడు పధ్నాలుగు సంవత్సరాలు ఆక్కడే ఉన్నాడు. ఆ ప్రాంతంలో ఎవరైనా తీర్థయాత్రలకు వెళ్ళేటప్పుడు నందిగ్రామ్‌ని సందర్శించడం అక్కడ భరతుడిని సేవించి తమ పితృదేవతలకు పిండప్రదానాలు చేయడం ఆచారంగా వస్తోంది. ఈ సంస్కరణలు జరిగిన తరువాతే తీర్థయాత్రలకి వెళ్ళేవాళ్లు బెనారస్, గయా, ఇంకా భారతదేశం నలుమూలలా, తూర్పున ఉన్న పూరీ, దక్షిణాన ఉన్న రామేశ్వరం, పశ్చిమాన ఉన్న ద్వారక, ఉత్తరాన ఉన్న హిమాలయాలలోని బదరీనాథ్, కేదారనాథ్ వంటి ముఖ్యమైన యాత్రా స్థలాలకు వెళ్తారు. నేనెప్పుడూ నందిగ్రామ్‌కి ఇంతటి ఆధ్యాత్మిక  ప్రాముఖ్యత ఉంటుందని  అనుకోలేదు.

నేను నందిగ్రామ్‌కి వెళ్లాను గానీ అది అంత విశేషమైనది కాదు. యవ్వనంలో ఉన్నపుడు అయోధ్యలో నివసిస్తున్న బాబారాం మంగళదాస్ ఆదేశాన్ని అనుసరించే ఆక్కడికి వెళ్లాను. ఆయన ఒక రామభక్తుడని చెప్తారు. అంతేకాదు, నిగూఢమైన శ్రీవిద్య అనే తాంత్రిక విద్యలో

ఆయనెంతో నిష్ణాతుడు. దివ్యదృష్టిలో కూడా ఎంతో నిష్ణాతుడనే పేరుంది. భాష, దేశకాల పరిస్థితులూ ఇవేవీ అతనికి ఆటంకాలు కావు. బ్రతికున్న వాళ్లతోనైనా చనిపోయిన వాళ్లతోనైనా ఆయన మాట్లాడగలడు. ఆయన మనసు బాగుంటే గొప్ప ఆత్మలైన వేదఋషులు, బుద్ధుడు, అబ్రహం లింకన్, జార్జి వాషింగ్టన్, గురునానక్ ఇంకా మనం పట్టించుకోని అనేకమంది గొప్ప వ్యక్తుల అత్మలతో కూడా మాట్లాడగలరు. బాబా రామ్ మంగళదాస్ వాళ్లతోటి ఎలా మాట్లాడతారంటే వాళ్ల గురించి ఏవో కథలు చెప్పినట్టు కాక వాళ్లతో కలిసి జీవించారా అన్నంత సయోధ్యతో మాట్లాడతారు. ఆయన తరచుగా తన సూక్ష్మ శరీరంతో ప్రపంచ వ్యాప్తంగా ఉన్న పవిత్ర స్థలాలను సందర్శిస్తుంటారనీ అలాగే గొప్ప గొప్ప ఆత్మలు కూడా ఆయోధ్యలోని ఆయన ఆశ్రమాన్ని సందర్శిస్తూ వుంటాయని ప్రజలు చెప్పుకుంటూ ఉంటారు. ఒకసారి ఆయన ఈ విషయాలన్నీ తన శిష్యులతో పంచుకోగా వాటిని పుస్తకంగా అచ్చు వేసి వారు ప్రచురించారు.

బాబా రామ్ మంగళదాస్ నన్ను ఓసారి కారణం చెప్పకుండా నందిగ్రామ్ వెళ్లమన్నారు. అక్కడికి వెళ్లగానే పూజారులందరూ నా చుట్టూ చేరారు. నేను యాత్రికుడిని కానని తెలుసుకోవడంతో నా దగ్గరకి శ్రాద్ధ కర్మలు చేయించడానికి వచ్చిన పండిట్‌ల ఉత్సాహం అంతా నీరుగారిపోయింది. అప్పటికే కొంతమంది పండిట్‌లు వచ్చిన నన్ను కేశఖండనం చేయించుకోమని బలవంత పెడుతున్నారు. (సహజంగా అక్కడ యాత్రికులు కేశఖండన చేయించుకుని పుష్కరిణిలో స్నానం చేసి పితరులకు పిండ ప్రదానం చేస్తుంటారు.) బాబా రామ్ మంగళదాస్ ఎందుకు పంపారో తెలియక నేనక్కడ లక్ష్యరహితంగా తిరిగాను. నేను తిరిగి ఆ సాధువు దగ్గరికి వెళ్లినప్పుడు 'నీ ఆత్మ శ్రీరామునిపై భరతుడు చూపించిన ప్రేమామృతంతో పునీతమైంది,' అన్నారు. ఆ సమయంలో ఈ వ్యాఖ్యలో ఎలాంటి అర్థం నాకు స్ఫురించలేదు.

కొన్ని సంవత్సరాల తర్వాత, స్వామీజీ 'నందిగ్రామ్ గాలిలో వంచనకి స్థానం లేదు. ఎలాంటి కపటం, స్వార్థం లేకుండా అక్కడ సాధన చేస్తే దురాశ నుంచి విముక్తి లభిస్తుంది' అని అంటే నాకెందుకో ఆశ్చర్యం వేసింది. నాకు అక్కడ ఎలాంటి ప్రత్యేకతా లేదనిపించింది. అందువల్ల స్వామీజీని నేను, 'ఈ ప్రదేశంతో పితృదేవతలకు అనుబంధం ఎలా కలిగింది? కానీ ఆధ్యాత్మిక మార్గ అన్వేషకులు దీన్ని ఒక విశేషమైన ప్రదేశంగా ఎందుకు చూడటంలేదు?' అని అడిగాను.

రాముడు అడవికి వెళ్లినపుడు ఆయన తండ్రి దశరథ మహారాజు శోకంతో మరణించాడు. శ్రీరాముని సోదరుడు భరతుడు తండ్రి అంత్యక్రియలు, కర్మలు పిండ ప్రదానాలు చేయాల్సినవాడు. భరతుడు తండ్రి మరణం తరువాత నందిగ్రామ్‌లో నివసించడం వల్ల తన తండ్రి కర్మలు ఇక్కడే చేశాడని నమ్ముతారు. ఆ విధంగా పూర్వీకుల శ్రాద్ధ కర్మల కోసం ప్రజలు నందిగ్రామ్‌ని ఎంచుకున్నారు. ఒక ఆదర్శవంతమైన పుత్రుడూ ఆదర్శవంతమైన రాజూ అయిన భరతుడు ఇక్కడ యోగిగా మారి కఠోర సాధన, తీవ్రమైన తపస్సూ చేశాడు. సమస్త కోరికలూ, ఆశల నుంచి విముక్తి పొందిన మహాత్ములలో భరతుడు ఒకడు. రాముడి కోసం తన జీవితాన్ని త్యాగం చేసినవాడు, పధ్నాలుగేళ్లు పరిపాలించిన తర్వాత మళ్లీ ఆయన తన అన్నగారిని రాజ్యం అడగలేదు. నందిగ్రాంలో ఉన్నపుడు ఆయన వశిష్టులు, జాబాలి వంటి మహామునులతో కలిసి ఉండేవారు. ఆ రకంగా నందిగ్రాం దాని చుట్టు ప్రక్కల ప్రాంతాలు ఆధ్యాత్మిక శక్తి, స్వీయ క్రమశిక్షణ, నిస్వార్థం, ప్రేమ, దయా గుణాలతో విరాజిల్లుతూ ఉండేది. ఇక్కడ ఎవరైనా సాధన చేస్తే ఎలాంటి ప్రయత్నమూ లేకుండా త్వరగా వారి మనసులు రాముడి పట్ల భరతుడికి ఉన్నంత ప్రేమతో నిండిపోతుంది. గ్రంథాలలో వివరించినట్లు గొప్ప యోగి అయిన భరతుడు పధ్నాలుగేళ్లు నిద్రపోకుండా తన దీక్షను కొనసాగించారు. అందువల్ల నందిగ్రాం ప్రత్యేకంగా యోగనిద్ర సాధనకు ఎంతో అనుకూలమైనది.

స్వామీజీ నందిగ్రాంలో కొద్దిరోజులు ఉన్న తరువాత చిత్రకూట్‌కి తన ప్రయాణాన్ని కొనసాగించారు. కానీ దారిలో శ్రీ సాయీ నది ఒడ్డున ఉన్న 'బేలామాయీ' అనే సుందరమైన ప్రదేశంలో ఆగారు. చరిత్ర ప్రకారం శ్రీరామచంద్రుడు వారి సమూహంతో సాయంత్రం ఇక్కడికి వచ్చారు. తరువాత రోజు ఉదయం ఆయన ఇక్కడ స్నానం చేసి దేవిని ప్రార్థించారు, శ్రీరాముని ప్రార్థనకు బేలామాయి ప్రసన్నురాలై ప్రత్యక్షమై దీవించింది. ఇదంతా సూర్యోదయం నాడు జరిగింది. అందువల్ల ఈ నదికి బేలాదేవి (సూర్యోదయవేళ దర్శనమిచ్చిన దేవత) అనే పేరు వచ్చింది. కాలం గడుస్తున్న కొద్దీ ఆ పేరు కాస్తా మారి 'బేలామాయీ'గా స్థిరపడిపోయింది.

స్వామీజీ తరువాతి మజిలీ అలహాబాద్‌లో ఉన్న శృంగ్ బేరాపూర్. ఇదెంతో ప్రఖ్యాతి గాంచిన యాత్రా స్థలం. ఇక్కడే పడవ నడిపే నిషాదుడు పట్టుపట్టి శ్రీరాముని పాదాలు కడిగి తన నావలో కూర్చోపెట్టుకున్నాడు. రామాయణంలో ఉన్న ఈ ఘట్టాన్ని భారతీయ జానపదులు ఎంతో గొప్పగా జరుపుకుంటారు. రామాయణంలో ఉటంకించబడిన ఈ పడవ నడిపే వ్యక్తి అక్కడి గిరిజనులకు నాయకుడు, యవ్వనంలో శ్రీరాముని స్నేహితుడు. వశిష్ఠులవారి ఆశ్రమంలో కలిసి చదువుకున్నపుడు ఈ గిరిజన నాయకుడు రాముడు దైవాంశ సంభూతుడని గ్రహించాడు. కానీ అప్పటి సంప్రదాయాలూ, ఆచారాల పట్టింపు వల్ల అతడలా చేయలేకపోయాడు. అందువల్ల చిత్రకూట్‌కి వెళ్ళే దారిలో గంగానదిని దాటాల్సి వచ్చినప్పుడు రాముడి పడవతో నదిని దాటిస్తానని నిషాదుడు వేడుకున్నాడు. రాముని నది దాటించే అదృష్టం తనకి కావాలన్నాడు. శ్రీరాములవారిని భగవంతుడిగా పూజించాలనీ, రాకుమారునిగా గౌరవించాలనే తన వాంఛని ఆ రకంగా వెలిబుచ్చాడు. కానీ శ్రీరామచంద్రుడు తనని స్నేహితునిగా చూడమని కోరాడు. సుదీర్ఘమైన సంభాషణ తర్వాత దర్పహీనమైన, వినీతమైన ప్రేమతో వినయంతో రాములవారిని ఒప్పించి ఒక భక్తుడు దేవుని పూజించినట్లు నిషాదుడు శ్రీరాముని పాదపద్మాలను కడిగి పూజించాడు. నిషాదుడు రాముని సమూహాన్ని నది దాటించిన తర్వాత రాముడు తన చేతి ఉంగరాన్ని నిషాదుడికి ఇవ్వబోయాడు. నిషాదుడు అందుకు తిరస్కరించి, 'ఓ ప్రభూ! ఈ ఉంగరాన్ని తమ దగ్గరే వుంచండి. సమయం వచ్చినపుడు నన్ను ఈ జీవితమనే నదిని దాటించండి!' అని వేడుకున్నాడు. ఆ రకంగా శృంగ్ బేరాపూర్ అన్నిరకాల కులాల, జాతుల, తెగల, మతాల అడ్డుగోడలను మనుషుల మధ్య ఉన్న విభేదాలను విచ్ఛిన్నం చేస్తూ శ్రీరాముని ప్రేమను పొందిన ప్రదేశంగా గుర్తింపు పొందింది. ఇప్పటికి కూడా గంగానది పవిత్ర స్నానఘటాల దగ్గర ఆడవాళ్లు పవిత్ర స్నానాలను ఆచరించే రోజుల్లో వాళ్లు తమ సొంత మాండలిక భాషల్లో ఈ మధురఘట్టాన్ని పాటలుగా పాడుకుంటూ ఉంటారు.

శ్రీరామపథంలో ప్రయాణిస్తున్న స్వామీజీ తరువాత మజిలీ ప్రయాగ. ఇప్పుడు దాన్ని అలహాబాద్ అంటారు. అక్కడి వందలాదిమంది ప్రజలకు స్వామీజీ తెలుసు. సామాన్యంగా ఇక్కడికి వచ్చినపుడల్లా టాండన్ కుటుంబంతోనే ఉంటారు. కానీ ఈసారి ఒక భక్తునిగా వచ్చారు గనుక వాళ్ల ఆతిథ్యం తీసుకోవడం సరైంది కాదు. సాధ్యమైనంతవరకూ భక్తితో విశ్వాసంతో ఆ దారిని అనుసరించడానికి స్వామీజీ నేరుగా భరద్వాజ ముని ఆశ్రమానికి వెళ్లారు. రామాయణ కథనాన్ని బట్టి కూడా శ్రీరాములవారు భరద్వాజ ఆశ్రమంలో కొన్నాళ్లు గడిపారు. ప్రస్తుతానికి ఆ ప్రదేశంలో ఎన్నో దేవుళ్లు, దేవతల ఆలయాలు నిర్మింపబడి ఉన్నాయి. భరద్వాజ ఆశ్రమం కూడా అక్కడ ఉంది. రామాయణ కాలంలో భరద్వాజ ఆశ్రమం గంగా నది ఒడ్డున నిర్మించబడిందనీ, కానీ వందల సంవత్సరాల తర్వాత నది తన ప్రవాహ మార్గాన్ని మార్చుకుందనీ స్వామీజీ నాతో అన్నారు. దాంతో ఇప్పుడు నదికీ ఆశ్రమానికీ మధ్య మూడు నాలుగు మైళ్ల దూరం ఏర్పడింది.

1972 నుంచీ 1979 దాకా నేను అలహాబాద్‌లో భరద్వాజ ఆశ్రమానికి ఎదురు రోడ్డులోనే ఉన్నాను. సెయింట్ ఆంథోనీ విద్యాలయం ఆ పక్కనే ఉంది. భారతదేశ మొదటి ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ నివాసం 'ఆనంద భవన్' మరో వైపున ఉంటుంది. ప్రతి సంవత్సరం జనవరి మాసంలో గుంపులు గుంపులుగా యాత్రికులు అనంద్ భవన్‌కు రావడాన్ని చూస్తుంటాను. దాంతో పోల్చుకుంటే చాలా తక్కువమంది ఒకే ఒక గదితో నిర్మితమైన మునీశ్వరుడి గుడికి వెళ్లి నివాళులు అర్పిస్తుంటారు. అలహాబాద్ వాస్తవ్యులకు తప్ప ఇతరులకు భరద్వాజ మహాముని ఆశ్రమం గురించి దాదాపుగా తెలియదు. నాకు సంబంధించి నా కిరాణా సామాన్లు తెచ్చుకోవడానికీ, అక్కడి స్థానిక బెంగాలీలు జరిపే నవరాత్రి ఉత్సవాలను సందర్శించడానికీ సంబంధించిన ప్రదేశం మాత్రమే.

స్వామీజీ పుణ్య క్షేత్రాల గురించి మాట్లాడుతూ భరద్వాజ ఆశ్రమం గురించి చెప్పినపుడు యోగులకు మాత్రమే తెలిసిన అద్వితీయమైన ప్రత్యేకత ఏదో దీనికి ఉందని అర్థమై నా గుండె ఎగసిపడింది. అక్కడి ప్రత్యేకత ఏమిటని అడిగితే స్వామీజీని నేను అడిగాను. శ్రీరామచంద్రమూర్తి అక్కడ ఓ ప్రత్యేకమైన సాధన చేశారని చెప్పారు. ప్రామాణిక రామాయణం ప్రకారం శ్రీరామచంద్రమూర్తి శ్రీమహావిష్ణువు అవతారం. అనన్య రామభక్తుడైన తులసీదాస్ శ్రీరాముడు అవతార పురుషుడని తెలియజేయడానికి ఆయన ఆధ్యాత్మిక ఆచరణ గురించి తెలియజేయాల్సిన అవసరం లేదని చెప్పారు. సనాతన వాల్మీకి రామాయణ కథనం శ్రీరాముడి తన గురువు పాదాల వద్ద ఎలా విధ్యాభ్యాసం చేశాడో తీవ్రమైన సాధనను ఎలా కొనసాగించాడో, స్వయంకృషితో, మునుల దీవెనలు, దివ్య శక్తి సహకారంతో తనలో నిద్రాణంగా ఉన్న శక్తులను సంపూర్ణంగా ఎలా మేల్కొల్పుకున్నాడో తెలియజేసే సన్నివేశాలను చిత్రీకరించింది. ప్రయాగ తీర్థంలో రాముడు సంప్రదాయంగా వస్తున్న భరద్వాజులవారి శిష్యరికంలో తీవ్రమైన సాధన చేసి, కాలాన్ని భక్షించగల మరణాన్ని జయించగల కాళీమాత ప్రసన్నతను సాధించి మహా పరాక్రమసంపన్నుడయ్యాడు. రాముడు కాళీమాతను ధ్యానించి ఆమె ఆశీస్సులను పొందిన ప్రదేశంలోనే ఇప్పుడు ఒక చిన్న కాళీమాత గుడి కట్టబడింది. ఇప్పుడు అలహాబాద్‌గా పిలుస్తున్న ప్రయాగ మొదటి నుంచీ శక్తిసాధనకి కేంద్రంగా భాసిల్లుతోంది. ఎప్పుడైనా మానవ నిర్మిత వైపరీత్యాల వల్ల భూమాత ఉపద్రవానికి గురైతే ఋషులూ, సాధువులూ ఈ కాళీ దేవతను ప్రసన్నం చేసుకుని ఆ విపత్తు నుంచి రక్షింపబడతారు. విశ్వవ్యాప్తంగా ప్రాణుల ఆరోగ్యాన్నీ బలమైన సుస్థిరత్వాన్నీ తిరిగి సాధించడానికి తగినంత సామూహిక చైతన్యం ఉత్పన్నం చేసే దిశగా తీవ్రమైన కృషి చేస్తారు.

స్వామీజీ చెప్పిన విషయాలలో కొన్నిటిని అప్పటికే గ్రంథాల్లో చదివాను. కానీ శ్రీరాములవారు కాళీమాతను ఇక్కడ ధ్యానించారనే విషయం మాత్రం నాకు పూర్తిగా కొత్తది. తాళపత్ర గ్రంథాల ప్రకారం భారతదేశం మొత్తంలో అలహాబాద్‌తో కలిపి యాభై ఒక్క శక్తి మందిరాలు ఉన్నాయి. ఈ పవిత్ర పుణ్యక్షేత్రంలో ఉన్న దేవత 'లలితాదేవి' (శ్రీ విద్య అనే పేరుతోకూడా పిలుస్తారు) నామంతో ఉద్భవించిన శక్తిమాత. ఇప్పటికీ స్వామీజీ నాకు చెప్పినదాన్ని బట్టి నాకు అలహాబాద్ దేవతగా కాళీమాతే వుందనీ అక్కడే భరద్వాజ మహాముని ఆధ్యాత్మిక ఆశ్రమం కూడా ఉందనీ నా అభిప్రాయం. ఈ సంభాషణని ఇలాగే కొనసాగిస్తే కేవలం మౌఖిక సంప్రదాయంలోనో లేదా స్థలపురాణంలో మాత్రమే ఉండే విషయాల్ని నేను తెలుసుకునే అవకాశం ఉందని నాకు అనిపించింది.

అప్పుడు నేను స్వామీజీతో, 'శ్రీరామచంద్రమూర్తి, మధ్య భారతదేశం, దక్షిణ భారతదేశంలోని కీకారణ్యాల్లోకి వెళ్లే ముందు ఇక్కడ ఆగి భరద్వాజ మహామునిని కలిశారని నేను రామాయణంలో చదివాను. రామాయణంలో భరద్వాజ మహామునికి శ్రీరాముడు భగవంతుడి

అవతారమని తెలిసి ఆయనను వనవాసకాలమంతా ఇక్కడే ఉండమని అభ్యర్థించారు. దానికి శ్రీరాముడు ఈ ప్రదేశం అయోధ్యకు చాలా దగ్గరగా ఉంటుందనీ అందువల్ల తనని చూడటానికి వచ్చిపోయే జనాలతో ఆశ్రమ ప్రశాంతత దెబ్బతింటుందనీ సమాధానమిస్తాడు. తాను ఎక్కడ నివసించాలో సలహా ఇవ్వమని కూడా ఆ మునిని శ్రీరాముడు కోరతాడు. దానికి సమాధానంగా భరద్వాజ ముని, 'ఓ పరాత్పరా! నువ్వు లేని ప్రదేశాన్ని నాకు తెల్పవయ్యా!' అంటాడు. ఇది స్పష్టంగా భరద్వాజ మహర్షి రాముని ఎంతగా సేవించేవారో తేటతెల్లమౌతోంది. కానీ మీరు చెప్పినట్లు భరద్వాజ ముని కూడా రామునికి గురువే అవుతాడు. ఆ ప్రావీణ్యుడు రాములవారికి శక్తి సాధన, ముఖ్యంగా కాళీ మాతకు సంబంధించిన యోగసాధన నేర్పారు.

స్వామీజీ 'భరద్వాజ మునీశ్వరులు శ్రీవిద్యా పారంగతుడు. శ్రీవిద్యకి చాలా పేర్లు ఉన్నాయి. వాటిల్లో ప్రసిద్ధి చెందినవి 'లలిత', 'త్రిపుర'. తీర్థప్రయాగకి రావడానికి ముందు భరద్వాజ ముని ప్రధాన నివాసం హిమాలయాలలోని కాశ్మీర్ ప్రాంతం. వారు శ్రీవిద్యను సాధన చేసిన ప్రదేశాన్ని ఇప్పుడు శ్రీనగర్ అంటున్నారు. అయన ఒక గొప్ప గురువు. ఆయన ఆధ్వర్యంలోనే హిమాలయాలలోని కాశ్మీర్ ప్రాంతం ఉపఖండానికే విద్యా కేంద్రంగా మారింది.'

సామాజిక అంశాల చర్చలకి దూరంగా ఉండే స్వామీజీ ఇప్పుడు వాటిని ఉద్దేశించి పరోక్షంగా మాట్లాడటం మొదలుపెడుతున్నారు. కాశ్మీరీలు తమ మూలాల్ని మర్చిపోయారని చెప్పారు. భారతదేశంలో ఏ కులంలోని వారైనా వాళ్ల పేర్ల చివర భరద్వాజ అని ఉన్నా, వారి గోత్రం భారద్వాజస గోత్రమైనా, వాళ్లందరూ భరద్వాజ మునీశ్వరుని వంశస్తులే. భరద్వాజ శిష్యులలో ఒకరు తీవ్రమైన శ్రీవిద్యా సాధన చేశారు. దాని ఫలితంగా దేవిని ప్రత్యక్షంగా తమ చర్మచక్షువులతో చూడగలిగారు. భరద్వాజ మహర్షి తీర్థప్రయాగకి వెళ్లాలని నిర్ణయించుకున్నపుడు కాశ్మీర్‌లోని విద్యాపీఠం బాధ్యతలు ఓ శిష్యుడికి అప్పగించి అతడి నుదుటి మీద తిలకం దిద్దారు. అప్పటి నుంచీ ఆ విద్యార్థికీ, అతడి వంశస్థులకూ 'టికావన్' అనే పేరొచ్చింది. కాలక్రమేణా అ కుటుంబాలన్నీ టికూ కుటుంబాలుగా మారాయి. ఇప్పటికి కూడా కాశ్మీర్‌లోని టికూ కుటుంబాలు విద్యాదేవిని, 'త్రిపుర' అనే పేరుతో తమ కులదైవంగా పూజిస్తారు.

మునీశ్వరుని సంతతికి చెందిన పిల్లలు వాళ్ల వారసత్వాన్ని మరచిపోవడం ఎంతో విచారంగా వుందని స్వామీజీ బాధపడ్డారు. చాలామంది కాశ్మీర్‌ను వదిలి వెళ్లారు. వాళ్ల మూలాలనుంచి విడిపోయినా ఈ ఉత్కృష్ట జ్ఞానం వాళ్ల జన్యువుల్లో అంతర్భాగమై ఉంది. 1992లో ఒక సందర్భంలో స్వామీజీ నన్ను చూస్తూ 'ఏదో ఒకరోజు ఈ పిల్లలు ఎంత గొప్ప సంప్రదాయానికి చెందినవారో నువ్వే వాళ్లకి తెలియజేయాలి. కాశ్మీర్ అత్యంత సుందరమైన ప్రదేశం. తమ వారసత్వాన్నీ, మునీశ్వరులతో తమకు గల అనుబంధాన్నీ వారు తెలుసుకుంటే, ఇక్కడే కాదు, ఈ భూలోకంలో మరెక్కడైనా కూడా వారు స్వర్గాన్ని సృష్టించగలరు,' అని అన్నారు.

నా ప్రశ్నకి సమాధానంగా స్వామీజీ శ్రీరామచంద్రమూర్తి అడవికి వెళ్తున్నప్పుడు భరద్వాజ మహర్షి రామునితో శౌర్య స్వరూపిణి, దైవమాత అయిన కాళీని ధ్యానించవలసిందిగా ఆజ్ఞాపించారు. ఏమైతేనేం వనవాసం నుండి తిరిగి వచ్చేటపుడు రామచంద్రుడు తీర్థప్రయాగ సమీపంలో ఆగి ఎంతో సుందరమైన కరుణామూర్తి అయిన లలితా దేవి రూపాన్ని పూజించారు. ఆయన దేవిని రెండవసారి ధ్యానించిన ప్రదేశం భరద్వాజ ఆశ్రమానికి దక్షిణాన యమునా నదీతీరంలో కొన్ని మైళ్ల దూరంలో ఉంటుంది. స్వామీజీ వెళ్లే ముందు అక్కడ ఆగి ఆమెకు వందనం చేసి సాగిపోయారు.

చిత్రకూట్ చేరగానే స్వామీజీ నాస్తిన్ బాబా అక్కడే ఉండటం చూసి ఎంతో ఉపశమనం పొందారు. ఆయనకు సంబంధించి తన స్నేహితుడు ఈ పవిత్రమైన యాత్రలో పాల్గొంటున్నందుకు






స్వామీ రామ విద్యార్థి దశ, శంకరాచార్యగా ఉన్నప్పటి చిత్రాలు



గంగోత్రి, గోముఖానికి మధ్యన ప్రయాణించాల్సిన దారి ఈ చిత్రంలో ఉంది



యువ భోలే బాబా







ఈ చిత్రాలన్నీ స్వామీజీకి ఇష్టమైన హిమాలయ శిఖరాగ్ర దృశ్యాలు




DARSAN DAS HELD THE LANTERN WHILE LOK DAS UNCOVERED THE BODY. HE PLACED HIS HAND OVER THE MOUTH. "THIS MAN IS ALIVE," SHOUTED DARSAN DAS.

బ్లిడ్జ్ మేగజైన్ నుంచి







బ్లిడ్జ్ లో ఇచ్చిన భవాల్ సన్యాసి చిత్రం

ఎడమ వైపు ఉన్న ఈ రెండు చిత్రాల్లోనూ లచ్చూ లోయ నుంచి కైలాస పర్వతాన్ని ఈ విధంగా చూడవచ్చు



గంగా నది నుంచి కాశీ పుణ్యక్షేత్రం



తుంగనాథ్ నుంచి దేవాలయ ప్రవేశం



తుంగనాథ్ దేవాలయం






వింధ్యాచలంలో ద్వారంపై ఉన్న ఈ ఫలకం బాబాజీ గదికి దారి తీస్తుంది, ప్రక్కనే ఉన్నది సమాధి ఆలయం



హృషీకేష్‌లో వ్రేలాడే వంతెన, గంగ పశ్చిమ తీర దృశ్యం



రవీంద్రనాథ్ ఠాగూర్



హృషీకేష్‌లో వ్రేలాడే వంతెన, గంగ తూర్పు తీర దృశ్యం



మహాత్మాగాంధీ



చిత్రకూట్



ఛిన్నమస్తాదేవి



లాసాలో జోఖంగ్ బౌద్ధమఠం



పోటల ప్యాలెస్



శివాలయం వద్ద మోతియా తాలాబ్



శంకరాచార్యగా స్వామీజీ

జోఖంగ్ దేవాలయం











ఎడమ వైపు క్రింద:
రాష్ట్రపతి నుంచి అవార్డు
తీసుకుంటూ

నాన్తిన్ బాబా ఎంతో సంతోషంగా ఉన్నారు. నాన్తిన్ బాబా సిద్ధసాధువు, అలాగే గొప్ప భక్తుడు. ఆయన జీవితం శ్రీరామునికి అంకితం. ఆయన సాధన చేసిన భక్తి నవవిధ భక్తుల్లో 'సఖ్య భక్తి'గా చెప్పుకోవాలి. ఈ విధమైన భక్తిలో దేవుణ్ణి ఒక స్నేహితుడిగా పరిగణిస్తారు. నిజానికి నాన్తిన్ బాబా రాముడికి స్నేహితుడే. శ్రీరాముడిలాగానే తలకట్టు కట్టుకుని నుదుట గంధం పూసుకుని ఉంటారాయన. ఆయన చూడటానికి రామచంద్రునిలాగే వుంటారు. ఆయన కూడా రాముడిలాగే ప్రవర్తిస్తారు. ఈ యాత్రలో స్వామీజీని కూడా అలాగే ఉండమన్నారు. అలా ఉండటం వల్ల నిరంతరం రామచైతన్యంలో ఉంటామని చెప్పారు. తరచూ ఆయన 'లోపలా రాముడే బయటా రాముడే శ్రీరాముడు సర్వాంతర్యామి' అని పాడుతూ వుండేవారు.

తొంభై దశకం ఆరంభంలో స్వామీజీ వాల్మీకి రామాయణాన్ని అనువదించారు. దాని పరిచయంలో 'ఆరోజుల్లో నేను నాన్తిన్ బాబా వాల్మీకి రామాయణంలో శ్రీరాముని వస్త్రధారణని ఎలాగైతే వివరించారో మేం సరిగ్గా అలాంటి వస్త్రధారణ చేశాం. మా ప్రయాణంలో మమ్మల్ని చూసిన సన్యాసులు ఎంతో ఆశ్చర్యపోయారు. చాలామంది మమ్మల్ని రామలక్ష్మణుల అవతారమని భావించారు. కానీ ఇలా పొరపాటుగా గుర్తింపబడటం, అదీ రామలక్ష్మణులతో సమానంగా గుర్తింపబడటం మాకు అస్సలు రుచించడంలేదు. ఎందుకంటే మేం ప్రజల సంబంధాలకి దూరంగా ఉండి మా ప్రయాణాన్ని కొనసాగించాలనుకుంటున్నాం.

మొదట్లో స్వామీజీ చిత్రకూట్‌కి చాలా పర్యాయాలు వెళ్లి ఉన్నారు. కానీ ఈ విషయంలో నాన్తిన్ బాబాకి గల స్థల పరిచయం ఈయనకు లేదు. అది ఆయనకు సొంత ఇల్లు లాంటిది. వాళ్ల దగ్గర ఉన్నప్పుడు కొండ శిఖరం క్రింద ఉన్న పవిత్రమైన హనుమాన్ ధార అనే గుహలో ఉన్నారు. ఆ గుహలో హనుమంతులవారి విగ్రహం ఉంది. ఆ గుహలో ప్రవహించే జలపాతానికి 'హనుమ ధార' అనే పేరు ఉంది. చిత్రకూట్ పర్వతంమీద వివిధ ప్రదేశాలలో రామధ్యానం నిర్వహించే ముందు సాధకులు తప్పనిసరిగా ఈ గుహలోని హనుమంతుడిని ధ్యానిస్తారు.

హనుమాన్ ధార లోని కొండ శిఖరం మీద సీతమ్మవారి వంటిల్లు ఉంది. చరిత్ర ప్రకారం శ్రీరామచంద్రమూర్తి సీతాదేవీ లక్ష్మణ సమేతంగా చిత్రకూట్ వచ్చినప్పుడు ఇక్కడే నివసించారు. యాత్రాస్థలంలోని మధ్య ప్రదేశంలో సీతమ్మవారు వంట చేసేవారు. నమ్మకం ఉన్న భక్తులు ఇప్పటికీ జగన్మాత రూపంలో సీతాదేవి శ్రీరామచంద్రమూర్తి కుటుంబంలో భాగమైన స్నేహితులకూ, భక్తులకూ వంట చేస్తూ ఉంటుందని నమ్ముతారు.

'హనుమాన్ ధారలో ఉన్నపుడు ప్రతిరోజూ మేము సీతమ్మవారి వంటింటికి వెళ్ళేవాళ్లం!' అని చెప్పారు స్వామీజీ.

ఒక్క క్షణం ఆగి, 'స్వామీజీ, మీకు ఆ వంటింటి నుంచి భోజనం వచ్చిందా?' అని అడిగాను.

సమాధానం చెప్పే ముందు స్వామీజీ క్షణకాలం తాదాత్మ్య స్థితిలోకి వెళ్లి, 'ఈ ప్రపంచమంతా ఆమె వంటిల్లే. అందుకే నిరంతరం ఈ సృష్టి వర్ధిల్లుతూ కొనసాగుతోంది.'

చిత్రకూట్‌లో 'కామదగిరి' అనేది ఎంతో ముఖ్యమైన ప్రాంతం అయి ఉండవచ్చు. దాని గురించి చెప్పేటప్పుడు స్వామీజీ ఎంతో భావోద్వేగానికి గురవడం వల్ల ఆయనకు మాటలు దొరకడం కష్టంగా ఉండేది. అక్కడ వారు ఎంతో ఉద్విగ్నభరితమైన, అమూల్యమైన అనుభవాలు పొందారని అర్థమైంది. చివరికి మాట్లాడుతూ 'ఈ భూ ప్రమాణాలతో సంబంధం లేకుండా కొన్ని ప్రదేశాలు ఉన్నాయి. వాటిల్లో కామదగిరి కూడా ఒకటి. రాములవారు ఇక్కడ నాలుగు సంవత్సరాలు వనవాసం చేశారు. ఇక్కడ వందలాది ఋషులు ఆయనతోపాటు తపమాచరించారు, ధ్యానంలో

ఉండేవారు. శ్రీరాములవారు దక్షిణాది వెళ్ళేటప్పుడు ఆయనతో కూడా వస్తామని చెప్పారు. కానీ రాముడు వారిని వారించి కామదగిరిలోనే ఉండమనీ, తాను శాశ్వతంగా అక్కడ సూక్ష్మరూపంలో వుంటానని అన్నారు. ఇది రాముని శాశ్వత నివాసం కావడం వల్ల ఇక్కడ ఉన్న ఋషులు రాముని పట్ల కలిగి ఉండే భక్తిని మోక్షంకన్నా ఎక్కువగా భావిస్తారు. ఇక్కడి ఋషులు ఎంతో దయతో, ఉదారంగా వుంటారు. వాళ్ళు ఇక్కడికొచ్చే భక్తుల కోరికలు తీరుస్తుంటారు. అందుకనే ఈ పర్వతాన్ని కోరికలు తీర్చే కామదగిరి అని అంటారు. ఇక్కడికి వచ్చి భగవంతుని కంటే తమ జీవితంలో ఇతర విషయాలు ఎంతో ముఖ్యమని భావించే వాళ్లను చూస్తే ఎంతో జాలి వేస్తుంది.

కామదగిరిలో నాన్తిన్ బాబాతో తాను ఎంతకాలం ఉన్నదీ స్వామీజీ చెప్పలేదు. కానీ అక్కడ ఉన్నంతకాలం అనునిత్యం వాళ్లిద్దరూ రామాయణ పారాయణ చేస్తూనే ఉన్నారని చెప్పారు. ఎందుకంటే రామాయణాన్ని తొమ్మిదిరోజుల్లో పూర్తిచేయాలనేది సాధారణ నియమం. అంటే వాళ్లిద్దరూ కనీసం అంతకాలం అక్కడే వుండి ఉంటారు.

శీతాకాలం ప్రవేశిస్తున్నకొద్దీ సూర్యుని తీక్షణం తగ్గి దోమల బెడద కూడా తగ్గుతుంది. సెప్టెంబర్ చివరినాటికి నదుల ఉధృతి తగ్గి సాధారణ స్థితిలోకి వస్తాయి. వర్షాకాలంలో పొదలు, గడ్డితో మూయబడిన దారులు తెరుచుకుంటాయి. ఈ సమయంలోనే ప్రజలందరూ శ్రీరాముని బాట అనుకూలంగా ఉంటుందని వెళ్తారు, ఇదొక సాంప్రదాయం. స్వామీజీ అనువదించిన వాల్మీకి రామాయణం పరిచయంలో వారు నాన్తిన్ బాబాతో కలిసి వెళ్లిన ప్రయాణం గురించి కొంత వివరించారు.

పున్నమిరోజు రాత్రి ఒక దుప్పటీ, ఉతకర్ర, నీటి కమండలం తప్ప ఇంకేమీ పట్టుకుని వెళ్లకూడదని నిర్ణయించుకొని 'అనసూయ' అనే ప్రదేశం వైపు వెళ్లదలుచుకున్నాము. (అక్కడి స్థలాలని ప్రఖ్యాతి గాంచిన ఋషుల పేర్లతో పిలుస్తుంటారు.) అనసూయ ప్రదేశం చిత్రకూట్‌లో ఉన్న అందమైన ప్రదేశాలలో ఒకటి. ఇక్కడ మా చుట్టూ అడవి జంతువులనూ, కొండ శిఖరాల పైన పెద్ద పెద్ద తేనె తుట్టెల్ని చూశాం. పులి గాండ్రింపులు విన్నాం. రామాయణ గ్రంథాన్ని మాచేతపట్టుకుని ఒకరోజు రాత్రంతా మందాకినీ నది ఒడ్డున ప్రయాణించాం. మా ప్రయాణంలో కాగడా వెలిగించి చెరొక రాత్రి ధ్యానం చేయాలని నిర్ణయించుకున్నాం. మా గురువర్యులు బాబాజీ రాత్రి పడుకోవద్దనీ, కునుకు తీయవద్దనీ చెప్పారు. మధ్యాహ్న భోజనం తరువాత మూడు గంటలు నిద్రపోవాలని ఆదేశించారు.

'మా భుక్తి కోసమూ, జీవనోపాధి కోసమూ గృహస్తుల మీద లేకపోతే సన్యాసుల మీద ఆధారపడలేదు. తిండి కోసం చెట్ల వేళ్లనూ, దుంపలనూ తవ్వి తీసి ఉడక పెట్టుకుని తినేవాళ్లం. అవి ఎంతో రుచిగానూ పోషక విలువలతో కూడి ఉండేవి. అప్పుడప్పుడూ అక్కడ చుట్టుప్రక్కల గ్రామాల్లో నివసించే ప్రజలు మాకు జావ, సంకటి ఇస్తుండేవాళ్లు. ఆ రోజుల్లో జీవితం అనిర్వచనీయమైన ఆనందంతో గడిచిపోయేది. మేము ఏ విధంగా ప్రయాణం చేశామో మా అనుభవాలు ఎంత గొప్పగా ఉండేవో చెప్పడానికి మాటలు దొరకవు.'

చిత్రకూట్ వదిలిన తరువాత వాళ్లు దక్షిణానికి కొద్ది మైళ్ల దూరంలో ఉన్న 'శరభంగా' వెళ్లారు. అక్కడే గొప్ప మహాముని శరభంగా నివసించారు. రామాయణంలో చెప్పబడిన కథని బట్టి చూస్తే ఈ మునీశ్వరుని ఆయుర్దాయం పూర్తి అయిన తర్వాత దేవేంద్రుడు తనంతట తానుగా దిగి వచ్చి శరభంగాను వెంటబెట్టుకుని స్వర్గానికి తీసుకెళ్లడానికి వచ్చాడు. అయితే రాముడు వనవాసానికి వెళ్ళేటప్పుడు తనని చూడటానికి తప్పనిసరిగా వస్తాడని తెలిసింది. ఎలా అయినా శ్రీరాముణ్ణి ఈ ఆశ్రమంలోనే వుండి ఈ దేహంతోనే చూడాలనే కోరికతో దేవేంద్రుడి ఆహ్వానాన్ని తిరస్కరించాడు. చిత్రకూట్‌లో ఉన్న చాలామంది మునులు అత్రి, అనసూయ వంటి

వారందరికీ ఇది తెలిసి, శ్రీరాముడు దక్షిణాపథానికి వచ్చినప్పుడు ఆయన్ని శరభంగా ఆశ్రమానికి వెళ్లవలసిందిగా కోరారు. శరభంగా శ్రీరామునికి ఆతిథ్యమిచ్చిన మరుక్షణమే దహనమై అదృశ్యమైయ్యాడు. అప్పటినుండి ఇది ఎంతో పవిత్రమైన ప్రదేశంగా పరిగణింపబడుతోంది.

అక్కడినుండి యాత్రికులు దగ్గరలో ఉన్న సత్నా పట్టణానికి వెళ్లి అక్కడి నుండి రైలులో సీతను అపహరించిన నాసిక్ వెళతారు. ఇది దక్షిణాన కొన్ని వందల మైళ్ల దూరంలో ఉంది. అలా చేయడం వల్ల వాళ్లు రాముడు నివశించిన, దీక్షా సాధనలు చేసిన వందలాది ప్రదేశాలు చూడకుండానే వెళ్లిపోతారు. అందుకే స్వామీజీ, శ్రీరామ పథంలో పయనించే ముందు కేవలం రామాయణంలో పేర్కొన్న ప్రాంతాల్ని మాత్రమే కాక శ్రీరాముని ప్రయాణాన్ని వివరిస్తూ గ్రంథస్థం చేసిన పద్మ పురాణం వంటి ముఖ్యమైన ఇతర గ్రంథాలను చదవాలని చెప్తారు.

పద్మ పురాణంలో చెప్పినట్లు స్వామీజీ, నాన్తిన్ బాబా మధ్యప్రదేశ్‌లోని శరభంగా నుండి ఓర్చాకి బయల్దేరారు. ఐతే వాళ్లు ఓర్చాకి చేరే ముందు అందమైన కొండ శిఖరంమీద ఉన్న 'మైహర్' అనే అమ్మవారి గుడికి చేరుకున్నారు. స్థల పురాణం ప్రకారం 'అల్‌హా' అనే చిరంజీవి యోగి పూజారులు గుడి తలుపులు తెరవకుండానే తెల్లవారుఝామునే వచ్చి అమ్మవారిని పూజ చేస్తుంటాడు. పురాణ గ్రంథాలలో ఉన్న సమాచారం ప్రకారం ఇక్కడి అమ్మవారు సాంప్రదాయ కళలకు సంబంధించిన శక్తిదేవత. కానీ కాలక్రమేణా ఇక్కడి భక్తులు ఆ దేవత భక్తుల ప్రాపంచిక కోరికలు తీరుస్తుందని నమ్మటం మొదలుపెట్టారు. దాంతో మిహిర దేవి తాంత్రిక శక్తి స్వరూపిణిగా మారిపోయింది. పూజలు కూడా తరచుగా ద్రాక్షసారాయి మద్యంతో, మాంస భక్ష్యాలతో జరుగుతుంటాయి.

వాళ్లు చేరుకునే 'ఓర్చా' అనేది చాలా చిన్న పట్టణం. అందువల్లే ఆధునిక కాలంలో దాన్ని ఒక ఆధ్యాత్మిక ప్రదేశంగా గుర్తించడం లేదు. కానీ స్వామీజీ, నాన్తిన్ బాబా అటు గ్రంథాలలోనూ, సాంప్రదాయాల జ్ఞానంలోనూ ఎంతో అవగాహన ఉన్నవారు. అందుకే వైదిక కాలం నాటి ఓర్చా ప్రాముఖ్యతనూ, చరిత్రనూ తెలుసుకోగలిగారు. రాముని కాలంలో అది గొప్ప ప్రసిద్ధిగాంచిన శివాలయం. అత్రి మహర్షి సారథ్యంలో శ్రీరామచంద్రమూర్తి అక్కడ సాధన చేసేవారు. ఈ ప్రదేశాన్ని పద్మ పురాణంలో 'రిక్షావాన్' అనంటారు.

పందొమ్మిదవ శతాబ్దం వరకూ రిక్షావాన్‌ని ప్రజలు పట్టించుకునేవారు కాదు. కానీ ఓర్చారాణి తాను శ్రీరాముణ్ణి అయోధ్యలో కలిసినట్లు స్వప్నంలో చూసినప్పటి నుంచీ ఆ స్థలం తిరిగి ప్రాముఖ్యం సంతరించుకుంది. ఆ కలలో శ్రీరాముడు తాను పరమశివుడి దీవెనలు అక్కడే పొందాననీ, అందుకే ఓర్చాను తాను ఎంతగానో ఇష్టపడతాననీ, ఓర్చా పట్ల తనకు ఎంతో కృతజ్ఞత ఉందనీ తెలియజేశాడు. అంతేకాక ఆమెతో తాను ఓర్చాలో ఉండాలనుకుంటున్నాననీ, ఆమె స్వయంగా వచ్చి తనను ఓర్చాకు తీసుకెళ్లాల్సిందిగా భావిస్తున్నట్లు ఆ స్వప్నంలో తెలియజేశాడు. వెంటనే లేచి ఎంతో ఆతృతతో ఆయోధ్యకు వెళ్లి శ్రీరాముణ్ణి తీసుకుని రావాలనుకుంది. దాంతో ఆమె ఓర్చాలో గుడి కట్టడం మొదలుపెట్టింది. అది నిర్మాణంలో ఉండగా ఆమె ఆయోధ్యకు వెళ్లింది. అక్కడ తాను కలలో చూసిన సీతా సమేత రామలక్ష్మణుల విగ్రహాలను చూసింది. ఆ విగ్రహాలను ఒక ఏనుగు మీద అధిష్టింపజేసి అశ్వాలూ, రథాలూ పూన్చి సపరివారంగా ఆమె స్వయంగా ఓర్చాకు తెచ్చింది. రాచఠీవితో శ్రీరాముడు అయోధ్య నుండి ఓర్చాకి చేసిన ప్రయాణ కథనాన్ని రెండు పట్టణాల్లోనూ ఇప్పటికీ కమనీయగాథగా చెప్పుకుంటారు. ఆ విగ్రహాలను పూజా మందిరంలోని దైవ పీఠంపై ప్రతిష్ఠించారు. ఆ స్వామి రఘునాథునిగా ప్రసిద్ధి చెందాడు. ఆ ఆలయాన్ని 'రఘునాథ్ మందిర'మని పిలుస్తున్నారు.

స్వామీజీ, నాన్తిన్ బాబా ఓర్చాకు చేరుకున్నారు. అక్కడ స్వామీజీ తన ఉనికి బయటపడకుండా ఉపాయంగా తప్పించుకోవాల్సి వచ్చింది. స్వామీజీ భోలేబాబాగా ఉన్నప్పుడు ఆయన భార్యకు ఆ చిన్న ఓర్చా రాజ్యం, ఆ ప్రక్కనే ఉన్న టిక్మాఘర్ రాజ్యంలోని రాచకుటుంబాలతో పరిచయం ఉంది. భోలే బాబా సంసార జీవితాన్ని వదిలేసి స్వామీ రామగా, సన్యాసిగా మారినప్పటికీ ఓర్చాలో తనని ఎవరైనా తెలిసినవాళ్లు చూస్తే గొడవ అవుతుందని భావించారు. దాంతో తననెవరూ గుర్తుపట్టకుండా ఉండటానికి ఆయన చినిగిపోయిన దుస్తుల్లోకి మారారు. ఆ విధంగా సాధువులిద్దరూ ఓర్చాకి వెళ్లి గుడిలో దర్శనం చేసుకుని వెంటనే తిరిగి వెళ్లిపోయారు.

పద్మపురాణంలో చెప్పబడినట్లు శ్రీరామ పథంలోని మార్గాన్ని అనుసరించి స్వామీజీ, నాన్తిన్ బాబా పశ్చిమ దిశలో ఉన్న రాజస్తాన్‌లోని పుష్కరకి ప్రయాణించారు. పురాణ గ్రంథాలని అనుసరించి మొదటిసారిగా అత్యంత ప్రతిష్ఠాకరమైన యజ్ఞం జరిగింది ఇక్కడే. ఈ యజ్ఞం బ్రహ్మ ఆధ్వర్యంలో జరిగింది. ఈ యజ్ఞంలో సకల దేవతలూ, రాక్షసులూ, మనుషులూ, పాములూ, పక్షులూ, ఇలా మొత్తం ప్రకృతి శక్తులన్నీ పాల్గొన్నాయి, ఈ యజ్ఞంలోనే మొట్టమొదటిసారిగా వేద పరిజ్ఞానం ఆచరణలోకి తీసుకురాబడింది.

చాలాకాలం క్రితం ఉన్న పుష్కర్ గురించి గ్రంథాల్లో వ్రాసిందీ, ఇప్పుడిక్కడున్న వాస్తవ పరిస్థితినీ పోల్చుకుంటే కొంత సారూప్యం ఉంటుంది. అప్పట్లో ఇక్కడ మూడు కొండలు మూడు సరస్సులూ ఉండేవి. ఒక సరస్సు నుండి సరస్వతీ నది పుట్టి సముద్రం వైపు ప్రయాణిస్తూ ఉండేది. అయితే ఇప్పుడు ఆ మూడింటిలో రెండు సరస్సులు అదృశ్యమయ్యాయి. ఒకటి మాత్రమే మిగిలి ఉంది. ఆ మిగిలిన సరస్సులో కూడా నీళ్లన్నీ బాగా ఎండిపోయి 'ఒక సరస్సు'గా పిలవబడడానికి వీల్లేకుండా ఉంది. ఆధునిక హిందూ మతంలో పుష్కర్ మాత్రమే సృష్టికర్త బ్రహ్మతో సంబంధం కలిగి ఉన్న ప్రదేశం. ప్రక్కనే ఉన్న అజ్మీర్ భారతదేశంలోని ముస్లింలకూ, సూఫీలకూ ఎంతో పవిత్రమైన ప్రదేశం.

పుష్కర్‌లోకి ప్రవేశించక ముందు, నాన్తిన్ బాబా ఈ ప్రదేశానికి పవిత్రత ఎలా చేకూరిందో ఖచ్చితంగా యాత్రాస్థలం ఉన్న చోటు గురించీ, సాంప్రదాయబద్ధంగా ఇక్కడున్న ఆచార వ్యవహారాల గురించీ, గతంలో ఇక్కడ ఉండి సాధన చేసిన మహనీయుల గురించీ, ఇక్కడికి వచ్చి శ్రీరామచంద్రుడు తన తపోదీక్షలను కొనసాగించిన పరిస్థితుల గురించీ అనేక విషయాలను వివరించారు.

చిత్రకూట్‌లో మొదలైన దగ్గర నుండి ఇక్కడికి వచ్చేంత వరకూ స్వామీజీ, నాన్తిన్ బాబా రామాయణ పారాయణ చేస్తూనే ఉన్నారు. ఇక్కడికి వచ్చి రామాయణ పారాయణ బదులు పద్మ పురాణ పారాయణ కొనసాగించాలనీ దాంతో పాటు మరి కొన్ని గ్రంథాలను పారాయణ చేయాలని కూడా వారు నిర్ణయించుకున్నారు. ఇలా నిర్ణయించుకుని వీరిద్దరూ అక్కడున్న ధర్మసత్రంలో ఒక గదిని తీసుకోని దాన్ని శుభ్రం చేసి పారాయణ చేసే పీఠ స్థానాలను నిర్ణయంచుకున్నారు. ఒక పీఠం గురువుకీ, మరొక పీఠం శిష్యునికీ, వేరొక పీఠం గ్రంథం కోసమనీ నిర్ణయించుకున్నారు. స్వామీజీ అభ్యర్థన మేరకు నాన్తిన్ బాబా గురువు పాత్రనూ స్వామీజీ శిష్యుడి పాత్రనూ ధరించారు. దాంతో గ్రంథంలోని సూచించబడిన విధి ప్రకారం స్వామీజీ నాన్తిన్ బాబాని పద్మపురాణాన్ని రచించిన వ్యాస మహాముని ప్రతీకగా కొలిచారు. వాళ్ల దీక్షలో భాగంగా అక్కడున్న చిన్న కొలనులో ప్రతిరోజూ స్నానం చేసి బ్రహ్మను పూజించి తపస్సు చేసేవారు. తరువాత తగుమాత్రం ఆహారం తీసుకునేవారు. మధ్యాహ్నం తిరిగి గదికి వచ్చి పారాయణ మొదలుపెట్టి ఆ రోజు చదవాల్సిన భాగాల్ని పారాయణ చేసేవారు.

పదహారు సంవత్సరాలుగా స్వామీజీతో ఉన్నా గానీ ఎప్పుడూ ఆయన పుస్తకం చదివినట్లు చూడలేదు. దాంతో ఎవరో ఆయన కోసం చదువుతుంటే ఆయన కూర్చుని వినడాన్ని నేను ఊహించలేకపోతున్నాను. అయితే పురాణ గ్రంథ పారాయణ అనేది ఆధ్యాత్మిక ఆచరణలో భాగమని నాకు తెలుసు. అందుకే వాళ్లిద్దరికీ ఆ గ్రంథం ఎక్కడ నుంచి వచ్చిందా అని చాలా ఆసక్తి కలిగింది. ఆదే విషయాన్ని స్వామీజీని అడిగినప్పుడు స్వామీజీ 'నాన్తిన్ బాబా దగ్గర ఒకటి కూడా లేదు. ఆయన ఒకే గ్రంథాన్ని చదవలేదు. చాలా సార్లు చాలా రకాల గ్రంథాలను చదివారు. ఆ రకంగా మొత్తాన్ని కంఠస్థం చేశారు. ప్రస్తుతం లభ్యమవుతున్న పద్మపురాణంలోనూ, మిగతా పురాణాల్లోనూ, వేదాల్లోనూ అనేక కథా సంకలనాల్లోని కథలన్నీ కనిపిస్తాయి. కానీ నాన్తిన్ బాబా భావనలో పద్మపురాణం సజీవశక్తి. ఆయన పద్మపురాణాన్ని ఆవాహనచేసి రామాయణంలో పొందుపరచి దాన్ని అక్కడ గ్రంథానికి కేటాయించిన పీఠంపై వుంచారు. రోజూ గ్రంథ పారాయణ చేస్తూ పూర్వకాలంలో గ్రంథ పారాయణ చేసే పద్ధతిలోనే ఆయన ప్రతిరోజూ పారాయణ చేస్తూ ఆందులోని కథల్ని తన జ్ఞాపకాల పొరల్లోంచి తీసి చెప్తుండేవార'ని సమాధానమిచ్చారు.

నాన్తిన్ బాబా తన జ్ఞాపకాల పొరల నుంచి కథలు చెప్పారని స్వామీజీ అన్నపుడు నాకు ఓ కొంటె ఆలోచన వచ్చింది. నేను ఈ గ్రంథాలను చదివాను. వాటిలో హిందూ మత కర్మలూ, ప్రవర్తనా నియమావళీ, ఈ పుష్కర్‌తో సహా పవిత్ర ప్రదేశాలను తెలిపే మార్గదర్శకాలూ, కులవ్యవస్థతో కూడిన శిష్టాచార వివరాలూ వుంటాయి. స్వామీజీ కులవ్యవస్థను నమ్మరని నాకు బాగా తెలుసు కానీ నాన్తిన్ బాబా సంగతేంటి? అదే విషయం స్వామీజీని అడిగాను. దానికి వారు నాన్తిన్ బాబా పద్మపురాణ వివరణలో కులవ్యవస్థ కానీ మతాచారాలుగానీ ఏవీ ఉండవు. నాన్తిన్ బాబా లాంటి గురువులు పుస్తకాల బరువులను మోయరు. వాళ్లే గ్రంథాలను నాశనం చేయగలరు, సృష్టించగలరు. ఇతర మతాలకు చెందిన గ్రంథాల్లాగానే హిందూ మత గ్రంథాలు కూడా మతగురువుల స్వార్థంతో కలుషితమైపోయాయి. యోగులు గ్రంథాల్లోని ఏభాగం వాస్తవమైనదో ఏ భాగం కల్పితమైనదో అవలీలగా తెలుసుకోగలరని చెప్పారు.

అప్పుడు స్వామీజీని గ్రంథాల్లో ఏ భాగం కల్పితమైనదో నేనెలా తెలుసుకోగలనని అడిగాను. దానికి వారు పద్మ పురాణం కాపీని తీసుకుని రమ్మన్నారు. అప్పుడు నా దగ్గర గోరక్‌పూర్‌లోని గీతా ప్రెస్‌వారు హిందీలో ముద్రించిన సంక్షిప్త పద్మ పురాణం ఒకటి ఉంది. దాన్ని ఆయన చేతికి అందించగానే నేరుగా విషయ సూచిక తీసి అందులో సగానికి పైగా ఉన్న సూచికలను కొట్టేసి ఇలా అన్నారు, 'ఈ అధ్యాయాలలో ఉన్న విషయాలలో చాలావరకు జీవిత విలువల గురించి లేదా ప్రమాణాల గురించి, వేదకాలంలో ఉండే లోకాచారం గురించీ, పాపం, భయం, దోషం వంటి విషయాల గురించీ బోధిస్తున్నాయి. ఋషులు చెబుతున్న విషయాలకీ దీంట్లో ఉన్న ఆధ్యాయాలకీ ఎలాంటి సంబంధమూ లేదు. ఇవి పూజారులూ, పండితులు వందల సంవత్సరాల నుండి అసలు వ్రాత ప్రతులను కాపీ కొట్టి ఆడుతున్న కపట నాటకాన్ని తేటతెల్లం చేస్తున్నాయి.'

నేను అపుడు నాన్తిన్ బాబా సుదీర్ఘంగా వివరించిన భాగాన్ని ఒకటి చెప్పమని స్వామీజీని అడిగాను. వారు విషయ సూచికను చూస్తూ తన చూపుడువేలును ఒక చోట ఉంచి, 'చూడు ఈ భాగం! దీన్ని చదువు!' అన్నారు.

నేను నా ఆఫీస్‌కి వెళ్లి పుస్తకంలోని ఆ విభాగాన్ని చదవడం ఆరంభించాను. అందులో ఇలా ఉంది–

'ఒకరోజు రాజు ప్రభంజనుడు సరదాకి పుష్కర్ దగ్గరలో ఉన్న అడవిలోకి వెళ్లాడు. ఆ అడవి అంతా వన్య ప్రాణులతో కళకళలాడుతోంది, కొంతసేపు అలా గడిచిన తరువాత ఒక

జింక పొదల మాటున పడుకుని ఉండడం చూశాడు ఆ రాజు. అది ఒక పవిత్రమైన ప్రదేశంలో నివసిస్తోందనీ దాన్ని చంపకూడదనీ తెలిసి కూడా ఆయన బాణం వేశాడు. ఆ ఆడ జింక గాయపడింది. కానీ ఆశ్చర్యంగా అది తప్పించుకోవడానికి ప్రయత్నించలేదు. రాజు దాని దగ్గరకి వెళ్లి చూడగా, 'ఓ బుద్ధిహీనుడా, ఏం చేశావో చూడు. నన్ను వేటాడటానికి సరైన సమయం కాదు ఇది. నేను నా బిడ్డకి పాలిస్తున్నాను. అసలైనా ఈ అడవిలో వేటాడకూడదు. ఈ అడవి ఒక ఆధ్యాత్మిక ప్రదేశమని నీకు తెలుసు. నీవు చేసిన ఈ చర్యకి నువ్వు క్రూర మృగంగా పుట్టి పచ్చి మాంసాన్ని తింటూ జీవించు' అని శపించింది.

భయపడిపోయి రాజు నేల మీద సాగిలపడి నన్ను క్షమించు. నేను ఈ పవిత్ర ప్రదేశంలో నేరం చేశాను. కానీ నీ జింకపిల్లను నేను చూడలేదు. ఆ విషయంలో నేను అమాయకుణ్ణి!' అని రోదించాడు.

ఆ జింక 'వంద సంవత్సరాల తర్వాత నువ్వు ఒక ఆవును చూస్తావు. ఆ ఆవు తన పేరు చెప్పిన తరువాత నీ శాపవిమోచనం జరుగుతుంది. కానీ సింహంగా నీ జీవితకాలంలో ఏదైనా జంతువును పట్టుకుని తినబోయే ముందు ఓ క్షణం ఆగి నీ చేతికి చిక్కిన ఏ జంతువైనా నీకు ఆహారమవుతుందని వివరించాలి. ఆ రకంగా మాత్రమే నీకు నీ ఆహారాన్ని వేటాడే హక్కు ఉంటుంది.'

ఈ సంభాషణ ముగియగానే ఆ జింక, ఆ రాజు, ఇద్దరూ చనిపోయారు. రాజు దేహం శక్తివంతమైన సింహంగా మారింది. అది ఎంతో అసాధారణంగా పెద్ద ఆకారంలో వుండి భయంకరంగా ఉంది. తన ఆహారం కోసం ఏ జంతువునైనా చంపే సమయంలో తప్ప మిగతా సమయాలలో అది ఎంతో దయగా రాజుకున్న ప్రవృత్తులతో జీవించసాగింది.

జింక చెప్పినట్లుగానే సింహం ఆడవిలో వేటాడుతూ జీవనం గడుపుతోంది, వంద సంవత్సరాలై పోయింది. ఒకరోజు పశువుల కాపర్లు కొంతమంది తమ గోవుల్ని అడవిలోకి ప్రవేశించారు. అక్కడ స్వచ్ఛమైన నీరు, పుష్కలంగా పచ్చిక కనబడడంతో ఆ రోజుకి అక్కడ విశ్రాంతి తీసుకుందామనుకున్నారు. దాంతో అక్కడ గోవుల కోసం చిన్న కంచె వేసి వాళ్లు గుడారాలు వేసుకున్నారు. కాసేపట్లోనే ఆ ప్రదేశం గోవుల అంబారావాలతో గొల్లపిల్లల పిల్లనగ్రోవి గానాలతో నిండిపోయింది.

ఆ గుంపుల్లోని గోవుల్లోకెల్లా పెద్దదీ ఆరోగ్యవంతమైనదీ అయిన ఆవు పేరు నందా. అదెంతో తెలివైనదీ, భయంలేనిదీ. అయితే ఓరోజు పచ్చిక మేస్తుండగా సింహం దానిపై దాడి చేసింది. దాని అలవాట్లో భాగంగా, 'ఈ రోజుకి ఆహారంగా నిన్ను విధాత నాకు పంపించాడు,' అని అంది.

ఆవు, 'నీ నుండి నన్ను నేను రక్షించుకోవడం అసాధ్యం, చావు రాక తప్పదు అది ఇప్పుడైనా లేదా తరువాతైనా వస్తుంది. ఓ మృగరాజా! కొద్దిరోజుల క్రితమే నేను బిడ్డను కన్నాను. నా దూడ బ్రతకడానికి నా పాలు మాత్రమే ఆధారం. ఇప్పుడు దానికి ఆకలిగా ఉంది. నా రాక కోసం ఎదురుచూస్తోంది. నువ్వు నన్ను చంపితే అది ఎలా బ్రతుకుతుంది? దయచేసి నన్ను పోనీయి. నా దూడకు పాలిచ్చి దానికి ఎలా బ్రతకాలో కొన్ని పాఠాలు చెప్పి దాన్ని వేరే ఎవరికైనా అప్పజెప్పి తిరిగి నీ దగ్గరికి వస్తాను.' అంది.

'నీ ధైర్యాన్నీ, నిర్భయత్వాన్నీ చూస్తే నువ్వు గొప్ప జ్ఞానిలా ఉన్నావు. కానీ నీ బిడ్డతో నీకున్న అనుబంధం వల్ల అబద్ధాలాడుతున్నావేమో! అయినా జీవితపు ఈ ఆఖరి క్షణాల్లో నీ బిడ్డ గురించి నీకు ఎందుకింత కలవరం?' అనడిగింది సింహం. అప్పుడు నందా, 'నన్ను నమ్ము.

నేను వెళ్లి మళ్లీ వస్తా. నేను గనక తిరిగి రాకపోతే ఒక జ్ఞానవంతుడైన ఋషినీ లేదా దంపతులను చంపినంత పాపం నాకు చుట్టుకుంటుంది. నేను నా ప్రమాణాన్ని ఉల్లంఘిస్తే నాకు సహాయం చేయడానికి నిరాకరించిన వాడికీ జంతువుతో పోల్చి తిట్టినంత పాపం చేసినవాడికీ లేదా ఇతరుల ఆధ్యాత్మిక సాధనకు అంతరాయం కలిగించినంత వాడికీ చుట్టుకునే పాపం చుట్టుకుంటుంది. ఇవన్నీ ఎంతో ఘోరమైన పాపాలని నాకు తెలుసు, కనుక నేను తప్పనిసరిగా తిరిగొస్తాను.' అంది.

సింహం, 'అయితే వెళ్లు! వెళ్లి నీ బిడ్డని ఆఖరిసారిగా చూడు. పాలిచ్చి దాని నుదుటిని ప్రేమతో నాకు. దానికి జాగ్రత్తలు చెప్పి నీ స్నేహితులకి అప్పగించు. ఆ తర్వాతే తిరిగి రా!' అని అంది.

నందా ఆవులున్న కంచెకు బయలుదేరింది. తన తల్లి రావడం చూసిన లేగదూడ ఆనందంతో గెంతడం మొదలుపెట్టింది. అయితే తల్లి దగ్గరికి వచ్చిన తరువాత ఆమె ముఖంలో బాధను చూసి ఎందుకలా ఉన్నావని అడిగింది. నందా కారణం వివరిస్తూ, 'బిడ్డా! నా పాలను కడుపు నిండా త్రాగు! రేపు నువ్వు ఎవరి పాలు త్రాగుతావో ఎవరికి తెలుసు. ఇదే మన ఆఖరి కలయిక. నేనొక ఆకలిగొన్న సింహానికి దాని ఆకలి తీర్చడానికి తిరిగొస్తానని ప్రమాణం చేశాను' అంది.

'నేనూ నీతో వస్తానమ్మా' దూడ ఏడ్చింది. 'నువ్వు లేకపోతే నేనెలాగూ చచ్చిపోతాను. అలా కాకుండా నీతో వస్తా,' అంది దూడ.

'చావును కావలించుకోవడం అంటే ఆత్మహత్యతో సమానం!' అంది నందా కఠినంగా. 'నన్ను ప్రేమతో గౌరవించడం అంటే నువ్విక్కడ ఉండడమే! ఇప్పుడు నామాటలు జాగ్రత్తగా విను' అంటూ దానికి ఈ విధంగా హితబోధ చేయడం ప్రారంభించింది–

'నువ్వు అడవిలో మేత మేస్తున్నపుడు గానీ లేదా జలపాతం దగ్గర నీరు త్రాగుతున్నప్పుడు గానీ ఏ మాత్రం నిర్లక్ష్యంగా ఉండకు. దానివల్ల ప్రమాదకరమైన జంతువులను నువ్వే నీ నాశనానికి ఆహ్వానించినట్లు అవుతుంది. తిండి కోసం దురాశపడి ప్రమాదకరమైన ప్రాంతాల్లోకి వెళ్లి మేత మేయకు. దురాశ నిన్ను ప్రమాదంలో ముంచుతుంది.

'అయోమయంలో ఉండి గుడ్డిగా ఎవరినీ అనుసరించకు. నిర్లక్ష్యం, దురాశ, గుడ్డినమ్మకాలు నీకు శత్రువుల్లాంటివి. ఎవ్వరినీ పరీక్షించకుండా నమ్మకు. ఎవరినైనా నమ్మినా కూడా నీ పూర్తి నమ్మకాన్నీ విశ్వాసాన్నీ వాళ్ల పైన ఉంచకు. అలా చేస్తే త్వరలోనే నువ్వు ఆందోళననీ, భయాన్నీ ఆహ్వానించినదానివి అవుతావు. నీ ఆత్మ విమోచన కోసం, నీ మనశ్శాంతి కోసం దేవుణ్ణి నమ్ము.

'నిన్ను నువ్వు రక్షించుకోవడానికి అన్ని విధాలా ప్రయత్నించు. ఆరోగ్యంగా ఉండు. కానీ మరణానికి ఏనాడూ భయపడకు. జీవితం వచ్చిన తర్వాత నిశ్చయంగా మనం తప్పనిసరిగా ఎదుర్కోవలసింది మరణం ఒక్కటే. నీడలో ప్రయాణికుడు కాసేపు సేద తీరి తిరిగి ప్రయాణించినట్లే, మనమిద్దరం మన గమ్యాన్ని చేరే ముందు కలిశాం. అంతే. నీకు నువ్వు శోకం నుండి విముక్తం కా.'

నందా తన కుమారుడితో ఈరకంగా మాట్లాడిన తరువాత దాని నుదుటిని తనివితీరా నాకి తన స్నేహితుల దగ్గరికి వెళ్లి, 'మీరెంతో ఉన్నతులూ ఉదార స్వభావులు, ఇతరులకు సహాయం చేయగల స్తోమత మీకు ఉంది. దయచేసి నిస్సహాయుడైన నా కుమారుడిని రక్షించండి. మాట నిలబెట్టుకోవడానికి నేను ఆ సింహం దగ్గరకి వెళ్లాలి,' అంది.

అప్పుడు ఆ గోవు ఆ మంద చుట్టూ ఒకసారి తిరిగి ఈ భూమికీ, నీటికీ, అగ్నికీ, వాయువుకీ, ఆకాశానికీ, సూర్యుడికీ, చంద్రుడికీ, నక్షత్రాలకీ, దశదిక్పాలకులకీ, అక్కడి చెట్లకీ, పుష్కర వనానికీ అందరికీ వందనం సమర్పించింది. 'ఓ ప్రకృతి శక్తులారా! ఇక్కడ దృశ్యరూపంలోనూ ఆదృశ్యరూపంలోనూ ఉన్న దివ్యశక్తులారా! నాబిడ్డను రక్షించండి! సత్యాన్నీ ధర్మాన్నీ అనుసరించే బలాన్ని నాకు ప్రసాదించండి!' అని ప్రార్థించింది.

తర్వాత నందా సింహం దగ్గరికి  తిరిగి వెళ్లింది. 'నేను వచ్చాను! నీ ఆకలిని నా రక్తమాంసాలతో తీర్చుకో!' అంది.

కానీ సింహం దాన్ని చంపలేదు సరి కదా, ప్రణామం చేసింది. 'ఇలాంటి అద్భుతమైన సంఘటన నా జీవితంలో ఇంతకాలం నాకు ఎదురు కాలేదు. నా జీవితమంతా క్రోధంతోనూ ఆకలితోనూ గడిచిపోయింది. కానీ నీతో మాట్లాడిన తరువాత సత్య వచనాన్ని ఆచరించడమే అన్ని ఆచరణలలోకల్లా గొప్పదని అర్థం చేసుకున్నాను. నువ్వు నివసించే ప్రాంతం, ప్రాణి కోటీ ఆశీస్సులు వర్షిస్తాయి. నీ పాలు సేవించినవారు ఆశీర్వదింపబడతారు. నిన్ను చూసిన తరువాత ఈ జీవితం మీద నాకు విరక్తి కలిగింది. సింహంగా జన్మించిన నేను  నా ఆకలిని తీర్చుకోవడానికి కొన్ని వేల జంతువులను చంపాను. నా స్వభావం నన్ను వేటాడటానికి ప్రేరేపించింది, కానీ ఇవాళ నాలోని అంతరాత్మ జీవితంలో తినడం, నిద్రపోవడం, వార్ధక్యంలోకి రావడం, చనిపోవడంలాంటి వాటికన్నా ఉన్నతమైంది ఏదో ఉందని తెలియజేస్తోంది. కానీ నేను ఒక సింహాన్ని. నా ఆకలి మీద నాకు నియంత్రణ లేదు. దయచేసి ఈ జీవితంలో ప్రశాంతతనీ ఉన్నతమైన విలువలను సాధించే విధానం తెలియజేయి,' అని కోరింది.

ఆవు 'నా ప్రియమైన సోదరుడా! ఈ చీకటి యుగంలో శాంతిని సాధించడానికీ జీవితంలోని ఉన్నత లక్ష్యాలను తెలుసుకోవడానికీ నిస్వార్థ సేవ ఒక్కటే ఉత్తమమైన మార్గం. పరులకు సహాయం చేసేవారు చనిపోయేటప్పుడు బ్రాహ్మణత్వంలో కలుస్తారు,' అని పలికింది.

సింహం, 'నాకు ఇపుడు అర్థమైంది నువ్వెవరివో! రాజుగా ఉన్నపుడు వంద సంవత్సరాల క్రితం నేను ఒక జింకను చంపాను. నాకు తగిలిన శాపం నుండి విమోచన కలిగించడానికి వచ్చిన దయామూర్తివి. దయచేసి నన్ను ఈ శరీరం నుంచీ ఈ అలవాట్ల నుంచీ విముక్తం చేయి. నేను నిన్ను వేడుకుంటున్నాను, నీ పేరేమిటి చెప్పు!' అని అడిగింది.

'నందా!' అంది ఆవు.

వెంటనే ఆ సింహం చనిపోయి దాని మృతదేహం నుంచి రాజు ఉద్భవించాడు.

ఈ కథ చదివిన తరువాత గ్రంథాలలోని విషయాలపై విశ్వాసం వుంచే వైఖరిని కొనసాగించడానికి శాయశక్తులా ప్రయత్నించినప్పటికీ ఒక ప్రశ్న మాత్రం మిగిలిపోయింది. సహజంగా ప్రజలు ఆ రోజుల్లో వేటాడేవారు. అయినా కూడా రాజు పవిత్ర ప్రదేశంలో జింకను వేటాడడం వల్ల శాపం పొంది వంద సంవత్సరాలు సింహంగా జీవించాడు. అది నాకు చాలా క్రూరమైన శిక్షగా తోచింది. తర్వాత స్వామీజీ నన్ను కలిసినప్పుడు 'ఆ కథ చదవావా!' అని అడిగినప్పుడు నేనది చదివాననీ కానీ కేవలం వేటాడినందుకు రాజుకు అంతటి శిక్ష ఎందుకు పడిందని ఆడిగాను. 'అదే అసలు విషయం!' అన్నారు స్వామీజీ. 'చర్యలు మంచివైనా చెడ్డవైనా అలాంటి పవిత్రమైన ప్రదేశంలో చేస్తే వెంటనే ఫలితాన్ని అనుభవించాలి. రాజు అమాయకుడు కాదు. అతనికి ఆ ప్రదేశం ప్రాముఖ్యత తెలుసు. అలాగే అక్కడ నివసిస్తున్న ప్రాణులకు ఎలాంటి హానీ తలపెట్టకూడదని కూడా తెలుసు. ఆ ధర్మం అతనికి తెలిసి కూడా తెలిసి తెలిసీ నేరం చేశాడు. తాను ఏం చేస్తున్నాడో తెలిసి కూడా నేరం చేయడం అనేది, ఒక అమాయకుడు తెలియక చేసిన నేరం కంటే ఎంతో తీవ్రతరమైనది. అక్కడి ప్రాదేశిక పవిత్రత తెలియక గానీ లేదా

ఆకలితో ఉన్న మరెవరైనా ఆ జింకను చంపి ఉంటే గానీ అదంత తీవ్రమైన నేరం అయి ఉండేది కాదు. అలాగే దాని పర్యవసానాలూ ఇలా ఉండేవి కావు.

దాంతో విషయాన్ని మారుస్తూ స్వామీజీ గ్రంథ పారాయణ ప్రాముఖ్యత గురించీ తీర్థయాత్రల గురించీ మాట్లాడటం మొదలుపెట్టారు. ఒక గ్రంథానికి సంబంధించిన వాస్తవ అంతరంగాన్నీ, దాని ఉద్దేశాన్నీ గ్రహించాలంటే దాన్ని కనీసం మూడు సార్లు చదవాలి. మొదటగా తీర్థయాత్రకు వెళ్లే ముందు చదవాలి. తర్వాత యాత్రాస్థలంలో చదవాలి. ఆ తర్వాత చివరగా దాన్ని మిగతా వారికి వివరిస్తూ నీ అనుభవాలను పంచుకుంటూ చదవాలి. మనం ఆ యాత్రాస్థలంలోని ప్రాముఖ్యత గురించీ పవిత్రత గురించీ ఏ విషయాలూ తెలుసుకోకుండా వెళ్తే అంతకు ముందు ఎంత అజ్ఞానంతో ఉన్నామో చూసిన తర్వాత కూడా అంతే అజ్ఞానంతో ఉంటాము. కథల ద్వారా ఈ పవిత్ర గ్రంథాలు ఈ ప్రదేశాలను పరిచయం చేస్తూ అక్కడ నివసిస్తున్న ఋషులనూ దైవాలనూ మనకు తెలియజేస్తాయి.

నాన్తిన్ బాబా పుష్కర్‌లో చెప్పిన విషయాలలో ఒక విషయాన్ని ఉదహరిస్తూ స్వామీజీ, సాధకుడు పుణ్యక్షేత్రాలకి వెళ్లేటప్పుడు తన వెంట తర్కమనే బరువుని తీసుకెళ్లకూడదని చెప్పారు. గ్రంథాలలో వ్రాసిన ప్రతి విషయం పరమ సత్యమని ఒప్పుకుంటూ వాటి పట్ల విశ్వాసంతో ఉండాలని నొక్కి చెప్పారు. పవిత్ర ప్రదేశానికి వెళ్లినపుడు అక్కడ గ్రంథాలలో వున్న ప్రదేశాలను కనుక్కోవడానికి ప్రయత్నించమని సలహా ఇచ్చారు. భౌతిక (దృగ్గోచర) ప్రపంచమంతా మరో వాస్తవ జగత్తుకు దారితీసే ద్వారం వంటిదేనని ఆ విషయాన్ని నీ మనసుతో నీ మెదడుకు తెలియజేయమనీ చెప్పారు.

స్వామీజీ, గ్రంథాలనేవి బహిర్గతపరచిన అవతార పురుషుల జ్ఞానమనీ వాటిని వెల్లడించిన ఋషులు అమరులనీ, వారు స్థల కాలాదులతో సంబంధం లేకుండా సర్వాంతర్యామిగా వుంటారనీ వాళ్లను ప్రార్థించి ఆవాహన చేసినపుడు వాళ్లు అక్కడ ఉంటారనీ అన్నారు. అలాగే పవిత్రమైన ప్రతి ప్రదేశమూ గ్రంథానికి అనుగుణంగా ఉంటుంది. అందుకే మీరు అక్కడున్నపుడు ఆ ప్రదేశానికి సంబంధించిన గ్రంథాన్ని పఠించడం తప్పనిసరి. రెండోసారి సాగే గ్రంథపఠనం మొదటిసారి కన్నా ఎంతో భిన్నమైంది. ఈసారి దాన్ని ఆధ్యాత్మిక చింతనలో భాగంగా చదువుతాము. నువ్వు ఆ గ్రంథాన్ని ఋషుల ఆత్మకు ప్రతీకగా గుర్తిస్తే అది నీతో మాట్లాడుతుంది. అప్పుడు ఆ స్థలం పవిత్రతను నువ్వు వినగలుగుతావు. అప్పుడు నీ దృఢమైన విశ్వాసం దాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తుందని అన్నారు. ఇంకా స్వామీజీ రెండోసారి చదవడాన్ని గురించి మాట్లాడుతూ ఆ పవిత్రస్థలంలో నేరుగా సత్యాన్ని తెలుసుకున్నవారు బిగ్గరగా గ్రంథాన్ని పఠించడం చాలా మంచిదని అన్నారు. గురువు చెప్పిన విషయాలను విని వాటి గురించి ఆలోచించడమే యాత్రికుడి పాత్ర. దీన్నే ఆధ్యాత్మిక పరిభాషలో 'పారాయణం' అంటారని అన్నారు.

గ్రంథ పారాయణ సమయంలో స్వామీజీ ఎంతో నిష్ఠగా తక్కువగా తినడం, తక్కువగా మాట్లాడటం, తక్కువగా నిద్రపోవడం వంటివి చేసేవారు. 'నీ లక్ష్య సాధన నుండి దృష్టి మరల్చే ఎలాంటి సాంగత్యాన్ని అయినా దూరం పెట్టు. స్థానికంగా ఉన్న వారిని ఎవ్వరినీ కలవద్దు. అలాగే కేవలం విహారం కోసం వచ్చినవాళ్లతో కలవద్దు. ఆధ్యాత్మిక బోధనలను నీ దినచర్యలలో మిళితం చేయి. అప్పుడే నీ ఆధ్యాత్మిక చైతన్యం నీ గురువు చైతన్యం ఒకే దిశలో కొనసాగుతుంది. నీ అంతట నీవు నీ గురువులోకి విలీనం కావడానికి సిద్ధపడు,' అన్నారు.

'ఆధ్యాత్మిక సద్గుణాలైన సరళత్వం, అమాయకత్వం, స్వచ్ఛత, బుద్ధి కుశలత, తనకు తానుగా ఆవిష్కరించుకోగలిగే ఆధ్యాత్మిక వాతావరణంలో ఇలాంటి కథలన్నీ ఒట్టి కథలుగా మాత్రమే మిగిలి ఉండక అవి సజీవ వాస్తవాలవుతాయి. బుద్ధిజీవులు వాటిని పుక్కిటి పురాణాలని

తోసిపారేయనీ గాక మరి కొంతమంది ఆ కథల్లో కొన్ని అర్థాలను మాత్రమే వెతుక్కోనీ గాక! నువ్వు ఆధ్యాత్మిక సాధకుడిగా ఉండబోతున్నావు కనుక నీ మనసుని తెరిచి ఈ భౌతిక జగత్తుకు మత్రమే తమ చైతన్యాన్ని పరిమితం చేయకుండా ఉన్న ఋషుల హృదయాలతో సంబంధాలని ఏర్పరచుకో. పంచేంద్రియాలతో చూడలేనిది వారి మనోనేత్రంతో నువ్వు చూడగలవు. నువ్వు వారిలో ఒకరిగా మారితే మామూలు మనుషులకు ఈ భౌతిక ప్రపంచ కనబడినట్లు ఈ అగోచరమైన ప్రపంచం నీకు కనబడుతుంది. నువ్వేం అర్థం చేసుకున్నావో దాన్ని ఆచరణలో పెట్టు. నీకు అర్థం చేసుకోలేనిదాన్ని సత్యద్రష్టలకు వదిలిపెట్టు!' అని చెప్పారు స్వామీజీ.

పద్మపురాణ పారాయణ ముగించి నాన్తిన్ బాబా, స్వామీజీ, పుష్కర్ నుంచి పంచవటీకి బయల్దేరారు. దారిలో విదిశ, ఉజ్జయినీ, ఓంకారేశ్వర పుణ్యక్షేత్రాలలో ఆగారు. రావణాసురుడు పంచవటీలోనే సీతను అపహరించాడు. అక్కడే పేరొందిన ఓంకారేశ్వర ఆలయం త్రయంబకేశ్వరం ఉంది. అక్కడికి దగ్గరలో ఉన్న పట్టణం నాసిక్. ఇది ముంబాయికి సుమారు వంద మైళ్ల దూరంలో వాయవ్య దిశలో ఉంది. నాన్తిన్ బాబా గారి దృష్టిలో పంచవటీ అడవి (రాముడికాలంలో దండకారణ్య వన్యప్రాంతం ఎక్కువగా మధ్య భారతాన్నీ, దక్షిణ భారతాన్నీ ఆవరించి ఉండేది) ముఖ్యంగా నది ప్రవహించే వైశాల్యమంతా శ్రీరాములవారి నివాసస్థానమేనని రామాయణంలోని శ్లోకాలు గానం చేస్తున్నాయి. స్వామీజీ ఈ అడవి అంతా తిరిగారు. ఈ అనుభవాల గురించి పంచుకుంటూ స్వామీజీ ఇలా రాశారు.

'పంచవటీ అంతా భయంకరమైన విషసర్పాలతో పొంచి ఉంది. ఆశ్చర్యం గొలిపిన విషయం ఏమిటంటే మాకు అవి భూమి మీద ఎంతో పురాతనమైన తెలివిగల జీవులుగా కనబడ్డాయి. వాటికి ఇబ్బంది రానంతవరకూ అవి ఇంకొకరిని కరవడం గానీ హాని తలపెట్టడం గానీ చేయవు. ఆ అడవిలో ఒకసారి మేము పది నుండి పన్నెండడుగుల నల్లత్రాచు పడగ విప్పి తోక మీద నించుని ఉండడం చూశాం. అదొక చిరస్మరణీయమైన దృశ్యం. ఒక్క మాట మాట్లాడకుండా మా దారిని మళ్లించి మా ప్రయాణం కొనసాగించాం.

'ప్రతిరోజూ పులుల్నీ, పందుల్నీ ఇతర జంతువులను చూడడం మా దినచర్యలో భాగమయింది. ఒకరోజు మేము ఎలాంటి అడవి జంతువులనూ చూడటం జరగలేదు. ఆ రోజు వాటికి దూరమయ్యాం. ఉదయాన్నే మా స్నానాలు ముగించగానే అడవి దుంపలనూ, వేళ్లనూ తవ్వే కార్యక్రమం మొదలయ్యేది. తరువాత వాటిని కాల్చుకుని తినేవాళ్లం. మొదట్లో మర్నాటికి ఎలాంటి ఆహారాన్నీ మోసుకెళ్లకూడదని అనుకున్నాం, కానీ తర్వాత ఈ ఆలోచన మార్చుకుని కొన్ని దుంపలను కూడా మాతో తీసుకెళ్లడం ప్రారంభించాం. అప్పుడప్పుడూ ఆ అడవిలో ప్రయాణం చేస్తున్నపుడు శ్రీరాముని బాటలో ప్రయాణించే యాత్రికులూ, భక్తులూ కనబడేవాళ్లు. వాళ్లు జొన్నలూ, తృణధాన్యాలూ, ఇతర పప్పు దినుసులూ, ఆహార పదార్థాలూ ఇస్తుండేవాళ్లు. కొన్ని కొన్నిసార్లు వాటిని తీసుకునేవాళ్లం. అక్కడ ప్రయాణం ఎంతో కఠినమైంది, ఆ ప్రాంతంలో ఏమీ దొరకదు. కానీ ఆక్కడి అనుభవం మాత్రం ఎంతో పులకరించేంత ఉద్వేగభరితంగా ఉంటుంది. మేము ఎక్కడన్నా ఆగితే వెంటనే కట్టెలను పోగుజేసి హోమాగ్ని రాజేసి దాని ప్రక్కన కూర్చుని మా రోజూవారీ ధ్యానాన్ని కొనసాగించేవాళ్లం. తరచూ మా నివాస స్థలాన్ని నదీ తీరాన ఏర్పరచుకుంటూ ఉండేవాళ్లం. ఎందుకంటే అక్కడైతే నీటి ఇబ్బంది ఉండదు.'

నెలకు పైగా నడిచిన తరవాత నాన్తిన్ బాబా స్వామీజీ మైసూరుకి దగ్గరగా ఉన్న ఊటీ సరస్సుకు చేరుకున్నారు. ఈ రోజుల్లో ఊటీ అంటే ఎంతో ఆకర్షణీయమైన విహార స్థలంగా పేరొందింది కానీ పూర్వకాలంలో అది ఎంతో పేరొందిన ఆధ్యాత్మిక ప్రదేశం. రాముని కాలంలో ఊటీని 'ఉదక మండలం' అని అనేవారు, అంటే 'చుట్టూ నీరున్న లేదా నీటితో నిండిన' అని

అర్థం. రామాయణ కథనం ప్రకారం ఒక యోగి తన యోగ శక్తులతో ఒక దివ్యమైన భవనాన్ని ఇక్కడ సృష్టించి నివసించాడు. దగ్గరలో సీతమ్మ తల్లిని విడిపించడంలో సహాయం చేసిన పురాతన బనారస్ రాజ్యం ఉండేది. ఇక్కడి తన అనుభవాలన్నీ స్వామీజీ సంక్షిప్తంగా తన రామాయణ పరిచయంలో వివరించారు.

'అక్కడ ఉదక మండలం లేదా ఊటీ అనే పేరుతో ఓ గొప్ప సరస్సు ఉండేది. ఆ సరస్సు చుట్టూ రాజభవనంతో పాటు అందమైన భవనాలను నిర్మించారు. మేము అక్కడికి చేరుకోగానే మైసూర్ భవన సంరక్షకుడిని మాకు కొన్నిరోజులు ఆశ్రయం ఇవ్వవలసిందిగా కోరాము. ఎందుకంటే ఎండా కాలం వస్తోంది, ఊటీ చాలామందికి ఎంతో ఇష్టమైన విహార ప్రాంతం. ఊటీ కొండలంతా సందర్శకులతో నిండిపోతుంది. ఆ సంరక్షకుడు ఎంతో దయతో భవనానికి వెనక ఉన్న ఓ చిన్నగదిని ఇచ్చారు. అక్కడే వుండి చాలా రోజులు చుట్టూ ఉన్న పర్వతాల్లో తిరిగాం.

'ఉదక మండలం వచ్చిన తరువాత మా ఆహార అలవాట్లు మారిపోయాయి. అన్నం, కాయగూరలూ, పప్పు, బ్రెడ్ లాంటి ఆహారం తీసుకోవడం మొదలు పెట్టాం. ఈ సమయంలోనే మేము 'గుడ్లూరు', కోయంబత్తూర్, మరి కొన్ని ప్రాంతాల్ని చూశాం. అక్కడి చుట్టుపక్కల ప్రాంతాలన్నీ తిరిగాం. ఉదక మండలానికి దగ్గరగా తోరా అనే కమ్యూనిటీ ఉంది. ఈ రోజుకి కూడా చరిత్రకారులూ, మానవ పరిణామ శాస్త్రజ్ఞులకి ఈ సమూహ చారిత్రక పరిణామం గురించీ మూలం గురించీ ఎన్నో అభిప్రాయ భేదాలున్నాయి. ఇక్కడ నివసించేవారు అసాధారణమైన పొడవుతో అందంగా ఆరోగ్యంగా ఉంటారు. పొడవైన జుట్టు గడ్డాలతో వీళ్లు ప్రకృతికి దగ్గరగా నివసించడానికి ఇష్టపడతారు. వ్యవసాయం వీళ్ల ప్రధాన జీవనాధారం, బంగాళ దుంపలు పండిస్తారు. నాస్తిన్ బాబాకీ నాకూ వాళ్ల జీవన శైలిని దగ్గరగా చూడాలనిపించేది. బహశా వీరు రామాయణంలో చెప్పినట్లు వానర సైన్యానికి చెందిన సుగ్రీవుడి వారసులై ఉండవచ్చని భావించాం.'

తర్వాత ఆ ఇద్దరు సాధువులూ శ్రీరాముడి భక్తుల దృష్టిలో నిర్లక్ష్యం చేయబడినదైనప్పటికీ, భారత దేశంలో అత్యంత ప్రసిద్ధిగాంచిన మధురైలో పుణ్య క్షేత్రం ఆగారు. నాస్తిన్ బాబా ప్రకారం శ్రీరాముడూ అతని వానరసేన చివరిసారిగా వాళ్ల ఆధ్యాత్మికమైన, వస్తుగతమైన వనరులన్నిటినీ సమకూర్చుకుని లంకపై దాడి చేయడానికి ఇక్కడే కలుసుకున్నారు. శక్తి ఆవాహనకీ మదురైకీ ఎంతో ప్రాముఖ్యత ఉంది. దేవీ మాతను పూజించడానికి హిమాలయ ఋషుల సంప్రదాయం ప్రకారం మదురైలోని దేవి మహోన్నతమైన శ్రీవిద్య రూపంలో ఉంది. బాబాజీకి దక్షిణ భారతదేశంలో మదురై ఎంతో ఇష్టమైన పుణ్యక్షేత్రం. స్వామీజీ యవకుడిగా ఉన్నప్పుడు ఇక్కడికి వచ్చి తాంత్రిక విద్యలోని సవ్యదిశ మార్గాన్ని ముఖ్యంగా శ్రీవిద్య ఉపదేశ మార్గాన్ని నేర్చుకున్నారు. ఘనమైన, పటిష్టమైన గుళ్లతో, వేదజ్ఞానం మూర్తీభవించిన బ్రాహ్మణ పండితులతో సవ్యదిశ మార్గాన్ని ఆచరించే పారంగతులతో మదురై దేదీప్యమానంగా వెలుగొందుతూ ఉంటుంది.

స్వామీజీ తన ప్రయాణంలో తెలిసిన వాళ్లందరినీ దూరంగా వుంచుతూనే ప్రయాణించారు. కానీ మదురైలో మాత్రం తనకు ఎంతో భక్తిశ్రద్ధలతో శ్రీవిద్యోపాసన నేర్పిన బ్రాహ్మణ పండితులను కలుసుకున్నారని చెప్పారు. వాళ్ల గురించి చెబుతూ స్వామీజీ 'వాళ్లు మానవరూపంలో ఉన్న దైవాంశ సంభూతులు. వాళ్ల అధ్యయనం, ఆచరణ, సాధనతో, సమస్త సృష్టి పట్ల నిస్వార్థంతో భూలోకానికి జీవం పోస్తున్నారు. అందువల్లే ఈ పుడమి సముద్రంలోకి క్రుంగిపోయి ప్రళయం సంభవించడం లేదు. వాళ్ల జీవితమంతా ఆధ్యాత్మిక సాధనే. వీళ్లు తినడం,

తాగడం, నిద్రించడం, నడవడం, మాట్లాడడం అంతా భగవంతుని సేవలో భాగంగానే చేస్తారు. వాళ్లు పిల్లల్ని కంటారు. ఎందుకంటే ఆ రకంగా వాళ్లు ఈ ప్రపంచానికి ఋషులుగా చేసే సేవలు కొనసాగుతూనే వుంటాయి. దైవ ధ్యానమూ, ఆచార కర్మకాండలే కాదు, వారి సామాన్య దైనందిన చర్యలు కూడా సంపూర్ణ ఆధ్యాత్మిక చింతనలో భాగంగా జరుగుతాయి. వాళ్ల దృష్టిలో ఈ దైవదత్త ప్రపంచం తప్ప మరేదీ లేదు. బ్రాహ్మణులు ఇంతటి మహిమాన్వితులు కావడం వల్లనే గ్రంథాలు 'ఈ భూమ్మీద మొట్టమొదట పుట్టిన బ్రాహ్మణుల ఆచరణ, జీవన విధానాన్ని చూసి ప్రజలందరూ ఆదర్శవంతమైన జీవన ప్రమాణాలను తెలుసుకోవాల'ని ఘోషిస్తున్నాయి. ఇలాంటి గొప్ప తపోధనులను కలవకుండా మదురై పుణ్య క్షేత్రాన్ని దర్శించడం అసంపూర్ణంగా ఉంటుంది. వాళ్లు దేవత దీవెనలతో పుట్టిన పిల్లలు.'

వాళ్ల దీవెనలు, దేవి దీవెనలు అందుకుని స్వామీజీ, నాన్తిన్ బాబా తరవాత మజిలీ అయిన రామేశ్వరానికి బయల్దేరారు. శ్రీరాముని మార్గంలో ఆఖరి గమ్యం శ్రీలంక. అయితే భారతదేశంలో రామేశ్వరం రాముడి మార్గంలో ఆఖరి మజిలీ. ఇది ఓ చిన్న ద్వీపం. భారతదేశంతో ఓ వారధితో కలపబడి ఉంది. ఈ ప్రాంతమంతా ఎన్నో ఆలయాలతో నిండి ఉంటుంది. అయితే ప్రధానమైన గుడి శివాలయం. దాన్నే 'రామేశ్వరం' అంటారు. ఇక్కడి నుండి రాముడు లంకకి వెళ్లడానికి వారధి కట్టే ముందు తానే శివలింగాన్ని ప్రతిష్ఠించి పూజించాడు.

వాళ్లు ద్వీపాన్ని చేరగానే నాన్తిన్ బాబా, స్వామీజీ సముద్ర స్నానం చేసి రామేశ్వరం గుళ్లోకి ప్రవేశించారు. అక్కడ ఇరవై ఒక్క బావుల నుండి నీటిని తోడుకుని భక్తులందరూ స్నానం చేసే ఆచారాన్ని గమనించారు. ఈ బావులన్నీ సముద్రానికి మహా అయితే వంద గజాల దూరంలో వుంటాయి. అయినా వాటిలోని నీరు ఏ మాత్రం ఉప్పగా లేదు. పైగా అవి చాలా తియ్యగా ఉన్నాయి. వీటిల్లో నీటిమట్టం కూడా ఎక్కువే. అక్కడ పరమశివుడిని పూజించిన తరువాత వాళ్లిద్దరూ మిగతా గుళ్లను కూడా దర్శించి చివరగా ధనుష్కోటికి చేరుకున్నారు. ధనుష్కోటి అంటే 'విల్లు చివర' అని అర్థం. ఇది ఈ ద్వీపంలో ముఖ్యమైన క్షేత్రాలలో రెండవది. రామాయణం ప్రకారం రాముడు తన సైన్యాన్ని పంపడానికి శ్రీలంకకీ, భారత భూభాగానికీ మధ్య ఇక్కడ నుంచే వారధి నిర్మించాడు. రామరావణ యుద్ధం ముగిసి రాముడు విజయం సాధించిన తర్వాత లంకా పట్టణానికి రాజుగా ఉన్న విభీషణుడు, పట్టణ భద్రతని దృష్టిలో ఉంచుకుని శ్రీరామచంద్రుడు నిర్మించిన వారధిని కూల్చేయమని ప్రార్థించాడు. శ్రీరాముడు ఆ అభ్యర్థనను గౌరవించి తన విల్లు చివరి మొనతో వారధిని తోసి కూల్చేశాడు. అలా విల్లు ఎక్కుపెట్టడానికి ఆయన నిలబడిన ప్రదేశానికి 'ధనుష్కోటి' అని పేరు వచ్చింది.

పుష్కర్‌లో నాన్తిన్ బాబా చేసినట్లుగానే ఇక్కడ కూడా రామాయణ గ్రంథాన్ని తీసి పారాయణ చేయడం మొదలుపెట్టారు. ఈసారి చదువుతున్న భాగం 'సుందరకాండ'. అది చిన్న భాగమే కావడంతో గంటలోపే పూర్తి అయింది. ఆ తర్వాత స్వామీజీని ఒక శిష్యుడిగానూ, తాను గురువుగానూ భావించి నాన్తిన్ బాబా ఆ వారధి మార్మిక ప్రాధాన్యతని వివరించారు.

రామాయణ గ్రంథంలో ఉద్ఘాటించినట్లు నాన్తిన్ బాబా స్వామీజీకి వివరించారు. ఋషులు రాముడికి అనంతమైన అంతర్ దృష్టినీ, శక్తిని అందించి దీవించారు. రావణుడిని రాముడు ఒంటరిగానే ఓడించగలడు. కానీ రావణున్ని చంపడమే ఆయన లక్ష్యం కాదు. రావణుడి దుష్టపాలనను అంతమొందించడమే ఆయన లక్ష్యం. శత్రువుని చంపడం ద్వారా శత్రుత్వం నశించిపోదు. అది మరో రూపంలో బ్రతికే ఉంటుంది. మరింత క్రూరంగా తన ప్రతీకారాన్ని తీర్చుకోవడానికి కాచుకుని ఉంటుంది. దీన్ని కేవలం సంభాషణల ద్వారా సరైన అవగాహనల

ద్వారా మాత్రమే రూపుమాపగలం. ఈ వారధి కట్టడంలో ఉన్న అంతరార్థం కూడా అదే. ఇది రెండు జాతుల మధ్య రెండు జీవన విధానాల మధ్య సంబంధాన్ని ఏర్పరుస్తోంది. ఈ పవిత్ర యాత్రాస్థలానికి వచ్చిన తరువాత కూడా మనలోని స్వజాతి వ్యామోహాన్ని విడనాడకపోతే, జాతుల మధ్య వారధి నిర్మించకపోతే మన ప్రయాణం నిష్ఫలమైనట్లే. ప్రతిచోట ఉత్తర దక్షిణాలకీ, తూర్పు పడమరలకీ, పాతకీ కొత్తకీ, ఆధ్యాత్మిక వాదానికీ భౌతికవాదానికీ మధ్య ఘర్షణ ఉంటూనే ఉంటుంది. అది పరిష్కరించబడనంత వరకూ శాంతి లేదు. రాముని తాత్విక చింతన స్పృశించని జీవితం గడిపేవారు అంతర్గత వైరుధ్యాలకి బాధితులుగానే కొనసాగుతారు. వాళ్ల ఆత్మఘోషకీ ఇంద్రియవాంఛలకీ మధ్య నలిగిపోతారు. ఒక వాస్తవమైన ఆరాధకుడికి ఈ పవిత్రమైన ధనుష్కోటిలో ఈ వైరుధ్యాలన్నిటి నుండీ స్వేచ్ఛ లభిస్తుంది.

సహాయపడదామనే ఉద్దేశ్యంతో ఇలాంటి వారధి నిర్మించేప్పుడు నీ సొంత ఆచారాల్నీ, సాంస్కృతిక విలువల్నీ వాటిపై రుద్దకుండా దూరంగా వుంచడం ఎంతో ముఖ్యం. ఆచారాలూ, సంప్రదాయాలూ, సంస్కృతి, పిడివాదాలవంటివన్నీ ఉత్కృష్టమైన జీవిత విలువలను సాధించే విత్తనాలను జాగ్రత్త చేసే బుట్టలాంటిది. ఆ విత్తనాలు ఆత్మ అవసరాలను తీరుస్తాయి. బుట్ట విత్తనాలను మాత్రమే భద్రపరుస్తుంది. ఒకసారి ఆ విత్తనాలను కొత్త ఆత్మలో నాటిన తరువాత అవి వాటి వాటి సొంత వాతావరణాల్లో పెరుగుతాయి. ఈ వారధిని కూలగొట్టడం ద్వారా రాముడు, 'ఒకసారి విత్తనాలు నాటిన తరువాత నీ దారిన నువ్వు వెళ్లు. అంతే కానీ నీ సొంత ఆచారాల్నీ, సంప్రదాయాల్నీ పిడివాదాలనూ వాళ్లమీద రుద్దకు' అనే మార్మిక సందేశాన్ని మనకు తెలియజేశాడు. శ్రీరాముని చర్యలు చేయవలసిన పని చేసిన తరువాత ఎలాంటి అనుబంధాలూ పెట్టుకోకుండా నిస్వార్థంగా ఉండాల్సిన లక్షణాన్ని తెలియజేస్తోంది.

స్వామీజీ నాన్తిన్‌బాబా రామేశ్వరంలో కొన్ని రోజులుండి శ్రీలంక ద్వీపానికి పడవలో ప్రయాణమయ్యారు. నాన్తిన్ బాబా ఇంతవరకూ రామేశ్వరానికి ఆవల ఉన్న పుణ్యక్షేత్రాలను చూడలేదు. అందువల్ల శ్రీలంకలో రాముడు సంచరించిన ప్రదేశాల గురించి ఆయనకు ఎలాంటి అవగాహనా లేదు. అయితే రకరకాల ప్రయాణ సాధనాల ద్వారా వాళ్లు లంకలోని మధ్య ప్రాంతం, ఉత్తర ప్రాంతాల్లోని కొన్ని ప్రదేశాలలో ఒక నెలరోజుల పాటు తిరిగారు. శ్రీలంకలోని ప్రజలకి రాముడి గురించి తెలుసు గానీ రావణున్ని రాక్షస రాజుగా భావించడంలేదు. వాళ్ల దృష్టిలో రాముడు అసమాన పరాక్రమ సంపన్నుడు, పండితుడు...తన రాజ్యాన్నీ, తన జాతినీ రక్షించే దృఢమైన యోధుడు. ప్రచండ శివ భక్తుడు. స్వామీజీ, నాన్తిన్ బాబా తమ ప్రయాణంలో ఎంతో మంది శైవ పండితులనూ, యోగులనూ కలిశారు.

వీళ్లిద్దరూ బౌద్ధ ఆరామాలను కూడా సందర్శించారు. ఆ ఆరామాలన్నీ స్వచ్ఛమైన బౌద్ధ తత్వాలను ఇంకా తమ దగ్గర పరిరక్షించుకున్న ఆరామాలు. వాటినే 'తెరవాడ' అని పిలుస్తారు. వాళ్లలో ఒక సన్యాసి స్వామీజీ, నాన్తిన్ బాబా హిమాలయాల నుండి వచ్చారని తెలుసుకున్న తరువాత వాళ్లందరూ ఎంతో గౌరవంతో ప్రేమతో వారిని అభినందించారు. స్వామీజీకి పాళీభాషలో బాగా పరిచయం వుందని తెలుసుకుని ఆయన్ని బుద్ధుడి సూత్రబద్ధమైన నియమావళికి అనుగుణమైన విషయాల మీద ప్రసంగించవలసిందిగా కోరారు. ఎందుకంటే అవి స్వచ్ఛమైన పాళీభాషలో వ్రాయబడ్డాయి. సంప్రదాయం ప్రకారం తీర్థయాత్ర ముగింపులో నిష్కామంగా దానం చేయాలి. అది చేయనిదే తీర్థయాత్రకి పరిపూర్ణమైన ముగింపు ఉండదు. ఇక అన్నిటికన్నా ఉత్తమమైన దానం జ్ఞానదానం! మనకున్న జ్ఞానాన్ని ఇతరులకు పంచడం. దాంతో స్వామీజీ వీళ్లకు 'విశుద్ధి మార్గాన్ని' బోధించడం ద్వారా తన యాత్రను పరిపూర్ణం చేసే సదవకాశాన్ని వినియోగించదలిచారు. 'విశుద్ధి మార్గ'మంటే మనల్ని మనం శుద్ధి చేసుకునే మార్గం. అక్కడి

బౌద్ధ సన్యాసులు స్వామీజీకి సంస్కృత వ్రాతప్రతి అయిన కుంభకర్ణ రామాయణాన్ని బహుకరించారు. ఇది చాలా అరుదైన యోగ గ్రంథం. దీనిలో యోగనిద్ర గురించి వివరించబడింది. దీని గురించి స్వామీజీ నాతో చర్చిస్తూ, 'రావణాసురుడూ, కుంభకర్ణుడూ ఇద్దరూ గొప్ప యోగులు. కానీ ఆ రోజులలో వాళ్లని రాక్షసులుగా చిత్రించారు. ఎందుకంటే వాళ్లు తమ శక్తుల్ని మానవ కళ్యాణం కోసం కాకుండా తమ సొంత ఆనందాల కోసం భోగాల కోసం వాడారు' అని చెప్పారు.

దీంతో శ్రీరామ పథంలో స్వామీజీ ఆఖరి పుణ్యక్షేత్ర దర్శనం ముగిసింది. శ్రీలంక నుండి వారిద్దరూ తిరిగి హిమాలయాలకి వెళ్లిపోయారు. నాన్తిన్ బాబా హిమాలయ పర్వతాల అంతరంగాలలోకి సుదూరంగా ప్రయాణించారు. స్వామీజీ ఆయన గురించి తలుచుకుంటూ, 'చివరికి నా స్నేహితుడు నాన్తిన్ బాబా తన దేహాన్ని హిమాలయాలలో విడిచిపెట్టారు. నేను ఇంకా మరి కొన్ని కథల్ని వివరించడానికి బలంగా సజీవంగా ఉన్నాను,' అన్నారు.

అధ్యాయం 7

# ఆధ్యాత్మిక ప్రచారం

శ్రీరాముని పథ యాత్ర నుండి తిరిగి వచ్చిన తర్వాత స్వామీజీ కొన్ని రోజులు ఉత్తరకాశీలో గడిపారు. నా అదృష్టంకొద్దీ ఆ రోజుల్లో స్వామీజీకి తెలిసిన చాలామంది ప్రముఖుల్ని నేను కలవగలిగాను. మొట్టమొదట మాయా టాండన్, ఆమెభర్త శివనాథ్‌లను మిన్నియాపోలిస్‌లో 1979 లో కలిశాను. అలహాబాద్ విశ్వవిద్యాలయంలో స్వామీజీ చదువుకునే రోజుల నుంచీ కూడా మాయా వాళ్ల నాన్నగారికి స్వామీజీ గురించి తెలుసు. బాల్యం నుంచీ మాయా, శివనాథ్‌లకు స్వామీజీ గురించి తెలుసు. నేను చాలా సాయంత్రాలు వాళ్ల దగ్గరకు వెళ్లి కాలక్షేపం చేశాను. స్వామీజీ శంకరాచార్య పదవిని వదిలేసిన తరువాత ఆయన జీవిత విశేషాలన్నీ వీళ్ల దగ్గర తెలుస్తాయని నాకు అప్పుడే తెలిసింది.

తర్వాత 1980లో నా జీవితం ఎంతో ఆసక్తికరమైన మలుపు తిరిగింది. నేను పెన్సిల్వేనియాలోని హిమాలయన్ ఇనిస్టిట్యూట్ ప్రధాన కార్యాలయంలో ఉండగా స్వామీజీ నా వివాహాన్ని విశ్వవిద్యాలయంలోని మరో స్నేహితుడైన డా.ఎస్.ఎన్. అగ్నిహోత్రి గారి కూతురితో నిశ్చయించారు. ఆమెతో నా వైవాహిక జీవితం ఎప్పుడూ ప్రశ్నార్థకంగా మారలేదు. స్వామీజీకి దగ్గరగా ఉన్న మా కుటుంబంలో ఆమె కూడా ఒక సభ్యురాలు కావడం వల్లన మా కుటుంబ వాతావరణం స్వర్గంగా మారింది. చెప్పుకోదగ్గ మరో విశేషం ఏమిటంటే డా.అగ్నిహోత్రి, డా.టాండన్ ఇద్దరూ ప్రాణస్నేహితులు. నా పెళ్లి అయ్యేటప్పటికి టాండన్ చనిపోయారు. కానీ స్వామీజీ డా.టాండన్‌గారికీ, డా.అగ్నిహోత్రిగారికీ వ్రాసిన ఉత్తరాలను చూసే అవకాశం దొరికింది. శ్రీరామ పథ యాత్ర నుంచి స్వామీజీ తిరిగొచ్చిన తర్వాత వారి జీవితం గురించి ఎన్నో విషయాలు మా మామగారు చెప్పారు.

ఉత్తర కాశీకి మూడు కిలోమీటర్ల దూరంలోఉన్న 'టెఖ్‌లా' లోని కుటీరంలో స్వామీజీ 1958 నుండీ 1961 దాకా ఉన్నారు. 1996లో నా అమెరికన్ స్నేహితులతో వారి కుటీరంలో సరిగ్గా ఎక్కడ నివసించారో వెతకడానికి వెళ్లాను. అక్కడ ఒక గెస్ట్‌హౌస్‌లో ఉన్నాము. అక్కడి నుండే మహిమాన్వితమైన శక్తిమాత, మహాశివుని ఆలయాలను సందర్శించాము. అక్కడి పూజారి మురారీ భట్ గారికి మేము స్వామీజీ శిష్యులమని తెలిసి మా పూజా కార్యక్రమాల కోసం మంచి ఏర్పాట్లు చేశారు.

విడిగా ఉన్నప్పుడు చూసి వారిని, 'మీకు స్వామీజీ తెలుసా?' అని అడిగాను. దానికి వారి కళ్లు ఆనందంతో చెమ్మగిల్లాయి. 'స్వామీజీ నాకు నా చిన్ననాటి నుండీ తెలుసు! ఆ రోజుల్లో

ఆయన టేఖ్‌లాలోనే నివసిస్తుండేవారు. నేను చూసిన వాళ్లలో ఈయన ఎంతో అసాధారణమైన సాధువు. ఆయన సన్నగా పొడవుగా తేజస్సుతో వెలిగిపోతూ ఉండేవారు. వారి కళ్లు ఎంతో తేజోవంతంగా తీక్షణమైన చూపులతో ఉండేవి. ఎవరూ ఆ కళ్లలోకి సూటిగా చూడలేకపోయేవారు. మబ్బుగా ఉన్న రోజుల్లో కూడా ఆయన నల్ల కళ్లద్దాలు ధరించేవారు. ఆయన నడక పచ్చటి పైరు మీద గాలి వీచినట్లుండేది. ఆయనకి ఒక ట్రాన్సిస్టర్ రేడియో ఉండేది. కానీ అది అంగీ లోపల ఉండటం వల్ల దాన్ని మేమెవరమూ చూడలేదు. బహుశా ఆయన పెదాలు కదల్చకుండా దాంతో పాటలు పాడుతుంటారు కాబోలునని అనుకునేవాళ్లం. మేం దీని గురించి ఎప్పుడైనా అడిగితే అదంతా 'ఓ అద్భుతం' అని మాత్రం అనేవారు. మొత్తానికి మేం ఆ ట్రాన్సిస్టర్‌ని కనుక్కున్న తర్వాత ఆయన్ని 'ట్రాన్సిస్టర్ బాబా' అని పిలిచేవాళ్లం. ఆయన గుడి చుట్టూ నడుస్తున్నప్పుడు ఆయన చేయి పట్టుకుని ఆయనతోబాటే ప్రదక్షిణాలు చేసేవాణ్ణి,' అని చెప్పారాయన.

తర్వాత ఆ పండితులు స్వామీజీ ఏక్కడ ఉన్నదీ ఖచ్చితంగా చెప్పారు. వారు నివాసమున్న కుటీరాన్ని తర్వాత 'శాంతి కుటీరం' అని పిలిచేవారు. దాంతో మర్నాడు ఉదయం ఆ కుటీరాన్ని చూడడానికి మేమందరం తెల్లవారుఝామునే బయల్దేరాము. శాంతి కుటీరానికి వెళ్లగానే మేము అక్కడ బాబా శీతల్‌దాస్ ఆశ్రమాన్ని చూశాము. మేం పొరపాటు పడ్డామని అనుకున్నాం కానీ మేం వచ్చింది సరైన చోటికే! అక్కడ నివసిస్తున్న వసంతదేవ్‌గారికి స్వామీజీ బాగా తెలుసు. మేం స్వామీజీ శిష్యులమని తెలిసి ఆయన చాలా ఆనందపడ్డారు. స్వామీజీని ఆయన చూసి అరవై సంవత్సరాలైనప్పటికీ నిన్ననే చూసినట్లుగా మాట్లాడారు.

మమ్మల్ని ఆయన లోపలికి ఆహ్వానించి ఒక స్వామితో మాకు 'టీ' చేయమని చెప్పారు. టీ తయారు అవుతుండగా ఆయన తమ గురువు బాబా శీతల్‌దాస్‌జీ, స్వామీజీ ఇద్దరూ ఎంతో గొప్ప స్నేహితులని చెప్పారు. శీతల్ దాస్ బాబా ఎక్కడ ఉన్నారని నేను అడిగాను. ఆయన తమ గురువుగారి దగ్గర నివసిస్తున్నప్పుడు నేపాల్‌లో దేహం చాలించారని చెప్పారు. చాలామంది బాబాజీ శిష్యులు తమ పేర్ల చివర 'దాస్' అని పెట్టుకోవడం వల్ల శీతల్‌దాస్ బాబాజీ శిష్య పరమాణువుల్లో ఒకరేమోనని నాలో ఉత్సుకత రేగింది. వసంతదేవ్ బాబా తన పరమగురువు పేరు తెలియదని చెప్పినపుడు నాలో ఈ ఉత్సుకత మరింత పెరగసాగింది.

అప్పుడు వారి గురువుగారు ఉత్తరకాశీ రాక ముందు ఎక్కడ ఉండేవారని అడిగాను. దానికి ఆయన 'నాకు తెలిసినంతవరకూ స్వామీజీ, మా గురువుగారూ ఋషీకేశ్‌లో కలుసుకున్నారు. అక్కడి నుంచి ఇద్దరూ ఉత్తర కాశీకి వచ్చారు. మా గురువుగారు ఈ కుటీరంలోనూ, స్వామీజీ కొండ శిఖరం దగ్గరా ఉండేవారు. తరచూ స్వామీజీ మధ్యాహ్నం మా గురువుగారిని కలుసుకోవడానికి వచ్చేవారు లేదా మా గురువుగారు స్వామీజీని కలుసుకోవడానికి వెళ్లేవారు. ఇద్దరి వెంటా ఎప్పుడూ సాధుసమూహం ఉంటూనే ఉండేది. చాలామంది కొత్త సాధువులు వీరిద్దరి నుంచీ యోగవిద్యలు నేర్చుకోవాలని తహతహలాడుతుండేవాళ్లు. కానీ స్వామీజీ ఆ కొండ శిఖరం మీద ఉండడం వల్ల అంత దూరం వెళ్లడం చాలా కష్టంగా ఉండేది. పైగా ఆయన తన శిష్యులతో చాలా కఠినంగా ఉండేవారు, దాంతో ఎక్కువగా యోగవిద్యను మా గురువుగారే నేర్పేవారు.'

ఇంతలో టీ వచ్చింది. దాంతో మా సంభాషణ మామూలుగా కొనసాగింది. అక్కడి గోడల మీద సంస్కృతంలో వ్రాసి ఉన్న శ్లోకాలను చదవసాగాను. అవన్నీ 'కబీర్‌దాస్' సూక్తుల్లో ఉన్నవే. అప్పుడు నేను బాబా శీతల్‌దాస్ 'కబీర్ దాస్ వారసులా?' అని అడిగాను. దానికాయన అవునని చెప్పారు. అలా అంటూనే తన మందుల పెట్టెని తెరిచి రెండు మాత్రలు టీతో మింగారు.

తాను చాలా పెద్దవాడినైపోయాననీ ఈ పర్వత వాతావరణం తనకు పడటం లేదనీ అన్నారు. డెహరాడూన్ దగ్గరున్న హిమాలయన్ హాస్పటల్‌కి వెళ్లారు. అక్కడే మందులు కూడా తీసుకున్నారు. చాలాసార్లు అక్కడ స్వామీజీని చూడడానికి ప్రయత్నించారు గానీ ఫలించలేదు. అదేరోజు రాత్రి నేను ఆ హాస్పటల్‌లో పనిచేసే నాస్నేహితుడు డా. అనిల్ సింఘాల్‌కి ఓ ఉత్తరం రాస్తూ వసంతదేవ్ గారిని ప్రత్యేక శ్రద్ధతో చూడాల్సిందిగా కోరాను.

మేం టీ త్రాగడం పూర్తయింది. ఆ తర్వాత స్వామీజీ కుటీరానికి తీసుకెళ్లాల్సిందిగా వసంతదేవ్ బాబా గారిని కోరాం. మేమందరం డ్రైవింగ్‌లో ఉండగా స్వామీజీ ఇక్కడి చివరి రోజుల్లో ఉత్తరకాశీలో ఒక వైద్యశాలని ప్రారంభించి దాంట్లో పనిచేసే డాక్టర్ గారికి తన కుటీరాన్ని ఇచ్చేశారు. అయితే ఆ డాక్టర్ చనిపోయారనీ ఆయన పిల్లలు ఆక్కడే ఉన్నారనీ అన్నారు. మేము ఆ ఇంటికి చేరగానే ఓ పెద్దమనిషి బయటికి వచ్చాడు. మేమతనిని 'స్వామీజీ ఎప్పుడైనా ఇక్కడ ఉండేవారా?' అని అడగగానే ఖిన్నుడైపోయి 'లేదు, లేదు, లేదు, స్వామీజీ ఇక్కడ ఉండేవారు కాదు,' అంటూ లోపలికి వెళ్లి తలుపు వేసుకున్నాడు. వసంత బాబా నవ్వుతూ 'ఈ మనిషి మీరు ఈ ఇంటిని స్వాధీనం చేసుకోవడానికి వచ్చారని అనుకున్నాడు' అన్నారు. మేం కొన్ని ఫొటోలు తీసుకుని వెళ్లిపోయాం.

నా మామగారు డా. అగ్నిహోత్రి ఒక స్వామీజీ గురించి చెబుతూ, 'ఉత్తరకాశీలో ఉన్నపుడు మొదట్లో స్వామీజీ అందుబాటులో ఉండేవారు కారు. కానీ కాలం గడుస్తున్నకొద్దీ ఆయన అందరికీ మరింత దగ్గరయ్యారు. ఆయన ఉత్తర భారతదేశ నగరాలకు ప్రయాణించడం ప్రారంభించారు. ముఖ్యంగా చలికాలంలో లక్నో, కాన్పూరు, అలహాబాద్‌కి వెళ్లారు. ఆఖరికి వారు 1963లో అలహాబాద్‌కి వెళ్లారు. అక్కడ వారు నివసించిన కుటీరాన్ని 'శివకుటీర్' అని పిలుస్తారు. అక్కడే మరోసారి ఆయన తన విశ్వవిద్యాలయ పాత స్నేహితులైన డా.ఎం.పి. లఖేరా, డా.జి.అర్. శర్మలను కలుసుకున్నారు. ఈ సమయంలోనే స్వామీజీ మతం, ఆధ్యాత్మికం, ఆరోగ్యం, యోగా, సైన్స్, తత్వశాస్త్రం మొదలైన విషయాలపై అనేకమందితో తన అభిప్రాయాలు వ్యక్తం చేస్తూ వచ్చారు. ఆయన ఈ విషయాలపై అప్పటికప్పుడే ఏదైనా పని ప్రారంభిస్తారా అన్నట్లుండేది.

డా. లఖేరా, స్వామీజీ ఇంతకాలం ప్రజలకి దూరంగా ఉన్నా కూడా మళ్లీ తనకు కావలసిన వాళ్లని ఆకర్షించుకుని వాళ్లని కలుస్తూ ప్రభావితం చేస్తున్నారని అన్నారు. స్వామీజీకి ఇష్టమైన విషయం మృత్యువు గతి తర్కం గురించి మాట్లాడడం. ఆయన తన శరీరంలోని సగభాగం నుంచి రక్తాన్ని మరో సగభాగానికి పంపించి ఒక భాగం తెల్లగా పాలిపోయేటట్లు చేసి, కేవలం అవతలి భాగాన్ని మాత్రమే ఎర్రగా ఉండేటట్లు చేసి డాక్టర్లను ఆందోళనకు గురి చేసేవారు. మరోసారి ఒకచేతి మణికట్టు నాడిని పూర్తిగా కొట్టుకోకుండా అపేసి మరో చేతి మణికట్టు వద్ద నాడి సరిగ్గా కొట్టుకునేటట్లు చేసేవారు. ఇదంతా యోగా వల్ల సాధ్యమవుతుందనీ, యోగాభ్యాసం వల్ల వ్యక్తి తనమీద తాను పరిపూర్ణ ఆధిపత్యాన్ని సాధించగలరనీ అన్నారు. జీవితంలో అగోచరమైన మార్మికత మృత్యు జ్ఞానంలోనే వుందనీ, ఈ చావుపుట్టుకల గతి తర్కాన్ని యోగాభ్యాసం ద్వారా తెలుసుకోవచ్చుననీ అన్నారు. మామూలు మనిషి చనిపోయి మళ్లీ పుట్టి తన జీవన ప్రయాణాన్ని మళ్లీ అదే విధంగా ప్రారంభిస్తాడు. 'అ.ఆ.ఇ.ఈ.లు నేర్చుకుని చనిపోయేటప్పుడు వాటన్నిటినీ మర్చిపోయి మళ్లీ జన్మలో అదే అ.ఆ.ఇ.ఈ.ల్ని తిరిగి నేర్చుకుని తన జీవితాన్ని మళ్లీ ప్రారంభిస్తాడు,' అంటూ స్వామీజీ ఆశ్చర్యంగా అరుస్తూ 'కాలం ఎంత వృథా అవుతోంది! ఒక యోగి మరణించకుండా తన దేహాన్ని త్యజించడం ద్వారా తన జీవితకాలంలో నేర్చుకున్నది వదిలేయకుండా మళ్లీ కొత్త దేహంలోకి ప్రవేశించి తన పాత జ్ఞానాన్ని తిరిగి పొంది అక్కడి నుంచి తన జీవితాన్ని ప్రారంభిస్తాడు.'

దీనికి ముందు స్వామీజీ ఎప్పుడూ తన యోగ సాఫల్యతనీ, ప్రావీణ్యతనీ ఎవరి ముందూ బహిర్గతం చేయలేదు. కానీ ఇప్పుడు డాక్టర్లకీ, శాస్త్రజ్ఞులకీ మరణానికి గల అతి సూక్ష్మమైన నిగూఢమైన రహస్యాలని విశాల దృక్పథంతో తెలుసుకోవలసిన అవసరం వారికి ఉందని సవాలు విసురుతున్నారనీ కూడా ఆయన చెప్పారు. ఆ తర్వాత వారు ఒకదాని తర్వాత మరో యోగవిద్యను ప్రదర్శించి వాళ్ల జ్ఞానం ఎంత పరిమితమైందో వాళ్లకే అర్థం చేయించేవారని డా.లఖేరా అన్నారు. ఒకసారి ప్రొఫెసర్ జి.ఆర్.శర్మ, డా.లఖేరా, శ్రీ ఆనంద్ ప్రతాప్ సింగ్ సమక్షంలో ఒక యోగి కొద్ది క్షణాలు మరణించి తిరిగి తన దేహంలో ఎలా ప్రవేశిస్తాడో వాళ్ల ముందు ప్రదర్శించారు. తనకు తానుగా ఆయన చనిపోయినప్పుడు అక్కడున్న వాళ్లందరూ ఒక్కసారిగా నిర్ఘాంతపోయారు. కానీ ఆయన తన దేహాన్ని ఏ మాత్రం కదిలించవద్దని ముందుగానే చెపారు. చెప్పినట్లుగానే సరిగ్గా రెండు గంటల తరువాత ఆయన తిరిగి తన దేహంలోకి ప్రవేశించారు.

ఇలాంటి ప్రతి ప్రదర్శన తరువాత ఉపనిషత్తుల గురించీ, యోగసూత్రాల గురించీ అధికార స్వరంతో మాట్లాడుతూ వేదాలలో వర్ణించిన ఉన్నతమైన విషయాల్ని అర్థం చేసుకోవడానికీ మానవత్వంలోని నిజమైన సామర్థ్యాన్ని వెలికి తీయడానికీ శాస్త్ర జ్ఞానాన్నీ, ఆధ్యాత్మిక జ్ఞానాన్నీ రెంటినీ కలిపి ప్రయాణించేలా చేయాలనీ అనేవారు. తర్వాత వారి సంభాషణ మతం మీదకి మళ్లేది. మతాన్ని వివరిస్తూ దేవుని సందేశాలూ ప్రత్యక్ష జ్ఞానం మతాలన్నిటికీ మూలాలైనప్పటికీ కాలక్రమేణా వాటిలో మూఢనమ్మకాలూ పిడివాదాలూ కూడా కలిసిపోయి చివరికి సత్యం కాస్తా గాఢాంధకారంలోనే మిగిలిపోయిందనేవారు. రెండు సంవత్సరాల్లోనే అలహాబాద్‌లోని డాక్టర్లూ, లాయర్లూ, న్యాయాధికారులూ, ప్రొఫెసర్లూ వారి ఉపన్యాసాలకి ఎంతో ఉత్తేజితులయ్యారు. స్వామీజీతో అనేక బహిరంగ సభలను ఏర్పాటుచేశారు, దీంతో స్వామీజీ ఆవశ్యకత ఇక్కడే కాక మిగతా నగరాలకు కూడా ఎంతో పెరిగింది.

అలహాబాద్‌లో పన్నెండు సంవత్సరాలకి ఒకసారి జరిగే కుంభమేళా ఎంతో గొప్ప ఆధ్యాత్మిక ఉత్సవం. భారతదేశం నలుమూలల నుంచీ లక్షలాది మంది భక్తులు ఇక్కడికి వస్తారు. 1964 జరిగిన కుంభమేళా అందుకు మినహాయింపేమీ కాదు. దేశంలోనే పెద్దదైన హిందూ మత సంస్థ విశ్వ హిందూ పరిషత్ ఆహ్వానం మేరకి స్వామీజీ మతం మీద ఆధ్యాత్మికం మీద అనేక ఉపన్యాసాలిచ్చారు. ఆ ఉపన్యాసాలు మతంలోనూ మేధో మథనంలోనూ తూగుతున్న వేలాది మంది ప్రజలను జాగృతం చేసింది. స్వామీజీ మిథ్యాచారాలనూ, మత దురభిమానాలనూ, గుడ్డినమ్మకాలనూ, కులవ్యవస్థనూ, స్త్రీల అణచివేతనూ దుయ్యబడుతూ తీవ్రంగా విమర్శిస్తూ చేసిన ఉపన్యాసాలు విన్న శ్రోతల తలలు వేడెక్కిపోయాయి. కేవలం దేవుడి గుళ్లనూ, పూజారుల పూజా కార్యక్రమాలనూ నమ్మేవారు. ఆధ్యాత్మికత అనేది ఆలయాలు, మశీదులు, చర్చిల నాలుగు గోడల మధ్యనా పరిమితమై ఉండదని అన్న స్వామీజీ మాటలు విని ఆశ్చర్యపోయారు. వారి ఉపన్యాసాలలో ఆధ్యాత్మిక సాధన ఇతరులపై ఆధారపడకుండానే కొనసాగించవచ్చుననీ, తమ నిత్య జీవన కార్యాచరణలోనే భగవంతుడిని అనుభూతి చెందవచ్చని వాళ్లు అర్థం చేసుకున్నారు. స్వామీజీ ఒక హిందువనీ హిందూ మతాన్ని ఉన్నతంగా సూచిస్తారని అనుకున్న వారందరూ ఆయన ఏ మతానికీ ప్రాధాన్యత ఇవ్వడం లేదని తెలిసి ఎంతో బాధపడ్డారు. ఆయన హిందూమతానికీ సనాతన ధర్మానికీ మధ్య ఒక స్పష్టమైన విభజనరేఖని గీశారు. వేదాలు కేవలం హిందువులకి మాత్రమే సంబంధించినవి కావనీ అవి మొత్తం మానవాళికి సంబంధించిన సత్యాలను భద్రపరచిన జ్ఞాననిధులనీ అవి ప్రపంచం మొత్తానికీ సంబంధించినవనీ ఆయన శ్రోతలకి గుర్తుచేశారు.

స్వామీజీ మిగతా మతాలు కూడా హిందూమతం లాగానే ఉన్నతమైనవని అనడంతో చాలామంది హిందూ మత నాయకులూ వారి అనుచరులూ ఎంతో రెచ్చిపోయారు. స్వామీజీ, మతంతో గుర్తింపబడడం ఒక అంశమైతే, మతంలో సూచించబడిన ఆధ్యాత్మిక ఆచరణలూ ఉన్నత విలువల్ని ఆచరించడం పూర్తిగా భిన్నమైన అంశమనీ అనేసరికి వాళ్లు ఎంతో అసహనంతో ఊగిపోయారు. స్వామీజీ మత గురువులను ఆరాధిస్తూ వాళ్లని గుడ్డిగా అనుసరిస్తే హిందువులైనా క్రైస్తవులైనా వాళ్లు గొఱ్ఱెలుగానే ఉంటారనీ వాళ్లు గనుక భగవద్గీతలో లేదా బైబిల్‌లోని విషయాలను తమ దైనందిన జీవితంలో ఆచరణలో పెడితే వాళ్లు గొర్రెల నుంచి మానవులుగా మారతారనీ వాళ్లు మాత్రమే నిజమైన హిందువులూ లేదా క్రైస్తవులుగా ఉంటారనీ అనేవారు. అలాంటి నిజాయతీపరులైన వాళ్లు శాశ్వతమైన సత్యంతో జ్ఞానంతో దీవించబడతారు, తర్వాత వాళ్ల చైతన్యం మతానికి అతీతంగా విస్తృతంగా వ్యాప్తి చెందుతుందని స్వామీజీ ఉపన్యసించారు.

త్వరలోనే స్వామీజీ వివాదాస్పద వ్యాఖ్యలకి కేంద్రంగా మారారు. దాంతో మరింతమంది ప్రజలను ఆయన ఆకర్షిస్తున్నారు. జనాలు గుమిగూడుతున్నకొద్దీ ఆయన మరింత నిష్కర్షగా మాట్లాడుతూ అగ్నికి ఆజ్యం పోయడం మొదలుపెట్టారు. ప్రతి ఉపన్యాసాన్నీ నింపాదిగా మంద్రస్థాయిలో మొదలెట్టేవారు. క్రమంగా వేగాన్ని పెంచుతూ చివరికి తుఫానులా చెలరేగిపోయేవారు. దేవుడూ, స్వర్గం, నరకం, పూజారుల మీద పండితుల మీద ఆధారపడటం వంటి సందేహాస్పదమైన తప్పుడు భావనలను తీవ్రంగా విమర్శిస్తూ పటాపంచలు చేసేవారు. తర్వాత నింపాదిగా మళ్లీ సున్నితమైన స్వరంతో సాధువులాగా తన ఉపన్యాసాన్ని ముగించేవారు. ఈ విధంగా అద్భుతమైన నైపుణ్యంతో శ్రోతల మనోభావాలను ఋషుల శాశ్వతమైన బోధనల వైపు మళ్లించి సత్యం గంభీరమైన ఉపన్యాసాలు వినడం వల్ల సాక్షాత్కరించదనీ, సాధన చేసి ఆచరణలో అనుభూతి చెంది మాత్రమే తెలుసుకోగలమనీ ఒప్పించేవారు.

మౌలికంగా ఆయన పూర్తిగా విభిన్నమార్గంలో ఉపన్యసిస్తున్నా అందరూ చాలా శ్రద్ధగా వినేవారు. విశాల దృక్పథం గల సత్యాన్వేషకులు ఎంతో పులకించిపోయేవారు. కానీ సంకుచితులూ, అల్పబుద్ధులూ ఎంతో బాధపడి ఆగ్రహించారు. కుంభమేళా అయిన తరువాత కూడా కొన్ని నెలల వరకూ స్వామీజీ ఉపన్యాసాలే నగరంలో ప్రధాన చర్చనీయాంశాలుగా మారాయి. రెండు సంవత్సరాల తర్వాత ఆయన ఉపన్యాసాలన్నీ ప్రోగుచేసి సంపాదకీయం వహించి హిందీలో 'ఈ యుగ ధర్మం ఏమిటి?' అనే పేరుతో ప్రచురించబడింది. ఇదే స్వామీజీ మొదటి పుస్తకం.

1964 కుంభమేళా తర్వాత స్వామీజీ తరచూ బహిరంగంగా కనిపించడం ప్రారంభమైంది. అప్పటికి ఆయన శంకరాచార్యుల పదవిని వదిలేసి పన్నెండు సంవత్సరాలయింది. ఆ సమయంలో ప్రజల కంట్లో పడకుండా జాగ్రత్తపడ్డారు. అయినప్పటికీ ఆయన స్పష్టంగా ప్రజల దృష్టిలో పడ్డారు. ఇప్పటికీ ఆయన తన చుట్టూ భక్తులు గుమిగూడకుండా ఉండేటట్లు జాగ్రత్త వహిస్తుంటారు. ఆయన కేవలం ఆధ్యాత్మిక విషయాలపై మాత్రమే మాట్లాడేవారు. అవి విస్తృత ప్రజానీకాన్ని ఆకర్షించేటట్లు ఉండేవి కావు. ఆయన ఆలయాల్లో ఉపన్యాసాలిచ్చేవారు కారు. ఎందుకంటే చాలామంది దేవుణ్ణి దర్శిస్తే చాలు, తమ కష్టాలన్నీ పోతాయనుకునేవాళ్లే ఎక్కువగా అక్కడికొస్తారు. ఆయన తన 'ఈ యుగధర్మం ఏమిటి?' అనే పుస్తకంలో వ్రాసినట్లు ఆయన ఉపన్యాసాలు వీళ్లను ఉద్దేశించి కొనసాగవు.

'ఇప్పటి పరిస్థితుల్లో సంకుచిత స్వభావంతో చేసిన 'ఇజమ్స్' మనకెంత మాత్రమూ సహాయపడవు. మతాచారాలన్నీ మతాలకూ, గుళ్లకూ, చర్చిలకూ, మశీదులకూ పరిమితమై ఉన్నాయి. ఇలాంటి నిర్దిష్టమైన ప్రదేశాల్లో మాత్రమే మతాన్ని ఆచరిస్తే ఉపయోగం ఉంటుందనే

విషయాన్ని నీ మనసెప్పుడూ నిన్ను ప్రశ్నించలేదా? దైనందిన జీవితానికి సంబంధం ఉండని మతాచారాలకి ఏమైనా అర్థం వుందా?

'దురదృష్టం ఏమిటంటే భారతదేశంలో ప్రతి సంవత్సరం కొత్త దేవుళ్లు ఆవిర్భవిస్తూనే ఉంటారు. కానీ మన కష్టాలు మాత్రం అలాగే వుంటాయి. గురువు చుట్టూ కూర్చోగానే తమ కష్టాలన్నీ పోతాయనే భ్రాంతి నుండి మీరెప్పుడు బైటపడతారు? గురువు అనేవాడు చాలా ముఖ్యుడు కానీ ఆయన చెప్పిన విషయాలను సాధన చేయడం ఆచరణలో పెట్టడం మరింత ముఖ్యం. గురువనేవాడు నీకు మార్గాన్ని చూపుతాడు కానీ ఆ దారి వెంట నువ్వు నడవాలి. ఒకవేళ ఆ గురువు, 'నన్ను నమ్ము. నేనే నీ కోసం సమస్తం చేస్తాను. నువ్వేమీ చేయనవసరం లేదు' అని అంటే ఆలాంటి గురువును వదిలేయడమే మంచిది. చాలామంది గొప్పవాళ్లు దేవుడికి గుళ్లు కట్టారు. వాళ్లకి కానీ వాళ్ల పిల్లలకి కానీ కష్టాలేమైనా తక్కువగా ఉన్నాయా? లేవండి! మీ శక్తుల్ని తెలుసుకోండి. వాటిని మేల్కొల్పండి. మిమ్మల్ని మీరు ఆరోగ్యంగా దృఢంగా వుంచుకోండి. మీ విధులనీ, బాధ్యతల్నీ నిర్వర్తించే విధంగా మీ జీవితాన్ని తీర్చిదిద్దుకోండి. అలాగే మీ శారీరిక, జ్ఞాన, మానసిక అవసరాల పట్ల కూడా శ్రద్ధ వహించండి. భౌతికంగా అనారోగ్యంగా వుండి మానసిక దృఢత్వం లేకుండా మీరెలా దేవుణ్ణి పూజించగలరు?'

స్వామీజీని ఇంకా శంకరాచార్యులుగానే గుర్తుంచుకున్నవాళ్లు ఆయన ఈ విధంగా ఆచారాల, దేవాలయాల విలువలను తగ్గించి మాట్లాడటం జీర్ణించుకోలేకపోయారు. ఆయన యోగాచరణ, వాటి భంగిమలూ, ప్రాణాయామం, సంతులన ఆహార నియమం, ధ్యానం మున్నగు వాటి ప్రాముఖ్యత గురించి చెబుతుండేవారు. ఈ బోధల్ని మన భారతీయులు ఏనాటి నుంచో వింటూనే వస్తున్నా చాలామంది వాటిని మర్చిపోయారు. అటు తూర్పునా ఇటు పశ్చిమానా కొద్దిమంది సాధువులూ, బాగా చదువుకున్న వాళ్లు మాత్రమే వీటిని ఆచరిస్తున్నారు. అందుకే స్వామీజీ మేధావులు, బాగా చదువుకున్న వారి వద్ద తరచూ మాట్లాడుతుంటారు. ఉదాహరణకి ఆయన అలహాబాద్ విశ్వవిద్యాలయంలో, పబ్లిక్ సర్వీస్ కమీషన్, కాన్పూర్‌లోని ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలోనూ ప్రసంగించారు. ఇక్కడి శ్రోతలు స్వామీజీ వేదాలు, ఉపనిషత్తుల విలువల్ని వివరించే విధానాన్ని ఆహ్వానించారు, అర్థం చేసుకున్నారు. అంతేకాక అక్కడి ప్రేక్షకులు స్వామీజీ చెబుతున్న ప్రాచీన జ్ఞానానికీ, ఆధునిక శాస్త్రాలకీ, అలాగే ఆధ్యాత్మిక భౌతిక వాదాల మధ్య వారధి నిర్మించాలనే భావాలను అభినందించారు.

ఒక సభలో ఉపన్యసిస్తూ స్వామీజీ ఇలా అన్నారు, 'శాస్త్రమూ సాంకేతిక జ్ఞానమూ ఈ రెండూ నీతి, ఆధ్యాత్మికం, నైతికత అనే అత్యున్నతమైన సూత్రాల ఆధారంగా నడవాలి. శాస్త్రమూ మతమూ, సాంకేతిక ఆవిష్కరణలూ, ఆధ్యాత్మిక జ్ఞానమూ అన్నీ కలిసి ఉండాలి. ఈ రోజుల్లో సైన్స్‌కీ ఆధ్యాత్మికానికీ మధ్య సమతుల్యం లేదు. దాని ఫలితంగా సైన్స్ శాంతిని చేకూర్చడానికి బదులు స్వీయ విధ్వంసం వైపు కదులుతూ భయాన్ని సృష్టిస్తోంది. సైన్స్ సహాయంతో మానవ సమాజం అణుయుగంలోకి ప్రవేశించింది. శాస్త్రీయ ఆవిష్కరణలు మన జీవన ప్రమాణాలను ఎంతగానో పెంచాయి. వస్తు వినియోగం ద్వారా ఎంతో భౌతిక సుఖాన్ని పొందగలుగుతున్నాము. మన తాత ముత్తాతల కన్నా మనమెంతో మెరుగు. కానీ బాహ్య ప్రపంచం పెరుగుతున్న కొద్దీ ఈ సౌకర్యాలూ, విలాసాలూ పెరిగిపోతున్నాయి, అదే స్థాయిలో మన మానసిక ప్రశాంతత తగ్గిపోతోంది. మన మేధోజ్ఞానంతో ఎన్ని వస్తువుల్ని మనం కనుగొన్నామనేది ముఖ్యం కాదు. మనం ఏ మేరకు అసమానతల నుంచీ, భయం నుంచీ, అనుమానాల నుంచీ స్వేచ్ఛని పొందామనేదే ముఖ్యం. ఈ స్వేచ్ఛను పొందాలంటే మనం మన మనసులను బాహ్య ప్రపంచం నుండి

ఉపసంహరించుకుని మన అంత: ప్రపంచంలోకి దృష్టి సారించాలి. మానవజాతి సమస్యలకు పరిష్కారం మనం మానవుడి మసస్సులోనే కనుక్కోగలం. మానవ మేధస్సు, మానవ జాతి జ్ఞానం అనే రెండు ఉపకరణాలను ఉపయోగించి ప్రపంచంలోని దృగ్విషయాలను తెలుసుకోవడం ద్వారా మనలోని సత్యాన్ని గ్రహించగలం. అయితే వాటికి చెడు నుంచి మంచి గ్రహించడానికీ, సుఖం నుండి మంచి గ్రహించడానికీ శిక్షణ అవసరం.'

ఎక్కువగా విద్యాసంస్థల్లో ఉపన్యాసాలు ఇవ్వడంతోపాటు డా. అగ్నిహోత్రి, డా. టాండన్, డా. కులకర్ణి, నరేంద్రమోహన్, రోషన్ లాంటి కొంతమంది ఎంపిక చేయబడ్డ వాళ్లకి స్వామీజీ ఉపనిషత్తులు బోధించారు. ఈ తరగతులు ఎక్కువగా కాన్పూర్ మెడికల్ కాలేజ్ డా. సునందాబాయి ఇంట్లో జరిగేవి. స్వామీజీ కాన్పూర్‌లో ఉన్నప్పుడు ఆవిడ ఇంట్లోనే ఉండేవారు. అక్కడే 'హిమాలయన్ ఇంటర్నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ యోగా సైన్సెస్ అండ్ ఫిలాసఫీ' ఏర్పాటు చేయాలనే అలోచన కూడా రూపొందింది. 1980–1997 మధ్య డా.సునందాబాయి గారిని చాలాసార్లు కలిశాను. ఆమె చాలా ఉన్నతమైన మహిళ. స్వామీజీ చెప్పిన విషయాలను పూర్తిగా ఆకళింపు చేసుకున్న శిష్యుల్లో ఈమె ఒకరు. స్వామీజీలాగనే ఆమె కూడా ఎంతో క్రమశిక్షణతో ఉండి ఏ మాత్రం నిరర్థకమైన విషయాలను పట్టించుకోకుండా తన దైనందిన విషయాలను సైతం ఆధ్యాత్మిక జ్ఞానంతో సంబాళించగల వ్యక్తిత్వం ఆమెది. కానీ వ్యక్తిగత జీవితంలో ఆమె భక్తియోగిని. స్వామీజీ పట్ల ప్రేమతో తన జీవితాన్ని నింపుకున్న ప్రేమమయి. నాకు తెలిసిన విద్యార్థులలో ఆమె మాత్రమే స్వామీజీని వ్యక్తిగతంగా కలవగలిగేది. ఆమె దగ్గరే స్వామీజీ ఫొటో కూడా ఉంది.

డా. సునందాబాయితో జరిపిన సంభాషణల్లో స్వామీజీ ప్రాచీన ఆధునిక మహర్షుల అనుభవాలు రెండింటినీ కలగలుపుగా కలిగి ఉన్నారనే విషయాన్ని సేకరించగలిగాను. 'స్వామీజీ తన గురువుగారైన బాబాజీని ఎంతో గాఢంగా ప్రేమించారు. వారి మార్గం పురాతనమైనది. అది సుస్పష్టం. వారు మంత్రాలు తెలిసిన జ్ఞానులు, జ్ఞాన సముపార్జన చేసి బహిర్గతపరచిన యోగులు. స్వామీజీ తాను నేరుగా ప్రాచీన ఋషులనుండే గ్రంథాలను తెలుసుకున్నట్లుగా మాట్లాడుతుంటారు. ఆయనకు ఋషుల పట్ల ఉన్న గాఢమైన భక్తిప్రపత్తుల్ని అజ్ఞానులు అపార్థం చేసుకుంటారు. స్వామీజీ ఋషులను దైవంగా చూస్తారనీ లేదా వారికి దేవుడి మీద నమ్మకం లేదనీ తప్పుగా భావిస్తారు,' అని చెప్పారామె.

గ్రంథాలను బోధించడంలో స్వామీజీ ఒక ఉపాధ్యాయుడిగా కాక వాటిని ఋషుల సాధనాలుగా ఎంతో సాధికారతతో, కౌశలాన్ని ప్రదర్శిస్తూ బోధించేవారు. ఎంతో సంక్లిష్టమైన విషయాలను సరళంగా సూటిగా మనసుకు హత్తుకునేటట్లు వాడుకలో ఉన్న ఉదాహరణలతో చెప్పేవారు. ఆయన దృష్టిలో జ్ఞానం మాత్రమే శాశ్వతమైన స్వేచ్ఛను ప్రసాదించగలదు. నిత్యమైన శాంతి జ్ఞానంతోనే కొనసాగుతుంది. మిగతావన్నీ మేధో మధనాలే. ఇదే విషయాన్ని ఆయన తన 'ఈ యుగధర్మం ఏమిటి?' అనే పుస్తకంలో కూడా తెలియజేసారు.

'ఈ ప్రపంచంలో శాశ్వతమైన ఆనందాన్ని కోరుతూ ప్రజలు ఈ ప్రపంచంలోని అనేక విషయాలతో ప్రయోగాలు చేస్తూనే ఉన్నారు. ఇంతవరకూ మానవ సమాజం ఆనందకరమైన జీవన మార్గాన్ని కనుగొనలేకపోయింది. చూస్తుంటే ఈ ప్రయోగాలు నిరంతరాయంగా కొనసాగేటట్లున్నాయి. గతంలో చాలామంది ఉన్నతమైన సత్యాన్ని అనుభూతి చెంది ఆనందమనేది బాహ్యంగా ఉన్న భౌతిక ప్రపంచంలో లేదనీ, అది మన ఆంతరంగంలోనే ఉందనీ నిర్ధారించారు. అయినా కూడా వారి అనుభవాలు ప్రాపంచిక అనుభవాలు కాలేదు. అశేష ప్రజానీకంలో కొంతమంది మాత్రమే వీళ్ల అడుగుజాడల్లో నడుస్తున్నారు. అదిగో...వాళ్లే ఆనందాన్ని

పొందుతున్నారు. వాళ్లు ఈ ప్రపంచంలోనే నివసిస్తుంటారు కానీ ఎల్లప్పుడూ ప్రాపంచిక స్థాయికి మించి కొనసాగుతూ ఉంటారు.'

'అంతర్గత ప్రకాశం లేనిదే బాహ్య జీవితం స్వచ్ఛంగానూ ఆదర్శవంతంగానూ ఉండదు. మన అంతర్గత దివ్యకాంతి ద్వారా బాహ్య ప్రపంచాన్ని ప్రకాశింపచేయాలి. అంతరంగపు మర్మాల్ని కనుక్కోవడం ద్వారా బాహ్య ప్రపంచంలోని దు:ఖం నుండి స్వేచ్ఛను పొందగలం. నీ అంతరంగంలోని ముసుగులను తీసేసిన మరుక్షణం నీ అహం ఉన్నతస్థాయికి చెందిన స్వీయాత్మక విలువలతో అనుసంధానింపబడి మన ఆలోచనలూ, మాటలూ, చర్యలూ అన్నీ దైవ సంకల్పానికి అనుగుణంగా సాగుతాయి. మన ప్రాపంచిక కార్యక్రమాలు ఒక్కసారి దైవసంకల్పంతో అనుసంధానింపబడ్డాయంటే మనం స్వేచ్ఛానందాన్ని ఇక్కడే ఇప్పుడే పొందగలం. అంతరంగ, బాహ్య ప్రపంచాలు రెండింటిలోనూ ఏకకాలంలో కొనసాగగలిగే వ్యక్తి రెండుచోట్లా ఉనికిలో ఉంటాడు.'

స్వామీజీ మరింత క్రియాశీలకంగా మారుతున్న క్రమంలో ప్రజలకి ఒక నిర్మాణాత్మక పద్ధతిలో సేవ చేయడానికి స్థిరంగా ఒక చోట వుంటే బాగుండనుకున్నారు, దాంతో ఆయన ఋషీకేశ్ గంగానది తీరాన కాస్త స్థలం తీసుకుని రెండుగదుల ఆశ్రమాన్ని నిర్మించారు. ఆ ప్రదేశం స్వామీజీకి చిరపరిచితమే. తన బాల్యంలో చాలా రాత్రులు వారి గురువుతో ఇక్కడే గడిపారు. ఇక్కడి ప్రదేశాన్ని 'ప్రశాంత్ తటీ' అని అంటారు. 1960లో స్వామీజీ అక్కడ ఆశ్రమాన్ని కట్టినప్పుడు ఆ ప్రాంతమంతా అడవి. అడవి ఏనుగులు అక్కడి నదీతీరాన్ని దాటుతూ ఈ అడవంతా తిరుగుతుండేవి, అక్కడ 'కాలీ కమలీవాలా' అనే ఆశ్రమం ఉండేది. దాంట్లో ఒక సంస్కృత పాఠశాల, కొద్దిమంది విద్యార్థులూ, గురువులూ ఒక సాధువూ ఉండేవాళ్లు. అక్కడ మనుషులున్న నివాస ప్రాంతం అది ఒక్కటే. అక్కడ నానాజీ అనే గొప్ప యోగి ఉండేవారు. మిగతా వాళ్లలాగానే ఆయన కూడా స్వామీజీకి జ్ఞానాన్ని అందించారు. బాబాజీ తరచూ బాల్యంలో ఉన్న స్వామీజీని ఆయన దగ్గర ఉండటానికి పంపేవారు. స్వామీజీతోపాటు ఆయన కూడా పర్వతాల్ని అధిరోహించే వారు. స్వామీజీ పెద్దయిన తర్వాత కూడా నానాజీ ఆయనను చిన్నపిల్లాడిగానే చూసేవారు. ఈ మహర్షి చిన్న పెట్టెలాగా ఉన్న ఓ కుటీరంలో నివసించేవారు. దాని ప్రక్కనే స్వామీజీ కోసం ఓ విశాలమైన ప్రశాంత కుటీరం నిర్మింపబడింది. కాస్త విశాలంగా ఉన్న ఈ కుటీరంలోకి రమ్మని స్వామీజీ చాలాసార్లు అడిగారు. అయినా వారు నిరాకరించారు. ఆ కుటీరం 1990 వరకూ అలాగే ఉంది. మాలో చాలామంది హృషీకేశ్ వెళ్లినప్పుడు ఆయన గౌరవార్థం దాన్ని సందర్శిస్తూ ఉండేవాళ్లం.

అక్కడే కాలీ కమలీవాలా ఆశ్రమ ప్రాంగణంలో ఏనుగులని ఆకర్షించే ప్రజ్ఞగల స్వామీజీ ఒకరుండేవారు. కొంతమంది ఆయన గణేశ భక్తుడు కావడం వల్లనే ఆయనకి ఆ రకమైన సామర్థ్యం అబ్బిందని అంటారు. మరి కొంతమంది అతను పూర్తిగా అహింసావాద జీవితంలో స్థిరపడటం వల్ల అతని సమక్షంలో ఏనుగులు తమలోని జంతు సహజమైన ప్రవృత్తులను ప్రదర్శించడం లేదని అంటారు. అసలు నిజమేమిటంటే ఈ సాధువు పూర్వాశ్రమంలో మావటి. సాధువుగా మారక ముందు దక్షిణ భారత దేశంలో ఆయన ఏనుగులకు శిక్షణనిచ్చాడు. అతని గుడిసెలో కలకండ స్ఫటికాలను పెట్టేవాడు. ఏనుగులు అక్కడ ఏపుగా పెరిగిన గడ్డిని తినడానికి వచ్చినప్పుడు వాటికి ఈ కలకండ పెట్టేవాడు. చాలాసార్లు స్వామీజీ ఆలా చేయవద్దనీ, అవి వచ్చినప్పుడు ఎపుడైనా కలకండ లేకపోతే ఆయన మీద తీవ్రంగా దాడిచేస్తాయని హెచ్చరించేవారు.

ఆయనన్నట్లే ఒకరోజు రాత్రి ఓ పెద్ద ఏనుగు ఆయన కుటీరానికి కలకండ కోసం వచ్చింది. సాధువు కలకండ ముక్క పెట్టారు. కానీ అది చాలక ఏనుగు ఇంకా అడిగింది. సాధువు

మరొకటి పెట్టాడు. దానికి అదీ చాల్లేదు. చివరికి సాధువు తనవద్ద ఉన్న కలకండ మొత్తం పెట్టాడు. ఇంతలో ఆ గుంపులో ఆధిపత్యం వహించే మగ ఏనుగు అక్కడికి వచ్చింది. దాంతో పోట్లాట ఎందుకని మొదటి ఏనుగు వెళ్లిపోయింది. సాధువు దగ్గర కలకండ లేదు. కలకండ దొరకకపోయేసరికి ఆ మదపుటేనుగు సాధువుని తొండంతో ఎత్తిపట్టి గిరగిరా తిప్పి నేలకేసి కొట్టింది. స్వామీజీ అమెరికాలోని 'హోన్స్‌డేల్' లో చెప్తున్న ఒక ఉపన్యాసంలో మనిషి తన ఆకాంక్ష తీరకపోతే తీవ్ర నిరాశ నిస్పృహలకి గురై హింసోన్మాదిగా ఎలా మారుతాడో చెప్పడానికి ఉదాహరణగా ఈ ఉదంతం ప్రస్తావించారు.

త్వరలోనే రెండుగదుల ఆశ్రమ నిర్మాణం పూర్తయింది. నదీతీరాన ఒడ్డుకి దగ్గరగా ఒక కుష్టువ్యాధి సోకిన వ్యక్తిని స్వామీజీ చూశారు. ఆ వ్యాధి అతని చేతివేళ్లనీ పాదాలనీ పూర్తిగా తినేసింది. అతని ముఖం కూడా వికారంగా మారింది. నదికి ఎగువ భాగంలో ఐదు మైళ్ల దూరంలో, లక్ష్మన్ ఝూలా అనే పుణ్యక్షేత్రం దగ్గర  కుష్టు వ్యాధిగ్రస్థులూ, బిచ్చగాళ్లూ నివసిస్తూ ఉంటారు. కానీ ఇతను ఎవ్వరి సహాయం లేకుండా ఒక్కడే ఎలా వచ్చాడా అని స్వామి ఆశ్చర్యపోయారు. ఆ వ్యక్తి స్వామీజీని చూసినపుడల్లా ఆహారం, మంచినీళ్లు అడిగేవాడు. స్వామీజీ తన దగ్గర ఉన్న ఆహారం అతనికి ఇచ్చేసేవారు. ఎంత ఇచ్చారనేది అక్కడ విషయం కాదు. ఒకసారి అతనికి సరిపడా ఆహారం లేదని స్వామీజీ అతన్ని సముదాయించబోయారు. దాంతో అతను అక్కడి నుండి వెళ్లకుండా వుండిపోయాడు.

అతను ఆశ్రమం దగ్గరే వుండి రాత్రీ, పగలూ ఆరుస్తూ స్వామీజీని తిట్టడం ప్రారంభించాడు. నీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్లమని స్వామీజీ అనగానే ఇదే అతని ప్రదేశమని అరవసాగాడు. స్నానంచేసి గాయాలు శుభ్రపరచుకోమని స్వామీజీ అంటే 'అది నీకనవసరం' అని అతను అరిచాడు. బహుశా అతనికి నీరంటే భయమేమో. చాలారోజులు ఇలానే అతడు ఇబ్బంది పెడుతుంటే స్వామీజీ కొంతకాలం ఆశ్రమాన్ని వదిలి వెళ్లిపోదామనుకున్నారు. కానీ వెంటనే ఆలా వెళ్తే ఈ కుష్టువాడికి ఏమౌతుందోనని కలవరపడ్డారు. ఇతని కారణంగా ఆశ్రమాన్ని వదిలి వెళ్లడం సరైంది కాదని అనుకున్నారు.

దాదాపు ఒక వారం అయింది. ఆ కుష్టువాడు ఇంకా బిగ్గరగా మరింత నీచమైన పదాలతో తిట్టడం మొదలుపెట్టాడు. ఒకరోజు అతను తిడుతుండగా బాబాజీ వచ్చారు. ఆయన వీణ్ణి చూసి వాడి దగ్గరకి వెళ్లి బలంగా ఒక్క తన్ను తన్నారు. ఆ కుష్టు వ్యాధిగ్రస్తుడు నది ఒడ్డు నుంచి దొర్లుకుంటూ వెళ్లి గంగానదిలో పడ్డాడు. ఇదంతా చూస్తూ స్వామీజీ నమ్మలేకపోతున్నారు. అయితే వారు తరువాత చూసింది మరీ నమ్మశక్యం కాకుండా ఉంది. ఆ కుష్టు వ్యాధిగ్రస్తుడు నదిలోని నీటిని తాకిన వెంటనే అతని రోగం నయమయింది. మెరుస్తున్న దేహంతో బయటికి వచ్చాడు. అతనూ బాబాజీ ఒకరికొకరు వంగి నమస్కరించుకున్నారు. ఒక్క మాట మాట్లాడకుండా ప్రకాశిస్తున్న ఆ వ్యక్తి గంగానది దాటి కొన్ని నిమిషాల్లో అవతలి పక్క ఉన్న అడవిలోకి వెళ్లి మాయమైపోయాడు.

స్వామీజీ ఇతనెవరని అడిగారు. దానికి బాబాజీ, 'ప్రపంచంలో వేలాదిమంది కుష్టువ్యాధిని తీసుకోని భరిస్తున్న ఏడుగురు ఋషులలో ఇతనొకరు. చాలాసార్లు గంగామాత ఆ జబ్బుని తనకివ్వమంది. కానీ వేలాదిమంది కుష్టు రోగాన్ని ఆమెకిచ్చి ఇబ్బంది పెట్టదలుచుకోలేదు. మిగతా యోగులు కూడా ఆయన బాధను పంచుకుందామని అనుకున్నారు. కానీ అందుకు ఆయన అంగీకరించలేదు, అతని స్వాభావికమైన కరుణా రసం వల్ల ఆ బాధనంతా అతనే దిగ మ్రింగాడు,' అని స్వామీజీ ఆ సంఘటన గురించి చెబుతూ మధ్యలో ఆగి 'ఆ రోజు నుంచీ నా గురువుగారి కుడి పాదం మీద తెల్లటి మచ్చ ఏర్పడింది,' అని చెప్పారు.

హృషీకేష్‌కి బాబాజీ వచ్చిన ఈ సమయంలోనే ఆయన స్వామీజీతో మహర్షుల సందేశాన్ని ప్రపంచం మొత్తానికీ తెలియజేయాల్సిన సమయం ఆసన్నమైందనీ చెబుతూ బాబాజీ, 'జీవితంలో ప్రతి అంశంలోనూ ఎంతో బాధ దాగి ఉంది. రోగాలు, ఆకలి, భయం, దు:ఖం అన్నిచోట్లా వ్యాపించి ఉన్నాయి. ఈ ప్రపంచంలో నీ అంతరంగంలో నువ్వు ఎంత అనుభవం గడించావనేది ఇప్పుడు విషయం కాదు, నువ్వింకా స్తబ్ధంగానే ఉన్నావు. ఇతరులకి సేవ చేయడానికి నీకు తరగని అపరిమితమైన సంపద కావాలి. అదే అంతర్గత శక్తి, అంతర్ దృష్టి. కనుక ఈ ప్రయాణంలోకి వెళ్లే ముందు మహర్షుల దీవెనలు అందుకో. మనాలీలోని మన గుహకి వెళ్లు. అక్కడ నువ్వు పదకొండు నెలలపాటు కఠోరమైన దీక్షకి అంకితం కా. అక్కడి గుహలో కళ్లు మూసుకుని ధ్యాన స్థితిలో ఉంటే ఈ భౌతిక నేత్రంతో సంబంధం లేకుండా నువ్వు ప్రతిదీ అనుభూతి చెందగలవు. మౌనంగా ఉండు. తర్వాత నువ్వు ఎంతో ప్రతిభావంతంగా మాట్లాడగలవు. నీ చేతులు ప్రాపంచిక ప్రయోజనాల కోసం వాడకు. తర్వాత విజయం దానంతటదే నీ దరికి వస్తుంది' అన్నారు.

ఆ గుహ హిమాలయాలలోని హిమాచల్ ప్రదేశ్‌లో ఉంది. హిమాలయ సంప్రదాయంలో పరశురాముడు ఈ ప్రాంతాన్నంతా సంరక్షిస్తూ ఉంటారు. సప్తర్షులలో ఒకరైన వశిష్ఠుని ఆధ్వర్యంలో ఈ గుహ ఉంటుంది. నేను చాలారోజుల పాటు కేవలం స్వామీజీ పదకొండు నెలల దీక్షని కొనసాగించడానికి ఆక్కడికి వెళ్లారని అనుకున్నాను. *'హిమాలయ పరమగురువులతో జీవనము'* పుస్తకంలో స్వామీజీ ఈ సందర్భంలో మాత్రమే మనాలీ గుహ గురించి ప్రస్తావించారు. మొత్తం పుస్తకంలో మిగతా పవిత్ర హిమాలయ ప్రాంతాల గురించి మాట్లాడారు. తర్వాత వాటిని చూడటానికి తన విద్యార్థుల్ని తీసుకెళ్లారు. కానీ మనాలీ గుహకు మాత్రం ఎవ్వరినీ తీసుకుని వెళ్లలేదు. చాలా సంవత్సరాల తర్వాత గానీ అది ఎందుకో నాకు తెలియలేదు.

స్వామీజీ ఈ గుహ గురించీ అక్కడ తను చేసిన సాధన గురించీ మాట్లాడుతూ, ప్రయోగశాలల్లో కఠినమైన పరీక్షలకి గురిచేసి శాస్త్రీయ ఆవిష్కరణల్ని పరిశీలించినట్టే, ఆధ్యాత్మిక సూత్రాలను కూడా పరీక్షిస్తారని చెప్పారు. శాస్త్రీయ సిద్ధాంతాలు బాహ్య ప్రపంచానికి సంబంధించినవి కనుక వాటికి భౌతిక పదార్థాలతో చేసిన పనిముట్లూ ఇత్యాది వస్తువులతో చేసిన శాస్త్రీయ ప్రయోగశాలలు కావాలి. ఆధ్యాత్మికం అనేది మానవుడి అంతర్గత వాస్తవికతకి సంబంధించినది. ఈ అంత:సత్యాన్ని పరిశీలించాలంటే మనిషి తన ఆంతర్గత రాజ్యంలోని ప్రయోగశాలలో పనిచేయాలి. మనసే ఒక ప్రయోగశాల. ధ్యానం ఆచరించడమే ఒక పని ముట్టు. ఆయన 'హిమాలయ పరమగురువులతో జీవనం'లో వ్రాసినట్లు 'సాధువులు ఒక క్రమపద్ధతిలో గాఢమైన ధ్యానంలోకి వెళ్లడం నేర్పుతారు. వాళ్లు 'ఇది మొదటి దశ', 'ఇది రెండవది', 'ఇది మూడవది' అని చెప్పుకుంటూ వెళ్తారు. ధ్యానంలో ఉత్పన్నమయ్యే లక్షణాలను వివరిస్తుంటారు. నిర్దిష్ట లక్షణం కనబడినపుడు నువ్వు ఆ దశలో ఉన్నావని అర్థమవుతుంది. ఈ రకంగా నువ్వు అత్యున్నతమైన ఏకాగ్రతను సాధిస్తావు. వాళ్లు మిమ్మల్ని జాగ్రత్తగా పరిశీలిస్తునే ఉంటారు. కనుక మీరు ఎలాంటి కలతా, ఇబ్బంది లేకుండా వుంటారు.'

అదే పుస్తకంలో స్వామీజీ ఆ గుహలో తానెట్లా నివసించింది, అక్కడ చేసిన సాధన ఏమిటీ, తన అనుభవాలు ఏమిటీ అనే విషయాల్ని సోదాహరణంగా వివరించారు. 'కేవలం అడవి దుంపలూ కందమూల ఫలాలే నా ఆహారం. కొన్ని రసాలు, ప్రొద్దున్న ఒక గ్లాసుడు పాలు, సాయంత్రం ఒక గ్లాసు. ఆ గుహలో ఉన్న కాస్త స్థలంలోనే క్రమం తప్పకుండా కొన్ని భంగిమలతో యోగాసనాలు వేస్తూ రెండూ లేదా మూడు గంటలు మాత్రమే నిద్రపోయేవాడిని. మిగిలిన సమయంలో మా గురుదేవులు చెప్పిన మంత్రాలను జపించడం, ధ్యానించడం ఇంకా

రెప్పవాల్చకుండా తదేక దీక్షతో చూడడం చేసేవాణ్ణి. రోజుకి మూడుసార్లు బలంగా ప్రాణాయామం చేసేవాడిని. కానీ ఎంతో జాగ్రత్తగా చేసేవాడిని.'

'గుహ ద్వారం మూసివేయబడింది, కానీ మురికినీరు పోవడానికి చిన్న తూము ఉంది. పైన కేవలం ఒక సూర్య కిరణం మాత్రమే ప్రవేశించడానికి అనువుగా ఒక చిన్న రంధ్రం ఉంది. నీ మనసును ఒకే విషయం మీద లగ్నం చేయడానికి ఆ రంధ్రం ఎంతగానో ఉపయోగపడుతుంది. అలా నువ్వు వద్దనుకున్నా దానంతటదే జరిగిపోతుంది. ఇలాంటి పరిస్థితిలో ఎలాంటి ప్రయత్నం చేయకుండానే నువ్వు మనసుని ఏకాగ్రంగా ఉంచగలవు. ఎందుకంటే అక్కడ ఒకే ఒక్క కిరణం ఉంది, ఇంకేమీ లేవు. ఈ ఏకాంత స్థితిలో రోజంతా నువ్వేం చేయగలవు? నువ్వు గనుక ధ్యానం నేర్చుకోకపోతే, ధ్యానం చెయ్యకపోతే నీ సమతుల్యాన్ని కోల్పోతావు. నీకు వేరే దారిలేదు,' అనేవారు గురూజీ.

'మొదటి రెండు నెలలూ గుహలో నివసించడం ఎంతో దుర్లభంగా ఉండేది. కానీ తర్వాత నేను దీన్ని విపరీతంగా ఆనందించడం మొదలుపెట్టాను. రాజయోగ శాస్త్రం సంయమనాన్ని నేర్పుతుంది. అంటే ఏకాగ్రత ద్వారా, ధ్యానం ద్వారా, సమాధి ద్వారా అంతరంగంలోకి పరివర్తన చెందడం. ఈ శిక్షణ సమయంలో ఉండాల్సినంత సమయం మౌనంగా ఉండకుండా గాఢమైన ధ్యానాన్ని నిర్వహించడం సాధ్యం కాదని తెలుసుకున్నాను.'

'పదకొండు నెలలైన తరువాత నేను ఆ గుహ నుంచి బయటికి వచ్చాను. అప్పుడు జూలై 27 వ తారీఖు సాయంత్రం 5 గం॥లు. మొదటి వారంలో ఎండ చూడవద్దని అన్నారు గురూజీ. బాహ్య ప్రపంచానికి అలవాటుపడడం చాలా కష్టమైంది. ఏదో కొత్త ప్రపంచానికి వచ్చినట్లు ప్రతిదీ నాకు ఎంతో కష్టమైంది. మొదట్లో నగరానికి వెళ్లినప్పుడు వీథిలో ఒక వైపు నుంచి మరో వైపుకి దాటడానికి సుమారు 40 నిమిషాలు పట్టింది. ఎందుకంటే బాహ్య ప్రపంచంలోని పనులకు నేనింకా అలవాటు పడలేదు. క్రమంగా ఈ ప్రపంచానికి అలవాటుపడ్డాను. బాహ్య ప్రపంచ విషయానికి వస్తే నేను నా అంతర్ శక్తినీ, వాక్కునీ, ఉద్వేగాలనూ, ఆలోచనల్నీ, నా ప్రవర్తననూ పరీక్షించుకోగల విశాలమైన రంగస్థలం ఈ బాహ్య ప్రపంచమేనని నేనర్థం చేసుకున్నాను.'

'ఈ శిక్షణ పూర్తి కావడంతోనే నేను పశ్చిమ దేశాలకి రావడానికి సిద్ధమయ్యాను. నాకు నా గురువుగారిని వదిలి ఉండాలని లేదు. కానీ ఆయన అదే కోరుకున్నారు. 'నువ్వు ఒక కార్యాన్ని పూర్తిచేయాలి. ప్రపంచానికి సందేశం ఇవ్వాలి. ఆ సందేశం మనందరిదీ, దానికి నువ్వు ఒక మాధ్యమం కావాలి.' నా గురుదేవులు తర్వాత నన్ను జపాన్ వెళ్లమన్నారు. నేను అక్కడ ఒకరిని కలుస్తాననీ వారు నన్ను అమెరికాకి తీసుకెళ్లడానికి సహాయం చేస్తారనీ అన్నారు.'

జపాన్‌కి వెళ్ళే ముందు ఖచ్చితంగా తను చేయాల్సిన కార్యక్రమ స్వభావమేమిటో అడిగారు. తాను గ్రంథాల్లో వ్రాసినట్లు ఋషుల సందేశాలను తెలియజేయాలనే విషయం తెలుసు. కానీ వందల మంది మహర్షులు ఉన్నారు, వేలాది గ్రంథాలున్నాయి. ఒక్కరినే ఎంచుకుని మరొకరిని విస్మరించడం అంత సులభం కాదు. అంతేకాక ప్రాచ్య ఆలోచనా విధానానికీ పాశ్చాత్య ఆలోచనా విధానానికీ మధ్యన గల సాంస్కృతిక అవరోధం ఆయనకు బాగా తెలుసు. దాంతో స్వామీజీ, 'నా నుండి నేర్చుకోవాలనుకున్న విద్యార్థులకు నేను ఏం నేర్పాలి? నేను హైందవ మతం గురించి చెప్పి వాళ్లను మార్చాలా? భారత దేశ సంస్కృతిని అనుసరించాల్సిందిగా కోరాలా?' అని అడిగేవారు.

సమాధానం స్వామీజీకి తెలుసు, అయినా గురువుగారిని ఆట పట్టించడానికి ఇలాంటి అవకాశం మళ్లీ ఎప్పుడు వస్తుందో తెలియదు. కాబట్టి మొత్తానికి అలా ప్రశ్నించారు. దానికి ఆయన 'పోరా, పిచ్చి తండ్రీ!' అనేవారు.

స్వామీజీ అప్పటికీ వదిలిపెట్టేవారు కాదు. 'అయితే నేనేం చెప్పాలి వాళ్లకి? పాశ్చాత్య సంస్కృతి పూర్తిగా మనకన్నా ఎంతో భిన్నమైంది. మన సాంప్రదాయంలో కుటుంబంలోని మిగతా వాళ్ల అంగీకారం లేకుండా ఎవ్వరూ వివాహం చేసుకోరు. కానీ పాశ్చాత్య సంస్కృతి స్వేచ్ఛాయుతమైన సాంఘిక జీవనాన్ని అంగీకరిస్తుంది. క్రిష్టియన్లు ఎవరినైనా పెళ్లి చేసుకోవడానికి అంగీకరిస్తారు. యూదులు కూడా అంతే. స్థిరమైన, నిశ్చితమైన పద్ధతిలో వాళ్లు దేవుణ్ణి పూజిస్తారు, మనం మనకి ఇష్టమైన పద్ధతిలో దేవుణ్ణి పూజిస్తూ జ్ఞానోదయ మార్గాన్ని ఎంచుకుంటాం. వాళ్ల దైవారాధనలో ఆలోచనా విధానంలో స్థిరమైన భావాలకి కట్టుబడి ఉంటారు. మనం స్వేచ్ఛగా ఆలోచిస్తూ సామాజిక నియమాలకి కట్టుబడి వుంటాం. ఈ రెండుదారులూ భిన్నమైనవి. ఇలా ఉంటే నేను పాశ్చాత్య సంస్కృతికి సందేశం ఎలా ఇవ్వగలను?' అని అడిగేవారు.

బాబాజీ, 'ఈ రెండూ ఒకే ప్రపంచంలో ఒకే జీవిత లక్ష్యంతో తీవ్రస్థాయిలో కొనసాగుతున్న సంస్కృతులు. ప్రాచ్య, పాశ్చాత్య సాంప్రదాయాలు రెండూ ఉన్నతమైన జీవన శైలి కోసం ప్రయోగాలు చేస్తునే ఉన్నాయి. హిమాలయ పరమగురువుల సందేశాలు సర్వకాల సర్వావస్థలకీ అనుగుణమైనవి. వాటికి పురాతన, అధునాతన, ప్రాచ్య, పాశ్చాత్య భావనలతో సంబంధం లేదు. మనం పరితపిస్తున్న మానవజాతి మహోన్నత జీవన సాఫల్యానికీ, ఆ నాగరికతకీ తీవ్ర భావాలేవీ సహాయపడవు. మానసిక బలం, చిద్విలాసం, నిస్వార్థసేవ ఇవే మౌలిక జీవన సూత్రాలు. ప్రజలు తూర్పు దేశాల్లో నివసిస్తున్నారా లేక పశ్చిమ దేశాల్లో నివసిస్తున్నారా అనేది ముఖ్యం కాదు. ముందు మనిషి మనిషిగా వుండాలి. నిజమైన మనిషి విశ్వానికి చెందినవాడు. మానవత్వాన్ని విభజించే శక్తి భౌగోళిక ఎల్లలు లేవు' అన్నారు.

బాబాజీ ఇంకా చెప్పసాగారు, 'అన్ని భయాల నుంచీ నీకు నువ్వుగా స్వేచ్ఛను పొందు!' ఇది హిమాలయ యోగులు ఇచ్చే మొదటి సందేశం. రెండవ సందేశం, నీలోని వాస్తవాన్ని తెలుసుకో. స్వతఃసిద్ధంగా ఉండి నీకు నువ్వు ఆధ్యాత్మిక బోధనలను ఎలాంటి మత, సంస్కృతులతో సంబంధం లేకుండా బోధించు. ఆధునిక విజ్ఞాన శాస్త్రానికి గనక సామర్థ్యం వుంటే అన్ని రకాల ఆధ్యాత్మిక ఆచరణలూ విజ్ఞానశాస్త్ర పరీక్షకు నిగ్గుతేలేలా చేయి.'

ఈ ఉపదేశాల్ని అందుకుని స్వామీజీ కాన్పూరు వెళ్లారు. అక్కడ డా. సునందా బాయి స్వామీజీకి టోక్యో వెళ్లడానికి టికట్ తీసుకున్నారు. అక్కడ్నించి వారు కలకత్తాకి వెళ్లి అక్కడ పశ్చిమ దేశాలకు వెళ్లడానికి 'చాత్య' ఎయిర్‌లైన్స్ ఎక్కారు. 1968 వ సంవత్సరం. ఆయన తన ప్రయాణాన్ని ఎనిమిది డాలర్లతో మొదలుపెట్టారు. ఆయన ఎంతో ఇష్టంగా ఈ విషయం మాకు చెప్పారు. ఆ రోజుల్లో భారతదేశం నుండి అంతకన్నా ఎక్కువ తీసుకెళ్లడానికి వీల్లేదు. హాంకాంగ్‌లో విమానాలు మారుతున్నప్పుడు అక్కడ టీ, బిస్కట్లు తిన్నారు. దానికి ఆయన నాలుగు డాలర్లు చెల్లించాల్సి వచ్చింది. పైగా ఒక డాలరు టిప్. మొత్తం ఐదు డాలర్లు. ఆ రకంగా టోక్యోలో మూడు డాలర్లతో దిగారు. ఎక్కడికి వెళ్లాలో తెలీదు. బాబాజీ చెప్పిన కార్యక్రమం ఎలా మొదలుపెట్టాలో తెలీదు. అయినా సరైన సమయంలో అంతా సవ్యంగానే జరుగుతుందని ఎంతో నమ్మకంగా ఉన్నారు. ఆయన గురువుగారు టోక్యోలో ఒకరు కలుస్తారనీ వారే ఆయన్ని అమెరికాకు తీసుకెళ్లడానికి సహాయపడతారనీ చెప్పారు.

ఆయన టోక్యో విమానాశ్రయంలో ఉండటం ఎంతో సందడిగానూ వింతగానూ ఉంది. తర్వాత అన్నారు, 'తెల్లటి ధోవతీ మీద కుర్తా వేసుకోని భుజాల చుట్టూ శాలువా కప్పుకుని ఉన్నాను. నేను నడుస్తున్నప్పుడు నా పావుకోళ్లు నేలమీద టక్ టక్‌మని చప్పుడు చేస్తున్నాయి. దాంతో ప్రతి ఒక్కరూ నన్నే చూడడం మొదలుపెట్టారు. నేను కస్టమ్స్ రూమ్‌లోకి నా లగేజ్ తీసుకోవడానికి వెళ్లినపుడు అక్కడి అధికారి నా లగేజ్ బ్యాగ్‌ను చెకింగ్ చేస్తుంటే మిగతా జనాలందరూ

వింతగా చూడటం మొదలుపెట్టారు. నాకు జపాన్ భాష తెలీదు. ఆఫీసర్‌కి ఇంగ్లీష్ రాదు. దాంతో మేమేం మాట్లాడుకుంటున్నామో మాకే అర్థం కావట్లేదు. నా బ్యాగ్‌లో ఆపిల్ పండు చూసి ఏదో అన్నాడు. అది దేశంలోకి తీసుకురాకూడదని అంటున్నాడో ఏమో అని నేను అనుకున్నాను. దాంతో విమానంలో నాకు అది ఇచ్చారనీ, మీరది తీసుకుంటే నాకు సంతోషమేననీ నేను చెప్పాను.

'వాళ్లల్లో ఒక అధికారికి కాస్త ఇంగ్లీష్ వచ్చినట్లుంది. నేను ఆపిల్ తీసుకోమని అనడాన్ని విని నవ్వి, 'బహుశా ఇతను వేరే గ్రహం నించి వచ్చాడేమో!' అన్నాడు. అప్పుడు ఆ ఆఫీసర్ నన్ను మీరు ఏ దేశం నుండి వచ్చారని అడిగారు. 'భారతదేశంలోని హిమాలయాల ప్రాంతం నుండి వచ్చాను' అని బదులిచ్చాను. వెంటనే ఎలాంటి ప్రశ్నలూ వేయకుండా నన్ను పంపించి వేశారు. కస్టమ్స్ చెకింగ్ అయిపోగానే ఓ విలక్షణమైన పెద్దమనిషి ఆయన దగ్గరకి వచ్చి, 'ఎక్కడి నుంచి వస్తున్నారు? జపాన్‌లో ఎక్కడుంటారు?' అని అడిగాడు. స్వామీజీ తాను భారతదేశం నుండి వస్తున్నాననీ, ఇక్కడ ఒక స్నేహితుడి ఇంట్లో వుంటానని సమాధానమిచ్చారు. దానికి ఆ మనిషి ఆ స్నేహితుడెవరని అడిగాడు. స్వామీజీ ఏం చెప్పాలో తెలీక 'బహశా అది మీరే అయి ఉంటార' ని అన్నారు.

ఈ సమాధానానికి ఆ పెద్దమనిషి అంతగా ఆశ్చర్యపోయినట్లు లేదు. ఆయన తన ఇంటికి తీసుకెళ్లాడు. ముందు రాత్రి ఒక ఋషి తన కలలోకి వచ్చి జపాన్‌కి త్వరలో మహర్షులు వస్తారనీ, వాళ్లకి కావలసిన ఏర్పాట్లు చేయమని చెప్పారనీ చెప్పాడు. అంతేకాక తన కుమారుడు హెపటైటిస్ రోగంతో బాధపడుతున్నాడనీ, డాక్టర్లు అతనిమీద ఆశ వదులుకోమని అన్నారనీ చెప్పి స్వామీజీని నయం చేయమని కోరాడు ఆ వ్యక్తి.

మొదటే ఇలా ఎవరినో ఒకరిని నయంచేసి ఆ రకంగా ప్రజల్లో అంచనాలు పెంచితే అది అద్భుతాలు చేసినట్లవుతుంది. అదే తన కార్యక్రమానికి పునాదిగా మారి తన ప్రతిష్ఠ పెరిగిపోతుంది. దాంతో తాను చెప్పేది ఆచరించకుండా అద్భుతాల పట్లే ప్రజలు దృష్టి పెడతారనీ స్వామీజీకి బాగా తెలుసు. ఏమయితేనేం, కార్యక్రమాన్ని ఇలాగే మొదలుపెట్టాలని తన గురువుగారి సంకల్పం అదే అయితే, అలానే జరగనిమ్మని అనుకున్నారు స్వామీజీ. కొన్నిరోజుల్లోనే పిల్లవాడు కోలుకున్నాడు. రోజులు వారాలుగా మారుతున్న కొద్దీ వాడి ఆరోగ్యం శక్తిసామర్థ్యాలు యథాస్థితికి వచ్చాయి.

అతిథ్యమిచ్చిన వ్యక్తి స్వామీజీ జపాన్‌కి కేవలం తన కొడుకుని కాపాడటానికే వచ్చాడని నమ్మాడు. స్వామీజీ హిమాలయాల నుండి వచ్చారు కనుక ఆయనను 'మహికారీ' ఆధ్యాత్మిక సంఘం ప్రధాన గురువు ఒకదాసన్ గారికి పరిచయం చేశాడు. ఒకదాసన్ గురించి చెబుతూ స్వామీజీ ఆయన ఎంతో గొప్ప వ్యక్తి అని చెప్పారు. అంతేకాక ధర్మమార్గాన నివసించాలని ఉద్బోధిస్తూ మానవత్వానికి ఎంతో సేవ చేసేవాడని అన్నారు. మహికారీ సంఘ సభ్యులు ఆయనను గత జన్మలో హిమాలయాలలో నివసించిన ఋషిగా భావించి ఆయనను ఒక ప్రవక్తగా చూస్తారు. స్వామీజీ జపాన్‌కి రాక ముందు ఒకదాసన్ అనేక హిమాలయ ఋషులను దర్శిస్తూ ఉండేవారు. స్వామీజీ బాబాజీ రూపం గురించి వర్ణించినపుడు ఆయన తనకు కలలో కనబడిన బెంగాలీ బాబా ఆయనేనని తెలుసుకున్నారు. ఆ గురువుగారి ఆధ్యాత్మిక పుత్రుణ్ణి కలుసుకున్నందుకు ఆయన ఎనలేని ఆనందాన్ని పొందారు. ఎంతో భక్తితో ఆ ఋషి మార్మిక బోధల్ని బోధించమని అభ్యర్థించాడు ఆయన. బాబాజీ స్వామీజీకి ఇచ్చిన పవిత్రమైన శిలను ఆయన ఒకదాసన్‌కి ఇచ్చారు. అప్పటినుండీ వాళ్లిద్దరూ కలిసి జీవించసాగారు.

స్వామీజీకీ తమ సంస్థ స్థాపకులైన ప్రియతమ గురువుకీ మధ్య గల అనుబంధం గురించి తెలుసుకున్న మహికారీ సంఘ సభ్యులు ఒకనాటి సాయంత్రం వేలాదిమందిగా స్వామీజీ దీవెనలు తీసుకోవడానికి తరలివచ్చారు. వారిపట్ల వాళ్లకి ఎంతటి గాఢమైన నమ్మకం ఏర్పడిందంటే ఆయన్ని దర్శిస్తే చాలు, అన్ని బాధల్నీ నయంచేసే శక్తి వస్తుందని నమ్మారు. స్వామీజీ, మహికారీ ఇద్దరూ అప్పుడప్పుడూ ఇతర సంస్థల్లో ఉపన్యాసాలివ్వడం ప్రారంభించారు. కానీ వస్తున్న వాళ్లలో చాలామంది తన దీవెనలు అందుకోవడానికే వస్తున్నారనీ, కొద్దిమంది మాత్రమే ఋషుల ప్రబోధం వినడానికి వస్తున్నారనీ స్వామీజీకి త్వరలోనే అర్థమైంది.

ఆ సమయంలో జపాన్ సాంస్కృతిక మార్పు సంక్షోభంలో ఉంది. వందల సంవత్సరాల నుండీ పురాతన సంస్కృతిలో భాగంగా జపాన్ ప్రజలు తమ చక్రవర్తి దైవాంశ సంభూతుడనీ, వాళ్లని గౌరవించడం తమకెంతో ఓదార్పునిస్తుందనీ నమ్మేవారు. ఇప్పుడు యువత తమ అంతర జ్ఞానాన్నీ, స్వేచ్ఛనీ అనుభవించడానికి సహాయపడే నమ్మకాన్నీ, ఆధ్యాత్మిక నిర్మాణాన్నీ కోరుతున్నారు. జపాన్‌కి సంబంధించిన ప్రత్యేక శైలితో అక్కడ అనేక సంవత్సరాలనుండీ బౌద్ధమతం కొనసాగుతోంది. ఈ బౌద్ధమతం జపాన్ దేశీయ ఆచారాలూ, నమ్మకాలూ, కర్మలతో కలిసిపోయి ప్రేమ, దయా వంటి గుణాలను నిలుపుకొంది. ఉదాహరణకి రకరకాల మార్షల్ విద్యలు వాళ్ల మతంలో అంతర్భాగమైనాయి.

శాస్త్రీయ సాంకేతిక రంగాలలో జపాన్ పశ్చిమ దేశాల కన్నా ఎంతో ముందుంది. కానీ మతం ఆధ్యాత్మిక రంగాలలో అది ఇంకా మార్గాన్వేషణ చేస్తూనే వుందనే అద్భుతమైన విషయాన్ని స్వామీజీ కనుగొన్నారు. స్వామీజీ, 'ప్రజలు ప్రగతిశీల పథంలో పయనిస్తూ అన్నిరకాల ఆటంకాలనూ అధిగమించి ఈ ప్రపంచంలో విజయం సాధించడానికి సిద్ధంగా ఉన్నారు. కానీ జీవితం అంతర్వీక్షణలోనూ, సత్యాన్వేషణలోనూ వాళ్లు తమ సొంత వారసత్వంలో నిక్షిప్తమైన గొప్ప ఆధ్యాత్మిక సంపదను ఇంకా వెలికితీయాల్సి ఉంది. బౌద్ధగురువుల, సింటో గురువుల సాంప్రదాయాలు, ప్రాచీన జపాన్ అద్భుతమైన జ్ఞానాన్ని ముందుకు తెచ్చి జపాన్ ప్రజల జీవితాల్ని సుసంపన్నం చేస్తాయని ఆశించాను. ఘనమైన సాంస్కృతిక వారసత్వం జపాన్ ప్రజల సొంతం. జపాన్ ప్రజలు వాళ్ల మతగురువులను పూజించడం మానుకుని, సత్యం కోసం స్వతంత్రంగా శోధన ప్రారంభించాలని కోరుకున్నాను. రెండవ ప్రపంచ యుద్ధం నుంచీ వాళ్లు భౌతికమైన పారిశ్రామిక ప్రగతికోసం పరితపించారు. నిస్సందేహంగా దాన్ని సాధించారు. కానీ వాళ్ల జీవితాలు దుర్భరంగా మారాయి. పని చేసే చోట ఇంటికి సంబంధించిన విషయాలు కలిగించే ఒత్తిడి, అశక్తత, సమస్యల్ని అధిగమించడానికి విజ్ఞానాన్నీ ఇతర ఆధునిక సాంకేతిక పద్ధతులనూ అనుసరించే బదులు అద్భుతాలను నమ్ముకున్నారు. కానీ జపాన్ వాసులు కష్టజీవులు, నీతిమంతులు, నిజాయతీపరులు. అది నాకెంతో ఆనందం కలిగించింది. ఏదో ఒకరోజు వాళ్లు అన్నిరకాల ఆచారాలనూ సంస్కృతులనూ ఒకేచోటుకి చేర్చడానికి కీలకమైన పాత్ర పోషిస్తారు,' అని అన్నారు నాతో.

ఒకదాసన్‌తో స్వామీజీ సుమారు ఆరునెలలు ఉన్నారు. ఈ ఆరునెల్లలో ఇద్దరు స్వాములూ ప్రాచ్య–పాశ్చాత్యాలకూ, ప్రాచీన–ఆధునికతలకూ శాస్త్ర సాంకేతికతలు–ఆధ్యాత్మికతకీ మధ్య సరైన వారధిని సృష్టించడానికి చర్చలు జరిపారు. చివరికి ఒకదాసన్‌కీ హిమాలయ ఋషుల వంశానికీ మధ్య అనుబంధం కుదర్చడానికే తాను ఇక్కడికి పంపబడ్డానని స్వామీజీ అర్థం చేసుకున్నారు. ఆ పని పూర్తయిన తర్వాత స్వామీజీ ఒకదాసన్‌కి తన గురువుగారు తనని అమెరికాలో ఋషుల సందేశాలను వెలిబుచ్చడానికి వెళ్లమన్నారని తెలిపారు. వెంటనే ఒకదాసన్ స్వామీజీ అమెరికా

వెళ్లడానికి కావలసిన ఏర్పాట్లు చేసి ఉదారంగా తగిన మొత్తంలో డబ్బును కూడా ముట్టజెప్పారు. స్వామీజీ వెళ్లిపోతూ కనీసం సంవత్సరంలో ఒకసారైనా జపాన్ వస్తానని ప్రమాణం చేశారు. ఆ ప్రమాణాన్ని వారు తాను పశ్చిమదేశాలలో ఉన్నంతవరకూ అమలుపరిచారు.

స్వామీజీ మొట్టమొదటగా అమెరికాలో హవాయిలో దిగారు. అక్కడ ఆయనకు పరిచయం ఉన్న జపాన్ దేశపు మహికారీ గ్రూప్ సంస్థ సభ్యులు ఉన్నారు. ఆయనకు వారి దగ్గరకు వెళ్లి కలిశారు. అక్కడినుండి సియాటెల్‌కీ, ఆ తర్వాత డెట్రాయిట్‌కీ వెళ్లారు. స్వామీజీ మొట్టమొదటి సారిగా ప్రజల మధ్యకు వెళ్లింది అక్కడే. అక్కడ ఉన్న డాక్టర్ల సమూహం శాస్త్ర సాంకేతికతలకూ ఆధ్యాత్మికతకీ మధ్యన ఉన్న అంతరాన్ని పూరించాలనే స్వామీజీ బోధకు ఎంతో ఉత్తేజితులైన వారు మిడ్ వెస్ట్‌లోని చర్చిలలోనూ కళాశాలల్లోనూ ఆఖరికి విశ్రాంతి ప్రదేశాల (మోటెల్స్)లో కూడా ఉపన్యాసాలివ్వడానికి కావలసిన రవాణా ఏర్పాట్లు చేశారు.

మొదట్లో ఆయన చాలా నగరాల్లో తన ఉపన్యాసాలు ఇచ్చారు. కానీ కాలక్రమేణా చికాగో, మిన్నియాపాలిస్‌లు వారి కార్యకలాపాలకి ప్రధాన కేంద్రాలుగా మారాయి. స్వామీజీ మొట్టమొదటి ఉపన్యాసం చికాగోలోని డౌన్‌టౌన్ దగ్గర పిక్ కాంగ్రెస్ హోటల్‌లో ఇచ్చారని స్వామీజీకి ఇష్టమైన పాత విద్యార్థిని మారినో పీటర్‌సన్ చెప్పారు. యూనిటీ నార్త్‌వెస్ట్ చర్చి మినిస్టర్ ఆమెను సభకు ఆహ్వానించారు. ఆమెకు స్వామీజీ ఉపన్యాసాల పట్ల అంత ఆసక్తి లేదు. చాలామందికి స్వామీజీ గురించి తెలియదు. ఆమెకి కూడా అంత ఇష్టంలేదు. దాంతో ఆమె మీటింగ్‌కి హాజరవలేదు. తర్వాత అదే మంత్రి స్వామీజీని చిన్న ఊళ్ళోని తన చర్చి ఆర్లింగ్‌టన్ హైట్స్‌లో సభ జరపవలసిందిగా ఆహ్వానించారు. మొట్ట మొదటగా అక్కడే చాలామంది స్వామీజీ విద్యార్థులుగా మారారు. మారినో కూడా వాళ్లలో ఉంది. అక్కడే ఆరోజు రాత్రి విద్యార్థిగా మారిన మరో మహిళ షేర్లీ వాల్టర్ హఠయోగంలో అక్కడ స్థానికంగా శిక్షణనిస్తోంది. అయితే స్వామీజీ ఆమెను తన ఇంట్లోనే యోగా తరగతులు నిర్వహించమని ప్రోత్సహించారు. అంతకు ముందే ఆమె అక్కడ కూడా తరగతులు చెబుతూ ఉండేది. వీరి మార్గదర్శకంలో షిర్లీ, ఆమె సోదరి లిండా తమ మొట్టమొదటి యోగా కేంద్రాన్ని అక్కడ ఏర్పాటు చేశారు. అధికారికంగా స్వామీజీతో అనుబంధం ఉన్న మొట్టమొదటి యోగా బృందం ఇది. అక్కడ ఆయన చాలామందిని ఆకర్షించడంతో త్వరలోనే ఆ బృందం పెరిగిపోయింది.

ఆ రోజుల్లో స్వామీజీ నిరంతరాయంగా ప్రయాణిస్తూ యోగా తరగతులు భోదిస్తూ ఎడతెరిపి లేకుండా ఉపన్యాసాలు ఇస్తుండేవారు. ఆయన వంట తరగతులు కూడా బోధించారు. విశ్వవిద్యాలయాల్లో, హాస్పిటల్స్‌లో ఆయన ఆధ్యాత్మికతలో ఉండే శాస్త్రీయ కోణం, సంపూర్ణ ఆరోగ్యం, ఏకాగ్రత ప్రభావం, అంత:స్రావ గ్రంథుల సడలింపు ధ్యానం, నాడీ వ్యవస్థ వంటి విషయాలమీద మాట్లాడేవారు. ఆ సందర్భంలో వత్తిడిని తగ్గించడానికి ధ్యానం ఎలా ఉపయోగపడుతుందో వ్యక్తిలో స్వస్థత చేకూర్చే అంతర్గత నివారణశక్తికి అదెలా దోహదపడుతుందో చెప్పేవారు.

యూనిటీ, యూనిటేరియన్ చర్చి ఇంకా మరికొన్ని మత విశ్వాస సంస్థల ఆహ్వానం మేరకు ఆయన 'ఆధ్యాత్మికత–అన్ని ఆచారాల సమగ్ర స్వభావం' అనే అంశం మీద మాట్లాడుతూ, 'వీళ్లే కనుక ప్రపంచంలోని గొప్ప సాంప్రదాయాల మధ్య ఉన్న అంత:సంబంధాన్ని కనుక్కోలేకపోతే ఎవ్వరితోనూ ప్రశాంతంగా జీవించలేరు. మీరు వివిధ కుటుంబాలను ఒకేచోట వుంచగలిగే పవిత్ర బంధాన్ని చూడలేకపోతే, మీరు మీ కుటుంబంలోనే ప్రశాంతంగా ఉండలేరు. ఈ పవిత్రబంధం, ఈ పవిత్ర సంబంధమే మీలో ఉన్న దైవత్వం. ఈ దైవత్వం నిరంతరాయమైనదీ, శాశ్వతమైనదీ. అది క్షయం లేనిది, నాశనం కానిది,' అన్నారు.

హిందూ దేవాలయాలలో వారు ఉపన్యాసాలిస్తున్నప్పుడు స్వామీజీ తరచూ కాస్త వింతగా వాళ్లను రెచ్చగొట్టే ధోరణిలో మాట్లాడుతూ ఉండేవారు. 'మీరు అమెరికాలో ఉన్నప్పుడు మీ పిల్లలను హిందువులుగానో లేక భారతీయులుగానో పెంచలేరు. ఎందుకు వాళ్ల మెదళ్లను గందరగోళంతో నింపుతారు? వాళ్లతో మీరు 'మేము భారతీయలం' అని తెలిపేలా భారతీయులుగా ప్రవర్తించండి! భారతీయ సంస్కృతిని ఆచరించండి! కానీ వాళ్లు మిమ్మల్ని, 'భారతీయత అంటే ఏమిటి? భారతీయ సంస్కృతి అంటే ఏమిటి?' అని మిమ్మల్ని అడిగినప్పుడు వాళ్లకి సమాధానం చెప్పడంలో విఫలమౌతారు. మీకు మీ ఆచారాలను పాటించడానికి సమయం లేదు, శ్రద్ధా లేదు. అయినా మీ పిల్లలకి వాటి గురించి ఏమీ తెలియక పోయినా వాటిని ఆచరించాలని మీరనుకుంటారు. పిల్లలు చాలా తెలివిగలవాళ్లు. మీరు గనుక వాళ్ల మెదళ్లను మీ పాతకాలపు పక్షపాతాలతోనూ, విభేదాలతోనూ పాడు చేయకుండా వుంటే వాళ్లు మంచి మానవత్వంతో వికసిస్తారు.

వైఎంసీఏలు, వైడబ్ల్యూసీఏలు, కొన్ని యోగాకేంద్రాలలో ఆయన వైఖరి కాస్త భిన్నంగా ఉండేది. అక్కడ ప్రాథమికమైన యోగా సూత్రాలను ముఖ్యంగా శారీరక భంగిమల గురించి మాట్లాడారు. ఐతే హఠయోగ నిర్వహణ తరగతుల్లో ఆయన తత్వశాస్త్రాన్నీ, ఆధ్యాత్మికాన్నీ పరిచయంచేసి యోగ అనేది కేవలం శారీరక దారుఢ్యానికే అనే తప్పుడు అభిప్రాయానికి రాకూడదని నిర్థారించారు. హఠయోగం అనేది శారీరక, మానసిక శ్రేయస్సు కోసం, ఆధ్యాత్మిక జ్ఞానం కోసం ఆచరించే విస్తృతమైన కార్యక్రమమని ఆయన ఎప్పుడూ నొక్కి చెప్తుండేవారు. ఆయన నిర్వహించే ప్రతి హఠయోగ తరగతి ధ్యానంతో ముగిసేది. ప్రతి తరగతిలో మహర్షుల బోధనలు సమగ్రంగా బోధించడం ఆయన లక్ష్యంగా ఉండేది.

వీరి బోధనలకూ, వర్క్‌షాప్స్‌కీ హాజరైన ప్రతి ఒక్కరూ స్వామీజీ తనతోటే ప్రత్యేకంగా మాట్లాడుతున్నారని బలంగా భావించేవారు. చివరగా ఆయన 'ఇప్పుడు నేను మీ ప్రశ్నలకు సమాధానం చెబుతాను. ఎవరికైనా ప్రశ్నలున్నాయా?' అనడిగేవారు. ఆయన సమాధానాలు నేరుగా ఒకొక్కసారి మరింత నేరుగా సులభంగా ఉండేవి.

ఉదాహరణకి ఒకసారి ఓ మహిళ 'స్వామీజీ నా మెదడు విపరీతమైన వత్తిడికీ సంఘర్షణలకీ లోనై కల్లోలంగా ఉన్నప్పుడు నేను నా మనసు చెప్పిన మాట వినాలా లేక సమస్యలకి మూలకారణమైన పరిస్థితితో పోరాడాలా?' అని అడిగింది.

అధికారస్వరంతో స్వామీజీ గట్టిగా మందలిస్తూ, 'నిన్ను నువ్వు తీర్చిదిద్దుకో! నీ భర్త మంచివాడు. ఎందుకు ఆయనను నొప్పించి నువ్వు బాధపడతావు? ఇతరుల్ని నిందించకు. నిన్నూ, నీ భర్తనీ, నీ పిల్లల్నీ సంరక్షించుకో' అని వెంటనే ప్రేక్షకుల వైపు చూసి, చిరునవ్వు నవ్వుతూ ఆమెనే చూపిస్తూ 'ఆమె నాకు బాగా తెలుసు. ఆమె నా కూతురు. ఆమె అంటే నాకెంతో ప్రేమ,' దాంతో ఆ మహిళ తత్తరబాటు కొంతమేరకు ఉపశమించింది, కానీ దిగ్భ్రమకు లోనయింది, ఆమె ఎప్పుడూ స్వామీజీని కలవలేదు, అయినా ఆమె వ్యక్తిగత జీవితంతో ఎంతో పరిచయం ఉన్నట్లుగా మాట్లాడారు. ఉపన్యాసం చివరలో ప్రేక్షకుల మధ్య నుంచి వెళిపోతూ, స్వామీజీ ఆమె తలపై చేయివేసి ప్రేమతో, 'ఒకసారి నన్ను కలుసుకో, నీకు సహాయపడతాను.' అన్నారు.

ఇలాంటివి సర్వసాధారణంగా జరుగుతుండేవి. వంద సంఘటనల్లో ఇది ఒక ఉదాహరణ మాత్రమే. ఒక్కోసారి ఎలాంటి ప్రశ్న అడగకపోయినా స్వామీజీ దృష్టిని తమ వైపు తిప్పుకోకపోయినా, స్వామీజీ వాళ్లను చూసి 'మీ అబ్బాయి గురించి దిగులు పడకండి. అతని గురించి నేను ప్రార్థిస్తాను, అతనికి నయమవుతుంది' అని అనేవారు. లేదా 'ఊరికే కాలక్షేపం చేయకండి. ప్రాక్టీస్ మొదలు పెట్టండి. మీకు సమాధానం దొరుకుతుంది.' లేదా, 'కీళ్లనొప్పులతో సంబంధం లేదు. ఒకసారి దంతవైద్యుణ్ణి కలవండి. సమస్యంతా మీ చిగుళ్లలోనే ఉండవచ్చు.' అనేవారు.

ఇలాంటి అనుభవాలు పొందిన వందలాదిమంది ఆయనను అద్భుతం అని అంటారు. నేను ఎప్పుడైనా వాటి గురించి స్వామీజీతో మాట్లాడడానికి ప్రయత్నిస్తే ఆయన మామూలుగా 'నేను నా గురువుకి అనుచరుణ్ణి మాత్రమే!' అని అనేవారు. మరో సందర్భంలో మరింత వివరంగా సమాధానం ఇచ్చారు, 'నేనేం చేస్తున్నాను? ఏమీ చేయడం లేదు. నేనొక ఉపకరణం, అంతే! నన్ను ఇక్కడికి పంపించింది నా గురువుగారు. నేనిక్కడ విద్యార్థులనీ, స్నేహితులనూ కలుస్తానని చెప్పారు. ఇక్కడ నాకోసం ప్రతీదీ ఆయనే ఏర్పాటు చేశాడు. ప్రజలు వాళ్లకున్న కష్టాల్లో భాగంగా నాదగ్గరకి వచ్చారు. మొదట్లో వాళ్ళెవ్వరూ నాకు తెలీదు. నేను మాట్లాడటం వాళ్లకు నచ్చింది. నేనెవరో అంతగా తెలీని వాళ్లు నా సభలను ఎన్నింటినో నిర్వహించారు, వార్తా పత్రికలు కూడా నా పనిని ఇష్టపడ్డాయి. నాకు నా గురువు గురించి తెలియకపోతే ఇదంతా అద్భుతమే అని నేనూ అనుకునేవాణ్ణి!' అన్నారు.

స్వామీజీ జీవిత చరిత్ర రచయితగా నాకు అర్థమైంది ఒకటే, ఆయన జీవితంలోని ఈ ఆధ్యాత్మిక ప్రచారదశ ఒక అద్భుతమైన దశ. ప్రజలు అపురూపమైన మార్గాల ద్వారా ఆయనను తెలుసుకునేవారు. ఒకసారి ఆయనను కలుసుకున్న తరువాత ఆయన తమని విలక్షణమైన మార్గంలోకి రూపాంతరం చెందిస్తున్నారని వారు అర్థం చేసుకునేవారు. తన దగ్గరకి వచ్చిన వారి అంతర్గతశక్తి స్వామీజీకి అర్థమయ్యేది. వాళ్లు అడగకుండానే వాళ్లకి ఏం కావాలో అది చేసిపెట్టేవారు ఆయన. ఆయన్ని ఒక్కసారి కలిసినవారు, వారిని కలిసి అభ్యసించి సాధన చేసినవారు, వారిని కలిసి అధ్యాపకులుగా మారినవారు, ఈ ప్రచార కార్యక్రమానికి సహాయంచేస్తూ ఉన్నవారందరికీ ఈ అనుభవం ఉంది.

స్వామీజీ రాత్రింబవళ్లూ పనిచేసేవాళ్లు. చాలామందికి ఆయన ఎల్లవేళలా తన గురువుగారితో కలిసి ఉంటున్నారని స్పష్టమైంది. తన దగ్గరికి వచ్చినవాళ్లకి బోధించడం, మార్గదర్శకత్వం వహించడం తప్ప ఆయనకు వేరే అవకాశంలేదు. ఏదైనా ఒకరోజు మామూలు కన్నా కొద్ది గంటలు ఎక్కువగా విశ్రాంతి తీసుకోవాలనుకుంటే అందుకు వాళ్ల గురువుగారు అనుమతించేవారు కాదు. కొన్ని సంవత్సరాల తర్వాత హొసెన్‌డాల్‌లో ఉపన్యసిస్తూ స్వామీజీ ప్రేమతో తన గురువుగారిని బానిస చోదకుడూ అని సంబోధించి ఈ క్రింది కథ చెప్పారు.

స్వామీజీ ఉపన్యసించవలసిన మిన్నియాపోలిస్‌లోని ఒక హోల్‌లో విశ్రమిస్తున్నారు. ఆ కార్యక్రమం ఊపిరి సలపనంతగా మారి ఆలస్యమయింది. అందులోనూ వారికి కాస్త జ్వరంగా కూడా ఉంది. అరగంట ముందు స్వామీజీ విద్యార్థుల్లో చర్చ జరిగి దాని పర్యవసానంగా స్వామీజీ విశ్రాంతి తీసుకోవాలనీ, ఉపన్యసించడానికి ఆయన స్థానంలో ఒక శిష్యుడిని పంపాలనీ నిర్ణయించారు. చివరికి స్వామీజీ ఒక శిష్యుణ్ణి ఉపన్యసించమని చెప్పి తను వెళ్లి పడుకున్నారు.

ఆయన ఒకవైపు ఆనుకుని కొన్ని నిమిషాలు విశ్రమించగా ఏదో తన చెవిలో పాకుతున్నట్లనిపించింది. ఆయన శిష్యుడు ఆయన పడుకున్న పరుపుని తనిఖీ చేసి ఏమీ లేదని నిర్ధారించాడు. సరే అని స్వామీజీ మళ్లీ పడుకున్నారు. కానీ మళ్లీ అదే రకమైన భావన కలిగింది ఆయనకు. మళ్లీ పరుపునీ, దిండునీ, దిండు గలీబునీ అన్నిటినీ వెతికి చూశారు. మళ్లీ ఏమీ కనబడలేదు. ఇలా కొన్నిసార్లు జరగ్గా స్వామీజీ శిష్యుడు హోటల్ హౌస్ కీపింగ్ బాయ్‌ని పిలిచి పరుపు దిండూ దుప్పటీ అన్నిటినీ మార్చమన్నాడు. అన్నీ మళ్లీ మార్చబడ్డాయి. అయినా సరే, పడుకోగానే ఏదో తన చెవిలో ప్రాకుతున్నట్లు ఆయనకు అనిపించేది. అప్పటికి ముప్పై నిమిషాలు అయిపోయింది.

ఆయన సహాయకుడు ఎక్కువసేపు విమానంలో ప్రయాణించడం వల్ల ఆ శబ్దం ఇంకా చెవిలో మారుమ్రోగుతునే ఉండి ఉంటుందని అన్నాడు. ఆయన దగ్గర ఒక ఇయర్ ఫోన్స్ సెట్

ఉంది. అవి పెట్టుకుంటే కాస్త ఉపశమనం కలుగుతుందని సలహా ఇచ్చాడు. స్వామీజీ అవి పెట్టుకోగానే ఆ ప్రాకే శబ్దం మరింత ఎక్కువగా వినబడటం మొదలైంది. ఆయన ఒక్కసారిగా వాటిని విసిరేసి 'అది దాంట్లోనే ఉంది! ఇప్పుడది...దాంట్లోనే...ఆ ఇయర్‌ఫోన్స్‌లోనే ఉంది!' అని అరిచారు.

'లేదు స్వామీ! దాంట్లో ఏమీ లేదు మీకే ఏదో అయింది!' అని ఆ సహాయకుడు అన్నాడు. స్వామీజీ దాన్ని తనిఖీ చేయవలసిందని గట్టిగా చెప్పగా ఆ యువకుడు దాన్ని బల్బ్ క్రింద పెట్టి చూసి ఆశ్చర్యపోతూ 'మీరన్నది, నిజమే దీంట్లో చిన్న పురుగు ఉంది, కానీ ఆదెలా సాధ్యం?' అన్నాడు.

స్వామీజీ లేచి పసిపిల్లాడిలా అరుస్తూ, 'నాకు తెలుసు నేను మీకు బానిసని! ఇక నేనే వెళ్తున్నాను ఉపన్యసించడానికి!' అంటూ లేచి ముఖం కడుక్కుని తల దువ్వుకుని శాలువా భుజాలపై వేసుకుని హాల్లోకి వెళ్లి ఉపన్యసించారు.

తర్వాత భారతదేశంలో వారి గురువుగారిని కలుసుకున్నప్పుడు, బాబాజీ, 'నీకు సోమరితనం లేకుండా చేసి నువ్వు నీ పని ముగించేటట్లు చేస్తాను. అందుకు నేను అవసరమైతే ఓ పురుగుగానైనా మారతాను!' అని అన్నారు.

అధ్యాయం 8

# ఆధ్యాత్మికత-విజ్ఞానం

'ఆత్మ జ్ఞానం పొందడమే మహర్షుల జీవన పరమావధి. అదే వారి జీవన సందేశం. 'ఆత్మ ప్రజ్ఞ' అంటే ప్రతి స్థాయిలోనూ మనల్ని మనం తెలుసుకోవడం! మన శరీరం, శ్వాస, మనసు, ఆత్మ, అంతర్గతంగా ప్రతి స్థాయిలోనూ మనకి మనం తెలిసి ఉండడం! మన గురించి మనం ఎంత బాగా తెలుసుకుంటే, మన చుట్టూ ఉన్న ప్రపంచం మనకి అంత బాగా అర్థమవుతుంది. మన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని మనం ఎంత బాగాగా అర్థం చేసుకోగలిగితే, ఈ ప్రపంచం గురించిన మన ఊహలు, అంచనాలు అంత ఖచ్చితంగా ఉంటాయి. అప్పుడు మనకు నిరాశ చెందే పరిస్థితులు అతి తక్కువగా సంభవిస్తాయి. ఆత్మ ప్రకాశం లేకపోవడంతో మన గురించి మనం వేసుకునే అంచనాలూ తప్పే అవుతాయి, అలాగే మన చుట్టూ ఉన్న ప్రపంచం గురించి మనం వేసే అంచనాలూ తప్పే అవుతాయి. ఇది మనల్ని దు:ఖానికి గురి చేస్తుంది. దు:ఖంలో ఉన్న వ్యక్తి ఉన్నత స్థితికి చెందిన సత్యాన్ని గుర్తించలేడు. అందువల్ల, మనం ఉన్నత స్థితికి చెందిన సత్యాన్ని అనుభూతి చెందాలనుకుంటే, మనకి మనంగా దు:ఖకారక స్థితిని సృష్టించుకోకూడదు. అది మనమంతా చేయగలం.'

1963–1968 మధ్య స్వామీజీ భారతదేశంలో ఎలా బోధించేవారో, అమెరికాలో కూడా అలాగే బోధించేవారు. ఆయన బోధ ఆరోగ్యం, ఆధ్యాత్మికత దిశగా నడిచేది. భారతీయులు స్వామీ రామ ను పవిత్రమైన గొప్ప 'స్వామీజీ' గానూ, హిమాలయ సాధువుగానూ, ఒకప్పటి శంకరాచార్యగానూ చూస్తారు కాబట్టి ఆయన బోధను ఎంతో గౌరవంగా వింటారు. యోగ సాధన ఎంత మహిమాన్వితమైనదో అప్పుడప్పుడూ ఆయన ప్రదర్శనలు నిరూపించేవి. దానితో అమెరికాలో స్వామీజీకి ఎంతో గౌరవం లభించింది. కానీ ఆ ప్రదర్శనలు భారతీయ శ్రోతల్ని ఆయన బోధలు అనుసరించేలా చేయలేకపోయాయి. ముందు నుంచీ స్వామీజీని ఒక గొప్ప సాధువుగా భావించిన వారి మనసులు కేవలం ఆయన బోధలు వినడం, ఆయన శిష్యులుగా గుర్తింపు తెచ్చుకోవడంతోనే ఆనంద సాగరంలో మునిగిపోయాయి. కొంతమంది శిష్యులు ఆయన్ని 'భగవంతుని సాక్షాత్తు రూపం'గా మాత్రమే కాక ఇంకా వేరు రూపాల్లో కూడా గుర్తించారు. కేవలం ప్రొఫెసర్ ఆర్.ఎస్. టండన్, మరి కొద్దిమంది స్వామీజీతో కలిసి కాఫీ త్రాగేవారు, పేక ఆడేవారు, జోక్స్ చెప్పేవారు. బాగా పొద్దు పోయిన తర్వాత స్వామీజీ వారిని వెళ్లి విశ్రాంతి తీసుకోమని చెప్పేవారు. మర్నాడు వారికి క్లాసు తీసుకోవడానికి తనకి కూడా కొంచెం నిద్ర

అవసరమని చెప్పేవారు. ఆధ్యాత్మిక భావనల్ని పాశ్చాత్య దేశాల వారికి ఆకర్షణీయంగా అందించడంలో ఒక సమగ్రమైన వ్యవహారశైలి ఉండేది వారికి. వారు స్వామీజీని చూసే భావనకీ, భారతదేశంలో స్వామీజీని చూసే భావనకీ మౌలికంగానే ఎంతో మార్పు ఉండేది. ఎంతోమంది పాశ్చాత్యులకి పదార్థగతమైన విజయాలకి గల పరిమితులు అర్థం కావడం వల్ల వారు జీవితాన్ని సార్థకం చేసుకునేందుకు నవీన మార్గాలను అన్వేషించడం మొదలుపెట్టారు. ప్రాచ్య భావనలు సాధకుల అంతర్గత అభివృద్ధికీ, ఆనందానికీ తోడ్పడేందుకు ఉపకరించేవి.

అమెరికా సంస్కృతి స్వామీజీని ఒక వ్యక్తిగానూ, గొప్ప సాధువుగానూ కూడా గుర్తించింది. అమితమైన భక్తి ప్రపత్తి భావనకి బందీలైపోకుండా అమెరికన్లు స్వామీజీని ఆ క్షణంలో ఎలా ఉండేవారో అలాగే స్వీకరించేవారు. భారతదేశంలో శిష్యుల్లా కాకుండా వారు అతి సూక్ష్మమైన అంశాల్ని గమనించగలిగేవారు. ఉదాహరణకి, 1970లో చికాగోలో ఉన్న విద్యార్థులు, స్వామీజీ ఆధ్యాత్మిక సాధనలో ఎంతో ఉన్నత స్థాయించినా గానీ, ఆయన చాలా వ్యావహారికమైన వ్యక్తి అనీ, వాస్తవికంగా ఉంటారనీ చెప్పుకునేవారు. ఎంత జ్ఞాని అయినా, ఆయన విద్యార్థులు నేర్చుకోవాలని కోరుకున్న విషయాన్నే బోధించేవారు. గొప్ప జ్ఞానం, ఆధ్యాత్మిక శక్తి ఉన్న స్వామీజీని వారెంతో ప్రేమించేవారు. ఆయన వారితో ఎల్లప్పుడూ నవ్వుతూ, ఛలోక్తులు వేస్తూ ఉండేవారు.కానీ వారి దైనందిన జీవితాలు, నిత్యకృత్య వ్యవహారాలూ ఎలా నడుస్తున్నాయో కూడా ఆసక్తిగా అడిగి తెలుసుకునేవారు. స్వామీజీ మొదటిసారి అమెరికాకి వచ్చినప్పటి నుంచీ కొన్నిరోజుల పాటు ఎక్కడో ఒకచోట మకాం ఉండడం, చుట్టు ప్రక్కల ప్రాంతాలు పర్యటన చేస్తుండడం చేసేవారు.

అయితే స్వామీజీ 1969 శీతాకాలంలో టొపేకా, కన్సస్‌లో ఉన్న మెన్నింగర్ ఫౌండేషన్‌కి వెళ్లినపుడు మాత్రం ఈ క్రమం మారింది. దీనికి కారణం మిన్నిపోలిస్ వైద్యులు డా. డేనియల్ ఫెర్గూసన్. అటానమిక్ నెర్వస్ సిస్టమ్, గుండె, రక్త ప్రసరణ వ్యవస్థపై స్వామీజీకి గల అసాధారణ సామర్థ్యం చూసి ఆయన గొప్ప సంభ్రమాశ్చర్యాలకు గురయ్యారు. దాంతో ఆయన మెన్నింగర్ ఫౌండేషన్‌లో రిసెర్చి డిపార్ట్‌మెంట్‌లో వాలంటరీ కంట్రోల్స్ ప్రోగ్రామ్స్ హెడ్‌గా పని చేస్తున్న తన సహచరుడు డా. ఎల్మర్ గ్రీన్‌ని కలిశారు. డా. గ్రీన్ ఆలోచన, అసంకల్పిత ప్రతీకార చర్యలతో సహా శారీరిక ప్రక్రియల్ని నియంత్రించడంలో మైండ్ సామర్థ్యం, మైండ్-బాడీ రిలేషన్‌షిప్‌కి సంబంధించిన పరిశోధనలు చేస్తున్నారు. డా. ఫెర్గూసన్ ఈ హిమాలయ సాధువుని మెన్నింగర్ ఫౌండేషన్‌కి వచ్చి ప్రయోగశాల పర్యవేక్షణలో మైండ్-బాడీ రిలేషన్‌షిప్‌ని అర్థం చేసుకునేందుకు దోహదం చేసే కొన్ని యోగ సాధనల్ని ప్రదర్శించమని కోరగానే స్వామీజీ అందుకు వెంటనే అంగీకరించారు.

28 మార్చి 1969 లో ఒక వారాంతంలో డా.ఫెర్గూసన్‌తో కలిసి స్వామీజీ మొదట టోపేకాని సందర్శించారు. అక్కడికి వెళ్లిన తర్వాత డా. గ్రీన్ తన భార్య అలైస్, తన సహచరులకు స్వామీజీని పరిచయం చేశారు. స్వామీజీ వారితో మాట్లాడుతూ మొత్తం శరీరం మైండ్ కంట్రోల్‌లోనే ఉంటుందనీ, మైండ్‌లో ఏ చిన్న పిసరు భాగమూ శరీరాధీనంలో ఉండదనీ తెలిపారు. శరీరం మనసు లక్ష్యాల్ని నెరవేర్చడానికే ఉందనీ, మనసు ఆత్మ లక్ష్యాల్ని నెరవేర్చడానికే ఉందని తెలిపారు. మొత్తం శరీరం మనసు అధీనంలోనే ఉన్నా, ఎవరూ తమ మనసుల్ని గురించి పట్టించుకోక పోవడం వల్ల వారి శారీరిక క్రియలు వారి స్వాధీనంలో ఉండవు. అంతర బాహ్య వాస్తవికతల్ని అన్వేషించడానికి మనసు ఒక గొప్ప సాధనమని తెలియకపోవడం వల్ల ప్రజలకు మనసు ప్రవర్తించే తీరునీ, దానికి సంబంధించిన వివిధ రకాల సామర్థ్యాలను పెంచుకునే ప్రయత్నం చేయరు. స్వామీజీ ఈ స్టేట్‌మెంట్ ఇచ్చింది ఒక శాస్త్రజ్ఞుల బృందానికి! అదీ ఎలాంటి బృందం అంటే, ఎలాంటి ఉత్కృష్టమైన ఆధ్యాత్మిక సిద్ధాంతాలైనా అవి శాస్త్రీయంగా నిరూపింపబడితేనే విశ్వసించే

బృందం! స్వామీజీ తాను విదేశాలకు వచ్చింది శాస్త్రీయతనీ, ఆధ్యాత్మికతనీ అనుసంధానం చేయడానికేనని చాలా స్పష్టంగా చెప్పారు. స్వామీజీ తన వ్యాఖ్యల్లోని వాస్తవికతని నిరూపించే శాస్త్రీయ ప్రయోగాల ద్వారా ప్రదర్శనలిస్తూ ఆధునిక విజ్ఞానం సందిగ్ధంగా కొన్ని పరిమితులలో ఉన్న భాగాలను స్పష్టం చేయడానికి ప్రయత్నించారు. నాగరికతలో మానవత్వం తదుపరి స్థాయిని సాధించాలని కోరుకుంటే, అది ఈ పరిమితుల్ని అధిగమించాల్సి ఉంటుందని ఆయన శాస్త్రజ్ఞులతో చెప్పారు. తనకు ఎలాంటి హానీ కలగకుండా తన గుండె కొట్టుకోవడాన్ని ఆపగలనని స్వామీజీ ప్రకటించారు. ఈ ప్రక్రియని ప్రదర్శించి చూపగలరా అని మెన్నింగర్ శాస్త్రజ్ఞులు ఆయనని ప్రశ్నించారు. వారు దానికి 'తప్పకుండా! అందుకే నేను ఇక్కడికి వచ్చాను' అని చెప్పారు.

కావలసిన సరంజామా అంతా సిద్ధం చేయబడింది. స్వామీజీని ఒక ఈకేజీ మెషీన్‌కి హుక్ అప్ చేశారు. తర్వాత కాలంలో స్వామీజీ మెన్నింగర్ ఫౌండేషన్‌లో ఉన్నపుడు సెక్రెటరీగానూ, పర్సనల్ అసిస్టెంట్‌గానూ పని చేసిన డౌగ్ బోయెడ్, ఈ ప్రాథమిక ప్రదర్శనల గురించి తను రచించిన స్వామి అనే పుస్తకంలో వివరంగా వ్రాశాడు. ఈ ప్రయోగశాల సెషన్స్ జరిగినపుడు బోయెడ్ అక్కడ లేడు. డా. గ్రీన్ అతడికి స్వామీజీతో పని చేసే అవకాశాన్ని కల్పిస్తూ, ఈ ప్రక్రియ అంతా ఎలా జరిగిందో వివరంగా చెప్పారు.

బోయెడ్, 'స్వామీ రామ తన గుండెని నిలిపినపుడు ఎలాంటి ఫీడ్ బ్యాక్ రాలేదు కదా?' అని అడిగాడు.

'లేదు, ఫీడ్‌బ్యాక్ ఏమీ రాలేదు. ఆయన ఎక్స్‌పెరిమెంట్ చేసే గదిలో అన్ని పరికరాల్నీ పని చేసే కండిషన్‌లో ఉంచడం జరిగింది. ఆ తర్వాత ఆయనను కంట్రోల్ రూమ్‌లో పాలీగ్రాఫ్స్‌కి కనెక్ట్ చేయడం జరిగింది. కానీ ఆ ప్రదర్శన సాధనలాగానో లేదా ట్రైనింగ్ సెషన్‌లా లేదు. అక్కడ ఏ విజువల్ లేదా ఆడియో ఫీడ్‌బ్యాక్ సిగ్నల్స్ లేవు. పైగా స్వామీజీ నిజంగా కూడా తన గుండెని ఆపలేదు, తెలుసా! నిజానికి అక్కడ జరిగిందేమిటంటే, ఆయన గుండె చప్పుడు ఒకేసారి నిముషానికి డెబ్బై నుంచి మూడు వందల బీట్స్ వరకు వెళ్లిపోయింది. దీన్నే 'ఆట్రియల్ ఫ్లట్టర్' అని అంటారు. నిజానికి ఆయన తన గుండెని డెబ్బై సెకండ్ల పాటు రక్తం పంప్ చేయకుండా ఆపారు. కన్సాస్ మెడికల్ సెంటర్‌లో పని చేసే డా.మార్విన్ దున్నే అనే కార్డియాలజిస్టు ఈ విధమైన రికార్డుని గుర్తించి, 'ఇది రక్తపోటు పడిపోవడం, స్పృహ తప్పడం, కొన్నిసార్లు మరణం కూడా సంభవిస్తుంది.

'మీకు తెలుసా, స్వామీజీ ఆ విధంగా మూడు లేదా నాలుగు నిముషాల సేపు తన గుండెని ఆపడానికి సుముఖంగా ఉన్నారు. కానీ నేను ఆయన ఆ పని పది సెకన్లపాటు చేసినా సంతోషమేనని చెప్పాను. నిజానికి, ఆయన ఆ ప్రక్రియని ప్రయత్నిస్తానని చెప్పడం నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆయన మొట్టమొదటిసారి ఆ ప్రక్రియని సాధించడానికి మూడు రోజులు ఉపవాసం చేశారట. ఆయనికి రెండు టెక్నిక్స్ ఉండి ఉండాలి. ఆయన ప్రదర్శన చేసే సమయంలో ఆయన ఉపవాసం ఉంటానని చెప్పారు కదా, ఆయన నిజంగా ఆ సమయంలో గుండె కొట్టుకోవడాన్ని నిలిపేసి, ఈకేజీ రికార్డు ఫ్లాట్‌గా వచ్చేలా చేస్తారు. ఈ రకంగా ఆయన గుండె మీద నియంత్రణని ప్రదర్శించేసరికి నేను ఆశ్చర్యపోయాను. ఎందుకంటే, ఆ సమయంలో మేము చేయాల్సిన ప్రయోగాలన్నీ పూర్తి అయిపోయాయని నేను అనుకున్నాను. మరొక ప్రయోగం కూడా ఉందని తెలిసింది. స్వామీజీ గురించి మాకు మొదటగా చెప్పిన డాక్టర్ డాన్ ఫెర్గూసన్, మేము స్వామీజీతో కలిసి డిన్నర్ టేబుల్ దగ్గర ఉన్నాము. స్వామీజీ మాతో ఆ తర్వాతి రోజు కాన్ఫరెన్స్ రూంలో మాట్లాడాల్సి ఉంది. ఆ సందర్భంలో స్వామీజీ, డా.ఫెర్గూసన్ మిన్నియాపోలిస్‌కి విమానంలో వెళ్లడానికి సిద్ధంగా ఉన్నారు. ఆలైస్, నేను వారిని ఒక రెస్టారెంట్‌కి తీసుకుని వెళ్లాము. అక్కడ మేము విందు భోజనం లాంటిది ముగించబోతున్నాము. మా పరిశోధనకు ఆయన ఎంతటి

గొప్ప సహకారాన్ని అందించారో మేము ఆయనతో చెప్తున్నాము. కానీ ఆయన ఆశ్చర్యాన్ని వ్యక్తం చేస్తూ, 'గుండె కొట్టుకోవడాన్ని నేను పూర్తిగా ఆపలేదు. మీరు దాన్ని చూడాలనుకుంటున్నారని నాకు తెలుసు,' అన్నారు. అప్పుడు నేను 'ఏం ఫరవాలేదు, మరోసారి చేద్దురు గానీ!' అన్నాను. అప్పుడు ఆయన, 'నేను దాన్ని రేపే చూపిస్తాను!' అన్నారు. అలైస్ ఆయనకి మనం ఇప్పుడు సుష్టుగా భోజనం చేస్తున్నామనీ, ఉపవాసం చేయడం లేదనీ, గుండె సహకరించడానికి ఒప్పుకోకపోతే ఆయనకు ప్రాణగండమని చెప్పకనే చెప్పారు. అప్పుడు ఆయన 'నా గుండె నా చేతిలో బొమ్మ. నేను కావలసినట్టు ఆడుకుంటాను దానితో!' అన్నారు. చివరికి ఆయన మమ్మల్ని అందర్నీ ఒప్పించారు.

'దాంతో మేమంతా హార్ట్ కంట్రోల్ ప్రయోగం జరిపాము. స్వామీజీ పట్టుపట్టి ఒప్పించారు. ఆయన ఆ పని కొద్ది సెకండ్ల వరకే చేస్తాననీ, అంతా సవ్యంగానే ఉంటుందనీ ఆయన పదే పదే చెప్పడంతో మేమంతా ఆ ప్రయోగానికి ఒప్పుకున్నాము. మేము సాధారణ సమయం కంటే ముందుగా ఆ వేకువజామునే ప్రయోగం మొదలుపెట్టాల్సి ఉంది. ఆ ప్రయోగం చేయడానికి స్వామీజీకి వైర్లు అమర్చాలి. ఆయన ఆ సాయంత్రం ఉపన్యాసం ఇచ్చే సమయానికి మొత్తం ప్రయోగం పూర్తి అయిపోవాలి. నేను స్వామీజీతో ప్రయోగం జరుగుతున్న గదిలో ఉన్నాను. అలైస్, డేల్ డా. ఫెర్గూసన్, మెన్నింగర్ డాక్టర్ అయిన డా. సార్జెంట్‌లతో కంట్రోల్ రూంలో ఉన్నారు. గుండె పనిచేయడం ఆగినపుడు ఇంటర్‌కమ్‌లో, 'ఇక చాలు' అనే మౌఖిక ఆదేశం ఇవ్వమని స్వామీజీ అలైస్‌తో చెప్పారు. ఆ ఆదేశం స్వామీజీకి సిగ్నల్‌గా పనిచేస్తుంది. అప్పుడు ఆయన తిరిగి తన గుండెని మమూలుగా పనిచేసేలా చేస్తారు. వాళ్లు ఈకేజీ పాలిగ్రాఫ్‌ని చూడకూడదని చెప్పారు. మేం కూడా దాదాపు అందులో ఒక పది సెకన్ల పాటు ఫ్లాట్ లైన్ వస్తుందేమో అని అనుకున్నాం. అందుకే మేం 'ఇక చాలు' అని చెప్పడానికి ఆలస్యమైంది. ఎందుకంటే, వాళ్లు పాలిగ్రాఫ్‌ని చూస్తూ, స్వామీ రామ వంటి అద్భుతమైన వ్యక్తిలో నిముషానికి మూడు వందల సార్లు కొట్టుకోవడం ఎలా సంభవిస్తోందా అని చూస్తున్నారు.

'ఏం జరుగుతోందో నాకు తెలియదు,' స్వామీ రామ మౌనంగా కూర్చున్నారు. 'ఇక చాలు' అనే సిగ్నల్ ఇచ్చినపుడు ఆయన తన ఉదరాన్ని సంకోచింపజేసి, దయాఫ్రం (రొమ్ము భాగాన్ని ఉదర భాగం నుంచి వేరు చేసే కండరం)ని బిగించడం ద్వారా సోలార్ ప్లెక్సస్ (ఉదర కూటమిలోని నాడీ కూటమి) ని లాక్ చేశారు. స్వామీజీని నేను, గుండెని ఆపినపుడు ఆయన ఎలా అనుభూతి చెందారో చెప్పమని అడిగాను. అప్పుడు అలైస్ ఇంటర్‌కంలో, 'ఓ నిముషం ఇలా వచ్చి ఈ రికార్డుని చూస్తారా?' అని అడిగాడు. నేను స్వామీజీ దగ్గరకి తిరిగి వెళ్లి, 'మనం అనుకున్నట్టుగా మీ గుండె కొట్టుకోవడం ఆగలేదు. పైగా అది మామూలుగా కొట్టుకోవలసిన దాని కంటే ఐదు రెట్లు వేగంగా కొట్టుకుంది!' అని చెప్పాను. దానికి ఆయన, 'సరే, మనం ఈ విధంగా ఆపితే, అది ఇంకా ఫ్లట్టర్ అవుతూనే ఉంది,' అన్నారు. ఆయన 'ఫ్లట్టర్' అనే పదాన్ని ఉపయోగించడానికి కారణం కన్సస్ యూనివర్శిటీ కార్డియాలజీ ప్రొఫెసర్ అయిన డా. మార్విన్ డున్నే ఎలక్ట్రోకార్డియోగ్రామ్ చూసినపుడు దాన్ని 'ఆట్రియల్ ఫ్లట్టర్' అని వ్యవహరించారు. డా. డున్నే ఈ రికార్డు గురించి కొద్దిసేపు మాట్లాడుతూ, 'అయినా, ఈ మనిషి ఎక్కడ ఉన్నారు? ఆయనకు ఏమైంది?' అని అడిగారు. నేను, 'ఏమీ లేదా. మేము ఆయనకి వైర్లు తొలగించాము, ఆయన వేదిక మీదకి వెళ్లి, ఉపన్యాసం చెప్పారు!' అన్నాను.

స్వామీజీ రెండు వారాల తర్వాత ఏప్రిల్ 16 న మిన్నియాపోలిస్‌కి తిరిగి వచ్చారు. తర్వాతి ప్రదర్శనల కోసం తాను లేబరేటరీకి వస్తానని వాగ్దానం చేస్తూ డా. గ్రీన్‌కి ఒక లేఖ వ్రాశారు. ఆ తర్వాత ఆయన శ్రోతల ఆకాంక్ష మేరకు చాలా చోట్ల ఉపన్యాసాలు చేయవలసి

రావలసి వచ్చేసరికి పర్యటనలు ఎక్కువయ్యాయి. ప్రజా జీవనంలో అన్ని స్థాయిల్లోనూ ఆయనకు శ్రోతలున్నారు. విద్యార్థులు, విద్యావేత్తలు, వైద్యులు, మానసిక వైద్యులు ఇలా అన్ని రంగాలకు చెందినవారూ ఆయన వద్ద ఆధ్యాత్మిక విషయాలు నేర్చుకోవడానికి వచ్చేవారు.

వేసవి వెళ్లిపోతుండగా, డా. గ్రీన్ స్వామీజీ మెన్నింగర్‌లో వాలంటరీ కంట్రోల్స్ ప్రోగ్రామ్‌కి కన్సల్టెంట్‌గా పనిచేసే విషయంగా ఒక ఫార్మల్ మీటింగ్ ఏర్పాటు చేశారు. డా.గ్రీన్ ఇదే సమయంలో డౌగ్ బోయెడ్‌ని కొనసాగబోయే 'స్వామీ రామ ప్రాజెక్ట్'లో భాగంగా స్వామీజీకి పర్సనల్ అసిస్టెంట్‌గా ఉండమని కోరారు. ఆ సంగతంతా బోయెడ్ ఇలా వ్రాసుకున్నారు: 'నన్ను స్వామీ రామ ప్రాజెక్ట్‌లో కలుపుకోవడం నన్నెంతో ఆకర్షించింది. గత కొద్ది నెలలుగా నేను పాశ్చాత్య ప్రపంచం మీద పెరుగుతున్న ప్రాచ్య (తూర్పు) ప్రభావాన్ని గమనిస్తున్నాను. అలాగే 'నవ యుగం' గురించి తరచూ మనం మాట్లాడుకుంటున్నాం. ఇప్పుడిది తూర్పు దేశాల్లో పెరుగుతున్న పాశ్చాత్య ప్రభావంలోనూ, పాశ్చాత్య దేశాల్లో పెరుగుతున్న తూర్పు ప్రభావంలోనూ కొట్టచ్చినట్టు కనిపిస్తోంది. నేను పదేళ్లుగా ఆసియన్లతో పని చేస్తున్నాను. వాళ్లు పాశ్చాత్య విధానంలో వ్యావహారికంగా, నిత్యవ్యవహారంలో అవసరమైన సిస్టమ్స్‌నీ, నైపుణ్యాల్నీ అభివృద్ధి చేసుకోవడానికి ఎంతో ప్రయత్నిస్తున్నారు. నన్ను స్వామీ రామ ప్రాజెక్ట్‌లో కలుపుకోవడం వల్ల నాకు ఈ గ్లోబల్ ప్రోసెస్‌లో మరో కొత్త దృక్పథం మీద పని చేసే అవకాశం వచ్చిందని భావిస్తున్నాను...ల్యాబ్‌లో ఆయన సెక్రెటేరియల్ అసిస్టెంట్‌గా, ఆయన టెక్నిక్స్‌ని పరిశీలించే అవకాశం కలిగింది.'

బోయెడ్ తాను స్వామీజీ కోసం ఏ విధంగా పని చేశారో తెలియజేశారు. స్వామీజీ పరిశోధనా కార్యకలాపాలు, అపాయింట్‌మెంట్స్, లెక్చర్లు, టెలిఫోన్ కాల్స్‌కి సమాధానం చెప్పడం, డిక్టేషన్ తీసుకోవడం, రికార్డింగ్స్‌ని తిరిగి వ్రాయడం, ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం, స్వామీజీ వ్రాసిన విషయాల్ని ఎడిట్ చేయడం వంటి పనులన్నీ ఆయన నిర్వహించేవారు. పరిశోధనకి సంబంధించిన డేటా అంతటినీ రికార్డు చేయడం, వాటిలో ముఖ్యాంశాల్ని రాసి ఉంచడం చేస్తుండేవారు. ఆయన, స్వామీజీ డా. గ్రీన్ ఇంట్లోనే ఉండేవారు. బోయెడ్ స్వామీజీకి ఇరవై నాలుగు గంటలూ అందుబాటులో ఉండేవారు. ఆయన ఉద్యోగ బాధ్యతల్లో స్వామీజీ ఆర్థిక లావాదేవీల నిర్వహణ, ఏవైనా ప్రత్యేక ఆహార అవసరాల్ని ఏర్పాటు చేయడం కూడా ఉన్నాయి. 'నాకు ఈ హిమాలయ యోగి బోధలు, ప్రజ్ఞలతో బాటు ఆయనతోనూ, ఆయన ఆకర్షణీయమైన దృక్పథంతోనూ కూడా పరిచయం కలగడం నా సౌభాగ్యం,' అని వ్రాసుకున్నారు ఆయన.

9 సెప్టెంబరు 1970 నాడు స్వామీజీ టొపేకాకి వెళ్లిపోయారు. ఈసారి ఆయన ఎక్కువ కాలం ఉండడానికే వెళ్లారు. కాన్సస్ మైదాన ప్రాంతాల్లోని ప్రకృతిమాత ఈ హిమాలయ పుత్రుణ్ణి పలకరిస్తుండగా ఆయన తన గదికే పరిమితమై గడపదల్చుకోలేదు. ఇంతలో పెనుతుఫాను హెచ్చరికని తెలియజేసే సైరన్ మ్రోగసాగింది. జనమంతా తుఫాను వచ్చినపుడు తలదాచుకోవలసిన సెల్లార్‌లోకి పరుగులు తీశారు. రేడియోలో హెచ్చరికలు, సైరన్ మోతలు, పెనుగాలి సవ్వడి, వర్షపు హోరు మధ్య అలైస్ గ్రీన్ స్వామీజీని క్రిందికి రమ్మని పిలవసాగాడు. స్వామీజీ కొద్ది నిముషాలు అక్కడే ఉండి వస్తానని చెప్పారు. అందువల్ల స్వామీజీని వెంటబెట్టుకుని రమ్మని ఆమె బోయెడ్‌ని పంపారు! బహుశా స్వామీజీకి ఇది ఎంతటి అత్యవసర పరిస్థితో తెలియదని భావించింది. బోయెడ్ ఈ అత్యవసర పరిస్థితిని గురించి వివరించినా స్వామీజీ దాని ప్రాముఖ్యతని గ్రహించడం లేదు. బోయెడ్ మాతో స్వామీజీ ఏమైనారో ఇలా తెలియజేశాడు, 'ఇంకా మన పని మొదలుపెట్టనే లేదు, అప్పుడే ఈ గాలి స్వామినీ, డాక్టర్‌నీ...ఇంకా మాట్లాడితే ఎవరనైనా ఎలా వెళ్లగొట్టగలదు? అది అసాధ్యం!' అంటూ హుందాగా తన లివింగ్ రూంలోకి నడుచుకుంటూ వెళ్లి తన భుజాల మీదుగా శాలువాని కప్పుకుంటూ, తనకి ఆ గదిలో ఇష్టమైన ఒక మూలగా ఉన్న చోటులో

కూర్చున్నారు. 'అలైస్, నేను సీక్రెట్ హాల్‌లోకి వెళ్లాము. అక్కడ ఎల్మర్ అప్పటికే ట్రాప్ డోర్‌ని క్లియర్ చేసి, అప్పటికే లోపలికి మురికి చేరిందా అనే సంగతిని గమనించడానికి చిన్న సందు గుండా లోపలికి చూస్తున్నారు. స్వామీజీ వస్తారని భావించాను. కానీ ఆయన రాలేదు, నేను మళ్లీ లివింగ్ రూంలోకి వెళ్లిపోయాను. ఆయన ఇంకా మాట్లాడుతూనే ఉన్నారు. 'కష్టాలు వస్తాయి, పోతాయి. అనుకోకుండా కష్టాలు వచ్చిపడవచ్చు. కానీ భయం ఎందుకు పడాలి? విపత్తుల గురించి ఈ ప్రకటనలు ఏమిటి? ఎంతో తెలివైనవాళ్లని మిమ్మల్నందర్నీ అండర్‌గ్రౌండ్‌లోకి వెళ్లమంటూ ఈ విజిల్స్, ఈ స్పీకర్లలో అనౌన్స్‌మెంట్లు ఏమిటి?' అన్నారు. నేను తలుపు దగ్గర నిలబడి ఆయన వైపు చూశాను. ఆయనతో ఎలా చెప్పాలో తెలియడం లేదు గానీ నేను ప్రయత్నించాలి. 'ఎవరికి తోచినట్టు వాళ్లు చేసుకోండి!' అంటూ హుందాగా చేతులు ఉపయోగించకుండా, కాళ్లు ఎత్తి ఆయన పద్మాసనం భంగిమలోకి వచ్చారు. తర్వాత చేతులతో నమస్కార ముద్రలో ఉన్నారు. 'నేనిక్కడ వాస్తవికతని సంపూర్ణంగా వీక్షిస్తూ ఉండాలి,' అన్నారు. కణ్వాస  మహర్షి హిమాలయ సాధువుని నమస్కరించిన విధం, హిమాలయ సాధువు కణ్వాస మహర్షికి తనను తాను పరిచయం చేసుకున్న విధం అది!

ఎక్కడికి వెళ్లినా స్వామీజీ వ్యక్తిత్వం అందరినీ వశపరుచుకునేది. స్వామీజీ ఆరు అడుగుల మీద అంగుళం ఎత్తులో స్ఫురద్రూపి. తల ఎత్తుకుని హుందాగా నడుస్తూ వెళ్తుంటే ఎంతో ఆకర్షణీయంగా ఉంటుంది. అయినా ఆయన చాలా స్నేహపూర్వకంగా మెలిగేవారు, ప్రజలంతా ఆయన శక్తికి ఆకర్షితులయ్యేవారు. నేను వారిని భారతదేశంలోనూ, అమెరికాలోనూ ఇరవై ఏళ్ల పాటు సేవించాను. వారి నడక, నిద్ర, ఆహారం, షాపింగ్, పని చేసే విధానం, ఆడే తీరు, ఇతరులతో మెలిగే తీరు, పాలనా సంబంధమైన విధానాల్లో వ్యవహరించే తీరు మొదలైనవన్నీ దగ్గరగా చూశాను. వారి అభిరుచుల్ని పరిశీలించాను. ఒక్కోసారి ఆయన వాటిని గాఢంగా కోరుకునేవారో, మరి కొన్నిసార్లు వారు వాటిని ఎలా విదిలించి కొట్టేవారో నేను చూశాను. ఆయన ఏం చేసినా అందులో ఆయన నైపుణ్యం కనిపించేది, ఆయనదే పైచేయిగా ఉండేది. ఆయన అన్ని విషయాల్నీ చాలా ముక్తసరిగా, ఎంతో ప్రతిభావంతంగా నిర్వహించేవారు. ఆయనకు తానే వంట చేసుకునేవారు, శుభ్రం చేసుకోవడం, బట్టలు ఉతుక్కోవడం చేసేవారు. తన పక్క తనే వేసుకునేవారు. తన శిష్యులకు ఆయన ఈ విషయాల్ని బోధించేవారు కూడా. ఉదాహరణకి, ఆయన వంట చేయడం గురించి తన శిష్యులకు క్లాసులు ఇచ్చేవారు. నీరు వృథా చేయకుండా పాత్రలు కడిగే విధానం నేర్పించేవారు శిష్యులకి. కానీ తన స్వంత అవసరాలు తీర్చుకోవలసి వచ్చేసరికి ఆయన కొన్నిసార్లు పొందే వైఫల్యాలు సరదాగా నవ్వు తెప్పించేలా ఉంటాయి.

బోయెడ్ ఇలాంటి లక్షణాలు చాలా గమనించాడు. ఆయన స్వామీజీ గురించి ఇలా వ్రాశారు. 'గ్రీన్ ఇంట్లో స్వామీ రామతో ఉండడంలో నా జీవన విధానంలో ఎన్నో చెప్పుకోదగ్గ మార్పుల్ని తీసుకొచ్చింది. నేను ఈ విషయాన్ని స్వామీజీ వచ్చిన రోజే గ్రహించాను. దాదాపు ఐదున్నర ప్రాంతంలో ఆయన నా బెడ్‌రూం తలుపు తట్టి, 'హేయ్, డగ్లస్! ఓ కప్పు చాయ్ ఇస్తావేమిటి?' అని అడిగారు. స్వామీజీకి టీ తయారు చేయడం నా నిత్యకృత్యంలో ఒక ముఖ్యమైన కార్యక్రమంగా రూపొందింది. స్వామీజీ ఆ దరిదాపుల్లో ఉన్నారంటే క్షణాల్లో నేను వేడిగా టీ గానీ, పాలు గానీ ఇవ్వడానికి సిద్ధంగా ఉండాలి. స్వామీజీ దాన్ని 'టిల్క్' అంటూ ఉండేవారు. టీ ఒక పెద్ద గ్లాసులో ఇవ్వాలి. అందులో టీ డికాక్షన్ చాలా చిక్కగా ఉండాలి. డికాక్షన్‌తో సమపాళ్లలో పాలు కూడా వేయాలి. కొన్ని స్పూన్ల తేనె దానికి కలపాలి...నేను అలారం హెచ్చరికల్ని పట్టించుకోకుండా ఉండగలనేమో గానీ, చురుగ్గా ఉండే స్వామీజీ గొంతుని పట్టించుకోకుండా ఉండడం కుదరదు. నన్ను వేకువ జాముల్లో ఇబ్బంది పెట్టకుండా ఉండాలంటే స్టవ్ నాబ్స్‌ని ఎలా

తిప్పాలో చెప్పడంతో సహా టీ తయారు చేసే విధానాన్ని సొంతంగా చెప్తే సరిపోతుందని ఒకసారి నాకు ఆయన చెప్పారు కూడా. స్వామీజీ నిరంతరం తన ప్రజ్ఞని వికసింపజేసుకుంటూ ఉంటారు కాబట్టి నేను ఆయనకు ఆ ప్రక్రియ అంతా తెలియజేశాను. కానీ ఆయన వేకువ సమయాల్లో మేలుకున్నపుడు నేనే టీ తయారు చేసి ఇవ్వడానికి ఇష్టపడేవాడిని.

'అనియంత్రిత ప్రక్రియ' ల మీద అసాధారణమైన పట్టు సాధించిన ఈ యోగ సాధువు, టీ వంటి సాధారణమైన విషయాలకి ఇంతగా ఎలా అలవాటు పడ్డారనే విషయంగా నాకు చాలా ఆశ్చర్యంగా ఉండేది మొదట్లో. 'కానీ ఆయన పుట్టింది, పెరిగింది భారతదేశంలో' కదా! అక్కడి అలవాట్లు సహజంగానే వస్తాయని గ్రహించాను. ఆయన ఖచ్చితంగా అలాగే ఉండాలని పట్టుపట్టలేదు. కానీ ఆయన పట్ల అంకితభావం, సేవాతత్పరత కలిగిన శిష్యులు ఆ విధంగానే వ్యవహరిస్తారు. స్వామీ రామ దక్షిణ భారతదేశంలో శంకరాచార్యగా ఉన్నారు. అందువల్ల వారు సన్యాసుల్లో కూడా ఎంతో పేరుప్రతిష్ఠలు కలిగినవారు. భారతదేశంలోని హైందవ సంప్రదాయానికి చెందిన ధార్మిక, ఆధ్యాత్మిక నాయకుల్లో 'శంకరాచార్య' అత్యంత ప్రతిష్ఠాకరమైన స్థాయి.

'నాకు తెలిసి 'స్వామీ రామ' ఒక్కరికే ఈ స్థితిలో ఉండడం కంటే తప్పించుకుని బయట పడడం అవసరమనిపించి ఉంటుంది. ఎందుకంటే, వారు నాతో ఒకసారి మాట్లాడుతూ, 'ఈ స్థితిలో ఉండడం బంగారు పంజరంలో చిలుకలా ఉండడమే' నన్నారు. ఒక సన్యాసి ఉత్కృష్టమైన పాండిత్యం కలిగి ఉంటే తప్ప ఉన్నతమైన పవిత్రమైన శంకరాచార్య స్థానానికి ఎంపిక చేయరు. స్వామీజీ జీవితమంతా ఉత్కృష్టమైన అధ్యయనం చేశారు. పుస్తకాల మీద నుంచి దృష్టి తప్పకుండా ఉండేందుకు ఆయన ఎన్నో రోజుల పాటు తనకు తానుగా కుర్చీకి బందీ అయిపోయేవారు. కొన్నిసార్లు నాకు ఆయన మనిషికి తెలిసే అవకాశం ఉన్న అన్ని విషయాల్లోనూ అపార ప్రజ్ఞాశాలి అని అనిపించేవారు. అధిభౌతిక శాస్త్రం నుంచి చరిత్ర, ఉద్యానవన పంటల వరకు అన్ని విషయాల పైనా నిశితంగా చర్చించేవారు. దైనందిన జీవితంలో ఆయన అవసరాల్ని ముందుగానే గమనించి వారి నోటి వెంట మాట రాకుండానే వారికి అందుబాటులో ఉంచడం జరిగేది. అందువల్ల వారికి నిత్యకృత్యంలో అవసరమైన వ్యావహారిక ప్రక్రియల్ని నిర్వహించుకోవడంలో ఏమాత్రం అనుభవం లేకపోయింది. విచిత్రంగా స్వామీజీ, ఒక వైపు గొప్ప జ్ఞానిగా ఉన్నతమైన విషయాలు బోధించేవారు, మరో వైపు ఏమీ చేతకాని అసమర్థుల్లా దిగులు చెందేవారు కూడా. టెక్నాలజీ అధికంగా ఉండే అమెరికాలో వైరుధ్యాలు, సంక్లిష్టతలు సహజంగానే ఎక్కువ. వాటితో నెగ్గుకి రావాలంటే ఒక సాధారణమైన విదేశీ కంటే కూడా ఈ హిమాలయ యోగికి మరిన్ని ఇబ్బందులు ఎదురవుతాయి. దానికి తోడు స్వంతంగా ఆయనే టీ తయారు చేసుకునే పరిస్థితి కల్పించి మరో ఇబ్బందిని కూడా జత చేయాలని అనుకోవడం లేదు నేను.

'మొదట్లో స్వామీ రామ, నేను ఉదయం వేళల్లో ఇంట్లోనే ఉండేవాళ్లం. చాలా సార్లు ఆయన నన్ను పై అంతస్తుకి వచ్చి తన గదిలో తనతో బాటు కూర్చోమని చెప్పి, తన భారతీయ సంప్రదాయ సంగీత రికార్డింగ్స్‌నీ, భక్తి సంగీతాన్నీ వినిపించేవారు...కానీ ఆయన ఎక్కువగా మౌనంగా ఉంటూ ఉండేవారు. కొన్నిసార్లు మేము ఎన్నో గంటల సేపు ఏ మాటా మాట్లాడుకోకుండా మౌనంగా ఉండేవాళ్లం. ఆయన ఎక్కువగా పద్మాసనంలో కూర్చుని అర్ధనిమీలిత నేత్రాలతో నిశ్చలంగా ఉండేవారు. వారి మెడ, వెన్నెముక మామూలు స్థితి కన్నా బాగా నిటారుగా ఉండేవి. అలాంటి సందర్భాలలో ఆయన మరింత పెద్దవారైపోయినట్టు ఉండేది, వారిని చూస్తే పూజ్య భావం కలిగేది. నేను ఏం చేసిపెట్టినా ఆనందంగా తీసుకునేవారు, అది నాకెంతో సంతోషాన్నిచ్చేది...

'డా. గ్రీన్స్ ఇంట్లో ఉండే సమయంలో వాళ్ల ఇంటికి ఎదురుగా ఒక ల్యాండ్‌స్కేప్ పార్క్ ఉంది. దాని చుట్టూ బోర్డర్‌లా అమరి ఉండేవి వీపింగ్ విల్లో వృక్షాలు. అందులో ఒక జూ, ఒక

రోజ్ గార్డెన్, ఒక గ్రీన్ హౌస్, ఒక స్విమ్మింగ్ పూల్, టెన్నిస్ కోర్టులు, పెద్ద గ్రీన్ లాన్ కూడా ఉన్నాయి. అందులో ఒక బుల్లి రైలు బెల్ మోగించుకుంటూ చెవులు గింగరాలెత్తే విజిల్ వేసుకుంటూ జనాన్ని సవారీ ఎక్కించుకుని ముప్పై ఐదు సెంట్ల కైవారంతో ఉన్న ఆ పార్కులో చక్కర్లు కొడుతుండేది. మేం మధ్యాహ్నం భోజనానికి టేబుల్ దగ్గర కూర్చునేసరికి ఈ రైలు సరదాగా విజిల్స్ వేసుకుంటూ బయల్దేరేది రౌండ్లు కొడుతుండేది. ఈ దృశ్యాన్ని స్వామీజీ ప్రతిరోజూ చూసి, ఏదో ఒక వ్యాఖ్య చేస్తుండేవారు. వీపింగ్ విల్లో వృక్షాల మధ్య తిరిగే ఆ ట్రెయిన్ వెళ్తుంటే చూడడం ఆయనకు ఆనందం కలిగించేది, ఆయన రెండు మూడు సార్లు కిటికీ దగ్గరకి పరిగెత్తుకుని వచ్చారు.

'ఒకరోజు నేను ఆయనతో మాట్లాడుతూ, 'గ్రీన్స్ తన మనుమలతో కలిసి ఆ ట్రెయిన్ ఎక్కారు. కానీ నాకు ఆ అనుభూతి దక్కలేదు' అన్నాను. ఎక్కాలని ఉండేది, కానీ ఎప్పుడూ దాని కోసం ప్రయత్నించలేదని అన్నాను. హాస్య ధోరణిలో, 'సాధకులు తమ కోరికల్ని తీర్చుకోవడం ద్వారానో లేక పూర్తిగా వాటిని తిప్పికొట్టడం ద్వారానో మోక్షం సాధించాలి కదా!' అన్నాను.

'ఈ మాటల్ని ఆయన వినడానికి సరదాగానే విన్నారు. క్షణంపాటు ఆయన ముఖం గంభీరంగా మారింది. కానీ ఆయన ఆలోచనలో పడ్డారు. ఉన్నట్టుండి ఆయన ముఖంపై చిరునవ్వు విరిసింది. ఆయన కళ్లు మెరిశాయి. 'సరే, మనం వెళ్దాం! మనం తప్పకుండా షికారు చేసొద్దాం! అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ పూర్తి చేయండి మీరు!' అన్నారు.

'యోగులకూ, ఉత్కృష్ట స్థాయిలో ఉండేవారికీ, ఎన్నో రకాల స్వభావాలు, దృక్కోణాలూ ఉంటాయి. ఎల్మర్ ఓసారి నాతో, 'స్వామిలో నడివయస్కుడు, చిన్న పసివాడు– ఈ మూడు దృక్కోణాలూ ఉన్నాయి. ఆయన మనతో ప్రజ్ఞా స్థాయిలో పెద్దరికంతో మెలగుతారు,' అన్నారు. ఇక్కడికి వచ్చిన మొదట్లో నాకు స్వామీజీలో ఉన్న ఈ ముగ్గురు వ్యక్తులూ పరిచయమయ్యారు. మౌనంగా ఆలోచించుకుంటున్నపుడూ, సాయంత్రం ధ్యాన సమయాల్లోనూ, ఆయన ఎంతో హుందాగా, వయసుమీరిన వృద్ధునిలా కూర్చునేవారు. కానీ ఎక్కువ భాగం ఆయన వెరపు, బెరుకు లేని నిర్భీతితో కూడిన జీవితాన్ని ఆనందించారు. అరుదైన కొన్ని సమయాల్లో పసివాడిలా ఉండేవారు. ఉన్నత స్థితిలో ఉన్న ఆయనలోని యోగ స్వభావం ఆయన్ని ఒక వయసుమీరిన వృద్ధునిలా నిలబెట్టినా, మా లేబరేటరీలో ప్రదర్శనలకీ, అసాధారణ యోగ సిద్ధుల్ని ప్రదర్శించడానికీ ఆయనలో ఉన్న యువకుడు ఉత్సాహపడేవాడు. ఆయనలో ఉన్న పసిబాలుడు మమ్మల్నందర్నీ ట్రెయిన్‌లో తప్పక తీసుకుని వెళ్తాడని నేను నమ్ముతున్నాను.'

ప్రతి మధ్యాహ్నమూ స్వామీజీ రెండు గంటలపాటు మానసికశాస్త్ర ప్రయోగాలకు సహకరించడానికి ఒక సౌండ్ ప్రూఫ్ లేబరేటరీలో గడిపేవారు. ఆయన్ని ల్యాబ్‌కి తీసుకుని రావడం, టేబుల్ మీద కూర్చోబెట్టడం, ఆయన అడిగినప్పుడు చాయ్ ఇవ్వడం చేసేవాడు బోయెడ్. ప్రయోగం మొదలు పెట్టే ముందు EK+ (ఎలక్ట్రోకార్డియోగ్రాఫ్), EE+ (ఎలక్ట్రోఎన్సెఫ్లోగ్రాఫ్), EM+ (ఎలక్ట్రోమియోగ్రాఫ్), ఈ మూడు మెషీన్లకీ స్వామీజీని హుక్‌అప్ చేయడం కూడా అతడే చూస్తాడు.

స్వామీజీ వివిధ ధ్యానస్థితుల్లోకి ప్రవేశిస్తుంటే పరిశోధకులు ఆయన శరీరంలో మారుతున్న వివిధ స్థితుల్ని అంచనా వేస్తుంటారు. ఆ తర్వాత ఒక పరిశోధకుల బృందం ఆ రోజంతా పాలిగ్రాఫ్ పేపర్ మీద రికార్డు చేయబడి గుట్టగా పేరుకున్న సమాచారాన్ని వ్యాఖ్యానిస్తారు.

ఈ సెషన్లు జరుగుతున్న సమయంలో మెదడునీ, నాడీ వ్యవస్థనీ రిలాక్స్ చేయడం సాధ్యమేనా అనే విషయాన్ని గమనించడానికి ఆసక్తి చూపేవారు. ఆ విధంగా వారు మైండ్‌కి పూర్తిగా విశ్రాంతినిస్తూ, అయినప్పటికీ దాన్ని నిద్రపోనీయకుండా చూడడం సాధ్యపడుతుందా? మానసికంగా సంకల్పం చేసుకుని, ఎరుకలో ఉంటూ, బాహ్య ప్రపంచం గురించిన స్పృహ కలిగి ఉంటూ కూడా బ్రెయిన్‌లో వివిధ రకాల వేవ్స్‌ని సృజించడం సాధ్యమేనా? అనే విషయాల్ని

గమనించేవారు. శాస్త్రజ్ఞులు బ్రెయిన్ వేవు పాటర్న్‌ని ఏకపక్షంగా నాలుగు బాండ్‌లుగా విభజించారు....బీటా, ఆల్ఫా, తీటా, డెల్టా. వాళ్లు పరమ ప్రశాంత స్థితి నుంచి, గొప్ప ఉద్వేగం పొందే వరకూ గల వివిధ మానసిక స్థితుల్ని ఈ నాలుగు పాటర్న్‌కీ సంబంధాన్ని అనుసంధానించారు. కానీ ఒక నిర్దిష్టమైన బ్రెయిన్ వేవు సంకల్పం మీద వెలువరించగల ఆయన సామర్థ్యాన్ని ప్రదర్శించడానికి ముందు స్వామీజీ ఆ పరికరాల గురించీ, గ్రాఫ్‌ల మీద ఆ లైన్ల ప్రాముఖ్యత గురించీ తెలుసుకుని ఉండాలి. ఉదాహరణకి, ఆయన తన మనసుని మంత్రం మీద నిలిపి ఉంచాలి. తర్వాత తాను జనసమ్మర్థం ఉన్న రైల్వేస్టేషన్‌లో రైలులో ఎక్కుతున్నట్టు ఊహించుకోవాలి. అరుస్తూ, కేకలేస్తూ, మిగతా పాసింజర్లను నెట్టుకుంటూ ముందుకు వెళ్లాలి. ఆ తర్వాత తను గంగా నదీ తీరంలో ప్రశాంతంగా కూర్చుని నది మీదుగా ఒక దట్టమైన అడవిని చూస్తున్నట్టు ఊహించుకోవాలి. ఆ సెషన్ ముగిసిన తర్వాత సైంటిస్టులు ఆయనకు గ్రాఫ్ చూపించి, ఆ ఎగుడు దిగుడుగా, ఉన్నట్టుండి పెరిగీ, తగ్గినట్టు ఉన్న ఆ లైన్స్‌ని బీటా, ఆల్ఫా, తీటా బ్రెయిన్ వేవ్స్‌తో ఎలా అనుసంధానించవచ్చో తెలిపేవారు. గ్రాఫ్‌లో లైన్ చాలా స్మూత్‌గా, అంటే ఎలాంటి వంకరలూ లేకుండా ఉంటే, అది డెల్టా వేవుకి చెందిన ఒక ప్రత్యేకమైన పాటర్న్‌ని చూపిస్తుందని చెప్పారు శాస్త్రజ్ఞులు. డైలీ సెషన్స్‌లో మరో రెండు వారాలు గడిచిన తర్వాత స్వామీజీ తను సరైన రీతిలో జరిపే ప్రయోగాలకి సిద్ధమేననీ, ఇక నుంచీ వారు తనపై ప్రయోగాలు చేయవచ్చుననీ చెప్పారు. త్వరలోనే ఆయన టెక్నాలజీ లిమిట్స్‌ని అర్థం చేసుకున్నారు. దాన్ని గురించి డౌగ్ బోయెడ్ ఇలా వివరించారు: 'స్వామీజీ త్వరలోనే తను ఇన్ని నిముషాలపాటు తీటాలోనూ, ఇన్ని నిముషాలపాటు డెల్టాలోనూ ఉండి, మళ్లీ బీటాలోకి వెనక్కి వస్తాననీ, ఇన్ని నిముషాలపాటు ఆల్ఫాలో ఉంటాననీ చెప్పేవారు, సరిగ్గా ఏం చెప్పేవారో అలాగే చేసేవారు. చివరికి ఆయనకు ఆ సాధన కూడా మెప్పించలేక పోయింది. ఒకానొక రోజు స్వామీజీ చాలా ఉత్సాహంతో తాను మా ఎలక్ట్రోఎన్సెఫ్లోగ్రాఫ్స్ కొలవలేని, రికార్డు చేయలేని అదనపు వేవ్స్ ఉనికిని ప్రదర్శించగలిగే మాధ్యమాన్ని అభివృద్ధి చేయడంలో సహకరించాలని భావిస్తున్నట్టు ఒక సూచన చేశారు. బయోమెడికల్ ఎలక్ట్రానిక్స్ లేబరేటరీలో ఎల్మర్‌తోనూ, మాతోనూ పని చేయడం వల్ల తాను మరింత సున్నితమైన పరికరాలను అభివృద్ధి చేయడానికి సహకరించగలుగుతాననీ, ఇప్పటివరకు ఆవిష్కరింపబడని వినూత్న తథ్యతలను తాను ఆవిష్కరించడంలో సాయపడతాననీ ఆయన భావించారు.

'మీకు అర్థం కావడం లేదు. అసలు ఉన్నదంతా ఇదే. మీరు ఫ్లాట్ రికార్డు నుంచి వెళ్లిపోగలుగుతారు. అంటే సెకండుకి జీరో సైకిల్స్' అనమాట. మీరు సెకనుకి ఇరవైనాలుగా, ఇరవై ఆరా, ఇరవై ఎనిమిది, ఇలా మీరు ఉత్పన్నం చేయగలిగినన్ని జీరోల్ని ఉత్పన్నం చేస్తే, సరిగ్గా అదే సంఖ్య మీకు పాలిగ్రాఫ్ మీద సూచింపబడుతుంది. మొత్తం స్పెక్ట్రం–ఎలక్ట్రోఫిజిలాజికల్ పూర్తి శ్రేణి అంతా కొంతవరకు ఏకపక్షంగా మెదడుకి సంబంధించిన ఈ నాలుగు బ్యాండ్లలోనే విభజించబడింది. ఇదీ సింపుల్‌గా దాని నిర్వచనం. కాబట్టి సున్నా నుంచి నాలుగు హెర్జ్ వరకు డెల్టా, నాలుగు నుంచి ఎనిమిది హెర్జ్‌ల వరకు తీటా. ఇవి మీకు తెలుసు. ఎందుకంటే వీటిని ఇంతకు ముందే మేము తెలియబరిచాము. ఎనిమిది నుంచి పదమూడు హెర్జ్‌ల వరకు ఆల్ఫా అంటారు. ఈ నమూనాలను కనిపెట్టిన వ్యక్తి మొదటగా పెట్టిన పేరు అదే. పదమూడు తర్వాత నుండి ఏ ఫ్రీక్వెన్సీ అయినా బీటాగా నిర్వచింపబడుతుంది. కాబట్టి ఆ తర్వాత ప్రత్యేకించి పేరేదీ లేదు.' అన్నారు ఎల్మర్.

'స్వామీజీ ఇప్పుడు ఈ నాలుగు ఫ్రీక్వెన్సీ బాండ్లలో దేనినైనా ప్రొడ్యూస్ చేయగలుగు తున్నారు. కానీ ఆయనకి తాను ఆ ప్రదర్శనలో పాల్గొన్న సమయం కంటే మరింత ఎక్కువ

ప్రదర్శించగలననే విషయం గుర్తించారు. 'ఇప్పుడు చూపించేది పెద్ద చెప్పుకోదగిన విషయమేమీ కాదు. ఇవన్నీ సింపుల్ ఎక్సర్‌సైజుల్లాంటివి. ఇక్కడ ఏదో లోపం ఉంది. ఈ బీటా, ఆల్ఫా, తీటా, డెల్టా పాటర్న్ (నమూనాలు) కి మించి వేరే ఏదో ఉండాలి,' అన్నారు స్వామీజీ.'

" 'ఆహా! అంతకు మించి వేరే ఏదో ఉండాలి,' అన్నాడు ఎల్మర్ కూడా. ఆయన, నేను మాత్రమే స్వామీజీ పాయింట్‌ని సరిగా అర్థం చేసుకున్నాం. 'ఈ మెషీన్లు మీ భౌతిక శరీరంలోని భౌతిక కార్యకలాపాల్ని మాత్రమే కొలవగలుగుతాయి. ఈ పాటర్న్ ప్రదర్శించే స్థితులేవైనా మెదడుకి సంబంధించిన కార్యకలాపాలే తప్ప మనసుకి చెందినవి కాదు.'

" 'అవి మెదడుకి సంబంధించిన స్థితులనే కాదు, ఖచ్చితంగా మెదడుకి అతీతమైన స్థితులు కావు,' అన్నాను నేను. స్వామీజీ ధ్యానం గురించి మాట్లాడుతూ, 'అది మనస్సుకి అతీతమైన స్థితి' అనడం గుర్తుకొచ్చి నేను అలా అన్నాను.

" 'స్వామీజీ కొన్ని సెకన్ల పాటు మౌనంగా ఆలోచిస్తూ ఉండిపోయారు. ఏకాగ్రత, ధ్యానం- ఈ రంగాల్లో ఆయన ప్రదర్శన పరిమితుల్ని దాటిందని ఆయన భావిస్తున్నారేమో అనిపించింది. చైతన్యం అంతరంగ స్థితుల్లో ఆయన చేరుకోగలిగిన వేరియేషన్స్‌ని సమానమైన ముఖ్యమైన మార్పులు పాలిగ్రాఫ్ పాటర్న్‌లో కనబడడం లేదని ఉన్నట్టుండి ఆయన గుర్తించారు.

" 'మరి ఈ మెషీన్ల ఉపయోగం ఏమిటి?' అని అడిగారు ఆయన.

" 'స్వామీజీ, వాటికై ప్రత్యేకించిన పనికి వాటి ఉపయోగం ఎంతో ఉంది. అవి సైకోఫిజియలాజికల్ సిద్ధాంతాన్ని డిమాన్‌స్ట్రేట్ చేయడానికీ, మనసు-శరీర సంబంధాన్ని ప్రదర్శించడానికీ ఎంతో ఉపయోగపడతాయి. ఆ శారీరిక స్థితులు మానసిక భావోద్వేగ స్థితుల్ని ప్రభావితం చేస్తాయి. అలాగే మానసిక భావోద్వేగ స్థితులు శారీరిక స్థితుల్ని ప్రభావితం చేస్తాయి. ఆ మేరకు భౌతికమైన మెషీన్ల ద్వారా తీసుకునే శారీరికమైన కొలమానాలు మన మానసిక, భావోద్వేగ స్థితులకి సంబంధించి ఎలాంటి మార్పులు తీసుకొస్తాయో అధ్యయనం చేయడం సాధ్యపడుతుంది. ఇది ఒక అమోఘమైన దశ. మీరు అందిస్తున్న సహకారం ఈ స్టెప్‌ని ఉపయోగకరంగా తీర్చిదిద్దడానికి ఉపకరిస్తుంది. 'నేను' అంటే శరీరంగా ఉన్న ఈ ఆకారం మాత్రమేననే భావన ఎంతోమంది ప్రజలు, డాక్టర్లు, సైంటిస్టులకి ఉంది. వారి దృష్టిలో శరీరమంటే అనియంత్రితంగా జరిగే అతి విస్తృతమైన కెమికల్ ఎలక్ట్రికల్ ప్రతిస్పందనలు. వాళ్లు కేవలం అంతవరకే ఊహించి ఊరుకోలేదు, వాళ్లు ఆ మేరకు దాన్ని సూత్రీకరించారు. విజ్ఞానం ఇంకా ముందుకు కొనసాగడానికి మనం ముందుగా అలాంటి అర్థాంతర నిర్ధారణల్ని శాస్త్రీయపరంగా తిరస్కరించాల్సి ఉంది. అలా కొనసాగుతూ మనం మరింత ఉన్నత సిద్ధాంతాల్ని కనుగొనాలి. మనసు శరీర బంధం ఉన్నత స్థితులకి చెందిన చైతన్యానికి ఎలా అన్వయం కుదర్చాలో మనం చూడాలి. బహుశా ఏదో ఒక రోజు అభౌతిక కొలమానాల్ని అభౌతిక పరికరాలతోనే కొలవగలిగే పరిస్థితి వస్తుంది.' "

స్వామీజీ తనకు తానుగా ఈ శాస్త్రీయ పరిశోధనలను తన మీద జరపడానికి సమ్మతించి ముందుకు వచ్చారు. కానీ ప్రయోగాలు చేయడానికి అక్కడున్నది గినియా పిగ్ కాదు, స్వామీజీ! స్వామీజీ బోధకులు. ఆయన ఒక గొప్ప బృహత్కార్యంతో ముందుకు వచ్చారు. బోధించడం, శిక్షణనివ్వడం, మార్పు చెందేలా చేయడం, మనకి తెలిసిన అన్ని భౌతిక భూమికలకీ అతీతంగా ఉన్న ఒక వాస్తవికతని మనకి ఎరుకపరచడం వంటి ఎన్నో ఉన్నతమైన పనుల్ని ఆయన పూర్తి చేయాల్సి ఉంది. సెప్టెంబరు మధ్య కాలంలో తొమ్మిదిమందితో కూడిన ఒక బృందం స్వామీజీని ఒక కాన్ఫరెన్స్ రూంలో కలిసింది. ఈ మీటింగ్‌కి అసలు లక్ష్యం రెండు విధాలుగా ఉంది. ఒకటి, స్వామీజీకి పాశ్చాత్య విజ్ఞానం, సంస్కృతి గురించి బాగా ఎరుకపరచడం, అలాగే రెండవది,

పాశ్చాత్యులు స్వామీజీ నుంచి ఏకాగ్రత, ధ్యానం ఏ పద్ధతిలో చేయాలో నేర్చుకుని, ఆయన ల్యాబ్‌లో ఏ విధంగా డిమాన్‌స్ట్రేట్ చేస్తున్నారో అర్థం చేసుకోవడం. ఆ సెషన్‌కి హాజరై కుర్చీల్లో కూర్చున్నవారు బిగ్రబిగుసుకుపోయి అస్తవ్యస్తంగా కూర్చోవడం చూసిన స్వామీజీ అలాంటి ప్రదర్శనల్ని అభ్యంతరపెట్టడంతో ఆ తర్వాతి సెషన్స్‌ని గ్రీన్స్ లివింగ్ రూంలో జరపడానికి నిర్ణయం జరిగింది. అక్కడ సందర్శకులకు నేలమీద వేసిన మెత్తటి పరుపులపై సౌకర్యవంతమైన ఆసనంలో కూర్చునే ఏర్పాటు చేయడం జరిగింది. సౌకర్యవంతమైన భంగిమలో ధ్యానంలో కూర్చుంటేనే ఎక్కువసేపు నిశ్చలమైన ధ్యానం చేయవచ్చునని చెప్పారు స్వామీజీ. తల, మెడ, మిగతా శరీరాన్ని ఎలా నిటారుగా నిలబెట్టాలో, ధ్యానముద్రలోకి వెళ్లే ముందు శరీర భాగాలన్నింటినీ ఎలా రిలాక్స్ చేయాలో బోధించారు. శ్వాసని సరైన విధంగా పీల్చే పద్ధతిని నేర్పించారు. సెషన్సు నడుస్తున్న కొద్దీ అవి అత్యంత ప్రేరణనీ, ఉత్సాహాన్నీ అందించేవి. చివరికి స్వామీజీ యోగ సాధనలో తాత్వికచింతన ఎలా ఇమిడీకృతమై ఉందో నేర్పించసాగారు. వారి టీచర్ మిషనరీ స్పిరిట్ గురించి బోయెడ్ సుస్పష్టంగా ఇలా వ్రాసుకున్నాడు. స్వామీ రామ సాధకులతో చెప్పేవారు, “ 'మనిషి శాంతి కోసం, బ్రహ్మానందం, ప్రజ్ఞ, సంతోషం కోసం అన్వేషిస్తూ ఉంటాడు. మనమంతా జ్ఞానం ద్వారా సాధించబడే, శాంతి ద్వారా సాధించబడే, ఒక పద్ధతి ద్వారా సాధించబడే చిరంతన ఆనందాన్ని సాధించాలని అన్వేషిస్తూనే ఉన్నాము. మనం సంతోషం సాధించాలంటే ముందు మనకి మనశ్శాంతి ఉండాలి. మనశ్శాంతి ఉండాలంటే, మనకి మైండ్ మీద కంట్రోల్ ఉండాలి. మైండ్ మీద కంట్రోల్ ఉండాలంటే, మనకి ఒక పద్ధతి అవసరం అవుతుంది. మనసుని బాహ్య ప్రపంచానికి సంబంధించిన వస్తువుల నుంచి తప్పించాలంటే మనం ఒక నిర్ణీతమైన ప్రక్రియని అనుసరించాలి...

“ 'మైండ్ ఏ విధమైన సంక్షోభాలూ ఇబ్బందులూ లేకుండా ఉండాలి. బౌద్ధ గ్రంథాలు, హిందూ గ్రంథాలు, టిబెటన్, తావో, కన్‌ఫ్యూషియన్ గ్రంథాలన్నీ మనసుని విముక్తం చేసే వివిధ పద్ధతుల గురించి మాట్లాడాయి. మొదట్లో అనేక రకాల పద్ధతులు ఉండేవి. కానీ అవన్నీ ఒకే లక్ష్యాన్ని చేరుకునేవి. అన్ని పద్ధతులూ ధ్యానమనే లక్ష్యానికే చేరుకుంటాయి. ఎందుకంటే ఆ మార్గాలన్నింటిదీ ఒకటే లక్ష్యం. ఆ లక్ష్యమే ధ్యానం! ధ్యానం ఒక్కటే ముక్తిని ప్రసాదించగలదు, ఆందోళన నుంచి విముక్తిని ప్రసాదించగలదు. బాధ నుంచి విముక్తిని ప్రసాదించగలదు. కోపం, నిరాశ, వేదన, విచారం నుంచి విముక్తిని ప్రసాదించగలదు. అన్ని దు:ఖాలూ, అన్ని రకాల భయాలు, అన్ని భవబంధాల నుంచి విముక్తిని ప్రసాదించగలదు. ధ్యానం ఒక్కటే జ్ఞాన మార్గం.' ”

స్వామీజీ నిరంతరం ఈ విధమైన ప్రేరణాస్పద, తాత్విక, ఆధ్యాత్మిక బోధల్ని వ్యావహారికమైన అంశాలకు జోడించి చెప్తూ ఉండేవారు. ఉదాహరణకు, 'మీ పని మొదట మీ ఊపిరితిత్తులతో మొదలవుతుంది. ఊపిరితిత్తులతోనే ఎందుకు మొదలవ్వాలి? మీ చేతులతో ఎందుకు కాదంటారా! మీ ఊపిరితిత్తుల కదలికని కంట్రోల్ చేయడం ద్వారా మీ మెదడు చలనాల్ని కంట్రోల్ చేయవచ్చు. మీ ఊపిరితిత్తుల కదలికని కంట్రోల్ చేయడం ద్వారా మీ ఊపిరితిత్తుల సామర్థ్యాన్ని పెంచవచ్చు. మీ ఊపిరితిత్తుల సామర్థ్యాన్ని పెంచడం ద్వారా వాటిని బలోపేతం చేయవచ్చు. ఆ విధంగా మీ ఊపిరితిత్తుల వ్యవస్థ సరైన గాడిలో పడేలా క్రమబద్ధీకరించవచ్చు. మీ ఊపిరితిత్తుల వ్యవస్థను క్రమబద్ధీకరించడం ద్వారా వెగాస్ నాడి (మెడ, ఛాతీ, ఉదరానికి ప్రాకే సంచారక నాడి) ని కంట్రోల్ చేయవచ్చు. ఈ వెగాస్ నాడిని కంట్రోల్ చేయడం ద్వారా సంకల్పిత అసంకల్పిత ప్రతీకార చర్య వ్యవస్థల్ని కంట్రోల్ చేయవచ్చు.' అని చెప్పేవారు.

ఈ విధమైన ప్రాక్టికల్ బోధల్లో భాగంగా స్వామీజీ ఒక నిర్దిష్టమైన శ్వాస అభ్యాసాన్ని చేయించేవారు. దాని పేరు *భస్త్రిక* సాధన. అంటే ఈ సాధన కమ్మరి కొలిమిలో ఉపయోగించే విధంగా తిత్తిని పోలి ఉంటుంది. ఈ సాధనలో శ్వాస వదిలేటప్పుడు పెద్ద సౌండ్ వచ్చేలా చాలా బలంగా వదలాలి. దానితో ఊపిరితిత్తుల్ని ఖాళీ చేయవచ్చు. మళ్లీ మెల్లగా, సున్నితంగా గాలిని లోపలికి తీసుకుని ఖాళీ అయిన ఊపిరితిత్తుల్ని గాలితో నింపాలి. ఉచ్ఛ్వాస నిశ్వాసల సమయాల్లో ఛాతీలో ఎలాంటి కుదుపులూ లేకుండా ఉండేందుకు వెన్నెముకని నిటారుగా నిలబెట్టి ఉంచాలి. ఈ విధమైన శ్వాస ప్రక్రియని ఎక్కువసార్లు వేగంగా చేయాలి. ఈ పద్ధతిని ఒకటి రెండు వారాల పాటు సాధన చేయాలి. అక్కడ నుంచి మీరు బ్రహ్మాండమైన పట్టుతో భస్త్రిక ప్రాణాయామాన్ని చేయగలుగుతారు. ఆ తర్వాత మీరు స్థిరమైన ముద్రలో కూర్చోగలుగుతారు. కాబట్టి నేను మీకు తెలిపిన విధంగా సాధన చేయండి. నోటితో గాలి పీల్చడం, విడవడం చేయవద్దు. నోరు అత్యవసరమైన స్థితిలో ఉపయోగించాల్సిన ద్వారం మాత్రమే. దాన్ని శ్వాస అభ్యాసాలకు గానీ, మామూలుగా గాలి పీల్చడానికి గానీ ఉపయోగించకూడదు. ఎందుకంటే, నోటికి ఫిల్టర్లు ఉండవు.' " అని చెప్పేవారు.

ఈ విధంగా స్వామీజీ యోగ, ధ్యానం, జీవితంలోని సన్నివేశాలపై ఇచ్చే డిమాన్‌స్ట్రేషన్లు, బోధలు, ప్రాక్టికల్ లెసన్స్ ఎంతో సరదాగా ఉండేవి. నవ్వులు, ఛలోక్తులు, ఒకరి జీవితం (ఆ మనిషి అంగీకరించినా అంగీకరించకపోయినా) గురించి రకరకాల ప్రణాళికలు వేయడం, ఇవన్నీ ఆయన ప్రవర్తనలో చాలా మామూలు విషయాలు. ఉదాహరణకి, డౌగ్ బోయెడ్ పెళ్లి చేసుకోవాల్సిన టైం వచ్చేసిందని ఆయనే నిర్ణయించారు. పెళ్లికి అవసరమైన ఫర్నిచర్, ఇల్లు, పెళ్లికూతురు వంటి విషయాలన్నీ తాను చూస్తానని చెప్పారు. 'బోయెడ్‌కి బహుశా వేరే ప్లాన్స్ ఏమైనా ఉండి ఉండొచ్చు గదా' అని మిసెస్ గ్రీన్ అన్నపుడు, స్వామీజీ త్రోసిపుచ్చుతూ, 'అతడికి అలాంటివేవీ ఉండడానికి వీల్లేదు' అనేశారు. 'అతడికి పెళ్లి కావాలి. నేను వెనక నుంచి పెట్టవలసిన వత్తిడి అంతా చిన్నగానో పెద్దగానో పెడుతూనే ఉంటాను. మనం వాడాల్సిన పద్ధతులన్నీ వాడేస్తూనే ఉంటాం,' అన్నారు స్వామీజీ. ఆయన ఆ విషయాన్ని చాలా గంభీరంగానూ, నిజంగానే చెప్తున్నారు! అందుకే బోయెడ్ ఆయన్ని 'ది ఇన్‌సిస్ట్ అరేంజెర్' గా భావించాడు.

స్వామీజీ టొపేకాలో ఉన్నంత కాలం మెన్నింగర్ సిబ్బందిలో ఎంతో కుతూహలాన్ని రేకెత్తించారు. కొంతమందికైతే ఆయన్ని చూస్తే భయం కలిగేది. బోయెడ్ ఆ విషయాల్ని గుర్తు చేసుకుంటూ, 'కొంతమంది పరిశోధకుల్లో మిశ్రిత భావోద్వేగాలు కనిపించాయి. కొన్ని రకాల అసాధారణమైన ప్రముఖమైన కార్యకలాపాలు చేయడం ద్వారా వారిలో ఆయన ఆసక్తిని ప్రేరేపించారు. అయినప్పటికీ, నిర్ధారణగా తేల్చలేని విశ్వ సిద్ధాంతాలు, మనిషి అనబడే ఎలక్ట్రోకెమికల్ ఆర్గానిజం, సమకాలీన పాశ్చాత్య విజ్ఞానానికి గల ఉత్కృష్టత, శ్రేష్ఠత వంటి అంశాలపై ముందే సిద్ధాంతీకరణ చేసిన కొందరికి ఈయన పట్ల భయం ఉండేది.'

ఒకనాడు స్వామీజీ డా. గ్రీన్ ఆఫీసులో ఒక సైకియాట్రిస్ట్‌తో చాలా వాడిగా వేడిగా చర్చిస్తున్నారు. స్వామీజీకి ఈ మనిషి తాను ల్యాబ్‌లో చూసిన విషయాన్ని సందేహిస్తున్నాడని తెలిసింది. అందువల్ల అతనిని ఒప్పించడానికి స్వామీజీ ఏకాగ్రచిత్తానికి గల బలీయమైన శక్తిని గురించి నొక్కి వక్కాణిస్తున్నారు. సైకోకెనటిక్ ఎనర్జీని ఉపయోగించి తాను ఒక వస్తువుని దూరం నుంచే కదిలించగలనని అన్నారు. ఆ సైకియాట్రిస్ట్ సందేహపడ్డాడు. స్వామీజీ తనకున్న ఈ సామర్థ్యాన్ని నిరూపించడానికి వెంటనే డా. గ్రీన్‌ని ఒక ప్రయోగం చేయడానికి ఏర్పాట్లు చేయమన్నారు.

'సూదితో కుట్టే ప్రయోగం'ని జాగ్రత్తగా కంట్రోల్ చేస్తూ చేయవచ్చు. డ్రాఫ్ట్‌తో సీల్ చేయబడిన ఒక గదిలో మంచం మీద స్వామీజీ నోటికీ, ముక్కుకీ మాస్క్ ధరించి బాసింపట్టు వేసుకుని కూర్చున్నారు. నాలుగు అడుగుల దూరంలో రెండు కుట్టే సూదులు ఉన్నాయి. వాటిలో ఒకటి పధ్నాలుగు అంగుళాల పొడవు ఉంది, మరొకటి పది అంగుళాల ఉంది. ఒక చిన్న కుదుపు ఇవ్వబడితే చాలు, అవి అడ్డంగా తిరిగేలా ఒక మెటల్ స్పిండిల్ (లోహపు కండె) మీద అమర్చబడ్డాయి. ఒక అగరువత్తిని వెలిగించి దాన్ని చల్లని నీళ్లతో కూడిన ఒక లోహపు పాత్ర మీద ఉంచి, తన కుడి చేతి వైపున పెట్టాల్సిందిగా స్వామీజీ డౌగ్ బోయెడ్‌ని ఆదేశించారు. బోయెడ్‌ని తను ఎడమచేతి వైపు కూర్చోమని చెప్తూ ఆ యువకుడిని తనను ముట్టుకుంటే శక్తివంతమైన ఆఘాతం (షాక్) తగులుతుందని హెచ్చరించారు. ఒకవేళ స్వామీజీ ఎడమచేతి వైపు ఒరిగితే, బోయెడ్ ఆయన్ని మెల్లగా సెంటర్ వైపు త్రోస్తూ ఉండాలని చెప్పారు. అలా త్రోయడానికి ఒక నాలుగు అంగుళాల మందం, రెండున్నర అడుగుల పొడవు గల ఒక ప్లైవుడ్ బోర్డ్‌ని ఉపయోగించాలని చెప్పారు. డా. గ్రీన్, బోయెడ్‌తో కలిపి మొత్తం పన్నెండు మందీ కూడా స్వామీజీ మాస్క్ ధరించడం గమనించారు. సూదులు, లైట్ వంటి వన్నీ అమర్చారు. ఆ గదిలో ఎక్కడ నుంచైనా గాలి ప్రవాహం ఉందేమో చెక్ చేశారు. ప్రయోగం మొదలైనపుడు స్వామీజీ ఒక మంత్రాన్ని మెల్లగా అస్పష్టంగా లోగొంతుకలో ఎవరికీ వినబడనట్టు చదివారు. (మా సంభాషణల్లో ఒకసారి ఎప్పుడో స్వామీజీ ఈ మంత్రం *'క్రీం'* అని చెప్పారు. దీనికి ముందు సబర మంత్రం జపించబడుతుంది.)

ఈ మంత్రోచ్చాటన తర్వాత ఏం జరిగిందో బోయెడ్ బ్రహ్మాండంగా వర్ణించాడు. "ఆయన (స్వామీజీ) ఒక వింతగా ధ్వనించే మంత్రాన్ని ఉచ్చరించారు. దాన్ని నేనంతకు ముందెన్నడూ వినలేదు. ఆయన దాని టెంపోనీ, పిచ్‌నీ కూడా విపరీతంగా పెంచేశారు. దాన్ని ఆయన పదే పదే జపిస్తూ ఉన్నత స్వరంలో కీచు ధ్వనితో చివరగా 'ర...ఈఈఈ...ఈఈఈ...ఈఈఈమ్' ధ్వని వచ్చేలా ఉచ్చరించారు. అప్పుడు రెండు విషయాలు ఒకేసారి జరిగాయి. నాకు విద్యుద్ఘాత అనుభూతి కలిగింది, అదీ ముఖ్యంగా నా ఛాతీ భాగంలోనూ, కుడి చేతి వైపు నా ముఖ భాగంలోనూ ఆ అనుభూతి బాగా ఎక్కువగా కలిగింది. ఎదురుగా ఆ వస్తువు కదిలింది.

నా మనసులో మొట్టమొదటగా కలిగిన ఫీలింగ్ ఏమిటంటే, ఎలక్ట్రిక్ షాక్ అనుభూతి వల్ల నాకు ఒక రకమైన హిప్నాటిక్ లక్షణం సోకి ఉంటుందనీ, అందువల్లే నాకు ఆ వస్తువు కదిలినట్టు కనిపిస్తోందనీ అనిపించింది. గతకాలపు స్మృతుల్లో దీనిని పోలిన అనుభవం ఒకటి తటాలున గుర్తుకొచ్చింది. సరిగ్గా అలాంటి షాకే అది. ఒక పర్వతం తొలిచి ఉన్న ప్రాంతంలో నా టీనేజి ఫ్రెండ్స్ కొందరు ఒక పోర్టబుల్ జెనరేటర్‌కి వైరుతో కట్టేసి, దాన్ని ఆన్ చేశారు. నేను వెళ్లలేకపోయాను. కానీ ఇప్పుడు పొందిన షాక్ తక్షణమే ముగిసింది. స్వామీజీ ఎల్మర్‌ని, తను కూడా అలాంటి అనుభూతి పొందాలనుకుంటున్నాడేమో అని అడిగి చూశారు. ఎల్మర్ అప్రయత్నంగా వెంటనే తలాడించాడు. స్వామీజీ తన ఉచ్చాటనని కొనసాగించారు, మెల్లగా, మంద్ర స్వరంలో జపిస్తున్నారు. ఇప్పుడు నేను ఆయన పలికే వింత 'ఈఈ...ఈఈఈ' అనే ధ్వనికి నా మనసులో అటువంటి భావోద్వేగం కలిగి ఉంటుందని భావించాను. మళ్లీ అదే ఘటన జరిగింది. అదే 'ర...ఈఈఈ...ఈఈఈ...ఈఈఈమ్' ధ్వని! అదే విద్యుత్ కంపనం, ఆ సూదులు మళ్లీ కండె వైపు తిరిగాయి. ఇప్పుడు, అది కేవలం నా భావోద్వేగపు ప్రతిస్పందన కాదు, అది నిజమైన భౌతిక సంవేదనే!

'ఆ సూదులు నిజంగానే కదిలాయి. ప్రతి ఒక్కరూ దాన్ని చూసే ఉంటారు. నిజానికి అవి కొద్ది డిగ్రీలే కదిలినా, అవి ఇప్పుడు వేరే స్థితిలో స్థిరంగా ఉన్నాయి. స్వామీజీ ఎదురుగా

ఉన్న సూది పాయింట్ ఆయన వైపు కదిలింది, అడ్డంగా ఉన్న గడియారంలో పెద్ద ముల్లు గడియారపు వ్యతిరేక దిశలో తొమ్మిది నుంచి ఏడుకి తిరిగినట్టు తిరిగిందది. స్వామీజీ ఎల్మర్ వైపు తిరిగినపుడు నేను ఆయన కళ్లను గమనించాను. అవి ఆర్ద్రంగానూ, అలిసిపోయినట్టూ అనిపించాయి.

'మాస్క్ తీయబడింది. స్వామీజీ ప్రశాంతంగా ఉన్నారు. పరిశీలకులు లేచి అక్కడ నుంచి వెళ్లిపోయారు. గదిలో ముగ్గురమే ఉన్నాము. అప్పుడు స్వామీజీ, 'ఇది పెద్ద పనికొచ్చేది కాదు. ఇంతకు ముందు సందేహిస్తున్న ఆ వ్యక్తి ఇంకా ఇప్పటికీ సందేహిస్తూనే ఉన్నాడు...' అన్నారు.

'నేను ఓ కప్పు వేడినీళ్లు, ఒక టీ బ్యాగ్ తెచ్చుకోవడానికి రెండవ అంతస్తుకి వెళ్లాను. నేను అప్పుడు స్వామీజీ ప్రదర్శన గురించీ, ఆయన ఫీలింగ్స్ గురించీ ఆలోచిస్తున్నాను. స్వామీజీ ఏం చేశారో వివరించడం నాకు తెలియదు. కానీ ఆయన గెలిచారని అనిపిస్తుంది. ఆ స్పిండిల్‌పై రెండు సార్లు సూదులు కదిలాయి. అది కేవలం స్వామీజీ ఊపిరితిత్తుల నుంచి వచ్చిన గాలి వల్ల కాదని నాకు అనిపించింది. ఒకవేళ సూదులు కదిలింది ఆయన శ్వాస వల్లనే అయితే, అవి వేర్వేరు సమయాల్లో కదిలి ఉండేవి, వ్యతిరేక దిశలో కదిలి ఉండేవి. వెలిగించి పెట్టిన అగరువత్తిపై కూడా ఆ ప్రభావం పడేది. ఆ ప్రకాశం వస్తువుకి దూరంగా జరిగి ఉండేది. పైగా, విద్యుత్ ప్రవాహ లక్షణం కూడా కనిపించింది. సూదులు కదిలినపుడు అది నాకు రెండు సార్లు అనుభవానికి వచ్చింది. ఏది ఏమైనా, సూదుల కదలికకి 'ఏదో' కారణం ఉండి ఉండాలి. ఆ 'ఏదో' అనేది స్వాభావికమా, అతీంద్రియశక్తికి సంబంధించిన విషయమా, ఏమిటో వర్ణించాల్సి ఉంది. ఒక భౌతిక వస్తువు మీద పనిచేసే వాస్తవిక శక్తి అది. నేను నా హైస్కూల్‌లో, కాలేజీలో నేర్చుకున్న సైన్సు ఏ వాస్తవాలూ ఏ సిద్ధాంతాలూ కూడా ఒక మానవ శరీరం, కంటి చూపులు, లేదా మానసిక సంకల్ప శక్తి ద్వారా ఒక వస్తువుని కదిలించగలిగే శక్తిని ఉత్పన్నం చేయగలదనే విషయం గురించి చెప్పనే లేదు. ఎవరైనా దీన్ని కాదనదల్చుకుంటే, వారు తమ తమ వ్యక్తిగత భావనలు, సంప్రదాయబద్ధమైన విశ్వాసాల మీద ఆధారపడవలసి ఉంటుంది.

" 'ఆ ప్రదర్శనని అంతకంటే గొప్పగా చేసేందుకు అవకాశం ఉందంటే నేను నమ్మలేను,' అంటూ నేను స్వామీజీకి టీ అందించాను. 'జనం వారి వారి అవకాశాన్ని బట్టి తమ తమ సందేహాలు, విశ్వాసాలకి అంటిపెట్టుకుని ఉంటారు. ఏ ప్రదర్శనా ఎవరి విశ్వాసాల్నీ ఎన్నడూ ప్రభావితం చేయలేదు స్వామీజీ...ఒకవేళ మనం కంట్రోల్ సిస్టమ్స్‌ని మరింత విస్తారంగా సిద్ధం చేయదల్చుకున్నామంటే, వాళ్లు సింపిల్‌గా మీ వద్ద మోసం చేసే విస్తారమైన సిస్టమ్స్ ఉన్నాయని అనుకుంటారు.

నేను ఈ ప్రయోగం గురించి విన్నపుడు స్వామీజీ సూదుల్ని ఎలా కదిపారా అని ఆశ్చర్యపోయాను. ఆయన మంత్రం ద్వారా కాక, తన కంటిచూపుని ఉపయోగించి అలా చేసి ఉండాలని భావించాను. ఆయన త్రాటక (ఏకాగ్ర దృష్టి) సాధన ద్వారా ఆ శక్తిని సాధించారు. ఆయన తన శక్తితో ఒక పేపరు ముక్కని కాల్చడం నేను చూశాను. దూరం నుంచి ఒక గ్లాసు వైపు చూసి దాన్ని బద్దలు కొట్టడం కూడా నాకు తెలుసు. స్పిండిల్ మీద స్వామీజీ ఒకటి కాక రెండు సూదుల్ని పెట్టడం నాకు ఆశ్చర్యం కలిగించింది.

ఆయన్ని నేను ఈ విషయం గురించి అడిగితే, 'నేను చాలా రకాల ప్రయోగాలు చేద్దామని అనుకున్నాను. కానీ ఇది నాకు చాలా నిరాశ కలిగించింది. శాస్త్రజ్ఞులు కూడా సంకుచిత మనస్తత్వం కలవారే. ఈ ప్రయోగం చేస్తున్నపుడు నేను నా శక్తిని నా కళ్ల ద్వారా ప్రవహింపజేశాను. నిజానికి నేనలా చేయడానికి కారణం, అలిసి పోయిన నా కళ్ల వైపు చూసైనా ఆ సైంటిస్టులు

కొంతలో కొంతైనా దృష్టి ద్వారా శక్తి కదలికలపై వివరించగల సూత్రాల్ని సిద్ధాంతీకరించగలరని భావించాను. నా చూపుతో ఒక వస్తువుని నా నుంచి దూరంగా పంపించడం లేదు, నా వైపు ఆకర్షిస్తున్నాను. నేను దాన్ని లాగుతున్నాను, త్రోయడం లేదు. పురాతన గ్రంథాల్లో దీన్ని 'ఆకర్షక' శక్తిగా పేర్కొన్నారు. షట్కర్మ విధిలో ఆరు తాంత్రిక క్రియల గురించి చెప్పబడింది. వాటిలో ఆకర్షణ ఒకటి. నా దగ్గర రెండు సూదులు ఉన్నాయి. ఆ రెండు సూదులూ ఒకదానికొకటి ఆకర్షితమయ్యేలా చేసి, ఆ తర్వాత విద్వేషణ ప్రక్రియ ద్వారా పరస్పరం వికర్షించుకునేలా చేయాలనేది నా ప్లాన్. ఇది షట్క్రియల్లో తర్వాతిది. ఆ తర్వాత నేను *స్తంభన* (కదలకుండా ఉంచడం) ప్రదర్శించాలని భావించాను. ఆ సమయంలోనే కదులుతున్న సూదిని అకస్మాత్తుగా ఆపాలని ప్లాన్ చేశాను. ఆ తర్వాత ఆ రెండు రకాల క్రియల్నీ కలిపి ప్రదర్శించాలని అనుకున్నాను. అంటే ఒకటి కదులుతుంది, మరొకటి స్థిరంగా ఉంటుంది.'

'కానీ ఇలాంటి క్రియలు చేయడం ప్రయోజనమేమీ లేదనుకున్నాను. వీళ్లు ముందుగానే ఒక నిర్ణయానికి వచ్చేశారు. ఇలాంటి సిద్ధుల్ని ప్రదర్శించవద్దని గ్రంథాలు ఎందుకన్నాయో ఇప్పుడు తెలుస్తుంది మనకు. ఇలాంటి ప్రయోగాలకు ఒక వ్యక్తికి సంభవించాల్సిన భౌతికమైన, మానసికమైన, ఆధ్యాత్మిక పరిణతులేవీ సంభవించగల పాజిటివ్ ఎఫెక్టు ఏమీ ఉండదు. ఇలాంటి విషయాల లక్ష్యం ఒక్కటే! అది ప్రజలకు ప్రేరణ కలిగించడం! మానవుడికి అసాధారణమైన శక్తి సామర్థ్యాలు నిబిడీకృతంగా ఉన్నాయనీ, వాటిని బహిర్గతం చేసే విధానాలు ఉన్నాయనీ తెలియజేయవచ్చు. ఈ ప్రయోగాల్ని ఉదహరించిన శాస్త్రగ్రంథాల ప్రామాణికతని నిరూపించవచ్చు.'

ఆ తర్వాత స్వామీజీ మెన్నింగర్ ఫౌండేషన్‌లో జరిగే ప్రయోగాల్లో పాల్గొంటూ వచ్చినా, దాని వల్ల పెద్ద ప్రయోజనమేమీ లేదని ఆయన గ్రహించారు. అందుకే వారు పబ్లిక్‌లోకి వెళ్లడం మీద ఎక్కువగా దృష్టి సారించారు. వారి మొట్టమొదటి ఉపన్యాసాలు మెన్నింగర్ ఫౌండేషన్‌లోని ఆడిటోరియంలోనే మొదలయ్యాయి. వాటికి ముఖ్యంగా వెటరన్స్ హాస్పిటల్‌కి చెందిన ప్రొఫెషనల్స్, టపేకా వాష్‌బర్న్ యూనివర్శిటీకి చెందిన ఉపాధ్యాయులు, విద్యార్థులు, దగ్గరలోనే ఉన్న ఆనందమార్గ ఆశ్రమంలోని సభ్యులు,మరి కొందరు మెన్నింగర్ ఉద్యోగులు హాజరయ్యేవారు. ఈ ఉపన్యాసాల్లో స్వామీజీ ముఖ్యంగా ఆరోగ్యం గురించీ, చిరకాలం ఆనందంగా గడపడం గురించీ మాట్లాడేవారు. కానీ ఆయన పరిశోధకుడిలా కాక ముఖ్యంగా ఒక తాత్వికవేత్తలాగా, ఆధ్యాత్మిక బోధకుడిలాగానే ఉపన్యసించేవారు. ఆయన ఉపన్యాసంలో యోగం ఒక మతం కాదనీ, అది స్వీయ అన్వేషణా మార్గమనీ పదే పదే నొక్కి వక్కాణించేవారు. 'ధ్యానం అంతర్గత ప్రయాణం. ఈ అంతర్గత ప్రయాణంలో మీకు మీరెవరో, ఇక్కడికి ఎందుకొచ్చారో, మీ బలమైన లక్షణాలు, గుణాలు ఏమిటో తెలుస్తాయి. మీ జీవితంలోని ఈ అంతరంగ దృక్పథాలు మీక అర్థమైతే, మీ గురించి మీరు ఒక వాస్తవమైన చిత్రాన్ని చూడవచ్చు. అప్పుడు మీరు ఇతరులు మీకు సంబంధించి చేసే ఎలాంటి చిత్రణలూ, ఆరోపిత కథనాలూ మీకు నచ్చవు. వాటిలోని అపసవ్యత మీకు తెలిసిపోతుంది. సంక్షిప్తంగా చెప్పాలంటే, ధ్యానం మిమ్మల్ని మీకు పరిచయం చేస్తుంది. ఒకసారి మీకు మీరు తెలిస్తే చాలు, మీకు ఈ ప్రపంచంతో గల సంబంధం ఏమిటో అలాగే జీవితేశ్వరుడితో గల బంధం ఏమిటో అర్థమై పోతుంది మీకు. అప్పుడు మీకు ఈ ప్రపంచంలో గల ఏ మతమూ మరొకదాని కన్నా ఉత్తమం కాదని అర్థమవుతుంది. అప్పుడు మీరు ఏ విధమైన మతపర ఘర్షణల్లోనూ చిక్కుకోరు.'

బోయెడ్ ఈ లెక్చర్స్‌ని చాలా గాఢమైన ముద్రతో వర్ణించాడు. 'స్వామీజీ మాటలు ప్రజల్ని బాగా ఆకర్షించింది. ఆయన స్టేజి మీద తన పావుకోళ్లతో ముందుకీ, వెనక్కీ హుందాగా నడుస్తూ బోధించేవారు. ఒక పెద్ద శాలువాని భుజాల మీదుగా కప్పుకుని అవసరానికి అనుకూలంగా

చేతులు తిప్పుతూ, స్వరాన్ని మంద్ర, మధ్య స్వరాల్లో ప్రయోగిస్తూ లెక్చర్ ఇస్తూ ఎంతో అందంగా, హుందాగా ఉండేవారు. ప్రతి శుక్రవారం సాయంత్రం ఆయన రెండు గంటలు లేదా అంతకంటే ఎక్కువసేపు ఉపన్యసించేవారు. కానీ ఏ మాత్రం శ్రోతల ధ్యానం అటూ ఇటూ మళ్లే ప్రసక్తే లేదు...అది పెద్దలైనా...పిన్నలైనా సరే! వారు మైండ్ గురించి మాట్లాడారు. మైండ్ గురించి ప్రాచ్య, పాశ్చాత్య అభిప్రాయాల గురించీ, మైండ్, దాని కార్యకలాపాలను అదుపు చేసే యోగ పద్ధతుల గురించీ మాట్లాడారు. ధ్యాన ప్రక్రియల అర్థాలు, అంతరార్థాల గురించి మాట్లాడారు ఆయన. అలాగే ఆయన యోగాన్ని కొన్ని భంగిమలు, ప్రాణాయామ అభ్యాసాలు, సంస్కృత మంత్రాలను సాధకులకి నేర్పించేవారు కూడా. ఆయన దీనిని 'ప్రాక్టికల్' అంటే నిత్యవ్యావహారిక సాధన అనేవారు. 'భారతదేశం నుంచి వచ్చిన యోగులు, స్వాములు వాళ్ల ధ్యాన పద్ధతుల్ని ఇతరుల మీద, వారి జీవిత విధానాల మీదా అనవసరంగా రుద్దుతారని అనుకునే ఎంతోమంది నాకు తెలుసు...' అనేవారు స్వామీజీ.

ఈ స్వామీజీ తూర్పు దేశం నుంచి వచ్చారు, ఆ స్వామీజీ పశ్చిమ దేశం నుంచి వచ్చారు అనే భావన మీ మనసుల్లోంచి తొలగించుకుంటే మంచిది. ఉన్నది ఒకే సత్యం. ఆ సత్యానికి మతంతో సంబంధం లేదు. ఇక పద్ధతులనేవి ప్రతి మనిషీ తన అభివృద్ధికి అనుగుణంగా తనే ఎంచుకుంటాడు.'

'తూర్పు తూర్పే, పడమర పడమరే!' అనే భావనకి కాలం చెల్లింది' అనేవారు స్వామీజీతో వారి గురువర్యులు. ఇప్పుడు స్వామీజీ టొపేకాలో తమ శిష్యబృందానికి అదే సందేశాన్ని ఇస్తున్నారు. 'ప్రపంచమంతా మానవాళి శాంతి కోసం, సంతోషం కోసం అన్వేషిస్తోంది. వాటి కోసం వారు ఎలాంటి ప్రక్రియలు, సాధనలూ పాటిస్తున్నారనేది వేరే సంగతి. ప్రధానంగా మాత్రం శాంతి సౌఖ్యాల కోసం ప్రపంచం నిరంతర యాత్ర కొనసాగిస్తోంది.' అని చెప్పారు.

ఆనంద మార్గ ఆశ్రమం కూడా శుక్రవారం రాత్రుల్లో బోధనా సమావేశాలు ఏర్పాటు చేసింది. స్వామీజీ ఉపన్యాసాలకు హాజరైనవారు ఆయనను తమ ప్రాంతాలకి రమ్మనీ, తమ సంస్థలోని మిగతా సభ్యులకు సందేశమిమ్మనీ ఆహ్వానించేవారు. కాబట్టి మెన్నింగర్ ఫౌండేషన్‌లో ఉపన్యాసాల తర్వాత, స్వామీజీ మరో ప్రదేశానికి వెళ్లి, మరో సమూహానికి ఉపన్యాసాలు ఇచ్చేవారు. ఫలితంగా ఈ విధమైన పరస్పర సంబంధాలతో మెన్నింగర్ లేబరేటరీ బయట కూడా స్వామీజీకి ప్రజాదరణ బాగా పెరిగింది. స్వామీజీకి చాలా మంది టెలిఫోన్ చేసి పిలిచేవారు. ఆ విషయాలను ప్రస్తావిస్తూ బోయెడ్ ఇలా రాశారు: 'ఒకరోజు ఆయన 'బయట' నుంచి వచ్చిన ఎవరో ఒక వ్యక్తిని వ్యక్తిగతంగా కలుసుకుని మాట్లాడడానికి అంగీకరించారు. అది మొదలు ఆయనకు ప్రతిసారీ అలాగే చేయాల్సి వచ్చింది. ఉదయం పూట కొన్ని గంటలు ఆయన ఆసక్తిగా ఉన్న మెన్నింగర్ ప్రజలతో ఆంతరంగికంగా మాట్లాడుతూ ఉండేవారు. ఆ క్లినిక్‌లో పనిచేస్తున్న డాక్టర్లలో ఒకరికి పాశ్చాత్య పద్ధతుల్లో ఇస్తున్న ఔషధాలని యోగ పద్ధతిలో ఇచ్చే ఔషధాలతో పోల్చి చూడాలనే ఆసక్తి ఉంది. ఈ సందర్భంగా తన దగ్గరకు వచ్చే రోగుల్లో ఇద్దరి గురించి స్వామీజీతో ప్రస్తావన చేసేవారు ఆయన. అంతే కాక, ఆ శిక్షణ సమూహంలోని కొంతమంది సభ్యులతో తరచుగా ప్రైవేట్ మీటింగ్స్ నిర్వహించేవారు. నేను ఆయన అపాయింట్‌మెంట్ బుక్‌ని మెయింటెయిన్ చేసేవాడిని. ఇక అక్కడి నుంచి ఆయన చాలా తరచుగా ప్రజలను కలిసేవారు. ఆయన కేలెండర్‌లో ఏ రోజూ ఖాళీ ఉండేది కాదు. ఆయన ఆశ్రమంలో ఉపన్యాసాలు, ఆయన మా ట్రైనింగ్ గ్రూప్‌కి సూచనలిచ్చే సెషన్లు, అలాగే లేబరేటరీలో లేనప్పుడు గానీ అందుకోసం సిద్ధపడడం గానీ జరగనప్పుడు ఖాళీ ఉన్న గంటలు, నిముషాలూ అన్నీ అపాయింట్‌మెంట్స్‌గా వెయిటింగ్ లిస్ట్‌లోకి చేరి ఇంత పొడుగు జాబితాగా మారేది. కనీసం ఫోన్ వంక చూడ్డానికీ, ఉత్తరాలు చూసుకోవడానికీ

కూడా సమయం ఉండేది కాదు. ఆయన ఎంత బిజీగా ఉంటే ఆయనకి అంత సంతోషంగా ఉండేది.'

'ఒకరోజు మధ్యాహ్నం ఆయన ఇంట్లో ఉన్నపుడు పాట్ నోరిస్‌తో టెలిఫోన్‌లో మాట్లాడారు. వాళ్లిద్దరూ అలా చాలా నిముషాలు మాట్లాడుకున్న తర్వాత, అకస్మాత్తుగా ఆయన, 'రండి ఒకసారి. మీరిక్కడకి రావాలని కోరుకుంటున్నాను. మీరు ఇప్పుడే వస్తారా? మీరు వెంటనే రావాలి. మిమ్మల్ని నేను వెంటనే చూడాలి,' అన్నారు. పాట్ టొపేకా కన్సస్ రిసెప్షన్ & డయోగ్నస్టిక్ సెంటర్‌లో ఒక ప్రొఫెషనల్ క్లినికల్ సైకాలజిస్టు.

ఆమె ట్రైనింగ్ గ్రూప్‌లో ఒక సభ్యురాలు కావడంతో, స్వామీజీ కోరగానే, ఆమె వెంటనే ఆయనను కలుసుకునేందుకు గ్రీన్స్ ఇంటికి వచ్చేసింది. ఆయన అంతగా టెలిఫోన్‌లో కూడా చెప్పలేని విషయం ఏమై ఉంటుందా అని ఆశ్చర్యపోతూ వచ్చింది దారి పొడవునా. పాట్ దారిలో వస్తుంటే, ఇక్కడ స్వామీజీ లివింగ్ రూంలో కూర్చుని ఏదో కాగితం మీద రాస్తున్నారు. తను రాసిన పేపరుని ఆయన సంతృప్తికరంగా చూసి, దాన్ని మడిచి, దానిని తన జేబులో పెట్టుకుని పాట్ రాక కోసం ఎదురుచూస్తూ ఉన్నారు.

పాట్ వచ్చి ఆయన పక్కన కూర్చోగానే 'నన్ను అడగవా!' అని అడిగారు.

'దేని గురించి? నేను దేని గురించి మిమ్మల్ని అడగాలి?' అని ఆశ్చర్యపడింది పాట్.

'దేని గురించైనా. ఊరికే అడుగు. నువ్వు ఏ ప్రశ్న అడిగినా అడగొచ్చు. అడుగు,' అన్నారు.

'ఆమె ఒక్క క్షణం ఆశ్చర్యపోయింది. బహుశా స్వామీజీ మనసులో ఏదైనా ఒక విషయం గురించి ఆలోచిస్తూ ఉండి ఉంటారు, ఏమిటది?' అనుకుంటోంది. పోనీ వాళ్ల టెలిఫోన్ సంభాషణలో కూడా ఏ అంశం మీద అయినా చర్చ జరిగితే దాని మీద అయినా అడిగి ఉండవచ్చు, కానీ అలాగూ జరగలేదు. ఇప్పుడు సరైన ప్రశ్న ఒక్కటీ బుర్రలోకి రావడం లేదు, అన్నీ హాస్యాస్పదమైన ప్రశ్నలే తడుతున్నాయి.

'ఆలస్యం ఎందుకు? అడుగు! అడుగు!'

'అప్పుడు ఆమె తన భవిష్యత్తు గురించి కొన్ని సంక్షిప్తమైన, చిన్న ప్రశ్నలు వేసింది. స్వామీజీ ఆమెకు ఏ సమాధానమూ చెప్పలేదు. ఆయన ఆమె వంక నిర్లిప్తంగా ఒక క్షణంసేపు చూసి, ఇంకా దేని గురించైనా అడగమని చెప్పారు. బహుశా ఆమె అడిగింది సరైన ప్రశ్న కాకపోయి ఉండవచ్చు. ఇంకొంచెం ఆలోచించి మరో ప్రశ్న వేసింది. ఇప్పుడు ప్రత్యేకంగా తన భవిష్యత్తుకి సంబంధించి ఎలాంటి ప్రణాళిక చేసుకోవాలో లేక పోస్ట్ గ్రాడ్యుయేట్ స్టడీస్‌ని తను కొనసాగించగలదో లేదో తెలుసుకోవాలనుకుంది.

'సరే అయితే. మరో ప్రశ్న అడుగు,' అన్నారు స్వామి.

'పాట్ అయోమయంలో పడింది. ఆయన తనని ప్రశ్నలు అడగమంటున్నారే తప్ప, ఆయనకు జవాబిచ్చే ఆసక్తి ఎంతమాత్రం లేదు. పైగా ఆ ప్రశ్నల్ని కూడా ఆయన సరిగా వింటున్నట్టు లేదు. ఆమె ఓ నిముషంపాటు మరి కొంచెం జాగ్రత్తగా ఆలోచించి మరింత వ్యక్తిగతమైన ప్రశ్న అడిగింది.

'మరో ప్రశ్న అడుగు.'

'తను ఏ విషయాల్లో స్వామి సలహా కోరుకుంటోందో ఆయన తెలుసుకోదల్చుకున్నారనీ, అందులో ఏమాత్రం అనుమానం లేదని పాట్ ఒక నిర్ణయానికి వచ్చింది. కానీ ఆమె ఆ ప్రశ్నలన్నింటినీ చాలా ఆలోచించి ఆలోచించీ శూన్యంలోంచీ గాలిలోంచీ లాగుతున్నట్టు

అడుగుతోంది. ఆమె అడగబోతున్న నాల్గో ప్రశ్నకి స్వామి సమాధానం చెప్పడానికి సిద్ధపడ్డారు. అది మరో అర్థవంతమైన వ్యక్తిగతమైన ప్రశ్న.

'ఆమె చాలా నిజాయితీగా తన నాలుగో ప్రశ్న అడగగానే, స్వామి ఆమె వైపు చిరునవ్వుతో తన జేబులో ఇంతకు ముందు రాసి ఉంచిన కాగితాన్ని తీసి ఆమెకి అందించారు.

'ఆమె దాన్ని తెరిచి చూసింది. అక్కడ ఆమె అడిగిన నాలుగు ప్రశ్నలూ వరుస క్రమంలో ఉన్నాయి. వాటికి స్వామీజీ సమాధానాలు కూడా ఉన్నాయి.

'ఆశ్రమ సాంగత్యంలో ఒక మెంబరు డిశెంబరు మొదట్లో చలి పెడుతున్న ఉదయపు వేళ స్వామీజీతో అపాయింట్‌మెంట్ తీసుకుంది. స్వామి మా ట్రైనింగ్ గ్రూప్‌తో కాన్ఫరెన్స్ రూమ్స్‌లో ఒకదాంట్లో ఉన్నారు. ఈ గ్రూపుకి వారు పతంజలి యోగ సూత్రాల మీద ఉపన్యాసాలు ధారావాహికగా ఇస్తున్నారు. ఆ సెషన్‌ని ముగించే రోజు ఆయన కొంచెం ఆలస్యమయ్యారు. ఆ ఉపన్యాసం ముగిసిన తర్వాత నేను మా ఆఫీసుకి పెద్ద స్టీరియో రికార్డరు పట్టుకుని హాల్ లోంచి లోపలికి వచ్చాను. అప్పుడే నేను లాబీలో మూడున్నర ఏళ్ల కొడుకుని ఒడిలో పెట్టుకుని ఆమె కనిపించింది.

'ఆశ్రమ సమూహంతో రెగ్యులర్ మీటింగ్‌లో ఆ శుక్రవారం రాత్రి టవర్ బిల్డింగ్ లెక్చర్ పూర్తి అయిన తర్వాత మేము బయటికి వెళ్లబోతుండగా, ఈమె స్వామీజీని సమీపించి, తన కొడుకు గురించి మాట్లాడడానికి ప్రయత్నించింది. ఆ పిల్లవాడికి విపరీతమైన ఆస్మా. న్యుమోనియా అని కూడా అనుమానం ఉంది. రాత్రిపూట వస్తున్న ఆయాసానికి చాలాసార్లు ఆ పిల్లాడు మరణపు అంచులు చూసి వచ్చాడు. వాడికి ఒక డాక్టరు దగ్గర వైద్యం జరుగుతోంది. కానీ ఆమె వాడి పరిస్థితి మెరుగుపడడం లేదని బాధ పడుతోంది. ఆమె స్వామికి తన బాధ చెప్పుకోవాలని వచ్చింది. ఆ పిల్లవాడు రాత్రంతా నిద్ర లేకుండా పిల్లికూతలు, ఎగశ్వాసతో ఇబ్బందిపడుతూ ఉంటాడని చెప్పాలని ఆమె ఉద్దేశ్యం. కానీ ఆమెకి స్వామిని కలుసుకోవడానికి సమయమే కుదరడం లేదు. ఆయన అక్కడికి వచ్చినందుకు ఎంతో మంది ఆయనకు ధన్యవాదాలు తెలుపుకుంటున్నారు. కొంతమంది ఆయన నుంచి ఏవో కొన్ని మంచి మాటలు, వ్యాఖ్యలు వినాలనుకుంటున్నారు కొంతమంది సెలవు తీసుకుని వెళ్లాలనుకుంటున్నారు. కానీ ఏ కారణం వల్లనో గానీ నిజంగా అత్యవసరంగా కలవాలని వచ్చిన మనిషిని మాత్రం ఆయన పట్టించుకున్నట్టు కనబడడం లేదు. సరిగ్గా వారితో ఆమె మాట్లాడడానికి ప్రయత్నించబోయేసరికి ఆయన అప్పుడే గుమ్మం దాటి బయటికి వెళ్లిపోతున్నవారల్లా అకస్మాత్తుగా వెనక్కి తిరిగి లోపలికి వచ్చి ఆమె పక్కన కూర్చున్నారు. ఆమె తన కుమారుని గురించి చెప్పింది. స్వామీజీ కళ్లు నిదానంగా మూతలు పడుతున్నాయి. ఆ పరిస్థితిలో జనాన్ని కలుసుకున్నందువల్ల ఆయన బాగా అలిసిపోయి అయినా ఉండాలి, లేక నిద్ర వస్తూ అయినా ఉండాలి. చాలా మెల్లగా ఆయన తనలో తాను మాట్లాడుకుంటున్నట్టు చెప్పారు, 'ఈ పిల్లవాడికి గుండె సంబంధమైన సమస్య ఉంది!' అని. ఆ తర్వాత ఆమె వైపు చూసి ఆమె తన డాక్టర్‌ని ఎలక్ట్రోకార్డియోగ్రామ్ చేయమని అడగాలని ఆమెకి సూచించారు. పరీక్షించడానికి ఈకేజీ చేస్తే సులభంగా ఉంటుందని చెప్పారు.

'ఆమె వచ్చి కూర్చుంది, కూడా ఆమె బిడ్డ కూడా ఉన్నాడు. ఆమె వచ్చిందని చెప్పడానికి నేను స్వామీజీ దగ్గరకు వెళ్లాను. అప్పుడు ఆయన, ఎల్మర్ ఒక సంభాషణలో ఉన్నారు. వారు అతని ఆఫీసులోకి వెళ్లారు. స్వామీజీ తన డ్రాయరు సొరుగులోంచి మహానుభావుల చిత్రాలు కొన్ని బయటికి తీసి, ఆ పిల్లవాడితో వాటిలోంచి ఒక చిత్రాన్ని తీసి తనకి ఇవ్వమని చెప్పారు. ఆ పిల్లవాడు తను కోరుకున్న ఓ చిత్రాన్ని తీశాడు. వాడు ఎంచుకున్న చిత్రంలో క్రీస్తు అధునాతన

చిత్రం ఉంది. స్వామి ఆ చిత్రాన్ని ఇంటికి తీసుకుని వెళ్లి అతని గదిలో గోడకి పెట్టమన్నారు. ఆమె ఈకేజీ సమస్యగా ఉందని చెప్పింది. ఆమె తమ డాక్టరుతో తాను ఈకేజీ తీయించిన విషయం చెప్పింది. ఆ డాక్టరు అది తప్పు అన్నట్లు మాట్లాడాడు. తనని కలుసుకోకుండా ఈకేజీ తీయించడం అతడికి కోపం తెప్పించింది. అప్పుడు ఆమె స్వామీజీ చెప్పిన విషయం చెప్పాల్సి వచ్చింది. కానీ అప్పుడు ఆ డాక్టరు కనీసం మీరు మరో డాక్టర్ సలహా అయినా తీసుకుని ఉండాల్సిందని మందలింపుగా తెలియజేశాడు ఆమెకి.

'కానీ యాదృచ్ఛికంగా ఓ కార్డియాలజిస్ట్ ఈకేజీ చూసి నిజంగానే ఆ పిల్లవాడి గుండె అసాధారణ స్థాయిలో తేడా ఉందనీ, అది సరిగా పని చేయడం లేద'నీ చెప్పారు.

'అసలు ఈకేజీ గురించి మీకు ఆలోచన ఎలా వచ్చింది?' అని అడిగాడు ఎల్మర్ స్వామీజీని.

'స్వామీజీ ఆ రాత్రి జరిగిన సంఘటనని గుర్తుచేసుకున్నారు. ఆశ్రమజనులకు బోధ చేసిన తర్వాత ఆయన ఆమె ప్రక్కన కూర్చున్నారు. 'నేను ఆ పిల్లవాడిని నేను పిలిచాను. వాడు నా దగ్గరకు తన కామ (ఆస్ట్రల్) శరీరంలో వచ్చాడు. నేను, 'నీకున్న సమస్య ఏమిటి?' అని అడిగాను. దానికి వాడు, 'ఈ జీవితంలో నేను గుండె సమస్యతో పుట్టాను!' అని చెప్పాడు.'

'దీనితో ఆ పిల్లాడి స్థితి చాలా మెరుగుపడింది. ఆ పిల్లవాడి తల్లి ఈకేజీ తీయించాలని స్వామీజీ చెప్పిన తర్వాత ఆమె డాక్టర్లనే మార్చివేసింది. వాడి ఆరోగ్యాన్ని మెరుగుపరచగల అసలు డాక్టర్ల దగ్గరకు తీసుకుని వెళ్లింది. నిజానికి స్వామీజీ ఆ పిల్లవాడిని ఆశీర్వదించారు. వాడి గురించి ధ్యానించసాగారు. నిజానికి ఆయనిచ్చిన క్రీస్తు చిత్రం ఆ పిల్లవాడి గదిలో ఇప్పటికీ ఉంది.'

కాన్పూరు, అలహాబాదు,బొంబాయి, ఢిల్లీ వంటి అనేక నగరాల్లో ఎందరికో స్వామీజీతో ఇలాంటి అసాధారణ అనుభవాలు ఉన్నాయి. ఒక్క కాన్పూరులోనే సుమారు వందమందికి ఆయన నయం చేశారు, వారి సమక్షంలోకి రాగానే వాళ్ల ప్రశ్నలకి సమాధానాలు దొరికేవి. అలహాబాదులో స్వామీజీ తన తీక్షణమైన కంటి చూపుతో బుల్లెట్‌ప్రూఫ్ గ్లాస్‌ని ముక్కలు చేశారు. హృషీకేష్‌లో ఓ బక్కెట్ నీళ్లని తన వ్రేలి నుంచి ప్రసరింపజేసిన శక్తితో మరిగేలా చేశారు. కేంద్ర మంత్రుల్లో ఒకరైన రాజా దినేష్ సింగ్ వ్యక్తిగత కార్యదర్శి శ్రీ ఆనంద ప్రతాప్ సింగ్ భవంతిలో ఆయన పలుచని గాలిపొర నుంచి ఒక శ్రీ చక్రాన్ని సృష్టించి ఇచ్చారు. వీటిలో ప్రతి ఒక్క సంఘటననీ ఎంతోమంది ప్రత్యక్షంగా వీక్షించారు. భారతదేశంలో స్వామీజీ వంటి అసాధారణ యోగులు ప్రకృతిలోని సూక్ష్మ శక్తుల్ని వశం చేసుకోగల మహానుభావులు ఉంటారు కాబట్టి భారతీయులకి ఇలాంటి 'అతీంద్రియ' సంఘటల్ని చూసే వినే అలవాటు ఉంది. పాశ్చాత్య దేశాల్లో ఇలాంటి శక్తులు చాలా అరుదుగా జరుగుతాయి. అక్కడి ప్రజలకి ఇలాంటి సంఘటనలు తమ కళ్ల ఎదుటే జరుగుతున్నా అవి నిజంగానే జరుగుతున్నాయని వారు అంత త్వరగా నమ్మలేరు. ఈ విషయం స్వామీజీకి కూడా అర్థమైంది. ఎందుకంటే ప్రయోగశాలలో నిర్దిష్ట పరిస్థితుల్ని సృష్టించి తన మీద జరుపుతున్న ప్రయోగాల్ని కూడా ప్రజలు ఆ విధంగానే అనుమానాస్పదంగా చూశారు.

కానీ స్వామీజీ నిరాశ చెందలేదు. ఆయన మనసు ఆధ్యాత్మిక, విజ్ఞానాలకు భాండాగారాలైన ప్రాచ్య పాశ్చాత్యాలను సమన్వయపరిచే వారధిని నిర్మించాలనే కార్యసాధనపై మరింతగా లగ్నమైంది. ఆ సాధనలో ఎన్ని ఆటంకాలు వచ్చినా తట్టుకుంటూ ముందుకు వెళ్లేందుకు స్థిర సంకల్పం కలిగింది. ఆయన ఒక లైసెన్సు ఉన్న డాక్టరేమీ కాదు. అలాగే ఆయన ఎలాంటి మందులూ వాడమని సలహా ఇవ్వడం లేదు. కానీ ఆయన తనను సందర్శించడానికి వచ్చే వారికి

ఏవైనా సమస్యలు ఉన్నాయని తెలిసినపుడు వారి సహాయార్థం కొన్ని యోగ పద్ధతుల్ని పాటించమని చెప్తున్నారు. స్టాఫ్ సైకాలజిస్టుల్లో ఒకరు బలహీనత సమస్యతో బాధపడుతుండేవారు. ఆయన డాక్టర్లు అన్ని మార్గాల్నీ వాడి చూశారు. చివరికి ఆయన స్వామీజీ దగ్గరకు వచ్చారు. స్వామీజీ అతడికి కొన్ని సరళమైన ప్రాణాయామ అభ్యాసాలతో ఆయన ప్రాణాన్ని బాగు చేయాలని సంకల్పించారు. ఈ విధంగా చేయడానికి ఆయన బోయెడ్‌ని ప్రాణానికి సంబంధించిన విషయాల్నీ, అది పని చేసే విధానం గురించీ కొంత నోట్సుని టైప్ చేయమని అడిగారు. దాన్ని ఆయన సైకాలజిస్టుకి ఇవ్వగా, ఆయన తన స్నేహితులకి చూపించారు.

ఈనాడు ప్రాణానికి సంబంధించిన యోగ సిద్ధాంతం విస్తృతమైన ప్రచారంలో ఉంది, దాన్ని అందరూ స్వీకరిస్తున్నారు కూడా. కానీ ముప్పై ఏళ్లనాడు ఈ సిద్ధాంతం పెద్దగా ఎవరికీ తెలియదు, ఎవరూ విని ఉండరు కూడా. మెన్నింగర్ ఫౌండేషన్‌లో స్వామీజీ ప్రాణం గురించి చెప్తూ అది శరీరాన్నీ మనసునీ కలిపి ఉంచే ఒక సూక్ష్మ శక్తి అనీ, జీవశక్తి అనీ చెప్పారు. మనం ఆరోగ్యప్రదమైన జీవనం కోరుకుంటే, ఆ శక్తిని సంతులిత స్థితిలో ఉంచడం ఎంతో అవసరమని తెలియజేశారు. ఈ సూక్ష్మ శక్తి ప్రదర్శనకి శ్వాస అత్యంత అవసరం. మనం శ్వాసించే సమయంలో సాధారణంగా మన నాసికా రంధ్రాలు పెద్దగా విచ్చుకుంటాయనీ అందువల్ల వాటి ద్వారా మన ఊపిరితిత్తులకు ఎక్కువ ప్రాణవాయువు సరఫరా అవుతుందనీ చెప్పారు స్వామీజీ.

సైకాలజిస్టుకి ప్రాణం గురించి ఇచ్చిన ఆ కొద్ది పేజీల నోట్సులోంచి కొంత భాగం ఇలా చదివారూ 'కుడి, ఎడమ నాసికా రంధ్రాల సంతులన చెదిరిపోయినపుడు, 'ప్రాణ' శక్తి కూడా చెదిరిపోతుంది. దానితో ఒక రకమైన భౌతిక రుగ్మత వస్తుంది. కొన్నిసార్లు చిన్న సమస్యలు రావచ్చు మరి కొన్నిసార్లు పెద్ద సమస్యలు రావచ్చు. రుగ్మత రాకుండా మనల్ని మనం సవ్యంగా ఉంచుకోవాలన్నా, జీవితంలో సంతులన సాధించాలన్నా, మనం మన శ్వాసని తిరిగి సంతులితంగా ఉండేలా చూసుకోవాలి. ఈ విధంగా శ్వాస ప్రవాహం రుగ్మతల్ని అరికట్టేందుకు నిశితంగా అధ్యయనం చేయబడింది. శ్వాస రక్తాన్ని ప్రాణవాయువుతో నింపడమే కాక అది 'ప్రాణ' శక్తిని కూడా నిల్వ చేస్తుంది కూడా. శ్వాస శరీరంలోని సానుకూల ప్రతికూల ప్రవాహాల్ని సమన్వయం చేస్తుంది. అంతేకాక కావలసిన అక్కరలేని పరిస్థితుల్ని కూడా ఆకర్షిస్తుంది. ఇది ఆకర్షణ వికర్షణకి చెందిన అయస్కాంత సూత్ర చలనం ద్వారా జరుగుతుంది...ఈ 'ప్రాణ' శక్తిని వ్యర్థం చేస్తే అది రుగ్మతలకి దారితీస్తుంది.'

అతడికి స్వామీజీ ఒక విలక్షణమైన భారతీయ పద్ధతిలో ఒక ప్రముఖ సత్యాన్ని వెల్లడించారని గ్రీన్, బోయెడ్ గుర్తించారు. అయితే పరిశోధన చేస్తున్న సైకాలజిస్టుల్లో స్వామీజీకి కొంతకాలం ప్రతికూలంగా ఉన్న ఒక వ్యక్తి స్వామీజీ నోట్సు చదవడం తటస్థించింది. అతడు స్వామీజీని తన దగ్గరకు సహాయం కోసం వస్తున్న ఆ సైకాలజిస్టుని చూడడానికి వీలులేదనీ, ఆరోగ్యం, చికిత్స రంగంలో నయవంచన చేయడం ఆపాలనీ తీవ్రంగా హెచ్చరించాడు. అతని స్నేహితుడు తనకు తానుగా స్వామీజీ సహాయం అర్థిస్తున్నాడనే విషయం అతని వైఖరిలో ఎలాంటి మార్పూ తీసుకురాలేదు. అతనికి ఒకటే అర్థమైంది. ఈ పేజీల్లో స్వామీజీ అన్ని రకాల రోగాల్నీ ఎడమ లేదా కుడి నాసికా రంధ్రాలతో కాస్త ఎక్కువ, తక్కువ గాలి పీల్చి రోగాల్ని నయం చేసుకోమని చెప్తున్నారు అనుకున్నాడు. ఈ విధమైన అతడు లేనిపోని ఆశలు కల్పించవద్దని స్వామీజీని ఇష్టం వచ్చినట్టు నిందించాడు. డా. గ్రీన్‌కి స్వామీజీ మాటలకి అసలు అర్థం ఏమిటో తెలుసు, వాటిని అవతలి మనిషి కోపంతో ఎలా తప్పుగా వ్యాఖ్యానిస్తున్నాడో తెలుసు. కానీ అనేక చట్టపరమైన సంక్లిష్టతలు ఉండడం చేత స్వామీజీని మళ్లీ ఎన్నడూ ఆ సైకాలజిస్టుని చూడవద్దని

చెప్పడం జరిగింది. బోయెడ్ గమనించినట్లుగా, 'స్వామీజీకి కోపం రావడం కంటే కూడా చాలా బాధపడ్డారు. ఆయనకి ఆ సైకాలజిస్టు నిజంగా నచ్చాడు. ఆ విషయం ఆయన చాలాసార్లు చెప్పారు కూడా. ఆయన చాలాసార్లు ఆ వ్యక్తి గురించి మాట్లాడారు. ఆ వ్యక్తి ఇంట్లోనూ, ఆఫీసులోనూ కూడా ఎంత ఎక్కువగా పని చేస్తాడో, అలాగే ఆయన మెన్నింగర్ ఫౌండేషన్‌లో చేసిన కృషి కంటే కూడా మంచి ఫలితాలు ఈ సైకాలజిస్టు విషయంలో ఎలా సాధించగలిగేవారో చాలాసార్లు ప్రస్తావించేవారు.'

డౌగ్ బోయెడ్ స్వామి పుస్తకం చదివితే స్వామీజీకి మెన్నింగర్ ఫౌండేషన్‌లో ఆయన అనుభవాలు నిరాశకి గురి చేసేవిధంగా ఉన్నాయని అర్థమవుతుంది. కానీ స్వామీజీతో నా వ్యక్తిగత అనుభవంలో ఎలాంటి పరిస్థితిలోనూ ఆయన ఎన్నడూ ఆ విధమైన నిరాశకి గురి కాలేదు. సందర్భాలు ఎంత ఆకస్మికమైన నిరాశావహమైన మలుపు తిరిగినప్పటికీ ఆయన ఏనాడూ చలించలేదు. నిజానికి, ఏదైనా ఆశిస్తే విషాదానికి దారి తీస్తుందని తన విద్యార్థులకు నిరంతరం గుర్తు చేస్తూ ఉండేవారు. అందువల్ల నేను స్వామి చదివిన తర్వాత స్వామీజీ అక్కడ ఉన్నందుకు ఏమైనా నిరాస చెందారా అని అడిగాను.

'నిజంగా నేనేమీ నిరాశ చెందలేదు,' అన్నారు స్వామీజీ. 'కానీ, అక్కడ అందకంటే మంచి అనుభవాలు ఉంటాయని భావించాను. అయితే ఈ ప్రపంచంలో అన్ని రకాల ప్రజలూ ఉంటారు. వాళ్లంతా విషయాల్ని వారి వారి సంస్కారాలతో (గత జన్మల నుంచి తెచ్చుకున్న సూక్ష్మ భావాలతో) వివిధ రకాల కోణాల్లో చూసి అర్థం చేసుకుంటారు. అందుకే ఒకే రకమైన లక్షణం, ఒకే సత్యం వివిధ రకాలుగా వ్యాఖ్యానింపబడుతుంది. అక్కడ జరిగింది కూడా అదే.

'కానీ అదేమంత పెద్ద విషయం కాదు. మెన్నింగర్ ఫౌండేషన్‌లో నేను చేసిన పని ఒక లక్ష్యం కోసం చేయబడింది. ఆ ప్రాజెక్ట్‌లో ఎంతమంది డాక్టర్లు, పరిశోధకులు పాలుపంచుకున్నారనేది గానీ, వారిలో ఎంతమంది నన్ను ప్రశంసించారు, ఎంతమంది విమర్శించారు అనేది గానీ ఇక్కడ విషయం కాదు. అక్కడ ఎంత క్రియాశీలత, కదలిక వచ్చిందనేది చూడాలి. విద్యాపరమైన, శాస్త్రీయపరమైన ఆలోచనా దృక్పథం గలవారి దృష్టిని యోగ పద్ధతుల వైపు మళ్లించడం జరిగిందనేది ఇక్కడ మనం ప్రధానంగా ఆనందించాల్సిన విషయం.

'నేను ఆ శాస్త్రజ్ఞులతో కలిసి పని చేయడం వల్ల నా మిషన్‌ని ముందుకు తీసుకుని వెళ్లగల విద్యార్థులు, స్నేహితులు, సహచరుల్ని నేను వెతుక్కోగలిగాను. నేను అక్కడున్న నాలుగు నెలల్లో అమెరికాలోనూ మిగతా ప్రపంచదేశాల్లోనూ ఎంతోమంది విద్యావంతులకి నాగురించి తెలిసింది. ఈ ఘనతలో ఎక్కువ భాగం మెన్నింగర్ ఫౌండేషన్‌కే చెందుతుంది. నాకు కోపం తెప్పించి నా పనిని పాడు చేయదల్చినవారికి నేను మరింత కృతజ్ఞుడినై ఉంటాను. వాళ్లు అలా చేయబట్టి నేను ప్రజలకి అందుబాటులో ఉండడానికి పరిధిని మరింత విస్తృతం చేశాను. నా గురువు కోరుకున్నదీ అదే.

'నేను సకలం వదిలేసి దైవచింతనని ఎంచుకున్న ఫకీరుని. నేను ఆ ప్రదర్శనల్లో ఏ ఒక్కటీ చేయడానికి కారణం లేదు. నా గురువు ఆకాంక్ష మేరకు నన్ను నేను ఆ ప్రయోగాలకు గురిచేసుకున్నాను. నా చుట్టూ ఎంతోమంది ప్రజలు ఉన్నారనే సంగతి నేను గమనించినప్పుడు, ఇక నేను స్వయంగా ఒక సంస్థని (ది హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్) స్థాపించడానికి సమయం ఆసన్నమైందని అర్థం చేసుకున్నాను. ఆ వేదిక మీద నుంచి మనం సాధు సందేశాన్ని అందించవచ్చు.'

ఈ సంభాషణతో నాలో మరో ప్రశ్న మెదిలింది. స్వామి వివేకానంద, స్వామి రామతీర్థ వంటి గొప్ప సాధువులు కూడా ఈ దేశానికి సందేశం ఇచ్చారు. సైన్సు మీద ఆధారపడకుండానే తమ శైలిలో ఆ సందేశం ఇచ్చారు. ఆధ్యాత్మికతకీ, విజ్ఞానానికీ మధ్య గల అంతరం ఎన్నో

యుగాలుగా ఉంటూ వస్తోంది. ఇటూ ఆధ్యాత్మిక నాయకులూ, అటు శాస్త్రజ్ఞులూ ఎవరూ ఆ అంతరాన్ని పూరించాల్సిన అవసరం ఉన్నట్టు భావించలేదు. అందువల్ల ఇప్పుడు ఒక ఆధ్యాత్మిక విషయాన్ని విజ్ఞానపరమైన ప్రయోగాలతో నిరూపించాల్సినంత అవసరం కొత్తగా ఏం వచ్చింది? బాబాజీ స్వామీజీకి ఇలాంటి పని ఎందుకిచ్చారు? ప్రాచ్య పాశ్చాత్యాలకీ ఆధ్యాత్మికతకీ, విజ్ఞానానికీ మధ్య వారధి వేయాల్సిన పని ఏముంది? అది అంత ముఖ్యమైన పని ఎందుకైంది? ఆధ్యాత్మికతకీ, విజ్ఞానానికీ మధ్య అంతరం పూరించడానికీ, వారధి వేయడానికీ గల ప్రక్రియ మెన్నింగర్ ఫౌండేషన్‌తోనే ఎందుకు ప్రారంభమైంది?

నేను స్వామీజీతో ఈ మాట అన్నపుడు, ఆయన 'ఈనాడు సైన్సు విపరీతమైన వేగంతో పెరుగుతోంది. శాస్త్రీయ పరిశోధనలు లౌకిక వస్తువులు, సౌకర్యాలను అనంతంగా ఉత్పత్తి చేయడానికి దోహదపడుతున్నాయి. మనం నివసించే ఈ ప్రపంచంలో మానవాళికి అందవలసిన ఆధ్యాత్మిక అవగాహన అదే వేగంతో అందకపోతే, మానవ నాగరికత చాలా లోపభూయిష్టంగా తయారై చివరికి అంతరించిపోతుంది,' అన్నారు.

అప్పుడు మళ్లీ ఉన్నట్టుండి ఆయన ఇలా చెప్పారు, 'ఎల్మర్, అలైస్ గ్రీన్‌ల విషయం వేరు. వారు చాలా విలక్షణమైనవారు. మొట్టమొదటి సమావేశంలోనే నాకు మిసెస్ గ్రీన్ నా తల్లిలా అనిపించింది. నేను వాళ్లతో ఉండడం మొదలుపెట్టే సరికి నా భావోద్వేగాల్ని ఆపుకోలేకపోయాను. వారితో నా గురువు గురించిన విషయాలన్నీ నేను చెప్పుకున్నాను. ఎంతా అంటే చివరికి నాకే అనిపించింది, ఇలా చెప్పడం సమంజసం కాదేమోనని. నా గురువు గురించి నేను ఎవరితోనూ ఇంత విశదంగా ఏనాడూ చెప్పలేదు, కానీ మిసెస్ గ్రీన్‌తో చెప్పాను. నా గుండెల్లో నా గురువుకున్న రహస్య స్థావరం ఎప్పుడూ ఎవరి ముందూ తెరవలేదు. కానీ ఇక్కడ! నాకే ఆశ్చర్యం, ఆయన గురించి ఇలా చెప్పేశానేమిటా అని! ఆ తర్వాత గురూజీ ద్వారానే తెలిసింది గ్రీన్స్ చాలా విలక్షణమైన ఆత్మలనీ వారు పూర్వజన్మలో యోగులనీ, వారు మానవాళికి సేవచేయడానికీ, దిశానిర్దేశం కావించడానికీ ఈ జన్మలో పెట్టి పుట్టారనీ! వాళ్లు ఈ జన్మలో తుదిశ్వాస తీసుకునే వరకూ ఆ పుణ్య కార్యం చేసి తీరతారు. ప్రజల్ని వేదనల నుంచి విముక్తం చేస్తారు.

'గ్రీన్స్ సైన్సు సంబంధమైన వాతావరణంలో ఉంటూ, వారు సైంటిఫిక్ ధోరణిలో ఉండేవారు చేయలేని విధంగా నాకు వారి ప్రేమని పంచారు. వారు గనక నన్ను అచంచలమైన నమ్మకంతో అనుసరించి, యోగాన్ని ప్రేమించి ఉండకపోతే యోగం యొక్క వాస్తవిక ప్రేరణని నాశనం చేయడంలో వారు కూడా నిమిత్తమై ఉండేవారు. సంపూర్ణ ఆరోగ్యాన్ని పొందడంలో యోగ విజ్ఞానానికి సరైన స్థానం దక్కి ఉండేది కాదు. అనేక సంప్రదాయాలు, పద్ధతుల్లో అది కూడా ఒకటిగా మారి ఉండేది. కొంతమంది నన్ను విమర్శిస్తుండడం వల్ల అది మిగతావారిలో ఆసక్తిని కలిగించింది. మా గురుదేవులు అనేకమైన విచిత్ర రీతులు, మార్మిక పద్ధతుల్లో పనిచేశారు.

'ఆయన ద్వారా నెలకొల్పబడిన ఆధ్యాత్మిక, దాతృత్వ సంస్థ ఒక ప్రాయోగిక జ్ఞానానికి ప్రామాణికమైన వనరుగా శాస్త్రవేత్తలు ఎన్నటికీ అంగీకరించరు. ఓ పరిశోధకుడు పెద్ద డిగ్రీలు తగిలించుకుని ఓ ప్రతిష్ఠాత్మక విశ్వవిద్యాలయంలో మిలియన్ల డాలర్లు ఖర్చు చేసి క్రొవ్వులు, చక్కెర ఎక్కువగా ఉన్న పదార్థాలను రాత్రి బాగా ప్రొద్దు పోయాక భోజనం చేస్తే అది ఆరోగ్యాన్ని దెబ్బతీస్తుందని చెప్తే గానీ ప్రజలకి ఎక్కదు. సాధువులు, యోగులు ఈ సరళమైన సత్యాలనూ, తమ వ్యక్తిగత అనుభవాలను ప్రజలు పట్టించుకోరు. ఆ విధంగా వారు చాలా బాధపడుతుంటారు. మెన్నింగర్ ఫౌండేషన్‌లో నేను కేవలం మానసిక శక్తి శరీరం మీద ఎంతగా పని చేస్తుందో

కేవలం ఉపన్యాసాలు మాత్రమే చెప్పి ప్రదర్శన ఇవ్వకపోతే, జనం 'ఈ హిందూ స్వామి వచ్చి ఆయన సంస్కృతి అంతా మన మీద రుద్దుతున్నాడు' అనుకునేవారు.

'ఆ ప్రదర్శనల తర్వాత నేను హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్‌ని నెలకొల్పాను. ఈ సంస్థ క్రిష్టియన్లు, యూదులు, హిందువులు, బౌద్ధులు, ముస్లింలు అందరూ ఎంతో గౌరవభావంతో చూసేవారు. శాస్త్రజ్ఞులు, డాక్టర్లు, గురువులు, విద్యార్థులు, వ్యాపారస్తులు అందరూ సమానంగా వచ్చి ఎలాంటి సంకోచమూ లేకుండా సార్వత్రిక ఆధ్యాత్మిక సిద్ధాంతాల్ని నేర్చుకునేవారు. ఈ సంస్థ తన విశ్వసనీయత నిలబెట్టుకున్నంతసేపూ అది ప్రాచీన, నవీన విజ్ఞానాల మధ్య ఉన్న అంతరాన్ని అధిగమించేలా వారధిగా నిలబడుతూ తన పని చేసుకుంటూ పోతుంది. సంస్థాగతమైన కార్యకలాపాల్లో ప్రజలు పాలు పంచుకుంటున్నారంటే వారికి కూడా ఈ సంస్థ చేసే పని మానవ హృదయాల్ని సంస్కరించి ప్రపంచవ్యాప్తంగా ఉన్న అన్ని రకాల ఆధ్యాత్మిక సంప్రదాయాలతోనూ అనుసంధానం చేసే పవిత్రమైన సూత్రాన్ని తిరిగి ఆవిష్కరిస్తుంది.'

1945లో ప్రపంచ యుద్ధం ముగిసింది. అమెరికా ఆర్థిక వ్యవస్థ బ్రహ్మాండంగా పుంజుకుంది. సంపద అందించే సౌకర్యాలూ, విలాసాలూ అన్నీ అమెరికన్లు సొంతం చేసుకుంటున్నారు. కొత్త ఆర్థిక అవకాశాలు ప్రజల్ని వారి సొంత వూళ్ల నుంచీ, ఉమ్మడి కుటుంబాల నుంచీ బయటికి నెట్టేశాయి. ఈ విధమైన కొత్త చైతన్యం వ్యక్తిగత స్థాయిలో వారికి విస్తృతమైన స్వేచ్ఛని కల్పించింది. కానీ అది కూడా వారిని భావోద్వేగపరమైన ఊతం లేకుండా చేసింది, ఉమ్మడి కుటుంబాలు చూపే మార్గదర్శకత్వం నుంచి దూరం చేసింది. జనం తక్కువ సమయంలో ఎక్కువ డబ్బు సంపాదించాలనీ, ఎక్కువ విశ్రాంతిగా ఉండాలనీ కోరుకుంటున్నారు.

టెలివిజన్, ఇంకా ఇతర విధాలైన మాస్ మీడియా ఆ అవసరాల్ని తీరుస్తోంది. బాహ్య ప్రపంచంలో పెరుగుతున్న సంపద అంతరంగ ప్రపంచంలో శూన్యపు భావనని పెంచుతోంది. అది అరవై దశకాల్లోని సంస్కృతిని పెంచి పోషిస్తోంది, అలాగే ప్రత్యామ్నాయ జీవిత విధానాలు, మతపరమైన విశ్వాసాలు, ఆధ్యాత్మిక పద్ధతులతో కూడిన ప్రయోగాలకూ అవకాశాన్నిచ్చింది. ప్రాచ్య పాశ్చాత్యాల మధ్యా, ఆధ్యాత్మికతా విజ్ఞానాల మధ్య వారధి నిర్మించడానికి తను రెండింటినీ నిశితంగా అర్థం చేసుకోవలసి ఉంటుందనీ, ఆ రెండింటిలోనూ సాధారణంగా ఉన్న అంశాల్ని తీసుకోవలసి ఉంటుందనీ స్వామీజీకి తెలుసు. మెన్నింగర్ ఫౌండేషన్‌లోనూ, ఆయన ఉపన్యాసాలు ఇస్తూ పర్యటనలు చేస్తున్నప్పుడూ ఆయన పాశ్చాత్య సాంస్కృతిక మనోవిజ్ఞానాన్ని చాలా నిశితంగా పరిశీలించారు, ముఖ్యంగా అమెరికన్ సమాజంలో లోపించిన అంశమేమిటో స్పష్టంగా తెలుసుకున్నారు. అక్కడ కుటుంబ బంధాలు చాలా బలహీనంగా ఉన్నాయి. ప్రాచీన విలువలు పతనమైపోయాయి, కొత్త విలువలు ఇంకా రూపొందించబడలేదు, ఆధ్యాత్మికతకీ విజ్ఞానానికీ మధ్య గల సంపర్క సూత్రం ఖండితమైంది. ఆర్థిక వ్యవస్థ కూడా అనంత వస్తు సంపదలు పొందాలనే అసంతృప్త ఆకాంక్షల్ని రెచ్చగొడుతోంది. ప్రజలు ఎక్కడో లోతుల్లో దాగి ఉన్న జీవిత పరమార్థాన్నీ సార్థకతనీ అన్వేషిస్తున్నారు.

అధ్యాయం 9

# పాశ్చాత్య మూలాలు

స్వామీజీ భారతదేశం విడిచిపెట్టక మునుపే, పాశ్చాత్య సమాజం ఏ దిశగా పయనిస్తోందో ఆయనకు అర్థమైంది. తన గురువు నుంచి స్పష్టమైన ఆదేశాలు పొందడం కోసం ఆయనకు ప్రాచ్య పాశ్చాత్య భావనల్ని విశదీకరించి చెప్పి, 'జీవితాన్ని ఈ రెండు భావనలూ వేర్వేరు విధానాల్లో చూస్తాయి. నేను నా సందేశాన్ని పాశ్చాత్య దేశాలకి ఎలా ఇవ్వగలను?' అని అడిగారు స్వామీజీ.

దానికి బాబాజీ, 'ఒకే ప్రపంచంలో నెలకొని ఉన్న ఈ రెండు రకాల జీవన విధానాలూ జీవన సార్థకతకే ఉపయోగపడతాయి, కానీ రెండూ చెరో కొసలోనూ ఉన్నాయి. ప్రాచ్య పాశ్చాత్య దేశాలు జీవితాన్ని సరైన విధానంలో ఎలా నడిపించాలో అనే విషయం మీదే ప్రయోగాలు చేస్తున్నాయి. హిమాలయ పరమగురువుల సందేశం కాలపరిమితులు లేనిది. దానికి పురాతన ప్రాచ్య పాశ్చాత్య భావనలతో సంబంధం లేదు. మనమంతా పాటుపడుతున్న నాగరికతలో ఉత్కృష్ట దశ సాధించడానికి తీవ్ర స్థితిలో కొసలకి చేరి ఉన్న సిద్ధాంతాలు పని చేయవు,' అని చెప్పారు. బాబాజీ చెప్పిన ఈ మాటలు స్వామీజీకి పాశ్చాత్య ప్రాంతంలో తాను నిర్వర్తించవలసిన కర్తవ్యం ఏమిటో రూపొందించుకోవడానికి ఒక దారి చూపించినట్టయింది.

స్వామీజీ 1970 లో డిశెంబరు మధ్య నాటికి మెన్నింగర్ ఫౌండేషన్‌ని కొన్ని నెలలపాటు విడిచిపెట్టారు. ఆయన తిరిగి అమెరికా రాష్ట్రాలు తిరిగి వెళ్లేవరకు ఆయన చికాగోనే ప్రధాన నివాసంగా చేసుకున్నారు. ఆయనకి ఒక ఆశ్రమం లేదు. తనకంటూ ఒక కేంద్రం లేదు. అందుకే ఆయన ఎప్పుడూ వివిధ హోటళ్లలోనూ మెట్రోపోలిటన్ ప్రాంతంలోని మోటెళ్లలోనూ బస చేస్తుండేవారు. స్వామీజీతో సన్నిహితంగా మెలిగే విద్యార్థులకి ఆయన పర్యటనల గురించి ముందుగా తెలిసేది. వారు తమ తమ ఇళ్ల నుంచే ఓ ఆఫీసులాంటిది నడిపేవారు. ఆయన చికాగోలో ఉన్నపుడు ఇతర నగరాల నుంచి ఆయనను వెతుక్కుంటూ వచ్చేవారికి వారు సహాయపడేవారు. చాలామంది స్వామీజీని తమతోనే ఉండమని ఆహ్వానించేవారు. కానీ ఎంతో కాలంగా ఏకాంతంగా ఉండడానికి ఆయన అలవాటుపడడం వల్ల హోటళ్లలోనే ఉండేవారు. స్వామీజీని ఎంతో పూజ్యభావంతో కొలిచే భారతీయ కుటుంబాల్లో ఇది కొంత ఆందోళన కలిగించింది. చికాగోలో ఉండే కొంతమంది భారతీయులు స్వామీజీని 'హోటల్ స్వామి' అంటూ ఉంటారు ఈనాటికీ!

1980 వసంతకాలంలో నేను ఈ దేశానికి కొత్తగా వచ్చాను. ఇంకా అప్పటికి నేను మిన్నియాపోలిస్‌లోనే ఉంటున్నాను. ఆ సమయంలో భారతీయ సంతతికి చెందిన ఒక వ్యక్తి నా

దగ్గరకి వచ్చి, 'స్వామీజీ చాలా గొప్పవారు, మన హిందూ మత ప్రబోధంలో గొప్ప అగ్రగామి. కానీ ఆయన ఎంతసేపూ అమెరికన్లనే కలుస్తుంటారు, మనకి అసలు సమయం ఇవ్వరు. ఉండడానికి ఆయనకి ఎక్కడా నివాసస్థానం లేకపోయినా, ఆయన తన స్వంత దేశపౌరులకి దూరంగా ఉంటారు. ఆయనకి ఇప్పుడు పెన్సిల్వేనియాలో పెద్ద కేంద్రం ఉంది. చిన్న చిన్న కేంద్రాలు దేశమంతటా ఉన్నాయి. కానీ ఆయనతో *సత్సంగం* ఏర్పాటు చేసుకోవడం ఎంతో కష్టం!' అన్నాడు.

ఈ మనిషి స్వామీజీని చికాకు పెట్టదలుచుకున్న మనిషేనని నాకు అర్థమైంది. తాను హిందువు కావడం వల్ల స్వామీజీపై తనకి ఒక ప్రత్యేకమైన అధికారం ఉన్నట్టు అతడు భావిస్తున్నాడు చూడండి! ఆ తర్వాత కొద్దికాలానికి నేను పెన్సిల్వేనియాలోని ఇన్‌స్టిట్యూట్ హెడ్‌క్వార్టర్స్‌లో స్వామీజీని కలిసినప్పుడు అక్కడ ఉన్న భారతీయులం మేమిద్దరమేనని గమనించాను. అదేమిటా అని నేను ఆశ్చర్యపోయాను. అందుకే నేను ఓ రోజు స్వామీజీతో నేను ఆ వ్యక్తి అన్న మాటలే చెప్పాను. దానికి ఆయన, 'మనం ఇక్కడ అరవైమందిమి ఉన్నాం. కానీ నువ్వు, నేను తప్ప ఇక్కడ భారతీయులు ఎవరూ లేరు,' అన్నారు.

'నా మిషన్ కేవలం భారతీయులకి మాత్రమే పరిమితమై లేదు,' అన్నారు స్వామీజీ.

'మా గురువుగారు నన్ను ప్రాచ్య పాశ్చాత్యాలకీ, విజ్ఞానం, ఆధ్యాత్మికతకీ మధ్య వారధి వేయడానికి పంపారు. నాకో పని ఉంది. అన్ని రకాల విశ్వాసాలు గల ప్రజలకీ, జీవితంలో అన్ని రంగాల వారికీ పరస్పరం ప్రేమ కలిగేలా, వారికిగల అత్యుత్తమమైన వాటిని అందరితో పంచుకునేలా, తమ తమ నేపథ్యాల ద్వారా తాము పొందిన బలహీనతల్ని గ్రహించేలా, ఆ బలహీనతల్ని వారికి వారుగా అధిగమించేలా చేయడం నా పని. 'హిమాలయ పరమగురువులతో జీవనం'లో మా గురువుగారు ఏమన్నారో చూశావుగా. 'హిమాలయ యోగుల మొట్టమొదటి సందేశం ఒకటే, *అన్ని రకాల భయాల నుంచీ విముక్తి!* మనలోని వాస్తవికతని నిరంతరం ఎరుక కలిగి ఉండడం రెండవ సందేశం. మిగతా అన్ని జాతి సముదాయాల్లాగానే, భారతీయులు కూడా అన్ని సంప్రదాయాల్నీ తనలో కలిపేసుకునే ఈ 'అమెరికా' లో కలిసి తమ స్వంత సాంస్కృతిక గుర్తింపుని కోల్పోతామేమోనని భాయం! భారతదేశం అతి ప్రాచీన దేశం. దాని సంస్కృతి బహుముఖీయమైనది. భారతీయులు ఉన్నతమైన ఆదర్శాల్ని పోషించేందుకు అలవాటు పడ్డారు. కానీ ఈ ఆదర్శాల్ని వారు చాలా అరుదుగా తమ పనుల్లో ప్రతిబింబిస్తారు. అందుకే భారతదేశానికి ఎంత గొప్ప సంపద, జ్ఞానం ఉన్నా గత పదిహేను వందల సంవత్సరాలుగా అనేక బాధలు పడుతోంది.

'ఈ దేశానికి వచ్చిన కొత్తల్లో కొన్ని సంవత్సరాలు నేను అనేక హిందూ కుటుంబాల్నీ, సంస్థల్నీ చూశాను. చాలా అరుదైన సందర్భాల్లో మాత్రమే వాళ్లు నా దగ్గర నుంచి ఏదైనా నేర్చుకోవాలనుకున్నారు. మిగతా అన్ని సందర్భాల్లోనూ అన్ని విషయాల గురించీ వాళ్లకి ఎంత జ్ఞానం ఉందో నాకు తెలియజేయాలనుకున్నారు. నేనేం చెప్పాలో, ఎలా చెప్పాలో కూడా వాళ్లే చెప్తుండేవాళ్లు. వాళ్లు అమెరికన్లని విమర్శించేవారు.

అమెరికన్లకి శీలసంపద లేదు. వాళ్లు భౌతికవాదులు. వాళ్లకి తమ తల్లిదండ్రుల్ని గౌరవించడం రాదు. వాళ్లకి తమ పిల్లల్ని క్రమశిక్షణలో పెట్టుకోవడం రాదు. వారికి తమ జీవిత భాగస్వాముల పట్ల విశ్వసనీయంగా మెలగడం చేతకాదు. వాళ్లు గోమాంసం తింటారు. వాళ్లకి హిందూ మతం అన్ని మతాలకీ మూలమనే విషయం తెలియదు...ఇలా ఎన్నో చెప్పేవారు. ఇలాంటి వాళ్లలో చాలా గ్రూపులు ఉంటాయి. నేను ఒక భారతీయ కుటుంబం లేదా సంస్థతో కలిసి ఉన్నానంటే, నన్ను కూడా సహజంగా పార్టీ రాజకీయాల్లోకి లాగేస్తారు. 'రెండు తలలు,

మూడు అభిప్రాయాలు' అనే సామెత భారతదేశంలో ఎంత ప్రచారంలో ఉందో, అమెరికాలో ఉన్న భారతీయుల విషయంలోనూ అంతే ప్రచారంలో ఉంది. ఒక గ్రూపుతో నేను ప్రేమగా మెలిగానంటే అది మిగతావారితో శత్రుత్వం తెచ్చిపెడుతుంది.

'నేను ఋషి విజ్ఞానాన్ని హిందూమతంతో అనుసంధానించకుండా బోధిస్తూ వచ్చాను. దాంతో హిందువులు, సిక్కులు, జైనులు, ఎవరైనా గానీ అంతా అమెరికన్లతో కలిసి కూర్చుని విన్నారు. ఆ విధంగా హిందువులు ఉదారవాదులయ్యారు. నేను భారతీయుల్ని ప్రేమిస్తాను. కానీ నేను వాళ్ల పిల్లల్ని ఇంకా ప్రేమిస్తాను. కారణం...వాళ్లు మరింత ఉదారంగా ఉన్నారు. వాళ్ల దృక్పథం వాళ్ల తల్లిదండ్రుల దృక్పథం కంటే విశాలమైనది.

'ఈ పిల్లల ద్వారా పాశ్చాత్య దేశాల్లో ఉంటున్న భారతీయ మూలాల ప్రజలు వేదాల్లో గ్రంథస్థం చేసిన ఋషి విజ్ఞానం హిందూమతానికి ఆత్మ అని గుర్తిస్తారు. సంప్రదాయాలు, ధార్మిక ఉత్సవాలు, వివిధ రకాలైన విభాగాలు హిందూ మతానికి బాహ్య వస్త్రాల్లాంటివి. అమెరికాలో ఉన్న హిందూ కుటుంబాలు వాళ్ల సంతానం వాళ్లని 'మనం ఎవరు? మన మూలాలెక్కడ? మన వారసత్వం ఏది? మనం మిగతావారి కంటే ఎక్కువేనా? ఒకవేళ ఎక్కువే అయితే, ఎందులో ఎక్కువ?' అని అడిగినపుడు మా గురువుగారు నెరవేర్చాల్సిన బృహత్తర కార్యం విలువని అర్థం చేసుకుంటాయి.'

మా గురువుగారు అన్నారు, 'తూర్పు తూర్పే, పడమర పడమరే!' అన్న మాట పాతకాలం నాటి భావన. పాశ్చాత్యులు తూర్పు దేశాలతో పంచుకోగల విజ్ఞానం చాలానే ఉందన్నమాటలో సందేహమే లేదు. కానీ తూర్పు దేశాలు కూడా పాశ్చాత్య దేశాలకు అందించగల జ్ఞానం చాలానే ఉంది. పాశ్చాత్య పుష్పం ప్రాచ్య పరిమళం వెదజల్లకపోతే ఆ పుష్పమే వ్యర్థం,' అనేవారు. నేను ఈ విషయాన్ని ఎప్పుడూ గుర్తుంచుకుంటాను. కేవలం హిందూ సముదాయంలో పని చేయడం, హిందూ మతానికే పరిమితమై ఉండడం, హిందూ వేదికల మీద సాధువుల సందేశం ఇవ్వడమనేది నా గురువు తలపెట్టిన బృహత్తర కార్యక్రమాన్ని భంగపరుస్తుంది. అందుకే నన్ను నేను వారికి దూరంగా హోటళ్లలో ఉంటున్నాను.'

అయినా హోటళ్లలో ఉండే ఏర్పాటు ఏమంత బాగుండేది కాదు. ఆ రోజుల్లో శాకాహారం దొరకడం చాలా కష్టంగా ఉండేది. స్వామీజీ చాలా సార్లు దోశెలు తిని ఉండేవారు. యాలకులు, అల్లం, కుంకుమపువ్వు, పంచదార వేసి తయారు చేసే 'టిల్క్' తాగేవారు. ఈ పానీయం ఆయనకు ఎంతో ఇష్టం. ఇది తయారు చేయడానికి ఆయన శిష్యులు ఒక హాట్‌ప్లేట్‌ని ఆయన గదిలోకి తీసుకొచ్చి పెట్టేవారు. ఇక అక్కడ నుంచి ఆ టిల్క్ హడావుడి అంతా ఇంతా కాదు. స్వామీజీని చూడడానికి ఎందరో సందర్శకులు వస్తుండేవారు. శిష్యులు గురువుగారి కోసం టిల్క్ తయారు చేస్తున్నపుడు సాధారణంగా ఆ పాలు తరచుగా మరిగిపోతూ ఉండేవి, లేకపోతే పొంగిపోయి కార్పెట్ మీద పడేవి. బాత్‌రూం సింక్‌లో దాన్ని కడగడం చాలా కష్టంగా ఉండేది. ఇది చాలదన్నట్టు, భారతీయ కుటుంబాల నుంచి తరచుగా స్వామీజీకి భోజనం వచ్చేది. ఘాటుగా ఉండే భారతీయ మసాలా వాసనలు హోటల్ మేనేజ్‌మెంట్ దృష్టిని ఠక్కున ఆకర్షించేవి. కార్పెట్ల మీద, కేండిల్స్, అగరవత్తులు, వెలిగించినపుడు కార్పెట్ మీద చిన్న చిన్న రంధ్రాలు పడడం వల్ల అప్పటికే వాళ్లకి గుర్రుగా ఉంది. ప్రయాణాల్లో ఖాళీ సమయం దొరకని స్వామీజీ ఉపన్యాసాలు, బోధనా తరగతులు నిర్వహించేవారు. స్వామీజీ భారతదేశంలోని కాన్పూరులో ప్రచురితమయ్యే 'వాయిస్ ఆఫ్ హిమాలయాస్' అనే పత్రికకి వ్యాసాలు రాస్తుండేవారు. తాత్కాలికమైన క్వార్టర్స్‌లో ఉంటూ ఆ విధంగా రాయడం ఆయనకు చాలా కష్టంగా ఉండేది. ఆయన వేరే నగరం నుంచి వచ్చినపుడు ఒక కొత్త హోటల్ రూమ్‌లో సెటిల్ అయ్యేవారు, ఆయన శిష్యులు ఒక పేపరు, టైప్ రైటర్ తెచ్చి

ఇచ్చేవారు. స్వామీజీ ఒక మూల కూర్చుని ఎవరో ఒకరికి డిక్టేషన్ ఇచ్చేవారు. దాన్ని వాళ్లు లాంగ్‌హ్యాండ్‌లో రాసుకుంటే, మరో వ్యక్తి వాళ్లకి ఎదురుగా ఇంకో మూలలో కూర్చుని టైప్ చేస్తుండేవాడు. ఈ పని సాధారణంగా రాత్రి ఒంటి గంట, రెండు గంటల సమయం దాకా తీసుకునేది. శిష్యులు వెళ్లిపోయాక స్వామీజీ స్నానం చేసి ధ్యానం చేసుకునేవారు.

చివరికి చికాగోలో ఈ గ్రూపుకి ఈ విధమైన సంచార జీవనం చాలా హాస్యాస్పదంగా తోచింది. స్వామీజీ మకాం ఉండడానికీ పని చేయడానికీ ఒక స్థిర నివాసం, ఆయనతో కలిసి పని చేసేవారికి ఒక ఆఫీసు అవసరమని భావించారు. అందువల్ల వాళ్లు ఆయన మిషన్‌ని ముందుకు తీసికెళ్లే ఉద్దేశ్యంతో వెళ్లి ఒక లాభాపేక్ష లేని సంస్థని నెలకొల్పడానికి చేసిన ప్రస్తావనని స్వామీజీ అంగీకరించారు. యోగ సైన్స్ హిమాలయన్ ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ యోగా సైన్స్ అండ్ ఫిలాసఫీ ఇన్‌కార్పొరేషన్ పత్రాలు 23 జూన్ 1971 న దాఖలు చేయడం జరిగింది.

ఈ క్రొత్త ఇన్‌స్టిట్యూట్‌ని చికాగోని బ్యారింగ్టన్ శివారు ప్రాంతంలో అద్దెకు తీసుకున్న ఒక ఇంట్లో ప్రారంభించడం జరిగింది. అక్కడ స్వామీజీ ఉపన్యాసాలు, ఉపాధ్యాయులకు శిక్షణ తరగతులు మొదలుపెట్టారు. ఉదయం ఆయన యోగ, ప్రాణాయామాలు, విశ్రాంతినిచ్చే ఇతర పద్ధతులు నిర్వహించేవారు. అలాగే సాయంత్రం వేళల్లో ఆధ్యాత్మిక విషయాలపై ఉపన్యాసాలను ఇచ్చేవారు. ఇప్పుడు స్వామీజీకి ఒక కార్యాలయం ఉంది కాబట్టి ప్రజలు వారికి కాల్ చేసి అపాయింట్‌మెంట్స్ తీసుకుంటూ ఉండేవారు, ఆయన ప్రయాణ ఏర్పాట్లు కూడా చాలా సులభంగా ఒక క్రమపద్ధతిలో నిర్వహించబడేవి. వారు శిక్షణ ఇచ్చిన శిక్షకులు గ్రేటర్ చికాగోలోనూ ఇతర నగరాల్లోనూ తరగతులు ప్రారంభించారు. ఒక సంస్థగా రూపుదిద్దుకున్న వెంటనే దేశ విదేశాల్లో అది అనేక శాఖలు, అనుబంధ కేంద్రాలుగా ప్రపంచవ్యాప్తంగా పనిచేయడం ప్రారంభమైంది.

స్వామీజీ అమెరికాలోని వివిధ నగరాల్లో వారానికి నాలుగు రోజుల పాటు ఉపన్యాసాలు ఇస్తూ అత్యంత పటిష్టమైన ప్రణాళికని నిర్వహించారు. షికాగోకి వారాంతాల్లో వచ్చి ఉపన్యసించేవారు. వారు భారతదేశానికి చలి తీవ్రంగా ఉండే శీతాకాలం చివరి భాగంలో వచ్చి చికాగోకి వసంతకాలంలో తిరిగి వెళ్తుంటేవారు. ఆయన ఆ విధంగా తూర్పు ప్రాంతానికి వచ్చి వెళ్లే సమయాల్లో మార్గమధ్యంలో గ్రేట్ బ్రిటన్, హాలండ్, స్విట్జర్లాండ్, బెల్జియం, జర్మనీ, ఇటలీ, ఫ్రాన్స్, స్పెయిన్ దేశాల్లో సెమినార్లు, సమావేశాలు నిర్వహించేవారు. ఆయన ఒక నగరంలో మొదటిసారిగా ప్రజల మధ్యకి వెళ్తున్నపుడు తన మనస్సుపైనా, మానవ శరీర వ్యవస్థల్లోని అసంకల్పిత వ్యవస్థల మీదా తనకి గల స్వచ్ఛంద నియంత్రణని ప్రదర్శించేవారు.

తన తదుపరి ప్రదర్శనలో ఆయన ఎప్పుడూ భౌతిక స్థాయిలో ఆరోగ్యప్రదంగా ఉండడం ఎలాగో, మానసిక స్థాయిలో ఆనందంగా ఉండడం ఎలాగో తెలియజెప్పేవారు. అంతరంగ కోణాల్ని అన్వేషించేందుకు వారిని సిద్ధం చేయడానికి కొన్ని సులభమైన హఠయోగ పద్ధతులు, ప్రాణాయామాలు, ఏకాగ్రత, వంటి విషయాల్ని బోధించేవారు. మతాతీతంగా ఉంటూ సకల మానవాళికీ ఆరోగ్యం, ఆధ్యాత్మికత అందించడానికి చేసిన ప్రయత్నం అందర్నీ ఆకట్టుకుంది. అందుకే ఆయన వెళ్లిన చోటల్లా అన్ని మతాలకి చెందిన ప్రజలూ వారి ఉపన్యాసాలు వినడానికి ఆసక్తి చూపేవారు. ఆ యా ప్రాంతాల మీడియా ఈ శాస్త్రవేత్త, యోగి, మార్మిక సాధువు, తత్వవేత్త గురించి ఎన్నో కథలు, కథనాలు ప్రసారం చేస్తూ ఉండేది. రెండు సంవత్సరాల్లో స్వామీజీ గురించి అన్ని వార్తాపత్రికలు, మ్యాగజైన్లలోనూ వార్తలు రాసేవారు. ఎన్నో రేడియో ప్రసంగాలు, టెలివిజన్ కార్యక్రమాలు జరిగాయి.

ఇదే సమయంలో ఎంతోమంది శాస్త్రవేత్తలు, ప్రొఫెసర్లు, ఆరోగ్య నిపుణులు వివిధ హోదాల్లో స్వామీజీకి సన్నిహితంగా వచ్చారు. వారిలో ఒకరు డాక్టర్ రుడోల్ఫ్ బల్లెంటైన్. హిమాలయన్

ఇన్స్టిట్యూట్ వికాసంలో ఆయనది గొప్ప కీలకమైన పాత్ర. ఒక యువ మానసిక నిపుణుడైన డా. బల్లెంటైన్‌కి యోగం, ప్రాచ్య తత్వశాస్త్రం గురించి మంచి పరిచయమే ఉంది. అతడికి ప్రాచ్య సంప్రదాయాల్లో కనిపించే స్వీయ పరిణామ పద్ధతుల్ని కనిపెట్టాలనే ప్రగాఢమైన ఆసక్తి ఉంది. అతడు న్యూ ఆర్లియన్స్‌లో లూసియానా స్టేట్ యూనివర్సిటీ స్కూల్ అఫ్ మెడిసిన్‌లో మానసిక అధ్యాపకుడుగా పని చేస్తున్నాడు. నగరంలోని ఫ్రెంచ్ క్వార్టర్లో అరవైయ్యవ పడిలో అతడు ఒక ఉచిత క్లినిక్ స్థాపించి దాన్ని వీధి పిల్లలకు సహాయం చేయడం కోసం అంకితం చేశాడు. అక్కడికి వచ్చే కేసుల్లో చాలావరకూ మాదకద్రవ్యాల బారిన పిల్లల సమస్యలే ఎక్కువగా వచ్చేవి. కానీ యోగాచరణలో నిమగ్నమైన తరువాత ఆ క్రమంలో నిజంగా ప్రభావవంతంగా ఉండటానికి తనకి మరింత జ్ఞానం మరియు అవగాహన అవసరమని గ్రహించాడు. అందువలన, చాలా సాహసోపేతంగానూ స్వేచ్ఛగానూ ఇప్పటికీ సంప్రదాయబద్ధమైన జ్ఞానాన్ని గౌరవించే తూర్పు దేశాల పర్యటన చేయడం ఉత్తమ మార్గమని అతడు నిర్ణయించుకున్నాడు.

1972 లో అతడు ఈ ప్రయాణం మీద బయల్దేరాడు. యూరప్ నుంచి భూమార్గం గుండా అతడు బీరూట్ చేరుకున్నాడు. కానీ అక్కడ కొద్దిసేపు ఉండగానే అతడికి అకస్మాత్తుగా భారతదేశానికి వెంటనే వెళ్లమని అంతరంగ సందేశం వచ్చింది. మరో గంటలో అతడు డెమాస్కస్‌కి వెళ్లే టాక్సీలో ఉన్నాడు. అక్కడ నుంచి అతడు పాకిస్తాన్‌లోని కరాచీకి వెళ్లే విమానం అందుకున్నాడు. 1973 వసంతకాలంలో అనేక వాహనాల్ని ఉపయోగించి ప్రయాణిస్తూ, అతడు పంజాబ్‌లోని అమృతసర్ మీదుగా ఢిల్లీ చేరుకున్నాడు. యోగం గురించి తను నేర్చుకోవాలంటే తను హిందీ నేర్చుకోవడం అవసరమని ఢిల్లీలో అతడికి అర్థమైంది. అందువల్ల అతడు ఢిల్లీ యూనివర్శిటీలో హిందీ విభాగానికి వెళ్లాడు. అక్కడ అతడు ఒక ప్రొఫెసర్ కలిశాడు. ఆయన తన ఇంట్లోనే డా. బల్లెంటైన్‌కి హిందీ నేర్పడానికి అంగీకరించాడు.

డా. బల్లెంటైన్ మొదటి హిందీ పాఠం నేర్చుకోవడానికి ఇంటికి రాగానే, ఆ ప్రొఫెసర్ అతడు స్వామిరామతో కలిసి అమెరికా నుంచి వచ్చిన డాక్టర్లు, సైకాలజిస్టుల బృందసభ్యుడా కాదా అని ప్రశ్న వేశాడు. డా. బల్లెంటైన్‌కి దీని గురించి అసలేమీ తెలియదు. అందువల్ల ఆ ప్రొఫెసర్ అతడికి ఆనాటి వార్తాపత్రిక చూపించి ఆ బృందం గురించి వ్రాసి ఉన్న వార్తని చూపించాడు. డా. బల్లెంటైన్ ఆ వ్యాసంలోని సమాచారం తెలుసుకుని ఆ బృందం హృషీకేశ్‌లోని స్వామీజీ ఆశ్రమంలో ఉందని తెలుసుకున్నాడు. అప్పుడు డా. బల్లెంటైన్ వారి పని గురించీ, మిషన్ గురించీ తెలుసుకోగోరుతున్నానంటూ వారికి ఉత్తరం వ్రాశాడు. ఒక వారం తర్వాత స్వామీజీ తరఫున మాట్లాడుతున్న ఒక అమెరికన్ స్వరం వినిపించింది టెలిఫోన్‌లో. తమ బృందం త్వరలోనే న్యూ ఢిల్లీ వస్తుందనీ, తమని అక్కడ కలుసుకోవచ్చుననీ ఆ అమెరికన్ చెప్పాడు. తనకి వంట్లో బాగోలేకపోయినా, డా. బల్లెంటైన్ ఆ అపాయింట్‌మెంట్‌ని వదులుకోదల్చలేదు. అతడు హోటల్‌కి రాగానే డా. అలన్ వెయిన్‌స్టాక్ అనే సైకాలజిస్ట్ ఆయనని పలకరించాడు.

ఆ హోటల్‌లో స్వామీజీ గౌరవార్థం ఒక ప్రముఖ సితార వాదకుల ప్రోగ్రాం ఉంది ఆ రోజున. పెద్ద హడావుడి, కోలాహలం! ఈలోపు డా. వెయిన్‌స్టాక్ డా. బల్లెంటైన్‌ని సంగీత కచ్చేరి జరుగుతున్న గది ద్వారం దగ్గరకి తీసుకొచ్చి, ఆయన్ని స్వామీజీకి చూపించారు. స్వామీజీ ఆయన్ని సరిగ్గా చూడలేదేమో కూడా. కానీ ఆయన, 'ఆ, నాకు తెలుసు, నాకు తెలుసు. ఆయన్ని నా సీటు పక్కకి తీసుకురండి!' అన్నారు. ఇది డా. బల్లెంటైన్‌కి ఏమంత మంచి అభిప్రాయం కలిగించలేదు.

కచ్చేరీ పూర్తి అయిన తర్వాత స్వామీజీ ఆయన్ని తన గదికి ఆహ్వానించి, అకస్మాత్తుగా ఆయన్ని, 'మీరు భారతదేశానికి ఎందుకు వచ్చారు?' అని అడిగారు. ఆయన ఏదో సమాధానం

చెప్పే లోపు, స్వామీజీయే మళ్లీ, మీకు ఒక టీచర్ దొరికినంత మాత్రంగా మీరు సాధించలేరు. వాళ్లు పర్వతాల్లో నివసిస్తారు. అయినా, మీకు కావలసింది ఏదైనా నేను నేర్పిస్తాను మీకు,' అన్నారు.

డా. బల్లెంటైన్ నిర్ఘాంతపోయాడు, 'ఏమిటి, ఈ మనిషికి గర్వం?' అనిపించింది అతనికి. కానీ పైకి ఏమాత్రం తన చికాకుని వెలిబుచ్చకుండా, మామూలుగా సమాధానం చెప్పాడు, 'మీరు నాకేదైనా నేర్పించగలరని నేను నిజంగా అనుకోవడం లేదు, స్వామీ రామా! అయినా, మీరు నాకు ఏ విషయంలోనైనా సహాయం చేస్తానంటే, నాకు మేలవుతుంది!' అన్నాడు.

'మీకు ఎలాంటి సహాయం కావాలి?' అని అడిగారు స్వామీజీ, అతడు ఆ విధంగా అవమానకరంగా మాట్లాడుతున్నా పట్టించుకోకుండా.

'సరే, చూడండి, నా వీసాకి కాలం చెల్లిపోతోంది. నేను ఈ దేశంలో కొంతకాలం ఉండి యోగం గురించి మరిన్ని విషయాలు తెలుసుకోవాలని భావిస్తున్నాను,' అని చెప్పాడు డా. బల్లెంటైన్.

'సరే అయితే, రేపు రండి,' అని చెప్పారు స్వామీజీ.

అతడు మర్నాడు వచ్చేసరికి గది మొత్తం భక్తులతో నిండి ఉంది. భారతీయ మహిళలు, వాళ్ల అమ్మాయిలు, ముఖ్యమైన ప్రముఖులు–అంతా స్వామీజీ ముందు నేల మీద కూర్చుని ప్రశ్నలు అడుగుతున్నారు. స్వామీజీ వారి వైపు చూస్తూ సమాధానం చెప్తూ డా. బల్లెంటైన్ వైపు ఒకసారి చూసి అతడి ప్రశ్నలకి సమాధానం చెప్పసాగారు– డా. బల్లెంటైన్ పైకి అడగలేదు, ఆ ప్రశ్నలు అతని మనసులో ఉన్నవి! ఆ సమాధానాలు చాలా స్పష్టంగా, వాస్తవికంగా ఉన్నాయి. డా. బల్లెంటైన్‌కి అప్పుడు కొంచెం నమ్మకం కలిగింది, బహుశా తనకి కావలసిన విషయం ఈయనగానీ చెప్పగలుగుతారేమో! వీలైతే మొత్తం పనంతా ఇక్కడే అయిపోయేలా ఉంది! అనిపించింది.

స్వామీజీ అందరినీ పంపించివేసిన తర్వాత డా. బల్లెంటైన్ వైపు తిరిగారు. ఆయన తన అనుచరుల్లో ఒకరి వైపు సైగ చేశారు. 'పాండేజీని ఒకసారి తీసుకురా,' అని చెప్పారు. హుందాగా ఉన్న వస్త్రధారణలో ఒక భారతీయుడు లోపలికి వచ్చి కూర్చున్నాడు. స్వామీజీ ఆయనకు, 'డా. బల్లెంటైన్ ఒక సైకియాట్రిస్ట్. అమెరికా నుంచి వచ్చారు. ఆయన వీసాకి సమయం అయిపోవచ్చింది. మీరేమైనా సహాయపడగలరా?' అని అడిగారు.

'తప్పకుండా చేస్తాను, స్వామీజీ!' అన్నారు ఆయన. 'ఆయనకి ఎంతకాలానికి వీసా అవసరమో నాకు చెప్తే చాలు, నేను ఆయనకు ఆ పని చేసిపెడతాను,' అన్నారు. అప్పుడు స్వామీజీ డా. బల్లెంటైన్ వైపు చూసి, 'మిస్టర్ పాండే సీబీఐ (సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇంటిలిజెన్స్) హెడ్, అది మీ ఎఫ్‌బీఐ డైరెక్టర్‌కి సమానం. ఆయన మీ వీసా సమస్యని పరిష్కరిస్తారు. ఇంకా ఏమైనా చేయాలా మీ కోసం?' అని అడిగారు.

డా. బల్లెంటైన్ నిశ్చేష్టుడయ్యాడు. ఆయన ప్రణాళికలు, ఒక పరిశోధన ప్రపోజల్ రాయడం, బొంబాయిలో ఒక స్పాన్సర్‌ని సందర్శించి వీసాని పొడిగించమని అభ్యర్థించడం లాంటి కార్యక్రమాలన్నీ అకస్మాత్తుగా అనవసరమైపోయాయి. ఇంకేం కావాలి తనకి? 'సరే అయితే! నా దగ్గర కొన్ని వేల డాలర్లు మాత్రమే ఉన్నాయి. నేను కొద్దికాలం భారతదేశంలో ఉండాలంటే, కొంచెం డబ్బు కావాలి,' అన్నాడు. ఇంకా అతని మాట పూర్తి కాలేదు. ఇంతలో స్వామీజీ తన అసిస్టెంట్స్‌లో ఒకరిని పిలిచి, 'శ్రీ శర్మగారిని ఒకసారి రమ్మనండి!' అని చెప్పారు. శర్మగారు అతి పెద్ద కంచు కళాఖండాల్ని అమ్మే ఎగుమతిదారు అని చెప్పారు. శర్మగారికి ఈ యువ సైకియాట్రిస్ట్‌ని

పరిచయం చేస్తూ, 'డా. బల్లెంటైన్ ఒక గొప్ప అన్వేషి. ఆయనకు మీరు కొంత ఆర్థికంగా సాయపడాల్సి ఉంటుంది,' అని చెప్పారు.

దానికి ఆ పెద్దమనిషి, 'తప్పకుండా, స్వామీజీ. వారికి ఎంత డబ్బు అవసరమవుతుందో నాకు చెప్తే చాలు. నేను వైర్ చేయిస్తాను వెంటనే!' అని చెప్పి, నమస్కరించాడు.

ఇక అతడికి వీసా పని లేదు, డబ్బు గురించిన బెంగా లేదు. తన ఎదురుగా కూర్చున్న ఈ వ్యక్తి దగ్గర తన ప్రశ్నలకి సమాధానాలు దొరికేలాగానే ఉన్నాయి. కొత్త ద్వారాలు తెరుచుకుంటున్నట్టు అనిపించింది డా. బల్లెంటైన్‌కి.

'అయితే మీరు ఎక్కడికి వెళ్లబోతున్నారు ఇప్పుడు?' అని అడిగాడు అతడు స్వామీజీని. మళ్లీ అతడికి ఆ ప్రశ్న సరిగా అనిపించి ఉండదు. 'నేను కూడా మీతో రావచ్చా?' అని అడిగాడు. పైగా స్వామీజీ తను ఏం తెలుసుకోగోరినా చెప్తానని చెప్పారు!

'బహుశా అది సాధ్యపడదేమో! అయితే మనం మరోసారి కలుసుకుందాం!' అన్నారు.

డా.వెయిన్‌స్టాక్‌ని అడిగిన మీదట డా.బల్లెంటైన్‌కి స్వామీజీ త్వరలోనే చండీఘర్‌లో జరుగుతున్న అంతర్జాతీయ యోగ సదస్సుకి వెళ్తున్నారని తెలిసింది. డా. బల్లెంటైన్ కూడా ఆ సదస్సు గురించి చదివి ఉన్నాడు. అక్కడికి వెళ్లాలని కూడా అనుకున్నాడు. యోగం గురించి ఇంగ్లీషులో రాసిన ఎంతోమంది రచయితలు అక్కడికి వస్తారని భావించాడు. ఢిల్లీ యూనివర్శిటీలో చాలామంది రాసిన పుస్తకాలు అతడు చూశాడు. ఇప్పుడు వాళ్ల మాటల్ని ప్రత్యక్షంగా వినే అవకాశం దక్కింది. ఇక దాంతో డా. బల్లెంటైన్ తన హిందీ టీచర్‌కి గుడ్‌బై చెప్పేశాడు. తన సామానంతా ఒకచోట భద్రపరిచి చండీఘర్ ట్రైన్ ఎక్కేశాడు. అక్కడ దిగిన తర్వాత, అతడు ఓ టాంగా (గుర్రపు బగ్గీ) మాట్లాడుకుని టాంగావాడిని చవక రకం హోటల్‌కి తీసుకుని వెళ్లమని చెప్పాడు. వాళ్లు చాలా చోట్లకి వెళ్లారు గానీ కొన్ని హోటళ్లు మూసేసి ఉన్నాయి, మరి కొన్ని చోట్ల ఖాళీలు లేవు. పైగా అక్కడ ఎవరికీ అంతర్జాతీయ యోగ సదస్సు గురించి తెలియదు. దాంతో అతడు చాలా నిరాశకి గురి అయ్యాడు.

'నాకు మరో హోటల్ తెలుసు. ఒబెరాయ్!' అన్నాడు ఆ టాంగావాడు. అది చాలా ఖరీదైన హోటల్. డా.బల్లెంటైన్‌కి డబ్బుని వృథా చేయడం ఇష్టం లేదు. కానీ తను బాగా అలిసిపోయాడు. ఒంట్లో అసలు బాగోలేదు, పడుకోవడానికి ఓ చోటు కావాలి. అందువల్ల అతడు ఒప్పుకున్నాడు. ఒక గంట తర్వాత రూం సర్వీసుకి వచ్చిన ఆహారం తీసుకున్న తర్వాత కొంచెం ఓపిక వచ్చింది అతడికి. కానీ అతడికి సంతోషంగా లేదు. యోగ సదస్సు గురించి వెదకడం గగన కుసుమంగా ఉంది. అసలది ఎక్కడా జరుగుతున్నట్టు లేదు. తన డబ్బు ఈ ఖరీదైన హోటల్‌కి ఖర్చయిపోతోంది!

సరిగ్గా అప్పుడే ఫోన్ మోగింది. అతడు ఫోన్ ఎత్తేసరికి అవతల డా.వెయిన్‌స్టాక్ లైన్‌లో ఉన్నారు. 'స్వామీజీ మిమ్మల్ని తన రూమ్‌కి రమ్మంటున్నారు, వెంటనే రండి!' అని చెప్పాడు. డా.బల్లెంటైన్ అపనమ్మకంగా చూశాడు రిసీవర్ వైపు.

'ఏమిటి?' అడిగాడు తెల్లబోయి.

'రూమ్ నెంబర్ 115,' డా. వెయిన్‌స్టాక్ చెప్పాడు.

అతడు రాగానే స్వామీజీ, 'మీకు ఇంత సమయం పట్టిందేమిటి?' అని అడిగారు.

డా.బల్లెంటైన్‌ని సదస్సుకి వెళ్లడానికి స్వామీజీ రూమ్‌కి మర్నాడు తొమ్మిది గంటలకల్లా వచ్చేయమని సూచించారు. అతని ఉత్సాహానికి అవధుల్లేవు.

తను ఇక్కడి పండితులు, విద్యావేత్తల్ని గురించి ముందే చదివి ఉన్నాడు, ఇప్పుడు కలుసుకుందామని వచ్చాడు. సదస్సు ఒక పెద్ద హాల్‌లో ఉంది. గదిలో చాలామంది జనం

ఉన్నారు. మేధోసంపన్నులైన నిపుణులు అప్పటికే వచ్చి స్టేజి మీద ఆసీనులయ్యారు. స్వామీజీ గదిలోకి వచ్చేసరికి వక్త మాట్లాడడం ఆపేశాడు. స్టేజి మీద ఉన్నవాళ్లు, క్రింద ప్రేక్షకుల్లో కూర్చున్నవాళ్లలో కొంతమంది లేచి హడావిడిగా అందర్నీ నెట్టుకుంటూ తోసుకుంటూ ఆయన కాళ్లకు నమస్కరించడానికి ఆయన దగ్గరకి పరిగెత్తారు. డా.బల్లెంటైన్ అయోమయంలో పడిపోయాడు. యోగంలో ఉన్నత స్థితులకు చేరుకున్న వీళ్లంతా స్వామిరామ పాదాలకు నమస్కరిస్తున్నారేమిటి?

పది నిముషాలు గడిస్తేనే కానీ ఆ హడావిడి తగ్గి, స్వామీజీ స్టేజీ మీదకి వెళ్లడం కుదరలేదు. ఆ వక్త మళ్లీ తన ఉపన్యాసం కొనసాగించబోతుంటే, స్వామీజీ అతన్ని ఆపారు. 'మీ ప్రోగ్రాంకి కాస్త అంతరాయం కలిగిస్తున్నందుకు అన్యథా భావించవద్దు. కానీ అమెరికా నుంచి ఒక ముఖ్యమైన వ్యక్తి మీకు ఒక విషయం వినిపించడానికి వచ్చారు,' అని ప్రకటించారు. ఆ వక్త స్వామీజీకి నమస్కరించి వెళ్లి ప్రేక్షకుల్లో కూర్చున్నాడు. అప్పుడు స్వామీజీ డా.బల్లెంటైన్‌తో, 'ఇప్పుడు స్టేజీ మీదకి వెళ్లండి!' అని చెప్పారు.

'ఎందుకు?' అని అడిగాడు అతడు మళ్లీ.

'మాట్లాడేందుకు!' స్వామీజీ చెప్పారు.

'దేని గురించి?' అతడు అడిగాడు, కళ్లు విశాలం చేసి.

'మీకేం మాట్లాడాలని ఉంటే అదే మాట్లాడండి!' అన్నారు స్వామీజీ.

నోట మాట రాని డా.బల్లెంటైన్ స్టేజీ ఎక్కి ప్రేక్షకుల ఎదుట నిలబడ్డాడు. మెల్లగా యోగా మీద తనకున్న ఆసక్తీ, యోగాకీ సైకోథెరపీకీ మధ్య ఉన్న సామ్యతల్ని గురించి చెప్పాడు. తన మనసులో ఉన్న ప్రశ్నల గురించి చెప్పాడు. ఈ రెండు విషయాల్నీ ఎలా సమన్వయపరచవచ్చో తెలియజేశాడు. అతడు మాట్లాడడం ముగించేసరికి హాలంతా కరతాళ ధ్వనులు, ప్రశంసలతో మారుమ్రోగి పోయింది. రచయితలు అతడి పట్ల తమ ఆరాధనాభావాన్ని తెలియజేస్తూ స్టేజీ దగ్గరకి వచ్చారు.

అతడు సంక్షిప్తంగానే మాట్లాడినా కనీసం అరగంట మాట్లాడి ఉంటాడు. కానీ అతడు నిపుణుల్నీ, శ్రోతల్నీ మంత్రముగ్ధుల్ని చేసేశాడు. ఒక పాశ్చాత్య వైద్యుడు ఇంత లోతైన విచారణ చేస్తూ ప్రాచ్య పాశ్చాత్య భావాలను సమ్మిళితం చేయాలని అనుకోవడమే చాలా గొప్ప విషయం. తాను ఇంత మంది మేధావుల ముందు ఉపన్యసించానంటే డా.బల్లెంటైన్‌తానే స్వయంగా నమ్మలేకపోతున్నాడు.

ఈ అనుభవం తర్వాత డా. బల్లెంటైన్‌కి తన లక్ష్యాన్ని చేరుకునే ఆకాంక్ష ఎంత తీక్షణ స్థితికి చేరుకుందంటే ఆయన అటుపై తాను అప్పటివరకూ చేసిన మానసిక చికిత్స వైపు తిరిగి వెళ్లనే లేదు. ఆయన స్వామీజీతోనే ఉండిపోయారు. హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్ ఆయన మనస్ఫూర్తిగానూ ఎంతో అంకిత భావంతోనూ పని చేశారు. స్వామీజీ మార్గదర్శనలో ఆయన భారతీయ తత్వశాస్త్రాన్ని అధ్యయనం చేశారు. వేదాంతం, యోగ, ఆయుర్వేద, హోమియోపతీలను నిశితంగా అధ్యయనం చేశారు. శారీరిక, మానసిక, ఆధ్యాత్మిక వికాసాల కోసం వివిధ విధానాలను నేర్చుకున్నారు. వివిధ హిమాలయ యోగ సంప్రదాయాలు పాటించే ధ్యాన పద్ధతుల్ని అభ్యసించారు. ఆయన కూడా ప్రాచీన విజ్ఞానం మీదా, సంపూర్ణ ఆరోగ్య సూత్రాల మీదా ఉపన్యాసాలు ఇచ్చి, కార్యశాలలు నిర్వహించారు. అంతేకాదు, ఆయన అమెరికా అంతటా వివిధ నగరాల్లో ఒక హోలిస్టిక్ (సంపూర్ణ) హెల్త్ క్లినిక్స్ నెట్‌వర్క్‌ని నెలకొల్పాడు.

డా. బల్లెంటైన్‌కి ప్రధాన చోదకశక్తి స్వామీజీయే అయినప్పటికీ ఆయనా, ఆయనతో బాటు ఈ సంప్రదాయంలో శిక్షణ పొందిన మిగతా శిక్షకులూ కలిసి చేసిన ప్రయత్నాల వల్ల

ఇన్‌స్టిట్యూట్ ఒక అద్దె ఇంటి నుంచి విశాలమైన భవంతిలోకి మారింది. 1975 సంవత్సరం మొదట్లో సంస్థ చికాగోలోని గ్లెన్‌వ్యూ శివార్లలో మూడు ఎకరాల ప్లాట్‌లోకి మారింది. ఇక్కడ ఒక ఇల్లు, ఒక కుటీరం, ఒక పెద్ద భవంతి ఉన్నాయి. అన్నీ నిర్జనంగా పాడుబడి ఉన్నాయి. వాటిని బాగు చేయడానికి ఆ వసంతకాలమంతా శిష్యులూ, వాలంటీర్లూ బాగా శ్రమ పడ్డారు. ప్రారంభోత్సవం మే 5 న చేయాలని నిర్ణయమైంది.

నేను నా స్నేహితుడు గస్ గట్జోని ఆ సమయం గురించి అడిగినపుడు, అతడు, 'స్వామీజీ ఎంత ఆ సమయంలో ఎంతో కష్టపడి పని చేయడం చూడడం నిజంగా గొప్ప ప్రేరణ కలిగించే అనుభవం. ఆయన ఎంతో తక్కువ సమయం నిద్రపోయేవారు. ఆయన ఓ ప్రక్క నిరంతరం ప్రయాణించడం, ఉపన్యాసాలు చెప్పడం, రచనా వ్యాసంగంలో తీరికలేకుండా ఉంటూనే ఉన్నా, మరో ప్రక్క మమ్మల్ని పరుగులెత్తిస్తూనే ఉండేవారు. కొంతమంది కుర్రాళ్లు మరమ్మత్తులు చేసిన అనుభవం లేకపోయినా ఆ పనులన్నీ పూర్తి చేశారు. ఆడపిల్లలు శుభ్రం చేయడం, మా అందరికీ భోజనాలు వండి వడ్డించడం చేశారు. ఆ రోజుల్లో ఇన్‌స్టిట్యూట్‌లో నివాసం ఉన్నవారికి ప్రత్యేకించి గదులు ఉండేవి కావు. వాళ్లు పగలంతా పని చేసి, సాయంత్రం పొద్దు పోయిన తర్వాత, ఫర్నిచర్, పనిముట్లు అన్నింటినీ ఒక ప్రక్కకి తోసి, కొంచెం చోటు చేసుకుని స్లీపింగ్ బ్యాగ్స్ పరుచుకుని నిద్రపోయేవాళ్లం. తెల్లారి మళ్లీ వాటిని మడిచేసి పనిలో పడేవాళ్లం. కొన్నిసార్లు అమ్మాయిలు లంచ్ తయారు చేసేవారు. మరి కొన్నిసార్లు స్వామీజీ అక్కడున్న ఇండియన్ రెస్టారెంట్ నుంచి తెప్పించేవారు. ఇన్‌స్టిట్యూట్ ప్రారంభోత్సవం పెద్ద ఎత్తున జరుగుతోంది కాబట్టి మేమంతా రాత్రీ పగలూ పని చేశాం. కానీ మేమెన్ని పనులు చేసినా, మళ్లీ పర్వతమంత పని ఉంటోంది. స్వామీజీ, అమెరికా రాయబారి, ఇండియన్ కాన్సుల్ జనరల్, చికాగో మేయర్, భారతీయ, అమెరికన్ సమాజాల్లో సుప్రసిద్ధులైన చాలామంది ప్రముఖుల్ని పిలిచారు.

'ప్రారంభోత్సవానికి ముందు రోజు మే 4 వ తేదీన, ఆ ప్రదేశం చాలా చూడముచ్చటగా తయారైంది. స్వామీజీ మధ్యాహ్నం దాటిన తర్వాత చిట్టచివరి సూచనలు ఇస్తూ అటూ ఇటూ హడావిడిగా తిరుగుతున్నారు. ఆ సంస్థకి మొదటి ఛైర్మన్ అన్నె ఐలార్డ్‌ని చాలా ప్రేమతో 'మామా' అని పిలిచేవారు. మెయిన్ హాల్‌లోకి వెళ్లారు, అక్కడ కొందరు శిష్యులు కర్టెన్లని వ్రేలాడదీస్తున్నారు. అన్నె, పెద్ద కిటికీకి బయట ఉన్న అతిపెద్ద మగ్నోలియా చెట్టుని చూస్తూ, 'ఆ మగ్నోలియా చెట్టు పూత పూస్తే ఎంత బాగుంటుంది?' అన్నారు. చికాగోలో ఆ సంవత్సరం వసంతకాలం చాలా ఆలస్యమైంది. ఆ చెట్టుకి ఆకులు కూడా సరిగా రాలేదు, మగ్నోలియా చెట్టు మొగ్గలు కూడా ఇంకా లేత మొగ్గ దశలో బాగా ముడుచుకుని ఉన్నాయి.

'స్వామీజీ ఆ గదిలోకి అప్పుడే అడుగు పెట్టి, 'మీరేం మాట్లాడుకుంటున్నార్రా!' అన్నారు.'

'మామా, 'ఈ చెట్టు ఎన్నో వారాలుగా పూత పూయడం లేదు, కానీ ప్రారంభోత్సవం నాటికి అది పూస్తే ఎంత బాగుండునా అని మేం అనుకుంటున్నాం,' అన్నారు.'

'స్వామీజీ ఆ చెట్టు వైపు ఓ క్షణకాలం చూసి, తన చేతిని మామా చుట్టూ వేసి, 'ఇది నేను నీకు బహుమతిగా ఇస్తున్నాను. అది రేపటికి పూస్తుంది,' అన్నారు. నిజంగానే మరునాటి ఉదయానికల్లా మెయిన్ హాల్ కిటికీలోంచి కనిపించే ఆ పెద్ద మగ్నోలియా చెట్టు చెట్టంతా వికసించిన పూలతో నిండిపోయింది.'

స్వామీజీ ప్రజల మధ్య అలాంటి అద్భుతాల్ని చాలా అరుదుగా ప్రదర్శించారు. కానీ ఆంతరంగికంగా ఇలాంటివి ఎన్నో అద్భుతాలు సన్నిహితులకి సుపరిచితం. అరవై దశకంలోని సంస్కృతి దాని పతాక స్థాయిని చేరుకుంది. సరదా కోసం మాదక ద్రవ్యాలు ఉపయోగించడం, సరదా కోసం లైంగిక విషయాల్లో ఆనందం వెదుక్కోవడం యువకుల్లోని అనేక సమూహాల్లో

సర్వసాధారణమై పోయింది. స్వామీజీ బోధలు యువజనుల్ని ఎంతో ఆకర్షించేవి. కానీ ఆయన సమక్షానికి చేరేనాటికే వారిలో చాలామంది జీవితాల్లో జరగాల్సిన నష్టమంతా జరిగిపోయి ఉండేది. స్వామీజీ ఈ యువకులకి తక్షణ దివ్యానందం లేదా సత్వర రూపాంతరణ లభిస్తుందని భరోసా ఏమీ ఇచ్చేవారు కాదు. పైగా ఆయన వాళ్లకి ఏం నమ్మకం కుదిరేదో ఏమో గానీ వాళ్లు ఆయనతోనే ఉండిపోయేవారు.

స్వామీజీ తమకి ముక్తి గురించి తెలియజెప్తారు, విముక్తి సాధనని నేర్పిస్తారనే ఉద్దేశ్యంతోనే ఎంతోమంది యువకులు, యువతులు, హిమాలయన్ ఇన్స్టిట్యూట్‌లో జాయిన్ అయ్యారు. ఆ విధంగా తమ సమస్యలన్నీ తీరిపోతాయనే వారు నమ్మేవారు. స్వామీజీ ఈ రకమైన శిష్యులకి పదే పదే చెప్పేవారు, 'మీరు ప్రపంచం నుంచి పారి పోయి స్వేచ్ఛని ఎన్నటికీ పొందలేరు. మీలోని అనవసరమైన భాగాన్ని వదులుకోవడం ద్వారా మాత్రమే మీరు స్వేచ్ఛ పొందగలరు. అంతర్గత బానిసత్వం నుంచి విముక్తి పొందడానికి మిమ్మల్ని మీరు నిశితంగా అధ్యయనం చేయాల్సి ఉంటుంది. మీ మనసు గతిశీలతని అధ్యయనం చేయాలి. ఎంత నేర్పరితనంతో దాన్ని వశపరుచుకోవచ్చో కనిపెట్టాలి. ఒకసారి మీ మనసునీ, మీ హృదయాన్నీ స్వచ్ఛపరుచుకుంటే, ఈ ప్రపంచం ఎంత అందమైన ప్రదేశమో, మీరెంత అందమైన వ్యక్తో మీకు అర్థమవుతుంది. ఈ ప్రపంచాన్ని విడిచి పెట్టాల్సిన అవసరం లేదు.'

స్వామీజీ ఎప్పుడూ ఆరోగ్యం, ఆధ్యాత్మికతల్ని విజ్ఞానపరంగానే చూసేవారు. ఆయన బోధలన్నీ వైదిక సంప్రదాయ సారమే కాబట్టి హైందవ మతభావనలకి ఆధారభూతంగానే ఉండేవి. కానీ ఆయన ఒక స్వామీజీ కావడం, ఆయన భారతదేశం నుంచి రావడం చూసిన అక్కడి జనానికి ఆయన్ని మతపరమైన, జాతీయపరమైన సామ్యతలకి చెదిరిపోని వ్యక్తిగా గుర్తించడం కష్టంగా ఉండేది. మతాలు మార్చడం వల్లా, తరచుగా కొత్త జీవన విధానాలకి మారిపోతుండడం వల్లా ఎవరికీ ఏనాడూ ప్రయోజనం కలగలేదని స్వామీజీ తన శిష్యులకి తరచుగా గుర్తు చేస్తుండేవారు. ఒక్క స్వీయపరివర్తన వల్లా, నిరంతరం అంతరంగంలో మార్పు చెందుతుండడం వల్లా మాత్రమే జీవితంలో నిజమైన సంపూర్ణత్వం సిద్ధిస్తుందని ఆయన అనేవారు.

వారు పదే పదే ఆ విధంగా చెబుతుండడం వల్ల, ఎందరో యువకులు స్వామీజీ చుట్టూ త్యాగానికీ, స్వచ్ఛతకీ, పవిత్రతకీ ప్రతీకగా నిలిచే కాషాయ బట్టల్లో తిరుగుతూ ఉండేవారు. స్వామీజీ అలాంటి సన్యాసులు ఎదురుపడ్డప్పుడల్లా, 'ఎలా ఉన్నావు, యువర్ హోలీనెస్?' అని సంబోధించేవారు. అలా అని, తన పక్కనే నిలబడి ఉన్నవారెవరితోనో, 'నేను ఆమెని హోలీనెస్ అని ఎందుకన్నానో తెలుసా? ఆమెకి తల మీద రంధ్రాలు ఉన్నాయి,' అనేవారు. ఇలా వేళాకోళం పట్టించినా సరే, స్వామీజీ తమకి ఏం చెప్పదలిచారో, అది పట్టించుకునేవారు కాదు జనం.

ఉదాహరణకి, చికాగోలో ఒక యువతి, ఇన్స్టిట్యూట్‌లో అత్యుత్తమ హఠ యోగ బోధకుల్లో ఒకరుగా ఉండేది. ఆమె గొప్ప ఏకాగ్రతతో సాధన చేసి సన్యాసిగా జీవించాలని భావించేది. ఆమె వివాహితే అయినా, తనని హిమాలయ యోగుల సాధు పరంపరని అనుసరించి సన్యాస దీక్ష ఇవ్వవలసిందిగా స్వామీజీని అభ్యర్థించింది. స్వామీజీ ఆమెకి భర్తతోనే ఉంటూ, తన చర్యల్ని నేర్పుగా, నిస్వార్థంగా చేస్తూ ఉండాలని సూచించారు. కుటుంబం, సంస్కృతి, మతపరంపరల్ని విడిచిపెట్టి సన్యాసం తీసుకోనవసరం లేదని చెప్పారు.

ఆ రోజుల్లో, ఒక హిందూ పండితుడు ఇన్స్టిట్యూట్‌లో స్వామీజీతోనే ఎక్కువసేపు ఉండేవాడు. అతడు వేదవేదాంగాలూ అభ్యసించి హిందూ సంప్రదాయాల్లో బాగా అనుభవజ్ఞుడైన వ్యక్తి. ఆ యువతి ఆ పండితుడికి తనకున్న ఆధ్యాత్మిక జిజ్ఞాస గురించి చెప్పేది, తరుచుగా తన లక్ష్యాల గురించి ఆయనతో చర్చిస్తూ ఉండేది. దాంతో ఆ పండితుడు ఆమె

అంకితభావంతో సాధన చేసే సాధకురాలు కాబట్టి స్వామీజీతో ఆమె అభిలాషని తీర్చమని చెప్పాడు. స్వామీజీ ససేమిరా కుదరదని చెప్పారు. సన్యాసం ఆమె అనుసరించాల్సిన మార్గం కాదని చెప్పేశారు. త్వరలోనే స్వామీజీ భారతదేశానికి వచ్చారు. ఆయన తిరిగి వెళ్లేసరికి ఆమె తన భర్తకి విడాకులు ఇచ్చింది. ఇక ఆ పండితుడు, హిందూ మతంలో పూజారిగా ఉన్న తన అధికారాన్నంతా ఉపయోగించి, ఆమెని సన్యాసినిగా చేయడానికి తగిన ఏర్పాట్లన్నీ చేస్తున్నాడు. మిగతా శిష్యులందరికీ చాలా అయోమయంగానూ, ఆందోళనగానూ ఉంది. వాళ్లకి తెలుసు స్వామీజీ ఆమెకు సన్యసించవద్దని చెప్పారు. కానీ ఈ పండితుడు ఆమెకు సన్యాసం ఎలా ఇస్తారో తెలియడం లేదు. స్వామీజీ కాని ఒక పండితుడు, ఒక సంప్రదాయబద్ధమైన హోమం జరిపి ఎవరికైనా సన్యాసం ఎలా ఇవ్వగలడు? ఆమె ధరించే సాధారణ దుస్తులకి బదులు కాషాయ వస్త్రాలు ధరించడం మినహాగా మార్పు జరగదనే విషయాన్ని చూడడానికి వాళ్లు కూడా చాలా ఆసక్తిగా ఉన్నారు.

అప్పటికి స్వామీజీ ఇంకా భారతదేశంలోనే ఉన్నారు. ఈ కొత్తగా వేషం వేసుకున్న సన్యసిని సంస్థలో అందరూ స్వామీజీని ఎలా గౌరవిస్తారో, తననీ అలాగే చూడాలన్నట్టు కోరుకోసాగింది. ఇది ఇన్‌స్టిట్యూట్ కమ్యూనిటీకి ఇంకా తలనొప్పిగా మారింది. కొంతమంది సంస్థని వదిలి వెళ్లిపోవడం కూడా జరిగింది. మరి కొంతమంది భారతదేశంలో ఉన్న స్వామీజీతో మాట్లాడడానికి ప్రయత్నించారు కానీ కుదరలేదు. సంస్థ సంక్షోభంలో పడిపోయింది. ఆ నాటకం ఎంతసేపు సాగుతుందో సాగనిద్దామన్నట్టూ, సంఘటనలు జరుగుతున్న క్రమంలో శిష్యులు కూడా తగిన పాఠాలు నేర్చుకుంటారన్నట్టూ స్వామీజీ మాత్రం అక్కడ ఏం జరుగుతోందో తనకు తెలియనట్లే ఉండిపోయారు. ఇంతలోనే ఆ యువ స్వామిని తన సన్యాసాన్ని విడిచిపెట్టి భర్త దగ్గరకి వెళ్లిపోయింది. మరి పండితుడు స్వామీజీ ఎదుట పడడానికి ఎలా మొహం చెల్లిందో నాకు తెలి.దు. కానీ ఆధ్యాత్మిక జీవితం గడపడానికి సన్యాసం స్వీకరించాలని ఆశించిన శిష్యులందరికీ ఇదొక పాఠంగా మారింది. ఆ విధంగా వారంతా తమ దృష్టిని స్వీయ క్రమశిక్షణ, స్వీయ పరిశీలన వైపు మళ్లించారు.

సన్యాస భావన మీద అనేక అయోమయాలు, గందరగోళాలూ ఉన్నాయి. ఇవి చాలక ఆధ్యాత్మికత గురించి మానవ సముదాయాల్లో మరింత గందరగోళం ఉంది. హిప్పీ ఉద్యమం అమెరికాలో అన్ని రకాల ప్రజల్నీ ఆకర్షించింది. వాళ్లు ప్రపంచంలో నలుమూలల నుంచీ, అందునా ముఖ్యంగా భారతదేశం, టిబెట్, చైనా, జపాన్ దేశాల నుంచి వచ్చారు. పైగా అమెరికన్లకి ఉన్న సర్వసాధారణ భావన ఏమంటే, ఓ సామాన్యమైన అంశం నుంచి ఉధృతంగా వచ్చిన సుడి భావన ఏదైనా ఆధ్యాత్మికతే.

కుంగ్‌ఫూ, కరాటే, తాయ్ చీ, రేకీ, డ్రీమ్ థెరపీ, మైండ్ రీడింగ్, క్లయర్‌వోయిన్స్, జ్యోతిష్యం, టారట్ కార్డులు, హఠయోగం, ఇంకా వివిధ రకాలైన ధ్యానాలు...ఇవన్నీ ఆధ్యాత్మికతకి చెందిన అతి విశాలమైన జాబితాలోకి పడిపోతాయి.

అత్యంత ఆసక్తికరమైన ఆధ్యాత్మిక గురువులలో అద్భుతాలు చేస్తామని చెప్పేవాళ్లు కొందరుంటారు. ఉదా. శక్తిపాతం (ఆధ్యాత్మిక శక్తిని నేరుగా ప్రసరింపజేయడం), శరీరానికి అతీతమైన అనుభవాలు, ఆస్ట్రల్ (కామ) ప్రయాణాలు, దేవుళ్లు, దేవతలు, ఇంకా ఇతర మానసిక అనుభవాల రూపాలు.

కానీ స్వామీజీ ఆధ్యాత్మికతని శాస్త్రీయ దృక్పథంలోంచి చూసేవారు. ఆయన అందరికీ వ్యావహారికంగా ఉండమనీ, మాయమాటలు, మాయ వాగ్దానాలూ నమ్మవద్దనీ చెప్తుండేవారు.

'శాశ్వతమైన రూపాంతరణ పొందేందుకు వచ్చే అనుభవమే విలువైన అనుభవం,' అనేవారు ఆయన. 'ఊరికే ఎరుపు, నీలం కాంతి కిరణాలు మీ తలలో మెదులుతూ ఉండడం

లేదా వివిధ రకాలైన స్వరాలు వినడం ఆధ్యాత్మికం అనిపించుకోదు. అలాంటి అనుభూతులు మీకు కలిగినా గానీ మీరు అంతకు ముందు ఎలా ఉన్నారో అలాగే ఉంటారు. మీలో ఏ మార్పూ ఉండదు. మీ శరీరాన్ని ఆరోగ్యంగానూ, మీ మనస్సుని సంతులితంగానూ ఉంచగలిగే టెక్నిక్స్ నేర్చుకోండి. అప్పుడు మీ ఆరోగ్యవంతమైన శరీరం, ప్రశాంతమైన మనస్సునీ సాధనాలుగా ఉపయోగించి జీవితంలోని నిగూఢ స్థితులకు చెందిన విషయాల్ని ఆకళింపు చేసుకోవచ్చు,' అనేవారు. వ్యావహారిక స్థాయిలో, ఆయన హఠయోగం, ప్రాణాయామం, సంతులిత ఆహారచర్య, రిలాక్సేషన్ పద్ధతులు, ఏకాగ్రతని నేర్పుతుండేవారు. అయితే తన శిష్యులకి వివిధ సంప్రదాయాలకు చెందిన సన్యాస సంప్రదాయాలూ, సంస్కృతులూ నేర్పే బోధకులు అవసరమనీ, అనేక పద్ధతుల్ని ఆకళింపు చేసుకున్న తర్వాత తన శిష్యులు తమకి ఫలానా మార్గం సరైనదో కాదో తమంతట తాముగా తమకి తగిన మార్గమేదో తెలుసుకుని దానినే అనుసరిస్తారనీ స్వామీజీకి తెలుసు.

ఒక సాంవత్సరిక సమావేశం నిర్వహించాలని స్వామీజీ నిర్ణయించుకున్నారు. దానికి ఆయన అన్ని సంప్రదాయాల నుంచీ బోధకులు, పండితులు, మతపెద్దల్ని ఆహ్వానించారు.

మొదటి సమావేశం 1976 జూన్‌లో జరిగింది. అది మూడున్నర రోజుల పాటు జరిగింది. నిజంగా అది కనువిప్పు కలిగించే సమావేశం. స్వామీజీ దానిలో మాట్లాడడానికి వక్తలుగా సూఫీలు, సిక్కులు, బౌద్ధులు, యూదులు, క్రైస్తవులు, ఇస్లాం ప్రవక్తలు, నేటివ్ అమెరికన్ షమాన్లు, జెన్ మాస్టర్లు, వివిధ సంప్రదాయాల నుంచి వచ్చిన స్వాములు, యోగులు, ఆరోగ్య నిపుణులు (సాంప్రదాయిక, అసాంప్రదాయిక), శాస్త్రీయ పరిశోధనావేత్తల్ని ఆహ్వానించారు. వీరందరికీ వారి వారి సంప్రదాయాలపై గొప్ప పట్టు, అనుభవం ఉంది. వాళ్లందరికీ అసంఖ్యాకంగా భక్తులు, సాధకులు ఉన్నారు. కొంతమంది పైకి కనబడుతున్నట్టుగా వారి స్వభావం ఉండదని తెలిసీ స్వామీజీ వారిని కూడా పిలిచారు.

ప్రజలు తమ ఉత్తమ విలువలతో జీవితం గడపడానికి కొంతమంది వక్తలు తాము సాధనా అనుభవాలు తెలియజేశారు. మిగతా ప్రెజెంటేషన్లు చాలా తెలివి, చతురత ప్రదర్శించాయి తప్ప చాలా విసుగు కలిగించేవిగానూ, వ్యావహారిక విలువబొత్తిగా లోపించినట్టూ అనిపించింది. భారతదేశం నుంచి వచ్చిన యోగి రామానంద తన శ్వాసతో ఏనుగుని కట్టి ఉంచిన చెయిన్‌ని తెంపి అద్భుతమైన యోగ ప్రదర్శన చేశారు. మరో సెషన్‌లో ఒక యువకుడు తన అసాధారణమైన ధారణాశక్తిని ప్రదర్శిస్తూ ప్రేక్షకుల్లోంచి ఇరవై మంది వాలంటీర్లను సుదీర్ఘమైన సిరీస్‌లో సంఖ్యల్ని చెప్పమని అడిగాడు. ఆ ఇరవై మంది చెప్పిన నెంబర్లనూ వినడం పూర్తి చేసిన తర్వాత, ఆయన ఒక క్రమంలో కాకుండా అక్కడక్కడా కూర్చున్న ఆ వాలంటీర్లలో ప్రతి ఒక్క వ్యక్తినీ గుర్తు పెట్టుకుని లేపి, వాళ్లు చెప్పిన నెంబర్లను మళ్లీ వాళ్లకు చెప్పాడు. మరో సెషన్‌లో ఒక యోగి తన కుండలినీ శక్తిని మేల్కొల్పారు. దీన్ని ప్రదర్శించడానికి ఆయన కొన్ని గజాల దూరంలో ఒకబొమ్మకు అనుసంధానింపబడిన వైర్లను తన తల అమర్చుకున్నారు. ఆ క్షణంలో ఆయన ప్రేక్షకులకు తాను సుషుమ్న నాడి (సూక్ష్మ శరీరంలోని మధ్య నాడి) ని చైతన్యవంతం చేస్తున్నానని చెప్పారు. అనేక దుస్తుల లోపల దాచి ఉంచిన ఒక రిమోట్ కంట్రోల్‌పై గల ఒక బటన్‌ని ఆయన నొక్కారు. అప్పుడు ఆబొమ్మ కళ్లు వెలిగాయి. అలాగే ఒక బోధకుడు తన ఉపన్యాసం మొదలుకాక ముందు ఎల్ఎస్‌డీ టాబ్లెట్ తీసుకున్నారు. దాని ప్రభావం చూపించడం మొదలైంది. ఆయన తాను సమాధిలోకి వెళ్లబోతున్నట్టు ఆయన ప్రకటించారు. ఎవరైనా తన గదిలోకి రావాలనుకుంటే రావచ్చుననీ, తన సమక్షంలో చలి కాచుకోవచ్చుననీ ప్రకటించారు.

చికాగో ఒక కాస్మోపాలిటన్ నగరం, కానీ ఆ హోటల్ ముందు నుంచి వెళ్తున్నవారంతా ఆ కాషాయ రంగు దుస్తుల్లో ఉన్న వాళ్లు చెప్తున్న మాటల్ని ఆశ్చర్యంగా వినసాగారు. పాయింటెడ్

హ్యాట్స్‌తో కొందరు, శిరోముండనం చేయించుకుని కొందరు, తమ మందీ మార్బలంతో వచ్చారు. కాన్ఫరెన్స్‌కి వచ్చినవారిలో కొందరికి చాలా గొప్పగా నచ్చింది, మరి కొందరికి నిరాశగా అనిపించింది. ఆరోగ్యం పొందడానికీ, ఆధ్యాత్మికతని ఆయన శాస్త్రీయమైన, సంపూర్ణమైన విధానాన్నే అవలంబించినా చాలామంది ఏవో ఆరోపణలు చేస్తుండేవారు. స్వామీజీ వక్తల్ని ఆహ్వానించేవారు. సంప్రదాయ, మత పెద్దల్నీ, కుహనా మేధావులు, కొన్నిసార్లు కేవలం మోసం చేసేవాళ్లని పిలుస్తుండేవాళ్లు. ఈ రకంగా విభిన్న సంప్రదాయాలతో కూడిన పరిషత్తు ఏర్పాటు చేసినందుకూ, గొప్ప గొప్ప పెద్దల్ని కలుసుకుంటున్నందుకూ మిగతావాళ్లు స్వామీజీకీ, హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్‌కీ కృతజ్ఞతలు వ్యక్తం చేసేవారు.

కొంతమంది తాము చాలా ఎక్కువగా నేర్చుకునే అవకాశం లభించినట్టు భావించేవారు. అతి కొద్దిమంది తమ కుండలినీ శక్తి చైతన్యవంతమైనట్టు భావించేవారు. సమన్వయపరిచే ఆ పరిషత్తు వేదిక కొంత గడబిడ వాతావరణం తీసుకొచ్చినా, మొత్తానికి అది ఒక విలువైన మానసిక స్థాయిని పొందడానికి అవసరమనే అందరూ భావించేవారు. స్వామీజీ ఆ సాధుపరిషత్తులో కేవలం మూడు సార్లు మాత్రమే మాట్లాడేవారు. జూన్ 17న వక్తల్నీ, శ్రోతల్నీ అభినందిస్తూ ఆ సమావేశానికి గల ప్రాముఖ్యతని వివరిస్తూ ప్రారంభోపన్యాసం చేశారు. ఆ తర్వాత 19 సాయంత్రం, 20 మధ్యాహ్నం, రెండు ఉపన్యాసాలు చెప్పారు. ముగింపు ఉపన్యాసం ఇవ్వడానికి వేదిక మీదకి వెళ్లే సమయానికి ఆయనకి శ్రోతల మిశ్రమ ప్రతిస్పందనలు ఆయనకి సంపూర్ణంగా అందేవి.

శ్రోతల్ని ఉద్దేశించి మాట్లాడుతూ, ఆయన తనదైన శైలిలో ఇలా చెప్పేవారు– 'మీలో ఉన్న దివ్యత్వాన్ని నేను ప్రార్థిస్తున్నాను. తమ జ్ఞానాన్ని మీతో పంచుకున్నందుకు వక్తలందరికీ నేనెంతో కృతజ్ఞుడిని. మీరు వారి మాటల్ని ఎంతో శ్రద్ధగా విన్నందుకు సంతోషంగా ఉంది. మీ అమెరికన్లు చాలా గొప్పవాళ్లు. మీరంటే నాకు చాలా ప్రేమ. నాకు మీరంటే చాలా గౌరవం. కానీ మీతో ఓ గొడవ ఉంది. మీరు మీ సమస్యలకి బాహ్య ప్రపంచంలో పరిష్కారాలు వెతుక్కోవడానికి ప్రయత్నిస్తారు. బాహ్య ప్రపంచంలోని వస్తువులు, విషయాలు అన్నీ నిరాశకి గురి చేసేవే. మీరు బాహ్య ప్రపంచంతో అన్ని రకాల అనుభవాలూ పొందారు. మీరు గాలిలో ఎగరగలరు, చంద్రుడి మీద దిగగలరు. కానీ మీరు మీ మనసుని అంతర్గతంగా మళ్లించడానికి గల ప్రాముఖ్యతని తెలుసుకోలేరు. మీ లోపలి వాస్తవాన్ని దర్శించలేరు. మిమ్మల్ని మీరు తెలుసుకోలేకపోతే, మీ శరీరాన్ని మీరు తెలుసుకోలేకపోతే, యోగులు 'ఆత్మ' గా పిలిచే ఆ చైతన్య కేంద్రాన్ని కనుక్కోలేకపోతే, మీరు ఈ ప్రపంచానికి సంబంధంలేని గ్రహాంతరవాసిగానే ఉండిపోతారు. మీ చుట్టూ ఉన్న ప్రపంచంతో మీరు సమాధానపడలేరు. ఆనందం లోపల నుంచి ఉబికి వస్తుంది. 'ఆనందాన్ని' పొందడానికి మీరు అనేక రకాల ప్రయత్నాలు చేశారు, సెక్స్, డ్రగ్స్, ఇలాంటి వందలాది విషయాలు ప్రయత్నించారు. అలాంటి విషయాలేవీ మీకు శాశ్వతానందాన్ని ఇవ్వలేవనే సంగతి మీకు తెలుసు. కానీ మీరు బాహ్య ప్రపంచంలో వాటి కోసం అన్వేషిస్తూ ఆరోగ్యం, ఆనందం పొందడానికి ఈ గురువు దగ్గరకీ, ఆ గురువు దగ్గరికీ, ఈ అర్చకుడి దగ్గరికీ, ఆ స్వామి దగ్గరికీ పరుగులు తీస్తుంటారు. కానీ లోపలి బోధకుడిని కనలేని వారికి బాహ్య ప్రపంచంలోని బోధకులు ఏ మాత్రం ఆనందింపజేయలేరు. లోపలి వెలుగుని గుర్తించడం నువ్వు తప్పక నేర్చుకోవాలి. బయటి వస్తువు నీకు కేవలం దారి చూపిస్తుంది, అంతే. కానీ అంతిమంగా నీ దారి నువ్వు ఏర్పరచుకుని నడవాల్సిందే. 'లక్ష్యం గురించీ, నీ జీవితాదర్శం గురించీ నీకు సరైన స్పష్టత లేకపోతే నీకు బాహ్య ప్రపంచంలోని గురువులు ఎన్ని విధాలుగా స్పష్టమైన సూచనలు ఇచ్చినా, నిన్ను భయాందోళనలూ, సందేహాలూ వెంటాడతాయి. అంతే తప్ప నువ్వు గమ్యం మాత్రం చేరుకోలేవు. భయం, సందేహం ఏకాగ్రతని చెడగొడతాయి. నిన్ను నీ మార్గంలో తిన్నగా నడవనీయవు.

అందువల్ల ముందుగా నువ్వు ఒక చోట కూర్చో. జీవితంలోని అత్యవసర విషయాలపై ధ్యానించు. ఉదా. 'నేను ఏం చేస్తున్నాను? నేను ఎందుకీ పని చేస్తున్నాను? నా జీవిత లక్ష్యం ఏమై ఉంటుంది? నేను ఈ జీవితంలో ఏం కోరుకుంటున్నాను? నేను గతంలో ఏం చేశాను? గతంలో నేను చేసిన పనులకు ఎలాంటి ఫలితాలు వచ్చాయి? ఇంతకు ముందు చేసిన పనులకి నేను ఎలాంటి గుణపాఠాలు నేర్చుకున్నాను? నా పనుల్లో ఏవి సత్ఫలితాల్ని ఇచ్చి, నా పురోగమనానికి దారితీస్తున్నాయి? ఏ పనులు నిష్ప్రయోజనంగా ఉంటున్నాయి? నేనెక్కడ తప్పు చేశాను, అలాంటి తప్పు నేను మళ్లీ చేయకూడదంటే ఏం చేయాలి?

'దీన్ని 'గాఢాలోచన' అంటాం. ఈ విధమైన గాఢాలోచన చేసే సమయంలో నీకు నువ్వుగా నిజాయితీగా ఆలోచించాలి. నీ అంతరంగ స్వరాన్ని వినాలి. నీ అంతరంగ స్వరం నీ మెదడు స్వరాలతో కలిసి కలుషితం కాకుండా చూసుకోవాలి. నీ నిజాయితీ, అంకితభావం నీకు నీ అంతరంగ స్వరాన్ని శ్రద్ధగా ఆలకించేందుకు సాయపడతాయి. ఒకసారి నీకు అంతరంగ స్వరం వినడం అలవాటు అయితే, బాహ్య ప్రపంచంలోని గురువులు చెప్పే సిద్ధాంతాలు, పాటింపజేసే పద్ధతులు అర్థవంతమైనట్లు బోధపడుతుంది. అప్పుడు ఏదో ఒక విధానం బాగుందనే భావన నీకు కలుగుతుంది. ఆ విధానాన్ని పాటించడం వల్ల నీ అభివృద్ధికి ఉపయోగపడుతుందనీ, మిగతా విధానాల జోలికి పోవడం సమయాన్ని వృథా చేయడమేననే ఇంగితం నీకే కలుగుతుంది. 'మూడు రకాల సాధకులు ఉంటారు. కొందరు ఏనుగు వైఖరిని పోలిన సాధకులు, మరి కొందరు చీమ వర్గానికి చెందిన వారు, మరి కొందరు తేనెటీగల తరగతికి చెందినవారు. ఏనుగులు చూడండి...బలంగా, శక్తివంతంగా ఉంటాయి. కానీ పంచదారను ఇసుక నుంచి వేరు చేయలేవు. కానీ చీమ అతి చిన్న ప్రాణి అయినప్పటికీ, అది ఇసుకనీ, పంచదారనీ వేరు చేయగలదు. ఇక తేనెటీగలైతే వేర్వేరు చోట్ల నుంచీ మధుర పదార్థాన్ని తెచ్చి గొప్ప నైపుణ్యంతో తేనెని తయారు చేస్తాయి. అదే విధంగా, మూడు కోవలకి చెందిన విద్యార్థులు ఉంటారు. కొందరు జ్ఞానాన్ని సిద్ధాంతం, మూఢ నమ్మకం, సంప్రదాయబద్ధమైన విధానాలు, వేడుకల నుంచి వేరు చేసి చూడలేరు. అలాంటి వారి జ్ఞానం ఆధ్యాత్మికత పట్ల అయోమయ భావననే మిగులుస్తుంది.

'మరో రకమైన విద్యార్థికి వాస్తవం–మిథ్యకి గల భేదం తెలుసు. అతడికి ప్రయోజనకరమైన, ఉపయోగం మాలిన విధానాల మధ్య తేడా అర్థమవుతుంది, కానీ అంతర్గతంగా మరీ అంత దృఢత్వం ఉండదు. ఉత్తమ విద్యార్థులకి అటు అంతర్గత దృష్టీ ఉంటుంది, అంతరంగ బలమూ ఉంటుంది. అన్ని రకాల సానుకూల ఆధారాల నుంచీ వాళ్లు జ్ఞానం సంపాదిస్తారు. తమకి ఏం కావాలో వాళ్లకి తెలుసు, తమ జీవిత సాధన, లక్ష్యం వాళ్లకి అర్థమవుతుంది కాబట్టి, ఆ జ్ఞానాన్ని వాళ్లు తమ అవసరాలకు అనుకూలంగా మలుచుకుంటారు.

'ప్రాచ్యంలో ఉపనిషత్తులు అతి గొప్ప ధార్మిక గ్రంథాలు. 'ఈ ప్రపంచం వెలుగు–చీకటితోనూ, మంచీ–చెడుతోనూ నిండి ఉంది. ఒక మనిషిగా నీకు చీకటి నుంచి వెలుగునీ, చెడు నుంచి మంచినీ వేరుపరిచి కేవలం వెలుగుని మాత్రమే ఆలింగనం చేసుకోగల శక్తిసామర్థ్యాలు నీవు కలిగి ఉండాలి. ఈ గురువు నుంచి ఆ గురువు దగ్గరకు పరిగెత్తడంలో నీ సమయాన్ని వృథా చేసుకోగూడదు. మీ చిదానంద అనుభూతి కోసం స్వామీ రామని గానీ, మరో వ్యక్తిని గానీ ఆలంబనగా చేసుకోవద్దు. నేను తింటే మీ ఆకలి తీరుతుందని భావిస్తున్నారు? మరొకరు తినడం వల్ల మీ ఆకలి తీరుతుందని ఊహించడం ఒక భ్రమ. అలాంటి ఊహలు, కల్పనలూ మీ మనసులో నాటేవారి మాటలు వినవద్దు.

'ప్రాక్టికల్‌గా ఉండండి. మీకు శరీరం ఉంది, కానీ మీరు కేవలం శరీరం మాత్రమే కాదు. మీరు ఆలోచన గల ప్రాణి కూడా. ఎందుకంటే మీకు మనసు ఉంది. మీరు ఆరోగ్యంగానూ

ఆనందంగానూ ఉండాలంటే, మీకు శరీరం, మనసు గతిశీలతపై అవగాహన ఉండాలి. వాటి మధ్య గల బంధం, అవి పరస్పరం ఎంతగా అనుసంధానమై ఉన్నాయో అర్థం చేసుకోవాలి. శరీరం, మనస్సుని శ్వాస అనుసంధానం చేస్తోంది. మీరు ఇప్పుడు శ్వాసిస్తున్నారు కూడా. శ్వాసని వల్లనే మీ శరీర, మానసిక ఆరోగ్యాలకి కీలకంగా పనిచేస్తుంది. సరైన ఆహారం, వ్యాయామంతో మీ శారీరిక ఆరోగ్యం బాగుంటుంది. సరైన ఆలోచనా విధానం, ఏకాగ్ర చిత్తం మానసిక ఆరోగ్యాన్ని నిర్ధారిస్తాయి. కానీ సరైన శ్వాస క్రియని అలవాటు చేసుకోకపోతే, మీకు శరీర ఆరోగ్యంగానీ, మానసిక ఆరోగ్యంగానీ ఉండవు.

'మీరు సరిగా తినడం, సరిగా వ్యాయామం చేయడం, శ్వాసించడం నేర్చుకుంటే, మీరు హిందువో, బౌద్ధ మతస్తుడో అయిపోరు. మీరు ఒక ఆరోగ్యవంతమైన మనిషిగా మారతారు. ఆరోగ్యప్రదమైన శరీరం, స్వచ్ఛమైన మనసుతో మీరు మీ మతాన్ని సమర్థవంతంగానూ, సృజనాత్మకంగానూ సాధన చేయవచ్చు. మీరు ఆరోగ్యప్రదమైన శరీరం, స్వచ్ఛమైన మనసుని సాధన చేస్తే, మీకు మీ జీవితాశయం, జీవిత పరమార్థం మీదకి దృష్టి తేలిగ్గా మళ్లుతుంది. సరిగా స్పష్టంగా ఆలోచించుకుంటే, మీకు ప్రాచ్య దేశాల్లో స్వామీజీలు, ప్రాచ్య ప్రాంతాల్లో బోధకులూ వచ్చి మీకు మేలు చేసేదేదో, కీడు చేసేదేదో తెలియజేయనవసరం లేదు. కాబట్టి నేను చెప్పేదేమిటంటే, సంపూర్ణ ఆరోగ్యం, ఆధ్యాత్మికత కోసం అవసరమైన టెక్నిక్స్‌ని నేర్చుకోండి. అవి మీకు ఆరోగ్యంగా, బలంగా, స్పష్టంగా, శక్తివంతంగా ఎదగడానికి ఉపయోగపడతాయి.

'ఇది శాస్త్రీయ మార్గం. అన్ని రకాల యోగ విధానాల్నీ శాస్త్రీయంగా నిరూపించడం జరిగింది. యోగం శాస్త్రీయ జ్ఞానం. ఆధ్యాత్మిక జ్ఞానాన్ని సాధన చేయడానికి మీరు మీ మతాన్ని మార్చుకోనవసరం లేదు. యోగంలో కమాండ్‌మెంట్స్ (ఆజ్ఞలు) అంటూ ఉండవు. యోగానికి స్వీయ నిబద్ధత కావాలి. స్వీయ నిబద్ధత ఆధారంగానే స్వీయ క్రమశిక్షణ వస్తుంది. స్వీయ క్రమశిక్షణే స్వీయ రూపాంతరణకి కీలకమైన అంశం. స్వీయ రూపాంతరణే మీకు నిరంతర బ్రహ్మానందాన్ని ప్రసాదిస్తుంది. ఆ స్థితిని వేషధారణ మార్చిగానీ, జీవనశైలి మార్చి గానీ, ఒక ప్రత్యేకమైన సమూహంలోనో సంస్థలోనో భాగం కావడం వల్ల గానీ పొందడం సాధ్యం కాదు.'

ఈ విధమైన ప్రెజెంటేషన్‌తో కాంగ్రెస్ అత్యధిక సంఖ్యలో ప్రేక్షకుల దృక్కోణాన్ని స్వీయ సాధన వైపు మళ్లించింది. అప్పటి వరకూ అనేక ఆధ్యాత్మిక అంశాలతో అయోమయానికి గురైనవారికి అడగకుండానే తమ మనసులోని సందేహాలకు సమాధానం దొరికినట్లయింది. ఆ తర్వాత ఇన్‌స్టిట్యూట్ కార్యకలాపాలకు నవోత్తేజం వచ్చినట్లయింది. ఆ శీతాకాలంలో స్వామీజీ భారతదేశానికి తిరిగి వచ్చారు.

ఇది ఇలా జరుగుతున్న సమయంలో, నేను నా జీవితంలో అత్యంత సంక్లిష్ట సమయంలో ఉన్నాను. నేను అప్పుడే నా మాస్టర్స్ డిగ్రీ పూర్తి చేశాను. అలహాబాదు విశ్వవిద్యాలయంలో సంస్కృత విభాగంలో డాక్టొరల్ ప్రోగ్రామ్‌లో జాయిన్ అయ్యాను. నన్ను ఉద్యోగం వెతుక్కోమని మా కుటుంబం వత్తిడి చేయసాగింది. కానీ నా సమయాన్ని కేవలం డబ్బు కోసం మాత్రమే వెచ్చించడం కంటే తీవ్రంగా వేధించే నా ఆకాంక్ష కోసం వెచ్చించడం నాకు ఇష్టం. అందుకే పన్నెండేళ్ల ప్రగాఢమైన సంస్కృత, వైదిక సాహిత్య అధ్యయనం కొనసాగించాను. ఊరికే పుట్టడం, యవ్వనదశకి చేరడం, ప్రపంచ వ్యవహారాల్లో విజయవంతం కావడం, వృద్ధాప్య దశలో నిస్సహాయంగా జీవించడం, చివరికి మరణించడం కంటే అతీతమైన ఒక సార్థకత ఈ జీవితానికి ఉందని నాకు తెలుసు. కాకిలా కలకాలం జీవించడం కంటే హంసలా ఆరునెలలు జీవించడం మేలనీ, ధూమంతో ఆకాశాన్ని నింపే కంటే, మెరుపులా ఒక్క క్షణం మెరిసినా చాలనీ నాకు తెలుసు. ఆ లక్ష్యంతో పోల్చుకుంటే నా సంకల్పంలోని అత్యున్నత స్థానంలో నా తల్లిదండ్రులు

గానీ, అప్పచెల్లెళ్లు గానీ లేరు. అంతా...అన్నీ వదిలేసి వెళ్లడానికి నేను సిద్ధంగా ఉన్నాననీ, భగవంతుని ద్వారానికి దారి చూపగలిగే గురువు ఒకర్ని అన్వేషించి వారి పాదాలను ఆశ్రయించాలనీ నేను సంకల్పించాను. అయితే నా కుటుంబ పరిస్థితుల దృష్ట్యా నేను ఉద్యోగం వెతుక్కుని త్వరగా నా బాధ్యతల్ని పూర్తి చేయాలని గుర్తు చేసుకున్నాను. నిజానికి, నేను మా అలహాబాదు విశ్వవిద్యాలయం, న్యూఢిల్లీలో రింగ్‌రోడ్‌లోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండోలజీతో సహా ఎన్నో చోట్ల ఉద్యోగాలకి దరఖాస్తు చేసి ఉన్నాను.

ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండోలజీ నాకు సెప్టెంబరు 1976 లో ఇంటర్వ్యూకి పిలిచినపుడు నేను మొదటిసారిగా న్యూఢిల్లీలో కాలుపెట్టాను. కానీ వాళ్లు అభ్యర్థిని ఎంపిక చేసుకున్నారని త్వరలోనే అర్థమైంది. వాళ్లు పైకి ఊరికే ఇతరుల్ని కూడా ఇంటర్వ్యూ నిర్వహించామని చెప్పుకోవడానికి మమ్మల్ని పిలిచారు, అంతే. ఒక వైపు రిలీఫ్, మరో ప్రక్క నిరాశతో నేను మా ఆతిథేయి, శ్రీ ఆనంద ప్రతాప్ సింగ్ ఇంటికి చేరుకున్నాను. శ్రీ సింగ్ అమర్‌గఢ్ రాజ్యాన్ని ఏలిన రాచకుటుంబ సభ్యులు. వారికి మా కుటుంబం ఎన్నో తరాలుగా రాచపురోహితులుగా ఉంటూ వస్తున్నాం.

మరుసటి ఉదయం దుర్గామాత నవరాత్రులు ప్రారంభం కాబోతున్నాయి. అందుకే నేను త్వరగా లేచి, స్నానాదికాలు ముగించుకున్నాను. జపం పూర్తి చేసుకుని పారాయణలు కూడా చేసేసుకున్నాను. తర్వాత అల్పాహారం తీసుకుని లాన్‌లో కూర్చున్నాను. ఇంతలో శ్రీ సింగ్ బయటికి వచ్చి, 'ఆ! రాజమణి! మీరు ఢిల్లీ చూడాలనుకుంటున్నారా?' అని అడిగారు.

నాకు సహజంగా చూడాలనే ఉంటుంది గదా! మేము సౌత్ ఎవెన్యూలో ప్రఖ్యాత రాజకీయనాయకుల నివాసాల్ని చూస్తూ వెళ్తుండగా, ఆయన తీన్‌మూర్తీ రోడ్‌లో ఉన్న భారత్ తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ఇంటి వైపు చూపించారు. మరి కొంచెం సేపటి తర్వాత అశోకా హోటల్ ఎదుట ఆగాము. నాకు ఆయన నాకు ఓ పది రూపాయల నోటు ఇస్తూ, 'నాకు ఈ హోటల్‌లో ఒక ముఖ్యమైన మీటింగ్ ఉంది. చాలా సేపు పట్టవచ్చేమో. ఈ వీథిలో నెహ్రూ పార్క్ ఉంది గదా! మీరు కాసేపు ఆ పార్క్‌లో నడవండి. ఇంటికి వెళ్లాలంటే వెళ్లండి. మీరు దారి తప్పిపోతే, త్రీ వీలర్‌లో వెళ్లండి. మీకు అడ్రస్ తెలుసు కదా!' అన్నారు.

ఢిల్లీకి వెళ్లడం నాకు అదే మొదటిసారి. నాకు అన్నీ అద్భుతంగానే కనిపిస్తున్నాయి. అంత అందమైన బిల్డింగులు గానీ, విశాలమైన రోడ్లు గానీ నేనెన్నడూ చూడలేదు. అంత పెద్ద పార్కుని ఎంత బాగా మెయింటెయిన్ చేస్తున్నారో చూసి ఆశ్చర్యపోయాను. అక్కడే కాసేపు ఊరికే అటూ ఇటూ తిరుగుతూ ఉండిపోయాను. కాసేపటి తర్వాత నేను అవతలి పక్కకు వెళ్లాను. రోడ్డుకి అవతలి వైపు ఒక ఎత్తైన బిల్డింగ్ ఉంది. పైకి చూస్తే, 'అక్బర్ హోటల్' అనే అక్షరాలు కనిపించాయి. అలహాబాద్, బెనారస్, ఇంకా ఇతర నగరాల్లో రెస్టారెంట్లుగా పిలవబడే చాలా హోటళ్లు తెలుసు గానీ, ఈ బిల్డింగ్ సైజు చూస్తే, అక్కడ రోజుకి ఎంత మంది తినడానికి వస్తారో తెలుసుకోవాలని ఆసక్తి కలిగింది. నేను ఎంట్రన్స్ దగ్గరకు రాగానే గేటు కీపర్ గేట్ తెరిచి పట్టుకున్నాడు. నేను ఓ అతిథిలా లోపలికి నడిచాను. పెద్ద పెద్ద లాబీలు కనిపించాయి. ఎక్కడా భోజనాల జాడే లేదు. నేను అక్కడ ఇష్టం వచ్చినట్టు తిరగకూడదనీ, ఇదొక ప్రముఖ ప్రదేశమనీ తట్టింది మొట్టమొదటగా. కానీ నేను శ్రీ ఆనంద ప్రతాప్ సింగ్ అతిథిని కాబట్టి ఆ విషయం పెద్దగా పట్టించుకోనవసరం లేదని అనిపించింది. ఆయనకు ప్రభుత్వంలో పెద్ద హోదా ఉంది. ఆ విషయం తెలుసుకుంటే ఎవరూ నన్ను ఇబ్బంది పెట్టరు. అందువల్ల నేను చుట్టూ తిరగడం మొదలుపెట్టాను. చివరికి ఒక తలుపు కొద్దిగా తెరిచి ఉంది. అందులోంచి కొంతమంది మనుషులు బయటికి వస్తున్నారు, మిగతావారు లోపలికి వెళ్తున్నారు. ఆ తర్వాత తలుపు మూసుకుంది.

మళ్లీ కొద్దిసేపటి తర్వాత మళ్లీ ఇందాకటి లాగానే జరిగింది. అక్కడ ఏదో వింత సందడి నెలకొని ఉంది. నేను తలుపు తెరిచేసరికి, బయట ఉన్న కార్పెట్ వేరుగా ఉందనే విషయం గమనించాను. నేను ఇందాకటి ఫ్లోర్‌లో లేను. నేను 'రూం' గా అనుకుంటున్నది ఒక లిఫ్ట్, ఒక ఎలివేటర్. నేను లిఫ్టుల గురించి విన్నాను గానీ చూడడం అదే మొదటిసారి. '9' దగ్గర లైటు వెలిగింది. నేను కొంచెం భయపడుతూనే, దిగాను.

నా భయాన్నీ అయోమయాన్నీ కప్పిపుచ్చుకోవడానికి నేను ఆ ఫ్లోర్‌లోని చిన్న లాబీలో అటూ ఇటూ పచార్లు చేయసాగాను, ఎవరి కోసమో ఎదురు చూస్తున్నానని అనిపించేలా. నేను కిటికీ దగ్గర నిలబడి ఉన్నాను. అక్కడ నుంచి చూస్తే నెహ్రూ పార్క్‌లో ఉన్న చెట్లు ఎంత చిన్నగా కనిపిస్తున్నాయో చూసి ఆశ్చర్యమనిపించింది. ఇంతలో ఎవరిదో స్వరం అతి మధురంగా వినిపించింది, 'బేటే (నాయనా)!' అంటూ. అక్కడ నాకెవరూ తెలిసినవాళ్లు లేరు. కాబట్టి ఆ గొంతు గురించి పట్టించుకోనవసరం లేదని నాకనిపిస్తోంది. కానీ ఆ చిన్న లాబీలో ఒక అందమైన పొడవాటి మనిషి నడుచుకుంటూ నా వైపు వస్తుంటే పట్టించుకోనట్టు ఉండడం ఎలా కుదురుతుంది? ఆయన సిల్క్ కుర్తా, పైజమాలో ఉన్నారు. అది భారతీయ వేషధారణ. పైగా మెడలో రుద్రాక్షమాల ఉంది కూడా. సంకోచం లేకుండా ఆయన నా భుజాలపై చేతులు వేసి, 'ఎప్పుడొచ్చావు నువ్వు?' అని అడిగారు.

'నిన్ననే వచ్చానండీ!' అన్నాను నేను. నాకెందుకో ఆ మనిషి నాకు బాగా తెలిసిన మనిషని అనిపించింది. ఖచ్చితంగా ఆయనకి కూడా నేను తెలుసనే అనిపిస్తోంది. ఆయన ఎవరో అప్పుడు అడిగితే బాగుండదని ఊరుకున్నాను. ఆయన నా చేతిని తన చేతిలోకి తీసుకుని నడుస్తుంటే నేనూ ఆయనతో బాటే నడిచాను. ఆయన సూట్ అక్కడికి కొన్ని అడుగుల దూరంలో ఉంది. మరి కొద్ది క్షణాల్లో ఆ సూట్‌లోకి వెళ్లాం మేము. ఆయన తన బెడ్ మీద కూర్చున్నారు. ఆయన తన ఎదురుగా ఉన్న మరో బెడ్ మీద కూర్చోమని సైగ చేశారు నాకు. 'నువ్వు ఎలా పెరిగి పెద్దయ్యావో నాకు తెలియదు. ఇప్పుడు నువ్వేం చేస్తున్నట్టు?' అని అడిగారు.

'నేనిప్పుడు పిహెచ్.డి. చేస్తున్నానండీ!' అని చెప్పాను.

'టాపిక్ ఏమిటి?'

'శ్రీవిద్యలో వేదాంత తత్వం మీద!' అన్నాను నేను. ఆయన సన్నగా నవ్వారు.

'శ్రీవిద్యలో వేదాంత తత్వం మీద! నీకు పిహెచ్.డి.లు, డి.లిట్.లు మునివేళ్ల మీద వచ్చేస్తాయి. కానీ నువ్వు సాధన ఎప్పుడు చేస్తున్నావో నాకది చెప్పు!'

ఆయన అంతటి అధికార స్వరంతో ప్రశ్నించేసరికి నేను ఆపాదమస్తకం చలించాను. అది ఓ ఆహ్వానం, ఓ సవాలు! ఎవరీ మనిషి? గత ఐదేళ్లుగా నేను శాస్త్రాల్లోకెల్లా మార్మిక విద్యగా చెప్పబడే శ్రీవిద్య బోధించే గురువు కోసం వెతుకుతున్నానే! కనీసం అప్పటికి నేను ఓ ఇరవైమందికి పైగా శ్రీవిద్య గురించి తెలిసినవారినీ, పరిశోధకుల్నీ, సాధువుల్నీ కలిసి ఉంటాను. కానీ నాకు వారెవరిలోనూ కూడా కేవలం పుస్తక జ్ఞానం తప్ప, నాకు సంతృప్తినివ్వగల జ్ఞానం వారి దగ్గర లేదని అర్థమైంది. కానీ వారే నన్ను ఆహ్వానించి శ్రీవిద్య గురించి తమకి తెలిసిన విషయాల్ని వర్ణించి చెప్పేవారు. కొంతమంది సిద్ధులు మాత్రం నేను గత జన్మల్లో నా గురువుల నుంచే నేను ఈ విద్యని ఉపాసించడం నేర్చుకోవాలని చెప్పారు. మరి నేను నా గురువుల్ని ఎలా కలుసుకోవాలో చెప్పమని అడగగా, వారు చాలా ప్రేమతో, నా గురువర్యులే నన్ను కనుగొంటారని చెప్పారు. సరిగ్గా నా గురుదేవులే నన్ను కనిపెట్టి పట్టుకున్నారు. అలాంటి గొప్ప సిద్ధుల్లో అలహాబాదుకి చెందిన స్వామి సదానంద ఒకరు. ఆయన, 'చీకటిపడే లోపు ఆయన తన గొర్రెని వెతుక్కుంటాడు.

కంగారు పడకు. ఆయన నిన్ను కనుగొంటారు. ఆయన తనకు తానుగా నీకు పరిచయం చేసుకుంటారు!' అని చెప్పారు.

నాకు ఆ మాటలు గుర్తుకు రాగానే, నా ఎదురుగా ఉన్న ఈ మనిషిని నా గురుదేవులుగా నేను గుర్తించడంతో పిడుగుపాటుకి గురైనట్టు తోచింది. స్వామీ సదానంద, ఇంకా ఇతర శ్రీవిద్యోపాసక సిద్ధులంతా చెప్తున్న గురువు ఈయనే! మరి ఈయనేమిటి, చూడడానికి ఎంతో ఉల్లాసంగా, సంతోషంగా, చాలా మామూలుగా ఉన్నారు? ఇంత వేగంగా కొన్ని ఘటనల పరంపర నా జీవితంలో చోటు చేసుకోవడం నాకేమీ జీర్ణం కావడం లేదు. కానీ కొద్ది క్షణాల మౌనం తర్వాత ఆయన నన్ను పరీక్షించడానికా అన్నట్లు, 'నేను శ్రీవిద్య గురించి విన్నాను. కొన్ని గ్రంథాలు ఈ శాస్త్రం గురించి మాట్లాడతాయి. నీకు అలాంటి గ్రంథాలేవైనా తెలుసా?' అని అడిగారు. నేను వారికి శ్రీవిద్యకి సంబంధించిన కొన్ని గ్రంథాల పేర్లు చెప్పాను. ఆయన తనకి ఈ విషయం మీద అంతగా తెలియనట్టూ, నాకేం తెలుసో తెలుసుకోవాలన్న ఆసక్తి ఉన్నట్టూ ప్రశ్నలు వేయసాగారు. నేను చెప్తున్న విషయాన్ని ఆయన ప్రశంసిస్తున్నారు, నేను ఆయన ప్రశ్నలకి సమాధానాలు చెప్తున్నాను. అప్పటికీ నా మనసులో ఈ మనిషి ఎవరో, మా ఇద్దరి మధ్యా అనుబంధం ఎలాంటిదో అర్థం కాక మాట్లాడుతూ మాట్లాడుతూ ఆలోచనలో పడిపోతున్నాను.

ఇంత అందంగా పొడవుగా ఉన్న స్ఫురద్రూపి! ఈయన సాధువై ఉంటారా! సాధువులు నగరాల్లో జనసమ్మర్థాల్లో ఉంటారా? అందులోనూ ఇలాంటి వైభవోపేతమైన ప్రాంతాల్లో! ఆయన స్వర మాధుర్యం, ప్రశాంతంగా ఉన్న వదనం చూస్తుంటే, ఆయన చాలా గొప్ప వ్యక్తి అనిపిస్తోంది. ఆయన అడుగుతున్న ప్రశ్నలు గానీ, సిల్క్ దుస్తుల్ని గానీ పరికిస్తే గొప్ప విద్యా ప్రజ్ఞతో ప్రకాశిస్తున్న రాకుమారుడిని తలపిస్తున్నారు. ఆయన వేసిన, 'సాధన ఎప్పటి నుంచి మొదలుపెడుతున్నావు?' అనే ప్రశ్న నా మదిలో పదే పదే తిరుగుతోంది. నా అంతరంగం ఈయనే నా గురువని చెప్తోంది.

ఆయన చూపిస్తున్న ఆసక్తికి అక్కడ ఉన్నంతసేపూ నేను శ్రీవిద్య గురించి మాట్లాడుతూనే ఉన్నాను. కానీ ఓ ఇరవై, ముప్పై నిముషాల సేపు మాట్లాడేసరికి నేను భద్రపరిచి ఉంచుకున్న విషయం అంతా అయిపోయింది. అప్పుడు, పరిస్థితి మరింత ఆసక్తికరంగా మారింది. ఆ విషయాన్ని ఆయన వివరించసాగారు. నేను ఏవేవో కల్పనల్లో ఉంటూ, నా అరకొర జ్ఞానాన్ని ప్రదర్శిస్తున్నా సరే, ఆయన ఎంత ప్రోత్సాహాన్నిచ్చేవారంటే, నేనెన్నడూ నా అజ్ఞానానికి క్షమాపణ కోరే అవకాశమే రాలేదు, ఆయన మాటలు అంత ప్రేరణనిచ్చేవి. ఆయన మాటల్లోని గాఢతకి నేను కట్టుబడిపోయాను, 'నా చిరకాల స్వప్నం నిజం కాబోతోంది' అని నాకు తెలుస్తోంది.

మరి కొంచెంసేపటి తర్వాత టెలిఫోన్ రింగ్ అయింది. ఆయన తీసుకున్నారు. ఓ క్షణం పాటు విన్న తర్వాత, 'ఆయన్ని పంపండి!' అన్నారు. మరి కొద్ది నిముషాల్లో ఆ తలుపు దగ్గర ప్రత్యక్షమైన వ్యక్తి నన్ను అక్కడుండడం చూసి ఆశ్చర్యపడిపోయారు. ఎందుకంటే ఆ వచ్చిన వ్యక్తి మరెవరో కాదు, నాకు ఆతిథ్యమిస్తున్న ఆనంద ప్రతాప్ సింగ్. శ్రీ సింగ్ లోపలికి వస్తూనే ఆ మహనీయుని పాదాలపై తల ఉంచి ప్రణమిల్లారు. ఆయన శ్రీ సింగ్‌తో మాట్లాడుతూ, 'ఆనంద్, అతన్ని ఇక్కడికి తీసుకుని రావడానికి సందేహించావే?' అని అడిగారు.

'సర్కార్! (ప్రభూ) ఆయన్ని ఇక్కడికి తీసుకుని రావడానికి ముందు మీ అనుమతి తీసుకోవాలని భావించాను,' అన్నారు సింగ్ సమాధానంగా.

ఆయన, 'నేను ఇతని గురించి ఎంతో కాలంగా ఎదురుచూస్తున్నాను,' అన్నారు.

శ్రీ సింగ్ కూర్చోగానే, ఆ మార్మిక వ్యక్తి మళ్లీ శ్రీవిద్య గురించిన మా సంభాషణని కొనసాగించారు. మరో ఐదు నిముషాల్లో మళ్లీ టెలిఫోన్ మ్రోగింది. శ్రీ సింగ్ దాన్ని అందుకుని, ఓ క్షణకాలం విని, 'సర్కార్, పీలూ మోడీ ఫోన్‌లో ఉన్నారు,' అని అన్నారు.

'నేనిప్పుడు పనిలో ఉన్నానని చెప్పండి. నేను ఆయనకి తర్వాత ఫోన్ చేస్తాను,' అని చెప్పారు.

పీలూ మోడీ పార్లమెంట్ సభ్యులు. ఆనాటి ప్రఖ్యాత రాజకీయనాయకులు, వ్యాపారవేత్తల్లో ఒకరు. ఆయన పేరు వింటూనే నేను మళ్లీ ఆశ్చర్యపోయాను, 'ఏం జరుగుతోంది? ఒక రాకుమారుడు, భారతదేశ విదేశాంగ వ్యవహారాలు చూసే మంత్రి గౌరవనీయ రాజా దినేష్ సింగ్‌కి సెక్రెటరీ అయిన ఆనంద ప్రతాప్ సింగ్ స్వయంగా ఇక్కడికి వచ్చి వినయంగా చేతులు కట్టుకుని కూర్చున్నారు. ఈయన టెలిఫోన్ కాల్స్‌ని ఆన్సర్ చేస్తున్నారు. ఇంకో వైపు పీలూ మోడీ స్థాయిలో ఉన్న వ్యక్తి ఈయనకి ఫోన్ చేస్తున్నారు. వీటన్నింటి కంటే వింతైన విషయం, నాతో *మాట్లాడుతుండడం వల్ల ఆయనకి పీలూ మోడీతో మాట్లాడే తీరిక దొరకకపోవడం!'*

ఒకవైపు నేను ఈ సంగతి ఆలోచిస్తూనే ఉన్నాను, మరో వైపు ఆయన శ్రీవిద్య గురించి చెప్పిన విషయాల్ని కూడా అంతరంగంలో నిశితంగా పరికించసాగాను. శ్రీ సింగ్ బ్లాక్ అండ్ వైట్ ఫోటోలు ఉన్న ఒక సన్నపాటి పుస్తకాన్ని చేతిలోకి తీసుకుని తెరుస్తుంటే, ఆ అట్ట మీద పేరు నాకు కనిపించింది. 'స్వామీ రామా ఆఫ్ ది హిమాలయాస్' అని ఉంది. ఆ ఫోటోలో ఉన్న వ్యక్తి నా ఎదురుగా ఉన్నారు. నేను ఆ పేరు, ఆ ఫోటో చూడగానే నాకు అంతా అర్థమైపోయింది. ఈయనే 'భోలే బాబా, శ్రీవిద్యోపాసకుల్లో అత్యంత ఉత్కృష్ట సాధన చేసినవారు!' దాంతో నా మనశ్శరీరాల్లో కలిగిన సంచలనానికి నేను గిర్రున ఆయన ఒడిలో పడిపోయాను. నేను నా బాహ్య స్మృతి కోల్పోయాను. నేనా స్థితిలో ఎంతసేపు ఉన్నానో తెలియదు. స్వామీజీ నా అశ్రుధారా ప్రవాహాన్ని తుడుస్తున్నారు. నేను తిరిగి యథాస్థితికి చేరుకున్నాక కూడా అంతకు ముందు నేనున్న వర్ణనాతీతమైన విస్మృత స్థితి నాకింకా ఆశ్చర్యంగానే ఉంది.

నేను ఎలాగో నిలదొక్కుకోవాలని చూస్తున్నాను. అప్పుడు నేను భోలే బాబా/స్వామీ రామ మాటలు విన్నాను, 'నేను నీ గురించి ఎదురు చూస్తున్నాను ఎంతో కాలంగా. ఎప్పుడొస్తున్నావు స్టేట్స్‌కి? నువ్వు నాకు చేదోడువాదోడుగా ఉండాలి,' అన్నారు. ఆయన పెన్, పేపర్ ఇవ్వమని అడిగారు నన్ను నా థీసిస్‌కి సినాప్సిస్ తయారు చేయడానికి. నేను డెస్క్‌లోంచి ఆ వస్తువులు తీసి ఇవ్వడానికి లేచాను, ఓ పక్కన నా స్థితి మత్తుపదార్థాలు సేవించినవాడి మాదిరిగా ఉంది. నా మనసు ఇంత క్రితం అనుభవించిన మధుర ఘడియల్ని తల్చుకుని ఆ ఆనందకరమైన జ్ఞాపకాలకి మురిసిపోతోంది. అయితే నేను పేపర్, పెన్ తీసుకుని వచ్చేసరికే, స్వామీజీ నా జ్ఞాపకశక్తి మీద ఓ మందపాటి పొర కప్పేశారు.

ఈరోజు ఆలోచిస్తే నాకు గుర్తున్నదొకటే, ఆ ఆనందం ఈ ఐహిక ప్రపంచంలోని అన్ని ఆనందాలకీ మించింది. లౌకిక సంబంధమైన అన్ని సుఖదు:ఖాల్నీ క్రింది స్థితుల్లోకి తోసేసి వాటన్నింటికీ ఆవలగా అతీతంగా కలిగిన ఆ ఆనందానుభూతిని మళ్లీ కావాలంటోంది మనసు. నా థీసిస్‌కి విషయసూచిక స్వామీజీ డిక్టేట్ చేశారు. తర్వాత నా వైపు తిరిగి, నా గురించీ, అమ్మానాన్న గురించీ, అక్కచెల్లెళ్ల గురించీ కనుక్కునే ముందు ఆయన శ్రీ సింగ్‌తో భారతదేశ రాజకీయాల గురించి మాట్లాడారు. ఉన్నట్టుండి, 'వాళ్ల గురించి నువ్వేమీ బెంగ పెట్టుకోకు. వాళ్ల గురించి నేను చూసుకుంటాను. వాళ్ల బాధ్యత నాది. నీ బాధ్యత సాధన చేయడం, అమెరికాకి రావడానికి సిద్ధంగా ఉండడం!' అన్నారు. తర్వాత ఆయన టెలిఫోన్ తీసుకుని, అమెరికాలో ఉన్న తన శిష్యుల్లో ఒకరికి, ఇమ్మిగ్రేషన్ పేపర్లు పంపించమనీ, నా వీసాని స్పాన్సర్ చేయించమనీ చెప్పారు. ఆ తర్వాతి మూడు రోజులూ తీరికలేకుండా ఎంతో వత్తిడితో గడిచిపోయాయి. నన్ను స్వామీజీ నిజంగానే తనతో స్టేట్స్‌కి తీసుకుని వెళ్లాలని భావిస్తున్నారా? వారితో వెళ్లిపోవాలా?

లేదంటే ఢిల్లీ యూనివర్శిటీలో టీచింగ్ ప్రొఫెషన్‌ని తీసుకోవాలా? లేకపోతే ఆయన కేవలం నా సహనాన్నీ, నా మానసిక స్పష్టతనీ, నిలకడనీ పరీక్షించదలుచుకున్నారా? కానీ ఒకసారి ఈ దశ ముగిసిపోగానే, ఆయన నాపై ఎంత కరుణ చూపారో, ఎంత స్పష్టతతో నాకు దిశా నిర్దేశం చేశారో అర్థమైంది. ఆధ్యాత్మిక విషయాల్లో ఆయన చాలా సీరియస్‌గా, సంక్షిప్తంగా మాట్లాడేవారు. కానీ మిగతా అన్ని సందర్భాల్లోనూ ఆయన చాలా సరదాగా, సమయస్ఫూర్తిగా మాట్లాడుతూ ఆహ్లాదంగా ఉండేవారు. సందర్భం ఎలాంటిదైనా ఆయన కొంటెగా ఏమీ ఎరగనట్టు ఉండేవారు. ఆయన సాన్నిహిత్యం నన్ను ఒద్దికగా ఉంచేది. ఎందుకంటే, ఆయన గొప్ప సాధువని తెలుసు. అలాగే ఆయన వ్యక్తిత్వం ఎంత మహనీయమైనదంటే, ఆయన సమక్షంలో నేను బెరుకుగానే ఉండేవాడిని. నా గురువు ఆయనే అనే ఎరుక, ఆయన్ని ప్రశ్నలు అడిగి సందేహ నివృత్తి చేసుకోవడం, ఆయన నుంచి ఎంతో నేర్చుకోవడం నాకెంతో ప్రేరణగా ఉండేది. కానీ ఆయన సమక్షంలో ఆ అనుభూతుల వెల్లువ తట్టుకోలేక ఎక్కడో ఓ మూల దాక్కుందామని ఉండేది. నాకు సహకరించడానికి, స్వామీజీ, పాశ్చాత్యదేశాల్లో తన అనుభవాల గురించి రకరకాల కథల్ని వినిపిస్తూ వాతావరణాన్ని హాస్యోక్తులతో సరదాగా ఉంచేవారు.

ఒకరోజు స్వామీజీ నాకు చికాగోలో తనని చూడడానికి వచ్చిన ఓ మహిళ గురించి చెప్పారు. ఆ తర్వాత అమెరికాలో చెప్పిన ఉపన్యాసాల్లో స్వామీజీ ఆ కథని ఎన్నోసార్లు శ్రోతలకి వినిపించారు. ఆమె మిన్నెసోటా యూనివర్శిటీలో డాక్టొరల్ స్టూడెంట్. ఆమె యోగా మీద థీసిస్ సమర్పిస్తోంది. అందులో భాగంగా ఆమె ఫీల్డ్ వర్క్ చేస్తూ స్వామీజీ కలవడానికి అపాయింట్‌మెంట్ తీసుకుంది. ఇంటర్వ్యూ చేస్తున్న సమయంలో ఆమె సిద్ధులు సాధించి అతీంద్రియ శక్తులు, సిద్ధుల సాధన గురించి అడిగింది. ఆమె స్వామీజీకి ఆటోనామిక్ నాడీ వ్యవస్థ మీద వాలంటరీ కంట్రోల్ ఉందనే విషయం గురించి అనేకమైన ఉదంతాలు అప్పటికే విని ఉంది. ఈ యోగా అద్భుతాలన్నీ ఆయన సిద్ధులు కాబట్టే చేస్తారని భావించింది ఆమె. కొంతమంది స్వామీజీ భక్తులు విపరీతమైన స్వామీజీ పట్ల గల మిక్కుటమైన భక్తి భావంతో స్వామీజీ గొప్ప సిద్ధసంపన్నులనీ, వారికి ఆకలి, దప్పిక, శీతోష్ణస్థితులు, బాధ, ఆనందం వంటి శారీరిక అనుభవాలన్నింటికీ ఆయన అతీతమనే భావన ఆమెలో కలిగించారు. ఆమెకి ఎవరో గానీ స్వామీజీ నిద్ర కూడా పోరని చెప్పారు. దాంతో ఆయన ఇంటర్వ్యూ సందర్భంగా దగ్గు వచ్చి మధ్య మధ్యలో దగ్గుతుంటే, అంత గొప్ప సాధువుకి దగ్గు రావడం ఎలా సాధ్యమా అని చూసింది. అక్కడుండే ఆశ్రమవాసుల్లో ఒకరు వచ్చి, స్వామీజీకి భోజనం సిద్ధంగా ఉందని చెప్పడానికి వస్తే, ఆమె నమ్మలేకపోయింది. 'మీరు భోజనం చేస్తారా?' అని అడిగింది ఆమె. ఆయన దానికి, 'అవును, చేస్తాను,' అన్నారు.

ఆమె ఆశ్చర్యంతో, 'అదేమిటీ, యోగులు ఆకలిదప్పులకు అతీతులు కాదా?' అని అడిగింది.

'అంటే ఏమిటి నీ ఉద్దేశ్యం?' కఠిన స్వరంతో అంటూ స్వామీజీ లేచి, బాత్‌రూంకి వెళ్లారు. ఆమె స్తబ్ధురాలైపోయింది. ఆ స్తబ్ధత నుంచి తేరుకున్న తర్వాత, ఆమె స్వామీజీని ఒక మిథ్యావేదాంతిగా భావించింది. ఊరికే యోగ సాధన గురించి బోధలు చేస్తారు, యోగాన్ని అభ్యసించానని చెప్తారు, కానీ ఆయన కూడా అందరిలాగానే ఆహారం తీసుకుని అవసరాలు తీర్చుకోవడానికి బాత్‌రూంకి వెళ్లారని భావించడంతో ఆమె ఎంతో నిరాశకి గురైంది. నిజానికి, ఆమె మిన్నియాపోలిస్‌కి తిరిగి వెళ్లిన తర్వాత, ఒక గ్రూప్‌ని ఏర్పరిచి, వారికి భారతీయ యోగులు, స్వాముల మీద ధర్మ వ్యతిరేక ప్రచారం చేయాలనుకుంది కూడా.

ఆమె పిహెచ్.డి. విద్యార్థిని అయి ఉండి కూడా అంతటి అవగాహనా లోపం ఎలా కలిగి ఉందని నేను స్వామీజీని అడిగాను. ఏ కొంచెం అవగాహన కలిగి ఉన్న మనిషికైనా

మానవులు–మానవేతరులు, యోగులు–యోగులు కానివారూ, ఎవరైనా సరే, జీవించి ఉండడానికి ఆహారం తీసుకోవాలనీ, విసర్జన క్రియలు జరిపి తీరాలనీ అర్థం కావాలి.

స్వామీజీ మర్మంగా నవ్వి, 'ఇక్కడ అదే కదా సమస్య!' అన్నారు. 'మేధావులకి తరచుగా కనీస ఇంగిత జ్ఞానం లోపిస్తుంది. అందుకే వారి పనులు వ్యావహారికంగా ఉండవు. యోగులు, స్వాములు మోసకారులనే అభిప్రాయం ఈమెలో బలంగా కలగడానికి అనేక రకాల అంశాలు తోడయ్యాయి. ఆమె ఇప్పటివరకూ యోగా మీద ఎలాంటి ప్రామాణికమైన గ్రంథాల్నీ అధ్యయనం చేయలేదు. పైగా సంస్కృత భాష తెలియకపోవడం వల్ల ఆమె యోగ సాహిత్యం కూడా చదవలేకపోయింది. ఆమె యోగసూత్రాల మీద కొన్ని ఉపన్యాసాలు మాత్రం విన్నది. అందులోనూ ముఖ్యంగా అతీంద్రియ శక్తుల మీద ఉన్న మూడవ అధ్యాయం మీద ఉపన్యాసాలు విన్నది. ఆమె నా గురించి కూడా అద్భుతమైన కథల్ని విని ఉంది. ఆ కథలకి నేను సరితూగపోయేసరికి ఆమె చాలా నిరాశ చెందింది.

'ఇది ఆమె తప్పు కాదు. తరచుగా భక్తులు తమ గురువులపై ఇతరులకు గురి కుదరడానికి కొన్ని రకాల అసాధారణమైన కథల్ని అల్లుతూ ఉండి, వాటికి గొప్ప విశ్వసనీయత కల్పిస్తారు. వాళ్ల గురువులు గొప్పవారైతే, తాము కూడా గొప్పవాళ్లమవుతామనే భావన ఒక వైపు, కనీసం గురువుగారిలా గొప్పవాళ్లు కావాల్సిన అవసరం ఇంకో వైపూ పని చేస్తుంటాయి వాళ్లకి. అలాంటి భక్తులలు ఒక గురు సంప్రదాయాన్ని సృష్టిస్తారు. పవిత్రమైన గురు–శిష్య సంప్రదాయ ఔన్నత్యాన్ని మకిలిపరుస్తారు. ఈ ప్రక్రియలో కొత్త సాధకుల్ని తప్పుత్రోవ పట్టిస్తారు,' అన్నారు.

స్వామీజీని అంచనా వేయడం ఎవరికీ సాధ్యం కాదని అనిపించింది. కొన్ని రోజులు ఆయన నేను వస్తానని ఎదురు చూస్తున్నట్టు ఉండేది. గంటలకొద్దీ సమయం నాతో ఆయన ఏకాంతంలో మాట్లాడుతూ ఉండేవారు. ఆ సమయంలో ఆయన ప్రతి విషయం మీదా మాట్లాడేవారు. *మరణ గతిశాస్త్రం* ఆయనకి ఇష్టమైన విషయం. ఆయన *పరకాయ ప్రవేశం* మీద మాట్లాడేవారు. *పరకాయ ప్రవేశం* గురించిన జ్ఞానం, దానిపై పట్టు సంపాదించడం, మరణ గతిశాస్త్రం–ఇవి మన సంప్రదాయంలో కీలకమైన అంశాలని అనేవారు ఆయన. ఆయన తన బాల్యంలో తన సిద్ధ గురువు, ఇంకా కొంతమంది సిద్ధ సాధువులు తనకి చూపించడం కోసం ఏ విధంగా మరణ ప్రక్రియని చూపించేవారో వర్ణించారు. ఆయన ఏం చెప్పున్నారో నాకు పూర్తిగా అర్థం కాకపోయినా, ఆ విషయం నన్నెంతగా ఆకట్టుకుందంటే, నేను ఆయన్ని కలవడానికి వెళ్లిన ప్రతిసారీ, నాకు ఆ విషయం గురించి మళ్లీ ప్రస్తావన తెస్తే బాగుండునని అనిపించేది. మరి కొన్ని సార్లు నేను ఆయన్ని సందర్శించడానికి వెళ్లినపుడు లాబీలో గంటల కొద్దీ సమయం వేచి ఉండాల్సి వచ్చేది, ఒకోసారి రోజు రోజంతా అలా ఎదురు చూసేవాణ్ణి కూడా. అదృష్టం ఉంటే, కొన్ని నిముషాల పాటు ఆయన్ని చూడగలిగేవాణ్ణి.

స్వామీజీకి తాను ఎక్కడ నివసిస్తున్నారో, ఏం చేస్తున్నారో, తను ఎప్పుడు వస్తున్నారో, ఎప్పుడు వెళ్తున్నారో, ఎవరికీ తెలియడం ఇష్టం ఉండేది కాదని నేను గమనించాను. నేను ఆయనతో సమయం గడుపుతున్నట్టు గానీ, ఆయన నాకు తెలుసన్నట్టుగానీ ఎవరూ గమనించడం ఇష్టం లేదనే విషయం కూడా నేను గమనించాను. ఆయన బోధించిన సాధనా పద్ధతుల విషయంలో కూడా అలాగే ఉండేది. నేను నాకేం చెప్పారనే విషయాన్ని ఎవరికీ తెలియకుండా కాపాడుకుంటేనే నాకు తదుపరి స్థాయి గురించి బోధించేవారు.

నేను ఆయనకు పరిచయమైన కొత్తల్లో మొదటి నాలుగు నెలల్లోనూ వరసగా పన్నెండు రోజుల పాటు ఆయనతో కూడా ఉండే అవకాశం దక్కింది నాకు. ఇప్పుడు ఓసారి వెనక్కి తిరిగి చూసుకుంటే, నా జీవితంలో ఆ సమయం ఎంతో విలువైనదని అనిపిస్తుంది. అదెలా జరిగిందంటే–

సెప్టెంబరు చివర్లో ప్రత్యేకమైన కారణం ఏదీ లేకపోయినా స్వామీజీ మా తల్లిదండ్రుల్ని చూసి, వీలైనంత వెంటనే రమ్మని అన్నారు. అందుకే నేను ఉత్తర భారతదేశంలో ఎక్కడో లోపలి మూలల్లో ఉన్న మా ఊరికి వెళ్లి, ఒక రాత్రి ఉండి ఢిల్లీకి బయల్దేరాను. ఆయన వీలైనంత వెంటనే రమ్మన్నారు కదా, అందుకు! నేను ఢిల్లీకి వచ్చానని ఎవరికీ తెలియక ముందే నేను ఆయన్ని చూడాలని అనుకున్నాను. నా దగ్గర అదనంగా ఒక కుర్తా, పైజమా సెట్, ఒక అండర్‌వేర్ సెట్, బ్రష్ వంటి కొన్ని అవసరమైన సామాన్లు ఉన్నాయి, అంతే. నేను ట్రైన్‌లోనే బ్రష్ చేసుకుని, తల దువ్వుకుని ఫ్రెష్ అయ్యాను. నేను హోటల్‌కి చేరేసరికి ఏడు గంటలైంది. స్వామీజీ మరో సూట్‌కి మారారని రిసెప్షనిస్ట్ చెప్పింది. నేను ఆయన కాళ్లకు నమస్కారం పెడుతూ ఉంటే, 'ఖుష్ రహో, ఖుష్ రహో' (సంతోషంగా ఉండు) అని దీవించారు. నేను ప్రజలతో కలవడం, మాట్లాడడంతో పూర్తిగా అలిసిపోయాను. నువ్విక్కడే ఉండు. నన్ను ఎవరూ ఇబ్బందిపెట్టకుండా ఉంటారు. ఇక టెలిఫోన్ కాల్స్ నాకు పంపవద్దని రిసెప్షన్‌కి చెప్పు. ఇంకా చెప్పాలంటే, నేను అందుబాటులో లేనని చెప్పేయమను.' అన్నారు. ఆయన ఈ విధంగా ఆదేశించి బెడ్‌రూంలోకి వెళ్లి తలుపు మూసుకున్నారు. నేను లివింగ్ రూంలో కూర్చున్నాను. చాలా గంటల తర్వాత స్వామీజీ బయటికి వచ్చి, నన్ను ఏదైనా తినేసి త్వరగా రమ్మన్నారు. నాకు రూమ్ కీ ఇచ్చి, తలుపు తట్టకుండా వచ్చేసి లోపల కూర్చోమని చెప్పారు. నేను సరిగ్గా అలాగే చేశాను.

రాత్రి రెండు గంటలకి ఆయన బయటికి వచ్చారు. నన్ను వెళ్లి తిరిగి తెల్లవారి రమ్మన్నారు. కానీ నేను ఎక్కడికి వెళ్లగలను? అంత రాత్రి పూట నేను ఆనంద్ ప్రతాప్ సింగ్ ఇంటికి వెళ్లడం సరి కాదని అనిపించింది. పైగా నేను ఢిల్లీలో ఉన్నట్టు, స్వామీజీ దగ్గర ఉన్నట్టు ఆయనకు చెప్పలేదు. అయినా నాకు అక్కడ అతి చవక హోటల్‌లో కూడా ఉండగలిగే స్తోమత లేదు. అప్పుడు నాకు ఒక సంగతి మనసులో మెదిలింది. పోనీ ఎక్కడికి వెళ్దామని అంత ఆలోచించడం ఎందుకు? ఎలాగూ ఓ రెండు మూడు గంటలు గడిపితే తెల్లవారుతుంది. రోడ్డు దాటి నెహ్రూ పార్క్‌లో చెట్ల క్రింద గడిపేస్తే పోతుందనిపించింది. తీరా పార్కు మూసేసి ఉంది. ఆరడుగుల ఐరన్ ఫెన్సింగ్ ఎక్కి ముళ్లు తప్పించుకుంటూ లోపలికి గడ్డి మీదకి జారాను. కాసేపు అటూ ఇటూ నడిచాను. శరీరం వేడిగా ఉంచుకోవడానికి వ్యాయామం చేశాను. తెల్లవారుతుండగా, ఓ నీళ్ల పైపు కనిపించింది. అక్కడే బ్రష్ చేసుకుని, స్నానం పూర్తి చేసుకున్నాను. సూర్యోదయం అవుతుండగా హోటల్‌కి చేరుకున్నాను.

పదకొండు రోజుల పాటు నా దినచర్య మొత్తం ఇలాగే గడిచింది. సోఫాలో కూర్చుని జపం చేసుకోవడమో, నిద్ర పోవడమో చేసేవాడిని. బెడ్‌రూం నుంచి కొద్దిగా శబ్దం వినిపించినా అది స్వామీజీ బయటికి వస్తున్న శబ్దంగా నేను గుర్తించేవాడిని. నేను లివింగ్ రూంలో అడుగుపెట్టినపుడు నా అవసరం అక్కడ లేదని అనిపిస్తే అప్పుడు నేను సరోజినీ నగర్ మార్కెట్‌లో కొంచెం పప్పు వేసుకుని రెండు మూడు చపాతీలు తిని రావడానికి పరిగెత్తేవాడిని.

పన్నెండవ రోజు రాత్రి సుమారు రెండు గంటలకు స్వామీజీ, 'ఇప్పుడు నువ్వు వెళ్లవచ్చు,' అన్నారు. ఎప్పుడూ చెప్పినట్టే చెప్పారు కదా అని నేను నా బ్యాగ్ తీసుకున్నాను. ఆయన అప్పుడు, 'ఎక్కడికి వెళ్లి ఉంటావు?' అని.

'ఢిల్లీలో,' నేను జవాబిచ్చాను.

'అదే, ఢిల్లీలో ఎక్కడా అని!'

'రోడ్డుకి అవతల, అక్కడ!'

'ఎక్కడా? మరెవరైనా ఉన్నారా నీతో?' అడిగారు ఆయన.

'అదో అద్భుతమైన చోటు. చాలా ప్రశాంతంగా ఉంటుంది!' అన్నాను నేను.

'కానీ ఎక్కడుంటున్నావు?' పట్టి పట్టి అడిగారు.

'నెహ్రూ పార్కులో, చెట్ల క్రింద!'

ఆయన ఒక క్షణం మౌనంగా ఉన్నారు. అప్పుడు చేయి పైకెత్తి ఆశీర్వదించారు, నేను తల వంచాను. ఆయన చేయి నా తల మీద ఉంచారు. 'నీ కోసం అక్కడ ఆశ్రయం ఎప్పుడూ దొరుకుతుంది. కానీ నువ్వెక్కడ తింటున్నావు?' అని అడిగారు.

'సరోజినీ నగర్ మార్కెట్‌లో రోడ్డు ప్రక్కన ఉన్న చిన్న హోటళ్లు ఉన్నాయి. ఆ దాభాల్లో ఒక చోటకి వెళ్తున్నాను, స్వామీజీ!'

'అక్కడ నీ కోసం ఎప్పుడూ ఆహారం ఉంటుంది. నువ్వేనాడూ ఆకలితో ఉండవు,' అన్నారు. అప్పుడు ఆయన టీ, పాలు, కొన్ని బిస్కట్లు తీసుకుని రమ్మని ఆర్డర్ ఇచ్చారు. ఈ పన్నెండు రోజుల్లో ఆయన నాతో మాట్లాడింది గానీ, నా కోసం ఏదైనా తినడానికి ఆఫర్ చేసింది గానీ అదే మొదలు.

ఆ సంభాషణ నాకు స్వామీజీని అర్థం చేసుకునేందుకు ఉపకరించింది. అంటే స్వామీజీ ఈ ఐహిక ప్రపంచంలో చురుగ్గా ఉన్నట్టే అనిపిస్తున్నా, ఆయన ఈ ప్రపంచంలో లేరు. మంచు శిఖరాలు, హిమాలయాల్లోని హిమనీ జలపాతాలే ఆయన అసలు నివాసస్థానం. కైలాస పర్వతంలోని ప్రాచీన గుహ ఆయన ఆటస్థలం. ప్రజలంతా స్వామీజీని ఒక సైంటిస్ట్‌గా, యోగి, వేదాంతి, కవి, సర్వజీవహితైషిగా భావిస్తుంది. కానీ నాకు ఆ రాత్రే అర్థమైంది, ఆయన ఆ దివ్య మోహన సౌందర్యంతో ఉట్టిపడే ప్రకృతి మాత వరాల మూట! ఆయన అంతరంగ, బాహ్య ప్రపంచం ఆమె ఉనికితోనే ప్రకాశిస్తున్నాయి. 'ఎవరూ ఎవరి గురువూ కాదు,' అన్నారాయన. 'ఎవరూ ఎవరికీ శిష్యులు కారు. ఆ దేవీ మాతే అందరికీ గురువు. బేషరతుగా ఆమె ప్రేమని కురిపిస్తూ నిజమైన సాధకుడి ఎదుట గురువు రూపంలో నిలబడుతుంది. ఆమెకీ, గురువుకీ మధ్య అంతరం ఉందని భావించడం మాయ. మనం ఈ మాయావరణాన్ని గనుక ఛేదించలేకపోతే, మనకి అంతరంగంలో శాంతికి తావు ఉండదు.'

అప్పుడు స్వామీజీ అధికార స్వరంతో నాతో మాట్లాడారు. 'ముందు నీ థీసిస్ పూర్తి చేసుకో. అస్సాంకి వెళ్లు. అక్కడ గౌహతి విశ్వవిద్యాలయం లైబ్రరీలో ఎన్నో వ్రాతప్రతులు ఉన్నాయి. కామాఖ్య కూడా దగ్గరగా ఉంటుంది. ఇక్కడే అమ్మవారు గురువు రూపంలో ప్రత్యక్షమవుతుంది. ఆమె నీకు శాశ్వత ముక్తి మార్గం చూపుతుంది.'

నేను, 'ఇప్పటికే నేను మీలో ఆ తల్లిని చూస్తున్నాను,' అని అన్నాను.

'నీకు అర్థం కాదు. ఆచారపరమైన పద్ధతులు పాటించడం సంప్రదాయంలో భాగం కాదు, కానీ నువ్వు ఒక బోధకుడిగా సిద్ధం చేయబడుతున్నావు. నీకు ఆచార వ్యవహారాలు కూడా తెలియాలి. కామాఖ్య మాత నీతో శ్రీవిద్యా సాధన చేయించేందుకు అన్ని ఏర్పాటూ పూర్తి చేస్తుందిలే! అందులో అనుష్ఠానం, ఆచార సంప్రదాయాలూ, శ్రీచక్రార్చన వంటివన్నీ కలిసే ఉంటాయి. సాధన చేసే పద్ధతి నీకు ఒకసారి తెలిస్తే, నేను నీకు దానిపై సాధన చెప్తాను,' అన్నారు. ఈ విషయాలు చెప్పి స్వామీజీ నన్ను పంపించారు. ఆ తర్వాత నేను వారిని పది నెలల దాకా కలుసుకోలేదు గానీ ఆయన కార్యకలాపాలు ఆనంద ప్రతాప్ సింగ్ జీ ద్వారా ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనే ఉన్నాను.

1977 వసంతకాలంలో స్వామీజీ అమెరికాకి తిరిగి వచ్చారు. ఈసారి ఆయన తక్కువగా పర్యటిస్తూ తన దృష్టినీ, శక్తియుక్తుల్నీ ఎక్కువగా రాత పని మీద కేంద్రీకరించి *హిమాలయ పరమగురువులతో జీవనం* వేసవికాలానికి పూర్తి చేశారు. ఆ పుస్తకం డిక్టేట్ చేస్తున్న ఆ రెండు నెలలపాటూ ఆయన చుట్టూ ఉన్న వాతావరణం ఎంత శక్తివంతంగా, ఎంత ఓజస్సుతో నిండి

ఉందో చూసిన అందరికీ అర్థమైంది. స్వామీజీ దగ్గర శిష్యులు షిఫ్టుల్లో పని చేశారు. ఓ పక్కన డిక్టేషన్ తీసుకునే వాళ్లు చేత్తో డిక్టేషన్ తీసుకునేవారు. ఆ మెటీరియల్ టైపింగ్ పూర్తయ్యేది. దాని ఎడిటింగ్ అయ్యేది. మళ్లీ పుస్తక రూపంలో ఆ అధ్యాయానికి టైప్ సెట్టింగ్ అయిపోయేది.

డా. అగ్నిహోత్రి, అలహాబాదు విశ్వవిద్యాలయంలో స్వామీజీ కలిసి చదువుకున్న స్నేహితుడు. ఆ తర్వాత ఆయనకి శిష్యులయ్యారు. ఆయన ఈ సెషన్లకి హాజరై హిమాలయ పరమగురువులతో జీవనం 'ఒక అద్భుతమైన గ్రంథం' అని ప్రశంసించారు. స్వామీజీ సిద్ధులతో తన అనుభవాల గురించి డిక్టేషన్ చెప్తున్న సందర్భంలో ఈ లోకాన్ని విడిచి ఎక్కడికో వెళ్లినట్టు ఉండేదని చెప్పేవారు. ఈ ప్రాజెక్ట్‌లో పని చేసే వారందరికీ ఈ పని ఆధ్యాత్మిక ప్రేరణతో జరుగుతోందన్న విషయం అర్థమైంది. వీళ్లందరికీ వాళ్ల వాళ్ల అనుభవాలు ఉన్నాయి. ఈ అనుభవాల్లో ఒక అనుభవం ఇక్కడ చెప్పుకోవాల్సి ఉంది. అది చాలా మంది తమ కళ్లతో తామే చూశారు కూడా.

ఒకరోజు సాయంత్రం పొద్దుపోయింది. స్వామీజీ ఒక అధ్యాయం డిక్టేట్ చేశారు. తమ గురుదేవుల గురించి మాట్లాడే మూడ్‌లో ఉన్నారు. బాబాజీ జీవితంలో కొన్ని నిగూఢమైన విషయాల్ని ఆయన చెప్తున్నారు. తనకి ఆయన నేర్పిన సాధనల గురించి విస్తారంగా చెప్తున్నారు. అక్కడికి వచ్చిన విద్యార్థులు మంత్రముగ్ధులైపోయారు. ఆ విషయాన్ని గూడా పుస్తకంలో చేర్చమని వాళ్లు కోరారు. స్వామీజీ వద్దన్నారు. 'నా గురువు గురించి ఆ విషయాలు ప్రజలకి వెల్లడి చేయకూడదు. మా గురుదేవులకి ఆ విషయాల్ని పైకి చెప్పడం ఇష్టం ఉండదు,' అన్నారు. ఆ గ్రూప్‌లో చాలా మంది గురుదేవులు కాదని చెప్పడాన్ని ఒప్పుకోవలేదు. ఇక స్వామీజీ ఇష్టం లేకుండానే ఒప్పుకోవాల్సి వచ్చింది. ఆ స్టోరీని డిక్టేట్ చేశారు. దాన్ని చాలా వేగంగా టైప్ చేసి, పేజీల్ని స్వామీజీ ముందు పెట్టారు. తలుపు మూసి ఉంది. రూమ్‌లో ఒక పన్నెండు మంది కూర్చుని ఉన్నారు. అకస్మాత్తుగా ఆ తలుపు ఫెడీమని తెరుచుకుంది. చల్లగాలి పెద్ద శబ్దంతో వచ్చి, సుడులు తిరిగి కొత్తగా టైప్ చేసిన పేజీల్ని పైకి లేపింది. ఆ కాగితాలు సుళ్లు తిరుగుతూ గది బయటికి వెళ్లిపోయాయి. ఇక అవి ఆ తర్వాత కనబడలేదు.

హిమాలయ పరమగురువులతో జీవనం పుస్తకం ప్రచురణకి వెళ్లినపుడు, స్వామీజీ కొన్ని నెలలపాటు పర్యటనలతో, ఉపన్యాసాలతో చాలా బిజీ షెడ్యూల్‌లో ఉన్నారు. ఆ శీతాకాలంలో ఆయన కొన్ని నెలలు భారతదేశంలో ఉండి మళ్లీ వసంతకాలం నాటికి తిరిగి వచ్చారు. అప్పటికి ఆ పుస్తకం ప్రచురింపబడి అద్భుతాలు చూపిస్తోంది. గ్లెన్‌వ్యూ సెంటర్‌లో అప్పటికే సౌకర్యవంతంగా ఉండవలసిన వారి కంటే ఎక్కువ మంది ఉన్నారు. వెయిటింగ్ లిస్ట్ ఇంకా ఎప్పటికప్పుడు పెరిగిపోతోంది. చికాగోలోనూ, ఇంకా ఇతర నగరాల్లోనూ స్వామీజీ అప్పుడప్పుడూ ఒకటీ రెండు ఉపన్యాసాలు చెప్పడం కాకుండా ఇంకా విస్తృతమైన కార్యకలాపాలు ప్రారంభించాలనుకుంటున్నారు. అక్కడివాళ్లు ఈ హిమాలయ యోగి దగ్గర చాలాకాలం పాటు అధ్యయనం చేయాలనుకుంటున్నారు. దాంతో ఆశ్రమ సిబ్బంది ఎక్కువమందికి ఆశ్రయం కల్పించేందుకు మరో ప్రదేశం కోసం వెతకసాగారు.

మరి కొద్ది నెలల్లో వాళ్లు ఉత్తర పెన్సిల్వేనియాలోని హానెస్‌డేల్ అనే చిన్న పట్టణం సరిహద్దుల్లో ఉన్న క్రైస్ట్ సెమినరీ ఆఫ్ ది సేక్రెడ్ హార్ట్‌ని చూశారు. దాన్ని స్వామీజీ తన మిషన్‌కి అనుకూలమైనదిగా భావించారు. అది నాలుగు వందల ఎకరాలకి పైబడి ఉంది. అందులో రెండు మెయిన్ బిల్డింగ్‌లు, వంద గదులు, ఒక ఆడిటోరియం, ఒక కాన్ఫరెన్స్ రూం, ఒక లైబ్రరీ, ఒక ఇండస్ట్రియల్ కిచెన్, చాలా తరగతి గదులు ఉన్నాయి. వెనక ఒక చిన్న బిల్డింగ్ ఉంది. అందులో కొంతమంది నన్స్ ఉన్నారు. అందులో కూడా చాలా గదులు, ఒక వంటగది,

చర్చి ఉన్నాయి. రెండు బిల్డింగులూ ఇటుకతో కట్టబడ్డాయి. చాలా చక్కగా కట్టారు వాటిని. ఒక పాత డెయిరీ ఫారమ్‌లో పాఠశాల పని చేస్తోంది. పెద్ద ధాన్యం కొట్టు, ఇంకా ఆవరణలో బయట ఉన్న బిల్డింగులన్నీ ఇప్పటికీ బాగానే ఉన్నాయి. అందులో రెండు చిన్న ఫార్మ్‌హౌస్‌లు ఉన్నాయి. చూడముచ్చటైన ఆస్తి సంపద. పోకోనాస్ రోలింగ్ హిల్స్‌లో ఉన్న ఈ అందమైన వన్య ప్రాంగణం డౌన్‌టౌన్ మాన్‌హట్టన్ నుంచి కేవలం రెండున్నర గంటలు, ఫిలడెల్ఫియా నుంచి మూడున్నర గంటల ప్రయాణ దూరంలో ఉంది. విల్కెస్-బ్యారె/స్క్రాన్‌టన్ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్టుకి అక్కడి నుంచి నలభై ఐదు నిముషాల్లో చేరుకోవచ్చు. ఆ ప్రదేశం సరిగ్గా సరిపోతుంది. ప్రధాన నగరాలకు చాలా దూరంగా ఉండడం వల్ల ప్రశాంతంగా ఉంది, పైగా అక్కడికి చేరుకోవడం కూడా చాలా తేలిక.

అక్కడ నుంచి స్వామీజీ ఫండ్స్ సేకరించడం మొదలుపెట్టారు. ఆ సంవత్సరం ముగిసేలోపే హానెస్‌డేల్ ప్రాపర్టీని ఇన్‌స్టిట్యూట్ కొనుగోలు చేసింది. 1978 వేసవి నాటికి ఇన్‌స్టిట్యూట్ కొత్త హెడ్‌క్వార్టర్స్ శాశ్వత నిర్మాణం పూర్తయింది. ఇప్పుడు స్వామీజీ మిషన్ నిజంగా మొదలైంది. స్వీయ రూపాంతరణ కార్యక్రమంలో ఒక నెల రోజులు పాల్గొనడానికి ప్రపంచం నలుమూలల నుంచీ విద్యార్థులు వరదలా వెల్లువెత్తి వస్తున్నారు. అందులో శారీరిక ఆరోగ్యం, సంక్షేమం మాత్రమే కాక సెల్ఫ్ రిఫ్లెక్షన్, ఇంట్రాస్పెక్షన్ (అంతర్వీక్షణ)కి సంబంధించి ప్రాక్టికల్ టెక్నిక్స్‌ని నేర్చుకుంటున్నారు. ఈ ప్రోగ్రామ్‌లోనే స్వామీజీ సాధకులకి జీవిత అర్థాన్నీ జీవన పరమార్థాన్నీ సాధకులు అన్వేషించే వాతావరణం కలగజేసేవారు. స్వామీజీ దాన్ని గురించి మాట్లాడుతూ, 'స్వీయ రూపాంతరణ ప్రోగ్రామ్ ఆధ్యాత్మిక విషయాలను అర్థం చేసుకునేందుకు అవసరమైన ఉపకరణాలనూ, సాధనాలనూ అందిస్తుంది. వాటి సాయంతో సాధకులు ఆధునిక శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం కల్పిస్తున్న సౌకర్యాల్ని అందుకుంటూ ఆహ్లాదభరితంగా సాధన చేస్తారు. సాధకులు తమని తాము కనుగొనడానికి అవకాశం కల్పించేవారు. మొదటి నుంచీ ఇన్‌స్టిట్యూట్ రెసిడెన్షియల్ ప్రోగ్రామ్స్ ముఖ్య ఉద్దేశ్యం అదే.'

ఆ వేసవిలో స్వామీజీ కలసి అధ్యయనం చేస్తున్న ఎంతోమంది పి.హెచ్.డి.లు, ఎం.డి.లు ఇన్‌స్టిట్యూట్ బోధనా సిబ్బందిగా జాయిన్ అయ్యారు. గ్లెన్‌వ్యూలో ప్రారంభించిన ఒక చిన్న హోలిస్టిక్ క్లినిక్‌ని మరి కొంచెం పెద్దగా విస్తరించడం జరిగింది. ఇప్పుడు అది కంబైన్డ్ థెరపీ డిపార్ట్‌మెంట్‌గా తయారైంది. డా.బల్లెంటైన్ మార్గదర్శకత్వంలో, కొత్తగా ఆవిష్కృతమైన హోలిస్టిక్ (సంపూర్ణ) హెల్త్ ఫీల్డ్‌లో అది కీలక పాత్ర పోషిస్తోంది. జాన్ క్లార్క్ అనే మరో కార్డియాలజిస్టు డాక్టరు కూడా మా టీంలో జాయిన్ అయ్యారు. దాంతో ఆధ్యాత్మికత, వైద్యం చక్కటి సమన్వయంతో శక్తివంతంగా పని చేయసాగాయి.

హానెస్‌డేల్‌లో స్థిరపడిన తర్వాత బోధనా సిబ్బంది కేవలం ఉపన్యాసాలు, వర్క్‌షాపుల వరకే పరిమితం కాకుండా మానవాళికి సేవచేయడానికి వారికి వ్యాసాలు, పుస్తకాలు రాయమని కొత్త మార్గాల్ని సూచిస్తూ ఉండేవారు. ప్రజలతో పని చేయించడానికి ఆయన ఒక ప్రత్యేక తరహాలో ప్రేరణ కలిగించేవారు. ఉదాహరణకి, ఉన్నట్టుండి, ఆయన తన ఉపన్యాసంలో, 'మీకు తెలుసా, డా. బల్లెన్‌టైన్ ధ్యానం మీద పుస్తకం రాస్తున్నారు. ఆయన ఇప్పటికే మొదలుపెట్టేశారు.' అనేవారు. ఆ తర్వాత ఆయన ఆశ్చర్యంగా చూస్తున్న డా. బల్లెంటైన్‌తో, 'డా. బల్లెంటైన్, మీరు ఆ పుస్తకాన్ని ఎప్పటిలోగా పూర్తి చేస్తారు?' అని అడిగేవారు. మళ్లీ శ్రోతల వైపు చూస్తూ, 'మీరు ఈ పుస్తకం ఈ వసంత కాలంలో మీ చేతుల్లోకి రాకపోతే నాతో చెప్పండి. నేను డా. బల్లెంటైన్‌ని మందలిస్తాను,' అన్నారు. ఆయన తరచుగా ఎవరో ఒకరిని ఒక పుస్తకం రాయమని చెప్తుండేవారు. ఆ తర్వాత కొద్ది రోజులకే ఆ పుస్తకం రాయడం అయిపోయిందా అని అడిగేవారు.

స్వామీజీ పుస్తకం రాసే పద్ధతి కూడా అసాధారణంగానే ఉండేది. అదేదో మిషన్ లాగా ఒక పుస్తకం రాయడం మొదలుపెడితే అది పూర్తి అయ్యేదాకా రాయడం ఆపేవారు కాదు స్వామీజీ. విద్యార్థులు షిఫ్టుల్లో పని చేస్తుండేవారు. ఒక విద్యార్థి డిక్టేషన్ తీసుకుంటే, ఇంకో విద్యార్థి టైప్ చేస్తుండేవాడు. మరో అధ్యాయం డిక్టేషన్ అవుతుండగానే ఎడిటర్ ఏ అధ్యాయానికి ఆ అధ్యాయంగా ఎడిట్ చేసేవాడు, పూర్తిగా పుస్తకం అయ్యేదాకా ఆగకుండా! రాతపని అంతా అయిపోయిందంటే, స్వామీజీ దాన్ని తర్వాతి సెమినార్ లోపు ప్రచురణ పూర్తి అయేలా చూసేవారు. ఇదంతా కొన్ని వారాలు లేదా కొన్నిసార్లు కొన్ని రోజుల్లోనే పూర్తి అయిపోయేది. అందువల్ల సంస్థకి స్వంత ప్రెస్ ఉండడం అవసరమైంది. ఇందుకోసం ఒక చిన్న ప్రెస్‌ని కొనుగోలు చేయడం, టౌన్‌లో అద్దెకి తీసుకున్న గదిలో దాన్ని ప్రారంభించడం కూడా జరిగిపోయాయి. స్వామీజీ స్వయంగా రాయడం, ఇతరులను ప్రోత్సహించి రాయించడంలో చూపించే వేగానికి మరింత యంత్రసామాగ్రీ, మరింత విశాలమైన ప్రదేశం కావాల్సి వచ్చింది. అందువల్ల ఆశ్రమంలో ఉంటున్న కొంతమంది వ్యక్తులు బయల్దేరి ఒక డెయిరీ షెడ్‌కి కొత్త మెరుగులు మొదలుపెట్టారు. 1980 వసంతకాలం నాటికి అందులో కొంత భాగం టూ–కలర్ హెడెల్‌బర్గ్ ప్రింటింగ్ ప్రెస్, కొల్లేటింగ్, కటింగ్, బైండింగ్ మెషీన్లతో సంపూర్ణంగా ప్రెస్ సామాగ్రి వచ్చి చేరింది. మరో భాగంలో ఆర్ట్ డిపార్ట్‌మెంట్, ఆఫీసులు, షిప్పింగ్, ప్యాకింగ్, హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్ ప్రెస్ గొడౌన్‌ల ఏర్పాటు జరిగింది.

ఒక నెలలోపు సెల్ఫ్ ట్రాన్స్‌ఫర్మేషన్ (స్వీయ రూపాంతరణ) ప్రోగ్రామ్, ఒక దీర్ఘకాలిక ఆవాస (రెసిడెన్షియల్) కార్యక్రమం, కంబైన్డ్ థెరపీ డిపార్ట్‌మెంట్, ఇంకా ఎంతో ప్రసిద్ధికెక్కిన ప్రచురణా కార్యక్రమాలన్నీ చక్కగా మొదలయ్యాయి. స్వామీజీ పని చేయడానికి ఇప్పుడు పశ్చిమగోళంలో సుస్థిరమైన ఆధారం ఏర్పాటైంది. అక్కడ నుంచీ దాన్ని చక్కగా కొనసాగించాల్సిన పని మాత్రమే మిగిలి ఉంది ఆయనకు. అందు కోసం ఆయన అమెరికాలోని హోన్స్‌డేల్‌లోని ఇన్‌స్టిట్యూట్ ప్రధాన కేంద్రంలోనూ, వివిధ శాఖా కేంద్రాల్లోనూ, యూరప్ దేశాల్లోని ప్రధాన నగరాల్లోనూ ఉపన్యాసాలు మొదలుపెట్టారు.

అధ్యాయం 10

# శ్రమైక జీవన సౌందర్యం

అమెరికాలో స్వామీజీ కార్యకలాపాలు ఊపందుకోగానే, భారతదేశంలో నా ఇమ్మిగ్రేషన్ పేపర్లు పూర్తి చేశాను. ఇక అక్టోబరు 1979 లో నేను ఢిల్లీకి వెళ్లి న్యూయార్కు ఫ్లయిట్ ఎక్కాలి. నేను స్వామీజీని క్రిందటి వసంతకాలం నుంచి చూడలేదు, కానీ నేను ఎయిర్‌పోర్టుకి బయల్దేరబోతుంటే శ్రీ ఆనంద ప్రతాప్ సింగ్ నాతో స్వామీజీ ఢిల్లీకి వచ్చారనీ, నన్ను చూడాలంటున్నారనీ చెప్పారు. నేను వెంటనే అక్బర్ హోటల్‌కి వెళ్లాను. వారికి నమస్కరించి నిలబడ్డాను. ఆయన నా టికెట్ వైపు చూసి, 'ఇది ఢిల్లీ నుంచి న్యూయార్క్‌కి వెళ్తున్నావు. ఇంకా ఎంతవరకు వెళ్తావు?' అని అడిగారు.

'నాకు తెలియదు,' అన్నాను నేను. 'నిజానికి, నేను ఎక్కడికి వెళ్తున్నానో నాకు తెలియదు. ఈ టికెట్ మిన్నియాపోలిస్ నుంచి వచ్చింది. అంటే నేను మిన్నియాపోలిస్ వెళ్లాలా? స్వామీజీ, నాకు ఇంగ్లీషు తెలియదు. ఇప్పుడు నాకు ఎలాంటి అనుభవాలు ఎదురవుతాయో?' అన్నాను.

స్వామీజీ కొద్దిసేపు మౌనంగా ఉన్నారు. ఆ తర్వాత, 'న్యూయార్క్‌లో నిన్ను ఒక వ్యక్తి కలుస్తారు. అతడు నీకు అవసరమైన ఏర్పాట్లన్నీ చూస్తాడు. నువ్వు ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్లవచ్చు. అక్కడ నుంచి నువ్వు ఎక్కడికి వెళ్లాలో, ఏం చేయాలో తెలుస్తుంది. నువ్వు వెళ్లవచ్చు.' అన్నారు.

నాకు ఇంగ్లీషు రాకపోవడంతో ప్రయాణం నన్ను ఒక అగ్నిపరీక్షకి గురి చేసింది. నేను అంతకు ముందెన్నడూ నేను విమానం ఎక్కలేదు. ప్రతి అనౌన్స్‌మెంట్‌కీ నాకు గాభరా, ఆందోళనా కలిగేవి. ఏం చెప్తున్నారో తెలియదు గదా! ఫ్రాంక్‌ఫర్ట్‌లో మేం విమానం దిగాలి, టెర్మినల్‌కి వెళ్లాలి, మళ్లీ గేట్ దగ్గరికి వచ్చి, మళ్లీ విమానం ఎక్కాలి. నా దగ్గర ఆక్స్‌ఫర్డ్ పాకెట్ డిక్షనరీ ఉంది. దాన్ని ఉపయోగించి ఎయిర్‌పోర్టులో కనిపిస్తున్న సంకేతాల్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాను. కానీ చాలా రకాలుగా ఊహాగానాలు చేసి, విఫలమైన తర్వాత, నాకు ఆ సంకేతాలు జర్మన్ భాషకి చెందినవని తెలిసింది. కెనెడీ ఎయిర్‌పోర్టులో ఇమ్మిగ్రేషన్ నాకు ఓ పెద్ద పీడకలలాంటిది. చివరికి, నేను ఎలాగో కష్టమ్స్ పూర్తి చేసిన తర్వాత, నా ఆతృత మరీ పెరిగింది. బయట పెద్ద గుంపు ఉంది. నేను ఎక్కడికి వెళ్లాలి? నన్ను తీసుకుని వెళ్లడానికి వచ్చినవాళ్లని నేనెలా గుర్తుపడతాను? నేను ప్రతి ఒక్కరి కళ్లల్లోకీ పట్టి పట్టి చూడసాగాను. అప్పుడు ఒక మనిషి 'పండిట్ రాజమణి టిగునైట్' అనే సైన్ బోర్డు పట్టుకుని నిలబడి ఉన్న అతన్ని చూశాను. 'రక్షించావు దేవుడా!' కనీసం, ఈ మాత్రం చదువుకుని అర్థం చేసుకోగలిగే ఇంగ్లీషు వచ్చిందని అనుకున్నా.

ఈ మీటింగ్‌కి సంబంధించి నాకు చాలా విలక్షణమైన అనుభూతులు, జ్ఞాపకాలు ఉన్నాయి. ఆరాధ్య దైవమే హఠాత్తుగా ఎదుట ప్రత్యక్షమైతే భక్తుడు పడే తడబాటుకి గురయ్యాను అక్కడ! ఆ సైన్ బోర్డు పట్టుకుని నిలబడింది ఇన్‌స్టిట్యూట్‌కి చెందిన మాన్‌హటన్‌లో ఈస్ట్‌వెస్ట్ బుక్‌స్టోర్ మేనేజర్. అతడు నన్ను అక్కడికి తీసుకుని వెళ్లి డా. జాన్ క్లార్క్‌కి అప్పగించాడు. అతడు నన్ను పెన్సిల్వేనియాలోని హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్‌కి తీసుకుని వెళ్లాడు. హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్ అనుబంధంగా ఉన్న మిడ్‌వెస్ట్‌లోని యోగా సెంటర్లలో ఒక సెంటర్‌కి తీసుకుని వెళ్లడానికి అక్కడ నా కోసం అన్ని ఏర్పాటూ చేయబడ్డాయి. అక్కడే స్వామీజీ తనవైన మార్మిక రీతుల్లో ట్రైనింగ్ ఇచ్చారు.

మొదటి కొద్ది వారాల్లోనే కొంతమంది స్వామీజీ నన్ను గురించి ప్రశంసాత్మకంగా మాట్లాడారని నాతో అన్నారు. 'పండిట్‌జీ చాలా తెలివైనవారు.' 'ఆయన చాలా విశేషమైన శ్రద్ధతో పని చేస్తారు!' 'ఒకసారి మాట్లాడడం మొదలుపెడితే జనం అందర్నీ ఆశ్చర్యపరుస్తాడు!' అని చెప్తుండేవారు. కానీ స్వామీజీ నన్ను క్రిస్ట్‌మస్ దగ్గరికి వస్తోందనగా పిలిచి, 'ఏమైంది నీకు? రోజంతా రూంలోనే కూర్చుని ఉండిపోతున్నావు. పుస్తకాల పురుగులా తయారయ్యావు. నేర్చుకునే పద్ధతి ఇది కాదు. మిగతా వారితో సమయం గడుపు. ఇతరులతో నువ్వు బాగా మాట్లాడడం నేర్చుకుంటే నీకు విషయాలు తెలుస్తుంటాయి. ఇతరులు మాట్లాడడం వింటే, నువ్వు వేగంగా నేర్చుకుంటావు. నీకు ఇప్పటికే ఇంగ్లీషులో చాలా పదాలు తెలుసు. కానీ ఇంగ్లీషులో వాక్య నిర్మాణం రాదు. నీకున్న మరో సమస్య, ఇంకా హిందీలోనే ఆలోచిస్తూ ఉండడం! ముందు హిందీలో ఆలోచించడం ఆపు! నువ్వు అమెరికన్ సంస్కృతి, అక్కడి సంస్కృతినీ నేర్చుకో. నేను నీకు ఎంతో బోధించాలి!' అన్నారు. స్వామీజీ ఆ సంభాషణని ఒక శక్తివంతమైన ఆదేశంతో ముగించారు, 'పొగరుబోతు బ్రాహ్మణుడిలా ప్రవర్తించకు!' అంటూ.

ఇది విన్న తర్వాత నేను ఇతరులతో ఎక్కువగా కలవడానికీ, నా ఇంగ్లీషు భాషని అభివృద్ధి చేసుకోవడానికీ ప్రయత్నించాను. కానీ నాకు నా పరిమితులు తెలుసు. నాకు గ్రామర్ బొత్తిగా రాదు. నా ఉచ్చారణ భయంకరంగా ఉంటుంది. వాక్యూమింగ్ చేయడం, గిన్నెలు తోమడం, వంట చేయడం, మంచు తుడవడం, మిమియోగ్రాఫ్ (స్టెన్సిల్ పేపరుతో ప్రతులు తీసే మెషీన్) తో పని చేయడం, కవర్లు సీల్ చేయడం వంటి పనులు బాగా చేయగలను.

కానీ నేను ఎవరికైనా ఎలా బోధించగలను? ఇన్‌స్టిట్యూట్‌లో ఉండేవారితో, ముఖ్యంగా రోల్ఫ్, మేరీ గెయిల్ సోవిక్, బార్బరా హిక్స్ (ఇప్పుడు కమలా గెర్హర్‌డట్)లతో ఎక్కువగా మసులుతూ ఉండేవాడిని, వాళ్లు చాలా అభిమానంతో నాకు ఇంగ్లీషు బోధించడమే కాక అమెరికా జీవన విధానం కూడా నేర్పించారు.

ఒకరోజు నాకు స్వామీజీ దగ్గర నుంచి సందేశం వచ్చింది, 'అమెరికా వెళ్లి మూడు నెలలు గడిచినా, ఇంకా పని ప్రారంభించకపోవడం నాకు చాలా నిరాశ కలిగిస్తోంది!' అంటూ. నాకో ఆలోచన వచ్చింది. ముందుగా నేను *భక్తిసూత్రాలతో* మొదలుపెడతాను. నేను యోగ సిద్ధాంతంలో ఉన్న ప్రేమ, అంకితభావం వంటి ఉదాత్తమైన అనుభూతుల్ని సునాయాసంగా వివరించగలనని అనిపించింది. ప్రాక్టికల్‌గా చూస్తే, ప్రతి ఒక్కరూ ఆ పద్యం చదువుతుంటే, నాకు ఆ చిన్న సమూహంతో మాట్లాడడానికి కొంచెం సమయం దొరుకుతుంది. ఆ విధంగా మెల్లగా పదాలు కూర్చుకుని నేను మాట్లాడడం మొదలుపెట్టాను. మొత్తానికి నేను ఇంగ్లీషులో అనుకున్నదాని కంటే బాగానే మాట్లాడగలిగాను.

వసంతకాలం తొలిరోజుల్లో స్వామీజీ హానెస్‌డేల్ క్యాంపస్‌కి తిరిగి వచ్చారు. నాకు ఆయన బాగా గుర్తొస్తూ ఉండేవారు. వారికి ఉత్తరాలు రాయాలనిపించేది. కానీ నేను ఆయన

అనుకున్నంత మెరుగ్గా లేకపోతున్నాననే భావనతో నేను ఆ విధంగా చేయలేకపోయేవాడిని. స్వామీజీ నా ప్రగతికి ఆనందిస్తున్నారని కొంతమంది చెప్తే మరి కొంతమంది ఆయన నా పట్ల పూర్తి అసంతృప్తితో ఉన్నారని చెప్పారు. ఈ రెండు విషయాల్లో ఏది నిజమైనా, స్వామీజీ నాకు మేలు చేకూరే విధంగానే నన్ను గైడ్ చేస్తారని తెలుసు. అప్పుడు ఒకరోజు నేను ఉంటున్న చోటికి కొన్ని బ్లాక్స్ దూరంలో ఉంటున్న మాయా టండన్ నన్ను ఓసారి స్వామీజీకి కాల్ చేయమని చెప్పారు. ఆమెకి స్వామీజీని చిన్ననాటి నుంచీ చూసింది. ఆయన మాటల్ని ఎలా అర్థం చేసుకోవాలో, ముఖ్యంగా ఆయన మాటల్లో వ్యక్తం చేయని విషయాల్ని ఎలా తీసుకోవాలో ఆమెకి బాగా తెలుసు. కానీ ఆమె గానీ, ఆమె భర్త శివనాథ్ గానీ ఏ విషయాన్నీ బయటపెట్టకుండా గుంభనగా ఉంటారు. మరీ అవసరమైతే తప్ప వాళ్లు అసలు విషయాన్ని బయటపెట్టరు. కాబట్టి నాకు స్వామీజీ మిగతా వాళ్ల దగ్గర నా గురించి అసలు ఏం చెప్పారన్న సంగతి ఓ వారం తర్వాత గానీ బయటపడలేదు. 'అమెరికాకి వచ్చిన తర్వాత ఈ పిల్లాడు నన్ను పూర్తిగా మర్చిపోయాడు. నేనేం చేయగలను? అతను నాతో మాట్లాడడం లేదు,' అన్నారట స్వామీజీ.

అది మే మాసం. నేను స్వామీజీని హోనెస్‌డేల్ నుంచి కాల్ చేయడానికి ప్రయత్నిస్తున్నాను గానీ నా కాల్ వారికి చేరడం లేదు. నేను కాల్ చేసిన ప్రతిసారీ, స్వామీజీ సెక్రెటరీ నాతో స్వామీజీ విశ్రాంతి తీసుకుంటున్నారనో, ఉపన్యాసంలో ఉన్నారనో లేదంటే అవేం చెప్పకుండా ఆయన అందుబాటులో లేరనో చెప్పేస్తోంది.

కానీ నేను స్వామీజీ సెక్రెటరీకి కాల్ చేస్తూనే ఉండేసరికి ఒకనాడు అతను నేనెందుకు కాల్ చేస్తున్నానో వారి నుంచి నాకేం కావాలో స్వామీజీ కనుక్కోమన్నారని చెప్పింది. అప్పుడు ఆమెకి విషయమంతా వివరిస్తూ, నేను స్వామీజీకి ఎంతో కాలంగా ఫోన్ చేయలేదనీ అందుకే ఫోన్ చేస్తున్నానీ చెప్పాను. ఆ విషయం ఆయనకు చెప్తానని ఆమె చెప్పింది. మర్నాడు నేను స్వామీజీకి మళ్లీ కాల్ చేశాను. కానీ ఈసారి సెక్రెటరీ హోల్డ్ బటన్ నొక్కకుండా సెక్రెటరీ ఫోన్‌ని క్రింద ఉంచింది. ఆమె స్వామీజీతో నేను ఫోన్‌లో ఉన్నానని చెప్పింది. 'నేను ఆయనకు ఏం చెప్పను?' అని అడుగుతోంది.

స్వామీజీ, 'నేను పనిలో ఉన్నానని చెప్పు,' అన్నారు.

అప్పుడు నేను ఆమె మాటలు విన్నాను, 'నేను వెళ్లాలి స్వామీజీ. కాసేపటి దాకా ఇక్కడ మీ కోసం వచ్చే ఫోన్ కాల్స్‌ని ఆన్సర్ చేసేవాళ్లు ఎవరూ ఉండరు,' అంది. అప్పుడు ఆమె రిసీవర్ అందుకుని స్వామీజీ బిజీగా ఉన్నారని చెప్పి పెట్టేసింది.

కొన్ని నిముషాల పాటు వెయిట్ చేసి నేను మళ్లీ కాల్ చేస్తే, స్వామీజీయే ఫోన్ తీసుకుంటారని నాకు తెలుసు. నేను అదే పని చేశాను. ఆయన ఫోన్ తీసుకున్నారు. నేను ఏదో చెప్పబోయేలోగానే, 'నువ్వు నన్ను విసిగిస్తున్నావే! ఏం కావాలి నీకు నా నుంచి?' అని అడిగారు.

'నేను మిమ్మల్ని చూడాలి, స్వామీజీ!'

'ఎందుకు?'

'ఎందుకంటే...నేను మిమ్మల్ని చూసి చాలా రోజులైంది.'

'అయితే ఏమిటి?'

'అది కాదు, స్వామీజీ! మిమ్మల్ని చూడడానికి నాకు అనుమతినివ్వండి!'

దానికి స్వామీజీ అరుస్తూ, 'నన్ను చూడాలని నువ్వు ఇప్పటికే నిర్ణయించుకుని ఉంటే, ఇక నా అనుమతి ఎందుకు?'

'మీతో చెప్పకుండా మిమ్మల్ని చూడడానికి రావడం సరైన సంగతి కాదని!'

ఆయన స్వరంలో అకస్మాత్తుగా మార్పు! 'నేనేమో నిన్ను చూడడానికి ఇన్ని నెలలూ పడిగాపులు కాస్తుంటే మిన్నెసోటాకి వెళ్లి కూర్చున్నావు దర్జాగా! నేను ఇవాళ చికాగో వస్తున్నాను. అక్కడికి రా నన్ను చూడడానికి!'

నేను రోల్ఫ్, మేరీ గెయిల్ సోవిక్‌కి నా ప్రయాణం గురించి తెలియజేశాను. వాళ్లు ఎంతో ఉదారంగా నేను ఆ రాత్రి ట్రైన్‌లోనే చికాగోకి వెళ్లేందుకు కావలసిన ఏర్పాట్లు చేశారు. నేను మంగళవారం ఉదయం అక్కడికి చేరుకున్నాను. తిన్నగా గ్లెన్‌వ్యూ సెంటర్‌కి వెళ్లాను. నేను స్వామీజీ గదిలోకి వెళ్తుంటే, అప్పటి ఇన్‌స్టిట్యూట్ ఛైర్మన్ అన్నే ఐల్వర్డ్ ఆయనతో కూడా ఉంది. ఆమె ఆశ్చర్యం అయోమయం ధ్వనిస్తున్న స్వరంతో, 'స్వామీజీ, మీరు ఇతని గురించా మాట్లాడుతున్నారు? చూస్తే ఇతను చిన్న కుర్రాడు కదా!' అని అడిగింది.

స్వామీజీ నవ్వి, 'అయితే ఏమైంది? నేను ఇప్పటికీ నా గురువులకి చిన్న పిల్లాడినే!' అన్నారు. ఆ తరువాత స్వామీజీ నా గురించి ఆ సెంటర్‌లో ఉంటున్న వాళ్లందరితోనూ ఎంతో గొప్పగా మాట్లాడారని తెలిసింది. కానీ వాళ్లు నన్ను చూడకముందు నా స్థానంలో వచ్చే వ్యక్తిని చాలా తెలివైన వృద్ధుడెవరో వస్తున్నారని అనుకున్నారు. మొత్తానికి గ్లెన్‌వ్యూ సెంటర్ వాతావరణం ఉల్లాసంగా మారింది.

సుజాత (ఇప్పుడు సుజాన్ గ్రేడీ) అనే ఓ యువతి స్వామీజీ దగ్గరికి వెళ్లగలిగే చొరవ ఉండేది. మేమిద్దరం త్వరలోనే స్నేహితులమయ్యాం. ఆమె నాతో స్వామీజీకి 'టిల్క్' ఇష్టమైన పానీయమని చెప్పి దాన్ని తయారు చేసే విధానం కూడా చెప్పింది. కొద్దిగంటల్లోనే నేనక్కడ ఇంట్లో ఉన్నంత హాయిగా స్వేచ్ఛగా ఉండగలిగాను.

ఆ సాయంత్రం చికాగో డౌన్‌టౌన్‌లో ఇవ్వబోతున్న ఓ ఉపన్యాసానికి స్వామీజీ నన్ను కూడా రమ్మని అడిగారు. గస్ గట్టో మమ్మల్ని సిటీలోకి తీసుకుని వెళ్లాడు. దారిలో స్వామీజీ అమెరికాలో నా అనుభవాల్ని గురించి చెప్పమని అడిగారు. మిన్నెసోటాలో నేను చేస్తున్న కార్యక్రమాల్ని వివరంగా చెప్పమన్నారు. మనదైన ఒక సమాజం నుంచి పూర్తి వైవిధ్యంగా ఉన్న మరో సమాజంతో మనుగడ సాగించాల్సి వచ్చినపుడు ఒక విధమైన సాంస్కృతిక దిగ్భ్రాంతికి లోను కావడం సహజమేనని చెప్పారు నాకు. మేము వెళ్తున్న వీధంతా అటూ ఇటూ ఎన్నో నియాన్ లైట్ల కాంతిలో మెరిసిపోతోంది. అప్పుడు ఆయన ఒక బిల్డింగ్ వైపు చూపిస్తూ, ఒక ఫ్లాష్ అవుతున్న సైన్ (గుర్తు) ని చూపించారు. అదేమిటో చెప్పమని అడిగారు నన్ను. 'తెలియదు, స్వామీజీ!' అన్నాను.

అప్పుడు ఆయన గస్ వైపు చూస్తూ, 'గస్, నువ్వు పండిట్‌జీని ఇక్కడికి తీసుకుని రావాలి!' అన్నారు.

'మీరు జోక్ చేస్తున్నారా, స్వామీజీ!' అని అడిగిన గస్ నాతో, 'స్వామీజీ ఇక్కడ ఉల్లాసం కోసం ఏదైనా దాచి ఉంచితే తప్ప, మీరిక్కడికి రావాలని అనుకోరు. ఇది స్ట్రిప్ జాయింట్! నైట్ క్లబ్!' అన్నాడు నాతో.

స్వామీజీ ముసిముసిగా నవ్వి, 'నువ్వు కొంచెంసేపు వెయిట్ చేసి చూడు, గస్. పండిట్‌జీ మీ సంస్కృతిలో ప్రతి అంశాన్నీ బాగా తెలుసుకుంటారు!' అన్నారు.

స్వామీజీ ఉపన్యాసం ఇవ్వబోతున్న చర్చికి మేము కొంచెం ముందుగా చేరుకున్నాం. కానీ మేము కారు దిగీ దిగగానే స్వామీజీ చుట్టూ జనం మూగిపోయారు. కొందరు ఆయన పాదాలకు దణ్ణం పెడుతున్నారు, మరి కొందరు ఆయనకు షేక్‌హ్యాండ్ ఇస్తున్నారు. స్వామీజీ కొద్దిమందిని వెంటబెట్టుకుని ఏకాంతంగా ఉండే గదికి వెళ్లారు. నేను మిగతా జనంతో కలిసి ముందుకు వెళ్లాను. ఉపన్యాసం మొదలుపెట్టే సమయం అయింది. హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్

గురించీ, స్వామీజీ గురించీ, ఆనాటి టాపిక్ గురించీ పరిచయం చేయడానికి గస్ ముందుగా మైక్రోఫోన్ దగ్గరకు వెళ్లారు. ఆ బ్రహ్మాండమైన హాల్‌లో నేను బాగా వెనక వరసలో కూర్చున్నాను. గుండుసూది పడిన శబ్దం కూడా వినిపించేంత నిశ్శబ్దంగా ఉంది హాలులో. స్వామీజీ స్టేజి మీదకి వెళ్లి చేతులు జోడించి నమస్కరిస్తూ, ఉపన్యాసం మొదలుపెట్టారు– 'మీలో ఉన్న భగవత్ తత్వానికి నేను చేతులు జోడించి నమస్కరిస్తున్నాను. ఈ సాయంత్రం నేను ఉపన్యసించబోతున్న విషయం 'వేవ్ ఆఫ్ బ్యూటీ అండ్ వేవ్ ఆఫ్ బ్లిస్' (సౌందర్య తరంగం–బ్రహ్మానంద తరంగం.) హిమాలయ సాధువుల అభిప్రాయంలో, ఈ సౌందర్యం, బ్రహ్మానందం అనేవి అంతర్నిహితమైన, కేవల పరిపూర్ణ తత్వ లక్షణాలు. కేవల భావాతీత సత్యం ఒక గొప్ప సౌందర్య సాగరం, ఒక గొప్ప బ్రహ్మానంద సాగరం. ప్రాణశక్తి నిరంతరం తరంగాలుగా ఈ మహాసాగరంలో ఉత్థానం చెందుతూ, లయించిపోతూ ఉంటుంది. ఈ సమస్త ప్రపంచమూ ఈ సుందరమైన, బ్రహ్మానందం నుంచే ఆవిష్కృతమైంది. ఇది తన బాహ్య విస్తరణని పూర్తి చేసుకుంటే తిరిగి దివ్య అస్తిత్వంలోకి తిరిగి లయించిపోతుంది. మీరంతా ఈ సౌందర్య, బ్రహ్మానంద సాగరంలో ఒక అలల రూపంగా ఉన్నారని తెలుసుకోవడమే ఈ జీవిత లక్ష్యం. సాగరంలో అలలు దాన్నించి వేరు కానట్టే, మీరు కూడా సౌందర్య, బ్రహ్మానంద సాగరానికి వేరుగా లేరు.

'మీరెంత అందమైనవారో మీకు తెలియకపోవడం వల్ల 'నేను ఎందుకూ పనికిరాను!' అనే ఉదాసీన భావం నుంచి బయటపడలేకపోతున్నారు. కానీ మీ అంతర్గత సౌందర్యాన్నీ, సంతోషాన్నీ ఆనందించాలనే ఆకాంక్ష మీకు లోలోపల ఉంటుంది. మీ మనసుని అంతర్ముఖం చేయడమెలాగో తెలియక మీరు ఆ సౌందర్యాన్నీ, సంతోషాన్నీ బాహ్య ప్రపంచంలో వెతుక్కుంటున్నారు. మీరు ఇతరులపై ఆధారపడుతున్నారు. 'మీరు చాలా అందంగా ఉన్నారు' అని ఎవరైనా మీతో చెప్తే మీ ముఖం వెలిగిపోతుంది. అప్పుడు మీరు, 'కృతజ్ఞతలు. ఈరోజు నాకెంతో సంతోషంగా ఉంది!' అంటారు. మీరు చక్కగా మేకప్ వేసుకుంటారు. కానీ మీ ప్రియుడు, ప్రియురాలు మీ అందాన్ని ప్రశంసించకపోతే, మీకు 'ఛ, వెధవ జీవితం!' అనిపిస్తుంది. మీలో అసలైన అందం ఏముందో మీకు తెలియక బయట నుంచి నిర్ధారణ కోసం ఎదురు చూస్తుంటారు. ఆ నిర్ధారణ బయటి నుంచి రాకపోతే మీకు ఎంతో నిరాశ కలుగుతుంది.

'నేను ఒకసారి లండన్‌లో ఉన్నాను. ఓ యువకుడు తన గర్ల్‌ఫ్రెండ్‌తో వచ్చాడు నన్ను కలుసుకునేందుకు. అతడు నా ఆశీస్సులు కావాలని అడిగాడు. 'నువ్వు ఈమెని పెళ్లి చేసుకోవాలని ఎందుకు అనుకుంటున్నావు?' అని అతడిని నేనడిగాను. 'తను అందంగా ఉంటుంది కదా, అందుకే నేను ఆమెను ప్రేమిస్తున్నాను,' అని చెప్పాడతను. అప్పుడు నేను పెళ్లి చిరకాల స్నేహంతో వర్ధిల్లడానికి అంతకంటే మంచి కారణం ఏమైనా ఉండాలని చెప్పాను.

'అతడు నాతో, 'స్వామీజీ, మీరేమంటున్నారో ఒక్క ముక్క కూడా నాకు అర్థం కావడం లేదు. ఆమె చాలా అందంగా ఉంది కదా! అది కారణం కాకూడదా!' అని అడిగాడు.

'అప్పుడు నేను అతనికి 'పెళ్లి చేసుకుని రా! నేను ఆశీస్సులిస్తాను!' అని చెప్పాను. ప్రతిరోజూ లేవగానే వాళ్లిద్దరూ ఫోన్ చేసుకుని మాట్లాడుకునేవారు. ఒకరోజు అతడు ఫోన్ చేయడానికి బదులు స్వయంగా వెళ్లద్దామని అనుకున్నాడు. తిన్నగా అతడు ఆమె ఉంటున్న అపార్ట్‌మెంట్‌కి కారులో డ్రైవ్ చేసుకుంటూ వెళ్లి, తలుపు కొట్టాడు. ఆమె నైట్ గౌన్‌లో బయటికి వచ్చింది. ఆమె ముఖం చూసి అతడు నివ్వెరపోయాడు. తను ఆమెని ఆశ్చర్యపరచడానికి అలా వచ్చానని చెప్పి, అక్కడ నుంచి త్వరగా వెళ్లిపోయాడు. తర్వాత అతడు నన్ను చూడడానికి వచ్చాడు. 'స్వామీజీ, ఆమె కురూపి,' అని చెప్పాడు. నేను అతనితో, 'నువ్వు ఆమె శారీరిక సౌందర్యం వెంటపడ్డావు. అందుకే నీకు నిరాశ కలిగింది,' అని చెప్పాను.

'బాల్యం, యవ్వనం, మధ్యవయసు, వృద్ధాప్యం అనేవి శరీరానికి సహజ ధర్మాలు. శరీరానికి మారే గుణం ఉంది. అందమైన అంతరాత్మ నీలో ఉంది. ఆమెలో ఉంది, అందరిలోనూ ఉంది. నీలో ఉన్న ఆ అందమైన ఆత్మని నువ్వు దర్శించగలిగితే, ఆ సౌందర్యం నీకు అర్థమైతే ఆత్మ సౌందర్యం ఎంత గొప్పగా ఉంటుందో తెలుస్తుంది. నీ ముఖం మీద విరిసే చిరునవ్వు నీ అంతరాత్మ సౌందర్యమే,' అని చెప్పాను.

స్వామీజీ ఈ విధంగా దాదాపు ముప్ఫై నిముషాల సేపు మాట్లాడారు. అప్పుడు ఆయన, 'ఇప్పుడు మీరెవరైనా ప్రశ్నలు అడగాలంటే అడగవచ్చు. మీరెవరైనా ఏమైనా ప్రశ్నలు అడుగుతారా?' అని అడిగారు.

ప్రేక్షకుల్లోంచి ఎవరో లేచి, 'అంతర సౌందర్యం' అంటే ఏమిటి మీ ఉద్దేశ్యంలో?' అని అడిగాడు.

స్వామీజీ తన అధికార స్వరంతో, 'ఇదుగో, ఇదే విషయం మీద పిహెచ్.డి. చేసిన వ్యక్తి ఇక్కడ మీ ముందున్నాడు,' అన్నారు. ఆ తర్వాత నా వైపు చూపిస్తూ, 'దయచేసి లేచి నిలబడు!' అన్నారు. నేను చాలా సంకోచంతో లేచి నిలబడ్డాను. నా కాళ్లు వణుకుతున్నాయి. ఆయన నన్ను స్టేజి మీదకి రమ్మని పిలుస్తున్నారు. వందలాది మంది నా వైపు చూస్తున్నారు. నేను కూర్చున్న సీటులోకే వెనక్కి పడిపోతానేమోనని భయం వేసింది. అప్పుడు స్వామీజీ హిందీలో, 'చల్, చల్, చల్ (రా, రా, రా)' అని పిలిచారు. నేను స్టేజి మీదకి ఎలా వెళ్లానో, మైక్రోఫోన్ చేతిలోకి ఎలా వచ్చిందో ఏమీ గుర్తులేదు. కానీ నేను అక్కడ నిలబడి పదీ పదిహేను నిముషాలు మాట్లాడేశాను. ఏం చెప్పానో కూడా నాకు తెలియదు. కానీ నా మాటలు విన్న శ్రోతలు మాత్రం నేను చెప్పిన విషయాన్ని బాగానే అర్థం చేసుకున్నారు, వాళ్లకి ఆ విషయం నచ్చింది కూడా. అప్పటి నుంచీ నేను కూడా మాట్లాడడం మొదలుపెట్టాను. బెల్లంటైన్ విషయంలో కూడా స్వామీజీ ఇదే ఎత్తుగడ వేశారు. నిజానికి, ఎంతోమంది విద్యార్థుల్ని ఆయన ఇలాగే బోధకులుగా మార్చేశారు.

కొద్ది రోజుల తర్వాత, స్వామీజీ పెన్సిల్వేనియాకి తిరిగి వచ్చారు. వారితో మాట్లాడుతున్న సందర్భంలో నేను వారిని, 'స్వామీజీ, నన్నిక్కడ ఎన్నాళ్లుండమని మీ ఆదేశం?' అని అడిగాను. 'అసలు నేను మిన్నెసోటాలో ఉండాలని నువ్వెందుకు అనుకుంటున్నావు?' అని ఎదురు ప్రశ్న వేశారు నన్ను ఆయన. 'నాతో హోనెస్‌డేల్ వచ్చెయ్,' అన్నారు. నేనింకా బట్టలు, పుస్తకాలు సర్దుకోలేదని చెప్పాను ఆయనతో. ఆయన, 'వాళ్లు ఏ వస్తువూ విడిచి పెట్టకుండా ప్యాక్ చేసి నీకు పంపుతారు, నడు!' అని చెప్పారు. 1980 జూన్ మధ్య కాలంలో అదే జరిగింది. నేను స్వామీజీతో కలిసి ఇన్‌స్టిట్యూట్ హెడ్‌క్వార్టర్స్‌లో ఉండడానికి వచ్చేశాను.

ఇన్‌స్టిట్యూట్‌లో నేను స్వామీజీలో మరో కొత్త దృక్కోణం చూశాను. భారతదేశంలో ఆయన ఎంతో కరుణామూర్తిగా, సాధువుగా ఉంటారు. తన గురువు పట్లా, దేవీ మాత పట్లా మాటల్లోనూ, చేతల్లోనూ ఎంతో ప్రేమని వ్యక్తం చేస్తూ ఉంటారు. అక్కడ ఆయన నాతో, శరీరాన్ని స్వయంగా వదిలిపెట్టడం గురించీ, అంతర పొరల్లోని శక్తి ప్రవాహాన్ని (బ్రహ్మనాడిగా పిలువబడుతున్న) చైతన్యవంతం చేయడం గురించీ, చిరంజీవులైన సాధుమహాత్ముల సన్నిధిలో ధ్యానం చేయడం గురించీ, ఇతరులకి దూరం నుంచే స్వస్థత కల్పించడం మొదలైన అతీంద్రియ సంబంధమైన మార్మిక విషయాలపై మాట్లాడేవారు.

భారతదేశంలో ఉన్నపుడు వారిలో నేను ఈ మార్మిక కోణాన్నీ దర్శించాను. మరి కొన్నిసార్లు కొంటెమనిషినీ చూశాను. వారి చర్యల్లోని ఆంతర్యాన్ని అర్థం చేసుకోవడం చాలా కష్టం. ఆయనలో ద్వంద్వ భావాలు గల వ్యక్తి. ఆయన బాగా విలాసవంతమైన హోటళ్లలో నివసించేవారు. అందరూ పక్కల మీదకి చేరి దుప్పట్లు ముసుగు పెట్టుకుని పడుకునే వేళ

ఆయన నేల మీద పడుకునేవారు. ఆయన ప్రయాణం చేసినపుడు లేదా ప్రజల మధ్యకి వచ్చినపుడు సంప్రదాయబద్ధంగా టైలర్ కుట్టిన సూట్స్‌ని ధరించేవారు. కానీ సాధు మండలి మధ్య ఆయన తన పాత పద్ధతిలోనే ఉండేవారు. సాదా కుర్తా, పైజమాలో ధుని వేసి దాని ఎదురుగా సాధుబృందంతో కలిసి గడిపేవారు.

మిన్నెసోటాలో స్వామీజీని సైంటిస్ట్–యోగిగా అభివర్ణించేవారిని నేను చాలామందినే చూశాను. వారికి స్వామీజీని చూసే పెద్ద అద్భుతాన్ని చూసినట్టు ఉండేది. ఎందుకంటే ఆయన స్వచ్ఛందంగా గుండె కొట్టుకోవడాన్ని ఆపేవారు. రక్త ప్రసారాన్ని నిర్దిష్ట ధమనుల్లోంచే ప్రవహించేలా చేసేవారు. అలాగే మరి కొందరు స్వామీజీ భౌతిక ప్రపంచంలో నిమగ్నమై ఉన్నట్టు కనిపించినా, నిజానికి ఆయన సంపూర్ణ సమాధిలోనే గడుపుతున్నారని చెప్పిన వ్యక్తుల్ని కూడా చూశాను. ఈ సంప్రదాయంలోకి దీక్ష తీసుకుని వచ్చిన విద్యార్థుల్లో ప్రతి ఒక్కరి గురించీ ఆయనకు తెలుసనీ, ఆయనకి బాగా సన్నిహితంగా మెలిగే శిష్యుల ద్వారా మాత్రమే ఆయనని కలవవచ్చనీ కొందరు అభిప్రాయపడేవారు. అందువల్ల అలాంటి వ్యక్తులు స్వామీజీకి సన్నిహితంగా మెలిగే శిష్యుల్ని అనుసరించేవారు, ఆరాధించేవారు కూడా. ఆ శిష్యుల ఆశీస్సులతోనైనా ఒకానొక రోజు గురువుగారి అనుగ్రహం లభిస్తుందని వారి నమ్మకం. అలా అనుసరించే వ్యక్తుల్ని నేను వ్యక్తిగతంగా కలుసుకుని విషయాలు తెలుసుకునే ప్రయత్నం చేశాను. అప్పుడు నాకు తెలిసిన విషయం ఏమిటంటే స్వామీజీకి దగ్గరగా మెలిగే శిష్యుల్లో కొంతమంది స్వామీజీ తరఫున మాట ఇస్తుండేవారు. కానీ నాకు స్వామీజీతో ఉన్న అనుబంధంతో అర్థమైన విషయం ఏమిటంటే, ఆయన ఎన్నడూ మాట ఇవ్వరు. భారతదేశంలో స్వామీజీ ఏనాడూ మాట ఇచ్చేవారు కాదు. కానీ ఆయనకి సన్నిహితంగా ఉండే శిష్యులు చెప్పిన ప్రతి విషయాన్నీ వాళ్ల అనుచరులు విశ్వసించేవారు. ఒకవేళ వాళ్ల పనులు వారి వారి నమ్మకాల ప్రకారం పూర్తయితే సరే, ఏమీ అనేవారు కాదు. అదే, కాలేదంటే మాత్రం స్వామీజీయే స్వయంగా తమని దగా చేసినట్టు మాట్లాడేవారు.

ఉదాహరణకి, ఒక సన్నిహిత శిష్యుడు తన అనుచరలతో, 'నేను గుర్తించే స్థాయికి ఇంకా చేరుకోలేదు, కానీ రాత్రిపూట, గురుపరంపర కృపతో, నేను సంపూర్ణంగా స్వామీజీతో కలిసి ఉంటున్నాను. ప్రతి రాత్రీ పన్నెండు, మూడు గంటల మధ్య, నా ధ్యానస్థితిలో నా శిష్యులు ఎక్కడున్నా కలుసుకుంటాను. రేపు ఉదయం నేను ధ్యానంలో ఉన్న సమయంలో నేను మిమ్మల్ని చిన్నగా తోస్తాను. అది మిమ్మల్ని ఆధ్యాత్మిక ఉన్నతిలో తదుపరి స్థాయికి చేరుస్తుంది. అప్పటి నుంచీ మీరు ప్రతిరోజూ ధ్యానం చేస్తున్నప్పుడల్లా, నేను మీతో ఆధ్యాత్మిక యానంలో తోడుగా ఉంటూ ఉంటాను. మరో మూడు నెలల్లో మిమ్మల్ని ఆత్మ ప్రజ్ఞలో శిఖర స్థాయికి చేరుస్తానని మా గురువులు వాగ్దానం చేశారు,' అని చెప్పాడు. చాలామంది విద్యార్థులకు ఈ విధంగా 'తోయించుకోవడానికి' అతడు చెప్పిన సమయానికి లేవలేకపోయారు. అందుకు వాళ్లు నాలుక కరుచుకుంటున్నారు. మరి కొందరు అనుకున్నట్టుగా ప్రతిరోజూ మూడు గంటలకి లేచేవారు గానీ ఫలితాలు ఆ సన్నిహిత శిష్యుడు చెప్పినట్టు రాలేదు. ఫలితంగా వారు బాగా అలసి పోయేవారు, మందకొడిగా ఉండేవారు. చివరికి వాళ్లు మాత్రం వాళ్ల గురువుని ప్రేమగానే చూసుకునేవారు, కానీ స్వామీజీ మీద మాత్రం కోపం చూపించడం చూసి నాకు ఆశ్చర్యంగా ఉండేది. తమకి వాగ్దానం చేసిన ప్రకారం ఆధ్యాత్మిక చైతన్యాన్ని కలిగించడానికి స్వామీజీయే తిరస్కరించారని వాళ్లు పూర్తిగా నమ్మారు.

హోనెస్‌డేల్‌లో విషయాలు దీనికి పూర్తి విరుద్ధంగా ఉండేవి. స్వామీజీ ఇక్కడ ఓ కుటుంబ పెద్దలాగా వ్యవహరించేవారు. అందరూ ఆయనతోటి చాలా చనువుగా మెలిగేవారు, ఎప్పుడూ సరదాగా ఛలోక్తులు వేస్తూ గడిపేవారు. ఆయన అక్కడ పిల్లలతోనూ ఆడేవారు. పెద్దవాళ్లతో

జోక్స్ వేస్తూ ఉండేవారు. తరచుగా తన వంట తనే చేసుకుంటూ ఉండేవారు. తమ ఆశ్రమంలో గ్రౌండ్‌ని అందంగా తీర్చిదిద్దడానికి పని చేయడంలో ఎంత ఆనందంగా గడిపేవారో, పార్టీలకు వెళ్లి కూడా ఆయన అంత సరదాగానూ గడిపేవారు. అక్కడున్న వాతావరణం చాలా ఆహ్లాదకరంగా ఉండేది. అక్కడి వాతావరణం ఎంతో ఆహ్లాదకరంగా ఉండడం వల్ల ఆశ్రమవాసులు కూడా స్వేచ్ఛా స్వతంత్రాలతో వ్యవహరించేవారు. కాళ్లకు నమస్కరించి, ఆయన ఆశీస్సులు అందుకోవడానికి వాళ్లు స్వామీజీ వెళ్లే చోటికల్లా వెంబడించి పరిగెత్తేవారు కాదు.

పాలనా వ్యవహారాల్లో స్వామీజీ చాలా ఖచ్చితంగా వ్యవహరించేవారు. ఢిల్లీలో నేను వారిని మొదటిసారి కలుసుకున్నపుడే అర్థమైంది ఆ విషయం. ఆయనకు మెల్లిగా నిదానంగా పనులు చేస్తే చిరెత్తుతుంది. కానీ హోనెస్‌డేల్ వచ్చేదాకా ఆయన పనికి సంబంధించీ, స్వీయక్రమశిక్షణకి సంబంధించీ ప్రతి వ్యవహారాన్నీ అలాగే నిర్వహించేవారని నాకు అర్థం కాలేదు. ఆయన ఉదయం 8:45 కి అందరూ సీరియస్‌గా కష్టపడి పని చేస్తూ కనిపించాలని అనేవారు. ప్రతి ఒక్కరూ ఆ సమయంలో వంటగదిలోనో, ప్రింట్ షాప్, బిజినెస్ ఆఫీస్, ఆర్ట్ డిపార్ట్‌మెంట్, గ్రౌండ్‌లో ఎక్కడైనా గానీ ఆ సమయానికి పని చేస్తుండాలి. మొదట్లో కొద్దిసార్లు ఫలానా చోట ఫలానా మనిషి అతడు చేస్తూ ఉండాల్సిన పని చేయడం లేదని ఆయన గమనించినపుడు ఆయన ఆ వ్యక్తితో పనిని నియమపూర్వకంగా చేయడంలో ఉన్న ప్రాముఖ్యత, బాధ్యతగా మెలగడంలో గల విలువని తెలియజెప్పేవారు. అప్పటికీ ఆ వ్యక్తి పద్ధతి మారకపోతే, కోప్పడేవారు. అప్పటికీ మార్పు లేకపోతే, ఆ మనిషిని ఆ ప్రోగ్రామ్ నుంచి తప్పించేవారు.

నేను హోనెస్‌డేల్‌కి వెళ్లి ఉంటున్న కొత్తల్లో ఆయన ఉదయంపూట నడకకి వెళ్లేటప్పుడు నన్ను కూడా రమ్మన్నారు. అది సాధారణంగా మెయిన్ బిల్డింగ్‌కి రౌండ్స్ వేయడంతో మొదలయ్యేది. ఒకనాడు ఆరు గంటలకి ఆయన నేను ధ్యానం చేసుకునే గది దగ్గర ఆగారు. సాధారణంగా అందరూ అప్పటికి ఆ గదిలోకి వచ్చి ప్రార్థనలో ఉండాలి. మౌనంగా ఆ గది అంతా కలయజూశారు. అప్పుడు ఆయన పెద్దగా, 'డేవిడ్ ఎక్కడున్నాడు? ఇంకా నిద్ర పోతున్నాడా? లేపండి అతన్ని!' అని అరిచారు. కొద్దిసేపట్లో డేవిడ్ ఆయన ఎదుట నిలబడ్డాడు. స్వామీజీ అతన్ని చూస్తూ మందలింపు స్వరంతో, 'చూడు డేవిడ్! బద్ధకంగా ఉండకు! నువ్వు ఆరోగ్యంగా, ఆనందంగా ఉండదల్చుకుంటే, సరైన సమయానికి లే! ఉదయ ప్రార్థనకి రాకుండా ఎన్నడూ ఉండకు. వెళ్లి అన్ని తలుపులూ తట్టి అందర్నీ లేపు. ఎవరు లేవలేదో చూడు. ఇంకా చెప్పాలంటే, ప్రతి ఉదయమూ 5:30కి ఈ హాల్‌లో బెల్ నువ్వే మోగించాలి,' అని చెప్పారు. డేవిడ్ అక్కడ నుంచి చురుగ్గా కదిలాడు.

మేము నడకలో ఉన్న సమయాల్లో స్వామీజీ నాతో కొన్ని విషయాలు మాట్లాడేవారు, 'ఇది చాలా అందమైన బౌల్డర్ (నున్నగా పెద్దగా ఉన్న బండరాయి), దీన్ని మనం ఎక్కడైనా ఉపయోగించాలి', 'ఈ ఎండిపోయిన కొమ్మ అందంగా కనిపించడం లేదు', 'మనం ఇక్కడ కొన్ని పూల మొక్కలు నాటాలి', 'ఈ మార్గం సరిగ్గా మార్క్ చేయబడాలి' అనేవారు. అలాగే మేం నడక నుంచి వెనక్కి తిరిగి వచ్చే సమయంలో మెయింటెనెన్స్ చూసే వ్యక్తిని పిలిచి, అతడు ఇంకా అల్పాహారం ముగించక ముందే తగిన సూచనలు ఇచ్చేవారు. ఆ సూచనలు అదే రోజు అమలు చేయబడాలనే విషయం కోఆర్డినేటర్‌కి తెలుసు.

ఈ నడక సమయాల్లోనే స్వామీజీ కొన్ని అభిప్రాయాలు వ్యక్తం చేసేవారు, 'అమెరికన్లు చాలా గొప్పవాళ్లు. వాళ్లకి జాలీ ఉంటుంది, కష్టపడి పనిచేసే గుణమూ ఉంటుంది. కానీ వాళ్లు పాడైపోయారు!' అనేవారు. లేదా 'మోడరన్ జనాలకి సరదాలు కావాలి. కానీ వాళ్లకి సరదాలకీ, ఆ సరదాలు దురలవాట్లుగా మారి స్వీయనాశనానికి దారి తీసే పరిస్థితికీ తేడా తెలియదు,' అనేవారు. ఆ ప్రాపర్టీకి ఈశాన్యం దిశగా ఉన్న పెద్ద కొండ శిఖరం మీద నిలబడి

ఆయన లోయని పరికించి చూసి, 'విస్తరించిన ఈ సువిశాల ప్రకృతిలో ఉన్న అందం అంతా ఇంతా కాదు. ఈ సౌందర్యం కాంచలేనివారు ఎంత దురదృష్టవంతులు!' అనేవారు. నేను ఆయనతో భారతదేశంలో ఉన్నపుడు నాకు స్వామీజీ మాటలు గానీ వారి చర్యలు గానీ అర్థరహితమైనవి కాదు. వాటన్నింటికీ ఏదో అర్థం ఉంటుంది. ఆయన ఆ మాటలు అన్నారంటే దానికి ఏదో సార్థకత ఉండే తీరుతుంది.

ఒకనాటి ఉదయం నేను ఆయనతో ఉన్న సమయంలో ఆయన రెసిడెన్షియల్ ప్రోగ్రామ్ కోఆర్డినేటర్ బాలా (ఇప్పుడు జానెట్ లిండ్‌గ్రెన్) ని పిలిచి, 'పండిట్ జీ, ఇకపై ఇన్‌స్టిట్యూట్‌కి స్పిర్చ్యువల్ డైరెక్టర్‌గా ఉంటారు. ఆయన క్యాంపస్‌లో క్రమశిక్షణ విషయాలు చూస్తారు,' అని చెప్పారు. నేను మౌనంగా ఉన్నాను. కానీ ఆయన ఉద్దేశ్యంలో 'క్రమశిక్షణ' అంటే ఏమిటా అని ఆశ్చర్యపడ్డాను. బాలా వెళ్లిపోయిన తర్వాత, ఆయన నాతో, 'ఉదయం, సాయంత్రం ప్రేయర్స్‌కి ప్రతి ఒక్కరూ హాజరయ్యేలా చూడు. అందరూ సరైన సమయానికి భోజనం చేసి నిద్రపోయేలా చూడు. వారిని సకాలంలో మేలుకునేలా చూసుకో. ప్రతిరోజూ హఠయోగ తరగతులకీ, ప్రాణాయామ తరగతులకీ క్రమబద్ధంగా వెళ్లు.'

అదేమంత తేలికైన పని కాదని నేను గుర్తించాను. నేను ఎవరికైనా క్రమశిక్షణ నేర్పాలంటే ముందు నేను క్రమశిక్షణగా ఉండాలి గదా! స్వామీజీ స్వీయ క్రమశిక్షణ, స్వీయ ప్రేరణ గురించి ఆయన ఇచ్చిన ప్రతి ఉపన్యాసంలోనూ నొక్కి చెప్పేవారు. స్వీయ రూపాంతరణకి అసలు కీలకం మన అంతరంగపు పిలుపేనని ఆయన తరచుగా నాతో చెప్తుండేవారు. నాకు ఆ బాధ్యతల్ని అప్పగించడం ద్వారా ముందు నన్ను నేను అందుకు సన్నద్ధం చేసుకుని ఆ తర్వాత అక్కడ నివాసం ఉండే సాధకులకు ప్రేరణ కలిగించాలని ఆయన ఉద్దేశ్యం. నాకుగా నేను చాలా ప్రయత్నం చేసి కొంత ముందుకెళ్లాను. కానీ వారు ఊహించినంత గొప్పగా లేవు నేను చూపిన ఫలితాలు. అలాంటి ఒక సంఘటన ఒకటి ఉంది. ఒకనాడు మధ్యాహ్న భోజనం సమయం అవబోతుండగా స్వామీజీ మెయిన్ బిల్డింగ్‌లో సెంట్రల్ కారిడార్ నుంచి వెళ్తూ, వెనక ద్వారం దగ్గర నిలబడి, ఎవరితోనో గట్టిగా అరుస్తూ, 'పండిట్‌జీ ఎక్కడున్నారో తీసుకుని రండి!' అని. నేను వెళ్లగానే ఆయన అక్కడ ఓ చోట పడి ఉన్న ఓ ఆపిల్‌ని చూపించి, 'క్రమశిక్షణ నిర్వహించే తీరు ఇదేనా నువ్వు? జనం ఇక్కడ ఆపిల్ పండ్లూ, కప్పులూ, ప్లేట్లూ బిల్డింగ్ మీద నుంచి పడేస్తున్నారు!' అని మందలించారు. నేను నిర్లక్ష్యంగా ఉన్న విషయాన్ని మౌనంగానే అంగీకరించాను. క్రమశిక్షణ అంటే అందరూ సకాలంలో నిద్ర లేవడం, ప్రేయర్స్‌కి అటెండ్ అవడం, సరైన సమయానికి భోజనం చేయడం కంటే మరెన్నో విషయాల్లో ఎంతో నిశితంగా ఆలోచించి మెలగాలని అక్కడ అర్థమైంది. అసలు నిజంగా క్రమశిక్షణ అంటే ఏమిటా అని నాకు నేనే అనుకుంటూ ఉంటాను. కానీ స్వామీజీ సరైన మూడ్‌లో ఉంటే తప్ప ఆయన్ని ఏకాంతంలో కూడా మనం ఏ ప్రశ్నా అడిగేట్టు ఉండదు. అసలు ఆయన సాన్నిధ్యంలో ప్రశ్నలు మాయమైపోతాయి. ఒకవేళ అలా మాయం కాకపోయినా, ఆయన స్థాయి ముందు ఆ ప్రశ్న చాలా చిన్నదిగా అనిపిస్తుంది. ఆ ప్రశ్న వేసి స్వామీజీ సమయాన్ని వ్యర్థం చేయడమేమిటీ అని మనకే అనిపిస్తుంది. కానీ నేను ఒంటరిగా ఉన్నపుడు ఈ క్రమశిక్షణ ప్రశ్న నాకు పదే పదే గుర్తుకొచ్చేది.

ఆ వారాంతంలో అతీత ధ్యానం అధిచేతన (సూపర్‌కాన్షస్) ధ్యానం మీద ఒక సెమినార్ ఉంది. 'ప్రిపరేషన్ ఫర్ మెడిటేషన్' అనే విషయం మీద స్వామీజీ ఉపన్యాసం జరగబోతోంది. స్వామీజీ ఉపన్యాసాన్ని తమ విలక్షణమైన శైలిలో మొదలుపెట్టారు: 'మీలో ఉన్న దివ్యత్వానికి నేను నమస్కరిస్తున్నాను. ఈరోజు ఎలా గడిచింది మీకు? మీకు సౌకర్యంగా ఉందా? మీకు ఈ ఆహారం నచ్చిందా?...నేను ఈ ఉదయం 'ధ్యానానికి సంసిద్ధత' అనే విషయం మీద మాట్లాడాల్సి

ఉంది,' అంటూ ఉపన్యాసం ప్రారంభించారు. కానీ కొద్దిసేపట్లోనే విషయాన్ని మార్చేసి క్రమశిక్షణ మీద మాట్లాడడం మొదలుపెట్టారు.

ఆయన చెప్పసాగారు, 'క్రమశిక్షణ అంటే కొన్ని లక్షణాల్నీ, అర్హతల్నీ వికసింపజేసుకోవడం! 'డిసిప్లేన్' ఉంటే 'డిసైపుల్' అవుతారు. ఒక 'స్టూడెంట్' కీ 'డిసైపుల్' కీ తేడా చెప్పాలి మీకు. ఒక స్టూడెంట్ (విద్యార్థి) వస్తాడు, కొన్ని క్లాసులు వింటాడు, వెళ్తాడు. అతడు తను నేర్చుకున్న విషయంలో ఒక వంతు మాత్రం నేర్చుకుంటాడు, మిగతాది వదిలేస్తాడు. కానీ అతడికి గురువు గురించీ, గురు బోధల గురించీ అనేక సందేహాలు, భయాలూ ఉంటాయి. అయితే డిసైపుల్ (అనుయాయి) తన మనసుని వ్యవస్థీకరించుకుంటాడు. తన సమయం విలువనీ, తన గురువు సమయానికి ఉండే విలువనీ కూడా బాగా గుర్తించగలడు. సాధన వల్లే పరిపూర్ణత లభిస్తుందని అతడికి తెలిసి ఉండడం వల్ల సాధన చేయడానికి అతడు దృఢంగా నిర్ణయించుకుని ఉంటాడు. అక్కడ గురువుకీ అనుయాయికీ మధ్య నిశ్శబ్ద ఒప్పందం ఉంటుంది: 'నువ్వు సాధన చేస్తే నేను బోధిస్తాను' అనే భావన గురువుది. 'మీరేం చెప్పినా నేను సాధన చేస్తాను' అనే తత్వం అనుయాయిది. 'ఈ పరిస్థితిలో గురువు, అనుయాయి కొన్ని నిర్దిష్టమైన నియమ నిబంధనల్ని అనుసరిస్తారు.'

ఆధ్యాత్మిక స్థాయిలో గురువు శిష్యుడు కోరుకున్నప్పుడల్లా తనని తాను అందుబాటులోకి తెచ్చుకుంటాడు. అనుయాయిని అతడు 'క్రమశిక్షణగా ఉండు' అని మాత్రం చెప్తాడు. మిమ్మల్ని మీరు క్రమశిక్షణగా ఉంచుకోవడమంటే మీకు మీరుగా నిర్లక్ష్యాన్ని అధిగమించడం! మీ సాధనని ప్రారంభించడానికీ, ముగించడానికీ మీ బాహ్య, ఆంతరంగిక జీవితాన్ని మీరు ఆర్గనైజ్ చేయడం నేర్చుకోవాలి. మీరు నిర్లక్ష్యంగా లేకుండా ఉంటేం మిమ్మల్ని మీరు క్రమశిక్షణగా ఉంచుకోవడం జరుగుతుంది. అప్రమత్తంగా ఉన్న వ్యక్తి తన సమయాన్ని అత్యుత్తమంగా ఉపయోగించుకుంటాడు. సమయాన్ని సృజనాత్మకంగా, సద్వినియోగం చేసుకోగల కళ అతడికి తెలుసు. సాధుసత్పురుషుల భావనలో *నిర్లక్ష్యమే అన్ని పాపాలకూ మూలం!* అందువల్ల మీరు ఒక్కోసారి తప్పు చేయకూడదనుకున్నా, నిర్లక్ష్యం వల్ల తప్పులు జరిగిపోతాయి. నిర్లక్ష్యం, మనసులో మందకొడిగా ఉండే భాగాల్లో అంధకారంలో ఉండే ప్రతికూల లక్షణం. మీరు ఈ లక్షణాన్ని వదులుకుని, మిమ్మల్ని మీరు ఒక క్రమశిక్షణలో పెట్టుకుంటే తప్ప మీరు శిష్యుడుగా ఉండడానికి అర్హత సంపాదించలేరు. సమాచారం విద్యార్థులు, అనుచరులకు అందించబడుతుంది, అయితే నిజమైన జ్ఞానం కేవలం అనుయాయులకే బోధించబడుతుంది.'

స్వామీజీ తన సిద్ధాంతాన్ని ఇంకా విస్తరించి చెప్తూనే ఉన్నారు. కానీ ఆ ఉపన్యాసం అంతా నాకోసమేననిపిస్తోంది. చివరికి నాకు అర్థమైంది, ఇప్పుడు జరుగుతున్న ఉపన్యాసం అక్కడ ఆయన చూసిన ఆపిల్ మీదేనని! డిసిప్లేన్ అర్థం గురించి ఇంత లోతుగా నేను అర్థం చేసుకోవాల్సి ఉంది. ఆ ఆపిల్ అక్కడ ఉండడం ఎవరి నిర్లక్ష్యాన్నో ఎత్తి చూపిస్తోంది. అది ఎక్కడ ఉండాల్సిన వస్తువుని అక్కడ పెట్టని బద్ధకాన్నీ, మానసిక అస్తవ్యస్తతనీ తెలియజేస్తోంది. దీనివల్ల మనం మన సాధనని ఠంచనుగా పాటించలేము. మనం ఆలస్యంగా నిద్రలేస్తాము లేదా మన సమయమంతా కబుర్లు చెప్పుకుంటూ వ్యర్థం చేసుకుంటామని నేను గుర్తించాను. అందువల్ల మనం మన ఆలోచనలో, భాషలో, వ్యవహారంలో మందకొడిగా మారిపోతాము.

అదే సమయంలో స్వామీజీ నా ప్రశ్నకి సమాధానం ఇస్తున్నారని నాకు అనిపించింది. అలాగే ప్రేక్షకులకు వారి సమాధానాలు వారికి లభిస్తున్నట్టు ఉండేది. ఇది చాలా విచిత్రంగా ఉండేది. స్వామీజీ కేవలం తను చెప్పాల్సిన విషయానికి ఎక్కువసేపు పరిమితమై ఉండేవారు కాదు ఏనాడూ! ఆయన తరచూ, 'మీరు కాస్త శ్రద్ధ పెట్టినట్లయితే నేను ఈనాటి ఉపన్యాసంలో మీకు చాలా గంభీరమైన, ప్రేరణాస్పదమైన విషయాన్ని నేర్పించబోతున్నాను,' అని చెప్పేవారు.

అప్పుడు ఆయన ఆ టాపిక్‌ని మార్చేవారు. కానీ ఆశ్చర్యకరంగా, ప్రేక్షకుల్లో ప్రతి ఒక్కరూ, 'ఈ ఉపన్యాసం నా గురించే చెప్పారు. ఆయన నా ప్రశ్నలన్నింటికీ సమాధానాలు చెప్పేశారు' అంటూ నివ్వెరపోయేవారు.

స్వామీజీ ఏకాగ్రచిత్తంతో పని చేయాలని భావించినపుడు రాత్రి పది గంటలకి మొదలుపెట్టేవారు. అంటే అప్పుడు ఆయన పుస్తకాలు డిక్టేట్ చేయడమో లేదా ఆయన అందకు ముందు డిక్టేట్ చేసిన వెర్షన్స్‌ని మరోసారి చూడడమో జరిగేది. ఈ పని రాత్రి ఒంటిగంట లేదా రెండింటి వరకూ జరిగేది. ఆ సమయంలో ఆయన సెక్రెటరీ కమల్, ఇంకా ఆయన్ని అటెండ్ అయిన కెవిన్, వెండీ హాఫ్‌మ్యాన్ లాంటి ఇతర స్టూడెంట్స్ గానీ నేను గానీ ఆ అర్థరాత్రి వేళ ఆయన తినడానికి ఏదైనా స్నాక్స్ వంటివి తయారు చేసేవాళ్లం. సాధారణంగా ఖీర్ (పాయసం) గానీ లేదా సేమియా పుడ్డింగ్ గానీ, టిల్క్ గానీ తయారుచేసేవాళ్లం. ఆ తర్వాత పళ్లు తోముకునే వేడుక జరిగేది.

మాలో ఎవరో ఒకరం నీళ్లు, టూత్‌బ్రష్, బ్రష్, ఓ వాటర్ పిక్, ఒక ఖాళీ పాత్రని వారి లివింగ్ రూంలోకి తీసుకొచ్చేవాళ్లం. అప్పుడు స్వామీజీ దంతధావనం చేస్తూ, 'ఇది స్వామీ రామ దంత పూజ' అంటూ ఏవో ఛలోక్తులు విసురుతూ ఉండేవారు. ఆయన తన కృత్రిమ దంతాల్ని బయటకి తీసి దానిపై ఉన్న బంగారు పూతని చూపిస్తూ, 'మీకు తెలుసా, నాది చాలా ఖరీదైన నోరు. పూర్వం రోజుల్లో ఆడవాళ్లు తమ నగలనే సేవింగ్స్ బ్యాంక్‌గా ఉపయోగించేవారు. ఇప్పుడు నాలాంటి స్వాములు కూడా వాళ్ల నోళ్లని సేఫ్ డిపాజిట్ బాక్స్‌లాగా ఉపయోగిస్తున్నారు', అనేవారు. అప్పుడు ఆయన లేచి, వళ్లు విరుచుకుని, 'ఇప్పుడు స్వామీ రామ విలువైన సమయం మొదలు కాబోతోంది. మీరందరూ వెళ్లి రెస్ట్ తీసుకోండి. నేను నా పని మొదలుపెట్టాలి. గుడ్‌నైట్, ఎవ్విరీవన్!' అని అందరినీ పంపేసేవారు.

ప్రతి రాత్రీ, నేనూ మిగతా వాళ్లందరితో కలిసి వెళ్లబోతుంటే, కమాండింగ్ వాయిస్‌లో నన్ను ఆయన వెనక్కి పిలిచి, 'నీ థీసిస్‌ని ఎంత వరకు పూర్తి చేశావు?' అనో, 'ఇంకా ఎన్ని అధ్యాయాలు మిగిలి ఉన్నాయి?' అనో ప్రశ్నించేవారు. ఆయన మర్నాటి ఉదయం ఆరు ఏడు గంటలకి మళ్లీ నన్ను అదే ప్రశ్న వేస్తారని నాకు తెలుసు కాబట్టి నేను ఈ రాత్రంతా పని చేయాలని ఆయన అభిప్రాయమని నాకు అర్థమైంది. చాలాసార్లు ఆయన, 'నాయనా, నీ థీసిస్ ఈ సంవత్సరం పూర్తి అయిపోవాలి,' అని చెప్పేవారు నాతో. పైగా నేను నా థీసిస్‌ని ఇంగ్లీషులోనే రాయాలని ఆయన అభిప్రాయపడేవారు. ఇది నా పనిని మరింత సంక్లిష్టం చేసింది. ఎందుకంటే, 'శ్రీవిద్య' మీద ఇంగ్లీషులో ఎవరూ పుస్తకాలు రాయలేదు. చాలావరకు పుస్తకాలు సంస్కృతంలోనూ, మరి కొన్ని హిందీలోనూ ఉండేవి. అందువల్ల ఆ విషయాన్నంతా నేను సంస్కృతం, హిందీ భాషల్లో చదివి, ఇంగ్లీషులోకి మార్చుకోవడం, సరైన పదాల కోసం ఇంగ్లీషు డిక్షనరీ చూడడం జరిగేది. సీరియస్‌గా ఆలోచించడానికీ, దృష్టి పెట్టి రాయడానికీ నాకున్న సమయం స్వామీజీ గదిలోంచి బయటికి వచ్చిన తర్వాత అర్థరాత్రి దాటిన ఆ తొలివేకువ సమయమే. ఆ విధంగా స్వామీజీ నన్ను వేకువ సమయంలో పని చేసే అలవాటు చేశారు. స్వామీజీ నాకు ఈ విధంగానే నిద్రని మానుకునో, లేదా కొంచెం సేపు నిద్రతో సరిపెట్టుకునో పని చేయడం నేర్చుకునేలా శిక్షణ ఇచ్చారు. నేను సాధారణంగా లంచ్ తర్వాత నిద్ర పోయే అలవాటు చేసుకున్నాను. ఆ పడుకోవడం కూడా తల క్రింద చెయ్యి మడిచి పెట్టుకుని పడుకోవడం అలవాటు చేసుకున్నాను. ఓ అరగంట గడిచేసరికి నేనిక నిద్ర పోలేకపోయేవాడిని. నా శరీరం ఆ కాసేపట్లోనే సంపూర్ణ విశ్రాంతి ఎలా తీసుకోవాలో నేర్చుకుంది.

జూలైలో స్వామీజీ హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్ శాఖలు, దాని అనుబంధ కేంద్రాల డైరెక్టర్ల కోసం ఓ ప్రత్యేకమైన రిట్రీట్‌ని నిర్వహించారు. స్వామీజీ యోగనిద్రపై ప్రతి మధ్యాహ్నం సూచనలు ఇస్తున్నా సరే, నేను థీసిస్ పూర్తి చేయాలి కాబట్టి నేను అందులో పాల్గొనడం లేదు. కానీ, ఈ రిట్రీట్ ముగింపు సమావేశంలో తాను ఈ సాధన మీద సాధకులకి సూచనలు చేసే సమయంలో నేను వాళ్లతో కలిసి ఉండాలని ఆయన ఆదేశించారు. నేను వెళ్లేసరికి ఆలస్యమైంది. ఆయన అప్పుడు మీరు మేల్కొనేసరికి మీ మనసు భృకుటి మధ్య ఉన్న కేంద్రంలో స్థిరంగా నిలిచి ఉంటుంది. స్వప్నావస్థలో అది కంఠం మధ్యలో ఉంటుంది. గాఢనిద్ర పోయినపుడు అది హృదయ కేంద్రంలో ఉంటుంది. యోగనిద్రలో గల ముఖ్యమైన విషయం ఏమంటే, అది స్వప్నావస్థ గుండా చాలా త్వరగా సాగుతుంది. భృకుటి కేంద్రం నుంచి హృదయ కేంద్రం వరకు జరిగే దాని ప్రయాణంలో ఈ కంఠం మధ్య గుండా వీలైనంత తక్కువ సమయం గడపడానికి దానికి ట్రైనింగ్ అవసరం ఇవ్వాలి.

యోగనిద్ర సాధన చేసే సాధకుడికి అతడు కోరుకున్నపుడు నిద్ర రప్పించగల ఒక అభ్యాసం. ఆ స్థితిలో అతడికి నిద్రపోతున్నాననే స్పృహ ఉంటుంది. తిరిగి అతడు తను కోరుకున్నపుడు మేల్కొనగలడు కూడా. అది ఎరుకతో కూడిన నిద్ర. ఇది మీ అంతర్గత స్థితి మీకు తెలియని మామూలు నిద్రా స్థితిలా ఉండదు. మీరు మీ భృకుటి కేంద్రంలో మనసుని నిలిపినట్లయితే, మీరు నిద్ర పోవడం మీకు తెలుస్తుంది. మీరు కావాలనుకున్నపుడు మేల్కొనగలరు. ఈ సాధనలో మొదటగా మీరు మీ మైండ్‌కి విభిన్న పరిస్థితుల్లో నిద్రపోవాలని ఆజ్ఞ ఇవ్వాలి. మరో ప్రక్క ఒక నిర్దిష్టమైన సమయం తర్వాత మేలుకోవాలనే ప్రణాళికతో మీ మైండ్‌లో కొంత భాగానికి కొన్ని సూచనలు ఇచ్చుకుని అప్రమత్తంగా ఉంచుకోవాలి. స్వామీజీ ఇదంతా చెప్తుంటే, నేను ఆయనకు హిందీలో, 'స్వామీజీ, నేను ఈ పని ఈ టెక్నిక్స్ పాటించకుండా ప్రతిరోజూ చేస్తూనే ఉన్నాను,' అన్నాను.

స్వామీజీ, 'అవును. నువ్వు ఈ టెక్నిక్స్ పాటించకుండా ప్రతిరోజూ చేస్తూనే ఉన్నానని అనుకుంటున్నావు. కానీ నేను నువ్వు ఆ టెక్నిక్స్‌ని అసంకల్పితంగా పాటించే విధమైన పరిస్థితుల్ని కల్పించాను,' అన్నారు.

ఆ తర్వాత స్వామీజీ యోగనిద్రని అభ్యసించడానికి కావలసిన విషయాలను ఒక్కొక్కటిగా వివరించారు. స్వీయ క్రమశిక్షణకి *నాలుగు ప్రాథమిక అవసరాల్నీ* (ఆహారం, మైథునం, నిద్ర, స్వీయ సంరక్షణ) *నియంత్రించడం* పునాది. నిజానికి ఈ స్వీయ క్రమశిక్షణ యోగ నిద్రతో సహా ఏ పరిణతి చెందిన సాధనలకైనా తొలి మెట్టు. ఈ మార్గంలో మొట్టమొదట మీ *సంకల్ప శక్తినీ*, మీ ఇచ్ఛాశక్తినీ, మీ దృఢనిశ్చయాన్నీ మేల్కొల్పుకోవాలి. మీ సామర్థ్యాన్ని కించబరుచుకోవద్దు. 'నేను ఈ పని చేయలేను' అని ఎన్నడూ అనవద్దు. పైగా, మీలోని నిరోధక శక్తిని అధిగమించండి. మీ సామర్థ్యాన్ని విస్తరించండి. బద్ధకం అతి పెద్ద ఆటంకం. అది మస్తిష్కంలో కొలువుతీరి ఉంటుంది. అక్కడ నుంచి అది శరీరాన్ని ప్రభావితం చేస్తుంటుంది. అప్రమత్తంగా లేని మనిషి తన బద్ధకాన్ని శారీరిక అలసటగా భావిస్తాడు. దానికి కారణం నీరసమనో, రసాయనిక అసంతులన అనో చెప్పుకుంటాడు. బద్ధకం సాధనలో అత్యంత సూక్ష్మమైన ఆటంకం. మీ మనసుని మీ శరీరానికీ, ఇంద్రియాలకీ బానిస కాకుండా నిలువరించడం ద్వారా మీరు ఈ ఆటంకాన్ని అధిగమించవచ్చు. మీరు మీ శరీరాన్నీ, ఇంద్రియాల్నీ మనసు నేతృత్వంలో పని చేయమని ఆదేశించాలి. అలాగే మీ మనసు కేవలం ఒక ఆత్మ సాధనా మార్గమే. ఈ సంగతిని దానికి సూచించాలి. దృఢనిశ్చయ శక్తితో మీ మనసుని ఉత్తేజితం చేయండి. ఇచ్ఛాశక్తి, దృఢనిశ్చయ శక్తి ఆత్మ ధర్మం. యోగనిద్ర విధానం మీకు మీ శరీరమూ, ఇంద్రియాలూ, మనసుని

వ్యవస్థీకరించుకోవడానికి సహాయ పడుతుంది. కానీ మీరు తలపెట్టిన ప్రణాళికల్ని నిర్వహించే శక్తి మీ ఇచ్ఛాశక్తి, మీ దృఢనిశ్చయ శక్తి వల్లనే కలుగుతుంది. నిద్రపోతూ కూడా మేల్కొని ఉండడం, మీరు నిద్ర లేవాలనుకున్నపుడే సరిగ్గా లేవడం చేయగలుగుతారు. సంకల్ప శక్తే ఇక్కడ అతి కీలకమైనది.

ఇది విన్న తర్వాత, నా బద్ధకాన్ని అధిగమించేందుకు స్వామీజీ నాకు తెలియకుండానే ఎలాంటి శిక్షణనిచ్చారా అని అర్థం చేసుకున్నాను. తన శిష్యులకి ఏం కావాలో అది నేర్చుకునేలా ఆయన నేర్పే తీరు ఎంతో ఒడుపుతో కూడుకున్నది.

ప్రతి సంవత్సరం జూలైలో ఇన్‌స్టిట్యూట్‌లో గురుపౌర్ణమి వేడుక జరుగుతుంది. ఇది పౌర్ణమి రోజున గురువుని ఆరాధించే గొప్ప సంప్రదాయం. 1980 వేసవిలో జరిగిన ఈ శుభ సందర్భంలో నేను స్వామీజీ సన్నిధిలో ఉండే అవకాశం దక్కింది. అనాదిగా వస్తున్న ఈ సంప్రదాయాన్ని అనుసరించేందుకు నేను స్వామీజీకి పూలదండ వేసి నమస్కరించాలనుకున్నాను. కానీ నాకు మంచి సువాసన కలిగిన పూలతో కట్టిన దండ ఎక్కడ దొరుకుతుందో తెలియదు. నా స్నేహితుడు బాలా నా కోసం ఈ పనికి పూనుకున్నాడు. గులాబీలతో ఒక దండ తయారుచేసి తీసుకొచ్చాడు. గురుపౌర్ణమి ముందు రోజు రాత్రి నేను స్వామీజీతో, 'స్వామీ, రేపు ఉదయమే వచ్చి నేను మిమ్మల్ని చూడడానికి వస్తాను,' అని చెప్పాను. ఆయన అలాగేనన్నారు.

నేను మర్నాడు ఒక వెండి పళ్లెంలో పూలదండ తీసుకుని ఆయన గది తలుపుల దగ్గర నిలబడ్డాను. తలుపు దగ్గర వేసి ఉంది. నేను మర్యాదపూర్వకంగా చిన్నగా తలుపు తట్టి లోపలికి వెళ్లాను. స్వామీజీ గది ఖాళీగా ఉంది. కానీ ఆయన కూర్చున్న చోట నేల మీద దిండు, దుప్పటిని ఏమాత్రం కదిలించకుండా మనిషి మాత్రం ఎక్కడికో వెళ్లారు. నేను వంటగది, కాన్ఫరెన్స్ రూం, బాత్‌రూం చెక్ చేశాను. ఎక్కడా స్వామీజీ లేరు.

నాకు అది చాలా మంగళప్రదమైన రోజు. నేను స్వామీజీతో ఉన్నంతసేపూ, ప్రాపంచిక వ్యవహారాల గురించి ఆలోచించలేను. అందువల్ల నేను ఆయన దుప్పటి పక్కనే కూర్చుని ధ్యానం చేయసాగాను. కానీ నా ధ్యానం స్వామీజీ రాక గురించిన ఆలోచనలతో భంగమవుతోంది. స్వామీజీ చప్పుడి చేయకుండా వచ్చి నా పక్కన నిలబడి ఉంటారనే భావనతో నేను మాటిమాటికీ కళ్లు తెరిచి చూస్తున్నాను. చివరికి మానసిక ఆందోళన తట్టుకోలేక, లేచి వెళ్లి తలుపులు మూసేశాను. మళ్లీ ఆ గదులన్నీ పరిశీలించి వచ్చాను. అవన్నీ ఖాళీగా ఉన్నాయి. ఇక నిశ్చింతగా కళ్లు మూసుకుని ధ్యానం మొదలుపెట్టాను. ఒక అరగంట తర్వాత చిరపరిచితమైన సెంట్ సుగంధం నా ముక్కు పుటాలకు సోకింది. నేను కళ్లు తెరిచాను. అప్పుడే దుప్పట్లోకి దూరి కూర్చున్న స్వామీజీ నా ఎదురుగా ఉన్నారు. నాకు ఆ క్షణమే గుర్తుకొచ్చింది. స్వామీజీ తన గురువుగార్ని సందర్శించేందుకు వెళ్లారు. నేను ఎంత విచలితుడిని అయ్యానంటే, నేను ఆయన పాదాలపై నా శిరస్సుని ఉంచి సరిగా నమస్కరించలేకపోయాను. పైగా నేను, 'మీరు బాబాజీ దగ్గరకు వెళ్లారు!' అని అరిచాను.

ఆయన ట్రేలో ఉంచిన పూమాల వైపు చూస్తూ ఊరికే చిరునవ్వు నవ్వి, 'ఏముంది అక్కడ?' అని అడిగారు.

నేను తేరుకుని, పూమాలని తీసుకుని, నేనేం చేస్తున్నానో సరిగా నాకే అర్థం కాని స్థితిలో దాన్ని ఆయన మెడలో వేశాను. ముందు నేను అనుకున్నది వేరు. నేను ఆయన *గదిలోకి వెళ్తాను, పూదండ వేస్తాను, గురుస్తవం పఠిస్తాను, మళ్లీ వారి చరణాలకు పాదాభివందనం చేస్తాను, ఆశీస్సులు అందుకుంటాను* అనుకున్నాను. కానీ అదంతా నేను మరిచిపోయాను ఈ క్షణంలో. నేను ఆయన ముందు నిశ్చేష్టుడిగా నిలబడ్డాను, నా భుజాల మీద శిరసే లేనట్టు! నాకు పదే పదే గుర్తుకొస్తోంది ఒకే సన్నివేశం! కొన్ని నిముషాల మౌనం తర్వాత స్వామీజీ పూలమాల

తీసి చేత్తో పట్టుకుని, 'ఇది నీకు!' అన్నారు. అనుకోకుండా నేను శిరసు వంచి ప్రణామం చేశాను. 'తపస్వీ మనస్వీ వర్చస్వీ భవ' అని ఆశీర్వదిస్తూ ఆ దండని నా మెడలోనే వేశారు. తపస్సు (స్వీయ క్రమశిక్షణ)కి అంకితం అవుగాక! దృఢనిశ్చయ శక్తి నీలో నిండు గాక! దైవిక తేజస్సుతో వెలుగొందుదువు గాక! అని దీని అర్థం.

ఈ అనుభూతి నన్ను రోజు రోజంతా కమ్మేసింది. నేను ఆ అనుభూతి పారవశ్యతని తట్టుకోలేకపోతున్నాను. కానీ నా పెదవులు ఒక్క మాట కూడా పలకడం లేదు. ఈ విధమైన దీక్షలు ఎప్పుడూ అంతర్గతంగా ఉండాల్సినవి! అందువల్ల నాతో నేను మాట్లాడుకుంటూ, 'నేనెంత అదృష్టవంతుడిని! స్వామీజీ వంటి మహా సాధువు నా గురుదేవులు. ఈ ఆశ్రమవాసులంతా స్వామీజీతో ఇంత సమయం వెచ్చిస్తుంటారు, వీళ్లంతా ఎంత అదృష్టవంతులు! వారి సాన్నిధ్యంలో ఉండడమంటే దైవసన్నిధిలో ఉండడమే! దేశకాలాదులు ఆయనకి ఆటంకాలు కావు. అందువల్ల ఆయనకి తన విద్యార్థుల గురించి సమస్తమూ తెలుసు. వారి గురించి ధ్యానించడమంటే దైవధ్యానం చేయడమే!' అని చెప్పుకున్నాను.

ఈ శుభదినంనాటి సాయంత్రం వందలాది అతిథులు, ఆశ్రమవాసులు ఆడిటోరియంలో సమావేశమై ఉన్నారు. కొంతమంది 'జై గురుదేవ, జై జై గురుదేవ' అంటూ గురుస్తవం చేస్తున్నారు. కానీ స్వామీజీ ఆడిటోరియంలో ప్రవేశించగానే అందరూ స్తవం ఆపేశారు. అయితే స్వామీజీ ముందుకు సాగుతూ, 'ఏం? ఎందుకు ఆపేశారు? నాకు కూడా గురుదేవులు ఉన్నారని తెలుసా? ఇవాళ నేను మీకు 'గురువు' అంటే ఏమిటో చెప్తాను,' అన్నారు. గురువు అనే పదంపై అందరికీ ఎన్నో రకాల భావనలు ఉన్నాయి,' అంటూ స్టేజీ మీదకి వెళ్లారు.

ఆయన వేదిక మీద కూర్చున్నారు, కళ్లు మూసుకుని ఉన్నారు, అలా కొద్ది క్షణాలు అలాగే కూర్చున్నారు. ఆ తర్వాత ఆయన మాట్లాడారు, 'గురు' శబ్దం ఎంతో పవిత్రమైనది. మేము 'గురు' శబ్దాన్ని విడిగా ఒక పదంగా ఉపయోగించము. 'గురు' పదంతో బాటు 'దేవ' అనే పదాన్ని కూడా కలిపి 'గురుదేవులు' అని అంటాము. 'దేవ' అంటే 'ప్రకాశ స్వరూపుడు' అని అర్థం. అందుకే మేము 'గురుదేవులు' అని ఉపయోగిస్తుంటాం. 'గురుదేవులు' అజ్ఞానమనే అంధకారాన్ని పోగొట్టేవారు. 'గురుదేవులు' మన హృదయాంతరంగంలో మార్మిక ప్రదేశంలో నివసిస్తారు. ఆయన మనల్ని జీవితంలో అన్ని వేళలా నడిపిస్తూ ఉంటారు. అదే అంతర జ్యోతి.

'ప్రజలంతా 'గురువు' అంటే ఒక ప్రత్యేకమైన మనిషి' అనే భావనలో ఉంటారు. అది చాలా పొరబాటు. నాలాగా, మీలాగా, ప్రతి మనిషి లాగా మానవ గురువుకి కూడా జనన, మరణ క్రియలు ఉంటాయి. కానీ గురుదేవులు అమరమూర్తి. ఆయనకు జననం, మరణం, క్షయం తప్పనిసరి. చరిత్ర మొదటి నుంచీ ఈ గురువు, ఆ బోధకుడు, ఈ యాజకుడు, ఆ స్వామి నుంచి మార్గదర్శకత్వం పొందాలని ప్రయత్నిస్తున్నారు. కానీ ఇప్పటిదాకా వాళ్లు ఏమీ సాధించలేదు కూడా. 'ఎన్ని పుస్తకాలు చదివినా, ఎంతమంది బోధకులు ఉపదేశించే బోధలు విన్నా, ఎంతమంది ధర్మోపన్యాసాలు అధ్యయనం చేసినా, మీరు ఎన్నడూ మీ సందేహాలు, భయాల నుంచి విముక్తం కాలేరు. మీరు మీ సందేహాలు, భయాల నుంచి విముక్తం కాకుండా మీరు మనస్ఫూర్తిగా ఎన్నడూ సాధన చేయలేరు. మీరు మనస్ఫూర్తిగా సాధన చేయనిదే మీకు ప్రత్యక్షానుభవం అన్నది రాదు. ప్రత్యక్షానుభవం రానిదే మీకు నిజమైన ప్రశాంతత ఎన్నడూ లభించదు.

'మీలో ఉన్న దివ్యపురుషుని మార్గదర్శకత్వం మీరు అందుకుంటేనే సందేహాలు, భయాలూ తొలగిపోతాయి. మీకు మీ దారికీ, మీ జీవన మార్గానికీ విలువనివ్వాల్సిన అవసరం ఉండదు. అంతరంగ ప్రకాశం అచంచలమైన అంకితభావంతో మీ హృదయాన్ని ప్రకాశింపజేస్తుంది. ఆ

అంకితభావం దివ్యత్వంతో ప్రకాశిస్తుంటే, అప్పుడు మీ దృఢత్వం ఎంత గొప్పగా ఉంటుందో మీరు ఊహించలేరు.

'విసుగునీ, నైరాశ్యాన్నీ పోగొట్టుకోవడానికి మీలో మీరు బోధకుడినీ, గురుదేవునీ వెతుక్కోవాలి. అంతరంగ బోధకుని ప్రకాశంలో మీకు మేలు చేసేదేదో, కీడు చేసేదేదో గుర్తించవచ్చు. మంచీ చెడూ విడివిడిగా వేరు చేసి తెలుసుకోలేకపోతే, మీరు బాహ్య ప్రపంచం చేతిలో దోపిడీకి గురి అవుతారు, ఘోరవైఫల్యాన్ని చవిచూస్తారు.

'నీ గురువు ఎంత ప్రకాశాన్ని పొందినా, అతడు నీకు ఆ జ్ఞానజ్యోతిని చూపించే గ్యారంటీ ఇవ్వలేడు. ఆయన నీకు దారి చూపిస్తాడు. అతడు నీకు జ్యోతిని చూపలేడు. లోపలికి వెళ్లి అంతర జ్యోతిని వెదకాల్సిందీ, తిలకించాల్సిందీ నువ్వు, దాన్ని ఆలింగనం చేసుకోవలసింది నువ్వు!

'మనం కలుసుకునేందుకు మహానుభావులైన గురుదేవులు ఎక్కువమంది ఉండరు. ఒకవేళ మనం కలుసుకున్నా వారు ప్రకృతిసిద్ధంగా మనకు అందించబడిన గుణగణాల్లో మార్పు తెచ్చేందుకు ప్రయత్నించరు. మన బలాలు, బలహీనతల్ని మనం గుర్తించేందుకు సహాయపడతారు.

మీరు మీ బలహీనతల్ని అధిగమించేందుకు మీకు దోహదం చేస్తారు. మీ అంతరంగాన్ని బలోపేతం చేసుకోగలిగే సంస్కారాన్ని మీకిస్తారు. సరైన సమయం వస్తే, దైవేచ్ఛ దాన్ని నిర్ధారిస్తే, ఆయన మీ హృదయపీఠంలో అంతర జ్యోతిని ప్రకాశింపజేస్తాడు. అలా చేసే ముందు అతడు నీ స్వీయ బాధ్యత విలువని అర్థం చేసుకుంటాడు. ఆ జ్ఞాన జ్యోతిని నీవు ఎంత చైతన్యవంతంగా ఉంచుకోవాలీ, ఆ ప్రకాశాన్ని ఎంత వీలుగా ఉపయోగించుకోవాలీ అనే విషయాన్ని తెలియజేస్తాడు. ఇదంతా దైవ కృపని సిద్ధం చేసుకునేందుకూ, అందుకునేందుకూ చేసే ఎదురు సన్నాహాలు!

'నేను ఇంకా చెప్తాను చూడండి! మీరు దీపం వెలిగేందుకు అవసరమైన ప్రమిద, వత్తి, నూనె సమీకరించుకోండి. ఈ సంసిద్ధత పూర్తి అయిన తర్వాత ఆ నిగూఢ ప్రకాశం బోధకునిలో ఉన్న చైతన్యవంతమైన జ్యోతిని తనని ప్రజ్వలింపజేయమంటూ ప్రేరేపిస్తుంది. మరోలా చెప్పాలంటే, మీలో ఉన్న చైతన్యవంతుడైన బోధకుడి అభ్యర్థన లభించిన క్షణమే మీలో ఉన్న చిరంతన జ్యోతి సేవ చేయడానికి సంసిద్ధమవుతుంది.

'నిజమైన గురువు తన శిష్యుడికి ఎన్నడూ లేనిపోని ఊహలూ, ఆశలూ కల్పించడు. నిజమైన గురువు ఎన్నడూ తన శిష్యుడికి 'నువ్వు నన్ను సేవిస్తే నీకు బదులుగా నేను సాధన చేస్తాను' అని చెప్పడు. ఒక విషయం మాత్రం నేను మీకు చాలా బలంగా, స్పష్టంగా చెప్తున్నాను. ఒక గొప్ప వ్యక్తి చుట్టూ తిరగడం వల్ల మీరు గొప్ప వ్యక్తి కాలేరు. సాధువు చుట్టూ తిరగడం వల్ల ఎవరూ సాధువు కాలేరు. రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు – వీళ్లంతా గొప్ప మహనీయులు. వీరు కోట్లాదిమందికి తెలుసు. వేలాదిమంది వారితో కలిసి జీవించారు. కానీ ఎంతమంది వారి ఆధ్యాత్మిక జ్యోతిని తమలో వెలిగించుకోగలిగారు? ఒకరో లేదా ఇద్దరో మాత్రమే ఉన్నారు. ఆ మహనీయులు చాలా శక్తివంతులు! దయామయులు! కానీ వారి చుట్టూ ఉన్న జనంలో ఎంతోమంది అజ్ఞానులై ఉంటారు. వారిని చూసి జాలిపడడం తప్ప మనం మరేమీ చేయలేని పరిస్థితిలో ఉంటారు. నిజానికి ఈ మహనీయుల నుంచి ఉన్నతమైన ఆధ్యాత్మిక సంపదని అందుకుని జీవితాన్ని మెరుగుపరుచుకోవడానికి చాలా తక్కువమంది ప్రయత్నించారు. ఫలితంగా ఈ మహనీయుల అనుయాయుల్లో అసహ్యం, అసూయ, దురాశ, కోపం, కోరికలు, ఆత్మీయత, అహంకారం వంటి ప్రతికూల భావనలన్నీ ఉన్నాయి. గొప్ప వ్యక్తుల అనుయాయులు ఎలాంటి స్థితిలో ఉంటారో వీరూ అలాంటి స్థితుల్లోనే ఉన్నారు.

'ఈ గురుపౌర్ణమి మీలో కొలువుతీరిన గురువుని మీకు గుర్తు చేసే రోజు. మీలో ఉన్న ప్రకాశం ఉత్సాహాన్ని ఇనుమడింపజేస్తుంది. ధైర్యం, ఆత్మ విశ్వాసం, స్వీయ ప్రేరణ, దేవుడి మీద నమ్మకాన్ని కలిగిస్తుంది. ఈ సందర్భంలో మీ మీ సాధనని ఇతోధికమైన శక్తితో చేయడానికి కృతసంకల్పం ఉండాలి. మీరు మీ గురువుని ప్రేమించడం, గౌరవించడం ముఖ్యం. ఏ ఒక్క విషయానికీ ఎవరి మీదా ఆధారపడవద్దు. మీ గురువు భౌతిక రూపం మీద కూడా ఆధారపడకూడదు. ఆయనపై విశ్వాసం ఉంచండి. కానీ మీ గురువుని ఒక శరీర రూపధారిగా మాత్రం గుర్తించకండి. గురువంటే ఒక పవిత్ర జ్యోతి, పవిత్ర ప్రకాశం. ఆ పవిత్ర ప్రకాశం మీకు భిన్నం కాదు. ఆ ప్రకాశమే మీరు!'

ఈ ఉపన్యాసం అచ్చం నాతో నేను రోజల్లా చెప్పుకునే స్వీయ అభిభాషణ, స్వీయ ఏకపాత్ర సంవాదాల్లాగానే నడుస్తోంది. స్వామీజీ, ఆయన గురువు, భవాల్ రాకుమారుడు, ఇంకా ఆ నిత్యనూతన ప్రకాశంలో తరిస్తున్న మరెందరో మహర్జ్యోతి రూపాలను సరికొత్తగా అర్థం చేసుకోవడానికి వీలు కల్పిస్తున్న ఉపన్యాసం ఇది! ఆనాటి నుంచీ నా ప్రయాణం మరో కొత్త రూపం తీసుకుంది. గురువు పావనజ్యోతి ప్రకాశంగా ఎలా ఉంటారో ఆలోచించడం మొదలు పెట్టాను. ఆ పవిత్రజ్యోతి నా నుంచి గానీ, ఏ ఇతర వ్యక్తుల నుంచి గానీ ఎలా భిన్నం కాదో అనుభూతి చెందాను. ఆ జ్యోతి మనలాంటి వ్యక్తుల్లో ప్రవేశించి ఇన్ని భిన్న రూపాల్లో ఎలా ప్రకాశిస్తోందో! ఆ జ్వాలని నేరుగా నాలోనే ప్రకాశిస్తున్నట్టు చూడడం ఎంత గొప్పగా ఉంటుందో గదా!

అమెరికాలో స్వామీజీ బహుముఖ ప్రజ్ఞ సంపూర్ణంగా అవగతమైంది నాకు. భారతదేశంలో ఆయన్ని నేను పరమ దయాళువైన సాధువుగానూ, మర్మసాధువుగానూ మాత్రమే చూశాను. గొప్ప సాధకులకి కొన్ని మార్మికమైన దీక్షలు ఇచ్చి ఉన్నారు తప్ప అక్కడ ఉపన్యాసాలేవీ ఇవ్వలేదు. భారతదేశంలో ఆయన ఎక్కడున్నారో కనిపెట్టడం కష్టం. ఆయన ఢిల్లీలో ఉన్నపుడు తప్ప, ఆయన ఎక్కడ ఉన్నదీ, ఏం చేసిందీ చెప్పడం కష్టం. అమెరికాలో ఆయన జనంతోనే మసలుతారు. ఆయన ఎప్పుడు ఎక్కడికి వెళ్లేదీ ప్రయాణ కార్యక్రమం ముందే సిద్ధంగా ఉండేది. ప్రజలు ఆయన్ని ఎక్కడ కావలసివస్తే అక్కడ కలుసుకునేవారు. ఇక్కడ ఆయన బోధకుడు, అనర్గళంగా ఉపన్యసించగలిగే ఉపన్యాసవేత్త, రచయిత, పాలనాదక్షులు, మానవతావాదిగా మెలిగేవారు. ఈ రకమైన వ్యక్తిత్వం ఆయనలోని మార్మిక దృక్కోణాన్ని అధిగమించేది.

స్వామీజీలో గొప్ప అద్భుతమైన కోణం ఆయన బోధన. నేను ఈరోజు ఓసారి వెనక్కి తిరిగి నా నోట్సుని పరికిస్తే, స్వామీజీ తమ ఉపన్యాసాల్లో, ఆధ్యాత్మిక బోధకుడికీ, మతబోధకుడికీ మధ్య గల భేదాన్ని చాలా స్పష్టంగా చూపించే ప్రయత్నం చేసేవారు. ఆయన ఉపన్యాసాలు చెప్తూ మధ్యలో 'మీలో చాలామంది ఇతర వ్యక్తుల్లోనో, టీచర్‌లోనో, గురువుని వెతుక్కుంటూ ఉంటారు. అప్పుడు మీ తండ్రిలోనో, మీ తల్లిగారిలోనో ఆ గురువుని దర్శిస్తారు. మీరు ఉన్నతమైన కల్పనా ప్రపంచంలో విహరిస్తూ ఉంటారు. కానీ విషయాలు మీరు అనుకున్నట్టు జరగలేదనుకోండి, వెంటనే మీకు నిరాశ కలుగుతుంది. ఆ నిరాశలో ఆ ఆధ్యాత్మిక సత్యాన్ని నిందిస్తారు. కానీ శృతిస్మృత్యాది గ్రంథాలన్నీ మనకు సర్వేశ్వరుడైన దేవుడే సర్వజ్ఞుడని చెప్తున్నాయి. ఒక దివ్య జ్యోతి వెలుగుతున్న ఏ భౌతిక శరీరమైనా మీకు గురువు కావచ్చు. కానీ ఒక సర్వజ్ఞ దివ్య పురుషుడు, అంతర ప్రకాశంగా ఉండి మనకు మార్గం చూపుతాడు.

'ఒక మత ప్రచారకుడికీ, ఆధ్యాత్మిక బోధకుడికీ మధ్య చాలా తేడా ఉంది. మత ప్రచారకులు మనల్ని ఒక గ్రూపులో భాగంగా ఉండడానికి శిక్షణనిస్తూ ఉంటారు. అది మనల్ని తరచుగా మిగతా మానవ సమాజం నుంచి వేరు చేసి మన చైతన్యాన్ని నొక్కేస్తుంది. ప్రచారకులు

తమనే విశ్వసించాలని చెప్తారు. కానీ ఆధ్యాత్మిక బోధకులు మన చైతన్యాన్ని విస్తరింపజేస్తారు. వాళ్లు కఠోరమైన నియమ నిబంధనలు, సూత్రాలకు లోబడి పరిశీలించరు. నిజమైన బోధకులు తాము చేస్తున్న దివ్య బోధ వల్ల కలిగే మహత్ ఫలితాలకి పొంగిపోయి, 'నేను కాబట్టి ఇంత గొప్ప పని చేస్తున్నాను!' అనే మిథ్యా భావనలకి లొంగి అల్ప సంతోషానికి లోనుకారు. వారు తమ సాధు సంప్రదాయాన్ని పాటిస్తున్నామనీ, తమ కర్తవ్యాన్ని తాము నెరవేరుస్తున్నామనీ భావిస్తారు వారు. అలాంటి గురువులూ, అలాంటి బోధనలూ ఏనాడూ ఒక సంప్రదాయం మీదే దృష్టి నిలపవు. ఎందుకంటే అవి అన్ని మతాలనూ, ప్రజలనూ సమానంగా చూస్తాయి.

స్వామీజీ ఏ విషయం చెప్పినా అంతరంగంలో కొలువున్న పరమాత్మని తలుచుకున్న తర్వాతే మొదలుపెడతారు. ఆ తర్వాత బ్లాక్‌బోర్డు మీద రాసి ఉన్న విషయం చూసి ఏం చెప్పాలో ఓ క్షణం ఆలోచిస్తారు. ఆ తర్వాత కొద్ది మార్పుచేర్పులతో ఈ క్రింది బాణీలో ఇలా మొదలుపెడతారు– 'మనిషి' అంటే కేవలం మానవ శరీరమే కాదు, కేవలం మనసు మాత్రమే కాదు. శరీరానికీ, మనసుకీ మధ్య 'శ్వాస' అనేది ఒకటి ఉంది. మనం ఆరోగ్యంగా సంతోషంగా ఉండాలంటే, శారీరిక, మానసిక స్థాయిల్లో శ్వాస మర్మాన్ని తెలుసుకోవాలి. 'శ్వాస' ఒక సీక్రెట్ కస్టమ్స్ ఆఫీసర్ లాంటిది. శరీరం, మనసుకి మధ్య ఎగుమతి, దిగుమతులు చేసేది వాటి మధ్యన నిరంతరం సంచరిస్తూ ఉండే మనసే. దీర్ఘాయువు రహస్యం, అంతర్గత పవిత్రత, శ్వాసకి అనుగుణంగా నడుచుకోవడం వల్లనే సాధ్యపడతాయి,' అని చెప్తారు.

అప్పుడు స్వామీజీకి చెప్పాలనిపిస్తే విషయాన్ని ఇంకా విస్తరించి చెప్పేవారు. లేదంటే మనసు మర్మం గురించి వివరించేవారు. 'బంధానికైనా, మోక్షానికైనా మనస్సే మూలం!' అనేవారు. 'మన ఆధునిక విద్యా వ్యవస్థలో మనకి కేవలం మైండ్‌లోని చైతన్యవంతమైన భాగాన్ని ఎలా సంస్కరించుకోవాలో మాత్రమే తెలుస్తుంది. కానీ అవచేతన (సబ్‌కాన్షస్) భాగం గురించి ఎవరూ వివరించలేరు. మీ అవచేతన స్థితిలోకి మీరు ప్రవేశించడం తెలిస్తే తప్ప మీరు మీ గత జీవితంలోని సూక్ష్మతమమైన ముద్రల నుంచి విముక్తం కాలేరు. మీ అవచేతన మనస్సుని అర్థం చేసుకోవడంలో మీరు విఫలమైతే అది మిమ్మల్ని భయాందోళనల్లో ఊగిసలాడేలా చేస్తుంది. ధ్యానం అనేది ఒక పరికరం వంటిది. దానితో మీ అచేత మనస్సుని చేరుకోవచ్చు,' అని చెప్పేవారు.

ఆ తర్వాత స్వామీజీ మనసు స్థాయిని దాటి అతీత స్థితిలో ఉండే విషయాల్ని గురించి విస్తారంగా చెప్పేవారు. 'ఆత్మ' ని స్వామీజీ ఎప్పుడూ 'చైతన్య కేంద్రం' అని పిలిచేవారు. 'మీరు మీ జీవితాన్ని పరిపూర్ణంగా ఆనందించాలంటే ప్రతి స్థాయిలోనూ శరీరం, శ్వాస, మనస్సు, చైతన్యం మొదలైనవాటికి మిమ్మల్ని మీరు పరిచయం చేసుకుంటూ ఉండాలి. రెండు ప్రపంచాలకి చెందిన పౌరులు మీరు. ఒకటి మీకు బాహ్యంగా ఉన్న ప్రపంచం. రెండవది, మీలో ఉన్న ప్రపంచం. ఈ రెండు ప్రపంచాలకీ వంతెన వేయడమే 'సాధన.'

తరచుగా శ్రోతల్లో ఎవరో ఒకరు స్వామీజీని, 'స్వామీజీ! నేను సాధన చేయడానికి ప్రయత్నిస్తూనే ఉన్నాను. కానీ లోపల చాలా పెద్ద సంఘర్షణ జరుగుతోంది. నేనేం చేయాలి?' అని అడుగుతారు.

స్వామీజీ దానికి జవాబిస్తూ, 'సాధన ప్రేమపూరితమైనది కాకపోతే మీరు దాన్ని ఎంత పద్ధతిగా చేసినా, ఎంత ప్రామాణికంగా చేసినా అది యాంత్రికమే అయిపోతుంది. మీ సాధనకి ప్రేమని మిళితం చేయండి. అప్పుడే మీరు దీర్ఘకాలం పాటు ఎలాంటి నిరాశా నిస్పృహలు లేకుండా సాధన చేయగలరు. ఆధ్యాత్మిక సాధనలో నిమగ్నమై ఉన్నపుడు మీతో మీరు హాయిగా ఉండండి, మిగతావారితోనూ హాయిగా ఉండండి. మీరు బాధపడకండి, ఇతరుల్ని బాధ పెట్టకండి.

మీ శక్తి సామర్థ్యాల మేరకు మీరు నిలబడండి. మీ సామర్థ్యాన్ని పెంచుకుంటూ సాధనని ఇంకా బలంగా, సుస్థిరంగా చేయండి,' అని చెప్పేవారు.

అప్పుడు మళ్లీ విషయాన్ని మరోవైపుకి తీసుకుని వెళ్లేవారు. 'మీ కర్తవ్యాన్ని ప్రేమతో నిర్వహించండి! మీరు మీ పనుల్ని ప్రేమగా నైపుణ్యంగా చేయడం మొదలుపెడితే ఈ ప్రపంచంలో సంతోషంగా జీవించగలరు. యోగం అంటే మీ పనుల్ని అందంగా, నైపుణ్యంగా చేసుకోవడం! ఈ ప్రపంచానికి అతీతంగా ఉంటూ కూడా మీరు ఈ ప్రపంచంలో ఎలా ఉండవచ్చో చూపిస్తుంది. ఈ ప్రపంచంలోని వస్తువులతో సంగబుద్ధి లేకుండా ఆనందిస్తూ ఉండడం! ఈ జీవిత లక్ష్యం ఏమిటి? జీవితాన్ని సార్థకం చేసుకోవాలంటే ఏం చేయాలి? దీనికి మనం జీవితం నుంచి పారిపోవాల్సిన అవసరం గానీ, బాధ్యతల నుంచి తప్పించుకోవాల్సిన అవసరం గానీ లేదు. కర్తవ్యం పాటించడం అంటే చాలా శక్తివంతమైన పని చేస్తున్నట్లే. మీ కర్తవ్యాల్ని ప్రేమగా, నిస్వార్థంగా, నైపుణ్యంగా చేయాలి. అలా చేస్తే మీరు ఇప్పుడే ఇక్కడే విముక్తులు అవుతారు.'

విమర్శనాత్మకంగా ఆలోచిస్తే స్వామీజీ ఉపన్యాసాలు ఒక పద్ధతి ప్రకారం నడిచినట్టు ఉండవు. ఆయన చెప్పాల్సిన విషయానికి ఏమాత్రం సంబంధం లేని మరో విషయం తీసుకుని చెప్తారు. కానీ ఆయన చెప్పే విధానం ఎంత గొప్పగా ఉంటుందంటే శ్రోతలు మంత్రముగ్ధులై వింటూ ఉంటారు. ఆయన నోటివెంట మాట వచ్చిందంటే, శ్రోతలు వినాలని కోరుకునే మాటే అయి ఉండేది. ఆ శ్రోతల్లో ప్రతి ఒక్కరూ స్వామీజీ తమ గురించీ, తమ సమస్యల గురించే మాట్లాడుతున్నారని భావించేవారు.

ప్రతి ప్రసంగంలోనూ స్వామీజీ దైనందిన జీవితంలోని సంఘటనల ద్వారా భగవంతుని ఉనికిని గుర్తించాలంటూ బలమైన స్వరంతో తెలిపేవారు. తాను ఒక మతం గురించి బోధించడం లేదనీ, తాను కేవలం హిందూ మతానికో, ఒక నిర్దిష్టమైన వాదానికో కట్టుబడడం లేదనీ స్పష్టంగా చెప్పేవారు. నిజానికి ఆయన తన లెక్చర్‌లో 'భగవంతుడు' శబ్దాన్ని మొదట్లో ఉపయోగించేవారు. కానీ త్వరలోనే ఆ పదాన్ని వదిలేసి, ఆ తర్వాతి ఉపన్యాసమంతా 'దైవ', 'దివ్య పురుషుడు' అనే పదాల్ని వాడేవారు. 'భగవంతుడు ఆరాధింపబడాలని అర్రులు చాచడు. భగవంతుడు సర్వవ్యాపి, సకల చరాచరుడు, ఆయనకు కావలసింది ఏదీ లేదు. మీరు భగవంతుడిని సేవించాలనుకుంటే, మీరు ఆయన సృజించిన సృష్టిలో ఒక మంచి వ్యక్తిగానూ మంచి పనులు చేసి దివ్యత్వాన్ని ప్రదర్శించే విధంగానూ జీవిస్తూ ఉండాలి. ఆయన రచించిన ఈ సృష్టికి మీరు మరింత అందాన్ని తీసుకుని రాలేకపోతే పోవచ్చు, కనీసం ఇప్పుడున్నంత అందంగానూ, పరిశుభ్రంగానూ ఉండేలా జాగ్రత్తలు తీసుకోవచ్చు. ఎవరికీ బాధని కలుగజేయకండి. దివ్యత్వం మీలోనే ఉంది. దానినే మీరు భగవంతుడని పిలుస్తున్నారు. మీరు ఈ ప్రపంచ సంక్షేమం కోసం పని చేయడం చూసి ఆయన ఎంతో సంతోషిస్తాడు. మన హృదయ కుహరంలో ఉన్న దైవం మన పనుల్ని సాక్షీభూతంగా చూస్తుంటాడు, ఆనందిస్తుంటాడు. మనం కరుణాపూరితమైన, నిస్వార్థమైన పనుల్ని చేయడం చూసి ఆయన సంతోషంగా ఉంటాడు. దైవాన్ని పూజిస్తున్నామంటూ మనం ఢమరుకాలూ, శంఖాలూ మ్రోగించి పూజించడంలో ఏమైనా అర్థం ఉందా?

'సాధన లక్ష్యం దేవుడిని చూడడమో లేదా దివ్యంగా మారడమో కాదు. ఎందుకంటే మీరే దేవుళ్లు! మీరే దివ్యులు. వేరే మారడమంటూ ఏమీ లేదు. మీ దివ్య స్వభావాన్ని అర్థం చేసుకోవడానికి మీరు మొదట మానవులుగా మారండి. మనకి ఉన్న పశు ప్రవృత్తుల వల్ల దివ్యత్వం మరుగున పడిపోతుంది. కోపం, అసహ్యం, ఈర్ష్య, సంగం, కోరిక, అహంకారం వంటి వృత్తులు పశుప్రవృత్తులు. ఈ ప్రవృత్తులకి నాలుగు ప్రాథమిక అవసరాలు ఉంటాయి. ఆహారం, మైథునం, నిద్ర, స్వీయపరిరక్షణ కాంక్ష. దివ్యానుభూతి అనే నిచ్చెన ఎక్కడానికి మొదటగా

మీరు మీలోని ఈ పశుప్రవృత్తుల్ని అణగిపోయేలా చూసుకోవాలి. అప్పుడు మీరు పరిపూర్ణమైన మానవులు అవుతారు. మీలో ప్రదర్శితమయ్యే గొప్ప మానవత్వమే దివ్యత్వాన్ని మీ వైపు ఆకర్షించుకుంటుంది. అప్పుడు దివ్యత్వం వైపు మీరు పరుగులు తీయనవసరం లేదు. మనలోని దివ్యత్వం పరిపూర్ణతని పొంది సంతృప్తిగా ఉంటుంది,' అని బోధించేవారు.

స్వామీజీ ఉపన్యాసాలూ, బోధలూ లేని వేళల్లో ఒక సామాన్యుడిలా, ఒక సంపూర్ణ మానవుడిలా కాలం గడుపుతారు. వారి ప్రతి చర్యలోనూ ఇది స్పష్టంగా కనిపిస్తుంది. టెన్నిస్ ఆడినపుడు చూస్తే ఆయన ఓ టీనేజర్‌లా ఉంటారు. బిగ్గరగా అరుపులు, కేకలతో చాలా హడావిడి చేస్తారు, హుషారుగా ఉంటారు. ప్రతి స్ట్రోక్‌కీ కామెంట్ చేస్తూ ఉంటారు. జనాల మీద జోక్‌లు పేలుతూ ఉంటాయి. పిల్లలకైతే స్వామీజీ ఆట ముగించగానే, తమని ఒళ్లోకి తీసుకుని క్యాండీలు ఇస్తారని తెలుసు. చిన్న పిల్లలతో కలిసి ఉన్నపుడు ఆయన వాళ్లతో ఆటలాడుకునే తాతగారిలా ఉండేవారు. వాళ్లతో ప్రేమగా వ్యవహరిస్తూ ఉండేవారు. వాళ్ల తల్లిదండ్రులకు కూడా ఎప్పుడూ పిల్లలతో సరదాగా సంతోషంగా గడపమని చెప్తూ ఉండేవారు. స్వామీజీ బయట ఎక్కడైనా నడుస్తూనో, గార్డెన్‌లో పనిచేస్తూనో, మంట అంటిస్తూనో కనిపిస్తే చాలు, పిల్లలు వెంటనే ఆయన చుట్టూ మూగేవాళ్లు. స్వామీజీ వాళ్లను తరచుగా అడిగే ప్రశ్న ఒకటి ఉండేది. 'మిమ్మల్ని ఎక్కువగా ప్రేమించేది ఎవరూ?' అనేవారు. ఆ పిల్లలంతా, 'బాబా!' అనేవాళ్లు. కొన్నిసార్లు స్వామీజీ వాళ్లను, 'మీరు నన్ను ఎంత ప్రేమిస్తున్నారు?' అనేవారు. ఆ పిల్లలు తమ చిట్టి చిట్టి చేతులు చాపి కోరస్‌లో, 'ఇంతా!' అనేవాళ్లు.

ఒక్కోసారి పిల్లలు స్వామీజీ గదికి వెళ్లేవారు తమ తల్లిదండ్రులతో కలిసి. అక్కడ వాళ్ల ఇష్టారాజ్యంగా ఉండేది. వాళ్లు ఆయన దగ్గరకి దూసుకుపోయేవారు. వెళ్లి అమాంతం ఆయన ఒళ్లో పడేవారు. ఆయన వాళ్ల చెక్కిళ్లు నిమిరీ, బుగ్గలు సాగదీసీ వాళ్లతో ఆటలాడుతుండేవాళ్లు. ఆయన జుట్టు పట్టుకుని లాగడం, కొన్నిసార్లు ఆయన ముక్కు కూడా కొరికేవాళ్లు. ఒకసారి ఓ పిల్లవాడు ఓ దిండులోకి దూరాడు. దిండు కవరుకీ, దిండుకీ మధ్య దాక్కుని కప్పలాగా గెంతసాగాడు స్వామీజీ దృష్టిని ఆకర్షించడానికి. ఆ పిల్లవాడి తండ్రి వాడిని పట్టుకుని, 'స్వామీజీ గదిలో ఇలాంటి అల్లరి పనులు చేయకూడదు,' అని గుసగుసగా చెప్పారు. స్వామీజీ ఆ మాట విని కల్పించుకున్నారు. 'వాణ్ణి ఆడుకోనీండి! వాడి పసితనాన్ని పాడు చేయకండి!' అని చెప్పారు. ఆ తర్వాత ఆయన కూడా వాడితో కలిసి ఆడుకున్నారు.

స్వామీజీ ఉపన్యాసాల్లోనూ, తల్లిదండ్రులతో నెరపే ఆంతరంగిక సమావేశాల్లోనూ, స్వామీజీ విడిపోతున్న ఉమ్మడి కుటుంబాలు, పిల్లలపై అవి చూపిస్తున్న పర్యవసానాల గురించి మాట్లాడేవారు. అనేక సందర్భాల్లో ఆయన మీరు మీ భవిష్యత్తు బాగుండాలని కోరుకుంటే, పిల్లల్ని ప్రేమగా నిస్వార్థంగా పెంచండి. భవిష్యత్తులో వాళ్లే మీ సంరక్షణా బాధ్యతలు చూసుకుంటారు. మీరు ఈ రోజు వాళ్లకి ఏమిస్తున్నారో, రేపటి రోజు వాళ్లు మీకు తిరిగి అదే ఇస్తారు,' అనేవారు. భవిష్యత్తు గురించి ప్లాన్ చేసుకోవడానికీ, దాని గురించి ఆందోళన చెందడానికీ మధ్య గల తేడా ఇదే. వర్తమానం మీద ఎవరికైతే మంచి పట్టు ఉంటుందో వారికే ప్లానింగ్ ఉంటుంది. జనం గతం గురించి చింతించడమో, భవిష్యత్తు గురించి బెంగ పడడమో చేస్తూ సమయాన్ని వృథా చేసుకుంటారు. వర్తమానం మీద మంచి పట్టు ఉన్నవారికి ప్లానింగ్ బాగా ఉంటుంది. జనం గతం గురించీ, భవిష్యత్తు గురించీ ఆలోచిస్తూ సమయాన్ని పోగొట్టుకుంటారు. దురదృష్టవశాత్తూ తల్లిదండ్రులు ఈ ప్రవృత్తులనే తమ పిల్లలకు అందిస్తారు. నిస్తేజమైన వర్తమానం నీరసప్రాయమైన భవిష్యత్తుకి కారకమవుతుంది.

1980 చలికాలంలో స్వామీజీ కుటుంబ జీవనం, బిడ్డల పెంపకం మీద వరసగా కొన్ని ఉపన్యాసాలు ఇచ్చారు. తర్వాత కాలంలో ఆ ఉపన్యాసాల సారమే 'లవ్ అండ్ ఫ్యామిలీ లైఫ్' పేరుతో ఒక పుస్తకంగా రిలీజ్ అయింది. తర్వాతి సంవత్సరం స్వామీజీ పిల్లల కోసం ఒక ఇన్‌స్టిట్యూట్‌లోనే ఒక స్కూలు స్థాపించారు. మాంటిసోరీ విద్యా విధానంలో పాఠ్య ప్రణాళికని డిజైన్ చేయడంలో చురుకైన పాత్ర పోషించారు. ఆయన పిల్లల్లో నిబిడీకృతంగా దాగిన ప్రతిభని వెలికి తీయడానికి తరగతుల్ని నిర్వహించారు. పిల్లలతో ప్రేమపూరితంగా మెలగడం గురించి ఆయన నొక్కి చెప్పేవారు. పిల్లలు తమ సృజనాత్మకతని వ్యక్తీకరించడానికి అవకాశాలు ఇవ్వాలనీ, నిర్భయంగా కమ్యూనికేట్ చేయడానికి వీలు కల్పించాలని ఆయన బలంగా చెప్పేవారు.

స్వామీజీ తమ జీవితంలో అతి కొద్దికాలం తప్ప సాధు జీవనమే గడిపారు. పిల్లల గురించీ, కుటుంబ జీవనం గురించీ చాలా విజ్ఞతతో ఆలోచించేవారు. ఒకసారి ఒక పిల్లవాడు స్కూల్లో ఉన్న మిగతా పిల్లల్ని కొరకడం మొదలుపెట్టాడు. ఇలా చాలా కాలం జరిగింది. వాడు అలా కొరక్కుండా ఉండానికి టీచర్లు, వాడి తల్లిదండ్రులు చేతనైనంత ప్రయత్నం చేశారు. కానీ ఏమీ ప్రయోజనం లేకపోయింది. చివరికి ఒకరోజు ఆ పిల్లవాడి తల్లి స్వామీజీతో జరుగుతున్న విషయమంతా వివరించింది. ఆయన, 'వాడి కడుపులో క్రిములున్నాయి. అవి వాడిని కొరుక్కుని తింటున్నాయి, వాడు మిగతావాళ్లని కొరుకుతున్నాడు. డా. క్లార్క్‌తో మాట్లాడండి, సినా 1 ఎం (హోమియో మందు) ని కొన్ని మోతాదుల్లో ఇస్తే సరిపోతుందేమో చూడండి,' అన్నారు. ఆ మందు ఒక డోసు ఇచ్చిన తర్వాత వాడు కొరకడం మానేశాడు.

మరో సందర్భంలో స్వామీజీ క్యాంపస్‌లో నడుస్తున్న సమయంలో ఒక మహిళని కలిశారు. అప్పుడే ఆమెకు కొత్తగా వివాహమైంది. ఆమెతో భర్త రాకపోయేసరికి కారణం అడిగారు. ఆమె ఆయన సెలవులు గడపడానికి వెళ్లాడని చెప్పింది. స్వామీజీ అప్పటికి ఆ మాట విన్నారు. కానీ ఆ మనిషి తర్వాత ఒకసారి వచ్చినపుడు, అతడిని స్వామీజీ పక్కకు తీసుకుని వెళ్లి సెలవులు గడపడానికి ఒంటరిగా ఎందుకు వెళ్లావంటూ నిలదీశారు. 'నాకంటూ కొంత ఊపిరాడే సమయాన్ని కేటాయించుకుని గడపాలని అనిపించింది. నాతో నేను గడపడానికి అలా వెళ్లాను,' అన్నాడు ఆ యువకుడు.

'నాయనా, నువ్వు కొంచెం సున్నితంగా వ్యవహరించాలి. నీ భార్యతో నీ అనుభూతులు పంచుకుంటూ ఆమెతో అనుబంధాన్ని పెంచుకో. ఆమెతో స్నేహం, ఆత్మీయత పంచుకో. అప్పుడు నీకు కావలసినంత సమయం ఊపిరాడుతుంది. నీ జీవితమంతా అనంత ప్రేమయానాన్ని సాగించవచ్చు.' అన్నారు.

స్వామీజీ మర్మం ఎవరికీ అర్థం కాదు. ఆయన మార్మికతలో చిలిపిదనం కూడా చాలా ఉండేది. ఆయనది కరుణాపూరిత హృదయం. అయినా ఆయన చేసే పనులు పైకి అతి క్రూరంగా కనిపించేవి. ఇది నాకే కాదు, చూసే వాళ్లందరికీ ఆశ్చర్యాన్ని కలిగించే విషయం. ఒక విద్యార్థికి పై స్థాయి సాధన చేసే దీక్ష ఇస్తానని చెప్పేవారు. కానీ చెప్పిన చోటికి చెప్పిన సమయానికి వెళ్లేవారు కారు. లేదంటే ఆయన ఒక విద్యార్థికి, 'రిలాక్స్, హాయిగా ఉండండి. నువ్వు అప్రమత్తంగా ఉంటూ ఉండాలి,' అని చెప్పేవారు. కానీ కొద్ది రోజుల్లోనే ఆయన ఆ విద్యార్థికి ఎంత చేసినా తరగని కొండంత పని అప్పగించేవారు. పైగా అదీ సరైన రీతిలో చేసి తీరాలి. ఓసారి ఓ స్త్రీని ప్రశంసలతో ముంచెత్తారు. మరుసటి రోజు ఉపన్యాసంలో ఆమెను తిట్టారు.

స్వామీజీ ఒక స్టూడెంట్‌ని ఆహ్వానించారు తనని చూడడానికి రమ్మని. అతనికి ఎన్నో ప్రేమపూరిత వాక్కులు ఆశీర్వచనాలూ అందాయి. అతన్ని పంపించే లోపునే 'నిన్ను నేనెంతగా అభిమానిస్తున్నానో నీకు తెలియదు,' అన్నారు. కానీ కొద్దిరోజుల తర్వాత ఆయన ఇన్‌స్టిట్యూట్

రెసిడెన్షియల్ ప్రోగ్రామ్ కో ఆర్డినేటర్‌ని పిలిచి 'ఏమిటి అతనిలో లోపం?' అని అడిగారు. అతడు, 'అతను ప్రతిరోజూ జరుగుతున్న ప్రోగ్రామ్‌ని సరిగా ఫాలో కావడం లేదు. అతనికి సరైన క్రమశిక్షణ లేదు. అతన్ని ఈ శిక్షణని వదిలిపెట్టి వెళ్లమని చెప్పడం మంచిది,' అన్నారు. మిగతా ఆశ్రమవాసులంతా ఈ విషయంలో జోక్యం చేసుకున్నారు. దాంతో సమస్య మరింత సంక్లిష్టమైపోయి స్వామీజీ కో–ఆర్డినేటర్‌నీ, విద్యార్థినీ పిలిచి, 'మీ ఇద్దరూ ఒకరితో ఒకరు సయోధ్యగా ఉండడం, సరిగా మాట్లాడుకోవడం నేర్చుకోవాలి,' అని చెప్పి పంపేశారు. వాళ్లిద్దరూ స్వామీజీ అసలు ప్రణాళిక ఇదీ అని అర్థం చేసుకోడానికి నెలలు పట్టింది. ఈ సీన్ చాలామందికి చాలాసార్లు జరిగింది. అన్ని సార్లూ అంతిమ ఫలితాలు వేర్వేరుగానూ విలక్షణంగానూ వచ్చాయి, చివరికి అంతా మంచే జరిగింది. కొన్నిసార్లు ఇలాంటి విషయాలు వాటంతట అవే బయటికి వచ్చేవి, మరి కొన్నిసార్లు నిరాశ, అయోమయంలో ముంచెత్తేవి.

నాకు కూడా ఆధ్యాత్మిక ప్రబోధం మీద అభిరుచి కలిగింది. 1980 లో గురుపౌర్ణమి తర్వాత కొద్ది రోజులు గడిచిన తర్వాత నేను కూడా తరగతులు తీసుకోవడం మొదలుపెట్టాను. స్వామీజీ సాధన గురించి మాట్లాడుతూ, 'మీలో లేని లక్షణాల్ని గానీ, మీకు లేని స్వరూపాన్ని గానీ ప్రదర్శించడానికి ప్రయత్నించవద్దు. ఆత్మ జ్ఞాన మార్గంలో అహంకారం ప్రధానమైన ఆటంకం!' అన్నారు. ఆ రోజు తెల్లవారుఝామున స్వామీజీ నన్ను తన రూమ్‌కి పిలిచి గత కొద్ది రోజులుగా రాసిన నా పి.హెచ్.డి రచనా వ్యాసంగంలోని భాగాన్ని చదవమని అడిగారు. 8.30 గంటలకి స్వామీజీ సెక్రెటరీ లోపలికి వచ్చింది. ఆమె స్వామీజీకి బయట ఏడుమంది విద్యార్థులు 7.30 గంటల నుంచి స్వామీజీ ఇచ్చే మంత్ర దీక్ష కోసం ఎదురు చూస్తున్నారని చెప్పింది. స్వామీజీ ఆమెతో మంత్ర దీక్షకి ఏర్పాట్లు చేసుకోమనీ, త్వరలోనే తాను వచ్చి మంత్ర దీక్ష ఇస్తాననీ చెప్పారు. ఆమె వెళ్లిపోయింది. స్వామీజీ మళ్లీ నేను చదువుతుంటే వినసాగారు. కొద్దిసేపు ఆయన నేను చదివిన విషయం మీద ఆలోచించారు. ఇంకాచదవాల్సిన పుస్తకాల్ని గురించి కూడా ప్రత్యేకమైన సూచనలు ఇచ్చారు. మిగతా విషయాన్ని ఎలా సేకరించాలో కూడా ఆయన సూచించారు. పది గంటల ప్రాంతంలో స్వామీజీ సెక్రెటరీ మళ్లీ వచ్చి, స్వామీజీతో జనం ఆయన రాక గురించి ఎదురుచూస్తున్నారని చెప్పింది. స్వామీజీ సమాధానమిస్తూ, 'ఆ, ఆ, నాకు తెలుసు. వాళ్లని కొంచెం వెయిట్ చేయమను. నేను వాళ్లని కలుస్తాను,' అన్నారు. ఆయన నాకు సూచనలు ఇస్తూనే ఉన్నారు.

పదకొండు గంటలకు ఆమె మళ్లీ వచ్చింది. 'స్వామీజీ! అయితే, వాళ్లని రేపు రమ్మని చెప్పనా?' అంది.

దానికి ఆయన హఠాత్తుగా లేచి, 'లేదు, లేదు! పండిట్‌జీ వచ్చి వాళ్లకి ఇప్పుడే దీక్ష ఇస్తారు!' అన్నారు. ఆయన నా వైపు చూపిస్తూ, 'పండిట్ జీ! వాళ్లకి దీక్ష మీరే ఇవ్వండి!' అని చెప్పి వెళ్లిపోయారు.

నాకు మంత్ర దీక్ష ఎలా ఇవ్వాలో తెలియదు. అసలు ఏ మంత్రం ఇవ్వాలో కూడా తెలియదు. అందువల్ల నేను స్వామీజీ చెప్పినట్టు చేయాలని భావించాను. కానీ ఆయన సూచనలేవీ ఇవ్వలేదు సరికదా, గట్టిగా అదిలిస్తూ, 'వెళ్లి వాళ్ల సంగతి చూసుకో. నేను చేయాల్సిన పని చాలా ఉంది. త్వరగా చేయి. ఇప్పుడు వంట నువ్వే చేయాలి,' అనేసి నడుచుకుంటూ వెళ్లిపోయారు అక్కడ నుంచి.

నేను నా గదిలోకి వెళ్లాను. నాకసలు ఏమీ అర్థం కావడం లేదు. అంతా అయోమయంగా ఉంది. అసలైతే స్వామీజీ నాకు సంప్రదాయ రీతిలో మంత్ర దీక్ష ఇవ్వాలి. అప్పుడే నేను వాళ్లకి ప్రత్యక్షంగా మంత్ర దీక్ష ఇవ్వడానికి వీలుపడుతుంది. లేకపోతే నాకు మంత్ర దీక్ష ఇచ్చే అర్హతే

లేనట్టు లెక్క. నాకు శాస్త్రగ్రంథాల్లో చెప్పబడినట్టు మంత్ర దీక్ష ఇచ్చే ప్రక్రియ గుర్తుంది. కానీ అది చాలా సుదీర్ఘమైనదీ, సంప్రదాయబద్ధంగా నడిచేదీ. గత నాలుగేళ్లుగా స్వామీజీ ఎప్పుడు మంత్ర దీక్ష ఇచ్చినా ఆ సంప్రదాయాన్ని పాటించలేదు నేను పరిశీలించినంత వరకూ. పైగా, ఎవరికైనా దీక్ష ఇవ్వాలంటే కొద్ది నిముషాల సమయమే పట్టేది ఆయనకు. నాకు ఏం చేయాలో తెలియలేదు. నేను చాలామంది గురువుల దగ్గర చాలా మంత్రాలు నేర్చుకున్నాను. కానీ నాకు వేటిల్లోనూ పూర్తిగా నమ్మకం కుదరలేదు. గ్రంథాల్లో ఉన్న వందలాది మంత్రాలు నాకు తెలుసు. కానీ అవన్నీ చాలా పెద్ద మంత్రాలు. అమెరికన్లు వాటిని పలకలేరు. పైగా స్వామీజీ బోధనల్లోనూ, గ్రంథాల్లోనూ ఒక విషయం స్పష్టంగా ఉంది. 'మీరు బోధించే విషయాల్నే చెప్పండి!' అని అంటారాయన. గ్రంథాల్లో ఉన్న మంత్రాల్లో కొన్నింటిని నేను పరమ రహస్యంగా సాధన చేస్తూ వచ్చాను. నేను వాటిని గురించి వాళ్లతో మాట్లాడకూడదు. కాబట్టి నేను సాధన చేసిన మంత్రాల్ని నేను దీక్ష ఇవ్వకూడదు. నేనిప్పుడు ఏం చేయాలి? ఏడుపొచ్చింది నాకు. కానీ స్వామీజీ నన్ను త్వరగా పూర్తి చేయమన్నారు కాబట్టి నేను సమయాన్ని వృథా చేసేందుకు కూడా లేదు.

నేను మంత్ర దీక్ష ఇచ్చే గదిలోకి వెళ్లాను. ఏం చేయాలో తెలియడం లేదు. అప్పుడు విద్యార్థులంతా ఒక్కొక్కరుగా వచ్చి నా ఎదుట ధ్యానముద్రలో కూర్చున్నారు. అప్పుడు నా హృదయం తెలియకుండానే అప్పటికప్పుడు ప్రార్థనానుభూతి పోటెత్తింది. 'ప్రభూ,' మునుపటి పరమ గురువులందరికీ నీవే గురువువి. నేనిప్పుడు ఏం చేయాలో నాకు తెలియదు. అయినా స్వామీజీ చెప్పారు కాబట్టి నేను ఏదో చేయాలని వచ్చాను. ఒక సాధకుడిగా నేను ఈ బాధ్యతని నెరవేర్చగలనో లేదో నాకు తెలియదు. కానీ నేను దీక్ష ఇవ్వగల గురువు స్థానంలో ఉండి మిగతా వారికి దీక్షనిస్తున్నాను. సమయం చాలా తక్కువగా ఉంది. నేను కనీసం ప్రార్థన కూడా చేయలేనంత తక్కువ సమయం! అందువల్ల, నువ్వు నన్ను ఒక శక్తిప్రవాహంగా మార్చి ఏ విద్యార్థికి ఏ మంత్రం అవసరమో అది నాతో ఇప్పించు. నువ్వే నన్ను రక్షించు. నేను మిథ్యా ప్రజ్ఞని ప్రదర్శించకుండా చూడు. ఇదంతా అయిపోతే నేను స్వామీజీని సరిగా దీక్ష ఇచ్చే విధానమేమిటో అడుగుతాను,' అని ప్రార్థించాను. ఇలా ప్రార్థించగానే నా మైండ్‌లో ఏ ఆలోచనా లేని శూన్య స్థితి ఆవరించింది. అకస్మాత్తుగా ఓ చిన్న పదం స్ఫురించింది. ఆ పదాన్ని నేను చాలా సార్లు పలికాను. ఆ వ్యక్తికి సరైన ఉచ్చారణ వచ్చే దాకా ఈ ప్రక్రియని నేను చాలా సార్లు పలికాను. ఏడు మందికీ మంత్రాలు చెప్పాను. ఆ తర్వాత వంట చేయడానికి పరిగెత్తాను.

వంట చేస్తూనే ఉన్నాను. మరో పక్క స్వామీజీకి నేనిచ్చిన మంత్రాల గురించి తెలియజేసి అవి సరిగానే ఉన్నాయో లేదో తెలుసుకోవాలని రిహార్సల్ వేసుకున్నాను. కానీ ఆయన మధ్యాహ్న భోజనానికి వచ్చే సమయానికే ఎన్నో వ్యవహారాల్లో తలమునకలుగా ఉన్నారు. ఆ సమయంలో ఈ దీక్షల గురించిన ప్రస్తావన తీసుకుని రావడం మంచిది కాదని భావించాను నేను. లంచ్ పూర్తి కాగానే, నేను వారిని దీక్షా విషయాల గురించి అడగబోతున్నాను. ఇంతలో ఆయనే, 'బేటా, నువ్వు నాకు ఒక టీ తయారు చేయగలవా?' అని అడిగారు. మళ్లీ నేను అడగాలనుకున్న విషయం పైకి రాలేదు.

తర్వాత 11 నెలలపాటు స్వామీజీ సాధకులకు ఇన్‌స్టిట్యూట్‌లో మంత్ర దీక్షలు ఇచ్చిన సందర్భాలు బాగా అరుదే. ప్రతిసారీ నేను ఎవరో ఒకరికి మంత్రం ఇచ్చేవాడిని. ప్రతిసారీ నేను అజ్ఞానిననీ, ఏం చేయాలో తెలియడం లేదనీ, మార్గదర్శకం చేయమనీ దైవాన్ని ప్రార్థించాల్సి వస్తోంది. స్వామీజీ నాకు మంత్ర దీక్ష ఇచ్చే విధానాన్ని తెలియజేయడం లేదని కష్టంగా ఉంది మనసుకి. ఆయన మహానుభావులని నాకు తెలుసు. కానీ నేను పోషించలేని పాత్ర ఇచ్చి పోషించమని బలవంతం చేస్తున్నారాయన. మళ్లీ 'హిపోక్రసీ ఆత్మ జ్ఞాన మార్గంలో అహంకారం ప్రధానమైన

ఆటంకం,' అని అనేదీ స్వామీజీయే. ఆయన మాటని త్రోసిపుచ్చితే నేను నా మార్గం నుంచి జారిపోయినట్టే. కానీ తెలియనిది తెలిసినట్టు ప్రవర్తిస్తే, అది నన్ను పథభ్రష్టణ్ణి చేస్తుంది. కొన్నిసార్లు నేను ఇన్‌స్టిట్యూట్ నుంచి పారిపోతే బాగుందునని ఆలోచించాను. దూరంగా ఉండి స్వామీజీపై నా భక్తిశ్రద్ధల్నీ, ప్రేమాభిమానాల్నీ చాటుకున్నట్టు అవుతుందని భావించాను. కానీ తటాలున మనసులో ఒక భావన మెరిసేది. 'లేదు, స్వామీజీకి తాను చేసేదేమిటో తెలుసు. నాకేమీ చెడు అభిప్రాయం లేదు. నేను మిగతా వాళ్లని తప్పు త్రోవ పట్టించడం లేదు. కాబట్టి నేను తెలియనిది తెలిసినట్టుగా నటించడం లేదు!' అనిపించింది. కానీ నా కోపం అలాగే ఉంది.

జూన్ 1981లో ఇన్‌స్టిట్యూట్ వార్షికోత్సవం జరిగింది న్యూయార్క్‌లో. చివరలో ఆహ్వానితులంతా వెళ్లిపోతుంటే స్వామీజీ హోటల్ లాబీ గుండా నడిచి వెడుతూ తిన్నగా బ్రూనెట్ ఈసన్ గదిలోకి వెళ్లారు. ఆమె చికాగో నుంచి వచ్చిన విద్యార్థి. అమెరికా వచ్చిన తొలినాళ్లలో స్వామీజీ వద్ద అధ్యయనం చేసిన విద్యార్థిని బ్రూనెట్. స్వామీజీ ఆమెను హోనెస్‌డేల్‌కి రమ్మన్నారు. ఈ సంప్రదాయంలో దీక్షనిచ్చి ప్రచారకురాలిగానూ, దీక్షప్రదాతగానూ చేయడానికి స్వామీజీ ఆమెను రమ్మన్నారు. బ్రూనెట్ చికాగోకి వెళ్లాల్సిన ఫ్లయిట్ టికెట్‌ని రద్దు చేసుకుని స్వామీజీ వద్దకు తిరిగి వచ్చింది. స్వామీజీ ఆమెను మర్నాడు ఏడు గంటలకు రమ్మన్నారు. బ్రూనెట్ స్వామీజీ గురించి లాబీలో ఐదు గంటలు నిరీక్షించింది. మధ్యాహ్నానికి ఆయన వచ్చారు. ఆమె భుజం మీద చేయి వేసి ప్రేమగా, 'బ్రూనెట్, నేను నీకు కనీసం యాభై, అరవై మంత్రాలు చెప్పాలని పండిట్‌జీకి పురమాయించాను. ఆయన నీకు ఆ మంత్రాలన్నీ రాసి ఇస్తారు. ఆ తర్వాత ఏం చేయాలో నేను నీకు చెప్తాను,' అన్నారు. అప్పుడు బ్రూనెట్ నా వైపు చూసి, 'స్వామీజీ మీరు నాకు యాభై, అరవై మంత్రాలు చెప్తారని చెప్పారు. ఆ మంత్రాలు మీరు నాకు ఎప్పుడు చెప్తారు?' అని అడిగింది.

నా మనసులో పొంగుకొస్తున్న ఆశ్చర్యం, విచారం దాచుకుంటూ, 'లంచ్ పూర్తి చేసుకుని చెప్తాను!' అన్నాను.

ఇది నా కోపాన్ని మరింత ఉధృతం చేసింది. 'నేను ఇందులో ఇతరుల్ని కూడా లాగుతున్నానే' అని బాధ కలిగింది. సరే బాగానే ఉంది! కనీసం ఇప్పుడైనా స్వామీజీకి అర్థమవుతుంది నేనేం చేస్తున్నానో!' అనుకున్నాను.

లంచ్ పూర్తయింది. నేను బ్రూనెట్‌ని స్వామీజీ కాన్ఫరెన్స్ రూంలోకి తీసుకుని వెళ్లి గత పదకొండు నెలలుగా నేను శిష్యులకు చెప్తున్న మంత్రాలన్నీ వరసబెట్టి రాయడం మొదలుపెట్టాను. ఈ సెషన్ మధ్యలో, నేను 'బాలా త్రిపుర' అనే ఒక మూడు బీజాక్షరాలతో కూడిన ప్రత్యేక మంత్రాన్ని కొంచెం మార్చి రాయసాగాను. ఈ మంత్రం పరమ రహస్యమైనది. ఇది రహస్యంగానే ఉండాలి. నేను ఆ మంత్రాన్ని ఎవరికీ ఉపదేశించలేదు. కానీ, 'ఈ మంత్రం అంత రహస్యంగా ఎందుకు ఉండాలి?' అని నాలో నేనే తర్కించుకున్నాను. చివరికి ఆ మంత్రాన్ని ఉపదేశిస్తూనే రహస్యంగా ఉంచాలని కూడా భావించాను. అందువల్ల ఆ మంత్రాన్ని మూడు భాగాలుగా చేసి, తిరిగి ప్రతి బీజాక్షరాన్నీ ఒక సంపూర్ణ మంత్రంగా రాశాను. అప్పుడు నేను ఒకటి–మూడు బీజాక్షరాలు, మూడు–ఒకటి బీజాక్షరాలు, రెండు–ఒకటి బీజాక్షరాలు, ఇలా కాంబినేషన్స్‌లో రాస్తున్నాను. చివరికి నేను మూడు బీజాక్షరాలకి సంబంధించిన సరైన వరుసక్రమాన్ని ఒక పరిపూర్ణమైన, స్వతంత్రమైన మంత్రంగా రాశాను. అప్పుడు నేనిచ్చిన ఇతర మంత్రాల్ని కూడా రాసి, వివరించసాగాను.

మా సెషన్ చివర్లో ఉండగా స్వామీజీ గదిలోకి వచ్చారు. నేను లేచి నిలబడి ఆయన చేతికి పేపర్ అందించాను. స్వామీజీ నా వైపు గానీ, పేపర్ వైపు గానీ చూడలేదు. ఆయన బ్రూనెట్‌తో మాట్లాడారు. ప్రశాంతంగా కూర్చుని మంత్రాల్ని చదవడం ప్రారంభించారు. మొదట

రాసిన కొన్ని మంత్రాల్ని చూసి, స్వామీజీ, 'అంతే, చాలా మంచి మంత్రాలు!' అన్నారు. ఆ తర్వాత బాలా త్రిపుర మంత్ర బీజాక్షరాల సంపుటిని నేను మార్చి రాసిన చోట పడింది ఆయన దృష్టి. స్వామీజీ అక్కడ చాలాసార్లు అడ్డగీతలు గీశారు. నా వైపు ఓరగా చూస్తూ, 'మంత్రాలతో ఆడుకోకు!' అన్నారు. నా మనసులో భారం దిగింది. నేను ఈ మంత్రాల్ని గత పదకొండు నెలలుగా అందరికీ చెప్తున్నాను. కానీ నేను రాసిన ఈ మంత్రాల మూలం గురించి నేను ఎప్పటికప్పుడు లోపల్లోపల తర్కించుకుంటూనే ఉన్నాను. అసలు వీటికి ఆధ్యాత్మిక ఆధారం ఉందా?

ఆ రాత్రి 10:30 కి నేను స్వామీజీ గదిలోకి వెళ్లాను. 'పండిట్‌జీ, నేను నీకు ఎప్పుడైనా ఆ గ్రంథాల్ని చూపించానా?' అని అడిగారు స్వామీజీ.

'ఏ గ్రంథాలు స్వామీ?' నేనడిగాను ఆశ్చర్యపోతూ.

'అవే, నేను టిబెట్‌లో మా పరమగురువు గారి దగ్గర నుంచి తెచ్చినవి,' అన్నారాయన.

నేను చూపించలేదన్నట్టు తల అడ్డంగా తిప్పాను. అప్పుడు ఆయన సెక్రెటరీని ఆ గ్రంథాల్ని తెమ్మని చెప్పారు. ఆమె ఒక కట్ట తీసుకొచ్చి స్వామీజీ చేతికిచ్చింది. బియ్యం పొట్లం కట్టిన కట్టలా ఉందది. ఆయన ఆ బండిల్‌ని నా చేతికిచ్చి విప్పమన్నారు. ఆ కట్ట ఒక ఎరుపు వస్త్రంలో చుట్టబడి ఉంది. నేను దాన్ని జాగ్రత్తగా తెరిచాను. లోపల రెండు అట్టల మధ్య దీర్ఘచతురస్రాకారంలో కొన్ని కాగితాలు విడివిడిగా కనిపించాయి. పై అట్ట మీద దళసరిగా గంధం పూత పూసి ఉంది. ఈ గ్రంథాన్ని ఎవరో చాలా పవిత్రంగా పూజించి ఉంటారని అర్థమవుతోంది నాకు.

ఎక్కడ నుంచి మొదలుపెట్టాలో తెలియక, నేను పైనున్న కొన్ని కాగితాలు అందుకుని ప్రక్కకి తీసి జాగ్రత్తగా చూడసాగాను. నా కళ్లని నేనే నమ్మలేకపోయాను: కొద్ది గంటల క్రితం నేను బ్రూనెట్‌కి రాసిచ్చిన మంత్రాలన్నీ అందులో ఉన్నాయి. పైగా అదే క్రమంలో. బాలా త్రిపుర మంత్రం బీజాక్షరాలు కూడా అందులో ఉన్నాయి. అక్కడ కూడా అచ్చం స్వామీజీ నేను రాసిన పేపరు మీద అడ్డగీతలు గీసినట్టే గీసి ఉన్నాయి. నేను సంభ్రమాశ్చర్యాలు, భయభక్తులు ముంచెత్తుతుండగా దివ్య ప్రపంచంలో తలమునకలై ఉన్నాను. స్వామీజీ నా వైపు చూసి, 'అయితే నేను నీకు ఏమీ చెప్పకుండానే ఉన్నానంటావా?' అన్నారు.

అప్రయత్నంగా నా నోటి వెంట, 'నన్ను క్షమించండి, స్వామీజీ! నా పసితనాన్ని మన్నించండి, నేనెంత మిమ్మల్ని అర్థం చేసుకోవడానికి! నేను వీటిలో చాలా మంత్రాల్ని సాధన చేశాను. కానీ వీటిలో నా గురుమంత్రం ఏదో నేను తెలుసుకోలేకపోతున్నాను,' అన్నాను. కానీ నేను ఆ మాట చెప్పడంతోనే మెరుపులా నా మనసులో ఒక మంత్రం మెరిసింది. అదే నా గురుమంత్రం అని నాకు అర్థమైంది. నేను స్వామీజీతో ఆ మాట చెప్పబోతున్నాను. ఇంతలో స్వామీజీ, 'అవును, అదే నీ గురు మంత్రం!' అన్నారు. ఆ తర్వాత నన్ను ఆయన టిల్క్ తయారు చేయమన్నారు.

స్వామీజీ టీ సేవిస్తుంటే, ఈ మంత్ర దీక్షల గురించి నేను అడగదల్చిన ప్రశ్నలన్నీ అడగవచ్చునని అనిపించింది. నిజానికి సాధనలోని మార్మిక అంశాల గురించి ఆయన నాతో చెప్పే అవకాశాన్ని ఈ విధంగా తీసుకున్నారనీ, భగవంతుని కృప–స్వీయ ప్రయత్నం పాత్ర గురించి అప్పుడు చెప్తారనీ నాకు అనిపించింది. నేను వారితో అప్పుడు, 'స్వామీజీ, ఇలాంటి విషయాలు ఎలా సంభవిస్తాయో నాకు చాలా నా ఊహకి అందడం లేదు' అన్నాను.

'భగవత్కృప నిరంతరం వర్షిస్తూనే ఉంటుంది. కానీ సాధారణంగా ప్రజల మనసుల్లోనే రంధ్రాలుంటాయి,' అన్నారు స్వామీజీ. 'వర్షిస్తున్న ఆ భగవత్కృపని నీవు ఎలా నిలుపుకోగలవు?'

భయం, సందేహం, అసహ్యం, కోపం, దురాశ, కోరిక, సంగభావనలనే రంధ్రాల్ని పూడ్చడం ఆధ్యాత్మిక సాధనలో ఓ అంతర్భాగం. నీ పని నువ్వు పూర్తి శ్రద్ధతో చేసి, ఆ తర్వాత నువ్వు నిజంగా అలిసిపోయి ఉంటే, అప్పుడు నువ్వు నిస్సహాయతతో ఏడవాలి. అనాయాసంగా వెలువడే ఆ ఏడుపే నీ అంతరంగం నుంచి వెలువడే అత్యున్నతమైన ప్రార్థన. అది దివ్య ప్రవాహ మార్గాన్ని తెరుస్తుంది. అది ఉన్మత్త స్థితికి దారి తీస్తుంది. ఈ ఉన్మత్త స్థితే భగవత్కృప. ఆ కృపని మీరు మీ విశ్వసనీయమైన శ్రద్ధాపూర్వకమైన ప్రయత్నాలతో అందుకోగలుగుతారు.

'ఆత్మ జ్ఞానం ఎవరంతట వారికి అనుభూతిపరంగా లభించేది. అది దైవ కృప వల్లనే సాధ్యపడుతుంది. భగవంతుని కృప ఉండాలి. స్వీయ ప్రయత్నాలు మానుకోవాలి. సాధనలోని తొలి స్థితుల్లో అది చాలా పెద్ద తప్పు అవుతుంది. భగవత్కృప ఒక వర్షం లాంటిది. ఏవో కొన్ని ప్రాంతాలకే పరిమితం కాకుండా అది అంతటా వర్షిస్తుంది. అది న్యాయం మీదా, అన్యాయం మీదా కూడా ఒకేలా వర్షిస్తుంది. అది వర్షించినా మంచి నేల కాకపోతేనో, నీటిని నిలుపుకునే నేల కాకపోతేనో అది బంజరు భూమిగానే ఉంటుంది. కానీ అదే వర్షం సారవంతమైన నేలమీద పడినపుడు, ఆ నేలని సరిగా దున్ని మడిగా చేసి విత్తనం నాటితే అది మొలకెత్తుతుంది, మొక్క ఎదుగుతుంది. మనం పూర్తిగా సిద్ధమైనపుడు మాత్రమే మనం ఏ విషయాన్నైనా అందుకోగలం, మనలో సమ్మిళితం చేసుకోగలం. ఆ భగవత్కృప వల్ల ప్రయోజనం పొందగలం.

'భగవత్కృప మన హృదయంలో చాలా మార్మికమైన రీతిలో వెలుగొందుతుంది. అది సంభవించినపుడు మనం సంభ్రమాశ్చర్యాలకు లోనవుతాం. మనం ఆశ్చర్యకరమైన స్థితిలోకి వెళ్తాం. మనం అందుకునే భయం, సందేహం మొదలైన భావాల నుంచి విముక్తి భగవత్కృప వల్లనే సాధ్యపడుతుంది. ఆ తర్వాత, దిగులు, భయం మొదలైనవన్నీ ఐపూ మచ్చా లేకుండా పోతాయి. దీనినే గ్రంథాలు 'అమరత్వం' అని పిలిచాయి,' అని చెప్పారు.

ఇన్‌స్టిట్యూట్‌లో కార్యక్రమాలు ప్రతి సంవత్సరం ఊపందుకుంటున్నాయి. 1981 కల్లా కంబైన్డ్ థెరపీ డిపార్ట్‌మెంట్ పూర్తి స్థాయిలో పని చేయడం మొదలుపెట్టింది. అందులో ప్రాచ్య అధ్యయన విభాగంలో గ్రాడ్యుయేట్-లెవల్ ప్రోగ్రామ్‌ని కూడా ప్రారంభించారు. బోధనా సిబ్బంది సంఖ్య, రెసిడెంట్స్ సంఖ్య పెరగసాగాయి. ఒరిజినల్ రెసిడెంట్స్ చాలా మంది వివాహితులే. వారికి పిల్లలు కూడా ఉన్నారు. కాబట్టి వారి కోసం ఇన్‌స్టిట్యూట్ మాంటిసోరీ స్కూలుని క్యాంపస్‌లోనే ప్రారంభించింది. ఇదంతా జరుగుతుండగా 1981 వేసవిలో ఒక వింత నాటకం వెలుగు చూసింది.

బోర్డు మెంబర్స్‌లో ఒక వ్యక్తి చాలా సంపన్న వ్యక్తి. ఆయన ఇన్‌స్టిట్యూట్‌కి చాలా డబ్బు దానం చేశారు. ఆయన, ఆయన కుటుంబం క్యాంపస్‌లో ఉండేవారు కాదు, కానీ వారి ఇల్లు దగ్గరలోనే ఉంది. ఆయన స్వామీజీకి చాలా సన్నిహితంగా మెలిగేవారు. డెబ్భై దశకం మధ్యలో ఇన్‌స్టిట్యూట్‌కి వారు ఎక్కువగా రాకపోకలు సాగించారు. ఈయనకు ఆధ్యాత్మిక ఆకాంక్ష చాలా ఎక్కువ, కానీ ఆయన చాలా అహంకారి. ఆయనకి ఉన్న స్థితిగతుల వల్లా, సంపన్నత వల్లా. పైగా ఆయన స్వామీజీకి చాలా సన్నిహితంగా మెలుగుతూ ఉండడం, ఇన్‌స్టిట్యూట్‌కి ఉదారంగా సాయం చేస్తుండడం వల్లా జనం ఆయన్ని భరించేవారు. స్వామీజీ అతనిలో మార్పు తీసుకుని రావడానికి చాలా ప్రయత్నించారు గానీ ఏమాత్రం మార్పులేదు. అతడి అహంకారం మహా ప్రచండమైనది.

ఆ వేసవిలో ఆయన కూతురు అనారోగ్యం పాలైంది. ఆయన, ఆయన భార్య ఇన్‌స్టిట్యూట్ క్లినిక్‌కి రావడానికి అపాయింట్‌మెంట్ తీసుకున్నారు. కానీ అపాయింట్‌మెంట్ రోజున ఆ అమ్మాయి రాలేదు. అప్పుడు ఆ డాక్టరు ఆ వ్యక్తి ఇంటికి వెళ్లారు ఆమెను పరీక్షించడానికి. అయితే ఆయన ఆ డాక్టరుని నోటికి వచ్చినట్టల్లా మాట్లాడాడు. గట్టిగా అరుస్తూ, తన కూతురుని చూడడానికి అతడే

ఇంటికి రావాలి తప్ప, ఆమె హాస్పిటల్‌కి వచ్చి డాక్టరు అపాయింట్‌మెంట్ కోసం ఎదురుచూసేలా చేయకూడదంటూ అరిచాడు. అతడు డాక్టరుగానూ, మనిషిగానూ కూడా పని చేయడని అరిచాడు. ఆ డాక్టరు పాపం, చేసేది లేక తన మనసులో భావాలు వ్యక్తం చేయకుండా ఎలాగో ఉగ్గబట్టుకున్నాడు. అతడు తిరిగి వస్తుంటే కొద్ది నిముషాల్లో స్వామీజీ ఆయన దారికి ఎదురొచ్చారు. స్వామీజీ అతడిని, 'ఏమైంది నాయనా?' అని అడిగారు.

'ఏం లేదు స్వామీజీ!' అని బదులిచ్చాడు ఆ డాక్టరు. కానీ అతడి ముఖం వేరే భావాల్ని ప్రదర్శిస్తోంది. స్వామీజీ అతడిని చేయి పట్టుకుని తన గదిలోకి నడిపించారు. ఆయన డాక్టరు నోటి వెంట విషయమంతా విన్న తర్వాత స్వామీజీ డా. బాలెంటైన్‌ని పిలిచి, మళ్లీ ఆ సంపన్నుడు క్యాంపస్‌లో అడుగుపెట్టకుండా చూడమని చెప్పారు. ఈ గొడవలు జరుగుతుండగా ఆశ్రమవాసుల్లో చాలామంది స్వామీజీనీ, ఆశ్రమాన్నీ వదిలి వెళ్లిపోయారు. ఇన్‌స్టిట్యూట్ నేరారోపణలకీ, కోర్టు వాదాలకీ ఆలవాలంగా మారింది.

ఇదంతా చూస్తూ నేను చాలా ఆశ్చర్యపోయాను. నిజంగానే స్వామీజీ అంత కఠినంగా వ్యవహరించడం అవసరమా అని! దాన్ని కొంచెం చాతుర్యంగా, నైపుణ్యంగా నిర్వహించి ఉండవచ్చునేమో అనుకున్నాను నేను. జరిగిన సంఘటనల మీద దృష్టి పెట్టే కంటే అవి నేర్పే పాఠాల మీద దృష్టి పెట్టడం మంచిదని అనుకున్నాను. కానీ సుదీర్ఘమైన ఆలోచన తర్వాత, ఈ భావన కూడా నా నుంచి తప్పుకుంది. ఎన్నో నెలల తర్వాత కూడా ఆ సంఘటన నా సమయాన్నీ, శక్తినీ, డబ్బునీ తినేస్తోంది. చాలామంది ఆ సంఘటన గురించి ఇంకా మాట్లాడుకుంటూనే ఉన్నారు. సరే, ఒకరోజు స్వామీజీతో మాట్లాడుతూ నా మనసులో ఉన్న సందేహాన్ని బయటపెట్టాను.

దానికి స్వామీజీ, 'ఆయన నా శిష్యుడు. నేను ఆయన్ని క్రమశిక్షణలో పెట్టలేకపోతే, ఎవరు పెడతారు? ఒక గురువు భయపడీ లేదా ఆకర్షణకి లోబడీ తన బాధ్యతని విస్మరించరాదు. ఇది హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్. ఇది ఒక ఆశ్రమం. ఇక్కడ అందరూ శాంతిగా సామరస్యంగా ఉండాలి. ప్రేమ, క్రమశిక్షణ ఈ ఆశ్రమానికి మూలం. నేను గొప్ప అనే ఆధిపత్య భావన, స్వీయ ప్రాముఖ్యతా భావన శాంతిని నాశనం చేస్తుంది. ప్రతి ఒక్క భావనకీ సమయం ఉంది. ప్రజలు జన్మిస్తారు, మరణిస్తారు. నువ్వు దివ్య ప్రణాళికని అర్థం చేసుకుంటే, ఎదురవుతున్న ఒక పరిస్థితిలో నీ పాత్ర ఏమిటో నువ్వు అర్థం చేసుకోగలిగితే ఆ నాటకంలో నీ పాత్ర రక్తి కడుతుంది. నీకు అర్థం కాకపోతే, ఏ విషయంలోనూ నువ్వు జోక్యం చేసుకోకుండా దూరం నుంచి చూడు. 'నువ్వు జాగ్రత్తగా దృష్టి సారిస్తే, ఈ రకమైన నాటకం నుంచి ఏమైనా నేర్చుకోగలుగుతావు. చూశావా? ప్రజలు ఆధ్యాత్మిక గురువు వద్దకు ఊరికే రారు, ఏ ప్రయోజనం లేకుండా ఆధ్యాత్మిక కారణాల మీదే ఆధ్యాత్మిక సంస్థల్లో అడుగుపెట్టరు. వాళ్లకి మొదట్లో ఆధ్యాత్మిక కారణమేదైనా ఉన్నా, కొంతమంది వాళ్లకి ఉన్న దివ్య దృష్టిని కోల్పోతారు త్వరలోనే. అలాంటివాళ్లే ఆశ్రమాన్ని కలుషితం చేస్తారు.

'ఆశ్రమం' అంటే, 'పరిపూర్ణమైన విశ్రాంతి. ఆశ్రమ వాతావరణం, నీ శరీరం, మనసు, ఆత్మకి సంబంధించి పరిపూర్ణమైన విశ్రాంతిని కలుగజేసేందుకు నువ్వు ఎంచుకున్న సాధనా పద్ధతులు నీకు నిజమైన శాంతిని కలుగజేయాలి. 'ఆశ్రమం' అందరితోనూ కలుపుగోలుగా ఉండేందుకు అనువైన ప్రదేశం కాదు. ఇక్కడ ధార్మిక, మతపరమైన విషయాలపై చర్చలు జరిపే ప్రదేశమూ కాదు. అసలు రాజకీయాలకి ఇక్కడ తావే లేదు. స్వీయ క్రమశిక్షణ, స్వీయ విశ్లేషణ, ఆశ్రమ జీవితానికి పునాది. నువ్వు ఆశ్రమానికి నేర్చుకోవడానికి రావచ్చు. సాధన చేయడానికి రావచ్చు. ఆ తర్వాత మళ్లీ నీ విశాల ప్రపంచంలోకి వెళ్లు. ఆ పరిస్థితులతో నీకు పరీక్ష పెట్టుకో.

నీ ఆధ్యాత్మిక పథంలో నువ్వెంత ప్రగతి సాధించావో నీకు అర్థం అవుతుంది. లేదూ, నువ్వు నిజంగానే శాశ్వతమైన ఆశ్రమవాసివి కావాలంటే, నిన్ను ఆ తాపాగ్ని గుండా నడిపించే బాధ్యత నీ బోధకుడి కర్తవ్యం. ఆ తాపాన్ని తట్టుకోగలిగినవారు ధన్యులు. తర్వాత కాలంలో వారే ఈ లోకానికి వెలుగుని ఇవ్వగలిగినవారు. ఏ ఆశ్రమంలోనైనా ఒక సద్గురువు గానీ, ఉత్సాహమూ, చురుకూ లేకుండా ఉన్న విద్యార్థులు గానీ ఉంటే అది మామూలు సంస్థలాంటిదే తప్ప ఆశ్రమం ఎలా అవుతుంది?' అంటూ నా మనసులోని సంశయాన్ని నిర్మూలించారు.

అధ్యాయం 11

# జ్యోతిపథం-ప్రకాశం

1981లో స్వామీజీ ఆరోగ్యం దెబ్బతింది. శారీరిక బలం తగ్గిపోయింది. వైద్య పరీక్షలు స్వామీజీకి అంతర్గత రక్తస్రావం జరుగుతోందని తెలిపినప్పటికీ దానికి కారణం ఫలానా అని వైద్యులు గుర్తించలేకపోయారు. స్వామీజీ తాను ఈ ప్రపంచంలోకి వచ్చిన పని అయిపోతోందనీ తన శాశ్వత నివాస స్థానమైన హిమాలయ గుహలలోకి వెళ్లిపోవాలని కొంతమందితో అంటూ ఉండేవారు. ఆయన అప్పుడు తాను నడుపుతున్న సంస్థలో పరిపాలనా విభాగంలో మార్పులు చేస్తూ డా. బాలెంటైన్‌ని ప్రధాన నిర్వాహకుడిగా నియమించారు. సంస్థకి సంబంధించి అన్ని నిర్వహణా బాధ్యతల్నీ, ఆముష్మిక కార్యక్రమ నిర్వహణలనూ అతనికి స్వామీజీ అప్పగించారు. ఆ మరుసటి రోజే పాశ్చాత్య దేశాలకు వీడ్కోలు పలికి ఇండియా వచ్చేశారు. మునుపు పదకొండు నెలల ఆధ్యాత్మిక సాధన సలిపిన మనాలీ గుహలలోకే వెళ్లిపోయారు. ఇక్కడ నుంచే స్వామీజీ గతంలో అమెరికాకి వచ్చారు. ఒక్క వారంలోనే స్వామీజీ ఆరోగ్యం యథాస్థితికి వచ్చింది. పెన్సిల్వేనియా నగరంలోని తన ఆధ్యాత్మిక సంస్థ వంటిదే భారతదేశంలో కూడా ఒకటి నెలకొల్పాలని స్వామీజీ సంకల్పించారు.

స్వామీజీ 'మనాలీ' నుండి 'ఛెయిల్' వరకు ప్రయాణం చేసి ఆ ప్రదేశంలోనే ఉండి తన కార్యక్రమానికి ఒక రూపకల్పన చేశారు. మహారాజా ప్యాలెస్ హోటల్‌లో ఐదు నెలలపాటు మకాం ఉన్నారు. ఇంతకు ముందు ఈ ప్రదేశం పాటియాలా మహారాజు గారి వేసవి విడిదిగా ఉండేది. స్వామీజీ ఈ ప్రదేశంలోనే 'భగవద్గీత'కి వ్యాఖ్యానం వ్రాశారు. విరామ సమయాల్లో డా. ఎస్.ఎన్.అగ్నిహోత్రితో కలిసి టేబుల్ టెన్నిస్ ఆడేవారు. చాలా దూరం కలిసి నడిచేవారు. ఇంకా ప్రశాంతత కోసం ధ్యానం చేసేవారు. స్వామీజీకి అగ్నిహోత్రి చిరకాల మిత్రుడూ, శిష్యుడు కూడా. వీరిద్దరూ ఇదే హోటల్‌లోని పెద్ద సూట్ తీసుకుని ఉండేవారు. అది నిజానికి, హనీమూన్‌కి వచ్చే యువదంపతుల నిమిత్తం సిద్ధపరచబడిన విశాలమైన సూట్. అందులో స్వామీజీ, అగ్నిహోత్రి ఐదు నెలలపాటు మకాం ఉండేసరికి వారికి 'స్పిర్చ్యువల్ హనీమూనర్స్' అనే పేరు వచ్చింది. ఈ లక్జరీ హోటల్‌కి వచ్చే యువజంటలకు ఈ విషయం ఎప్పుడూ వింతగా తోచేది.

ఇక్కడ నుండే స్వామీజీ, హోనెస్‌డేల్‌లోని తన ప్రధాన కార్యాలయానికి ఒక సందేశం పంపారు. భారతదేశంలోని వేద సంస్కృతి, నాగరికతపై అధ్యయనం చేసే నిమిత్తంగా ఒక సంస్థని నెలకొల్పదలిచారన్నది దాని సారాంశం. భారతదేశం అనేక శతాబ్దాల కాలంలో వివిధ కారణాల వల్ల నలుగుడు పడి తన ప్రధానమైన, వారసత్వంగా సంక్రమించిన సంస్కృతి,

సంప్రదాయాలను, నాగరికతా విలువలనూ నిలుపుకోలేక, పాశ్చాత్య దేశాలను అనుకరించడం మొదలుపెట్టింది. ప్రస్తుతం మన భారతదేశంలోని విద్యా విధానం రెండు వందల సంవత్సరాల క్రితంది. కొన్ని విద్యా సంస్థలైతే గుమాస్తాలనూ, టీచర్లనూ తయారు చేసేవిగా మాత్రమే ఉన్నాయి. మన దేశం మహాజ్ఞానులకు పుట్టినిల్లు, ప్రపంచానికి నాగరికతను నేర్పిన దేశం. ఆ విలువలను ప్రతిబింబించేలా, మన భారతీయ విద్యా విధానంలో పెనుమార్పులు రావాలి. ఇక్కడ మరో సమస్య కూడా ఉంది. ఆధునికీకరణ కోసం తీసే పరుగులో, పాశ్చాత్య దేశాలు స్వయంగా వదిలించుకుంటున్న అనారోగ్యకరమైన అంశాలను అర్బన్ ఇండియా ఆసక్తికరంగా దిగుమతి చేసుకోవడం మొదలుపెట్టింది. పాశ్చాత్య సంస్కృతి, నాగరికతలో విలువైన అంశాలను వాటిలో ఉన్న హానికరమైన అంశాల నుంచి వేరు చేయడంలో భారతదేశం విఫలమైంది.

అందువల్ల, భారతదేశ మేధోవర్గం విపరీతమైన భౌతికవాద ప్రవృత్తితో కలుషితం కాక ముందే, ఆధ్యాత్మిక, సామాజిక, కుటుంబపరమైన విలువలు విచ్ఛిన్నం కాక ముందే, ఒత్తిడి సంక్రామక స్థాయికి చేరక మునుపే, ఈ ధోరణిని ఆద్యంతం మార్చడానికి తగిన పద్ధతులు, సాధనాలని సిద్ధం చేసుకోవాల్సిన అవసరం, అంతరంగంలోనూ, బాహ్యంగానూ కూడా శాంతి సౌహార్ద్రాలు తిరిగి నెలకొల్పాల్సిన అవసరం ఎంతగానో ఉందని స్వామీజీ అన్నారు. ఇంకా ఆయన తూర్పు, పశ్చిమార్ధ గోళాల్ని సమన్వయం చేయడానికి ప్రాచ్య, పాశ్చాత్య సంస్కృతుల గొప్ప అనుసంధానం జరగాలని ఆయన అభిప్రాయపడ్డారు. కాబట్టి ఆయన డా.బాలెంటైన్, డా.క్లార్క్, వారితో బాటు నన్నూ కో-ఆర్డినేటర్లుగా నియమించి వైదిక సంప్రదాయంలోని అన్ని దృక్పథాలనూ క్రోడీకరిస్తూ ఒక ప్రాజెక్ట్‌ని రూపకల్పన చేయమనీ, వైదిక సంస్కృతి ఆవిర్భవించిన భూమిలో ఆ జ్ఞానాన్ని విస్తరింపజేయమనీ కోరారు. ఈ సందేశం హానెస్‌డేల్‌లో ఆనందం, ఉత్సాహం పొంగులువారాయి. ఎందుకంటే స్వామీజీ మళ్లీ ఆరోగ్యం పుంజుకుంటున్నారు, మళ్లీ ఆయన చురుగ్గా, ఉత్సాహంగా పని చేస్తున్నారు. ఆయన తన మిషన్‌ని నిర్వహించేందుకు ఇన్‌స్టిట్యూట్ సాయపడుతుందని బలంగా విశ్వసిస్తున్నారు. పంజాబ్, హరియాణా రాష్ట్రాల్లో ప్రభుత్వాధికారులు ఈ ప్రాజెక్ట్‌పై చాలా ఆసక్తి చూపించారు. ఢిల్లీ దగ్గర హరియాణాలో రెండు వందల ఎకరాల భూమిని ఇన్‌స్టిట్యూట్ కోసం గ్రాంట్ చేసే వాతావరణం ఏర్పడింది. కొద్ది నెలల కాలంలో మరో రాజకీయ పార్టీ అధికారంలోకి వచ్చింది, దానితో ప్రాజెక్ట్‌కి ప్రభుత్వ మద్దతు నిలిచిపోయింది. ఇంతలో, చాలాకాలంగా స్వామీజీ శిష్యులుగా ఉన్న నేపాల్ రాచ కుటుంబీకులు, ఈ ప్రాజెక్ట్‌ని తమ దేశంలో ప్రారంభించమని కోరారు. నేపాల్ బాబాజీకి అత్యంత ప్రీతికరమైన ప్రదేశాల్లో ఒకటి. స్వామీజీ యువకులుగా ఉన్నపుడు తన గురువుగారితో నేపాల్‌లోని నామ్చా బజార్‌లోనూ, ముక్తినాథ్ మందిరంలోనూ ఉండేవారు. కాబట్టి ఆయనకు ఈ పర్వత ప్రాంత దేశంతో ప్రత్యేకమైన సాన్నిహిత్యమూ, అనురక్తీ ఉన్నాయి.

కాబట్టి 1982లో ఇన్‌స్టిట్యూట్‌కి తిరిగి వచ్చే ముందు స్వామీజీ నేపాల్ సందర్శించారు. మంచు శకలాలతో కూడిన హిమాలయ పర్వతాల అద్భుతమైన దృశ్యం ఆయన మనసుని ఆకట్టుకుంది. చిన్నతనంలో ఆయన బాబాజీతో కలిసి పర్వతారోహణ చేస్తుంటే, గౌరీశంకర శిఖరం వైపు చూపిస్తూ, 'నేను ఈ శరీరంతో లేనపుడు ఇవే నిన్ను తల్లిదండ్రుల్లా అక్కున చేర్చుకుంటాయి!' అన్నారు. ఆ ప్రాంతంలోని గ్రామస్తులు స్వామీజీకి అవసరమైనంత భూమిని అమ్మడానికి అంగీకరించారు. అందువల్ల ఆయన ఖాట్మండూ సరిహద్దుల్లో ఉన్న బనేపా అనే గ్రామంలో హన్సదా ఆశ్రమాన్ని నెలకొల్పారు.

అందరూ తమ దేశంలో ప్రాచ్య సంస్కృతి, నాగరికతకి చెందిన వివిధ రకాల దృక్పథాల్ని అధ్యయనం చేసేందుకు ప్రపంచం నలుమూలల నుంచీ వచ్చేందుకు వీలు కల్పించే ఇన్‌స్టిట్యూట్

నెలకొల్పబడుతుందని చాలా ఉత్సాహంగా ఉన్నారు. స్వామీజీ అమెరికా వదిలే ముందు తను లేని సమయంలో నిర్మాణం, ల్యాండ్‌స్కేపింగ్ పర్యవేక్షణకు భరత్ గురంగ్ సారథ్యంలో ఒక టీమ్‌ని ఏర్పాటు చేశారు. భరత్ గురంగ్ అద్భుతంగా పని చేశారు. స్వామీజీ వేసవి చివరిలో నేపాల్‌కి తిరిగి వచ్చేసరికి అక్కడ కొన్ని బిల్డింగ్స్ నిర్మాణం జరిగిపోయింది. ఎలక్ట్రిసిటీ పని పూర్తయింది. ఆశ్రమానికి వెళ్లేందుకు మంచి రోడ్డు ఏర్పాటు చేయబడింది.

హానెస్‌డేల్‌లో ఆ వేసవిలో స్వామీజీ తీరికలేని పనిలో ఉన్నారు. ఇన్‌స్టిట్యూట్‌లో ఉన్నవారు ప్రాజెక్ట్‌లు, ల్యాండ్‌స్కేపింగ్స్ నిర్మాణంలో మునిగిపోయారు. ఆయన చాలా తక్కువ ఉపన్యాసాలు ఇచ్చారు. సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం వరకు ఇన్‌స్టిట్యూట్ రెసిడెంట్స్‌తో కలిసి మొక్కలు, చెట్లని కట్ చేస్తూ, చెత్తని తగలబెడుతూ, దారిలో రాళ్లనీ, పొట్టి మొక్కల్నీ, క్రిందపడిన ఎండు కొమ్మలూ ఆకుల్నీ తొలగించి దార్లనీ, లాన్స్‌నీ, గార్డెన్స్‌నీ శుభ్రం చేస్తూ, స్వామీజీ బయటే తిరుగుతుండేవారు. వాళ్లు మొక్కల్ని నాటేవారు, పూలతోటలు పెంచేవారు, లాన్ గడ్డిని పెంచేవారు. ఆ సంవత్సరం స్వామీజీ గ్లోవ్స్ వేసుకుని 'రాక్స్ అండ్ రూట్స్' బ్రిగేడ్‌లో పాలుపంచుకునేవారు. ఇన్‌స్టిట్యూట్‌కి వచ్చిన అతిథులు, రెసిడెంట్స్ అందరూ ఆయనతో ఆరుబయట నెగడు అంటించి మౌంటెన్ బ్రెడ్ కాలుస్తుంటే తలో చెయ్యీ వేసి సాయం చేసేవారు. కొన్ని సార్లు ఆయన బంగాళదుంపలు రోస్ట్ చేసేవారు, 'భర్తా' అనే ప్రత్యేకమైన డిష్‌ని తయారుచేసేవారు.

ఇదంతా జరుగుతుండగా స్వామీజీ చుట్టూ పిల్లలు మూగేవాళ్లు. ఆయన్ని ఆకట్టుకోవడానికి చితుకులు తెచ్చి ఆ నెగడులో వేసి కాల్చేవారు. ఇసుక పొరల్లోంచి పట్టుకున్న నీరుడుములు (బల్లి జాతికి చెందిన రంగురంగుల జీవి), కప్పలు, బోదురుకప్పల్నీ ఆయనకి చూపించేవారు. ఎక్కడ పడితే అక్కడ విషపూరితమైన సతతహరిత మొక్కలు, విషపూరితమైన ఓక్ వృక్షాలూ ఉండేవి. స్వామీజీ అందర్నీ గ్లోవ్స్ వేసుకోమని హెచ్చరించేవారు. అయినా కానీ వేసవి చివరి రోజుల్లో ఏదో ఒక సమయంలో అందరికీ దద్దుర్లు వచ్చేశాయి. కానీ పని జరుగుతూనే ఉంది. రాత్రి పూట్ల స్వామీజీ 'పథం ఎంపిక' పుస్తకం మీద పని జరుగుతోంది. ఓ పక్కన స్టూడెంట్స్‌కి సలహాలు ఇస్తున్నారు, మరో పక్క నేపాలీయులతో సుదీర్ఘమైన టెలిఫోన్ సంభాషణలు జరుగుతున్నాయి.

1982 వేసవి నుంచి 1984 వేసవి మధ్య కాలంలో అమెరికా, నేపాల్ దేశాల్లో నిర్మాణ కార్యకలాపాలు జరిగాయి. స్వామీజీ ఎక్కువ సమయం అమెరికా, నేపాల్ దేశాల్లోనే గడుపుతున్నారు. ఎన్నో కమ్యూనిటీ ప్రాజెక్ట్‌లు హన్సదా ఆశ్రమంలో మొదలయ్యాయి. స్వామీజీ ఉదారంగా వ్యాలీలో ఒక చిన్న స్కూల్‌లో టీచర్లని ఏర్పాటు చేసి పిల్లలు సరైన విద్యావకాశాల్ని వినియోగించుకునేలా చేశారు. స్వామీజీ ఒక డిస్పెన్సరీ మొదలుపెట్టారు. కాన్పూర్ నుంచి డా. ఎ.పి. సింగ్, అమెరికా నుంచి లారీ జెవియర్ డిస్పెన్సరీ నిర్వహణా బాధ్యతల్ని చూస్తున్నారు. వాళ్లు సుమారు రోజుకి పన్నెండు గంటలు పనిచేస్తూ రెండు వందలమంది పేషెంట్లకి సేవ చేశారు. హన్సదా స్వామీజీకి అప్పుడప్పుడూ వెళ్లి వచ్చే స్వంత ఇల్లులా ఉండేది. ప్రపంచం నలుమూలల నుంచీ నేపాల్‌కి స్వామీజీని చూడడానికి ఎందరో శిష్యులు వస్తుండేవారు. ఇన్‌స్టిట్యూట్ హన్సదాలో చేరేందుకు 'స్ప్రింగ్', 'ఫాల్' గ్రూప్స్‌ని తీసుకోవడం ప్రారంభించింది. స్వామీజీ ఖాట్మండూలో ఉన్న యాక్ అండ్ యతీ హోటల్‌లో మార్చి 1984లో ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్ ఆన్ యోగా అండ్ హోలిస్టిక్ హెల్త్ ఏర్పాటు చేశారు. కానీ కాన్ఫరెన్స్ మొదలుకాక ముందే స్వామీజీ మనసుని గాయపరిచే ఒక సంఘటన జరిగింది.

మార్చి తొలిరోజుల్లో హన్సదా ఆశ్రమంలో మూడు బిల్డింగులు పూర్తి అయ్యాయి. అక్కడ తేలిగ్గా ఇరవైమంది అతిథులకి వసతి కల్పించవచ్చు. ఒకరోజు ఉదయం స్వామీజీ తన గది బయటికి వచ్చి ఆశ్రమంలో ఒక కొస వరకూ మామూలుగా నడక సాగిస్తూ గ్రామం వైపు చురుగ్గా దృష్టి సారించారు. ఆ ఉదయమంతా ఆయన అక్కడిదాకా ఎక్కువసార్లు వచ్చి వెళ్లారు. ఏదో విషాదం ఆయన ముఖం మీద తాండవిస్తోంది. కారణం ఏమిటో తెలియదు. కానీ మధ్యాహ్నం అవుతూ ఉండగా ఒక వార్త వచ్చింది, 'ఆ గ్రామంలో చాలామందిని ఆ ఉదయం హత్య చేశారు!' ఆ మాట చెప్పిన వ్యక్తి, 'బ్రతికి ఉన్నవారు భయాందోళనల్లో గజగజలాడుతున్నారు, సామూహిక రోదనలు, వెక్కిళ్లు ఆ వాతావరణమంతా వ్యాపించాయి' అని చెప్తుంటే స్వామీజీ దీర్ఘంగా నిట్టూర్చారు. 'మనలాంటి వాళ్లకి ఇది సరైన చోటు కాదు. భగవంతుడా, ఇంత దారుణమా! మనం ఇక్కడ నుంచి మే 15 నాటికి ఖాళీ చేసి వెళ్లిపోవాలి!'

కాన్ఫరెన్స్ జరుగుతున్న సమయంలోనే అకస్మాత్తుగా స్వామీజీ నేపాల్ విడిచి పెట్టి వెళ్లిపోవాలనే నిర్ణయం ప్రకటించారు. అందరూ దిగులు పడ్డారు. కారణం ఏమిటని అడగ్గా, 'నేను ఇంత క్రూరత్వం సహించలేను,' అన్నారు. అయితే నిర్మాణం, ల్యాండ్‌స్కేపింగ్ కార్యక్రమాలు ఊపందుకున్నాయి. స్వామీజీ చాలా కష్టపడి పని చేస్తున్నారు. స్వామీజీ అంత ప్రేమతో అంత కష్టపడి పని చేస్తున్నారు కాబట్టి, ఆయనకు ఆశ్రమం విడిచిపెట్టి వెళ్లే ఆలోచన లేదని అనుకున్నారు చూసేవాళ్లు. ఇన్‌స్టిట్యూట్ ప్రధాన కార్యాలయం నుంచి గ్రాస్ సీడ్ పంపమని అడిగారు. ఇంతలో సెవెంటీ పౌండ్స్ వచ్చింది, దానిని నాటడం జరిగింది. ఒక వారం తర్వాత స్వామీజీ, 'ఈ లాన్ పెరగడానికి చాలా సమయం పడుతుంది. మనకి అంత సమయం లేదు. మనకి పచ్చిక దొరుకుతుందా?' అని అడిగారు. నేపాల్‌లో పచ్చికతో లాన్ తయారుచేసే పద్ధతి అప్పటికి తెలియదు. కానీ స్వామీజీ వెనక్కి తగ్గలేదు. చూసేవాళ్లకి అదో పిచ్చి ప్లాన్‌లా కనిపించింది. కానీ ఆయన హోనెస్‌డేల్ నుంచి వస్తున్న తన స్టూడెంట్స్‌కి తమ సూట్‌కేస్‌ల్లో సాడ్ (పచ్చిక) నింపుకుని రమ్మని ఆదేశించారు. ఖాట్మండూ ఎయిర్‌పోర్టులో ఈ పెద్ద పెద్ద సూట్‌కేసులు తెరిచి చూస్తే మట్టి, పచ్చిక కనిపించాయి. ఇలాంటి వ్యవహారం వాళ్లు అంతకు ముందెన్నడూ చూడలేదు. కానీ చాలామందికి స్వామీజీ, హన్సదా ఆశ్రమం తెలుసు. అందువల్ల వాళ్లు ఈ వింత సామాగ్రి దేశంలోకి రావడానికి అనుమతించారు.

పని కొనసాగుతోంది. మే 14 వచ్చింది. ఇంకా అప్పటికీ ఆశ్రమం మూసేస్తారనే సూచన ఏమీ కనిపించడం లేదు. స్వామీజీ గడ్డి పెంచుతున్నారు, దగ్గరలో నడుస్తున్న డిస్పెన్సరీ, స్కూల్లో ఉన్న జనానికి సూచనలు ఇస్తున్నారు. ఆ మధ్యాహ్నం స్వామీజీ, 'అయితే ఈరోజు తేదీ ఏమిటి?' అని చాలాసార్లు అడిగారు ఆరోజు. 'అంటే మనం ఈరోజే కదా ఈ చోటు వదిలివెళ్లాలని అనుకున్నది?' అంటున్నారు. మళ్లీ ఆయన, 'మనం పని మొదలుపెట్టాక పూర్తి కానిదే వెళ్లలేము. లాన్‌కి నీరు పోయాలి, కొంత కలుపు కూడా తీయాలి,' అన్నారు. ఆ తర్వాత పూల మొక్కల వైపు చూస్తూ, 'ఇప్పుడిప్పుడే అంకురిస్తున్నాయి మొక్కలు,' అంటూ, 'కనీసం నేను వెళ్లే ముందు మీరు ఓ చిరునవ్వైనా నవ్వరా?' అనేవారు. మర్నాడు ఉదయం మా కిరణ్ వదిన స్వామీజీకి సపర్యలు చేయడానికి వచ్చి, ఆయన గదిలోకి వెళ్లి, 'మోర్నింగ్ టీ త్రాగడానికి సిద్ధంగా ఉన్నారా?' అని అడిగింది. ఆయన, 'త్రాగుతాను,' అన్నారు. అలా అన్నాక, 'ఆగు. ఈరోజు ఏ తేదీ? పదిహేను కదా, అవునా? నేను వెళ్లాల్సి ఉంది. నేనిప్పుడు టీ త్రాగడం ఎలా కుదురుతుంది?' అన్నారు.

'స్వామీజీ, దయచేసి టీ త్రాగండి. ఆ తర్వాత వెళ్లిపోవడం గురించి కూడా ఆలోచించండి!' అని ప్రాధేయపడింది కిరణ్. ఆయన అంగీకరించి టీ త్రాగారు. కానీ ఆయన

కప్పు ఖాళీ చేసి క్రింద పెట్టిన ఉత్తర క్షణంలో తన బ్యాగ్ పుచ్చుకుని గది బయటికి నడిచారు. ఆశ్రమంలో ఉన్న తన స్టూడెంట్స్‌కి తీరిక దొరకగానే సామాన్లు ప్యాక్ చేసుకుని వచ్చి యాక్ అండ్ యేటి హోటల్‌లో ఉన్న తనని కలవమని చెప్పి వెళ్లిపోయారు. ఆయన పూదోట మీదుగా నడుస్తుంటే, విరబూసిన పూల మొక్కల్ని చూసి ఆయన వాటిని నిమిరుతూ ప్రేమగా ఏదో మాట్లాడారు, ఏదో పసిపాపలతో మాట్లాడినట్టు. అవి ఆయన్ని చూసి తలలు ఊగిస్తూ ప్రేమగా వీడ్కోలు పలికాయి. 'ఇంత అందమైన చిరునవ్వుతో సాగనంపుతున్నందుకు ధన్యవాదాలు,' అన్నారాయన.

'ఎప్పుడూ సంతోషంగా ఉండండి, మట్టిలో కలిసిపోయే వేళ కూడా ఇలాగే నవ్వుతూ ఉండాలి!' అన్నారు.

స్వామీజీ ఈ వీడ్కోలు గురించి డా. అగ్నిహోత్రి తన ఉత్తరంలో నాకు ఈ విధంగా వ్రాశారు, 'స్వామీజీ హన్సదా ఆశ్రమం నుంచి వెళ్లడం చూస్తుంటే, నాకు శ్రీరామచంద్రమూర్తి తన తండ్రి రాజభవనం నుంచి అడవులకు బయల్దేరుతున్న దృశ్యం తలపుకి వచ్చింది. ఆయన తిరిగి వెనక్కి ఒక్కసారి కూడా చూడలేదు. ఆ తర్వాత స్వామీజీ ఆ ఆశ్రమం గురించి చాలా తక్కువగా మాట్లాడారు. కానీ వైదిక సంస్కృతి, నాగరికత గురించి ఒక ఇన్‌స్టిట్యూట్ నెలకొల్పాలన్న ఆలోచన మాత్రం ఆయన మనసులో నిరంతరం మెదులుతూనే ఉంది.

హన్సదా నుంచి వెళ్లిన తర్వాత, స్వామీజీ స్టేట్స్‌కి వెళ్లిపోయారు. హన్స్‌డేల్‌లో ఆశ్రమవాసులు చాలా ఆనందించారు. కానీ వాళ్ల సంతోషం అవధులకి లోబడే ఉంది. కారణం, ఆయన అలాంటి అందమైన ప్రదేశాన్ని విడిచి పెట్టారు. ఆశ్రమాన్ని నిర్మించడానికి అంత సమయం, అంత శక్తీ ఎందుకు వెచ్చిస్తున్నారనే విషయమే అందరికీ చాలా ఆశ్చర్యంగా ఉంది. ఆయనకు తెలియదా ఏం జరుగుతుందో? ఎవరికీ ఆయన్ని అడిగే ధైర్యం లేదు. కానీ ఒకరోజు ఉపన్యాసం చెప్తుంటే, వెనకా ముందూ ఏమీ చెప్పకుండా, స్వామీజీ, 'తమ చర్యల ఫలితాల్ని విజయంతో ముడిపెట్టుకునేది కేవలం అజ్ఞానులే. కృష్ణుడు ఒక గొప్ప యోధుడు. ఆయన చతురుడు. భూత, భవిష్యత్, వర్తమాన కాలాల్ని తెలిసినవాడు. తన రాజధాని నగరం మీద దండెత్తిన శత్రువుతో ఆయన పదహారు సార్లు పోరాడాడు. పదిహేడవసారి కృష్ణుడు తన రాజధాని విడిచి పారిపోయాడు. ప్రజలు ఆయన్ని పిరికివాడని అన్నారు. కానీ ఆయన అసలు రాజధాని నగరాన్ని విడిచిపెట్టాకే, నలు వైపుల నుంచీ సముద్రంతో ఆవరించబడి సురక్షితంగా ఉన్న ఒక దీవిలో ద్వారక పేరుతో కొత్త రాజధాని నగరాన్ని నిర్మించగలిగాడు. అక్కడికి నివాసం మార్చిన తర్వాతే ఆయన తన ప్రశాంతంగా, సంతోషంగా జీవించగలిగాడు.'

ఇది విన్న తర్వాత, నేను స్వామీజీ తన ప్రాజెక్ట్‌ని ఇంకా భారీ ఎత్తున ఎక్కడో మొదలుపెడతారని అనుకున్నాను.

1985 శీతాకాలంలో స్వామీజీ భారతదేశానికి వచ్చారు. అక్కడ ఆయన నన్నూ, నా భార్యనీ, నా మూడేళ్ల కుమారుడు ఇషాన్‌నీ కలిశారు. మమ్మల్ని వీలైనంత త్వరగా తన మిషన్‌లో జాయిన్ అవాలని చెప్పారు. ఆయన మధ్య ప్రదేశ్‌లోని టికమ్ గఢ్‌లో ఉన్నారు. ఆయన అక్కడ ఎందుకున్నారో, ఆయన అక్కడ ఏం చేయదల్చుకున్నారో నాకేమీ తెలియదు. కానీ మేం ఢిల్లీ వెళ్లి అక్కడ నుంచి ఖజురాహోకి వెళ్లాము. అక్కడ నుంచి టికమ్ గఢ్‌కి చేరేసరికి రాత్రి భోజనం వేళైంది. స్వామీజీ మొత్తం గెస్ట్‌హౌస్ అంత బుక్ చేయించి ఉంచారు. అక్కడ ముప్ఫై, నలభై మంది దాకా ఉన్నారు. అంతటా వేడుక, సందడీ నెలకొని ఉంది. స్వామీజీ సాధువుగా ఆయన ధరించే కాషాయ వస్త్రాల్లో కాకుండా సిల్క్ షర్టు, పైజమాలో ఉన్నారు. మమ్మల్ని చూసి స్వామీజీ చిరునవ్వు నవ్వి త్వరగా తెమిలి భోజనానికి రమ్మన్నారు. కానీ మేము డైనింగ్ రూంకి వెళ్లి చూస్తే,

స్వామీజీ ఇంకా భోజనం చేయకుండా కూర్చున్నారు. నాకు చాలా అసౌకర్యంగా అనిపించింది. ఆయన తినక ముందే మేం తినడానికి ఇబ్బంది పడుతూ, మేం ఆయన ప్లేట్‌ని తీసుకుని వస్తామని చెప్పాము. కానీ స్వామీజీ 'వద్దు, ముందు మీరు భోజనం చేయండి,' అని చెప్పారు ఆనందంగా.

మర్నాడు అతిథులంతా డైనింగ్ రూంలో సమావేశమై ఉన్న సమయంలో కూడా స్వామీజీ ఎక్కడా తిన్న జాడ కనబడలేదు. అందుకే మేం ఆయన దగ్గరకి వెళ్లాం. మీరా (నా భార్య) స్వామీజీకి భోజనం తెచ్చిపెడతానని చెప్పింది. కానీ స్వామీజీ వద్దని చెప్పి, ఆమెను తినేయమని చెప్పారు. కానీ ఆమె స్వామీజీ తింటే తప్ప తను తిననని లంకె పెట్టుకుంది. అప్పుడు స్వామీజీ నావైపు చూసి, చిరునవ్వుతో, 'ఈ అల్లరిపిల్లతో నువ్వు కొంచెం మాట్లాడతావా?' అన్నారు. అసలు విషయమేమిటో నాకే అర్థం కానపుడు, ఇక నేను వివరించాల్సింది ఏముందని అడిగాను. అప్పుడు స్వామీజీ, 'మీరా! నువ్వు వెళ్లమ్మా. నేను పండిట్‌జీని తర్వాత పంపుతాను,' అన్నారు. తను వెళ్లిపోయిన తర్వాత, 'నేనిక్కడ భోజనం చేయలేను. ఎందుకంటే ఈ ప్రదేశమూ, ఈ జనమూ ఈ శరీరంతో అనుసంధానమై ఉన్నారు,' అన్నారు, తనకేసి చూపించుకుంటూ.

నేను చాలా ఆశ్చర్యపోయాను. 'స్వామీజీ, మీరు ఈ ప్రదేశంతో చేయాల్సిన పనేముంది? మీరు గఢ్‌వాల్ హిమాలయాల్లో జన్మించారు, మధ్యభారతదేశంలో కాదు గదా,' అని అడిగాను ఆశ్చర్యంగా.

'మోహిత్ ఎంగేజ్‌మెంట్. మా గురుదేవులకి నేను మాటిచ్చాను. వీడి పెళ్లికి వచ్చి తండ్రిగా నా పాత్ర నేను పోషిస్తానని! కానీ సన్యాసి అయిన తర్వాత నాకు కుటుంబంతోనూ, బంధువులతోనూ సాంగత్యం ఉండదనే విషయం వాడికి అర్థం కావడం లేదు. నేను మోహిత్‌కి ఇది చెప్పలేను. నా గురుదేవులు ఈ మాట చెప్పవద్దని ఆజ్ఞాపించారు. అందువల్ల నాలో మోహిత్ కేవలం తండ్రిని మాత్రమే చూస్తున్నాడు. కానీ, నేను సన్యాసి ధర్మాన్ని పాటించాలి. ఇక్కడ జరిగే వేడుకంతా పూర్వాశ్రమానికి సంబంధించినదే. కానీ నాకు భిక్షగా వేస్తే తప్ప నేను ఈ ప్రదేశానికి సంబంధించినది ఏదీ తీసుకోను, భోజనంతో సహా!' అన్నారు.

నాకు ఓ ఉపాయం తట్టింది. మేము మూడేళ్ల పిల్లవాడితో ప్రయాణం చేస్తున్నాం కదా, అందుకే మేం హోనెస్‌డేల్ నుంచి గ్రనోలా, డ్రైడ్ మిల్క్, డ్రైఫ్రూట్స్, జీడిపప్పు లాంటి చాలా ఐటెమ్స్ మాతో తెచ్చుకున్నాం. కనీసం ఆ ఆహారం తీసుకున్నా బాగానే ఉంటుందని అన్నాను. ఆయన, 'నువ్వు నన్ను రక్షించావు. మీరా ఎక్కడుంటే అక్కడ ఆహారానికి లోపం ఉండదు,' అన్నారు. ఆ తర్వాతి మూడు రోజులూ ఎంగేజ్‌మెంట్ హడావిడి కొనసాగింది. స్వామీజీ కేవలం గ్రనోలా, డ్రైఫ్రూట్స్, బాదాం పప్పు, డ్రైడ్ మిల్క్, జీడిపప్పు వంటి వాటి మీదే కాలక్షేపం చేశారు.

అది వివాహ వేడుక కాకపోయినా మేం టికమ్ గఢ్‌లో ఉన్నపుడు స్వామీజీలో ఒక కోణం గమనించాను. నేను దీన్ని మరో విధంగా అయితే ఎన్నటికీ చూసి ఉండను. రెండు ప్రపంచాల మధ్యా స్వామీజీ ఎంత చక్కగా సంతులన నిర్వహించారు! ఇటు భౌతిక ప్రపంచం, అటు ఆధ్యాత్మిక ప్రపంచం! టూ-పీస్ సూట్, రా సిల్క్ షర్టులో స్వామీజీ ప్రాపంచిక విషయాల్లో ఎంతో చురుగ్గా ఉన్నట్టూ, ఎంతో ఆసక్తి ఉన్నట్టూ మాట్లాడుతూ కనిపించారు. సరదాగా జోక్స్ వేస్తూ, బహుమతులు ఇచ్చి పుచ్చుకుంటూ, కుటుంబ విషయాలు చర్చిస్తూ ఉండేవారు. మరోవైపు, ఆయన విడిగా ఆనంద ప్రతాప్ సింగ్ జీ (ఆయనతో ఢిల్లీ నుంచి కలిసి వచ్చిన వ్యక్తి) తోనూ, నాతోనూ ఉన్నపుడు ఆయన హృదయం వారి గురుదేవుల స్మృతులతో ఉబ్బితబ్బిబ్బయ్యేది.

ఎంగేజ్‌మెంట్‌కి సంబంధించిన వేడుక అంతా ముగిసిన తర్వాత మేము స్వామీజీతో ఖజురాహో వరకూ వెళ్లాము. టికమ్ గఢ్‌కి అది వంద కిలోమీటర్ల దూరంలో ఉంది. ఖజురాహోలో మనసుని ఉత్తేజపరిచే ఎన్నో శృంగార భంగిమలు చెక్కబడిన శిల్పాలతో కూడిన ప్రాచీన దేవాలయాల

సముదాయం ఉంది. మేము అక్కడికి వెళ్లేసరికి మధ్యాహ్నమైంది. స్వామీజీ చాలా రోజులుగా సరైన భోజనం చేయలేదు. అందువల్ల మేము నేరుగా మధ్యాహ్న భోజనం చేయడానికి ఒబెరాయ్ హోటల్‌కి వెళ్లాము. అక్కడ మేము భోజనం చేస్తుంటే, ఖజురాహోలో తమ గురుదేవులతో ఉన్న రోజుల్లో ఎంత ఆహ్లాదభరితంగా గడిపారో స్వామీజీ వివరిస్తున్నారు. కానీ వారి ఆనందానుభూతుల్ని మేము సరిగా అందుకోలేకపోవడం చూసి, 'అరవైనాలుగు యోగినుల దేవాలయం నాకు అమ్మఒడిలాంటిది. నాకు ఏడేళ్ల వయసు ఉన్నపుడు నా మనసులో పడ్డ తొలి ముద్ర అది. లంచ్ పూర్తి చేసిన తర్వాత నేను అమ్మ దగ్గరికి తీసుకుని వెళ్తాను నిన్ను!' అన్నారు.

లంచ్ అయ్యాక ఆయన మాతో హోటల్ లాబీలో కూర్చుని తమ గురుదేవులతో తన బాల్యంలో గడిపిన ముచ్చట్లు చెప్తున్నారు. 'నా చిన్నతనంలో బాగా అల్లరిగా ఉండేవాడిని. ఏమీ ఆలోచించేవాడిని కాదు. కొన్నిసార్లు నేను సూప్‌లో గులకరాళ్లు వేసేవాడిని. వృద్ధ సాధువుల పంటి క్రిందకి అవి వెళ్లినపుడు ఏం చేస్తారో చూసి లోపల్లోపల వినోదించడానికే అలా చేసేవాడిని! మా గురువుగారి జుట్టు పట్టుకు లాగేవాడిని, కళ్లు మూసుకుని కూర్చుంటే, బలవంతంగా నా వేళ్లతో ఆయన కనురెప్పలు తెరిచి చూసేవాడిని. ఒకరోజు నేను చేసే అల్లరికి మా గురువుగారికి బాగా కోపం వచ్చింది. నేను చెప్తున్నాను కదా, ఆయన నాతో బాగా విసిగిపోయారు. ఆయన అరవైనాలుగు యోగినుల దేవాలయంలో అమ్మవారి ఎదుట నిలబడి నామీద ఫిర్యాదు చేశారు! ఉన్మత్తునిలా ఆయన అమ్మవారి మీద, 'నేనేం పాపం చేశానని వీడి అల్లరిని నేను భరించాల్సి వస్తోంది? వీడు చేసే ఆగడాలకి నేను మిగతా సాధువులందరికీ క్షమాపణ చెప్పుకోవాల్సి వస్తోందే!' గట్టిగా అరిచారు.

'ఆయన నన్ను గాల్లో పైకెత్తారు. మళ్లీ ఆ తల్లి మీద కేకలేస్తూ, 'చూడమ్మా, వీడికి ఎలా ప్రవర్తించాలో నేర్పనన్నా నేర్పు, లేదా తీసుకుపో!' అని బిగ్గరగా అరిచారు!' అన్నారు. అప్పుడు 'మా గురూజీ నన్ను అమ్మవారి విగ్రహం ఎదుట పడేస్తుంటే, ఆ తల్లి దివ్యమంగళ స్వరూపంతో గొప్ప కాంతితో ప్రత్యక్షమై నన్ను ఒడిలోకి తీసుకుంది. కొద్దిసేపటి తర్వాత గురూజీ వైపు చూసి చిరునవ్వు నవ్వుతూ, 'ఇక నుంచి వీడు బుద్ధిగా ఉంటాడు,' అని చెప్పింది. నేను అమ్మ దగ్గరకి తీసికెళ్తాను. ఆమె నా మాతృమూర్తి,' అన్నారు స్వామీజీ. అప్పుడు ఆయన బయటికి వెళ్లి హోటల్ బయట కూర్చుని దేవాలయం వైపు చూడసాగారు. వారిని చూస్తుంటే, ఆయన ఆత్మ అప్పటికే అక్కడికి వెళ్లిపోయిందనీ, కేవలం అక్కడ శరీరం మాత్రమే ఉందనీ అర్థమవుతోంది.

మేం కారులో కూర్చుని బయల్దేరాం. కానీ రోడ్డు నిర్మాణంలో ఉండడం వల్ల మూతపడింది. అప్పటికే 2:30 అయింది. ఢిల్లీకి వెళ్లే మా ఫ్లయిట్ నాలుగు గంటలకి ఉంది. ఆలయం వరకు నడిచి వెళ్లి మళ్లీ తిరిగివచ్చి ఫ్లయిట్ అందుకోవడం చాలా కష్టం. అందువల్ల స్వామీజీ, 'ఏం ఫర్వాలేదులే. ఏదో ఒకరోజు నేను నీకు చూపిస్తాను అమ్మని!' అన్నారు.

మూడు రోజుల తర్వాత నేను న్యూఢిల్లీలోని ఇండియా ఇంటర్నేషనల్‌లో స్వామీజీతో బాటు ఉన్నాను. అవకాశం దొరికినపుడు స్వామీజీని, 'స్వామీజీ! నన్ను ఎప్పుడు తీసికెళ్తారు అమ్మ దగ్గరకి?' అని అడిగాను.

స్వామీజీ మృదువుగా, 'నేను తీసికెళ్తాను అక్కడికి!' అన్నారు.

'స్వామీజీ! మనం ఆ అమ్మని చూస్తే, మీరు ఆమెగా మారిపోతారని గ్రంథాలు చెప్తున్నాయి కదా! ఆమెకీ, మీకూ తేడా ఉండదని చెప్తున్నాయి కదా. మమ్మల్ని అక్కడికి తీసికెళ్లకుండా కూడా మీరు మాకు అమ్మ దర్శనం ఇక్కడే ఇప్పించకూడదా?' అని అడిగాను నేను.

దీనికి స్వామీజీ ముఖంలో మార్పు వచ్చింది. 'నేనెప్పుడూ ఆ అమ్మతోనే ఉన్నాను. నేను బాహ్య ప్రపంచంలో నిమగ్నమై ఆ రకంగా ఆ తల్లి గురించిన స్పృహలో లేనప్పుడు కూడా ఆమె

నాతోనే ఉంది. రేపు ఉదయం నేను అమ్మని చూపిస్తాను,' అన్నారు. అప్పుడు ఆయన ఆనంద ప్రతాప్ సింగ్‌జీని పిలిచి, తాను మర్నాటి ఉదయం వారి ఇంటికి రాబోతున్నట్టు చెప్పారు. ఒక గదిని తమ కోసం బాగా శుభ్రపరిచి ఉంచాల్సిందిగా చెప్పారు.

మర్నాటి ఉదయం స్వామీజీ రోషన్ లాల్ కనోడియా, ఉషర్‌బుధ్ ఆర్య అనే ఇద్దరు స్టూడెంట్స్‌ని పిలిచారు. వాళ్లనీ, నన్నూ స్నానం చేసి శుభ్రమైన దుస్తులు వేసుకుని రావాలనీ శ్రీ సింగ్ ఇంటికి రావాలనీ చెప్పారు. మేము అక్కడికి వెళ్లేసరికి సింగ్‌జీ స్వాగతించి మమ్మల్ని స్వామీజీ కూర్చున్న చోటికి తీసికెళ్లారు. దయ, కరకుదనం ధ్వనిస్తున్న స్వరంతో ఆయన మమ్మల్ని ఏం కావాలంటూ అడిగారు. మేము 'మీ దయ, ఆశీస్సులు కావాలి!' అన్నాము. స్వామీజీ, 'మరీ భావుకతకి లోను కాకండి. నా దయ, ఆశీస్సులు ఏం చేసుకుంటారు? మీ జీవితంలో మీకు ఉపయోగపడేది ఏదైనా అడగండి!' అన్నారు. అప్పుడు స్వామీజీ క్లయిర్‌వాయిన్స్, మైండ్ రీడింగ్, భవిష్యత్తు తెలుసుకోవడం, ఆస్ట్రల్ ట్రావెల్ (కామయానం లేదా కోరుకున్న చోటికి వెళ్లడం), శివ బలి (ఒకానొక ప్రత్యేక ధ్యానం జరుగుతుండగా దేవత ప్రత్యక్షమై సాధకుడిచ్చే నైవేద్యం తీసుకుంటుంది) సిద్ధుల గురించి వివరించడం మొదలుపెట్టారు. ఆ తర్వాత ఆయన వాటిని రాయమని చెప్పారు. ఆ తర్వాత ఆయన మా అందరి వైపూ చూస్తూ, 'వీటిలో ఏ సిద్ధి గురించి అయినా అడగండి. ఒకటి లేదా రెండు సిద్ధులతో మీరు చాలా గొప్పవాళ్లవుతారు. మీరు చాలా డబ్బు సంపాదించవచ్చు, చాలామంది మీ వెంట తిరుగుతుంటారు, మీకు చాలా పేరు ప్రతిష్ఠలు వస్తాయి. అప్పుడు మీరు జీవితంలో చాలా చాలా మంచి పనులు చేయగలుగుతారు. మీరు మా గురువుగారు నాకు అప్పగించిన బాధ్యతని నెరవేర్చగలుగుతారు కాబట్టి నేను కూడా ఫ్రీ అయిపోతాను,' అన్నారు.

మాకు నోటి వెంట మాట రాలేదు. మేము ఈ ఆఫర్‌ని అంగీకరించలేదు. ఇలా చాలా నిముషాలు గడిచాయి. స్వామీజీ మాకు అసాధారణమైన బహుమానాల్ని ఇస్తామని చెప్పారు, ఆయన ఇస్తానంటున్న సిద్ధుల్ని వద్దంటున్నందుకు మమ్మల్ని కేకలేశారు. చివరికి ఆయన మమ్మల్ని ఆ గది నాలుగు మూలల్లో ఏదో ఒక మూల నించోమన్నారు. ఆయన స్వయంగా గుమ్మం దగ్గర నిలబడ్డారు. ఆయన హిందీలో మాట్లాడుతూ, 'నీ ఖజానాకి నేను కాపలాదారుని. ఈ పిల్లలకి నీవు ఏం బహుమానం ప్రసాదిస్తావో, అది ప్రసాదించు!' అన్నారు. దీనితో మేము చురుగ్గా తలుపుతట్టిన శబ్దం వినిపించింది. పరిచి ఉన్న ఒక ఎర్ర బట్ట గది మధ్యలోకి వచ్చింది. 'ఏం వచ్చిందో చూడండి!' అన్నారు స్వామీజీ. కానీ మాలో ఎవరికీ ఒక్కడుగు కూడా ముందుకేసే ధైర్యంగానీ, దాని దగ్గరకి వెళ్లి అదేమిటో తీసి చూసే సాహసం గానీ లేవు. స్వామీజీ గది మధ్యలో నడుస్తూ నేను ఆ వస్తువుని పట్టుకోవాలనీ, దాన్ని అన్ని వైపుల నుంచీ చూడాలనీ ఆజ్ఞాపించారు. నేను అలాగే చేశాను. అదేదో ఒక రకమైన యంత్రమని చెప్పాను. దానికి స్వామీజీ, తమ గురుదేవులతో హాస్యం ధ్వనించే స్వరంతో, 'ఇది న్యాయం కాదు. నేను వేరే ఏదో కోరితే మీరు క్యాండీలు, జిలేబీ ఇచ్చారు. వాళ్లు మిమ్మల్ని అడిగితే మాత్రం మీరు సాక్షాత్తూ దేవతని తీసుకొచ్చారు. నిజమేలెండి. మీకు మీ పిల్లల కంటే మనమల మీదే ఎక్కువ ప్రీతి!' అన్నారు.

యంత్రాన్ని చేతిలోకి తీసుకుని మాతో మాట్లాడుతున్నారు స్వామీజీ. 'గుహలో ఏం జరుగుతోందో మీకు తెలుసా? అక్కడ ఉండాల్సిన యంత్రం ఇది. ఇక్కడికి వచ్చింది. అక్కడ ఉంటున్న సాధువులు నా పట్ల చాలా కోపంగా ఉంటారు. నేను తప్ప ఈ యంత్రాన్ని అక్కడ నుంచి తీసుకురాగలిగేవారు ఎవరూ ఉండరని వారికి తెలుసు. ఇది చాలా ప్రత్యేకమైన శ్రీ యంత్రం. ఎవరికి కావాలి ఇది?' అని అడిగారాయన.

మేమంతా నిశ్శబ్దంగా ఉన్నాం. అప్పుడు స్వామీజీ, 'ఆనంద్! మీరు రాజకీయాల్లో చాలా వ్యస్తతగా గడుపుతారు. మీరు దాని గురించి శ్రద్ధ తీసుకోలేరు. ఉషర్‌బుధ్, నువ్వు ఎక్కువగా ప్రయాణాలు చేస్తుంటావు!' అని నా వైపు చూసి, 'నీకు సంప్రదాయాల్లో పెద్దగా ఆసక్తి లేదు, కానీ ఒక భౌతిక రూపంలో కనిపించే ఆకృతులకి పూజ, ఆరాధన అవసరం. రోషన్, నువ్వు ఉంచు దీన్ని!' అంటూ యంత్రాన్ని రోషన్‌లాల్‌కి ఇచ్చారు స్వామీజీ.

నేను స్వామీజీతో భారతదేశంలో నాలుగు నెలలపాటు ఉండిపోయాను. నేను వారిని అవకాశం దొరికినప్పుడల్లా ఆ యంత్రం ఎక్కడ నుంచి వచ్చిందనీ, దాన్ని చూసిన తర్వాత నేనేం చేయాలని ఆయన భావించారో చెప్పమనీ అడిగేవాడిని. సాధారణంగా ఆయన మౌనంగా ఉండేవారు. కానీ ఆయన ఒకసారి ఇలా వివరించారు, 'అది మా ప్రాచీన గుహ నుంచి వచ్చింది.' మరోసారి అన్నారు, 'మా గురుదేవులు దాన్ని తమ జటలో పెట్టుకుని సంచరించేవారు.' ఇంకోసారి, 'అది ఎక్కడ నుంచి వస్తే ఏమిటి? నువ్వు సత్యాన్ని సత్యంగా అర్థం చేసుకోవడానికి అదెక్కడ నుంచి వచ్చినా ఒకటే, కాదంటావా?' అన్నారు.

'ఆ యంత్రాన్ని చూడగానే నేను సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యాను. తర్వాత చాలా అద్భుతంగా తోచింది. ఆ తర్వాత, కాలం గడిచేకొద్దీ అదో స్వప్నం మాదిరిగా ఉంది. ఆ విషయాన్ని నేను ఇప్పుడు గుర్తు తెచ్చుకున్నా, మీరు సిద్ధపురుషుల వారసత్వాన్నీ, సంపదనీ సంరక్షిస్తున్నారని అనిపిస్తోంది. మీరు నన్ను తమ శిష్యునిగా అనుగ్రహించడం ఒక పూర్వజన్మ సుకృతమేమో అనుకుంటున్నాను. నేను మీ అమూల్యమైన సమయాన్ని వృథా చేశానని అనిపిస్తే మాత్రం నాకు చాలా విచారంగా ఉంటుంది. తొమ్మిదేళ్లు గడిచిపోయింది. 1976 లో ఉండే నాకూ, ఈరోజున మీ ఎదుట నిలబడి ఉన్న నాకూ పెద్ద తేడా ఏమీ కనబడడం లేదు,' అన్నాను నేను స్వామీజీతో.

దానితో అనాసక్తి అంతా ఆవిరైపోయింది. మళ్లీ ఆయన నాతో అక్బర్ హోటల్‌లో మొట్టమొదటిసారి నన్ను చూసినపుడు పలకరించిన ఆప్యాయతనే కనబరిచారు. 'అలాంటి యోగ ప్రక్రియలు సంభవమేనని అలాంటి విలువైన అనుభూతుల వల్ల తెలుస్తాయి. సాధు సంప్రదాయం ఎంత చిరంతనమైనదో నాకు అర్థమైంది. అది అనాది జ్ఞాన ప్రవాహం. ఈ ప్రవాహ మూలంలోనే అనంత శక్తి, భక్తి, వైరాగ్య, సిద్ధి సంపద దాగి ఉంది. ఈ సంప్రదాయంలోని పరమ గురువులు శాశ్వతమైన, సార్వకాలిక, సార్వభౌమిక, సర్వజ్ఞ స్థితిని కలిగి ఉండి పరమ దయామయులై ఉంటారు.

'వారు తమ విద్యార్థులతో నిరంతరం మమేకమై ఉంటారు. పథభ్రష్టులైన వారిని దివ్యమార్గంలో నడిపిస్తారు. ఈ పరమగురువులు తమ భౌతిక శరీరానికే పరిమితమై ఉండరు. వారు భూగోళానికి ఆవలి దిక్కున ఉన్నా తమ శిష్యులకి మార్గదర్శకత్వం వహిస్తారు. శతాబ్దాల క్రితమే వారు తమ భౌతిక శరీరాన్ని వీడి వెళ్లినా ఇప్పటికీ ఎప్పటికీ తమ శిష్యుల్ని దివ్యపథంలో నడిపిస్తూనే ఉంటారు. ఈ అవగాహన వచ్చిందంటే మన మనసు ఆనందంతో నిండిపోతుంది. కానీ మనం ఎలాంటి సాధనా చేయకపోతే, ఈ ప్రేమ ఎలాంటి ప్రయోజనాన్నీ, ప్రగతినీ కలిగించకుండానే మరుగున పడిపోతుంది. ఆ స్థితి మనల్ని ఏ ప్రగతి పథానికీ నడిపించదు. మీరు ఒక మహనీయుడైన సాధువు గురువుగా లభిస్తేనో లేదా మీరు ఒక గొప్ప సంప్రదాయానికి చెందినవారైతేనో మీరు గొప్పవారు కాలేరు,' అన్నారు ప్రేమగా.

'ఈ రకమైన అనుభవం నీకు తాత్కాలికమైన ప్రేరణ కలిగిస్తుంది. నువ్వు అప్రమత్తంగా ఉన్నావా, దాని ప్రయోజనం నీకు చేకూరుతుంది. నువ్వు అప్రమత్తంగా లేకపోతే, మెల్లగా ఈ అనుభవం, దీని ప్రేరణ మసకబారుతుంది. చివరికి ఏ ప్రయోజనం లేకుండానే అవి ఆవిరైపోతాయి,' అన్నారు స్వామీజీ.

ఇది విన్న తర్వాత నేను ఆయన్ని, 'ఈ అనుభవాన్ని నా ఆధ్యాత్మిక వికాసానికి భూమికగా చేసుకోవడానికి నేను ఏ సాధన చేయాలి స్వామీజీ!' అని అడిగాను.

'మొదటగా నువ్వు నీలో నుంచి అందుతున్న అనుభవానికీ, బయట నుంచి వచ్చిన అనుభవానికీ మధ్య గల తేడా తెలుసుకోవాలి. శ్రీ యంత్రాన్ని నీ కళ్లతో నువ్వు ప్రత్యక్షంగా చూశానని అనుకుంటున్నావు, కానీ అది నిజం కాదు. అయితే ఆ సన్నివేశం ఒక అసాధారణమైన రీతిలో జరిగింది కాబట్టి నీకు అది చాలా విలక్షణంగా, ప్రత్యేకంగా కనిపిస్తోంది. నేను మీ అందరినీ స్నానాలు చేయమన్నాను. శుభ్రమైన వస్త్రాలు ధరించమని చెప్పాను. ఆ ఖాళీ గదిలో మీ నలుగురినీ నాలుగు మూలల నిలబడిమని చెప్పాను. ఇదంతా పెద్ద హడావిడి, అంతే. నేను ఒక భవ్యమైన వాతావరణాన్ని ఏర్పాటు చేశాను. అందువల్ల మీకు శ్రీ యంత్రం అంత ప్రత్యేకంగా అనిపిస్తోంది. అంత హడావిడి లేకుండా నేను దాన్ని మామూలుగా రప్పిస్తే మీకు అది మాయాజాలంగా అనిపించేది. దానికి అంత పవిత్రత వచ్చి ఉండేది కాదు.

'మీ అంతర జ్ఞానానికీ, ఆత్మ విశ్వాసానికీ ఇది ఏమాత్రం దోహదం చేయలేదు. మిమ్మల్ని మీరు అర్థం చేసుకోవడానికి ఇది ఏమాత్రం ఉపకరించలేదు. 'నేను ఇలాంటి విషయాల్ని ప్రదర్శించగలను,' అని ఆ సంఘటన నిరూపిస్తుంది. అయితే ఏమిటి? నేను మిమ్మల్ని బయటికి నెట్టడానికి ఏదో ఒక నేరారోపణ వేశానంటే, ఈ మహత్ సంఘటన మొత్తం అమాంతం తుడిచిపెట్టుకుని పోతుంది.

'జ్ఞాన సంపాదన రెండు విధాలు: ప్రత్యక్షానుభవం, బాహ్య వనరులు. ప్రత్యక్షానుభవం ద్వారా మనం సంపాదించే అనుభవం పరిపూర్ణమైనది, స్వయంగా చూసి తెలుసుకున్నది, అది మనసుకి పడుతుంది. ఇక భౌతిక గురువులు, గ్రంథాలతో సహా బాహ్య వనరుల నుంచి పొందే జ్ఞానం అసంపూర్ణమైనది. దాని విలువని తెలుసుకోవడానికి వేరే ప్రమాణం అవసరమవుతుంది. అది సంతృప్తికరం కాదు. బయటికి ఎంత భవ్యంగా, ఆకర్షణీయంగా కనిపించినా బాహ్య వనరుల నుంచి సేకరించిన జ్ఞానం భౌతిక ప్రపంచపు మాయా బంధనాల్నించి తప్పించలేదు. అలాంటి జ్ఞానం కేవలం గుదిబండ తప్ప మరేమీ కాదు. అలాంటి జ్ఞానాన్ని సంపాదించడం వల్ల నీ దగ్గర బోలెడంత సమాచారం ఉంటుంది. ఆ సమాచారాన్ని నువ్వు ఆకర్షణీయమైన కథలుగా ఇతరులకి వినిపించవచ్చు తప్ప దానివల్ల నీకు అంతర ప్రజ్ఞా వికాసం జరగదు. సత్యాన్ని నేరుగా తెలుసుకోవడానికి ఎన్నో సంక్లిష్ట సందర్భాల్ని దాటాలని అర్థం చేసుకున్నవారు అంత కష్టమూ పడతారు, వారికే సత్యం బోధపడుతుంది కూడా. ప్రత్యక్షానుభవం కావాలంటే నువ్వు సాధన చేయాలి,' అన్నారు.

'ఈ విధమైన అనుభవాల్ని సాధించడానికి కొన్ని ప్రత్యేక సాధనా పద్ధతులు ఉండి ఉండాలి కదా. మరి అలాంటి సాధనని ఏకాగ్రతతో చేయాలి కదా?' అని అడిగాను.

'అవును, ఇందుకు కొన్ని ప్రత్యేకమైన సాధనా పద్ధతులు ఉన్నాయి. కానీ పై స్థాయికి చెందిన సాధన చేస్తున్నావంటే, నువ్వు ఆ సాధనని ఎంచుకున్న కారణం కూడా నీకు స్పష్టంగా తెలిసి ఉండాలి. నీకు ఆ సాధన ద్వారా కావలసింది ఏమిటో కూడా తెలియాలి. నీ జీవితంలో ప్రాముఖ్యతని అనుసరించి వివిధ రకాలైన లక్ష్యాల్ని సాధించడానికి నువ్వు ఆ సాధనని ఎంచుకున్నావా? సాధన అనేది ఒక అంతర్గత పరిశోధన. బాహ్య ప్రపంచంలో నిర్వహించే పరిశోధన కంటే అదెంతో భిన్నమైనది. బాహ్య ప్రపంచంలో పరిశోధకుడు తను చేయాల్సిన ప్రయోగాల కోసం వస్తువులు, విషయాల కోసం వెతుక్కుంటాడు. కానీ అంతర్గత పరిశోధనలో నీకు నువ్వే ఒక విషయంగా మారతావు. ఇది చాలా కష్టమైన విషయం. 'నేను ఒక పరిశోధకుడిని, నేనే ప్రయోగశాలని, నేనే విషయాన్ని' అనుకోవాలి నీలో నువ్వు,' అన్నారు స్వామీజీ.

'నువ్వు నీ పరిశోధనని సవ్యంగా పూర్తి చేయడానికి, ముందుగా నువ్వు గ్రంథాధ్యయనం చేసీ, ఆ సాధనని అభ్యసించిన గురువుల నుంచి వెలువడిన గురుబోధల్ని అవగతం చేసుకునీ, తగినంత సమాచారాన్ని సేకరించాలి. తీవ్రతరమైన సాధన చేయడమంటే, నువ్వు ఐహిక ప్రపంచాన్ని విడిచిపెట్టి సన్యాసి అయిపోవడం కాదు. బాహ్య ప్రపంచంతో నువ్వు ఎలా మెలుగుతూ నీ సమయాన్ని సక్రమంగా వినియోగించుకోవాలో నేర్చుకోవడం! నీ శారీరిక, మానసిక శక్తుల్ని ఉన్నత భూమికలకి చేరేందుకు వీలుగా సంరక్షించుకుంటూ ఉండడం! అసలు విషయం మీద ఏకాగ్రచిత్తంతో ఉండడం! ఐహిక ప్రపంచపు ఆకర్షణలు, వ్యామోహాలకు లొంగి దారితప్పకుండా ఉండడం!'

సెప్టెంబరు నుంచి డిశెంబరు వరకు స్వామీజీ ఉత్తర భారతదేశం, బీహారు, మధ్య భారతదేశమంతటా పర్యటించారు. నాకు వారితో కూడా వెళ్లే భాగ్యం లభించింది. స్వామీజీ నన్ను ఈ ప్రయాణంలోనే బెనారస్ తీసుకుని వెళ్లి వారు బాల్యంలో గాయత్రీ మంత్రాన్ని సాధన చేసిన ప్రదేశాన్ని చూపారు. ఆయన నన్ను బెనారస్‌లో కొన్ని మార్మిక ప్రదేశాలకు తీసుకుని వెళ్లారు. ఆ ప్రదేశాల గురించి సాధారణ యాత్రికులకు తెలియవు. ఆ ప్రదేశాల్లో సిద్ధయోగులూ, జిజ్ఞాసువులూ సాధన చేస్తుంటారు. వారు నన్ను పవిత్రమైన గయా క్షేత్రానికి తీసుకుని వెళ్లారు. గయ బీహార్ రాష్ట్రంలో ఉంది. ఆయన బాల్యంలో గులకరాయి (పెబల్) బాబాని కలుసుకున్న చోటు చూపించారు.

గయ నుంచి బోధ గయ పదమూడు కిలోమీటర్లు ఉంటుంది. బుద్ధుడికి జ్ఞానోదయం కలిగిన చోటు బోధ గయ. అక్కడ స్వామీజీ నన్ను తన ఎదుట కూర్చోబెట్టుకుని బుద్ధుని బోధనా సారమైన నాలుగు ఆర్య సత్యాల్ని వివరించారు. బుద్ధుడు అత్యంత వ్యావహారికమైన పద్ధతిలో బోధించిన గురువనీ, ఆయన బోధనల్లో ఆత్మ ఉందా లేదా, దేవుడు ఉన్నాడా లేడా అనే విషయాల గురించి మాట్లాడలేదనీ చెప్పారు. బుద్ధుడు కరుణాంతరంగుడని చెప్పారాయన. జీవితం అత్యంత దు:ఖపూరితమైనదనే సత్యాన్ని గుర్తించి, దు:ఖాన్ని నివారించుకునే ప్రయత్నం చేయాలని చెప్పారు. దు:ఖానికి అసలు కారణం తెలిస్తే తప్ప దాన్ని తొలగించడం సాధ్యం కాదు. దు:ఖపడుతోంది శరీరమా, మనసా? దు:ఖం చైతన్యస్థాయిలో కలుగుతోందా లేక బాహ్య ప్రపంచం నుంచి వస్తోందా అని తెలుసుకోవాలని చెప్పారు. దు:ఖకారకమైన పరిస్థితిని తొలగిస్తే తప్ప, మీకు స్వేచ్ఛాస్థితి రాదని తెలియజేశారు. అప్పుడు కరుణ, జ్ఞానంలో స్థిరంగా నిలవవచ్చునని చెప్పారాయన. అదే జ్ఞానమని అన్నారు.

స్వామీజీ నన్ను గయ చుట్టు ప్రక్కల ఉన్న దర్శనీయ ప్రదేశాలన్నింటినీ చూపించారు. ప్రతి చోటా ఆ యా క్షేత్ర మహత్మ్యాల్ని వర్ణించి చెప్పారు. వైదిక ఋషులు, జైన, బౌద్ధ గురువుల గురించీ, వారి సాధనా పద్ధతుల గురించీ వివరించారు. అప్పుడు మేము బెనారస్‌కి తిరిగి చేరుకున్నాము. అక్కడ నుంచి వింధ్య పర్వత పాద ప్రాంతంలో ఉన్న దేవాలయానికి టాక్సీ మాట్లాడుకున్నాము. అక్కడ, గెరువా తాలాబ్ (చెరువు) దగ్గర స్వామీజీ తమ గురువు నివసించిన రెండు గదుల నిర్మాణాన్ని చూపించారు. అది వారి గురుదేవుల గౌరవార్థం 1917 లో కట్టబడింది. ఈ భవంతి ముందు ఒక సమాధి ఉంది. అది భోలే బాబా అనే సాధువు సమాధి. నేను ఈ భోలే బాబా ఎవరని అడిగాను స్వామీజీని. 'ఈయన భూమి సమాధి (శరీరం వదిలే ముందు మెడ క్రింది భాగం భూమిలో ఉంటుంది) చేసిన ఒక యోగి,' అని చెప్పారాయన. 1995 లో నేను ఓ నలభై మంది అమెరికన్లతో మరోసారి ఆ ప్రాంతాన్ని సందర్శించాను. అప్పుడు అక్కడ మేము ఇద్దరు సాధువుల్ని కలిశాము. వారిలో ఎవరికీ స్వామీ రామ గురించి తెలియదు. కానీ భోలే బాబా బెంగాలీ బాబాకి శిష్యులని మాత్రం తెలుసు. ఆ ఇద్దరిలో ఒక సాధువు భోలే బాబా

శరీరం వదిలిన తర్వాత ఆ ప్రాంతాన్ని పూర్తిగా మట్టితో పూడ్చి పెట్టిన ప్రత్యక్ష శిష్యులు కూడా. భోలే బాబా 1958లో *భూమి సమాధి* అయ్యారని ఆయన చెప్పారు. నేను కొద్దిరోజుల తర్వాత స్వామీజీకి ఈ విషయం చెప్పినపుడు ఆయన, 'ఆధ్యాత్మికపథంలో జీవనం సాగించిన మహనీయులు చనిపోయిన తర్వాత, వారి అనుయాయులు అలాంటి కథలు ప్రచారం చేస్తుంటారు,' అంటూ మాట్లాడుతున్న విషయాన్ని పక్కదారి పట్టించారు. ఆ సమాధానం నాకు సంతృప్తినివ్వలేదు. నేను ఆ భోలే బాబా ఎవరా అని ఆశ్చర్యపోతుండేవాడిని.

ఆ నాలుగు నెలలపాటూ స్వామీజీ ఒక చోట నుంచి మరో చోటికి తుఫాను వేగంతో పర్యటించారు. ఢిల్లీ, ఋషీకేశ్, డెహరాడూన్‌లో తప్ప మిగతా అన్నిచోట్లా ఆయన ప్రయాణాలు ఆధ్యాత్మిక ప్రవచనాలే జరిగాయి. ఆ మూడు చోట్లా ఆయన చుట్టూ విపరీతమైన జనం చేరారు. టెలిఫోన్స్ నిర్విరామంగా మోగుతూనే ఉండేవి. అప్పుడు ఆయన నిరంతరం మాకు ఆదేశాలు ఇస్తూనే ఉండేవారు. దీనికి కారణం ఉంది. స్వామీజీ వేద సంస్కృతినీ, సంస్కారాన్నీ పెంపొందించే ఒక సంస్థ నిర్మాణం కోసం కొంత భూమి కోసం చూస్తున్నారు. ఒకనాడు ఆకస్మికంగా ఆయన మూడ్ మారింది. దానితో కేవలం ఒక సంస్థ కాకుండా ఆసుపత్రి కట్టాలని ఆయన భావించారు. ఆయన స్వామీజీ వద్ద అధ్యయనం చేసే విద్యార్థులు, శిష్యులు అనేక రకాల ఆలోచనలు, ప్రస్తావనలతో ఆయన దగ్గరకి వచ్చారు. వారంతా స్వామీజీని తాము ఉంటున్న నగరాల్లో కట్టమని ప్రాధేయపడ్డారు. వారు చెప్పే ఆలోచనలు కూడా సముచితంగానే ఉన్నాయి. హరిద్వార్‌లో కడితే చాలామంచిది. ఇక్కడ నివాస గృహాలు లేని వందలాది సాధువులు, భిక్షకులు ఉన్నారు. వీరికి వైద్య సౌకర్యం చాలా అవసరం. అలాగే డెహరాడూన్ హిమాలయ పాద ప్రాంతంలో ఉన్న వాణిజ్యపరమైన విలువలున్న ప్రాంతం. ఇక్కడ గొప్ప ప్రసిద్ధి పొందిన పాఠశాలలు ఉన్నాయి. ఆ హాస్పిటల్‌లో పనిచేసే వైద్యనిపుణుల పిల్లలకి మంచి విద్యావసతి అందుబాటులో ఉంటుంది. ఒకవేళ ఆసుపత్రిని ముస్సోరీలో నిర్మించినా బాగానే ఉంటుంది. కారణం ఎత్తు ఎక్కువ, పర్వతప్రాంతపు గాలిలో స్వచ్ఛత ఉంటుంది. కాన్పూర్ అయినా బాగుంటుంది. అక్కడ వేలాదిమంది హాస్పిటల్ అభివృద్ధికి సాయపడతారు. కానీ మిగతావాళ్లు హాస్పిటల్ హిమాలయాల్లో లోపలి ప్రాంతాల్లో పర్వత ప్రాంతాల్లో ఉంటున్న ప్రజలకి అందుబాటులో ఉండేలా చూడాలని చెప్పారు. అలాగే హాస్పిటల్ స్థాపన కోసం స్వామీజీ కృషి చేస్తున్నారు కాబట్టి అది ఆధ్యాత్మిక ప్రదేశంలో ఉండాలని కొందరు అభిప్రాయపడ్డారు.

ఈ ప్రస్తావనలకి అనుకూలమైన ప్రతికూలమైన విషయాల్ని స్వామీజీ పరిగణనలోకి తీసుకుని 'సంజీవనీ ఔషధాలయ' అనే పేరుతో డెహరాడూన్‌లో ఒక హాస్పిటల్‌ని కట్టాలని నిర్ణయించుకున్నారు. ఆ ప్రాంతంలో ఉన్న డాక్టర్లు ఒక బృందంగా ఏర్పడి ఈ ప్రాజెక్ట్‌తో కలిసి పని చేయడానికి చాలా ఉత్సాహంగా ముందుకొచ్చారు. స్వామీజీ వారిని ఒక సొసైటీగా ఏర్పడమనీ, దానికి భారత ప్రభుత్వ ఆమోదం తీసుకోమనీ చెప్పారు. ఈ సంస్థ పూర్తిగా అమెరికాలోని హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్ నిధుల మీదే నడుస్తుందని ఆయన చెప్పారు. నిజానికి డబ్బుకి లోటేమీ లేదనీ, వారు ఒక అద్భుతమైన హాస్పిటల్‌ని నిర్మిస్తే చాలనీ చెప్పారు. 1986 లో వేసవిలో ఈ విధంగా ఆదేశించి స్వామీజీ అమెరికా వెళ్లిపోయారు.

ఆయన హానెస్‌డేల్‌కి వెళ్లి అక్కడ ఆయన బోధన, రచనా వ్యాసంగం, నిధుల సమీకరణ మొదలైన పనులు చూసుకోసాగారు. ఆ వేసవి అంతా ఆయన సంగీతం గురించే తన్మయత్వంతో మాట్లాడారు. స్వామీజీ కౌమార దశలో ఉన్నపుడు సంగీతమంటే తనకి ఎంత ప్రాణంగా ఉండేదో తమ గురుదేవులు తనతో ఎంతగా విసిగిపోయారో చివరికి ఆ వీణని ధ్వంసం చేయమని మిగతా సాధువులకి ఆదేశమిచ్చారో అందరికీ వివరించసాగారు. 'నలభై ఏళ్ల వరకు ఈ నస

సంగీతం జోలికి పోవడానికి వీల్లేదు,' అని అన్నారు. అప్పుడు ఆయన అల్లరి పిల్లాడిలా నవ్వుతూ, 'ఆ సంవత్సరాలు పూర్తి అయిపోయాయి. మళ్లీ నేనిప్పుడు సాధన చేయవచ్చు,' అనేవారు. ఆయన సాధన చేశారు కూడా. రాత్రీ పగలూ కేవలం సంగీతం, సంగీతం, సంగీతం! ఆయన ఆశ్రమవాసులకి భారతీయ సంగీతం నేర్పారు. వాళ్లతో బాటు కలిసి పాడేవారు ఆయన కూడా. అనేకమంది గాయకుల్ని భారతదేశం నుంచీ, ప్రపంచం నలుమూలల నుంచీ రప్పించారు. వారు స్వయంగా వీణ, తబలా, హార్మోనియం, సితార్, తాన్పురా వంటి ఏదైనా ఏదో ఒక వాద్యం చేతిలోకి తీసుకునేవారు ఆయన. ఒకసారి నాకు ఆయన టెలిఫోన్ చేశారు తెల్లవారుఝాము మూడు గంటల ప్రాంతంలో. 'నీకు నా తబలా వినిపిస్తోందా? నువ్వు లైన్‌లోనే ఉండు. నేను తబలా పక్కన పెడతాను రిసీవర్!' అని చెప్పారు. అప్పుడు ఆయన తబలా వాయించడం మొదలుపెట్టారు. నేను మెడిటేషన్ చేస్తున్నాను ఆ సమయంలో. కానీ నేను రెండు గంటల పాటు విన్నాను. అప్పుడు ఐదు గంటలయింది. ఆయన టెలిఫోన్ అందుకుని, 'ఎలా అనిపించిది నీకు?' అని అడిగారు. 'అద్భుతం, స్వామీజీ! నేను రానా మీ దగ్గరకి?' అని అడిగాను.

'రా, వచ్చేయ్,' అని పెట్టేశారు ఫోన్. నేను ఆయన రూంలోకి వెళ్లాను. స్వరంతో పాడే పాట ఒకటి నాకు నేర్పించారు అప్పుడు. ఇలా కొన్ని గంటలు గడిచింది. ఇక నాకు ఆకలి దంచేస్తోంది. పాడేందుకు నాకు గొంతు కూడా పెగలడం లేదంటే అప్పుడు వదిలారు నన్ను. ఆ వేసవి కాలమంతా అలాగే గడిచింది. భారతీయ సంగీతమంటే ఏ కొంచెం అభిమానం ఉన్నట్టు కనిపించినా వాళ్లు ఆయన స్నేహితులైపోయేవారు. స్వామీజీ వారితో గంటలకొద్దీ కాలక్షేపం చేసేవారు. సంగీతమంటే స్వామీజీ అంత తన్మయత్వం చెందుతుంటే ఎవరికైనా సమాధి పొందడానికి సంగీతమే ఏకైక మార్గమేమో అనిపించేది.

ఇంతలో స్వామీజీ హాస్పిటల్ పని అప్పగించిన భారతీయ సభ్యుల బృందం చురుగ్గా పని చేయసాగింది. ఏం చేయాలో అనేది ప్లాన్ చేయలేదు వాళ్లు, ఎలా చేస్తే తమకి బాగా ఉపయోగమవుతుందో అలా ప్లానింగ్ చేశారు. నేను స్వామీజీతో రాత్రిళ్లు బాగా ప్రొద్దుపోయే వరకూ కూడా ఉంటూ ఉండేవాడిని. అందువల్ల డెహరాడూన్‌లో ఉన్నవారితోనూ, ఢిల్లీలో ఉన్నవారితోనూ ఆయన తరచుగా మాట్లాడడం వినేవాడిని. 'నాకు భారతదేశంలో సంస్థని నెలకొల్పడం మీద అనుభవం ఏమీ లేదు. భగవంతుడు నీకు ఈ నైపుణ్యాలన్నీ ఇచ్చాడు. నువ్వు ఈ పనులన్నీ చేయగలవు. దేశంలోని ఈ ప్రాంతంలో చాలా బాధలు పడుతున్నారు ప్రజలు. మీరు ఆ సమాజాన్ని మెరుగుపరచగలరు, ముందుకు నడిపించగలరు. నీకు తెలుసు కదా ఏం చేయాలో, ఎలా చేయాలో. నేను నా స్టూడెంట్స్‌ని ఈ ప్రాజెక్ట్‌కి సాయం చేయమని అడుగుతాను. మీరు డబ్బుకేమీ ఇబ్బంది పడవద్దు. అది నేను చూస్తాను,' అన్నారు.

ఒకరోజు సాయంత్రం, మాటల సందర్భంలో నేను స్వామీజీని పనులు ఎలా జరుగుతున్నాయని అడిగాను. ఆయన, 'వాళ్లు చాలా పేరు ప్రసిద్ధులు ఉన్న డాక్టర్లు. వాళ్లకి డబ్బు కూడా చాలానే ఉంది. అందుకే వాళ్లు తమ స్వంత ప్రజలకి సహాయం చేయడం, సేవ చేయడం చేస్తారేమో అనుకున్నాను, కానీ వారి సేవలు కేవలం వారికే పరిమితం చేసుకుంటున్నారు. చాలా నిరాశగా ఉంది!' అన్నారు.

'మీరు అమాయకంగా అడుగుతున్నారేం స్వామీజీ! మీకు తెలియదా, ఆధ్యాత్మిక తత్వం తెలియని వారి కోరికలకి కళ్లేలు ఉంటాయా? సాధారణంగా ఏదైనా ప్రాంతంలో ఒక అభివృద్ధి కార్యక్రమానికి నాంది పలకబోతుంటే, ఆ ప్రాంత ప్రజలే దాన్ని వ్యతిరేకిస్తూ దానికి ఆగర్భ శత్రువులవుతారు. ఇవి మీకు తెలియనివా?' అని అడిగాను నేను స్వామీజీని.

స్వామీజీ సమాధానం చాలా సరళంగా ఉంది, 'ప్రతి ఒక్కరికీ ఒక అవకాశం ఇవ్వాలి కదా?' అన్నారు. చివరికి స్వామీజీ ఆ ప్రాజెక్ట్ నుంచి తప్పుకున్నారు, ఆ డాక్టర్ల సొసైటీ కూడా విడిపోయింది. అప్పుడు స్వామీజీ హృషీకేశ్‌కీ, డెహరాడూన్‌కీ మధ్య సైట్ చూడమని తనకి బాగా తెలిసినవారికి పురమాయించారు. హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్ హాస్పిటల్ ట్రస్ట్‌ని ఏర్పాటు చేయడానికి తన స్టూడెంట్స్‌లో కొంతమందికి పేపర్ వర్క్ పూర్తి చేయమని చెప్పారు.

ఆ వేసవి కాలమంతా స్వామీజీ ఇన్‌స్టిట్యూట్ బయట ఇచ్చిన ఉపన్యాసాలు చాలా తక్కువ. అయితే, ఆయన ప్రత్యేకంగా ఏడురోజుల ఇంటెన్సివ్ హానెస్‌డేల్ క్యాంప్ నిర్వహించారు. దాని పేరు, 'జ్యోతిపథం–ప్రకాశం!'

ఈ కార్యక్రమం మొదలుపెట్టక ముందే స్వామీజీ పదే పదే చెప్పేవారు. 'నేను మీకు సాధనా సారాన్ని అందించబోతున్నాను. మీకు సరైన ధ్యాన పద్ధతుల్ని బోధిస్తాను. మీ సుషుమ్నని మేల్కొలిపే పద్ధతిని తెలియజేస్తాను. మీకు నిజంగా *బిందు భేదన* (కనుబొమల కేంద్రంలోని అత్యంత సూక్ష్మ చక్రాన్ని మేల్కొల్పడం) పద్ధతి నేర్చుకోవాలని ఉంటే ఈ అవకాశాన్ని వదులుకోవద్దు. మీలో చాలా మంది యోగసాధన చేస్తున్నామని అనుకుంటారు కానీ, మీకు సరైన విధానంలో యోగసాధన చేయడం తెలియకపోతే మీకు నిజమైన అభివృద్ధి లభించదు. ఈ తరగతులు ఇన్‌స్టిట్యూట్‌లో ఇంతకు ముందెన్నడూ బోధించనంత ఉన్నత స్థాయిలో ఉంటాయి,' అని చెప్పారు. ఉత్తర అమెరికాలో ఉన్న స్వామీజీ స్టూడెంట్స్ అందరూ చాలా ఉత్సాహంగా ఉన్నారు. ఆయన ఇప్పటికి 'అసలైన విషయం' చెప్తున్నారని పరమోత్సాహంగా ఉన్నారు.

నేనూ మిగతా అందరిలాగానే చాలా ఆనందంగా ఉన్నాను. 1983 లో నేను స్వామీజీకి *హిమాలయ పరమగురువులతో జీవనం* హిందీ అనువాదం చదివి వినిపించే వాడిని కదా! అందులో ఒక చోట మార్మిక అగ్ని గురించిన ప్రస్తావన వచ్చినపుడు స్వామీజీ నాకు దాన్ని గురించి ఎప్పుడో ఒకసారి చెప్తానని అన్నారు. ఆ సమయంలో ఆయన, 'ఈ విషయం మీద మనం ఒక ప్రత్యేకమైన కోర్సుని అందించాలి. అది ప్రజలకి ఉపయోగపడుతుంది. ఈ కోర్సు పేరు 'జ్యోతిపథం–ప్రకాశం!' అన్నారు. నా కాల్పనిక ప్రపంచంలో నేను కుండలినీ మేల్కొల్పే టెక్నిక్స్, నాభి కేంద్రం నుంచి అగ్నిని జ్వలింపజేయడం, హీలింగ్ పవర్‌ని కలిగించడం, శరీరాన్ని స్వీయదహనం ద్వారా వదిలివేసే టెక్నిక్ మీద పట్టు సంపాదించడం వంటివన్నీ పూర్తి చేసేశాను కూడా.

చివరికి ఆ కార్యక్రమం ప్రారంభించే రోజు వచ్చింది. స్వామీజీ ప్రతి రోజూ ఉదయం వేళ ఉపన్యసిస్తారు. మిగతా బోధనా సిబ్బంది సభ్యులకి మధ్యాహ్నం, సాయంత్రం వేళల్లో ఉపన్యసించే అవకాశం ఇవ్వబడింది. ఆడిటోరియంలో శ్రోతలందరూ స్వామీజీ నోటి నుంచి వెలువడే ప్రతి పదాన్నీ తమ అణువణువులోనూ లయింపజేసుకోవడానికి సన్నద్ధంగా ఉన్నారు. ఆ రూంలో జనం క్రిక్కిరిసి కూర్చున్నారు. ఈ ఉపన్యాసాల్లో ఏ ఒక్క వివరణనీ వదలకుండా ఫిల్మ్ తీసేందుకు కెమేరామ్యాన్ సిద్ధంగా ఉన్నాడు. స్వామీజీ రూం వెనక భాగం నుంచి స్టేజీ మీదకి వస్తుంటే గదంతా నిశ్శబ్దంగా ఉంది. వేదిక మీదకి చేరుకున్న తర్వాత, ఎప్పటిలాగానే, ఆయన చేతులు జోడించి ఉపన్యాసం మొదలుపెట్టారు, 'మీలో ఉన్న దివ్యత్వానికి నా నమస్సులు. ఇది ఎంతో ప్రత్యేకమైన సెమినార్. మీరు అత్యంత శ్రద్ధాసక్తులతో వింటే దీని వల్ల మీకు ఎంతో మేలు జరుగుతుంది. ఇందులో మనం 'జ్యోతిపథం–ప్రకాశం!' అనే విషయం చెప్పుకుంటాం. ఎందుకంటే ఇది మిమ్మల్ని అంధకారం నుంచి ప్రకాశం వైపు నడిపిస్తుంది. కానీ ప్రకాశం మూలాన్ని చేరుకోవడానికి మీరు సాధనా తాపాన్ని సహించాలి. అందుకే ఇది జ్యోతిపథం. ఇది

అందరూ సాధన చేయాలనుకునే మార్గం. కానీ సాధన చేయడానికి మీకు పూర్తి అంకితభావం ఉండాలి.

'మీకు అసలు టెక్నిక్స్‌ని బోధించే ముందు మీకు ఒక విషయం స్పష్టంగా చెప్పాలి. ఈ అగ్నిపథ–ప్రకాశ మార్గంలో బోధకుడు మీకు మార్గాన్ని మాత్రమే సూచించగలడు. ఈ పథం దేనితో నిర్మితమైంది, ఈ పథంలో ఎలా నడవాలి, అడ్డుపడే ఆటంకాల్ని ఎలా అధిగమించాలి, మీరు నిరంతరం ముందుకే వెళ్తున్నారనీ, వెనక్కి జారిపోవడం లేదనీ ఎలా తెలుసుకోవాలీ, ఈ విషయాలన్నీ ఇందులో తెలుసుకుంటారు. కానీ మీ బదులు మరెవరైనా ఆ పథంలో వెళ్తారని ఆశించకండి. మీ పథంలో వెళ్లాల్సింది మీరే. మీకు ప్రబోధం కలిగిస్తామనీ, మీకు దేవుడిని చూపిస్తానీ ఎవరైనా చెప్పినా, మీ సమస్యల్ని పరిష్కరిస్తామని ఎవరైనా అన్నా, మీరు ఆ వ్యక్తి మాటల్ని నమ్మనవసరం లేదు. అలాంటి మాటలు చెప్పే వ్యక్తి పచ్చి మోసగాడు.

'ఈ అగ్ని గురించి ఇప్పుడు నేను చెప్తాను చూడండి. ఈ శ్వాసే ఒక అగ్ని. మీరు శ్వాసిస్తున్నంత సేపూ మీరు జీవించి ఉన్నట్టు. చైతన్య కేంద్రం నుంచి ప్రాణ శక్తి తరంగం ఉత్పన్నమవుతూ ఉంటుంది. ఈ ప్రాణశక్తే శ్వాసగా మారుతుంది. దీన్ని మీరు శ్వాసనే ప్రాణశక్తికి చెందిన చిరుఅలగా అభివర్ణించవచ్చు. శ్వాస మిమ్మల్ని చైతన్యవంతంగా ఉంచుతుంది. మీ జీవితపు నిడివి శ్వాసల్లో కొలవబడుతుంది. మీరు పుట్టక ముందు మీ జీవితకాలం చుట్టూ నిర్దిష్ట సంఖ్యలో శ్వాసలతో ఒక పరిమితి కేటాయించబడి ఉంటుంది. మీకు కేటాయించబడిన శ్వాసల సంఖ్య పూర్తి కాగానే మీరు మృతి చెందుతారు. కాబట్టి శ్వాసే ఆరోగ్యానికీ, దీర్ఘాయువుకీ కీలకమైన అంశం.

'శ్వాస సజీవాగ్ని. ఆక్సిజన్ ఏమిటి? ఆక్సిజన్‌లో ఏముంటుంది. ఆక్సిజన్ ఒక ఇంధనం. ఇంధనం మండితే అది శక్తిని, అంటే వేడినిస్తుంది. శక్తి ఎక్కడ ఉంటుంది? అది ఇంధనంలోనే ఉంటుంది. కాబట్టి ఇంధనం నిద్రాణమైన శక్తిని మోసే ఒక పాత్ర వంటిది. ఆక్సిజన్ విషయం కూడా అంతే. అది సజీవ శక్తి అంటే ప్రాణశక్తి పాత్ర. అగ్ని మీలోనే ఉంది. ఆ అగ్ని ఆక్సిజన్‌ని జ్వలింపజేస్తుంది. ఆ విధంగా ఆక్సిజన్‌లో ఉన్న శక్తి మీ శరీరంలోకి విడుదల చేయబడుతోంది. ఆ శక్తే పోషణకి మౌలిక వనరు. మీలో ఉన్న ఆ అగ్ని చల్లారిపోయిందా అంటే, మీలో ప్రాణచేతన రవ్వంత కూడా లేనపుడు, మీ శరీరంలోకి ఆక్సిజన్‌ని ఎంత పంప్ చేసినా అది పని చేయదు. కాబట్టి శ్వాసని మీరు కేవలం 'పీల్చే గాలి'గా ఎన్నడూ భావించరాదు. అది అంతకంటే ఎంతో సూక్ష్మమైనది.

'ఈ జ్ఞానం 'శివ స్వరోదయ' సంప్రదాయంలో వర్ణించబడింది. 'శివ' శబ్దానికి 'చైతన్యం' అనే అర్థం ఉంది. 'స్వర' శబ్దానికి 'శ్రావ్యత', 'సంగీతం', 'అల', 'కెరటం' అనే అర్థాలు ఉన్నాయి. 'ఉదయ' అంటే 'ఆవిర్భావం, వ్యక్తీకరణ' అనే అర్థాలు ఉన్నాయి. ప్రాణ కెరటం అనాది చైతన్య కుండం నుంచి ఎలా పైకి లేస్తుందో ఈ విజ్ఞానం వర్ణిస్తుంది. ఈ విజ్ఞానాన్ని అనుసరించి, ప్రాణం ఒక అందమైన పద్యం. దీనిలో ఒక లయ ఉన్నది. గొప్ప శ్రావ్యత ఉన్నది. జీవితాన్ని పరిపూర్ణంగా ఆనందించడానికి మీరు ప్రాణశక్తికి గల ప్రవాహాలు, ఉప ప్రవాహాలతో కూడిన సంగీతం వినడం నేర్చుకోవాలి. లయ, తాళం, శ్రావ్యత. మీరు ప్రాణశక్తి వినిపించే ఈ సంగీతాన్ని వినడం నేర్చుకుంటే, ఇక మీ జీవితంలో ఎలాంటి విచారమూ ఉండదు. అప్పుడు మీకు ఆ అద్భుతమైన సంగీతం వినిపించే మార్మిక సంగీతజ్ఞుడు మీలోనే ఉన్నాడని అర్థమవుతుంది. ఆ సంగీతజ్ఞుడు మరెవరో కాదు, మీరే! ఆ చైతన్య కేంద్రం మీరే. మీరు శాశ్వతులు.

'విధి బలాల చేత ప్రేరేపితమై ప్రాణశక్తి అల చైతన్య కేంద్రం నుంచి ఆవిర్భవమవుతుంది. ఆ శక్తి వల్లనే ప్రేరేపితమై, తిరిగి ఆ చైతన్యంలోనే తిరిగి అణగిపోతుంది. ఈ విషయం మీకు

ఒకసారి అర్థమైతే, మీకు సందేహం, భయం, ఆందోళన ఉండవు. మీరు రూపాంతరం చెందుతారు. మీ దివ్య స్వభావం ప్రకాశిస్తుంది. కానీ నేను చెప్తున్నదంతా మేధోపరమైన జ్ఞానం మాత్రమే. ఈ అందమైన మాటలు మీకు సారాన్ని అర్థం చేసుకోవడానికి ఎలాంటి సాయమూ చేయవు. మీరు సాధన చేసినపుడు మాత్రమే ఆ సారాన్ని అందుకోగలుగుతారు.

'శాశ్వతమైన, వాస్తవమైన రూపాంతరణ కోసం మీరు ఒక పద్ధతి, స్వీయ క్రమశిక్షణ, స్వీయ శిక్షణతో కూడిన విధానాన్ని అవలంబించాలి. కుతూహలాన్ని ఉపశమింపజేసుకోవడం కోసం మీరు అధ్యయనం చేస్తారు, ఎన్నో రకాల తాత్త్విక సిద్ధాంతాల్ని పాటిస్తారు. కానీ ఆ సిద్ధాంతాల్ని కేవలం మీ కోసం అన్వయించుకున్నపుడు మాత్రమే అవి పనిచేస్తాయి. సైద్ధాంతిక జ్ఞానాన్ని అన్వయించుకోవడం, దానితో నిత్య జీవితంలో బ్రతకడం 'సాధన' అవుతుంది.

'ప్రజలు ఇతరులపై ఆధారపడి బ్రతకడమనే ఒక అలవాటు చేసుకుంటారు. ఇతరులు తమకి సాయపడాలని భావిస్తారు. తమకి ఏది మంచో ఏది చెడో ఇతరులు తమకి చెప్పాలని భావిస్తారు. ఇది చెడ్డ అలవాటు. మీరు మానవులు. మీ జాగ్రత్త మీరే తీసుకోవాలి. ఇతరుల మీద ఆధారపడి మీ స్వీయ ప్రేరణని మీరే అణచివేసుకుంటున్నారు. స్వీయ ప్రేరణ లేకుండా, మీరు ఏ పనీ చేయలేరు. మీ ఇచ్ఛాశక్తిని ఆహ్వానించండి. విఫలమవుతాననే భయాన్ని త్రోసిపుచ్చండి. తక్షణం విజయం మీ పాదాల్ని ముద్దాడడం మీరు గమనిస్తారు.'

ఇక ఆ తర్వాత స్వామీజీ దృష్టి ప్రధాన విషయం మీద నుంచి మళ్లింది. సంప్రదాయంలో ఉన్న శిష్యులకి తమ గురువుని గుర్తించడం ఎలా అనే విషయాన్ని వివరించారు. తర్వాత ఆయన నిర్వాణ్‌జీ కథ చెప్పారు. నిర్వాణ్‌జీ ఒక గొప్ప సాధువు. హృషీకేశ్‌లో ఆయన డెబ్భై సంవత్సరాలకి పైగా చెక్కలతో నిర్మించిన ఒక చిన్న ఇంట్లో ఉండేవారు. స్వామీజీ యువకునిగా ఉన్నపుడు, నిర్వాణ్‌జీతో కలిసి హరిద్వార్‌లోని ఒక ఆధ్యాత్మిక సమావేశానికి వెళ్లారు. ఆ సమావేశంలో బెనారస్ నుంచి వచ్చిన ఒక సుప్రసిద్ధ సాధువు రసవాదంలోని ఆధ్యాత్మిక కోణాన్ని వివరిస్తూ, యోగులు శరీరాన్ని సమతూకంలో ఉంచుకోవడానికీ, తమ శక్తి ప్రవాహాల్ని శుద్ధీకరించుకోవడానికీ, మనసుని జయించడానికీ పాదరసాన్ని ఎలా ఉపయోగిస్తారో చెప్పారు. ఈ యోగం 'వజ్రోలీ క్రియ' గా పేరొందింది. శాస్త్ర గ్రంథాల్ని అనుసరించి ఈ సంప్రదాయంలో శిక్షణ పొందే సాధకుడు ప్రత్యుత్పత్తి అవయవం గుండా పాదరసం తీసుకోవాలి. కానీ పాదరసం ఎలా మారుతుందని గానీ, శరీరంపై దాని ప్రభావం ఎలా ఉంటుందని గానీ, దాని విషప్రభావం ఎలా తొలగింపబడుతుందని గానీ పాదరసాన్ని శరీరం నుంచి ఎలా తొలగించాలని గానీ శాస్త్ర గ్రంథాలు చెప్పలేదు. సాధారణ నమ్మిక ప్రకారం యోగులు పాదరసాన్ని తన జననాంగం ద్వారా లోపలికి తీసుకుని దాన్ని తన మెదడుకు పంపుతారు. అక్కడ అది పనిచేసి సమాధి స్థితిని కలుగజేస్తుంది. అలాగే యోగులు తమ శరీరం మీదా, మనసు మీదా పట్టు సాధిస్తారు, వారు అమరత్వాన్ని కూడా సాధించగలరు,' అని చెప్పారు ఆ యోగి.

ఆ ప్రసిద్ధ యోగి వాక్కులు కొద్దిసేపు విన్న తర్వాత నిర్వాణ్‌జీ లేచి, 'బాల సాధూ! నువ్వు చెప్పిన విషయాల్ని నువ్వు స్వయంగా చేసి చూపగలవా?' అని అడిగారు. కాశీ నుంచి వచ్చిన ఆ స్వామికి ఇంత అవమానకరంగా ప్రశ్నిస్తోంది ఎవరో తెలియలేదు. కానీ ఆయన ప్రసంగాన్ని హర్షిస్తూ హరిద్వార్, హృషీకేశ్ నుంచి వచ్చిన ఎంతో మంది సాధువులు లేచి కరతాళ ధ్వనులు చేశారు. ఆ సాధువు తన తప్పిదాన్ని గుర్తించి, తాను గ్రంథాలు అధ్యయనం చేసి, ఆ ప్రమాణం మీద మాత్రమే మాట్లాడుతున్నానని అంగీకరించారు. తాను ఈ విషయాల్ని బోధించగల సమర్థులైన గురువుల కోసం వెతుకుతున్నాననీ, కానీ ఇంతవరకూ అది సాధ్యపడలేదనీ ఆయన

అన్నారు. ఆ తర్వాత ఆయన నిర్వాణ్‌జీని స్టేజీ మీదకి పిలిచి, ఈ పాదరసం శరీరం, శ్వాస, మనసు మీద చూపే ప్రభావాన్ని తెలిపే విజ్ఞానం గురించి చెప్పమన్నారు.

నిర్వాణ్‌జీ స్టేజీ మీదకి వచ్చారు. ఏ సాధనకైనా, ముందుగా సరిగ్గా కూర్చోవడం, సరిగ్గా శ్వాసించడం నేర్చుకోవాలన్నారు. సాధన పద్ధతికి లోబడి జరగాలన్నారు.

దాంతో స్వామీజీ ఆ ఉపన్యాసాన్ని ముగిస్తూ, 'రేపు నేను సంపూర్ణ సాధనా వ్యవస్థ బోధిస్తాను,' అన్నారు.

ఉపన్యాసం పూర్తి చేసిన తర్వాత స్వామీజీ సాధారణంగా నన్ను, 'నీకు ఈ ఉపన్యాసం ఎలా అనిపించింది?' అని అడిగేవారు. ఈ రోజు కూడా అలాగే అడిగారు. ఆయన నా నుంచి, 'బ్రహ్మాండంగా ఉంది మీ బోధ!' అనే సమాధానం వినాలని భావించారు. కానీ నేను ఇచ్చే జవాబులో నాదైన రీతిలో వేసిన ప్రశ్న ఉంది. నేను ఆయనకు చెప్పాను, 'స్వామీజీ, ఉపన్యాసం బాగుంది. కానీ మీరు మళ్లీ జనాన్ని మాయ చేశారు. నిర్వాణ్‌జీ ఆ ప్రదర్శన ఇచ్చారా? ఆయన వజ్రోలీ క్రియని వివరించారా?'

'ఆ, చేశారు. నిర్వాణ్‌జీ ఆ క్రియని ప్రదర్శించారు. మతంలో లాగానే యోగం, ఆధ్యాత్మికతలో కూడా అనేకానేక మూఢనమ్మకాలు ఉన్నాయి. జనం ఆ నమ్మకాలు నిజమో కాదో పరీక్షించి చూసుకోవాలని అనుకోరు. ప్రత్యుత్పత్తి అంగం ద్వారా పాదరసం తీసుకుంటే అది ఎక్కడికి వెడుతుంది? అది బ్లాడర్‌లోకో లేదా వృషణాల్లోకో వెడుతుంది. అక్కడ నుంచి మస్తిష్కానికి దాన్ని పంపే ట్యూబ్ గానీ, పైపుగానీ లేదు. మరి అక్కడ నుంచి మస్తిష్కానికి అది ఎలా వెడుతుంది? గది ఉష్ణోగ్రతలో పాదరసం ద్రవరూపంలో ఉంటుంది. అలాంటి నిర్దుష్టమైన ప్రాణాయామ పద్ధతుల్ని సాధన చేయాలంటే, కటివలయం వద్ద ఉష్ణోగ్రతని పెంచాలి. అప్పుడు పాదరసం ఆవిరిగా మారి నీ రక్త ప్రసరణ వ్యవస్థ చేత అవశోషించుకోబడి, నీ శరీరమంతటా రక్త ప్రసరణ ద్వారా సంచరిస్తుందని' స్వామీజీ బదులిచ్చారు.

పాదరసానికి గల విష ప్రభావం సుప్రసిద్ధమైనదే. దాన్ని తట్టుకునే విధంగా నీ శరీరానికి శిక్షణ ఇవ్వకపోతే, శరీరం పాదరస విషప్రభావానికి గురవుతుంది. దానివల్ల మూత్రపిండ వ్యవస్థ పాడవవచ్చు, నాడీ వ్యవస్థ పనిచేయకుండా పోవచ్చు, జ్ఞాపకశక్తి నశించవచ్చు, ఇంకా ఇతర వ్యవస్థలేవైనా చెడిపోవచ్చు. నీ శరీరంలో అగ్ని మర్మాన్ని నువ్వు తెలుసుకున్నపుడు మాత్రమే నువ్వు ఈ క్రియని అభ్యసించాలి. ఇది చాలా ఉన్నత స్థాయికి చెందిన ప్రక్రియ. కేవలం పరిపూర్ణత సాధించిన హఠయోగులు మాత్రమే ఈ క్రియని సాధించగలుగుతారు.

అప్పుడు స్వామీజీ నన్ను థర్మామీటర్ తెమ్మని అడిగారు. నేను తీసుకొచ్చాను. ఆయన దాన్ని పగలగొట్టారు. పాదరసం నేల మీద చెల్లాచెదురుగా పడిపోయింది. ఆయన నన్ను మెరిసే ఆ పాదరసం బిందువుల్ని ఏరుకుని రమ్మన్నారు. స్వామీజీ తన అరచేతిలో ఉంచుకుని వాటిని కదపసాగారు. అవి ఒక్కొక్కటీ కలుస్తుంటే పెద్ద బిందువుగా ఏర్పడ్డాయి. దాన్ని ఆయన ఒక ఘనస్థితిలో ఉన్న లోహంలా పట్టుకుని దాన్ని అరచేతిలో ఉంచుకుని, దాన్ని రుద్దమని ఆదేశించారు నన్ను. అది అన్ని వైపులకీ జారిపోతోంది కాబట్టి నేనలా చేయలేకపోయాను. ఆ తర్వాత ఆయన ఒక పేపర్ టవల్‌ని బౌల్‌లో ఉంచి నన్ను పాదరసాన్ని అందులో పెట్టమన్నారు. తర్వాత నన్ను ఒక గిన్నెలో నీరు, టవల్ తెమ్మని అన్నారు. నేను తెచ్చిచ్చాను. స్వామీజీ తన చేతుల్ని బౌల్‌లో పెట్టి కడుక్కుని తుడుచుకున్నారు.

అప్పుడు ఆయన పాదరసాన్ని పట్టుకున్నారు. తన ఎడమ అరచేతిలో పెట్టుకున్నారు. కుడిచేతి చూపుడు వ్రేలితో దాన్ని గిరగిరా తిప్పారు. స్వామీజీ చూపు పాదరసం మీదనే ఉంది. బహుశా ఆయన ధ్యానం చేస్తూ ఉండాలి లేదా మంత్రాన్ని జపిస్తూ అయినా ఉండాలి. ఒక

నిముషంలో దాని మెరుపుని కోల్పోయి, ఒక నల్ల ముద్దగా మారింది. స్వామీజీ ఇంకా దాన్ని కదుపుతూనే ఉన్నారు, ఆ ముద్ద ఇంకా ఆరిపోయి, మరింత గట్టిగా మారింది, చివరికి ఆయన అరచేతిలో అది ఒక నల్లటి చూర్ణం ముద్దలా మారింది. ఆ తర్వాత ఆయన తన చేతుల్ని టవల్‌తో తుడుచుకుని ఆ పాదరసాన్ని అరచేతి గుండా తనలోకి హరాయించుకున్నానని నాతో చెప్పారు. తను మళ్లీ దాన్ని ఎప్పుడు కావాలంటే అప్పుడు మూత్రం ద్వారా విసర్జిస్తానని చెప్పారు.

అప్పుడు ఆయన మధ్యయుగాల్లో యూరోప్ లో రసవాదులు పాదరసాన్ని ఎలా ఉపయోగించారో చెప్పారు. ఆయుర్వేదంలోనూ, చైనీస్ ఔషధశాస్త్రంలోనూ దాని ఔషధ ఉపయోగాల గురించి ఏం చెప్పారో వివరించారు అయితే చాలా వరకు ఈ శాస్త్రం ప్రస్తుతం అంతరించిపోయిందని హెచ్చరించారు. మిగిలి ఉన్నది సమగ్రంగా లేదు. అందువల్ల ఈ శాస్త్రాన్ని ఉపయోగించి వైద్యం చేయడం గానీ లేదా దీన్ని ఉపయోగించి మానవాళిని ఆధ్యాత్మిక పథం వైపు మేల్కొల్పేందుకు మార్గనిర్దేశం చేసేందుకు ప్రయత్నించడానికి కానీ వీలు పడదని అన్నారు. ఇంకా, పాదరసాన్ని ఉపయోగించడం చాలా ప్రమాదకరమని చెప్పారు స్వామీజీ. ఒక చిన్న తప్పు కూడా ప్రాణాంతకం కావచ్చునన్నారు. కొంతమంది అరుదైన యోగులు మాత్రమే ఈ అమూల్యమైన జ్ఞానాన్ని సంరక్షిస్తున్నారని అన్నారాయన. ఈ విద్యని రహస్యంగా ఉంచడానికి కారణం ఏమిటంటే ఏదైనా మహత్తరమైన రహస్య జ్ఞానం ఉందంటే, దాన్ని దుర్వినియోగం చేయడంలోనూ, దుర్భాషలాడడంలోనూ, వక్రీకరించడంలోనూ మానవులు మంచి దిట్టలని వారికి తెలుసు.

కొంత సమయం గడిచిన తర్వాత ఆయన నన్ను బౌల్‌ని శుభ్రం చేయమనీ, దాన్ని టవల్‌తో తుడిచి ఆరబెట్టమనీ అడిగారు. అలా చేసిన తర్వాత ఆయన అందులో మూత్ర విసర్జన చేశారు. మెరుస్తున్న పాదరసం చుక్కలు అడుగున కనిపించాయి.

ఈ ప్రదర్శన తరువాత, స్వామీజీ విషయాన్ని విశ్లేషించి చెప్పసాగారు. 'మెదడు, శ్వాస, లైంగిక శక్తిని పాదరసంతో పోల్చవచ్చు. పాదరసంలాగానే, అవి కూడా అస్థిమితంగా ఉంటాయి. మైండ్, శ్వాస, లైంగిక శక్తి పరస్పర ఆశ్రిత సంబంధంతోటి ఉంటాయి. ఒకటి అనిశ్చితంగా ఉంటే మిగతా రెండూ కూడా అస్థిరంగా ఉంటాయి; ఒకటి స్థిరత్వంలో ఉంటే మిగతా రెండింటికీ కూడా అది స్థిరత్వం తెస్తుంది. పాదరసం అద్భుతమైన పదార్థం. దాని ప్రవర్తనని ముందుగా ఊహించలేము. దీని ప్రవర్తన మనస్సు, శ్వాస, లైంగిక శక్తికి ప్రతిస్పందనగా మారుతూ ఉంటుంది. యోగులు పాదరస స్థిరీకరణ ద్వారా మనస్సు, శ్వాస, లైంగిక శక్తిని అదుపు చేయడం సాధ్యమని కనుగొన్నారు. ఒకసారి మీరు ఈ మూడింటి మీదా పట్టు సంపాదిస్తే మీరు ప్రత్యక్ష, పరోక్ష ప్రకృతి శక్తులన్నింటి మీదా పట్టు సంపాదించగలుగుతారు. యోగులు పాదరస శాస్త్రాన్ని వైద్యం కోసం ఉపయోగించి తమకి వచ్చిన రుగ్మతల్నీ, ఇతరుల రుగ్మతల్నీ కూడా నయం చేశారు. వారు ఈ విజ్ఞానాన్ని సూర్య విజ్ఞానాన్ని (మార్మిక సౌర శాస్త్రం) అందుకునే మార్గంగా ఉపయోగించారు. పాదరస విజ్ఞానం ద్వారా వారు అగ్ని తత్వానికి గల సూక్ష్మమైన మర్మాన్ని ఆవిష్కరించారు.'

మర్నాటి ఉదయం అందరూ ఆడిటోరియంకి వచ్చారు. స్వామీజీ ఆ రోజు ఏదో కొత్త విషయం, ఉన్నత స్థాయికి తీసికెళ్లే సాధన గురించి చెప్తారని ఆశించారు. కానీ మీలో ఉన్న దైవత్వానికి ప్రణమిల్లుతున్నాను, అని ప్రేక్షకులకు అభివాదం పలకడం పూర్తి కాగానే, స్వామీజీ ఉపన్యాసం వేరే రకంగా ప్రారంభించారు: 'మీతో వచ్చిన సమస్య ఏమిటంటే మీరు సరైన పద్ధతిలో సాధన చేయరు. మీరు ఈ కోకా కోలా సంస్కృతికి అలవాటుపడి దారితప్పారు. సీసా ఓపెన్ చేయడం, డ్రింక్ త్రాగడం, దూరంగా విసిరి పారేయడం!

'మీరు చేసే సాధన కూడా అలాగే ఉంటుంది. మీరు ఏదో ఒక కొత్త విషయం నేర్చుకుంటారు. కొద్ది రోజులు సాధన చేస్తారు. ఆ తర్వాత మరో కొత్త గురువుని వెతుక్కోవడం, మరో మంత్రం తీసుకోవడం! ఇంతే! మీరు గెంతుతూ ఉంటారు. అది మీ గెంతులేసే మనసుని సూచిస్తుంది.

'మీకు మీరు సాయం చేసుకోలేరు. ఎందుకంటే మీరు శ్వాసించే పద్ధతులే తప్పుల తడకగా ఉంటాయి. మీకు సరైన విధంగా శ్వాసించడం రాదు. మీకు మీరు పరీక్షించుకుని చూడండి. పైపైన శ్వాసిస్తూ ఉంటారు. శ్వాసిస్తున్నపుడు ధ్వని రావడం, కుదుపులు కుదుపులుగా శ్వాసించడం, ఉచ్ఛ్వాస, నిశ్వాసల మధ్య అంతరం– ఇలా ఎన్నో రకాలుగా ఉంటుంది మీ శ్వాస! ఈ విధంగా శ్వాస పైపైనే తీసుకోవడం, కుదుపులు, ధ్వనులతో తీసుకోవడం, ఆపి ఆపి తీసుకోవడం వల్ల మీ మనస్సు గానీ, శరీరం గానీ ఆరోగ్యంగా ఉండవు. ఏ సాధనకైనా, మీరు బలంగా, ఆరోగ్యంగా ఉండాలి. మీరు చేసే సాధన క్రమపద్ధతిలో ఉంటే, ఒక నిర్దిష్టమైన ముద్రలో స్థిరంగా ఉంటే, మీ శరీరం కూడా స్థిరత్వం చేకూర్చుకుంటుంది. మీ శ్వాస శాంతంగా ఉంటుంది. మీ మనసు పరమ ప్రశాంతంగా ఉంటుంది. మీకు శరీరం ఉన్నా మీరు శరీరం కాదని అప్పుడు మీరు గుర్తిస్తారు. అప్పుడు మీరు మీ శరీరం ఒక అద్భుతమైన సాధనమనీ, దాని గురించి మీరు చాలా జాగ్రత్తలు తీసుకోవాలనీ ఆలోచిస్తారు. అనారోగ్యంతో బాధపడే శరీరం మనసుని చెదరగొడుతుంది. అప్పుడు మీరు చేయాల్సిన వేరే పనులేవీ చేయడానికి సమయం ఉండదు. అందుకే శారీరిక ఆరోగ్యాన్ని సంరక్షించుకుంటూ ఉండడం అనేది ఆధ్యాత్మిక సాధనలో విడదీయలేని అంతర్భాగం.'

స్వామీజీ ఇదే రీతిలో ప్రసంగం చేశారు. అప్పుడు డా. బల్లెంటైన్ వైపు చూస్తూ, 'ఈ సాయంత్రం ఎవరు బోధిస్తున్నారు? డా. బి! మీరేనా? ఈ రాత్రి చేసే ప్రసంగంలో డా. బల్లెంటైన్ మీకు మంచి ఆరోగ్య సూత్రాల్ని బోధించమని కోరుతున్నాను. అలాగే కెవిన్ హాఫ్‌మాన్ మీరు కూర్చునే ముద్ర సరిగా ఉందో లేదో చూడమని కోరుతున్నాను. ఎందుకంటే సరైన భంగిమలో కూర్చుంటే తప్ప మీరు దేన్నీ సాధన చేయలేరు.'

'స్వామీజీ మళ్లీ పాత తరహాలోకే వెళ్లిపోయారు. ఆయన కొత్త విషయం ఏదీ చెప్పడం లేద'ని శ్రోతల్లో చాలామంది నిరాశ చెందారు. కొంతమంది మాత్రం తాము సాధన చాలా బాగా చేయాలనీ, సాధనకు అవసరమైన మౌలికమైన అంశాలపై బాగా పట్టు సంపాదించాలనీ గుర్తించారు. ఎందుకంటే ప్రాథమికమైన అంశాల మీద పట్టు దొరికితేనే ఉన్నత స్థాయి అంశాల్ని సాధన చేయడానికి వీలవుతుంది.

మర్నాటి ఉదయం స్వామీజీ మళ్లీ మొదలుపెట్టారు. 'నేను మీకు ఈరోజు నిజమైన సాధన ఎలా ఉంటుందో బోధిస్తాను. మీరు శ్రద్ధగా వింటే, సాధన విలువ అర్థమవుతుంది. ధ్యానం చేయడానికి ముందుగా తల, మెడ, మొండెం నిటారుగా ఉండాలి. కూర్చునే సమయంలో కూడా ఇలా కూర్చోవడం ఆరోగ్యకరం, సౌకర్యవంతంగా ఉంటుంది. ఈ విధంగా కూర్చోవడంలో వెన్నెముక ఆధారబిందువు వద్ద వేడి ఉత్పన్నమవుతుంది. ఆ వేడి పెరుగుతూ పోవడం వల్ల ప్రాణ శక్తి విస్తరించి ఊర్ధ్వముఖంగా ప్రయాణిస్తుంది. ఎందుకంటే వెన్నెముక తిన్నగా ఉండి, నాడీ వ్యవస్థ విశ్రాంతిగా ఉంటే శక్తి వెన్నెముక గుండా శిరో భాగానికి నిరాటంకంగా ప్రవహిస్తుంది. ఈ భంగిమలో మీరు సోమరిగా బద్ధకంగా ఉండరు. సరైన భంగిమ లేకపోతే మీరు మీ ధ్యానంలో అనేకమైన ఆటంకాల్ని ఎదుర్కోవాల్సి వస్తుంది. ధ్యానమే అన్ని మూలాలకీ కేంద్రం.'

సెమినార్ కోర్సులో ప్రతి ఉపన్యాసం చివరలోనూ స్వామీజీ, తాను మర్నాటి ఉపన్యాసంలో ఒక అపూర్వమైన సాధనా పద్ధతి బోధించబోతున్నానని చెప్పేవారు. కానీ మళ్లీ మౌలికమైన

అంశాల దగ్గరకే వచ్చేవారు. తాను ఎలా కూర్చున్నానో స్వయంగా వచ్చి పరిశీలించమనీ, తను శ్వాసించే విధానం చూడమనీ ఆయన జనాన్ని వేదిక మీదకి పిలిచేవారు. ఆయన హఠయోగంలో ఒక ప్రత్యేకమైన టెక్నిక్‌ని ప్రదర్శించారు కూడా. అది 'అగ్నిసార' అనబడే ఒక ప్రాణాయామం. ఆరవ రోజు స్వామీజీ, వెన్నెముక మూలంలో ఉండే కుండలినీ అగ్ని గురించి మాట్లాడసాగారు. జ్యోతిపథంలోని ప్రకాశమే అంతరంగ చైతన్యానికి దారి తీస్తుందని చెప్పారయన. ఈ పథంలో మీరు మీలో నిగూఢంగా నిద్రాణంగా ఉన్న శక్తిని మేల్కొల్పడానికి వర్తమాన స్థాయికి చెందిన శారీరిక, మానసిక శక్తుల్ని సంపూర్ణంగా వినియోగించుకోవచ్చునని చెప్పారు. ఈ నిగూఢంగా ఉన్న శక్తే 'కుండలినీ శక్తి' గా పిలవబడుతోంది. ఈ అంతరంగ చైతన్యంలో శ్వాస చాలా కీలకమైన పాత్ర పోషిస్తుందని చెప్పారు. తాను మర్నాడు ఓ మర్మం గురించి చెప్పబోతున్నానంటూ మరోసారి వాగ్దానం చేశారు స్వామీజీ.

ఏడవ రోజు ఉదయం, 'నేను మిమ్మల్ని ఒక షార్ట్‌కట్ ద్వారా లక్ష్యానికి చేరుస్తాను. ఆ షార్ట్‌కట్ ఏమిటంటే 'మీ అహంకారాన్ని వదులుకోవడం!' దాన్ని ఉన్నత స్థాయి చైతన్యానికి దాన్ని సమర్పించాలి. మీలో ఉన్న పనికిమాలిన అంశాల్నీ, ప్రతికూల అంశాల్నీ, చెత్తనీ ఆ అగ్నిలో ఆహుతి చేయాలి. ఆ అగ్నే మీ అంతర గురువు. ఈ అగ్ని సర్వవ్యాపి. కానీ కొన్ని వ్యావహారిక లక్ష్యాల కోసం అది మీ శరీరంలో 'నాభికేంద్రం', కనుబొమల మధ్యన ఉండే 'గురు చక్రం', ఇలా ఈ రెండు చోట్ల ఈ అగ్ని ఉంటుంది. నాభి కేంద్రంలో ఉన్న అగ్నిని ధ్యానం చేస్తే దాని క్రింద ఉన్న రెండు చక్రాలకీ సంబంధించిన ఆటంకాలన్నీ తొలగిపోతాయి. ఈ మొదటి రెండు చక్రాలూ స్వీయ పరిరక్షణ, ఆకలి, నిద్ర, మైథునానికి కేంద్రాలు. ఈ నాలుగు ఫౌంటెన్ల నుంచీ భావావేశానికి చెందిన అసంఖ్యాకమైన ప్రవాహాలు విరజిమ్మబడుతూ ఉంటాయి.

'బలహీనుడైన వ్యక్తి మెదడు నిరంతరం కళవళపడుతున్న భావావేశ ప్రవాహాల్లో ఈదుతున్న చేప వంటిది. కానీ మీరు నేరుగా నాభికేంద్రానికి వెళ్లగలుగుతున్నారంటే, అనాది ఆకాంక్షల మూలం నుంచి మీలో లేస్తున్న పశు ప్రవృత్తుల్ని ఆ అగ్నికి ఎలా ఆహుతి ఇవ్వాలో తెలిస్తే మీరు దృఢత్వం సంతరించుకుంటారు. మీపై మీరు అదుపు కలిగి ఉంటారు. నాభి కేంద్రం మీద ధ్యానం నిలిపితే మీరు శారీరికంగానూ, భావావేశపరంగానూ బలంగా ఉంటారు. గురుచక్రంలోని అగ్నికి విలక్షణమైన వైవిధ్యభరితమైన గుణం ఉంది. గురుచక్రంలో ప్రస్ఫుటమయ్యే అగ్నికి ఆధ్యాత్మిక తత్వం ఉంది. గురుచక్రంలోని అగ్నిపై ధ్యానిస్తే మీకు మానసికంగా స్పష్టత ఏర్పడుతుంది. అన్ని సందిగ్ధతల్నీ అధిగమిస్తారు, మిమ్మల్ని మీరు సరిగా అర్థం చేసుకోగలుగుతారు. దైవకృపకి పాత్రులవుతారు.

'చెప్పండి, నేను మీకు ఏ విషయం బోధించను? గురుచక్రంలోని అగ్ని మీద ధ్యానించడమా? నాభి చక్రంలోని అగ్ని మీద ధ్యానించడమా?' అని అడిగారు.

శ్రోతలు ఏది వినాలో తేల్చుకోలేకపోయారు. కొంతమంది నాభి చక్రంలోని అగ్ని మీద ధ్యానించడం గురించి చెప్పమంటే, మరి కొంతమంది గురుచక్రంలోని అగ్ని మీద ధ్యానించడం గురించి చెప్పమన్నారు. ఇంకొంతమంది రెండింటి గురించీ చెప్పమన్నారు.

స్వామీజీ తన స్టూడెంట్స్‌కి అప్పుడు ప్రాక్టికల్‌గానూ, సిస్టమాటిక్‌గానూ ఉండాలని చెప్పారు. 'నాభి చక్రం మీద ధ్యానిస్తున్నపుడు మీకు కొద్ది ఆటంకాలే ఎదురవుతాయి. ప్రయాణం తేలిగ్గా సాగిపోతుంది. కాబట్టి, నా ఉద్దేశ్యంలో, ఈ సంవత్సరం మీరు నాభి చక్రం మీద ధ్యానించడం నేర్చుకుంటే మంచిది. వచ్చే సంవత్సరం నేను మీకు గురు చక్రం మీద ఎలా ధ్యానించాలో నేర్పుతాను. గురుచక్రం మీద ధ్యానిస్తే ఆత్మ ప్రజ్ఞ ద్వారాల్ని తెరవడం సాధ్యపడుతుంది.'

స్వామీజీ అగ్నిసార సాధనా పద్ధతిని వివరిస్తున్నారు. ఇది హఠయోగ ప్రక్రియ. నాభి కేంద్రంలోని అగ్నిని ఉత్తేజపరిచేందుకు అగ్నిసార ఉపకరిస్తుంది. స్వామీజీ స్వయంగా అగ్నిసార ప్రక్రియ చేస్తూ, అప్పుడు తీసుకునే శ్వాసలో పిరుదులు లోపలికి ఎలా సంకోచించుకుంటాయో, శ్వాస విడిచిపెట్టే సమయంలో మొత్తం కటి వలయాన్నీ, పొత్తికడుపు కండరాల్నీ నాభి కేంద్రం వైపు ఎలా లాగబడతాయో ప్రేక్షకుల్ని స్టేజీ మీదకి వచ్చి చూడమని చెప్పారు. అప్పుడు ఆయన ఇన్స్టిట్యూట్ బోధకుల్ని ప్రేక్షకుల్లో ప్రతి ఒక్కరికీ వారు ఇంటికి వెళ్లే లోపల వ్యక్తిగతంగా శిక్షణనివ్వమనీ, ఆ క్రియని సరిగా చేసే విధానాన్ని తెలపమనీ సూచించారు.

ఈ సెమినార్ అయిన కొన్ని వారాల తర్వాత స్వామీజీ భారతదేశానికి బయల్దేరి వెళ్లారు. అక్కడ ఆయన పూర్తి చేయాల్సిన హాస్పిటల్ ప్రాజెక్ట్ ఒకటి ఉంది. ఆయన వచ్చినపుడు, ఆయన శిష్యుల్లో కొంతమంది డెహరాడూన్‌కీ హృషీకేశ్‌కీ మధ్యన ఉన్న ప్రాంతం చాలా బాగుంది. అక్కడ రోడ్డు ఉంది. కరెంటు సౌకర్యం ఉంది. తర్వాత కావాలంటే విస్తరించుకోవడానికి వీలుగా మైళ్ల కొద్దీ వ్యాపించిన వ్యవసాయ క్షేత్రం ఉంది. ఢిల్లీకీ ఉత్తర భారత దేశంలోని ప్రధాన నగరాలకూ త్వరితగతిన చేరుకునేందుకు ఆ ప్రాంతాలకు దగ్గరగా ఒక చిన్న ఎయిర్ పోర్టు ఉంది. స్వామీజీకి సరిగ్గా ఇలాంటి ప్రాంతమే కావాలి. ఇక ప్రాజెక్టు మొదలైపోయింది. ముందుగా అక్కడ ఒక అవుట్ పేషెంట్ వార్డులో ఒక డిస్పెన్సరీ ప్రారంభించబడింది. అక్కడ నుంచి అది మరింత విస్తరింపబడింది. మరో ఆరేళ్ల తర్వాత అది పూర్తి స్థాయి సౌకర్యాలతో కూడిన ఓ ఆధునిక ఆసుపత్రిగా ఆవిర్భవించింది. స్వామీజీ అక్కడ యేటా ఏడెనిమిది నెలలు ఉండేవారు. అమెరికాకు ఆయన వేసవిలో తిరిగి వచ్చి ఐదు నెలలు గడిపేవారు.

జీవితంలోని ఈ దశలో స్వామీజీ పని చేయడంలోనూ ఆయన వ్యక్తిగత జీవనంలోనూ కూడా విప్లవాత్మకమైన రూపాంతరణని నేను గమనించాను. ఆసుపత్రి ప్రాజెక్ట్ మొదలుపెట్టక ముందు భారత దేశం రావడమంటే ఆయనకు భలే సంతోషంగా ఉండేది. భారతదేశం ఆయనకు ఒక విశ్రాంతి గృహంలా ఉండేది. స్వామీజీ అక్కడ చాలా ప్రశాంత జీవనం గడిపేవారు. ఢిల్లీలో ఉన్నపుడు గానీ, కాన్పూర్ సందర్శించినపుడు గానీ ఆయన ఎక్కడున్నారో ఏం చేస్తున్నారో ఎవరికీ తెలిసేది కాదు. ఆ రోజుల్లో ఆయన శీతాకాలంలో తన వాస్తవ నివాసమైన హిమాలయ శిఖరాల్ని దర్శించేవారు. శీతాకాలంలో ఆయన తన సమయాన్ని వింధ్య పర్వతాల్లో సుదూర ప్రాంతాల్లో గడిపేవారు. కానీ హాస్పిటల్ ప్రాజెక్ట్ మొదలైన తర్వాత భారతదేశంలో ఎక్కడికి వెళ్లినా ప్రజలు ఆయనకు బ్రహ్మరథం పట్టారు, ప్రజలు ఆయన సందర్శనార్థం బారులు తీరేవారు. రోజుకి ఇరవై గంటలపాటు మీటింగ్‌లు, భూమి కోసం గ్రామస్తులతో చర్చలు చేయడం, రాజకీయ నాయకులతో భేటీ కావడం, ఆర్కిటెక్ట్‌లు, బిల్డర్లు, ల్యాండ్‌స్కేపర్లతో కలిసి ప్లానింగ్ చేయడం, డాక్టర్లనూ, ఇతర సిబ్బందినీ రిక్రూట్ చేసుకోవడం, నిర్మాణ కార్యకలాపాల్ని సమీక్షించడం చేసేవారు.

ఒకసారి సైట్‌లో వెయ్యిమంది వర్కర్లని నియమించారు. ఆ ఏరియాలో అంతకు ముందెన్నడూ చూడనంత విపరీతమైన జనసమ్మర్దం కనిపించింది. పనులు వేగవంతంగా జరుగుతున్నాయి. ఈ సొసైటీలో మీరు ఏదైనా పనులు చేయాలంటే పైనుంచి క్రిందికి అందరికీ లంచాలు ఇచ్చుకుంటూ రావాలి. కానీ స్వామీజీ ఈ పనులన్నీ సత్యం, ధర్మం, ప్రేమ, నిస్వార్థ సేవ ఆధారంగా పూర్తి చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఇది స్థానిక రాజకీయ నాయకులకి కంటగింపుగా మారింది. ఈ బృహత్తరమైన ప్రాజెక్టులో కొంత భాగాన్ని ఎలాగైనా కాజేయాలని భావిస్తున్నారు. కానీ స్వామీజీ వాళ్లకి ఏమైనా సరే, లంచం ఇవ్వకూడదని భావిస్తున్నారు. వాళ్ల డిమాండ్లను ఏ విధంగానూ ఒప్పుకోకూడదని ఆయన భావిస్తున్నారు. అందుకు వాళ్లు స్వామీజీ

మాటలు నమ్మకూడదని ప్రచారం మొదలుపెట్టారు. ఉదా. వాళ్లు గ్రామస్థుల్ని తప్పుత్రోవ పట్టించారు. స్వామీజీ తెరుస్తున్న హిమాలయన్ ఇన్స్టిట్యూట్ హాస్పిటల్ ట్రస్ట్ వాళ్లకి లేనిపోని కష్టాల్ని తెచ్చిపెడుతుందని భయపెట్టారు. ఈ హాస్పిటల్‌ని స్థాపించి స్వామీజీ ఆ ప్రాంతానికి పాశ్చాత్య సంస్కృతిని తీసుకొస్తారనీ, అది వాళ్ల మౌలిక సంస్కృతికి గల ఔన్నత్యాన్నీ, ఆధ్యాత్మిక వారసత్వ సంపదనీ పాడు చేస్తుందనీ దుష్ప్రచారం చేపట్టారు. స్వామీ రామ జన్మించింది హిమాలయ ప్రాంతంలోనే అయినా, ఆయన అమెరికా స్వామిగా మారిపోయారని వాళ్లు గ్రామస్తులకు నూరిపోశారు. ఆయన ఇక్కడికి వచ్చి చేసేదేమీ లేదనీ, ఆయన సీఐఏ ఏజెంట్ కాబట్టి బోలెడంత డబ్బు ఆయన దగ్గర మూలుగుతోందనీ ప్రచారం చేశారు.

గ్రామస్తులకి అంతకంటే మించి వేరే సమాచారమేమీ తెలియదు. శతాబ్దాలుగా వాళ్లు అణిగి మణిగీ బ్రతుకుతున్నవాళ్లు. అందరూ వాళ్లని దోపిడి చేసేవాళ్లూ, తప్పుత్రోవ పట్టించేవాళ్లే! వాళ్లని వాళ్ల నాయకులు ఇంకా దోచుకుంటారు. ఇక్కడా, భారతదేశంలోనూ మరి కొన్ని అభివృద్ధి చెందిన ప్రాంతాల్లోనూ డబ్బూ, శక్తీ, మతం చుట్టూ, జాతివాదాల చుట్టూ, కులాల చుట్టూ తిరిగింది. ఇప్పుడు వాటికి తోడు స్వామీజీ తమ విలువైన సమయాన్నంతా ఈ అవినీతి లంచగొండి ప్రాంతీయ నాయకులతో మాట్లాడ్డానికీ, మరి కొన్నిసార్లు వివిధ రకాలైన న్యాయపరమైన మార్గాల ద్వారా నడిపే వ్యవహారాలకీ వెచ్చించాల్సి వచ్చింది. తన జీవితాన్నంతా భగవంతుని ధ్యానంలో గడిపిన సాధువుకి, సకల మానవాళికీ తమ ప్రేమని పంచాలనుకునే సాధువుకి నిజంగా ఇది పెద్ద పరీక్షే.

ఆయన వేసవిలో అమెరికా నుంచి తిరిగి వచ్చినపుడు, స్వామీజీ చాలా అలసిపోయి కనిపించారు. ఆయన అది జెట్‌లాగ్ అనుకున్నారు. కానీ నా మనసు అది ఏడునెలలపాటు పడ్డ నిరంతర శ్రమ అని చెప్తోంది. నేను గానీ, మరెవరూ గానీ ఆయనకు విశ్రాంతి తీసుకోమని చెప్పడానికి సాహసించలేము. ఆయనకి ఉన్న అంకితభావం మాకు తెలుసుగా! 'జీవితమనే వృక్షానికి రెండే రెండు శాశ్వత ఫలాలు- కఠోర పరిశ్రమ, దైవచింతన!' అంటారాయన. స్వామీజీ తిరిగి వచ్చినపుడు ఇన్స్టిట్యూట్‌కి ఓ సంతోషకరమైన ఆహ్లాదభరితమైన చైతన్యం వస్తుంది.

ఆశ్రమవాసులకి స్వామీజీ వస్తున్నట్టు తెలిసినా, ఆయన ఏకాంతానికి భంగం కలిగించరు. స్వామీజీ వారిని చూడాలనుకున్నపుడే వారు ఆయన్ని కలుస్తారు. కానీ వాళ్లు ఆయన్ని చూడడానికి ఓ పద్ధతి కనిపెట్టారు. స్వామీజీ టెన్నిస్ ఆడడానికి వెళ్లినపుడు గ్రౌండ్ చుట్టూ చేరి ఆయన్ని చూడడానికి ప్రయత్నించేవారు.

1987 నుంచీ స్వామీజీ తక్కువగా కనిపించేవారు. ప్రయాణాలూ, బోధలూ తగ్గించేశారు. వారు ఎక్కువగా ధ్యానంలోనూ, సంగీతంలోనూ, పుస్తకాలు రాయడంలోనూ తమ సమయాన్ని గడిపేవారు. ఆయన చాలా అరుదుగా ఉపన్యాసాలు ఇచ్చేవారు. అయితే ఆయన ప్రతి వేసవిలోనూ 'జ్యోతిపథం-ప్రకాశం' అంశం మీద నిగూఢమైన అంశాల్ని వివరిస్తూ ఒక గొప్ప సెమినార్ నిర్వహించేవారు. ఆ సెమినార్‌కి దేశం నలుమూలల నుంచీ, కెనడా, యూరప్, అన్నివైపుల నుంచీ ఆయన్ని చూడడానికి వచ్చేవారు. ఆయన ఉపన్యాస ధోరణి కూడా చాలా మారింది. ఒకవైపు ఆయన సాధనకి సంబంధించిన మౌలికాంశాల మీద పట్టు సాధించడానికి గల ప్రాముఖ్యతని చెప్పేవారు. అంటే స్థిరాసనంలో కూర్చోవడం, సరిగా శ్వాసించడం, పోషక విలువలు గల తేలికపాటి ఆహారాన్ని సకాలంలో భుజించడం, సరైన మానసిక వైఖరి కలిగి ఉండడం, నియమబద్ధంగా కార్యకలాపాల్ని నిర్వహించడం గురించి చెప్పేవారు. మరో వైపు, తన బోధనలో మరింత నిగూఢమైన అంశాల్ని బోధించేవారు. ఈ సందర్భంలోనే స్వామీజీ

'బిందు భేదన' (భృకుటి మధ్యంలో ఉన్న ఆజ్ఞా చక్రాన్ని మేల్కొల్పడం) 'షార్ట్‌కట్' గురించి, శక్తిపాతం, భగవత్కృప గురించీ చెప్పారు.

ఇప్పుడు ప్రతి వేసవిలోనూ ఆయన ఉపన్యాసం జీవితాన్ని సద్వినియోగం చేసుకోమనే సందేశంతో సాగిపోతోంది, 'జీవితం చాలా చిన్నది, ప్రయాణం సుదీర్ఘమైనది. మీరంతా మేల్కోవాలని చెప్తున్నాను. మీ సమయాన్నీ, నా సమయాన్నీ కూడా వృథా చేయవద్దు. నా దగ్గర ఉన్నదంతా మీ కోసమే. నాకు మీరంటే ప్రేమ. మీ దయాగుణం, నిస్వార్థ సేవ నాకు చాలా ఇష్టం. కానీ మీ కోసం మీరు ఇప్పటిదాకా ఏం చేసుకున్నట్టు? మీరు ఈ ప్రదేశాన్ని విడిచిపెట్టే సమయంలో మీ వెంట వచ్చేదేమిటో మీరు చూసుకున్నారా? మృత్యు భయం ఇప్పటికీ మీ వెన్నాడుతోంది. ఎందుకంటే మీరెక్కడ నుంచి వచ్చారో మీకు తెలియదు. మీరు వెళ్లేది ఎక్కడికో కూడా మీకు తెలియదు. జీవిత లక్ష్యం, విలువ తెలియకుండా మరణిస్తే ఈ జీవితం పూర్తిగా వ్యర్థమైపోయినట్టే.

'మీరు కావాలనుకుంటే మా సంప్రదాయంలోని ఉన్నత స్థాయి యోగ సాధనా పద్ధతుల గురించి చెప్తానని నేను చాలాసార్లు మీకు వాగ్దానం చేశాను. నేను మీకు యోగ నిద్రని బోధించగలను. అది మీ శరీరానికి సంపూర్ణ విశ్రాంతినిస్తుంది. అతి కొద్దిసేపు నిద్రపోయినా ఆ యోగనిద్ర మీకు చాలా శక్తిసామర్థ్యాలనిస్తుంది. యోగనిద్ర పరమ ప్రయోజనకారి. అది మీకు అంతర్గత విశ్లేషణ సామర్థ్యాన్ని పెంపొందించడానికి ఉపకరిస్తుంది. నేను మీకు బిందు భేదన పద్ధతిని కూడా బోధించగలను. అది మీకు సూక్ష్మతరమైన ఆటంకాల ద్వారా ఏర్పరచబడే ముడుల్ని విచ్ఛిన్నం చేస్తుంది. అప్పుడు మీకు ఎలాంటి సందేహాలూ ఉండవు. భయం అనేది మాయమైపోతుంది. ఆ స్థితి భయమూ, సందేహాలూ తొలగిపోతే, మీతో మీకూ, ఇతరులకూ బాంధవ్యం ఏర్పడదానికి ఉపకరిస్తుంది. అప్పుడు మీరు సంపూర్ణంగా మారిపోతారు.

'మీ గురించి మీరు ఒక కొత్త కోణంలో అర్థం చేసుకుంటారు. మీ చుట్టూ ఉన్న బాహ్య ప్రపంచమూ మీకు మరో ఉన్నత కోణంలో అర్థమవుతుంది. విషాదం, విచారం మిమ్మల్ని కనీసం తాకను కూడా తాకలేవు. కానీ ఇప్పటిదాకా ఎవరూ ముందుకు రాకపోవడం విచారంగా ఉంది.

'మీరు నాకు డబ్బిస్తారు. నేనేం చేసుకోను ఆ డబ్బుని? ఐహిక వస్తువుల నుంచి వదిలించుకోవడానికి ఓ మార్గం వెతుక్కోవాలి నేను. అందుకే నేను ఈ హాస్పిటల్‌ని స్థాపించదలిచాను. త్వరలోనే నేను వెళ్లిపోతాను. కానీ మనం కలిసి చేసిన పనులకి సంబంధించిన జ్ఞాపకాలు మీ మనసులో కదలాడుతూ ఉంటాయి. నేను మీకు గుర్తొస్తాను. మీరు నాకు గుర్తొస్తారు.'

ఈ సందేశం ఎంతోమంది స్టూడెంట్స్‌ని మేల్కొల్పింది. 'జ్యోతిపథం-ప్రకాశం' సెమినార్లలో వారు యోగనిద్ర, బిందు భేదన పద్ధతులు రెండింటి సాధనా పద్ధతుల్నీ నేర్పమని స్వామీజీని కోరారు. కానీ స్వామీజీ మళ్లీ పాత పద్ధతిలోనే మౌలికాంశాలు సక్రమంగా నేర్చుకోనిదే వీటి దాకా రాకూడదని చెప్పారు. కాకపోతే చెప్పే ధోరణిలో కాస్త మార్చి ఆధునికంగా చెప్పారు. 'జ్యోతిపథం-ప్రకాశం' గురించి ఆయన మొట్టమొదటిసారి చెప్పినపుడు ఆయన సరిగ్గా కూర్చోవడం, శ్వాసించడం, ప్రాణాయామంలో ఉన్నత స్థాయి మెళకువలు, బంధాలు, ముద్రలు, అభ్యాసాలతో కూడిన మనోనేత్ర చిత్రీకరణల గురించి చెప్పారు. ఆ సంవత్సరం అగ్నిసార అభ్యాసం ఆ తర్వాత శవాసనం ఎలా వేయాలో చెప్పారు. ఇది శరీరంలో అరవై ఒక్క పాయింట్లలో విశ్రాంతిని తీసుకువస్తుంది. అందుకే ఈ యోగ నిద్ర టెక్నిక్ ఎంతో ప్రముఖమైనది.

కొన్ని సంవత్సరాలు గడిచిన తర్వాత, స్వామీజీ మనసు మర్మాన్ని వివరించడం మీద మరింతగా దృష్టి పెట్టారు. అలాగే నిరంతరం ఆనంద స్థితిలో ఉండాల్సిన అవసరం గురించి

తెలియజెప్పారు. 'ఆనందం నువ్వు స్వయంగా సృష్టించుకోవచ్చు,' అన్నారు. 'మీరు ఏదైనా ఆశిస్తున్నారా లేదా ఎవరైనా వచ్చి మిమ్మల్ని ఆనందింపజేయాలని భావిస్తున్నారా? అయితే దాన్ని మర్చిపోండి. మీరు కోరిన వస్తువుల్ని పొందడం మీకు సంతోషాన్ని ఇవ్వదు. మీకు అది తాత్కాలికమైన ఉత్తేజాన్ని కలిగిస్తుంది. మీరు భద్రంగా ఉన్నారనే భావనని కలుగజేస్తుంది. కానీ మీలో భయం ప్రవేశిస్తుంది. ఎందుకంటే ఆ వస్తువుని కోల్పోతానేమోననే భయం ఉంటుంది. మీకు. సంతోషం అనేది మానసిక స్థితి. అది మీ విశ్వాసంతో నిర్మితమవుతుంది. ఈ ప్రపంచంలో దేని గురించీ చింతించవలసిన అవసరం లేదన్న స్థితి. మీరు ఈ విశ్వాసాన్ని ఎంత దృఢంగా కలిగి ఉంటే మీరు అంత ఆనందాన్ని అనుభూతి చెందుతారు. కేవలం ఒక ఆనందకరమైన మనస్సే ఆధ్యాత్మిక సంపదని అందుకోగలుగుతుంది, సంరక్షించుకోగలుగుతుంది.'

ఒక ఆదివారం ఉదయం నేను స్వామీజీ పది గంటలకి మొదలుపెట్టే ఉపన్యాసం కోసం బయలుదేరబోతుంటే, సంస్థ జనరల్ మేనేజర్ ఫోన్ వచ్చింది. స్వామీజీ నన్ను వెంటనే చూడాలంటున్నారని చెప్పారాయన. నేను ఇంటి నుంచి మెయిన్ బిల్డింగ్‌లో ఉన్న స్వామీజీ గదికి వేగంగా వెళ్లాను. బెల్ మోగించాను. ఉరుములాంటి స్వరంతో ఆయన, 'లోపలికి రా!' అని అరిచారు. ఆయన జుట్టు చెదిరిపోయి ఉంది. చూపులు చాలా కోపంగా ఉన్నాయి. ఎందుకో ఆయన గాయపడ్డారు. కానీ నేను ఆయన ముందు తల వంచే లోపు మళ్లీ నన్ను చూసి కేకలు వేయడం మొదలుపెట్టారు. 'ఏమైంది నీకు? నువ్వు ఇన్‌స్టిట్యూట్ అంతా పాడు చేస్తున్నావు! ఏ పనులూ జరగకుండా పోతున్నాయంటే, అది నీ వల్లే. నువ్వు ఇంత అహంభావి అనీ, ఇతరులతో ఇంత దురుసుగా ప్రవర్తిస్తావనీ నేను అనుకోలేదు,' అన్నారు.

జనరల్ మేనేజర్‌తో బాటు, మిగతా ఇద్దరు బోధనా సభ్యులు కూడా అక్కడ ఉన్నారు. నేను వారి వైపు చూశాను, అసలు ఏం జరిగిందో తెలుసుకుందామని. కానీ ఏ ఒక్కరూ మాట్లాడడం లేదు. అందుకే నేను వినయంగా, 'స్వామీజీ! విషయమేమిటో నాకు తెలియదు స్వామీజీ!' అన్నాను. ఈ సమాధానం ఆయనకి ఇంకా కోపం తెప్పించింది. 'నువ్వు జనాన్ని అవమానిస్తున్నావు!' అరిచారు మళ్లీ. 'నీకు ఎంత పొగరెక్కిందంటే నీ దృష్టిలో ఎవరికీ ఏమీ తెలియదని అనుకుంటున్నావు!' అంటూ పక్కన ఉన్న ముగ్గురినీ చూసి అరిచారు, 'ఇతని వల్ల ఇన్‌స్టిట్యూట్ అంతా నాశనం కావడం నాకిష్టం లేదు!'

ఫ్యాకల్టీ మెంబర్స్ ఆయనకి పది దాటిపోతోందనీ, ఉపన్యాసానికి చాలా ఆలస్యమై పోతోందనీ గుర్తు చేశారు. 'నేనిప్పుడు ఉపన్యాసం చెప్పగలిగే స్థితిలోనే ఉన్నానా?' అని అరిచారు. అప్పుడు మాలో ఏ ఒక్కరి వైపూ ప్రత్యేకంగా చూడకుండానే, ఆయన ఆజ్ఞ జారీ చేశారు, 'ఈ ఉపన్యాసం గొడవేమిటో చూసి రా!' అన్నారు. మేమందరం ఒకరినొకరు చూసుకున్నాం. మాలో ఎవరు వెళ్లాలని ఆయన భావిస్తున్నారో ఊహించుకుంటున్నాం. మిగతా ముగ్గురూ నాకేసి చూశారు. సందేశం స్పష్టంగా ఉంది. నేను వెళ్లాలి. కానీ ఇప్పుడే కదా నేను అహంభావిననీ, ఎవరికీ ఏమీ తెలియదని అనుకుంటాననీ చెప్పారాయన! అందుకే స్వామీజీ నన్ను ఆదేశిస్తే తప్ప నేను వెళ్లదలుచుకోలేదు. నేను స్వామీజీ వైపు చాలా దీనంగా చూస్తూ, 'స్వామీజీ, నేను వెళ్లేదా?' అని అడిగాను. 'లేకపోతే, నా బుర్ర తింటావా, ఇక్కడే ఉండి?' అని ఎదురు ప్రశ్న వేసి, 'ముందు పో ఇక్కడ నుంచి!' అన్నారు. నేను గది దాటగానే మళ్లీ వెనక నుంచి ఆయన కేక వినిపించింది, 'ఉపన్యాసం పూర్తి అయిన తర్వాత వెనక్కి రా. అంతా తేల్చుకుందాం! ఈసారి అంతా తేలిపోవాలి!'

నేను ముఖం కడుక్కుని, మంచినీళ్లు త్రాగి ఆడిటోరియం వైపు వెళ్లాను. తర్వాత నాకు తెలిసింది ఏమిటంటే, నేను స్వామీజీ గదిలోంచి వెళ్లిపోయిన తర్వాత ఆయన మిగతావాళ్లని కూడా వెళ్లిపోమని చెప్పారట. ఈ విషయం గురించి తర్వాత మాట్లాడుకుందాం అన్నారట.

తర్వాత ఆయన జుట్టు దువ్వుకుని గది బయటకి వచ్చారు. కారిడార్‌లోంచి వెళ్తున్నారు. స్వామీజీ ఆడిటోరియంకి వెళ్తున్నారంటే సహజంగా జనం ఆయన్ని చూడడానికి అక్కడే వెయిట్ చేస్తారు. అక్కడ కొంతమంది జనం నిలబడి ఉండడం చూసి ఆయన, 'ఏం, మీరంతా ఇక్కడే నిలబడ్డారు? పండిట్‌జీ ఉపన్యాసం చెప్తున్నారుగా? వెళ్లి వినండి!' అన్నారు. అంతా అక్కడ నుంచి వెళ్లిపోయారు. అకస్మాత్తుగా ఆయన వాళ్లలో రీటా గారా అనే ఆమెని పిలిచి ఆడిటోరియం వెనక వైపు కూర్చోబెట్టారు. ఆమెని తీసుకురావడానికి తర్వాత ఎవరినైనా పంపిస్తానని చెప్పారాయన. రీటా అక్కడకి చేరేసరికే నేను స్వామీజీ మీద చెణుకులు విసురుతూ ప్రేక్షకుల్ని ఆహ్లాదపరచడానికి ప్రయత్నిస్తున్నాను. స్వామీజీకి బదులు నన్ను చూడడం, వినడం వాళ్లకి నిరాశే కదా మరి! మరో అరగంట తర్వాత స్వామీజీ రీటా కోసం కబురు పంపారు. వాళ్లు కాసేపు మాట్లాడుకున్నారు. అప్పుడు ఆయన రీటాని, 'మరి పండిట్‌జీ ఉపన్యాసం ఎలా ఉంది? ఆయన ఏం మాట్లాడారు?' అని అడిగారట.

ఆమె, 'పండిట్‌జీ చాలా హాస్యంగా మాట్లాడుతున్నారు. ఆయన మీమీద హాస్యోక్తులు బాగానే చెప్పారు. జనం హాయిగా నవ్వారు. ఆ తర్వాత ఆయన మాట్లాడే విషయాన్ని వినడానికి ఇష్టం చూపారు,' అని చెప్పారు.

స్వామీజీ, 'అతను చాలా మంచివాడు. నాకు అతనంటే చాలా ఇష్టం,' అని చెప్పారట.

నేను ఉపన్యాసం ముగించి స్వామీజీని చూడడానికి వెళ్లాను. ఈసారి ఆయన నా మీద ఉరుములు కాదు, వీలైతే పిడుగులు కురిపిస్తారని ఊహిస్తూ వెళ్లాను. కానీ నేను ఆశ్చర్యపోయేలా, ఆయనే తలుపు తీశారు ఏమీ అనకుండా. నేను లోపలికి ప్రవేశించగానే, ఆ గదిలో ఉన్న శక్తిక్షేత్రం చాలా విలక్షణంగా ఉంది. చుట్టుప్రక్కల పరమ ప్రశాంతంగా ఉంది. నేను ఆయన దగ్గరికి వెళ్తుంటే, ఆయన చేయి ఎత్తి, 'రా, రా, రా!' అంటూ దగ్గరికి పిలిచారు. నేను శిరసు వంచి నమస్కరించగానే నా భుజాల మీద చేతులు ఉంచి, 'నిన్ను చూసి చాలా గర్వపడుతున్నాను. సంతోషం అత్యంత విలువైన సద్గుణం. సంతోషంగా ఉన్న మనసు మాత్రమే జ్ఞానమనే బహుమతిని నిలుపుకోగలుగుతుంది.'

'స్వామీజీ! నేను సంతోషంగా ఎలా ఉండగలను నా ప్రవర్తన మిమ్మల్ని బాధిస్తుంటే?' అన్నాను.

'నువ్వు చెప్పు! నేను ఎన్ని తిట్టినా, ఎంత నిందించినా, నీకు బాధ కలగదు, విచారపడవు! నవ్వుతూ నవ్విస్తూ హాస్య ప్రసంగాలు చేస్తుంటావు!'

'ఎందుకంటే నన్ను మీరు ఎంతో ప్రేమగా చూసుకుంటారు కాబట్టి. నేను తప్పు చేస్తే, నన్ను సరిచేస్తారు కాబట్టి!' అని చెప్పాను.

అప్పుడు స్వామీజీ నా శిరసుపై చేతిని ఉంచి ప్రేమగా, 'అదే భక్తి! ప్రేమ, విశ్వాసం కలగలిసిన రూపం! భక్తిలో నిమగ్నమైనవాడికి ఎల్లపుడూ సంతోషమే. అతడికి శక్తి (అంతర్గత శక్తి) ఉంటుంది. సిద్ధి (యోగ సిద్ధులు) కూడా ఉంటాయి. భక్తి కంటే పైన ఏదీ లేదు. భక్తి వల్ల సందేహం, భయం, కర్మ బంధాల నుంచి స్వేచ్ఛ లభిస్తుంది. భక్తి లేని వారు ఎంత జ్ఞానులైనా, ఎంత నిష్ఠతో సాధన చేసినా భక్తి ఫలితం పూర్తిగా లభించదు. తరచూ వారు సాధించినదాన్ని పోగొట్టుకుంటారు.

'గుర్తుంచుకో! ఈ ప్రపంచాన్ని నువ్వు విశ్వసించదగింది కాదు. కానీ నువ్వు దాన్ని నిస్వార్థంగా, బేషరతు ప్రేమించవచ్చు. నువ్వు అందరినీ ప్రేమించాలి. కానీ దైవభావనపైనా, దివ్య గుణాలు చైతన్యవంతంగా ఉన్నవారిలోనూ పరిపూర్ణమైన విశ్వాసం ఉంచు. నా ఈ సలహా నీకు నా మిషన్‌ని ముందుకు తీసుకుని వెళ్లడంలో సహాయపడుతుంది. ఐహిక ప్రపంచం సృష్టించే ఉచ్చుల్లో పడకుండా నిన్ను కాపాడుతుంది.'

ఏడాదికి ఓసారి స్వామీజీ నిర్వహించే 'జ్యోతిపథం-ప్రకాశం' ఉపన్యాసాలు విని యోగం అంటే కేవలం ముద్రలు, శారీరిక స్థితులు, ప్రాణాయామ అభ్యాసాలు మాత్రమే కాదని ప్రజలు అర్థం చేసుకున్నారు. అది శ్వాస మీద ధ్యానం చేయడం, మంత్ర పఠనం, లేదా ఒక పవిత్రమైన ఆకారాన్ని దర్శించడం కంటే ఎంతో ఎక్కువ. అది ఒక గురువు దగ్గర కూర్చుని మంత్రజపం చేయడమో లేదా దర్శన గ్రంథాల్ని గురించి చర్చించడమో కంటే చాలా ఎక్కువ. యోగం శారీరిక, మానసిక ఆరోగ్యాలకు సంబంధించిన విషయాల్ని తెలియజేసే విలక్షణమైన వైద్యచికిత్స రూపావళి అనే విషయం అర్థమైంది. అది సంపూర్ణమైన విజ్ఞానం. మానవుడినీ ఆ మానవుని నివాసాన్నీ సమగ్రంగా చూస్తూ ఆ స్థాయికి సంబంధమైన సమస్యల్ని చర్చిస్తుందనీ ఆ విధంగా సృష్టిలోని మొత్తం మానవత్వం అందులో ఇమిడి ఉందని వారు గ్రహించారు.

స్వామీజీ ఇప్పటిదాకా బోధించిన భాగం కంటే బోధించని భాగం ఎంతో ఎక్కువ ఉందని వారికి అర్థమైంది. సాధు సంప్రదాయం కేవలం యోగానికి సంబంధించిన ఒక నిర్దుష్టమైన కోణాన్ని బోధించడం వరకే పరిమితమై లేదనీ, అది ఒక నిర్దుష్టమైన సంప్రదాయానికో, సమూహానికో చెందింది కాదనీ వారికి అర్థమైంది. అందువల్ల వారు ఈ సంప్రదాయాలు, సాధువులు, శృతి స్మృతి గ్రంథాలు, వాటిలోని కీలకమైన బోధనలు, దానిలోని జ్ఞానం, తరం నుంచి తరానికి అందించబడిన జ్ఞానం గురించి వారు తెలుసుకోవాలని అనుకున్నారు. వారి కోరిక మేరకు, స్వామీజీ నన్ను హిమాలయ పరమగురువుల సంప్రదాయాలు, వారి యోగ విధానాల మీద సమగ్రంగా ఒక సంవత్సరం కోర్సుని రూపొంచమన్నారు. నేను 1991-92 లో ఆ కోర్సుని నిర్వహించాను.

కోర్సు చివరి భాగంలో స్వామీజీ స్వయంగా ఆ సంప్రదాయంలో అత్యంత కీలకమైన సంప్రదాయమైన అందం, ఆనందం సమ్మిశ్రితరూపమైన 'సౌందర్యలహరి' ని బోధించడానికి సమ్మతించారు. ఆయన రాసిన 'లవ్ విష్పర్స్', 'హిమాలయ పరమగురువులతో జీవనం' గ్రంథాల్లో మాత్రమే చూసిన కొన్ని దృక్కోణాల్ని వారు ఈ సెమినార్ జరుగుతున్న సమయంలో స్వామీజీలో గమనించారు. ఒక తంత్రం, శక్తి సాధన గురించి పబ్లిక్‌లో ఆయన మాట్లాడడం అదే మొదటిసారి. ఈసారి ఆయన దేవీశక్తిని తన తల్లిగా పేర్కొన్నారు. అలాగే వ్యక్తిగతంగా తను అనుసరించే మార్గం 'శ్రీవిద్యా మార్గం' అని శిష్యులకి చెప్పారు. శ్రీవిద్య అనేక మార్మికమైన ఉన్నతమైన యోగమార్గాల్లోకల్లా ఉన్నతమైనదని చెప్పారు. 'శ్రీవిద్యోపాసనలో ఆరితేరినవారు దేవీమాతనే అత్యున్నత వాస్తవికతగా చూస్తారు. ఆనందం, అందం ఆమె నిగూఢమైన ప్రకృతి, విశ్వం ఆమె అభివ్యక్తి. ఈ విశ్వంలో అభివ్యక్తమవుతున్న రూపం ఆమెదే. కాబట్టి విశ్వం అందమైనదీ, ఆనందమైనదీ. ఈ విశ్వంలో అభివ్యక్తమవుతున్న ప్రతి ఒక్కరూ, ప్రతి ఒక్కటీ ఆ అందం, ఆనంద రూపానికి జన్మించిన అంశయే! ' అన్నారాయన.

'ఆ దేవీ మాత అనంత ఆనంద సాగరం. ఈ విశ్వంలోని అభివ్యక్తీకరణలన్నీ ఆ సాగరంలోని తరంగాలే. బిందువుల్లా మనమంతా ఆ తరంగాల్లో విడదీయలేని విధంగా కలిసి ఉన్నాము. సాగరంతో పోలిస్తే పరిణామంలో మనం చాలా చిన్న అంశలమే.

'ఇంకా ఈ వ్యక్తమవుతున్న విశ్వంలో ప్రతీదీ ప్రతి ఒక్కదానితోనూ కలిసి ఉంది. మనలోని అందం, ఆనందం ఈ అనుబంధాన్ని ప్రత్యక్షంగా అనుభవిస్తూ ఉండడం వల్లనే పరిపూర్ణంగా ఆనందించగలుగుతున్నాం. మన ఉనికిలోని ప్రతి స్థాయిలోనూ ఈ సూత్రం అన్వయిస్తుంది. సౌందర్యానికీ అనంత ఆనందానికీ అతీంద్రియ సాగరమైన ఆ దేవీమాత ప్రకృతి అభివ్యక్తీకరణ రూపం. ఆమె ప్రేమనీ సంరక్షణనీ పొందాలంటే మనం ఆమె ఒడిలో ఉండాలి. మనం ఆమెకి దూరంగా వెళ్లే కొద్దీ మనం ఆమె దివ్య ప్రేమకీ సంరక్షణకీ అంతగా దూరం జరుగుతాం.

ప్రకృతిని దోపిడీ చేయడమంటే మనకి జన్మనిచ్చిన తల్లిని దుర్భాషలాడడం వంటిది. ఈ సూర్యుడు, చంద్రుడు, తారలు, వాయువు, అగ్ని, జలం వంటి ఈ ప్రకృతి అంశాల నుంచి మనం నిరంతరం ఎంత తీసుకుంటున్నామో మన అజ్ఞానం వల్లే మనం మరిచిపోతుంటాం. మనం ఈ ప్రకృతి బలాల నుంచే తయారయ్యాం. మనం వీటిలో విడదీయలేని అంతర్భాగంగా ఉన్నాం. గురుత్వాకర్షక శక్తి కూడా ఒక గ్రహం తన హృదయం నుంచి ప్రస్ఫుటపరిచే మమతానుబంధమే. ఆ బంధమే మనల్ని ఈ భూమికి అంటిపెట్టుకుని ఉండేలా చేస్తుంది. ఓజోన్ పొరకి చిల్లులు పడేలా చేయడమంటే మన కపాలాలకి రంధ్రాలు చేసుకోవడం లాంటిది. అడవుల్ని నాశనం చేయడమంటే మన అవయవాల్ని నిస్తేజం చేసుకోవడమే. మృత్తికా క్రమక్షయం (నేలకోత) జరుగుతున్నా చూస్తూ ఊరుకోవడమంటే మన స్వంత చర్మాన్ని వలిచేసుకోవడమే.

'శ్రీవిద్యోపాసన చేసిన సాధువులు ఈ ప్రకృతిలోని ఆధ్యాత్మికతని ఆరాధించారు. 'ఆరాధన' అంటే ప్రకృతితో సామరస్యంగా జీవించడం, ప్రకృతి సంరక్షణ కోసం దానికి ఎలాంటి కీడూ జరగకుండా క్రియాశీలకంగా పని చేయడం! మనం ప్రకృతితో సామరస్యంగా జీవించే విధానం తెలుసుకుంటే మనపై ప్రకృతి ప్రేమ వృష్టి కురిపిస్తుంది, మనల్ని దయగా తనలో పొదువుకుంటుంది. మన హృదయాలు అప్పటికప్పుడు వికసిస్తాయి. ఇది జరిగిన క్షణం, ద్వంద్వం పోతుంది. ఆ క్షణం నుంచీ మనం ఈ సృష్టిలోని ఏ పదార్థంతోనూ, ఏ వస్తువుతోనూ వేరు కాదు. ఈ అనుభవం మన మరణ భయాన్ని తొలగిస్తుంది. ఎందుకంటే మనం ప్రకృతితో వేరు కాదనే విషయాన్ని గ్రహించాము. జననం, మరణం వంటిదేమీ లేదు. మనమంతా ఆ ఆనంద సాగరంలో లేచి పడే కెరటాల్లో ఎగసిపడే బిందువులం. అందులో నుంచే లేస్తాం, అందులోనే పడతాం. మనం జనన మరణ చక్రంతో బంధింపబడి లేము. కారణం, మనకి తెలిసింది. జననమంటే మన అమ్మ ఒడిలోకి రావడం, మరణమంటే తిరిగి ఆమె గర్భంలోకి వెళ్లడం!'

1976 లో కొద్ది రోజులు నేను స్వామీజీతోనే ఉన్నపుడు ఆయన నాతో, 'ఎవరూ నన్ను అర్థం చేసుకోరు. ఈ ప్రపంచంలో ఎవరికీ నా పనులు, నా మాటల్ని అర్థంకాని ఒకానొక సమయం వస్తుంది. నేను అప్పటికి హిమాలయాల్లోకి అంతర్ధానమైపోతాను, నన్నెవరూ కనిపెట్టలేరు,' అన్నారు. తొంభై దశకం ప్రారంభంలో ఆయన పనులు మరీ అసంగతంగా ఉండేవి. ఇక్కడ ఇన్‌స్టిట్యూట్‌లో ఉండేవాళ్లని కలవడం తగ్గించేశారు. ఉపన్యాసాలు చెప్పడం, ఆంతరంగిక సమావేశాలు, పరిపాలనా వ్యవహారాల్లో కల్పించుకోవడమూ తగ్గించేశారు. ఆయన ఎప్పుడైనా బోధ చేసినా, వైరాగ్యం, సంగరాహిత్యం, నిష్కామం వంటి సద్గుణాల గురించి చెప్పేవారు. మనసుని ఐహిక వ్యవహారాల నుంచి తప్పించి లోపలికి తిప్పేవారు. ఎక్కువసేపు ఆయన గదిలోనే ఉండిపోయేవారు. ఆయన బయటికి వచ్చారంటే టెన్నిస్ ఆడడానికో లేకపోతే కొద్దిసేపు నడవడానికో అయి ఉండేది. ఆయన ఒకసారి నాతో విడిగా ఉన్నపుడు అన్నారు, 'నేను నా సాధనని తీవ్రతరం చేస్తున్నాను. నేను ఎంత అల్ప స్థితికి చేరానో తెలుసా? ఒకప్పుడు నేను మూడు సెకన్లలో నా శరీరాన్ని వదిలేసేవాడిని. ఇప్పుడు మూడు నిముషాలకి పైగా పడుతోంది. ఇది నాకు చాలా అవమానం! కానీ నేను నా వాస్తవిక స్థితిని చేరుకుంటాను.'

స్వామీజీ ఏం చెప్పినా దాని వెనక ఏదో లక్ష్యం ఉండేది. అందువల్ల నేను ఆయన మాటలు, చర్యల వెనక ఉన్న ఉద్దేశ్యం ఏమిటో గమనించేవాడిని. కానీ ఆయన టెన్నిస్ మామూలుగానే ఆడుతున్నారు, గ్రంథ రచనా వ్యాసంగం జరుగుతోంది, హిందీ సినిమాలు చూస్తున్నారు, ప్రజలతో టెలిఫోన్‌లో మాట్లాడుతున్నారు. జోక్స్ వేస్తున్నారు, పిల్లలతో ఆడుకుంటున్నారు, నిధులు సమీకరిస్తున్నారు, హాస్పిటల్ ప్రాజెక్ట్ ఎంతవరకూ వచ్చిందో ఫోన్‌లో అడిగి తెలుసుకుంటున్నారు. వచ్చిన అతిథులు, సందర్శకుల్ని కలుస్తున్నారు, వారి మంచిచెడులు

అడిగి తెలుసుకుంటున్నారు. అందుకే ఆయనలో నాకేమీ విలక్షణమైన విషయం కనబడలేదు. కానీ నేను గమనించినంత వరకూ ఆయన మరింత ఏకాంతంగా ఉంటున్నారు, ఎక్కువ గంటలు ధ్యానంలో గడుపుతున్నారు. ఆయన కళ్లు చూస్తే తెలుస్తోంది. కానీ ఈ మార్పు ఒక్కటీ చూసి నేను ఆయన, 'ఈ ప్రపంచంలో ఎవరికీ నా పనులు, నా మాటల్ని అర్థంకాని ఒకానొక సమయం వస్తుంది' అని ఇందుకే అన్నారనే నిర్ణయానికి రాలేను.

నాకు ఆందోళనగా ఉంది. ఆయన, 'నేను నా సాధనని తీవ్రతరం చేస్తున్నాను' అన్న మాటల గురించే నేను తీవ్రంగా ఆలోచిస్తున్నాను. స్వామీజీ తన గురించి తాను ప్రశంసా వాక్యాలు పలకడం గానీ, తన సాధనని ఇతరులకి తెలియజేయడం గానీ ఆయన స్వభావానికి విరుద్ధం. ఆయన అన్న 'ఒకప్పుడు నేను మూడు సెకన్లలో నా శరీరాన్ని వదిలేసేవాడిని' అనే మాట కూడా నన్ను ఆందోళనకి గురి చేస్తోంది. ఆయన శరీరం వదిలేయడం గురించి ఆలోచిస్తున్నారా? అప్పుడు నాకు సడన్‌గా ఆయన తన పేరులో ఎందుకు మార్పు చేసుకున్నారో అర్థమైంది. ఇప్పుడు ఆయన పేరు లెటర్‌హెడ్‌లో 'స్వామి రామ' కి బదులుగా 'డా. ఎస్. రామ' అని ఉంటోంది. ఆ విషయాన్ని నేను మొదటిసారి గమనించినపుడు నేను నిశ్చేష్టుడినయ్యాను. దాని గురించి నేను గాఢంగా ఆలోచించాను. ఆయన 1952 లో తన పేరు ప్రక్కన 'సదాశివ' అనే పేరు చేర్చారు. ఆ పేరు ప్రక్కన 'భారతి' అనే పేరునీ చేర్చారు. 'భారతి' అనే పదం శంకరాచార్య సంప్రదాయానికి చెందినది. ఆ తర్వాత ఆయన 'స్వామీ రామ'గా పేరుపొందారు. ఈ దీక్ష తర్వాత స్వామీజీ తమ గురుదేవుల్ని తన సంప్రదాయం ఏమిటనీ, బాహ్య ప్రపంచానికి తన పరిచయం ఏ విధంగా తెలియజేయాలనీ అడిగారు. ఆ విషయం నాకు గుర్తుంది.

అప్పుడు బాబాజీ, 'నీ గతం అణగిపోయింది, అది నీ ప్రాపంచిక అస్తిత్వాన్ని తుడిచేసింది. అంతే కాదు, నీకున్న మతపరమైన, ఆధ్యాత్మికపరమైన అస్తిత్వాన్ని కూడా తీసేసింది. ఇప్పుడు నీకు ఏ సంప్రదాయాలూ లేవు, ఏ సంప్రదాయాలకీ నువ్వు లేవు...నువ్వు అన్ని రకాల సంప్రదాయాలకూ చెందినవాడివి. కానీ నువ్వు ఏ ఒక్క సంప్రదాయానికీ బానిసవి కావు. కైలాస పర్వతం నీ ఇల్లు. నువ్వు రాముడిని సేవించడానికి జన్మించావు, రాముడి ప్రపంచాన్ని సేవించడానికి జన్మించావు. రాముడిలా పనిచేయి, రామునిలా సేవించు. రాముని అడుగుజాడల్లో నడవకుండా, రామునిలా ఆత్మార్పణ చేసుకోకుండా నువ్వు మళ్లీ నీ ఇంటికి తిరిగి వెళ్లడానికి వీలు లేదు. రాముని బృహత్ సంకల్పం కేవలం భారతదేశాన్నీ, భారతీయుల్నీ సేవించడం మాత్రమే కాదు, యావత్ ప్రపంచాన్నీ సేవించడం! ఆయన మానవాళినీ, మానవేతర ప్రాణుల్నీ ఒకేలా ప్రేమించాడు. ఆయన పెద్దలకీ, పిన్నలకీ మధ్య, ధనికులు, బీదవారి మధ్య, మానవులు, జంతువుల మధ్య వంతెన నిర్మించాడు.'

కానీ నేను ఆలోచించడం మానలేదు. 'స్వామీ రామ' కి ఏమైంది. ఎవరీ 'డా.ఎస్.రామ?' గత యేడాదంతా నేను చాలాసార్లు స్వామీజీ, 'నేను ఈ స్వామీజీ వ్యవహారంతో విసిగిపోయాను,' అనడం విన్నాను.

అంటే, ఆయన స్వామిగా తన ఉనికిని వదులుకోవాలని నిర్ణయించుకున్నారా? నా హృదయంలో మరో ఆలోచన మెరవగానే గతుక్కుమన్నాను...అంటే, ఆయన తన శరీరాన్ని సంపూర్ణంగా విడిచిపెట్టదలుచుకున్నారా? అప్పుడు నేను మళ్లీ ఆలోచించాను. లేదు, లేదు, ఆయన కైలాస పర్వతానికి వెళ్లడానికి ఇప్పుడే అనుమతి లేదు. ఆయన ఆత్మార్పణ ప్రయాణం ఇంకా పూర్తి కాలేదు. స్వామీజీ అంతరంగాన్ని అర్థం చేసుకోవడానికి నాలాంటి అల్పబుద్ధికి ఎక్కడ సాధ్యమవుతుంది? కానీ నా అంతట నేను ప్రయత్నించడం మానలేదు. ఆయనతో బాటే ఉంటున్న నేను అనేకమైన అద్భుతానుభవాలు చూస్తున్నాను. వాటికి వైద్యపరమైన, శాస్త్రీయపరమైన

వివరణలు ఇవ్వలేము. వాటిని మార్మిక అనుభూతులుగా మాత్రమే మనం చెప్పగలం. అవి చాలావరకు మృత్యుకేంద్రంగా ఉన్నవే.

ఉదాహరణకి, ఆయన సెక్రటరీ కమల్ ఆయన పాదాల్ని నొక్కుతుంటే, అరిపాదాల్లో చిన్న చిన్న కాయల్లా ఉండడం గమనించింది. వాటిని మరింత గట్టిగా వత్తుతుంటే, చిన్న చిన్న గులకరాళ్లు బయటకి వచ్చాయి. అవి అక్కడికి ఎలా చేరాయని ఆమె స్వామీజీని అడిగితే, 'పర్వతాల్లో కాళ్లకి చెప్పులు లేకుండా నడవడం వల్ల అలా జరిగింది' అన్నారు.

మరోసారి స్వామీజీ బొంత కప్పుకుని ఒక కోచ్‌లో ప్రయాణిస్తున్న సమయంలో కునికిపాట్లు పడుతున్నారు. ఆయన్ని చూసుకోవడానికి స్వామీజీ శిష్యురాలు జూలీ హాబింగ్ ఆయన వెంట వెళ్తోంది. ఆమె లోపలికి వచ్చి ఆయన పాదాలు నొక్కుతానని చెప్పింది. స్వామీజీ, 'సరే, నొక్కు' అన్నారు. ఆమె బొంత లోపల చేతులు పెట్టి మెల్లగా పాదుల ఒత్తసాగింది. స్వామీజీ నిద్రపోయారు. కానీ కొద్ది సేపటి తర్వాత జూలీకి ఆయన పాదాలు చిన్నవిగానూ, మృదువుగానూ మారినట్టు అనిపించింది. ఆ వింతేమిటో చూడాలని ఆమె బొంత జరిపి చూసింది. ఆమె తన కళ్లని తనే నమ్మలేకపోయింది. ఆయన పాదాలు స్త్రీ పాదాల్లా చాలా అందంగా ఉన్నాయి. అంత అందమైన మృదువైన పాదాల్ని ఆమె అంతకు ముందెన్నడూ చూడలేదు. ఆమె కుతూహలం ఆమెకి ఒక కొత్త విషయాన్ని అవగాహనకి తెచ్చింది. 'ఆ దృశ్యంగానీ, ఆ స్పర్శగానీ ఈ ప్రపంచానికి సంబంధించినది కాదు. అవి దివ్యమైన అనుభూతులు!' అంది. ఈ విషయం గురించి ఆమె స్వామీజీతో ఏమీ చెప్పలేదు. కానీ ఆమె ఏకాంతంగా ఉన్నపుడు ఆ అత్యద్భుతమైన పాదాల్ని డ్రాయింగ్స్‌లో చిత్రించడానికి ప్రయత్నించింది. కానీ వాటిలో ఏ ఒక్కటీ ఆమె చూసిన పాదాల మాదిరిగా లేదు. ఆ తర్వాత ఒకరోజు ఆమె స్వామీజీ అపార్ట్‌మెంట్‌లో కిచెన్ టేబుల్ దగ్గర కూర్చున్నపుడు, ఆయన లోపలికి వెళ్లి ఆమె చిత్రించిన డ్రాయింగ్ చూశారు.

ఆమె డ్రాయింగ్ వేయడానికి ప్రయత్నిస్తున్న విషయం ఏమిటని ఆయన అడిగారు. దానికి ఆమె, 'కొద్ది రోజుల క్రితం నేను చూసిన దృశ్యం గీస్తున్నాను, స్వామీజీ!' అని చెప్పింది. అప్పుడు ఆయన కొద్ది క్షణాలు మౌనంగా ఉండి, 'నువ్వు చాలా అదృష్టవంతురాలివి. దేవతామూర్తి అమ్మ పాదాలు చూడగలిగావు!' అన్నారు.

మరోసారి, నా భార్య, నేను స్వామీజీ దగ్గరకి వచ్చాము. ఆ సమయంలో స్వామీజీ సాధారణంగా టెన్నిస్ ఆడతారు. కానీ ఎక్కడా స్వామీజీ బయటికి వచ్చే ఛాయలు కనిపించలేదు. మేం ఆడడం మొదలుపెట్టాము. మేము కోర్టులో బంతిని ఇటూ అటూ కొడుతుండగా ఒక పెద్ద సీతాకోకచిలుక బాల్‌ని వెంబడిస్తూ కనిపించింది. కొద్ది నిముషాల తర్వాత సీతాకోకచిలుక నా చుట్టూ తిరగడం మొదలుపెట్టింది. అది నాకు ఎంత దగ్గరగా వచ్చిందంటే, నేను బాల్‌ని ఆ సీతాకోకచిలుకకి తగలకుండా కొట్టడం చాలా కష్టమై పోయింది. నేను దూరంగా వస్తున్న బాల్స్‌ని కొట్టడానికి ప్రయత్నిస్తుంటే, ఆ సీతాకోకచిలుక నా ముందుకు వచ్చేసి, బాల్ మీద కూర్చుంటోంది. ఈసారి అది నా చేతి మీదకి వచ్చి కూర్చుంది. అక్కడ నుంచి అది నా కుడి బుగ్గ మీదకి వచ్చి, మళ్లీ ఎడమ బుగ్గ మీద వాలింది. ఎవరో నా బుగ్గల్ని ముద్దు పెట్టుకుని గుడ్‌బై చెప్తున్నట్టు ఉంది. ఆ తర్వాత సీతాకోకచిలుక ఎగిరిపోయింది. నేను దాన్ని అనుసరించి వెళ్లాను. అది స్వామీజీ అపార్ట్‌మెంట్‌లోకి వెళ్లి అంతర్ధానమైపోయింది.

మరి కొద్దిసేపటి తర్వాత స్వామీజీ బయటికి వచ్చారు. ఆయన నన్ను చూడగానే, 'నువ్వు రీటా గారాని చూశావా?' అని అడిగారు. స్వామీజీ హానెస్‌డేల్ ఇన్‌స్టిట్యూట్‌లో ఉంటే ఆమె వీలైనంత ఎక్కువగా ఇన్‌స్టిట్యూట్‌లోనే ఉంటుంది. స్వామీజీ టెన్నిస్ ఆడుతుంటే దూరంగా పోతున్న బంతుల వెనక పరిగెత్తి తెచ్చిస్తూ ఉంటుంది. ఆమె పాంక్రియాటిక్ కేన్సర్ చివరి స్టేజీలో

హాస్పిటల్‌లో చేర్చబడింది. నేను ఆమెని చూశానా లేదా అని ఆ సాయంత్రం స్వామీజీ నన్ను ప్రశ్నించినపుడు, నేను చాలా ఆశ్చర్యంగా, 'ఆమె హాస్పిటల్‌లో ఉంది,' అని సమాధానం చెప్పాను.

'లేదు, లేదు,' అన్నారాయన. 'ఆమె ఈరోజు ఉదయం శరీరం విడిచింది. మనకి గుడ్‌బై చెప్పడానికి వచ్చింది,' అన్నారు. నేను అపుడు ఆయన్ని, 'మరణించి శరీరం విడిచిన వెంటనే ఒక వ్యక్తి అంత త్వరగా వేరే శరీరంలోకి ఎలా వెళ్తారు?' అని అడిగాను. 'దీనికి ఒక ప్రత్యేకమైన నియమం అంటూ ఏమీ లేదు,' అన్నారాయన. 'ఆమె మనల్ని అంతగా ప్రేమించింది. ఆమె అచేతనావస్థ సామూహిక ప్రకృతి చైతన్యంలో కలిసే వరకూ ఆమెకి ఎగిరే కీటకం శరీరం అవసరమైంది మనకి గుడ్‌బై చెప్పడానికి. సీతాకోకచిలుకల వంటి కీటకాలకి మరీ ఎక్కువ స్ఫటికాకార చేతన ఉండదు. అందువల్ల కొద్ది క్షణాలపాటు ఆమె తన అనుభూతుల్ని తెలియజేయడానికి సీతాకోకచిలుక శరీరాన్ని ఉపయోగించుకుంది.'

మరో సందర్భంలో స్వామీజీ కమల్‌ని అకస్మాత్తుగా తన అపార్ట్‌మెంట్ దగ్గర ఆరుబయట ఎక్కడో ఒక పిట్ట గ్రుడ్డు ఉంటుందనీ, దాన్ని వెతకమనీ అన్నారు. ఆమె దాన్ని కనిపెట్టి తెచ్చి ఆయనకి ఇచ్చింది. ఆ గ్రుడ్డు పొదగబడింది. అందులోంచి ఒక పసి పిట్ట బయటికి వచ్చింది. అదే రకం పిట్టో, దాన్ని పెంచడం ఎలాగో ఎవరికీ తెలియదు. స్వామీజీయే ఆ చిన్నారి పిట్ట సంరక్షణా బాధ్యతని తీసుకున్నారు. దాని నోట్లో ఆయన నీటి చుక్కలు పోస్తుండేవారు. కొన్నిసార్లు తన మంచం మీద దాన్ని పెట్టి, తాను నేల మీద కూర్చునేవారు. కమల్ నాకు ఈ పిట్ట పరిస్థితి గురించి 'ఇప్పుడది తలెత్తి చూస్తోంది', 'ఇప్పుడు అది నడుస్తోంది', 'ఆ పిట్ట ఏమీ తినడం లేదు, స్వామీజీ చాలా దిగులుగా ఉన్నారు', అంటూ ఎప్పటికప్పుడు తెలియజేస్తూ ఉండేది. ఒక రోజు ఉదయం, కమల్ కొంతమంది స్వామీజీ విద్యార్థుల కోసం అల్పాహారం తయారు చేస్తోంది. వాళ్లు కరిబియన్ ఐలాండ్స్ నుంచి ఇన్‌స్టిట్యూట్‌ని చూడడానికి వచ్చారు. అప్పుడు వేపుడు మూకుడు కమల్ బొటనవ్రేలి మీద పడింది. అదే సమయంలో స్వామీజీ పెద్ద గొంతుతో 'కమల్!' అని కేకేశారు. ఆమె మెట్లన్నీ వేగంగా ఎక్కుతూ పైకి వెళ్లింది. కమల్ బొటనవ్రేలి మీద మూకుడు పడిన క్షణమే ఆ చిన్న పిట్ట నేరుగా రేడియేటర్‌లోకి దూసుకుపోయి చనిపోయింది. నిర్జీవంగా మారిన ఆ పిట్ట శరీరాన్ని స్వామీజీ కమల్‌కి అందజేసి, దాన్ని పూడ్చి పెట్టమని చెప్పారు.

తర్వాత నన్ను కమల్, 'ఆ పిట్ట ఎవరో తెలుసా?' అని అడిగింది. నాకు తెలియదని అన్నాను నేను. అప్పుడు ఆమె చెప్పింది, 'స్వామీజీని చిన్నపుడు సాకిన నిర్వాణ్‌జీయే ఆ పిట్ట రూపం ధరించారట. నాకు ఒక పెద్ద యాక్సిడెంట్ జరగాల్సి ఉందట. కానీ నిర్వాణ్‌జీ తన బదులు ఒక పిట్టగా మారి చనిపోయి నాకు జరగబోయే ప్రమాదాన్ని నిలువరించారట,' అని చెప్పింది ఆమె.

అది 1992 వేసవి సమయం. ఢిల్లీ నుంచి మా అక్క నాకు ఫోన్ చేసి, మా నాన్నగారిని అలహాబాద్‌లో హాస్పిటల్‌లో పెట్టారని చెప్పి నన్ను వెంటనే రమ్మంది. ఆమె నాకు హాస్పిటల్ టెలిఫోన్ నెంబర్ ఇచ్చింది. నేను రెండు గంటలపాటు ప్రయత్నించినా లైన్ కలవలేదు. సుమారు ఆరు గంటలైంది. మీరా నన్ను స్వామీజీ గది ద్వారం దగ్గర నిలబడమనీ, ఆ తలుపులు ఎప్పుడు తెరుచుకుంటే అప్పుడు, నేనేం చేయాలో సలహా ఇవ్వవలసిందిగా స్వామీజీని అడగమని చెప్పింది. కానీ ఆయన అపార్ట్‌మెంట్‌కి నేను బయల్దేరబోతుంటే, స్వామీజీయే నాకు ఫోన్ చేశారు. నేను ఆయనకు పరిస్థితి వివరించబోయేంతలో, 'ఏమిటి విషయం?' అని అడిగారు. నేను ఆయనకు అక్క చెప్పిన విషయం చెప్పాను. 'లేదు, లేదు, నువ్వు వెంటనే వెళ్లు. నువ్వు డ్రైవ్ చేసుకుంటూ వెళ్లిపో. న్యూయార్క్ వెళ్లగానే నాకో సారి కాల్ చేయి. అప్పటికి మేము నీ కోసం టికెట్ ఏర్పాటు చేస్తాము. ఏమీ గాభరా పడకు,' అని చెప్పారు. మరో గంటలో నేను విమానంలో బయల్దేరిపోయిన

తర్వాత, స్వామీజీ నా భార్య మీరాకి ఫోన్ చేసి, ఎంతో అనునయంగా, 'పండిట్‌జీ నుంచి నీకేమైనా ఫోన్ వచ్చిందా? వాళ్ల నాన్నగారు ఎలా ఉన్నారు?' అని అడిగారు. మీరా తనకే విషయం తెలియదని చెప్తే, ఆయన ఫోన్ పెట్టేసేవారట. దాదాపు గంట గంటకీ ఒకసారి ఆయన ఫోన్ చేసి అవే ప్రశ్నలు వేశారట.

మధ్యాహ్నం అయిన తర్వాత స్వామీజీ ఆమెని ఇన్‌స్టిట్యూట్ మెయిన్ బిల్డింగ్ హాల్‌లో చూసి మళ్లీ అడిగారట. ఆమె, 'స్వామీజీ! ఆయన ఇంకా విమానంలోనే ఉన్నారు. నాకు ఇంకా అలహాబాద్ నుంచి కూడా ఏ కబురూ రాలేదు,' అని చెప్పిందిట.

దానికి స్వామీజీ, 'ఆయన మరణించారు, కానీ ఆయనకి పండిట్‌జీ అంటే ప్రాణం. ఇతన్ని చూడకుండా ఆయన వెళ్లలేరు. పండిట్‌జీ మీద ఇంత అభిమానం పెట్టుకోవడం వల్లనే ఆయన చాలా బాధపడ్డారు. నేనిప్పుడు ఆయన్ని ఆయన శరీరంలోకి చేరుస్తాను. ఇప్పుడు పండిట్‌జీ వచ్చే వరకూ ఆయన తన శరీరంలో ఉండగలుగుతారు. అతన్ని చూసిన తర్వాతే ఆయన దేహత్యాగం చేస్తారు,' అన్నారు.

ముప్పై ఆరు గంటల తర్వాత నేను అలహాబాద్‌కి చేరాను. నేను అమ్మనీ, మా తోబుట్టువుల్ని చూసి చాలా ఆనందించాను. నాన్నగారి పరిస్థితి మెరుగవుతోంది. వాళ్లు చాలా భయపడిపోయారట. హాస్పిటల్‌కి వెళ్తుంటే దారిలోనే ఆయన శ్వాసించడం ఆపేశారట. ఆయన పొట్ట ఉబ్బరించిందట. ఆయనకు హెపటైటిస్ బి వచ్చిందట. ప్రస్తుతం ఆయన ఐవీ మీద ఉన్నారనీ, విశ్రాంతి తీసుకుంటున్నారనీ, మాట్లాడుతున్నారనీ చెప్పారు. మా నాన్నగారు నన్ను చూడగానే పొంగిపోయారు. నేను వచ్చానంటే ఆయన నమ్మలేకపోతున్నారు. 'నువ్వు నిజంగానే వచ్చి నా ఎదట నిలబడ్డావా? పిల్లలు ఎలా ఉన్నారు? మీరా ఎలా ఉంది?' అని అడిగారు. కానీ ఆరు గంటల తర్వాత ఆయన పరిస్థితి క్షీణించసాగింది. ఆయన కళ్లు పూర్తిగా పచ్చబడ్డాయి. నాలుక విపరీతంగా వాచి మాట్లాడడం కష్టమైంది. ఆయనకి ఎగశ్వాస వచ్చింది. ఎక్కిళ్లు రాసాగాయి. మరణ సమయంలో ఉండే లక్షణాలన్నీ నేను చూశాను. దృష్టిని భ్రూమధ్యంలో నిలిపి ఆయన జపించే మంత్రాన్ని తలచుకుంటూ ఉండమని చెప్పాను. ఆయన నవ్వి, చాలా కష్టం మీద, 'నాయనా, నాకిప్పుడు తెలుస్తోంది,' అన్నారు. 'మీకు తెలుస్తున్నది ఏమిటి?' అడిగాను నేను. 'నేను కొద్ది రోజుల క్రితమే చనిపోయాను. కానీ నేను నిన్ను చూడలేకపోయానని చాలా విచారంగా ఉంది. అప్పుడు స్వామీజీ వచ్చి నన్ను వెనక్కి తీసుకొచ్చారు. ఇప్పుడు నువ్వు నా కళ్ల ముందు ఉన్నావు. నా కోరిక తీరింది. ఇప్పుడు నేను వెళ్లాల్సిన సమయం వచ్చింది,' అన్నారు.

నేను ఆయన్ని, 'మీకేమైనా భయంగా ఉందా?' అని అడిగాను.

ఆయన, 'మనకి అలాంటి పరమ గురువులు తోడు ఉండగా, దేనికి మనం భయపడతాం?' అన్నారు.

'మీరు ఎక్కడికి వెడుతున్నారో మీకు తెలుసా?' అని అడిగాను.

ఆయన, 'ఆయన ఎక్కడుంటే అక్కడికి. ఆయన నన్ను ఎక్కడికి తీసుకుని వెడితే అక్కడికి!' అన్నారు. ఆ తర్వాత కళ్లు మూసుకుని ఈ లోకం విడిచి వెళ్లారు.

అమెరికాలో మూడు వారాల తర్వాత, స్వామీజీ నాతో మెలిగే వైఖరిలో మార్పు గమనించాను. ఆయన నన్ను ఇష్టపడనట్టు ప్రవర్తిస్తున్నారు. ఇంకా చెప్పాలంటే, నేనంటే ఎవరో తెలియదన్నట్టు ప్రవర్తించసాగారు. కానీ నా భార్య మీరా, పిల్లల పట్లా మాత్రం ప్రేమగా మెలగుతున్నారు. డా.బల్లెంటైన్ పట్ల కూడా స్వామీజీ ఇదే తీరుని ప్రదర్శించడం నేను గుర్తించాను. డా.బల్లెంటైన్‌తో ఆయన గతంలో గంటలకొద్దీ కాలం గడిపేవారు. ఇప్పుడు స్వామీజీని చూడడానికి ఆయన ముందుగా అపాయింట్‌మెంట్ తీసుకోవాల్సి వస్తోంది. ఆ విధంగా కలిసినా కూడా

ఏమాత్రం ప్రత్యేకమైన ఆదరణ చూపకుండా కలుస్తున్నారు. అలాగే, నేను స్వామీజీ గదికి వెళ్లినా సాధారణంగా నన్ను చూసి, 'ఏమిటి సంగతి? ఏమైనా అడగాలనుకుంటున్నావా?' అని అడిగేవారు. ఏదో రకంగా ధైర్యం చేసి నేను అక్కడే కూర్చుంటే, ఆయన, 'వెళ్లు, వెళ్లి నీ పని చూసుకో. నా సమయం వృథా చేయకు,' అనేవారు. ఆయన ఆశ్రమనివాసుల్లో ఎవరితోనూ అంత కఠినంగా ఉండట్లేదు. అలాగని ఆయన అంత సరదాగా కూడా ఎవరితోనూ ఉండట్లేదు. తనని సందర్శించడానికి ఎక్కడెక్కడి నుంచో వచ్చే విద్యార్థులతో మాత్రం సరదాగా ఉంటున్నారు. 1993 వేసవి కాలమంతా ఇలాగే గడిచింది. ఒకరోజు ఆయన నన్ను హాల్‌లో ఆపి, "త్రిపురా రహస్యం' అనువదించానని నువ్వు నాకెపుడూ చెప్పలేదేం? ఎప్పుడు అనువాదం చేశావు?' అని అడిగారు. 'త్రిపురా రహస్యం' తంత్ర రహస్యాల గురించిన గ్రంథం. ఆ గ్రంథంలోని విషయమంతా పరశు రాముడు, దత్తాత్రేయుల మధ్య జరిగిన సంవాదమే. స్టేట్ యూనివర్సిటీ ఆఫ్ న్యూయార్క్ (SUNY) ప్రెస్ ఎడిటోరియల్ బోర్డులో ఉన్న మా ప్రొఫెసర్లలో కొంతమంది పెన్సిల్వేనియా యూనివర్సిటీ నుంచి వచ్చారు. వాళ్లు (SUNY) ఈ వ్యాసాన్ని ప్రచురించాలని ప్రపోజల్ పెట్టారు. (SUNY) ప్రెస్ డైరెక్టర్ డా. విలియం ఈస్ట్‌మ్యాన్ పబ్లికేషన్ అగ్రిమెంట్ మీద నా సంతకం కావలసి వచ్చి అది నాకు పంపారు.

నేను ఈ విషయమంతా స్వామీజీకి వివరించాను. నేను ఆ పుస్తకాన్ని నా కోర్సువర్క్‌కి రెండవ పిహెచ్.డి.గా 1984 లో అనువాదం చేశానని చెప్పాను. అప్పుడు స్వామీజీ, 'నువ్వు నాకు ఆ వ్రాతప్రతి చూపించి ఉండాల్సింది. అది మన సంప్రదాయానికి సంబంధించిన అతి ముఖ్యమైన గ్రంథం. అది మన ఇన్‌స్టిట్యూట్ ప్రచురించాల్సిన పుస్తకం. ఆ వ్రాతప్రతి పట్టుకురా!' అన్నారు. నేను దాన్ని తీసుకొచ్చి ఇచ్చాను. 'మనం ఈ రాత్రి నుంచీ పని మొదలుపెడుతున్నాం,' అన్నారు. ఆయన వ్రాతప్రతిని చేతిలోకి తీసుకుని నన్ను సాయంత్రం వచ్చి కలవమని చెప్పారు.

ఆ రాత్రి నేను స్వామీజీ రూంకి వెళ్లాను. అప్పటి యోగా ఇంటర్నేషనల్ మ్యాగజైన్ ఎడిటర్ డిబోరా విల్లోబీతో కలిసి ఆ వ్రాతప్రతి మీద పని చేస్తున్నారు. నేను కొద్ది నిముషాలు అక్కడ కూర్చున్నాను. అప్పుడు ఆయన, 'అక్కడేం చేస్తున్నావు? నువ్వు వెళ్లి నీ పని చూసుకో!' అన్నారు. ఆ తర్వాత ప్రతి మధ్యాహ్నం పూటా ఆయన టెన్నిస్ కోర్టులో, 'ఇది మన సంప్రదాయంలో చాలా ముఖ్యమైన గ్రంథం. అందులో చాలా తప్పులు ఉన్నాయి. అది నా చేతుల్లో పడింది, అందుకు సంతోషం! లేకపోతే అది ఎంత పెద్ద దోషమై ఉండేది! ఈ రాత్రి నిన్ను పిలుస్తాను. మనిద్దరం ఓసారి దాన్ని చూద్దాం!' అన్నారు. ఆయన పిలిచినపుడు అందుబాటులో ఉండేందుకు ప్రతి రాత్రీ నేను ఆయన కిచెన్ ఏరియాలో మెట్ల మీద కూర్చునేవాడిని. టెన్నిస్ కోర్టులో 'ఈ రాత్రి చూద్దాం' అనడమే తప్ప ఆయన ఎప్పుడూ పిలవలేదు.

ఇంతలో స్వామీజీ డిబోరాతో ఓ ఆసక్తికరమైన నాటకం ఆడసాగారు. నా అనువాదం చాలా పేలవంగా ఉందని నిరూపించడానికి ప్రయత్నిస్తున్నారు. ఈ అనువాదంలో దారి తప్పిన భాగం ఏమిటంటే ఈ గ్రంథమంతా మన చైతన్యానికీ, వ్యావహారిక జగత్తుకీ మధ్య గల బంధాన్ని వర్ణిస్తూ 'దర్పణ సారూప్యత' నడిచిందని ఆమెతో అన్నారు. ఎందుకో గానీ స్వామీజీకి ఇది నచ్చలేదు, నన్ను ఆట పట్టిస్తున్నారు. 'పండిట్‌జీకి ఏమైంది? సత్యాన్ని నేరుగా తెలుసుకోవడానికి బదులు దాన్ని ఆయన దర్పణంలో ప్రతిబింబాన్ని చూస్తారు,' అన్నారు స్వామీజీ. చివరికి ఆయన చేతులు విసురుతూ డిబోరాతో, 'మనకి ఇలాంటి అద్దాల నుంచి ఎన్నటికీ స్వేచ్ఛ లభించదు!' అన్నారు. ఇతరులకి అదెలా కనిపిస్తుందంటే, నేనేదో చాలా అహంకారంతో మిడిసిపడుతూ ఉన్నట్టూ, నేను సంప్రదాయాన్ని తప్పు త్రోవ పట్టిస్తున్నట్టు కూడా గమనించలేనంత దురహంకారిని అయినట్టూ ఉంటుంది. ఆయన, 'దేవుడి దయవల్ల ఆ వ్రాతప్రతి నా చేతుల్లో పడింది. లేకపోతే

ఈ మనిషి దాన్ని నాశనం చేసి ఉండేవాడు,' అంటున్నారు. ఆయన నిజంగానే మొత్తం టెక్స్ట్ అంతా మళ్లీ అనువదించారు.

తర్వాత ఒకరోజు సాయంత్రం టెన్నిస్ కోర్టులో ఆయన, 'బేటే, మేం చాలా పని చేశాం. అందులో చాలా చాలా తప్పులున్నాయి. మేం వాటిని సవరించాం. కానీ మనం మరోసారి మొత్తమంతా చూడాలి. రాత్రి నువ్వు రా. మనం దాన్ని ఓ కొలిక్కి తీసుకొద్దాం!' అన్నారు. ఆ రాత్రి నేను కిచెన్ మెట్ల మీద కూర్చున్నాను, ఇంతలోనే ఆయన నన్ను పైకి రమ్మని పిలిచారు. డిబోరా మొదటి పద్యం చదవగానే, ఆయన, 'కాదు, కాదు. సవరించబడింది చదువు,' అన్నారు. తాను సవరించబడిన భాగమే చదువుతున్నానని చెప్పిందామె. అప్పుడు ఆయన, 'సరే అయితే, దాన్ని సవరించు,' అన్నారు. రెండవ పద్యం విషయంలో ఆయన, 'నా అనువాదానికి ఏమైంది?' అని అడిగారు. అప్పుడు ఆయన నా వైపు చూసి హిందీలో, 'ఏమైంది ఈవిడకి? నేను ఏదీ మార్చవద్దని చెప్పాను. కానీ ఈ ఎడిటర్లందరూ పెద్ద అహంకారులు!' అన్నారు. ఇంగ్లీషులోకి మారుతూ మళ్లీ స్వామీజీ, 'సవరించు దాన్ని!' అని చెప్పారు. అప్పుడు ఆయన అనువాదం డిక్టేట్ చేశారు. డిబోరా, నేను ఒకరినొకరు చూసుకున్నాం. ఈ 'చిట్టచివరి సవరణ' అచ్చం నేను రాసిన అసలు అనువాదమే. తర్వాత మరి కొన్ని పద్యాల విషయంలో కూడా ఇదే సీను పునరావృతమైంది.

స్వామీజీ నాతో హిందీలో మాట్లాడుతూ, డిబోరాని విమర్శిస్తున్నారు. ఆమె తన సమ్మతి లేకుండా మొత్తం విషయమంతా మార్చేసిందని అంటున్నారు. చివరికి నేను అడిగాను, 'స్వామీజీ, అయితే మనం మూల అనువాదమే తీసుకుందామా?' అని!

ఆయన, 'ఏ మూల అనువాదం?' అని అడిగారు.

'అదే, నేను 1984లో పెన్సిల్వేనియా యూనివర్శిటీలో చేసింది,' అన్నాను.

'స్వామీజీ చిరునవ్వు నవ్వి, 'ఆమెతో చెప్పు, ఆమెతో చెప్పు,' అన్నారు. అప్పుడు నేను డిబోరాతో ఒరిజినల్ ట్రాన్స్‌లేషన్ స్వామీజీ నా పేరుతో చేశారనీ, అలా ఎందుకు చేశారో, ఎలా చేశారో తర్వాత చెప్తాననీ చెప్పాను. అప్పుడు స్వామీజీ ఆమెతో ఒరిజినల్ ట్రాన్స్‌లేషన్ చూసి, దాన్ని కొంచెం నగిషీ చెక్కి, అక్కడికక్కడే తుది వ్రాతప్రతిగా తయారుచేసి ఇచ్చారు. దీనికి స్వామీజీ సమయం ఒక నెల రోజులు ఖర్చు కావడం చూసి డిబోరా ఆశ్చర్యపోయింది.

తర్వాతి పది రోజులూ స్వామీజీ నాతో చాలా దయగా ఉన్నారు. ఆయన తన రూంకి రాత్రి సమయాల్లో రమ్మని, భగవాన్ *పరశురామ, దత్తాత్రేయులు, దూర్వాసులు, గురు గోరఖ్‌నాథ్* వంటి గొప్ప గొప్ప మహర్షుల గురించి వివరించేవారు. ఆ తరువాత ఆ పరమ గురువులు ఆయన మాస్టర్స్ ఇప్పటికీ నివసిస్తున్న స్థలాల గురించి మాట్లాడారు. సాధకుడు వారిని తన చర్మచక్షువులతో చూడాలంటే ఎలాంటి సాధన చేయాలో వివరించారు. ఈ సమయంలోనే స్వామీజీ మనాలి గుహలో కొన్ని సంవత్సరాల క్రితం చేపట్టిన పదకొండు నెలల సాధనకి సంబంధించిన రహస్యాన్ని తెలిపారు. మేము పరశురాముని గురించి మాట్లాడుకుంటున్న సందర్భంలో నేను స్వామీజీతో, 'స్వామీజీ, పరశురాముడు గొప్ప జ్ఞానం ఉన్న సాధువు కదా, ఆయన స్వయంగా విష్ణువు అవతారమే. కానీ త్రిపురా రహస్యంలో ఆయన దత్తాత్రేయ మహర్షిని అడిగిన ప్రశ్నలు చాలా చిలిపిగా ఉంటాయి. ఉదాహరణకు, ఆయన దత్తాత్రేయునితో, తన స్వీయ అనియంత్రిత ప్రవర్తనతో విసిగిపోయానని అంటాడు, అపరాధం చేశాననే భావనని ఎదుర్కోవలసి రావడం, తన మనసే తనని గద్దించడం భరించలేకపోతున్నానంటాడు. ఇక ఆయన ఒక బ్రహ్మర్షి ఎలా అవుతాడు ఇలాంటి మానసిక ధోరణితో బాధపడుతుంటే?' అని ప్రశ్నించాను.

సమాధానమిస్తూ స్వామీజీ, పరశురాముడు, దత్తాత్రేయుడూ బ్రహ్మర్షులనీ, వారు చిరంజీవులనీ చెప్పారు. వారు సర్వజ్ఞులైన అమర బ్రహ్మర్షులు. వారు నిరంతరం మానవాళికి

మార్గదర్శకంగానూ, సహాయకరంగానూ ఉంటారు. ఇతరులకి బోధించడానికి ఈ పరమగురువులు సాధారణ మానవుల స్థాయికి తమను తాము దించుకుంటారు. అన్ని రకాల హెచ్చు తగ్గులూ చూస్తారు, చివరికి తమ స్వీయ అంతర్గత సమతౌల్యతని పునరుద్ధరించడానికి తీవ్రంగా పరిశ్రమిస్తారు. అలాంటి స్వీయ రూపకల్పన చేసి స్వీయ మార్గదర్శన చేస్తున్న సమయంలో ఆ మహర్షుల్లో ఒకరు ఆ నాటకంలో సాధకుని పాత్రనూ, మరొకరు పరమగురువు పాత్రనూ పోషిస్తున్నట్టు ఊహిస్తారు. పరశురాముడు ఆచరణాత్మక ప్రశ్నలు అడుగుతున్నారు, వాటికి సమాధానం ఇవ్వడం ద్వారా యుగయుగాలుగా సాధకులకి దత్తాత్రేయుడు తన మార్గదర్శకత్వాన్ని అందిస్తున్నాడు.

'భగవాన్ పరశురాముని కంటే ఉదారమైన వారు ఎవరూ లేరు,' స్వామీజీ అన్నారు. 'అందుకే పాశ్చాత్య ప్రాంతానికి నన్ను పంపే ముందు మా గురుదేవులు నన్ను వారి ఆశీర్వాదాల కోసమే మనాలీ గుహకు పంపారు. హిమాలయ ఇన్‌స్టిట్యూట్ నిగూఢమైన మూలాల్లో ఈ మహర్షుల దీవెనలు ఉన్నాయి.

స్వామీజీ పరశురామునికి మనాలి గుహతో ఉన్న సంబంధం గురించి చెప్పిన వెంటనే నాకు ఒక ఆలోచన మెరిసింది. 1981 శీతాకాలంలో వింతగా గడిచిన ఆ వారంలో స్వామీజీ అనారోగ్యంతో ఉన్నారు. ఆ తర్వాత ఆయన గురుదేవులు శరీరం విడిచిపెట్టారు. అప్పుడు స్వామీజీ 1982లో అమెరికాకి తిరిగి వచ్చి, తమ గురుదేవులు తమ పనిని పూర్తి చేయడానికి పది సంవత్సరాల సమయం ఇచ్చారని అన్నారు. పైగా, తరువాత పది సంవత్సరాలూ స్వామీజీ తరచుగా ప్రజలతో పాశ్చాత్య ప్రాంతంలో తన సమయం ముగింపుకి వచ్చిందని చెప్తుండేవారు. అప్పుడు 1991 లో వేసవి ప్రారంభంలో అయన తన గురుదేవుల ఇష్టానికి వ్యతిరేకంగా పాశ్చాత్య ప్రాంతం చేరుకున్నట్లు డెబోరా విలబీతో చెప్పారు.

ఇప్పుడు 1993 వేసవిలో ఆయనతో కూర్చున్నపుడు, అంతా స్పష్టంగా తెలిసి వచ్చింది. ఆయన మొదలుపెట్టిన పని పూర్తి చేయడానికి మనాలి గుహలో స్వామీజీకి మరి కొన్ని సంవత్సరాలు అదనంగా ప్రసాదించబడ్డాయి! కానీ ఈ గ్రహింపు మరొక ప్రశ్నని ఉత్పన్నం చేస్తుంది. స్వామీజీకి ఇలా కొన్ని సంవత్సరాలు అదనపు జీవితం ప్రసాదించింది ఎవరు- బాబాజీ? భగవాన్? పరశరాముడా? నాలోని బాలుడికి వచ్చిన ఈ ప్రశ్నకి సమాధానం స్వామీజీ చెప్పరు. కానీ ఏమైనప్పటికీ నేను అడిగేశాను. ఆ ప్రశ్న నా పెదవుల మీదకి వస్తుంటే కూడా, నేను ఆలోచిస్తూ ఉన్నాను, 'నేను ఎందుకిలా చేస్తున్నాను?" అని.

తన బిడ్డని అనునయించే తల్లిలా చెప్పారు ఆయన సమాధానం. 'తేడా ఏముంది? వారు చిరంజీవులు.'

ఆ వేసవిలో మిగతా కాలమంతా చాలా సంక్లిష్టంగానే గడిచింది. కొంతమందికి సంతోషకరం, మరి కొంతమందికి బాధాకరం. ప్రపంచం నలుమూలల నుంచీ ఇన్‌స్టిట్యూట్‌కి తరలివచ్చిన వారికి వారు కోరుకున్నట్టు ప్రాపంచిక, ఆధ్యాత్మిక బహుమతులు అందాయి. స్వామీజీ నుండి. కానీ కొంతమంది నివాసితులకి ఆయన చర్యలు నిర్దయగా తోచాయి. కానీ నాకెప్పుడూ అలా అనిపించలేదు. కానీ ఆయనతో సన్నిహితంగా ఉండే కొంతమంది వ్యక్తులతో ఆయన నెరపే వ్యవహారాల్లో గుర్తించదగిన తేడా నేను గమనించాను. ఇనిస్టిట్యూట్ దగ్గర కొన్ని కుటుంబాలు పదిహేను సంవత్సరాలకి పైగా ఉంటున్నాయి. స్వామీజీ వాళ్లని తమ సొంత పిల్లల్లా చూసుకునేవారు. వాళ్లు తరచుగా ఆయనని సందర్శించేవారు, స్వామీజీ వారి ఇళ్లకి వెళ్లి భోజనాలు చేస్తుండేవారు. వాళ్ల పిల్లలతో ఆడుకుంటూ ఉండేవారు. ఒక్కోసారి వారి కోసం వండి పెట్టేవారు కూడా. కానీ ఇప్పుడు ఆయన కేవలం వాళ్లు దారిలో ఎదురుపడితే మాట్లాడుతున్నారు. ఒకటీ

రెండు వాక్యాలు మాత్రమే మాట్లాడుతున్నారు. కొంతమందిపై అకారణమైన ప్రేమ శ్రద్ధ కురిపించారు, మరి కొందరిపై అకారణంగానే కోపగించి తక్షణం అక్కడ నుంచి వెళ్లిపొమ్మని అన్నారు. విద్యార్థుల్లో కొంతమంది తమని పట్టించుకోవడం లేదనే నిరాశతో ఇన్‌స్టిట్యూట్ వదిలి వెళ్లిపోగా, మరి కొంతమంది ఆయన భారతదేశం తిరిగి వెళ్లిపోయిన తర్వాత వెళ్లిపోయారు.

ఆయన నిష్క్రమణ తర్వాత, అనతికాలంలో గుసగుసలు ప్రారంభమయ్యాయి. స్వామీజీ ధనాన్ని దుర్వినియోగం చేస్తున్నారనీ, విద్యార్థినులతో ఆయన అనుచితంగా ప్రవర్తించేవారనే పుకార్లు వ్యాపించసాగాయి. ఏదో ఒక సమయంలో స్వామీజీకి సన్నిహితంగా మెలిగిన విద్యార్థినులు ఈ కొత్త నాటకంలో తమ పాత్ర పోషించసాగారు. వీరు వివిధ సందర్భాల్లో ఒక దశాబ్దం లేదా అంతకు ముందే ఇన్స్టిట్యూట్ ని విడిచి వెళ్లారు. వీరంతా ఆయన గురించీ, నాతో సహా ఇన్‌స్టిట్యూట్ అధికారుల గురించీ ఆరోపణలు చేయడంలో చురుకుగా పాల్గొనేవారు. ఈ ఆరోపణలు యునైటెడ్ స్టేట్స్, భారతదేశంలోని వార్తాపత్రికల్లో కనిపించడం ప్రారంభమైంది. స్వామీజీ మౌనంగా ఉండిపోయారు. ఆయన డెహరాడూన్‌లో మెడికల్ కాంప్లెక్స్ బిల్డింగ్ నిర్మాణం మీద దృష్టి నిలిపారు. స్వామీజీ గురించి సరిగా తెలియని వారిపైనా, అప్పటికే సందేహాస్పదంగా ఉండేవారికి ఈ నిశ్శబ్దం ప్రతికూలత ప్రభావం చూపింది, వారికి ఈ వార్తలు అయోమయానికి గురి చేసి ఆందోళన కలిగించాయి. ఈ పరిస్థితులకు తమ వృత్తిపరమైన కీర్తిప్రతిష్ఠలు దెబ్బతింటాయని ఆ ఇన్‌స్టిట్యూట్ అధికారులు కూడా చింతించసాగారు. స్వామీజీ తనను తాను కాపాడుకోవాలనీ లేదా తన నిర్దోషిత్వాన్ని ఋజువు చేసుకోడానికి తగిన చర్యలు తీసుకోవాలనీ లీగల్ ప్రోటోకాల్ డిమాండ్ చేస్తోంది. కానీ ఆయన దేనికీ ఇష్టం చూపించలేదు.

ఒక సంవత్సరం తరువాత నేను ఋషికేశ్‌లో స్వామీజీని సందర్శించే అవకాశం దానంతట అదే వచ్చినపుడు నేను ఆయన నిశ్శబ్దంగా ఉండడానికి కారణం ఏమిటని అడుగుతూ, అది వారి మిషన్ ని కుంటుపరుస్తోంది కదా అని అడిగాను. దానికి స్వామీజీ బదులిచ్చారు, 'ఒక స్వామిగా నన్ను నేను రక్షించుకోనని ప్రతిజ్ఞ చేశాను. నా గురించి ప్రతికూల విషయాలు చెప్తున్నది నా విద్యార్థులే, ఆధ్యాత్మిక భావనలో నా పిల్లలు. ఒకానొక రోజు నేను వాళ్లని నా హృదయానికి హత్తుకుంటాను. నా జీవితేశ్వరుడినీ, నా గురుదేవుల్నీ వారికి బేషరతుగా ప్రేమని అనుగ్రహించాలని నేను ప్రార్థిస్తున్నాను. నేను ఈ విద్యార్థులు తమ అంతిమ లక్ష్యం చేరుకునే వరకు. నా సేవలందిస్తానని మా సంప్రదాయ ఋషులకు వాగ్దానం చేశాను. ఇప్పుడు, ఇలాంటి ఒక అల్ప కారణానికి నేను వాళ్లని వదిలివేయనా? నేను అలా చేస్తే, నా ప్రార్థనలు, ఆశీర్వాదాలూ అర్థరహితమవుతాయి. దానికి నేనే బాధ్యత వహించాల్సి ఉంటుంది. మా గురుదేవుల బృహత్తర లక్ష్యం నిష్ప్రయోజనమై పోతుంది. దైవం మానవ ప్రణాళికల్నీ ప్రయత్నాల్నీ అధిగమిస్తుంది. గుర్తుంచుకో, దైవం ఎల్లప్పుడూ అత్యధిక శ్రేష్ఠమైన ప్రయోజనానికి సంబంధించిన విత్తనాలనే కలిగి ఉంటుంది.'

ఈ నాటకం జరుగుతోంది. నేను స్వామీజీ శిష్యునిగానూ, ఇన్స్టిట్యూట్ అధికారిగానూ ద్విపాత్రాభినయం చేస్తూ నాటకాన్ని వీక్షిస్తున్నాను. విశ్వ శక్తులు తమ బలాన్ని పంపించే సమయం కోసం ఎదురుచూస్తున్నాను. 'నా చర్యలనూ, నా మాటలనూ ఎవరూ అర్థం చేసుకోలేని ఒక సమయం వస్తుంది' అనే వ్యాఖ్య ఋజువవుతుందని ఎదురుచూస్తూ నా హృదయంలో నేను స్వామీజీ, బాబాజీ, మహర్షులందరినీ ప్రార్థించాను.

ముఖ్యంగా ఆయన వ్యాఖ్య, 'నేను హిమాలయాల్లో అంతర్ధానమవుతాను, ఎవరూ నన్ను కనిపెట్టలేరు,' అనే భాగంలోని వాస్తవికతని ఆదరించగలిగే బలం, అంతర్దృష్టి నాకు ఇవ్వమని ఆయన 1993 వేసవిలో మాట్లాడిన మహర్షులందరినీ ప్రార్థించాను.

అధ్యాయం 12

# నిర్వాణం దిశగా

1 9 8 6 లో స్వామీజీ హిమాలయాల పర్వత పాద ప్రాంతంలో ఆయన మొదట్లో అనుకున్నట్టు వేద సంస్కృతి నాగరికత కోసం ఒక కేంద్రం నిర్మించాలనే ఆలోచనని విరమించుకున్నారు. ఆయన ఆ తర్వాత మరెన్నడూ ఆ ప్రాజెక్ట్ గురించి మాట్లాడలేదు. దాని బదులు ఆయన తన దృష్టి మొత్తం భారతదేశంలో పేదరికం, నిరక్షరాస్యత, అల్పస్థాయిలో ఉన్న ఆరోగ్య సమస్యల నివారణ మీద పెట్టారు. ఆస్పత్రి ఏర్పాటుతో పాటు, వైద్య కళాశాల, నర్సింగ్ స్కూల్‌ని కూడా స్థాపించారు. మారుమూల హిమాలయ గ్రామాల్లో వయోజన విద్య కోసం కార్యక్రమాల (ధనార్జన మార్గాలతో సహా) నిమిత్తం ఆయన ఒక గ్రామీణాభివృద్ధి ప్రాజెక్ట్ కూడా చేపట్టారు. ఉన్నట్టుండి మరల స్వామీజీ వేద సంస్కృతి సముద్ధరణపై ఆసక్తిని ప్రదర్శించసాగారు.

ఇది 1993 వేసవి ముగుస్తుండగా జరిగిన సంఘటన. న్యూ జెర్సీలో నివసిస్తున్న భారతీయుల సమూహం కొంతకాలం పాటు ఇన్స్టిట్యూట్‌కి వస్తున్నారు. వాళ్లకి స్వామీజీ బాగా తెలుసు. ఆధ్యాత్మికత, సంపూర్ణ ఆరోగ్య దృక్పథం, మానవాళికి శ్రేయస్సు స్వామీజీ ఆలోచనల గురించి వాళ్లకి బాగా తెలుసు. వారి కమ్యూనిటీలో ఉపన్యాసమిచ్చేందుకు వారిని ఆహ్వానించడానికి వారు వచ్చారు. స్వామీజీ ఉపన్యాసానికి ముందు భగవన్నామ సంకీర్తన కార్యక్రమం ఉంది, కాబట్టి స్వామీజీ స్టేజీ మీదకి వెళ్లేలోపు ప్రేక్షకులు భక్తి పారవశ్యతలో ఉండేవారు.

ఆయన తన విలక్షణమైన శైలిలో ఉపన్యాసం ప్రారంభించేవారు: 'నేను మీలోని దివ్యత్వాన్ని ప్రార్థిస్తున్నాను. ఆధ్యాత్మిక తత్వంలో కీలకమైన అంశం ప్రతి స్థాయిలోనూ మిమ్మల్ని మీరు తెలుసుకోవటం. మీకు శరీరం ఉంది. కానీ మీరు శరీరం కాదు. మీకు ఒక మనస్సు ఉంది. కానీ మీరు మనస్సు కాదు. శరీరమూ, మనస్సూ-రెండూ కూడా మీలో మిరుమిట్లు గొలిపే దివ్యత్వాన్ని ప్రకాశింపజేసే సాధనలే. మీ కోసం ఉన్న ప్రపంచంలో అన్ని వస్తువుల్నీ అందుకోవడానికి మీరు అర్హులే.

ప్రాపంచిక సంపదల ప్రయోజనం మిమ్మల్ని సౌకర్యవంతమైన రీతిలో ఉంచడమే. ప్రాపంచిక వస్తువులు మీ శరీరాన్నీ, మీ మనసునీ అసౌకర్యాల నుంచి తప్పిస్తాయి. మీరు ఈ ప్రాపంచిక వస్తువుల్ని నైపుణ్యంగా ఉపయోగించడం నేర్చుకుంటే శరీరమూ, మనస్సూ ఆనందానికి తరగని వనరుగా మారుతుంది. మీ ఆధ్యాత్మిక అభివృద్ధికి అవరోధం కాకుండా ఉంటుంది. కానీ మీకు మీ శరీరానికీ, మనస్సుకీ సేద తీరేలా మీ ప్రాపంచిక వనరుల్ని ఉపయోగించడం తెలియకపోతే, మీరు జీవితం దుర్భరమవుతుంది. మీరు ప్రాపంచిక వస్తువుల్ని కోల్పోయారంటే,

మీరు కృంగిపోతారు. కానీ మీరు సంతులిత జీవనం జీవించడం, ఉన్నత లక్ష్యాల కోసం జీవించడంలో విజయం సాధించే కళ తెలుసుకుంటే జీవితం మీకూ, ఇతరులకూ కూడా అధిక ప్రయోజనాన్ని చేకూరుస్తుంది.'

అప్పుడు అకస్మాత్తుగా స్వామీజీ స్వరం మారింది. 'మీ గురించి మీరు శ్రద్ధ తీసుకోనందుకు నేను విచారపడుతున్నాను. ఈ దేశంలో, అన్నీ విస్తారంగా లభిస్తున్నా, ప్రజలకి ఆరోగ్యం తక్కువ. ప్రధాన స్రవంతికి చెందిన అమెరికన్లలో, అవగాహన పెరుగుతోంది. ధూమపానం, మద్యం వినియోగం తగ్గుతున్నాయి. ఇప్పుడు అమెరికన్లు హెల్త్ క్లబ్బులకి వెళ్తున్నారు. వారు యోగాసనాలు వేస్తున్నారు. జాగింగ్ చేస్తున్నారు, పరిగెత్తుతున్నారు. వారు ఒక ఆరోగ్యకరమైన ఆహారానికి పాటించాల్సిన సూత్రాల్ని నేర్చుకుంటున్నారు. ఒక సగటు అమెరికన్ జీవితకాలం అద్భుతంగా పెరిగింది. కానీ అమెరికాలో నివసిస్తున్న భారతీయులు సాధారణంగా అత్యంత అనారోగ్యంతో బాధపడే ప్రజలుగా ఉంటారు. అమెరికన్ సమాజంలో భాగంగా మారే ప్రయత్నంలో ఇక్కడ నివసిస్తున్న భారతీయులు అమెరికన్లు వదిలించుకోవటం ప్రయత్నిస్తున్న మాంసం, మద్యం వంటి అనారోగ్యకరమైన ఆహారపు అలవాట్లని ఆనందంగా ఆలింగనం చేసుకుంటున్నారు.

'శాఖాహారం తీసుకునే చాలామంది భారతీయులు, తాము మాంసం తినడం లేదు కాబట్టి వారి ఆహారం ఆరోగ్యకరమైనదని భావిస్తారు. మీరు కూడా మతపరమైన స్వచ్ఛత కోసం ఒక శాఖాహార ఆహారం తీసుకుంటారు. మతపరమైన కార్యక్రమంలో భాగంగా మీరు ఉపవాసం చేస్తారు, కానీ మీరు అన్ని రకాల స్వీట్లు, పిండి పదార్థాలు, కొవ్వులు, పాల ఉత్పత్తులతో కూడిన పదార్థాలు తింటూ మీరు 'ఉపవాసం' చేస్తారు. సాధారణ జీవితంలో ఒక ఆరోగ్యకరమైన వ్యక్తి తిని జీర్ణం చేసుకోలేని ఆహారాన్ని మీరు ఉపవాస సమయాల్లో తింటూ ఉంటారు.

'ఎవరూ ఏనాడూ అర్థం చేసుకునేందుకు ప్రయత్నించని విషయం ఏమిటంటే, అసలు ఇది ఎలాంటి మతపరమైన ఆచరణ? ఇలాంటి పద్ధతులను పాటించడం ద్వారా మీరు కూడా మీ సమస్యలన్నీ పరిష్కరించబడాలని ఆశిస్తారు. మీ పిల్లలు మీకు విధేయులుగా ఉండాలి; మీరు వ్యాపారం విజయవంతంగా చేయాలి; మీరు ఒక సాధుపురుషులు కావాలి; దేవుడు మిమ్మల్ని చూసి సంతోషించాలి. ఇన్ని విషయాలు ఒకేసారి ఎలా సాధ్యపడతాయో నాకు అర్థం కాదు. నిజానికి, ఫలితం మీ ముందు ఉంది. నలభై ఏళ్లు వచ్చేసరికి భారతీయ పురుషుల్ని అన్ని రకాల సమస్యలూ దాడి చేస్తాయి. వెన్ను నొప్పి, కీళ్ళనొప్పులు, కరోనరీ వ్యాధి, అధిక రక్తపోటు, మధుమేహం. భారతీయ మహిళలకి కూడా అంతే. మీ పిల్లలు మీ మాట వినరు. వారు భారతీయ సంస్కృతినీ, ఆచారాల్నీ పట్టించుకోరు దేవుడు నిరంతరం మీతోనే ఉంటాడు. కానీ మిమ్మల్ని ఎప్పుడూ భయం, అనుమానం, ఆందోళన, మీ మనస్సుని వెంటాడుతూనే ఉంటాయి.

'అందువల్ల నేను ఇంతవరకూ అమెరికాలో ఉన్న భారతీయులకు ఏదైనా కమ్యూనిటీ సెంటర్ ఉన్నట్టుగానీ, వారు అక్కడికి వెళ్లి ఏదైనా కొంచెం వ్యాయామం లాంటిది గానీ చేస్తున్నట్టు గానీ, ఆహారం, పోషణ, ధ్యానం, విశ్రాంతి తీసుకోవడం, వారు ఎదుర్కొంటున్న సంస్కృతి సంబంధమైన సంక్షోభం గురించిన విషయాల్ని చర్చించడం, పిల్లలికి సంబంధించిన సమస్యల్ని గురించి మాట్లాడుకోవడం వంటివి ఏవైనా జరుగుతున్నట్టు నేను వినలేదు. మీరు దేవాలయాలు, స్వాములు, ఇతర ధార్మిక ప్రముఖుల నుంచి ఏదో మహత్తుని మరీ ఎక్కువ ఆశిస్తుంటారు. మీరు దేవాలయాల్ని తరచుగా సందర్శించడం వల్ల, పౌరాణిక కథా కాలక్షేపాలు పెట్టించుకోవడం వల్ల, మీరు సాంస్కృతిక వారసత్వాన్ని కాపాడుతున్నామని భావిస్తుంటారు. ఆ విధంగా మీ తాత ముత్తాతల కాలాల నాటి వారసత్వాన్ని మీ పిల్లలకి అందిస్తున్నామని అనుకుంటూ ఉంటారు. కానీ అలా జరగదు.

'మీరు వ్యావహారికంగా ఉండండి. వాస్తవంలో జీవించండి. మీరు మీ ఉనికిని నిలబెట్టుకోవాలంటే మీరు ఎవరో తెలుసుకోవాలి. మీ మూలాధారం ఏమిటి? మీ మూలాలు ఎక్కడ ఉన్నాయి? మీ సంస్కృతిలో ఉన్న గొప్పదనం ఏమిటి? దానికి గల బలాలూ, బలహీనతలూ ఏమిటి? భారతీయ సమాజంలో ఏ నిర్దిష్ట భాగాల్లో అనవసరమైన చెత్త ఎక్కడ పేరుకుందో చూడాలి. మీ సంస్కృతిలో ఉన్న ఆరోగ్యకరమైన అంశాల్ని ఆదరించాలనే కోరిక కలిగి ఉండాలి. నష్టపరిచే అవమానకరమైన అంశాల్ని వదిలించుకోగల ధైర్యం కలిగి ఉండాలి. మీరు దృష్టి సారిస్తే ప్రపంచంలో అన్ని సంస్కృతుల్లోనూ ఇలాంటి అంశాల్ని కలిగి ఉంటాయి. భారతీయ సంస్కృతి అందుకు మినహాయింపు కాదు.

'మీరు ఆచార సంప్రదాయాల్ని పాటించడంలో మరీ ఎక్కువగా నిమగ్నమై ఉన్నారు. మీ పిల్లలకి ఈ ఆచారాలూ, ఈ ఆరాధనా విధానాలూ అర్థం పర్థం లేనట్టుగా కనిపిస్తాయి. వాళ్లు ఒక భిన్న సంస్కృతులు మేళవించిన వాతావరణంలో జీవిస్తున్నారు. వారు తమ భారతీయ సంస్కృతి పట్ల గౌరవం పెంపొందించుకునే ముందు ఆ సంస్కృతికి చెందిన అద్వితీయమైన అపురూపమైన లక్షణాల్ని తెలుసుకోవాలి. వారికి భారత సంస్కృతి గురించి తెలియడానికి ఉన్న ఏకైక స్రోతస్సు భారతీయ చలనచిత్రాలు. వాళ్లు వాటిని ఇష్టపడరు. వారికి ఆ భాష అర్థం కాదు, ఆ చిత్రంలో ఇవ్వబడే సందేశంలో పస తక్కువగా ఉంటుంది, ఆ చిత్రాలు కూడా ఒకే కేంద్రబిందువు చుట్టూ తిరుగుతూ ఉంటాయి– అవినీతి, నేరాలు, అవాస్తవిక ప్రేమ గాథలు...ఇలా.

ఒకవేళ మీరు మీ పిల్లలకి భారతీయ సంస్కృతి, దాని ఉత్కృష్టమైన వారసత్వం గురించి తెలియజేయాలనుకుంటే, మీరు ఆ విషయం గురించి మరింత నైపుణ్యంతో పని చేయాలి. ప్రామాణికమైన జ్ఞానాన్ని వారికి అందించండి. దాన్ని చాలా ఆహ్లాదకరమైన, ఆసక్తిదాయకమైన రీతిలో వారి ఎదుట పెట్టండి,' అని చెప్పారు. ప్రేక్షకుల్లో ఎక్కువమంది స్వామీజీ సందేశాన్ని మనసుకి పట్టించుకున్నారు. ఉపన్యాసం పూర్తి అయిన తర్వాత వారు ఆయన్ని కలిసి భారతీయ సంస్కృతి గురించి కేవలం మాట్లాడడానికి మించి చేయగల అమూల్యమైన పనులేవైనా చేయడానికీ, తమ సంస్కృతి వాస్తవిక ఆధారాల్ని వంటబట్టించుకోవడానికీ ఒక కేంద్రం ఏర్పాటు చేయడానికి తమకు మార్గనిర్దేశం చేయమని కోరారు.

మరో ప్రక్క చాలామందికి స్వామీజీ సూటిగా ఇచ్చిన సందేశాన్ని అభినందించలేక పోయారు. వారు స్వామీజీ హిందూ మతం విశిష్టత గురించీ, హైందవ ధర్మ గ్రంథాల విశిష్టత గురించీ మాట్లాడతారని ఆశించారు. తమచే భక్తి గీతాలు పాడించి హిందూమతం గొప్పతనం గురించి ప్రేరణాస్పదమైన ప్రసంగం ఇస్తారని ఎదురు చూశారు. దాంతో వారికి నిరాశ తప్పలేదు. అందువల్ల కొంతమంది ఉపన్యాసం పూర్తి కాక ముందే హాలు వదిలి వెళ్లిపోయారు. మిగతా వాళ్లు ఉపన్యాసం తర్వాత ఏర్పాటు చేయబడే ఫలహారాల కోసం కూర్చుని, తమలోని ప్రతికూల భావాలు పదిమందితో పంచుకున్నారు.

మేము హానెస్‌డేల్‌కి తిరిగి వస్తుంటే, స్వామీజీ విదేశాల్లో నివసిస్తున్న భారతీయుల గురించి తన ఆందోళన వ్యక్తం చేశారు. 'భారతదేశంలోనూ ఇంతకంటే మెరుగైన పరిస్థితి ఏమీ లేదు,' అన్నారు. అనేక మతాలకు చెందిన ప్రజలు తమ దేశం కోసం తమకి చాతనైనంత గొప్పగా ఏదైనా చేయాలని శతవిధాలా ప్రయత్నిస్తున్నారు. కానీ తరచుగా వారి ప్రయత్నంలో దూరదృష్టి లోపిస్తోంది. భారతదేశ నాయకులు ప్రధానంగా తమ తమ మత భావజాలాన్నీ, తమ సంస్థాగత ప్రయోజనాన్నీ ఆధారం చేసుకుని ప్రవర్తిస్తూ ఉంటారు. వారు ఆ స్థాయికి మించి ఎదిగితే హిందూమతంలోని బృహత్తర లక్ష్యంతో మమేకమై పని చేయగలుగుతారు. నిజానికి ఆధునిక భారతదేశంలో వేదర్షుల బోధనలు, సకల ప్రాచ్య సంప్రదాయాలకీ మూలమై నిలిచి

భారతీయ ఆత్మని నింపుకుని ఉన్న భారతీయ వారసత్వపు దృక్కోణాన్ని ప్రోత్సహించే నాయకులు ఒక్కరూ లేరు.' అన్నారు స్వామీజీ.

తర్వాత కొద్దిరోజుల పాటు సాయంత్రం వేళల్లో స్వామీజీ ఈ విషయాన్నే మళ్లీ మళ్లీ ప్రస్తావిస్తూ ఉండేవారు. 'భారతీయుల మనస్తత్వంలో ఏదో లోపం తలెత్తింది. ఒకానొక సమయంలో శకులు, హూణులు, కుషానులు, ఇంకా భారతదేశంపైకి దాడికి తెగబడి అడుగు పెట్టిన ఇతర విదేశీయుల్ని ఎవరినైనా వారిని తనలో మహత్తరంగా కలిపేసుకుంది. భారతీయ రాజులు వారితో పోరు సలిపేవారు. కొన్నిసార్లు శత్రువుల్ని జయించేవారు, కొన్నిసార్లు ఓటమి పాలయ్యేవారు. కానీ ప్రాచీన కాలంలో భారతదేశాన్ని పరిపాలించిన విదేశీ రాజులెవరైనా సరే, భారతదేశ దర్శనాన్ని గానీ, ఆధ్యాత్మికతని గానీ ఈషణ్మాత్రం కూడా మార్చలేకపోయేవారు. పైగా, చాలావరకు అలా దండెత్తి వచ్చిన విదేశీయులే ఎలాంటి మతపరమైన, జాతిపరమైన వైరుధ్యాలు ప్రదర్శించకుండా భారతదేశ భూభాగంలో స్థిరపడిపోయిన దాఖలాలు చరిత్రలో కోకొల్లలుగా ఉన్నాయి.

'కానీ ఎందుకో గానీ పదిహేను వందల ఏళ్ల క్రితం, వైదిక ఋషుల బోధలు హిందూ మతంగా పరిణమించడం, అలా అస్తిత్వంలోకి వచ్చిన హిందువులు తాము బౌద్ధులు, జైనుల కంటే వేరుగా ఉన్నామని చూపించుకోవడం మొదలైంది. వేదాలు, ఉపనిషత్తులు బోధిస్తున్న విషయాల్ని సాధన చేయడం కంటే, వేదాల మాదిరిగానే ప్రాచీన సంప్రదాయాల్లో అంతర్భాగమైన బౌద్ధ, జైన సంప్రదాయాల్నీ, బుద్ధుడు, మహావీరుని బోధల్నీ ఖండించడం గొప్పగా భావించారు. మతం, రాజకీయాలు కలిసిపోయి దేశం బలహీనపడింది, సంస్కృతి మిడిసిపడసాగింది. అన్ని విషయాల్లోనూ ఎవరి సమూహానికి వాళ్లు విలువనిచ్చుకోవడం, ఇతరుల్ని పల్చన చేయడం మొదలైంది. ప్రతి ఒక్కరూ, 'నా మార్గం నీ మార్గం కంటే గొప్పది. మా ఆధ్యాత్మిక గురువు మీ ఆధ్యాత్మిక గురువు కంటే గొప్పవారు. నీతో పోల్చుకుంటే నేను నా సమూహానికీ, నా గురువుకీ ఎక్కువగా అంకితమై ఉన్నాను.' ఈ భావన ఎక్కువైంది.

'ఈ భావన ఇప్పుడు మరింత ముదిరింది. భారతదేశంలో రాజకీయాలు మతం, జాతిపరమైన గుర్తింపులతో కలుషితమయ్యాయి. మతం, వ్యక్తిగత సంప్రదాయాలు, మూఢనమ్మకాలు, సిద్ధాంతాల కోరల్లో నలిగి నాసరిల్లుతోంది. భారతదేశంలో నివసిస్తున్న భారతీయుల మాదిరిగానే, విదేశాల్లో నివసిస్తున్న భారతీయులు కూడా తమ ఆలోచనా రీతుల నుంచి బయటపడలేక పోతున్నారు. నిజానికి, అదే మూసని తమ పిల్లలకు కూడా అందించడానికి చూస్తున్నారు. పిల్లలు వద్దని నిరసిస్తే, వాళ్లకి నిరాశ కలుగుతోంది. వాళ్లకి అద్భుతాల్ని మీద ఎక్కువ ఆశ ఉంటుంది. సంప్రదాయాల్ని పూజారులు పాటించాలనీ, ఆ విధంగా వారు తమ పిల్లల్లో మార్పు తీసుకురావాలనీ కోరుకుంటారు. వేసవి కాలంలో వందలాదిమంది సన్యాసులు భారతీయ సమూహాలకు కలుసుకుంటారు, వారికి బోధ చేస్తారు. వారు తమ ఆశ్రమాల్లోనూ, దేవాలయాల్లోనూ అనేక కార్యక్రమాలు, వేడుకలు జరుపుతారు. కానీ సమస్య ఎక్కడిదక్కడే ఉంటుంది,' అన్నారు.

ఒక సాయంత్రం నేను అడిగాను, 'స్వామీజీ, గత ఏడేళ్లుగా భారతీయ సంస్కృతి పరిరక్షణ గురించి ఇంతగా మీరు పట్టించుకోవడం ఇది మొదటిసారేమో కదా! నేను–' అంటూ ఇంకేదో చెప్పబోయాను,' అన్నాను.

నేను పూర్తి చేసేలోపే, 'నాకు భారతీయ సంస్కృతి, భారతీయులు, హిందువులు, లేదా భారత్ లోపలా, వెలుపలా నివసించే ఏ ఇతర గ్రూపు పట్లా ప్రత్యేకమైన పట్టింపు అంటూ ఏమీ లేదు. నాకు మహర్షుల బోధనల పట్ల ఆసక్తి ఉంది, వాళ్లు వేద ద్రష్టలు. వారి బోధలు వేలాది

ఏళ్ల క్రితం ఎంత ప్రాముఖ్యత కలిగి ఉన్నాయో, ఈనాడూ అంతే ప్రాముఖ్యతని కలిగి ఉన్నాయి. వారికి మానవత్వాన్ని పెంచి పోషించడం పట్ల గొప్ప ఆసక్తి ఉండేది.

వాళ్లు ప్రేమ సందేశం ఇచ్చారు. నాకు ఆ వేద వారసత్వాన్ని మానవత్వానికి మళ్లీ పరిచయం చేయడం పట్ల ఎంతో ఆసక్తి ఉంది. భారతీయులు, భారతీయేతరులు కూడా మానవత్వంలో అంతర్భాగమే. నేను నిన్ను మహర్షులకు సేవ చేయమని కోరుతున్నాను. వారి ప్రేమజ్యోతిని మానవ అంతరంగాల్లో వెలిగించు. ఇది నా ఆజ్ఞ. నువ్వు దీన్ని శిరోధార్యంగా భావిస్తావని నాకు తెలుసు.'

'స్వామీజీ, మీరు ఈ పని చేస్తున్నారు కదా! నేను మీ అడుగుజాడల్లో నడిస్తే, అది మీ ఆజ్ఞని శిరసావహించినట్లే కదా?' నేను అన్నాను.

'అవును,' అన్నారాయన. 'మహర్షుల సందేశాల్ని బోధించే పద్ధతిలో మార్పు చేయాల్సి ఉంది. సమయం వచ్చినపుడు ఏం చేయాలో, ఎలా చేయాలో నీకు అంతా అర్థమవుతుంది,' అంటూ ఆయన నన్ను ఆ రాత్రికి పంపేశారు. కొద్దిరోజుల తర్వాత ఆగస్టు 11 సాయంత్రం వేళ, స్వామీజీ నాకు గత పదకొండు ఏళ్ల నుంచీ చెప్తానని చెప్తూ వస్తున్న సాధన బోధించారు. ఆ తర్వాత సంస్థ నియమావళిలో కొన్ని మార్పులు చేయాలని తాను నిర్ణయించుకున్నానని చెప్పారు. స్వామీజీ ఆ సాధన ఇచ్చిన తర్వాత నా మనసు ఎంతో ఆనందం ఎగసిపడసాగింది. ఆయన వ్యాఖ్యలోని అంతరార్థాన్ని నేను గమనించలేకపోయాను. అప్పుడు ఆగస్టు 15 న స్వామీజీ ఇన్‌స్టిట్యూట్ నుంచి భారతదేశానికి వస్తూ మధ్యలో బఫలో, టొరాంటో, న్యూయార్క్ సిటీ, మాస్కో నగరాల్లో ఆగారు. మరి తిరిగి ఆయన వెనక్కి రాలేదు.

ఆయన వెళ్లిన రోజు బోర్డు సెక్రెటరీ, సుజాన్ గ్రాడీ నాతో ఒక విషయం చెప్పింది. స్వామీజీ హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్‌కి నన్ను స్పిర్చ్యువల్ హెడ్‌గా పెట్టి, తాను ఆ పదవికి రిజైన్ చేశారట. నేను విస్మయం చెందాను. గతంలో నేను చాలా సందర్భాల్లో ఆయన చేసే పనులు ఆ సమయంలో అర్థం లేనివిగా అనిపించేవి, కానీ ఈ నియామకం చాలా విభిన్నమైనది! నా మనసు చాలా ఆందోళన పడసాగింది. స్టాఫ్‌లో చాలా మంది నా కంటే పెద్దవాళ్లు, అడ్మినిస్ట్రేటివ్ వ్యవహారాల్లో నా కంటే చాలా అనుభవం ఉన్నవాళ్లు కూడా. కొంతమందైతే, స్వామీజీ తన వారసుడిగా ఎంపిక చేసేది తమనేననే ధీమాతో ఉన్నారు. కోరిక కోపానికి గురి చేస్తుందనీ, ఆ కోపం ఎలా వ్యక్తం కావాలో దాని దారి అది చూసుకుంటుందనీ నాకు తెలుసు. అలాగే స్వామీజీ 'ఈ స్వామి జీవితం నాకు మహా నిరంతర హింసగా ఉంది!' అని పదే పదే ప్రస్తావించేవారు. నేను స్వామిని కాకపోయినా, స్వామీజీ బాబాజీ మానస 'పుత్రుడి'గా ఆ హింసలో కొంత భాగానికి నేను కూడా వారసుడిని కావలసిందేనని నాకు తెలుసు. ముఖ్యంగా బాబాజీ వంటి మర్మయోగికీ, బహుముఖ ప్రజ్ఞాశాలికి పుత్రుడై, ఎన్నో పెద్ద పెద్ద సంస్థల్ని నడుపుతూ, ఎన్నో రంగాలకి చెందిన అనుచరుల్ని కలిగి ఉన్నపుడు ఆ హింస తప్పదు. అప్పుడు నేను ఆలోచించాను– 'నేనెవర్ని ఇదంతా ఆలోచించడానికి? పదిహేడేళ్ల క్రితం నేనొక ధూళి కణంగా రోడ్డు ప్రక్క ఎగురుతుండేవాడిని. ఆయన నన్ను చేరదీసి, తన హృదయ కమలానికి హత్తుకుని సంరక్షించారు. 1976 లో నాతో ఆయన ఓసారి, 'నొప్పి భరించడం నీకు సంతోషంగా ఉంటే, అప్పుడు నాతో ఉండే విషయం ఆలోచించు,' అన్నారు.

ఆ సమయంలో ఆయన ఉద్దేశ్యం ఏమిటో నాకు తెలియదు. కానీ నేను ఆయన్ని 'నేనెప్పుడూ మీతోనే ఉండే సౌభాగ్యం దయచేయండి' అని మాత్రమే ప్రాధేయపడ్డాను. ఆ సంభాషణని ఇప్పుడు తల్చుకుంటే, ఈ నియామకం ఎందుకు జరిగిందో అర్థం చేసుకోవడానికి నాకు సహాయపడుతుంది.

భరోసా ఇస్తున్నట్టున్న ఆయన స్వరం నా స్మృతిలో వినిపిస్తోంది, 'నీ కోరికలన్నీ త్యాగం చేయి. నేను నీ బాధ్యతని తీసుంటాను. నీకు కావలసింది నీకు లభించేటట్టూ, నీకు లభించినదాన్ని సంరక్షించుకునేటట్టూ నేను చేస్తాను.' ఆ మాటతో నేను స్వామీజీ పాదాలపై తల ఉంచాను. ఆయన నా శిరసుపై చేయి ఉంచి, 'వృద్ధిలోకి రా. నువ్వు జ్యోతిష్యం, రాజకీయాలు, మత విభేదాలు, వర్గ వైషమ్యాల్లో అనవసరంగా తలదూర్చకు,' అని ఆశీర్వదించారు. ఈ స్మృతి శకలమే నాలో నెలకొన్న శాంతికీ, బలానికీ మూలం. అప్పుడే నాకు అర్థమైంది, ఎలాంటి పరిస్థితి ఎదురైనా, స్వామీజీ ఎప్పటిలాగానే నాకు తోడుగా నీడగా నిలిచి నాకు దారి చూపిస్తారు అని.

సెప్టెంబరు 1993 మధ్య నుంచి 1994 వేసవి కాలం వరకు ఇన్‌స్టిట్యూట్‌లో వరసగా మీటింగ్స్ జరుగుతూనే ఉన్నాయి. అయోమయ పరిస్థితి నెలకొని ఉంది. కొంతమంది డైరక్టర్లు రిజైన్ చేశారు. ఇన్‌స్టిట్యూట్‌లో నివాసం ఉండేవారిలో కొంతమంది వెళ్లిపోయారు. కొంతమంది మోసపోయామని భావించారు. కొంతమంది స్వామీజీనీ, ఇన్‌స్టిట్యూట్‌నీ సందేహించారు. ఆ రోజుల్లో స్వామీజీ సాధారణంగా ఢిల్లీలోని అపార్ట్‌మెంట్‌లోనో లేదా ఋషీకేశ్ ఆశ్రమంలోనో ఉండేవారు. నేను వారితో మాట్లాడడానికి చాలాసార్లు ప్రయత్నించాను గానీ వారు నా కాల్స్‌ని తీసుకోలేదు. చివరికి, ఆయన ఈ విషయంలో కల్పించుకోదల్చుకోలేదని అర్థం చేసుకుని నేను వారిని కాంటాక్ట్ చేయడం మానేశాను. ఏం చేయాలో నాకు బాగా తెలుసు. కానీ నా సందేహం ఏమిటంటే, ఈ గందరగోళంలో స్వామీజీ దగ్గర ఎంతోకాలంగా చదువుకుంటున్న విద్యార్థి ఒకరు ఇబ్బంది పడుతున్నారు. అతడికి నేను చెప్తే విని అర్థం చేసుకునే స్థాయి లేదు. కాబట్టి ఏం చేస్తే బాగుంటుందని నేను అనుకున్నానో అదే చేశాను. వెళ్లేవారికి గుడ్‌బై చెప్పాను. ఉండదలుచుకున్న వాళ్లనీ కొత్తగా వచ్చి చేరదలుచుకున్నవాళ్లనీ స్వాగతించాను.

దాదాపు ఒక సంవత్సరం గడిచిపోయింది. మేము మొదటిసారి కలిసినప్పటి నుంచీ ఈనాటి దాకా స్వామీజీని ఇంతకాలం చూడకుండా ఉన్నది లేదు. ఆయన్ని చూడాలనిపిస్తోంది. నాలాగా వందలాది విద్యార్థులు ఆయన గురించి బెంగపెట్టుకున్నారు.

కానీ ఆయన అనుమతి లేకుండా నేను ఆయన్ని చూడటానికి భారతదేశానికి వెళ్ళలేను. పోనీ అనుమతి కోరడానికి తగినంత కారణం ఏదీ లేదు. అప్పుడు ఒక రోజు నాకు భారతదేశ ప్రధాన మంత్రి డెహరాడూన్ సమీపంలో హిమాలయన్ ఇనిస్టిట్యూట్ హాస్పిటల్ ట్రస్ట్ వద్ద మెడికల్ కళాశాలని ప్రారంభోత్సవం చేయబోతున్నారని విన్నాను. నాకు కారణం దొరికింది. నేను స్వామీజీకి ఉత్తరం రాశాను. ప్రారంభోత్సవ వేడుక తేదీలు కలిసొచ్చేలా నేను ఒక గ్రూప్‌తో హిమాలయాలు పర్యటించడానికి రావచ్చా అని నేను ప్రశ్నించాను.

స్వామీజీ అంగీకరించారు. తొంభై మంది బృందం వచ్చారు నాతో. మేమంతా ఋషికేశ్ చేరుకున్నాము. మేము వెళ్లాల్సిన గంగోత్రి క్షేత్రం దారిలో పర్వతాలలో భూస్ఖలనం జరిగి, దారి మూసుకుని పోయిందని చెప్పారు. ఇక ఆ దారిలో ప్రయాణించడానికి వీలు లేదు. పైగా, రాజకీయ సంక్షోభం కారణంగా ఆ ప్రాంతమంతా కర్ఫ్యూ ఉంది. ఇక ఎవరూ అటువైపు ప్రయాణించడానికి వీలుపడదు. మా బృందం ఋషికేశ్‌లో ఉన్న ఒక హోటల్‌లోనే ఎక్కువ సమయం గడిపింది.

కానీ విపత్తు రావడం కూడా మాకు మంచి అదృష్టం కలిసొచ్చేలా చేసింది. హోటల్ ఆశ్రమానికి కొంచెం దూరంలోనే ఉంది. అక్కడ నుంచి మేము గంగానది వెంబడే వెళ్ళిపోతే మేము అధికారులు చూడకుండా వెళ్లిపోగలము. పైగా అక్కడున్న ఒక నెల రోజుల సమయంలో స్వామీజీ ప్రతి రోజూ శ్వేతాశ్వతర ఉపనిషత్తుని బోధించారు. కొన్నిసార్లు రోజుకి రెండుసార్లు కూడా బోధించారు.

అమెరికాలో అయితే ఆయన వారం రోజులకి మించి ఏ గ్రంథాన్నీ బోధించే వారు కాదు ఎన్నడూ. కానీ ఇక్కడ మాకు ఇక్కడ వారితో కొన్ని వారాల పాటు ఆయనతో కలిసి అధ్యయనం చేసే వైభవం కలిగింది. మొదటి కొద్ది రోజులపాటు ఆయన ఉపనిషత్తులలో చెప్పబడిన సాధారణ విషయాన్ని వివరించారు. ఆ తర్వాత ఆయన శ్వేతాశ్వతర సారం మీద దృష్టి సారించారు. 'జీవితం అనేది గొప్ప వేడుక. ఈ వేడుకలో మనస్సు, శరీరం, భావాలను పాల్గొంటాయి. ఈ భాగస్వాములు ఎల్లప్పుడూ శరీరంలో నివసించే జీవితేశ్వరుడినీ, దివ్య జ్యోతినీ పూజిస్తాయి. అజ్ఞానం వలన, మన అహం తానే పెత్తందారునని ప్రకటించుకుంటుంది. మిగతా అన్ని అంశాలూ తననే సేవించాలని 'అహం' భావిస్తుంది. దాంతో సమస్యలు మొదలవుతాయి.

'అజ్ఞానమనే తెరని తొలగించడానికి ధ్యానం ఒక మార్గం. ధ్యానం చేసినపుడు తాను కూడా దైవ సేవలోనే ఉన్నానని అహానికి అర్థమవుతుంది తప్ప మరోలా దానికి అర్థం కాదు. ధ్యానమే యోగానికి మూలం. ధ్యానమే ఆధ్యాత్మిక క్రమశిక్షణ. ధ్యానం మీకు మిమ్మల్ని పరిచయం చేస్తుంది. ధ్యానం మీ శరీరం, ఇంద్రియాలు, మనస్సుతో మీ సంబంధాన్ని అవగాహనకు తెస్తుంది. అది మీరు ఎక్కడ బలహీనంగా తెలియజేస్తుంది, కాబట్టి మీరు మీ బలహీనతల్ని యోగాగ్నిలో విసిరివేయగలరు. నిజానికి, ఈ ఉపనిషత్తు అత్యంత నిగూఢమైన గ్రంథం. ఇది అగ్ని మర్మాన్ని తెలియజేసే ఉపనిషత్తు. ఇక్కడ అగ్ని 'రుద్రుని' గా పిలువబడుతున్నాడు. మిగతా తాంత్రిక సాహిత్యంలో అగ్ని 'శక్తి' రూపంగా పిలవబడింది. శైవుల గ్రంథాల్లో అగ్ని 'శివుని' గా కొలవబడింది. యోగులు దీనిని 'కుండలినీ శక్తి' అని పిలిచారు. ఋషుల భావనలో 'అగ్ని' ఆది గురువు, ఆది దైవం.

స్వామీజీ ప్రసంగంలోనూ, ఆయన కార్యకలాపాల్లోనూ ఇదివరకటి కంటే మరింత మార్మికత వ్యక్తమవుతున్నట్టు నాకు తెలుస్తోంది. ఆయన చేసే ప్రసంగాల్లో ఆయన చెప్పదలుచుకున్న విషయాన్ని తనదైన శైలిలో సూటిగా సరళంగా అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్టు చెప్పేశారు. కానీ ఇప్పుడు ఆ తర్వాత మాట్లాడిన మాటలు మళ్లీ మర్మంగానే ఉన్నాయి. వాటి అర్థమేమిటో ఎవరికీ తెలియలేదు. ఆయన మళ్లీ తన పూర్వపు శైలికి వెళ్లిపోయారు.

కొంతమంది స్టూడెంట్స్‌తో మాట్లాడుతుండగా ఆయన వాళ్లలో కొంతమందితో చాలా బాగా మాట్లాడేవారు, ఇతరుల్ని ఆకస్మికంగా పట్టించుకోకుండా వదిలేసేవారు.

ఉదాహరణకు, ఒక యేడాది ముందు స్వామీజీ హోనస్‌డేల్‌లో ఉన్నపుడు చాలా ప్రేమగా ఆప్యాయంగా చూసిన గ్వెన్ బర్డిక్ ఆయన్ని చూడటానికి వచ్చారు. కానీ స్వామీజీ ఆయన వైపు చూడనైనా చూడకుండా న్యూస్‌పేపర్ చదువుతూ ఉండిపోయారు. ఆమె, 'స్వామీజీ, నేను ఇక్కడ ఉన్నాను,' అని చెప్పింది.

అది విన్నాక కూడా ఆయన ముక్తసరిగా, 'ఆ, తెలుసు,' అని మాత్రమే అన్నారు.

ఆమె కొంతసేపు వేచి చూసి, 'మీరేమైనా చెప్తారా?' అని అడిగింది.

దానికి ఆయన బదులిస్తూ, 'లేదు,' అంటూ మళ్లీ న్యూస్‌పేపర్ చదవడంలో నిమగ్నమయ్యారు. చివరికి స్వామీజీ ఆమె వైపు చూస్తూ, 'ఇక్కడికి ఏం తీసుకొచ్చావు నువ్వు?' అని అడిగారు.

ఆమె, 'మీరు నన్ను గుర్తులేదా?' అని అడిగింది.

ఆయన నిక్కచ్చిగా, 'లేదు,' అని చెప్పారు.

ఆ అనుభవం గురించి వివరిస్తూ, గ్వెన్ 'అది ఒక గోడతో మాట్లాడటం లాంటిది' అని చెప్పింది. చివరికి ఆమె కన్నీరు పెట్టి వెళ్లిపోయింది. కానీ అప్పుడు కూడా స్వామీజీ ఏ మాత్రం పట్టించుకోలేదు.

ఆమె నా దగ్గరకు వచ్చింది. ఆయన ఎందుకలా ప్రవర్తించారని అడిగింది. నాకూ తెలియదనీ, బహుశా కాలం గడిచే కొద్దీ అర్థమవుతుందేమోననీ చెప్పాను.

ఆ సాయంత్రం నేను స్వామీజీని చూడటానికి వెళ్ళినప్పుడు ఆయన ఆకస్మికంగా 'నువ్వు శ్వేతాశ్వతర ఉపనిషత్తు చదివావా?' అడిగారు.

నేను 'చదివాను,' అన్నాను. అప్పుడు ఆయన దాని గురించి మాట్లాడడం మొదలుపెట్టారు.

'ఇది ఓ అద్భుతమైన గ్రంథం. ఈ ఒక్క ఉపనిషత్తూ చదివి అర్థం చేసుకుంటే, ఆనంద దు:ఖ ప్రవాహాల్లో డోలలాడవచ్చు,' అని చెప్పారు. ఈ ఉపనిషత్తుని అర్థం చేసుకోవాలంటే, ముందు శైవ గ్రంథాల్ని చదవాలి. ముఖ్యంగా 'నేత్ర తంత్రం', 'స్వచ్ఛంద తంత్రం' చదవాలని చెప్పారు.

ఆ తర్వాత ఉన్నట్టుండి, 'ఈ ప్రపంచంలో సమస్తమూ ఆ దివ్య పురుషుడి నుంచీ, ఆ పవిత్రాగ్ని నుంచే వచ్చింది! మహర్షులు ఆ అగ్ని నుంచి నేరుగా ఆవిర్భవించిన మహాపురుషులు. వారిని అర్థం చేసుకోవడం ఎవరి తరమూ కాదు. వారితో ఎవరూ మాట్లాడలేరు. ఎవరూ వారితో నడవలేరు. వారు తమ స్వంత ప్రపంచంలో జీవిస్తారు. అపార కరుణాచిత్తులై వారు భూమి మీదకి దిగివచ్చి మానవులతో బాటు నడుస్తారు. వారు కరుణాంతరంగులు. నిరంతరం దివ్యానుభూతుల్ని అన్వేషించే సాధకులకు మార్గదర్శకత్వం వహించడంలో నిమగ్నమై ఉంటారు. నీకు వారిని చూడాలని ఉంటే వారు రక్తమాంసాలతో నిర్మితమైన భౌతిక శరీరంతో నీ ఎదుట నిలుస్తారు. ఇటూ అటూ తిరిగి నీ సమయాన్ని వ్యర్థం చేయకు. వారు ఎల్లపుడూ నీతోనే ఉన్నారు. వారే నీ నిజమైన స్నేహితులు.'

అప్పుడు ఆయన, 'నీతో బాటు వచ్చినవారు చాలా దూరం నుంచి వచ్చారు. నువ్వు వాళ్లని ఎక్కడికైనా తీసికెళ్లాలి. హరిద్వార్ తీసికెళ్తే ఎలా ఉంటుంది?' అని అడిగారు.

నేను సరేనన్నట్టు తలవూపి, 'సరే, స్వామీజీ' అన్నాను.

ఆశ్రమం మేనేజర్ ప్రేమ్ శోబ్టే తొంభై మందికీ ప్రయాణానికీ, భోజనానికీ ఏర్పాట్లు చూశారు. మర్నాటి ఉదయం మేమంతా మూడు బస్సుల్లో బయల్దేరాం. మేము హరిద్వార్‌లో గంగా తీరం చేరేసరికి దాదాపు మధ్యాహ్న సమయం అయింది. మాలో కొంతమంది లంచ్‌బాక్స్‌లు అందరికీ ఇస్తున్నారు. మరి కొంతమంది ఫోటోలు తీసుకుంటున్నారు, ఇంకొంతమంది వీడియో తీస్తున్నారు. పాశ్చాత్యుల్ని అంత పెద్ద సమూహంలో చూసిన పూజారులు, బిచ్చగాళ్లు, దుకాణదారులు, త్వరగా మా చుట్టూ మూగి మా భోజనాల వైపూ, కెమేరాల వైపూ చూడసాగారు.

భారతదేశానికి నేను ఒక గ్రూపుని తీసుకుని రావడం ఇదే మొదటిసారి. తొంభై మందితో కూడిన బృందం వ్యవహారాల్ని చూశాను నేను. మూడు వారాల పాటు ఎక్కడికీ కదలకుండా ఉన్నచోటే బందీ అయిపోయి ఉన్నట్టుగా గడిపిన ఈ బృందంలో ఎవరికీ ఎవరి మాటా వినే క్రమశిక్షణే కరువైంది. దుకాణదారులతో బేరాలాడడం, బిచ్చగాళ్లు ఏమంటున్నారో అర్థం చేసుకోవడానికి ప్రయత్నించడం, మా భోజనాల్లో అత్యధిక భాగం డిమాండ్ చేస్తూ మీదకొస్తున్న కోతి దాడిని తట్టుకోవడంతోనే నా ఓపికంతా అయిపోయింది. కొంతమంది ఆ కోతి బాగుందని దానికి అరటిపండ్లు, చాక్లెట్లు పెట్టడానికి ప్రయత్నించారు, కానీ కోతికి వేరే ప్లాన్ ఉంది. అది అరటిపండ్లు పెడితే బాగానే తీసుకుంటోంది. పండు అందించకపోతే మీదకి వస్తోంది. మావాళ్లంతా భయపడిపోయారు. వీళ్లు భయపడుతుంటే కోతి మరీ భయపెట్టసాగింది. అక్కడ తినలేకపోతున్నాం. కూర్చోవడం కూడా కష్టంగా ఉంది. మేము వేరే చోటికి వెళ్లిపోదామని అనుకున్నాం. ఆ కోతుల మంద, ఆ మంద లీడరు మమ్మల్ని అనుసరిస్తూ వస్తున్నాయి. చివరికి, రద్దీగా ఉన్న జనంలోంచి ఓ బలహీనమైన సాధువు వచ్చి ఆ మందని చెదరగొట్టాడు. అతడు నిశ్శబ్దంగా ఉన్నాడు. అతడి

ముఖమండలం చుట్టూ ఉన్న కాంతి చూస్తే, అతడు ఖచ్చితంగా బిచ్చగాడు కాదని తెలుస్తోంది. అతడు తను నడిచే ఊతకర్రతో ఆ కోతిని బాదుతూ తిట్టాడు. ఆ కోతి మౌనం వహించింది. అప్పుడు ఆయన మా గుంపుకి సంకేత భాషలో ఆ కోతి ఎలాంటి హానీ చేయదనీ, భయపడాల్సిన విషయమేమీ లేదనీ చెప్పాడు.

సందడి సద్దు మణిగింది. కానీ మేం భోజనం చేస్తుంటే అవి మమ్మల్ని జూ లో జంతువుల్ని చూసినట్టు చూడసాగాయి. ఉన్నట్టుండి ఓ వింత వ్యక్తి జనం మధ్య నుంచి దూసుకొచ్చాడు. అతడు ఎర్రటి వస్త్రం ధరించాడు. పొడవాటి గడ్డం, ఎర్రటి కళ్లు, పొడవాటి జుట్టు, చేతిలో వెదురు కర్రతో ఉన్నాడు. అతడు మా గ్రూపులోని ఒక మనిషి మీద అరుస్తున్నాడు, 'ఇది పవిత్రమైన ప్రదేశం! ఇక్కడ ఫోటోలు తీయడం కుదరదు! ఈ విదేశీయులు మనల్ని ఆట పట్టిస్తున్నారు! వీళ్లు మన ఫోటోలు తీసుకుని వాళ్ల దేశాల్లో ఎక్కువ రేట్లకి అమ్ముకుంటారు!' అన్నాడు. అతడు ఓ కెమేరాని లాక్కోవడానికి ప్రయత్నించాడు. 'ఫోటోలు తీయడం నిషేధం' అని తెలిపే బోర్డులు ఎక్కడా నాకు కనిపించలేదు. అయినా నేను మా గ్రూపుని ఇకపై ఫోటోలు తీయవద్దనీ, ఎవరితోనూ గొడవకి దిగొద్దనీ చెప్పాను.

అప్పుడు ఆ మనిషి నా వైపు తిరిగాడు. నేను అతడి కళ్లకి విదేశీయుల్ని నమ్మించి బాగా డబ్బు చేసుకునే ఒక టూరిస్టు గైడ్‌లా కనిపించాను. తన వాటా తనకి ఇవ్వవలసిందేనని చెప్పాడు. నేను అతనికి ఏమీ ఇవ్వనని చెప్పాను. దాంతో అతడు ముఖ్యంగా 'ఆ పెద్ద కెమేరా' చిత్రించిన ఫిల్మ్ అంతా తీసి పారేయాలని చెప్పాడు. ఆ 'పెద్ద కెమేరా' వీడియో చిత్రీకరిస్తోందనీ, అందులో ఫిల్మ్ రోల్ ఉండదనీ చెప్పాను. దాంతో అతడు తన కర్ర పైకెత్తి ఆ కెమేరాని పాడు చేస్తానని బెదిరించాడు. ఇక ఇది దయ, ప్రేమ చూపాల్సిన సమయం కాదని నాకు అర్థమైంది. మా గ్రూపులో జీన్ పియరీ ఉన్నాడు. అతడు మార్షల్ ఆర్ట్స్‌లో నిపుణుడు. ఈ సాధువు నా మీద చేయి వేస్తే, అతడికి తగిన పాఠం లభిస్తుందని నాకు తెలుసు. అందుకే నేను సాధువు మీద గట్టి గట్టిగా కేకలేశాను. నీచంగా తిట్టాను. అతను వెంటనే అక్కడ నుంచి కదలకపోతే అతన్ని గంగానదిలో పారేస్తానని బెదిరించాను. అతను అక్కడ నుంచి జారుకుని జనసమ్మర్థంలో కలిసిపోయాడు.

ఆ ముసలి సాధువు నా మీదకి దూకుతున్న ఆ కోతి నుంచి కాపాడాడు, నా కళ్లలోకి చూశాడు, ఓ క్షణంసేపు నా బుగ్గలు పట్టుకున్నాడు. నేను అక్బర్ హోటల్‌లో మొదటిసారి స్వామీజీని చూసినప్పటి బ్రహ్మానంద స్థితిలోకి వెళ్లాను. జ్యోతుల్లా ప్రకాశిస్తున్న ఆయన నేత్రాలు చూస్తుంటే స్వామీజీ చూపులు, స్వామీ సదానందజీ చూపులే గుర్తుకొచ్చాయి. అతని ముఖ కవళికలు చూస్తుంటే ఆయన, స్వామీజీ ఒకే స్థాయికి చెందినవారని నాకు తెలిసింది. ఆ వృద్ధ సాధువు నన్ను సంకేత భాషలో నా గురువు ఎవరో చెప్పమని ప్రశ్నించారు. నేను చెప్పాను. ఆయన ఒక క్షణం ఆగి ఋషీకేశ్ వైపు తిరిగి చేతులు జోడించి ఆ దిశగా శిరసు వంచి ప్రణమిల్లాడు. ఆ తర్వాత ఆయన చేయి నా భార్య తలపై పెట్టి ఆశీర్వదించి చిరునవ్వు నవ్వుతూ, దూరంగా ఉన్న కుటీరం వైపు చూపించారు. ఆయన మమ్మల్ని తన నివాసానికి ఆహ్వానిస్తున్నారని అర్థమైంది.

ఆ కుటీరం ముందు ఒక చిన్న ఆవరణ ఉంది. చుట్టూ రెండు అడుగుల ఎత్తున వెదురు కర్రలతో కంచె ఉంది. దానికి ఒక గేటు. చిన్న పిల్లలు కూడా దాన్ని గెంతి లోపలికి వచ్చేయవచ్చు. కానీ ఆ సాధువు ఆ గేటుని ఏదో రాజభవన ద్వారం తెరుస్తున్నంత అనుభూతితో తీశాడు. అతడు లోపలికి వెళ్లి, సైగలతో నా భార్యని కూడా లోపలికి రమ్మని చెప్పారు. కానీ మేం లోపలికి ప్రవేశించబోతుంటే, కొంతమంది షాప్‌కీపర్లు, బిచ్చగాళ్లు మా వద్దకు పరిగెత్తుకుని వచ్చి లోపలికి వెళ్లవద్దని హెచ్చరించారు. అలా వెళ్లడం ప్రమాదమని చెప్పారు. అంతా బాగానే ఉంటుందని ఆ సాధువు సైగ చేశారు. తను మమ్మల్ని ఆహ్వానించాననీ, మాకు ఏ హానీ జరగదనీ

వారికి సైగలతో చెప్పాడు. ఇప్పుడు స్థానిక ప్రజలు, ఇంకా ఉన్మత్తంగా అరుస్తూ, 'వెళ్లకండి లోపలికి! చాలా ప్రమాదం! అవి త్రాచుపాములు! వాళ్లు క్షుద్రశక్తుల్ని పూజిస్తారు! మీలో కొంతమంది చనిపోవచ్చు. మీరంతా తప్పక అనారోగ్యాల బారిన పడతారు. మిమ్మల్ని శక్తులు ఆవహిస్తాయి! అది చాలా ప్రమాదం!' అంటూ రకరకాలుగా మాట్లాడుతున్నారు. ఆ వృద్ధసాధువు తన కర్రని ఝుళిపిస్తూ, వారిని హెచ్చరించారు. మేం ఇంటి ముంగిట భాగంలోకి ప్రవేశించాము. అక్కడ వందలాది తులసి మొక్కలు ఉన్నాయి.

నేను ఏ మాత్రం భయపడనవసరం లేదని భరోసా ఇస్తూ, ఆ సాధువు నన్ను కుటీరంలోకి రమ్మని పిలిచారు. నేను ఓ చిన్న గదిలోకి వెళ్లాను. ఎన్నో త్రాచుపాములు అక్కడ నేల మీద మెదలకుండా పడుకుని ఉన్నాయి. అవి శివుడికి మిత్రులు కాబట్టి నేను వాటికి మనసులో శ్రద్ధాపూర్వకంగా నమస్కరించాను. నేను బయటికి వచ్చాను. మేము ఆ వృద్ధ సాధువు దయకి అభివాదాలు చెప్పి సెలవు తీసుకున్నాము.

ఆ తర్వాత మేము హరిద్వార్‌లోని పవిత్ర క్షేత్రాలకు వెళ్లాము. మేము పట్టణంలో తిరుగుతుంటే కొంతమంది స్థానికులు వచ్చి ఆ సాధువు కొద్ది నెలల క్రితమే అక్కడికి వచ్చాడని చెప్పారు. అతడు గంగా నది దగ్గరకి వెళ్లి ఒక చిన్న ప్రదేశాన్ని చూసుకుని చుట్టూ గిరి గీశాడట. తన ధ్యానాన్ని ఎవరూ భంగపరచకూడదనీ తన అనుమతి లేకుండా ఎవరూ ఆ గీత దాటి లోపలికి రావద్దనీ చెప్పాడట. అతడు అందరికీ కనిపించేలా ఆ గీతని రోజు మొత్తంలో చాలాసార్లు గీస్తాడట. ఎవరైనా ఆ గీత దాటి లోపలికి వెళ్తే తక్షణం బుసకొట్టే త్రాచుపాముతో తలపడాల్సి ఉంటుందట. స్థానికుల్లో ఓ మొండి మనిషి గంగానదీ తీరానికి వెళ్లి ధైర్యంగా ఆ గీతని దాటడానికి ప్రయత్నించాడట. తక్షణమే ఏదో బలీయమైన శక్తి అతడిని గాలిలో ఇటూ అటూ తిప్పి, రపీ రపీ లెంపలు వాయించి, అతడిని ఆ చోటి నుంచి బయటికి విసిరివేసిందట. ఈ వార్త ప్రచారంలోకి వచ్చిన దగ్గర నుంచీ ఆ సాధువు ప్రశాంతతకి ఎలాంటి భంగమూ కలగడం లేదట. పైగా అతడు ఉండడానికి కుటీర నిర్మాణం కూడా చేసిపెట్టి, ఓ చిన్న కంచె కూడా ఏర్పాటు చేసి పెట్టారు.

రోజులో మిగతా భాగమంతా నేను ఆ వృద్ధ సాధువు గురించీ అతడి వింత ప్రవర్తన గురించీ ఆలోచించసాగాను. ఆ రోజు సాయంత్రం, నేను ఆశ్రమంలో స్వామీజీ పాదాలు వత్తుతూ ఆ వృద్ధ సాధువు గురించి చెప్పాను. ఆయన, 'హరిద్వార్‌లో ఏమైంది?' అని అడిగారు. నేను సంగతంతా చెప్పాను. నేను చెప్పడం ముగించగానే, ఆయన అదాటున లేచి నిలబడి కూర్చున్నారు. 'అంటే అదా జరిగింది హరిద్వార్‌లో? ఆయన హరిద్వార్‌లోనే ఉన్నారా? నిన్ను ఆయన చూశారా?' అని అడిగారు.

నేను, 'ఆయన చూశారు' అని చెప్పగానే, ఆయన హరిద్వార్ వైపు చూస్తూ, చేతులు రెండూ జోడించి, శిరసు వంచి నమస్కరించారు, అచ్చం ఆ వృద్ధ సాధువు చేసినట్టే!

ఆయన ఎవరని నేను అడగ్గా స్వామీజీ, 'ఆయన ఒక గొప్ప సాధువు. ఆయన చిరంజీవులు. మీరంతా ఆశీర్వచనం పొందినందుకు నాకెంతో సంతోషంగా ఉంది,' అన్నారు.

నాకంతా అయోమయంగా ఉంది. ఏం చెప్పాలో తెలియలేదు. కానీ అప్రయత్నంగా నా నోటి వెంట ఈ మాటలు వచ్చాయి, 'ఆయన అక్కడ ఎన్నో నెలలుగా ఉంటున్నారట. ఎవరికీ ఆయన తెలియదుట. అపరిచితులు ఆయన్ని బిచ్చగాడనీ, స్థానికులు ఆయన ఒక క్షుద్రశక్తుల్ని ప్రయోగించే ఇంద్రజాలికుడనీ అనుకుంటున్నారు,' అన్నాను.

స్వామీజీ తీవ్రస్వరంతో, 'అసలు ఆయన అక్కడ ఎప్పుడైనా నివసించారా? లేదంటే అదంతా మాయేనా?' అన్న విషయం ఎవరికి తెలుసు?' అన్నారు.

గ్రూపులో ప్రతి ఒక్కరూ ఈ వృద్ధ సాధువు విషయంలో ఏదో అద్భుతం ఉందని గ్రహించారు. కానీ వాళ్లలో చాలా మంది ఆయన త్రాచుపాములతో నివసిస్తున్నాడనే విషయం మీద దృష్టి పెట్టారు. గ్రూపులో కొంతమంది అక్టోబరు నెల మధ్యలో అమెరికాకి తిరిగి వెళ్లిపోయారు గానీ మరి కొంతమంది భారతదేశంలో మరి కొంతకాలం దాకా ఉంటామని ఆగిపోయారు. వాళ్లు మళ్లీ హరిద్వార్ వెళ్లారు. కానీ అక్కడ సాధువు గానీ అతడి కుటీరం గానీ లేదు.

ఆ గ్రూప్ వెళ్లిపోయాక నేను కూడా అక్కడ కొద్దిరోజులు ఉన్నాను. ఆ సమయానికి కర్ఫ్యూ ఎత్తివేశారు. హాస్పిటల్ సైట్‌లో పని ఊపందుకుంది. సైట్‌లో వేయి మందికి పైగా కూలీలు పని చేస్తున్నారు. వందలాది మంది డాక్టర్లు, నర్సులు, టెక్నీషియన్లు, పాలనా వర్గానికి చెందిన గుమాస్తాలు, తోటమాలులు, క్లీనింగ్ సిబ్బంది నియామకాలు జరిగాయి. అంతటా తానై స్వామీజీ నడిపించారు. ఆయన చాలా అలిసిపోయారు, కానీ సంతోషంగా ఉన్నారు.

ఆయన బరువు తగ్గారు. ఆయన ఏదో ప్రత్యేకమైన సాధన చేస్తున్నారని ప్రజలు అనుకుంటున్నారు. కానీ ఒక రోజు ఢిల్లీలో ఉన్న స్వామీజీ శిష్యుల్లో ఒకరు నాతో మాట్లాడుతూ తను స్వామీజీ ఆరోగ్యం గురించి అడిగినట్లూ, దానికి స్వామీజీ, 'ఇక్కడ చాలా వేడిగా ఉంది. చెట్లూ, గడ్డీ కూడా వాటి సౌకుమార్యం కోల్పోయి ఎండిపోతున్నాయి' అని జవాబిచ్చారనీ చెప్పారు. స్వామీజీ అలా చెప్పడంలో గల ఉద్దేశ్యం ఏమై ఉంటుందని ఆయన అడిగాడు.

ఎన్నో ఏళ్లుగా స్వామీజీ తన ఆరోగ్యం గురించీ, తన పని గురించీ నిరుత్సాహాన్ని కలిగించే వ్యాఖ్యల్ని ఆమోదించేవారు కాదు. కాబట్టి ఇక నేరుగా వారిని ప్రశ్నలు అడిగితే ఏ జవాబులూ రావు. కానీ నేను కూడా ఆయన ఆరోగ్యం గురించి ఆలోచించేవాడిని. ఒకవేళ నేను స్వామీజీని ఈ ప్రశ్న అడగాల్సి వస్తే ఎంత సామరస్య ధోరణిలో ఎలా అడగాలా అని ఆలోచించాను. ఒకరోజు అవకాశం దొరకగానే నేను ఆయన్ని, 'శరీరం తేలికపడితే సౌకర్యంగా ఉంటుందని భావిస్తున్నారా స్వామీజీ!' అని అడిగాను.

స్వామీజీ మెరుపులా సమాధానమిచ్చారు, 'తక్కువ సామాను ఉంటే, ప్రయాణం సవ్యంగా సాగుతుంది. కొద్దిరోజులు ఇలాగే చూస్తుండు. ఎముకలు తప్ప ఏమీ ఉండదు,' అన్నారు.

'కానీ స్వామీజీ! మీరు ఆరోగ్యంగా ఉండాలి కదా! మీరు ఇంత పని చేస్తున్నారు,' అన్నాను.

'ఏం చేయను మరి?' స్వామీజీ అడిగారు. 'అసలు చేసేదేమో వేరే ఎవరో! కష్టపడి పని చేయడం, భగవన్నామం జపించడం–ఈ రెండే జీవితం మనకిచ్చే రెండు దివ్యమైన బహుమతులు.'

తర్వాత ఆయన నేను అమెరికాకి ఎప్పుడు వెడుతున్నానని అడిగారు. నేను అమెరికా వెళ్లాల్సిన సమయం ఆసన్నమైందని నాకు ఆయన సూచిస్తున్నారు.

ఒక సంవత్సరం గడిచిన తర్వాత, 1995 శీతాకాలంలో, ఇన్‌స్టిట్యూట్ మరోసారి హిమాలయ సందర్శనకి ట్రిప్ నిర్వహించింది. ఈసారి మేం చూడబోతున్న ప్రముఖ ప్రాంతాల్లో దలైలామా నివాసమైన ధర్మశాల, అత్యంత సుందరమైన లోయ కులూ మనాలీలు ఉన్నాయి. కానీ మేము ఈ లోయలకి వెళ్లే దారిలో ఉన్న ఒక హిల్ స్టేషన్ అయిన షిమ్లా చేరగానే, అంతకు ముందు రోజే బ్రహ్మాండమైన కొండచరియ విరిగి పడి దారి మొత్తం ధ్వంసమైంది. వెళ్లే దారి మాత్రమే కాదు, మేం దిగబోయే హోటల్ కూడా నుజ్జునుజ్జయింది. ఒక రోజు ముందు వచ్చి ఆ ప్రమాదానికి గురి కానందుకు అందరూ కృతజ్ఞతలు చెప్పుకుంటున్నా, నా మనసు ఈ ప్రమాదం ఇస్తున్న సందేశం ఏమైనా ఉందా అని ఆలోచిస్తోంది.

నా వరకు నాకు ఇది విహారయాత్ర కాదు, తీర్థయాత్ర. నేను ఎవరికీ చెప్పలేదు గానీ, నా ప్రధాన ఆశయం మనాలీ గుహ సందర్శన. స్వామీజీ అమెరికాకి వచ్చే ముందు ఇక్కడే

పదకొండు నెలలపాటు తపస్సు చేశారు. మళ్లీ 1981 లో అనారోగ్యంగా ఉన్నపుడు కొద్ది రోజులు ఇక్కడ గడిపి వెళ్లారు. ఆ తర్వాత ఆయన అత్యాశ్చర్యకరంగా తేరుకున్నారు. ఈ గుహ చిరంజీవులైన పరశురాముడికి ఇష్టమైన ప్రాంతమని స్వామీజీ ఒకసారి చెప్పారు. నేను ఈ ప్రాంతాన్ని ఎన్నో ఏళ్లుగా సందర్శించాలని అనుకుంటున్నాను. అక్కడికి వెళ్లడానికి ఇది సరైన సమయం కాదని ఇప్పుడు నా హృదయం ఎందుకో పదే పదే చెప్తోంది. అందుకే మేం ధర్మశాలకి వెళ్లి దగ్గరలో ఉన్న ఆలయాలు సందర్శించి, ఋషీకేశ్‌లో స్వామీజీని కలుసుకున్నాం.

ఆ సంవత్సరం స్వామీజీ మా టూర్ గ్రూప్‌కి ఎలాంటి ఉపన్యాసాలూ ఇవ్వలేదు. ఆయన ఆరోగ్యం మరీ క్షీణించింది. పైగా బాగా బరువు కోల్పోయారు. ఆయనకి ఏదో చర్మ సంబంధమైన సమస్యలు కూడా వచ్చాయి. దురదలు ఎక్కువగా ఉండేవి. పాదరసం విషపూరిత లక్షణాలే అవి. ఆ విషయం స్పష్టంగా తెలుస్తోంది. కానీ ఆయన కేశాల నమూనాని వాషింగ్టన్ డి.సి.కి పరీక్షకి పంపినపుడు అలాంటిదేమీ లేదని చెప్పారు వాళ్లు. స్వామీజీ విపరీతంగా దగ్గుతున్నారు. శ్లేష్మం విపరీతంగా వస్తోంది. డాక్టర్లు ప్లూరిసీ (పుపుసావరణ శోథ) అని తేల్చారు. కొద్ది వారాల తర్వాత ఆయన హాస్పిటల్ మెడికల్ స్టాఫ్‌కి, 'మీరు తప్పుగా డయాగ్నైజ్ చేశారనుకుంటున్నాను. నా ఊపిరితిత్తుల్లో ఏ సమస్యా లేదు,' అని చెప్పారు. డాక్టర్లు మళ్లీ చెక్ చేశారు. ఆయన ఊపిరితిత్తులు బాగానే ఉన్నట్టు నిర్ధారణ చేశారు. అయినా ఆయన దగ్గుతూనే ఉన్నారు.

ఈసారి స్వామీజీ హాస్పిటల్‌లో ఒక అపార్ట్‌మెంట్‌లోకి మారిపోయారు. ఋషీకేశ్ ఆశ్రమాన్ని అప్పుడప్పుడూ వెళ్లి చూసి వస్తూ ఉండేవారు. నేను ఆయన్ని రెండు మూడు సార్లు మాత్రమే చూశాను. ఆ సమయాల్లో నేను ఆయన శరీరానికి మూలికా లేపనం రాసేవాడిని లేదంటే మెదలకుండా ఆయన పక్కన చేరి కూర్చునేవాడిని. లేపనం రాసినపుడు దురదల బాధ తగ్గిందని ఆయన అనేవారు. 'నువ్వు మనాలీ గుహకి వెళ్లావా?' అని అడిగారు. నేను, 'పూర్తిగా అక్కడికి వెళ్లలేదు. నేను గుహ దాకా చేరుకోలేకపోయాను,' అన్నాను.

స్వామీజీ, 'ఎందుకంటే అది సరైన సమయం కాదు,' అన్నారు. అప్పుడు నావైపు ఆట పట్టిస్తున్నట్టు చూసి, 'ఏమిటి నీలో లోపం? నువ్వు ఎక్కడికి బయల్దేరితే, అక్కడ కొండచరియలు విరిగిపడుతున్నాయి! క్రిందటి ఏడాది నువ్వు కొండచరియలు విరిగి పడడం వల్ల గంగోత్రికి వెళ్లలేదు. నువ్వు దీని గురించి ఏదో ఒకటి చేయాలి సుమా!' అన్నారు.

'నేనేం చేయాలో చెప్పండి స్వామీజీ,' అని అడిగితే ఆయన, 'నువ్వు మూలాధార చక్రం మీద ధ్యానం చేయాలి, దాన్ని సుస్థిరం చేయాలి. భూస్ఖలనాలు ప్రారంభమయ్యేది అక్కడే!' అన్నారు. ఆ తర్వాత సాధన చేయడానికి ఆయన 1993 వేసవి చివరలో ఇచ్చిన సాధనని కూడా దానితో బాటు చేయమన్నారు.

నేను అమెరికా నుంచి తిరిగి వచ్చానే కానీ నా మనసు స్వామీజీ భూస్ఖలనాల గురించి చేసిన వ్యాఖ్య మీదే ఆలోచిస్తోంది. నాకు దాని అర్థం కేవలం కొంతవరకే తెలుస్తోంది. అది కూడా ఆయన 'నువ్వు మూలాధార చక్రం మీద ధ్యానం చేయాలి, దాన్ని సుస్థిరం చేయాలి,' అని నాకు చెప్పబట్టే తెలిసింది. ఆయన గతంలో ఇచ్చిన స్టేట్‌మెంట్ కూడా నా జ్ఞాపకాల పొరల్ని గాఢంగా కదిలిస్తోంది– 'నా పనులు, నా మాటలు ఎవరూ అర్థం చేసుకోలేని సమయం వస్తుంది. అప్పుడు నేను హిమాలయాల్లోకి అదృశ్యమైపోతాను.' ఆయన ఎప్పుడైనా అలా ఆ సువిశాల పర్వత శ్రేణిలోకి మాయమైపోయినా, నేను ఆయన్ని వెతుక్కునే మార్గం గురించి ఊహించడంలో మునిగిపోయాను.

ఆరోగ్యం బాగోలేకపోయినా సరే, స్వామీజీ ఎంతో శ్రమపడి పని చేస్తున్నారు. ఆయన బాగా బరువు కోల్పోవడం గురించి ఆయనకి తప్ప అందరికీ ఆందోళనకరంగానే ఉంది.

పాలనాపరమైన విషయాల్లో ఆయన ఇంకా సీఈఓగా పని చేస్తూనే ఉన్నారు గానీ వ్యక్తిగత జీవితంలో మాత్రం ఆయన ఒక పసిపిల్లాడి కంటే కనాకష్టం. ఆరోగ్య నిపుణులూ, సాధారణ ప్రజలూ అందరూ ఆయన సలహాలు ఇస్తున్నవాళ్లే. ఎవరేం చెప్పినా అవన్నీ పాటిస్తున్నారు ఆయన. అలోపతీ డాక్టర్లు మందులు ఇస్తున్నారు. వాటిని వేసుకుంటున్నారు. ఆయుర్వేద డాక్టర్లు వాళ్ల పద్ధతిలో బరువైన లోహాలతో చేసిన ఔషధాలతో చికిత్స అందిస్తుంటే, అదీ తీసుకుంటున్నారు. తర్వాత యూనానీ మందులు, మూలికావైద్యులు, హోమియోపతీ వైద్యులు ఇలా వివిధ రకాల వైద్య నిపుణులు వచ్చారు. స్వామీజీ వాళ్లు ఏమిస్తే అది తీసుకున్నారు. ఆయన కావాలంటే తన శరీరాన్ని మెడిసిన్ కేబినెట్‌గా తయారు చేసేయలేరా, కానీ ఆయన బయటి మందు తీసుకున్నారు. 'మేమిచ్చిన మందులు స్వామి తీసుకుంటున్నారు', 'మేము ఆయనకు సేవ చేస్తున్నాము' అనే తృప్తిని అందరికీ మిగిల్చారు ఆయన. ఆయన స్టూడెంట్స్‌లో ఒకరు ప్రపంచవ్యాప్తంగా ఉన్న వేలాదిమంది స్వామీజీ శిష్యులకి స్వామీజీ ఆరోగ్యాన్ని గురించి శ్రద్ధతో పట్టించుకుని ప్రత్యేక వైద్యం చేయించాల్సిన పరిస్థితి గురించి సూచించాడు. స్వామీజీ ఈ విషయం గురించి విని, తన సెక్రెటరీ కమల్‌తో, 'ఎవరో చేసే వైద్యం నాకెలా పనికొస్తుంది? అది నిష్ప్రయోజనం!' అన్నారు.

అప్పుడు కమల్, 'స్వామీజీ, మీకు మీరే ఎందుకు నయం చేసుకోరు?' అని అడిగింది. 'అవును, సమయమైంది!' అన్నారు.

ఈ చివరిదశలో స్వామీజీ ఏకాంతంగా ఉండడమనేదే పోయింది. హాస్పిటల్, మెడికల్ కాలేజీ, నర్సింగ్ స్కూల్, గ్రామీణ అభివృద్ధి ప్రాజెక్టులూ ఇలా నిరంతర కార్యక్రమాలు వార్తల్లో హెడ్‌లైన్స్‌లో ఉంటున్నాయి. స్వామీజీ ఎక్కడికి వెళ్లినా, ఆయన అక్కడ ఏం చేస్తున్నారో, ఎలాంటి చికిత్స తీసుకుంటున్నారో ప్రతి ఒక్కరికీ తెలుస్తోంది. ఏ చికిత్స తీసుకున్నా ఆయన ఆరోగ్యం క్షీణిస్తోందని అందరికీ తెలుస్తోంది. అయినా గానీ, ఆయనతో కూడా పనిచేసే వారు ఆయన ఆరోగ్యం గురించిన చిన్న సమాచారం కూడా బయటికి రానిచ్చేవారు కాదు.

1996 వేసవిలో అందరూ స్వామీజీ ఆరోగ్యం గురించి బెంగపడుతున్నారు. ప్రపంచం నలుమూలల నుంచీ నాకు ఎడతెరిపిలేని టెలిఫోన్ కాల్స్ వస్తున్నాయి. ఆయన ఆరోగ్యం గురించి వారికి తెలిసిన సమాచారం చెప్తున్నారు, మిగతాది నేను పూర్తి చేసి ఆయన పరిస్థితి వారికి తెలియజేస్తానేమోనని! నాకొచ్చిన సమస్య ఏమిటంటే నాకు స్వామీజీ ఆరోగ్యం గురించి సమగ్ర సమాచారం తెలియదు. జనానికి ఇది ఆశ్చర్యంగా ఉంది. వారు జరుగుతున్నదేమిటో అన్ని విషయాలూ నాకు తెలుసుననుకుంటారు. నేను స్వామీజీ ఆరోగ్యం గురించి హాస్పిటల్ క్యాంపస్ నుంచి విశ్వసనీయ వర్గాల సమాచారం తీసుకోవాలని ఎన్నో సార్లు ప్రయత్నించాను. కానీ ఎప్పుడూ ఒకటే సమాధానం వినవచ్చింది, 'తానేం చేస్తున్నారో స్వామీజీ ఒక్కరికే తెలుసు. ఆయన ఎవరికీ, ఏమీ చెప్పడం లేదు, తెలుసా!' అప్పుడు నేను డా. పి.ఎన్.చుట్టానీకి కాల్ చేశాను. ఆయన చండీగఢ్ మెడికల్ కాలేజీలోని పోస్ట్‌గ్రాడ్యుయేట్ ఇన్‌స్టిట్యూట్ అండ్ మెడికల్ రిసెర్చి సెంటర్‌కి డైరెక్టర్. ఆయన స్వామీజీ స్టూడెంట్, స్నేహితుడు కూడా. హాస్పిటల్ క్యాంపస్‌లో మెడికల్ కాలేజీ నెలకొల్పడానికి డా. చుట్టానీ చాలా సహాయపడ్డారు. ఆయన స్వామీజీ మెడికల్ కండిషన్ గురించి వివరంగా మాట్లాడారు. ఆయన కేన్సర్ చివరి స్టేజీలో ఉన్నట్టు నాతో చెప్పారు. నాకు బాంబే డాక్టర్ల నుంచి కూడా అదే విషయం తెలిసింది.

మే మొదటి వారంలో నాకు స్వామీజీ చికిత్స గురించి మలేషియా వెళ్లారని తెలిసింది. ఒకవేళ ఆయన అక్కడకి వెడితే డా. మోహన్ స్వామీ దగ్గరైనా, డా. గణేశన్ దగ్గరైనా ఉండాలని తెలిసింది. నా ఊహ సరైనదే. నేను డా. మోహన్ స్వామీ ఇంటి నెంబరుకి కాల్ చేస్తే డా. గణేశన్ ఫోన్ తీసుకున్నారు. మాట్లాడుతూ మధ్యలో, 'ఒక్కసారి లైన్‌లో ఉండండి!' అన్నారు.

తర్వాత స్వామీజీ లైన్‌లోకి వచ్చారు. మేము ఒక నిముషం లేదా రెండు నిముషాలు మాట్లాడుకుని ఉంటాము. గొంతు చాలా నీరసంగా ఉంది, నాతో మాట్లాడడానికి ఉత్సృష్టంగా ఉంది ఆయనకు. అంతసేపు వారికి అసౌకర్యం కలిగించడం నాకు ఏమాత్రం ఇష్టం లేదు. అందుకే నేను అక్కడికి వచ్చి, ఆయనని చూడవచ్చునేమోనని అడిగాను. ఆయన, 'నన్ను ఇండియాలో కలుసుకో. నేను రేపు పొద్దున్న అక్కడికి వస్తున్నాను,' అని చెప్పారు.

మీరా, నేను వెంటనే ఉన్న ఫ్లయిట్‌కి ఇండియా వచ్చేశాము. స్వామీజీ చేరుకున్న మర్నాటికి హాస్పిటల్ క్యాంపస్‌కి వచ్చాము. ఆయన మమ్మల్ని చూడగానే, 'జనం వాళ్ల ఆలోచనలకి వాళ్లే బందీ అవుతారు!' అన్నారు. నాకు ఆ వ్యాఖ్యకి నేపథ్యం తెలియదు. కాబట్టి ఆయన అన్న మాటలకి అర్థం తెలియదు.

మైథిలి అనే స్టూడెంట్ ఆయన్ని అటెండ్ అవుతోంది. అప్పుడు ఆయన ఆమెని మిల్క్‌షేక్ చేసి ఇవ్వమని అడిగారు. మేమింకా దాన్ని పూర్తి చేయలేదు, 'మీరు వెనక్కి ఎప్పుడు వెళ్తున్నారు?' అని అడిగారు. ఈ ప్రశ్న బొత్తిగా ఊహించనిది. ఆయన ఏదైనా ఒక ప్రశ్న అడిగే ముందు, 'ఎప్పుడొచ్చావు నువ్వు?' అని అడుగుతారు సాధారణంగా.

'మీరు ఎప్పుడు వెళ్లమంటే అప్పుడు వెళ్తాను స్వామీజీ!' అన్నాను నేను.

ఆ తర్వాత ఆయన చిన్న చిన్న ప్రశ్నలు చాలా అడిగారు. 'ఎక్కడ ఉంటున్నావు?' అనే ప్రశ్న చివరిగా అడిగారు. ఇలా ఎప్పుడూ అడగలేదు ఆయన.

నేను, 'ఎక్కడో అక్కడ ఉంటాము స్వామీ. నేను ఇక్కడ ఆశ్రమంలోనైనా ఉంటాను, లేదా ఖాళీ ఉంటే హాస్పిటల్‌లో అయినా ఉంటాను,' అన్నాను.

'నీకు ఎక్కడ ఉండాలని ఉందో చెప్పు,' అన్నారాయన.

'మీరు నన్ను ఎక్కడ ఉండమంటే అక్కడే ఉంటాను, స్వామీజీ!' అన్నాను.

'ఇక్కడి వాతావరణం చాలా వేడిగా ఉంది. గాలి లేదు. నువ్వు ఆశ్రమంలోనే ఉండు. నేను నిన్ను అక్కడికి తీసుకుని వెళ్తాను,' అన్నారు.

పైకి చూడడానికి స్వామీజీ వ్యాఖ్యల్లో ఏమీ అర్థం కనబడదు. హాస్పిటల్ ఉన్న ప్రాంతం డెహరాడూన్ ఋషీకేశ్ కంటే చాలా చల్లగా ఉంటుంది. మంచి గాలి వేస్తుంది. మరి స్వామీజీ మమ్మల్ని ఆశ్రమానికి తీసుకుని వెళ్లడం ఎందుకు?

మీరా, నేను అక్కడికి మా అంతట మేమే వెళ్లగలం. మేము గతంలో అక్కడికి చాలా సార్లు వెళ్లాం. అందరికీ మేము తెలుసు.

నాకు తెలియనిదీ, అర్థం కానిదీ ఏదో జరుగుతోంది. కానీ ఇంకా నేను ఆ సూచనని నిలువరిస్తూనే ఉన్నాను. 'మీరు రెస్ట్ తీసుకోండి, స్వామీజీ!' అంటూ.

కానీ స్వామీజీ, 'లేదు, లేదు. ఈ విధంగానైనా నాకు కొంత వ్యాయామం అవుతుంది, తాజా గాలి పీల్చుకోవచ్చు,' అన్నారు.

తన కారు తెమ్మని పంపారు. స్వామీజీ ఫ్రంట్ సీట్‌లో కూర్చున్నారు మీరా, నేను వెనక సీట్లలో గార్డుతో బాటు కూర్చున్నాం. మేం ఆశ్రమానికి రాగానే స్వామీజీ ప్రేమ్‌తో, 'మీరాకీ, పండిట్‌జీకీ సౌకర్యంగా ఉండేట్లు చూడు,' అన్నారు.

ప్రేమ్ మాకు అప్పటికే ఏ రూం కేటాయించిందీ చెప్పినా, స్వామీజీ మళ్లీ అడిగారు, 'వాళ్లు ఏ రూంలో ఉంటున్నారు? వాళ్లకి సౌకర్యంగా ఉంటుందా?'

చాలా కష్టం మీద స్వామీజీ మెట్లు ఎక్కి తన గదుల్లోకి వెళ్లారు. అక్కడ ఆయన కొన్ని నిముషాలు గడిపారు. ఆ తర్వాత మెట్లు దిగి వచ్చారు. తిరిగి హాస్పిటల్ క్యాంపస్‌కి వెళ్లిపోయారు. ఇవి చూడడానికి అల్ప ప్రాధాన్యత కలిగిన సంఘటనలుగానూ, అర్థం కాని చిక్కుముదులుగానూ

కనిపిస్తాయి. స్వామీజీ నాతో ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తున్నారు. మేము ఆశ్రమంలో ఉన్నాం. స్వామీజీ ప్రతిరోజూ ఆశ్రమానికి వచ్చి వెళ్లేవారు. వచ్చిన ప్రతిసారీ 'నువ్వు ఫలానా ఫలానా వాళ్లని చూశావా?' అంటూ ఆయన ప్రశ్న అడుగుతూ ఉండేవారు. నేను ప్రతిరోజూ చూస్తున్న ఏ వ్యక్తి గురించో ఆయన అలా అడుగుతూ ఉంటారు. మూడవ రోజు ఆయన, 'నువ్వు హాస్పిటల్, క్యాంపస్ చూశావా?' అని అడిగారు. అందువల్ల నేను హాస్పిటల్ బిల్డింగ్, చుట్టూ ఉన్న బిల్డింగ్‌లు, గ్రౌండ్స్ అన్నీ తిరిగి చూశాను, స్వామీజీ నాతో ఏం చెప్పదలుచుకున్నారో కనీసం అప్పుడైనా అర్థమవుతుందనే ఆశతో. ఒక వ్యక్తిని స్వామీజీ ఏదో అడుగుతున్నారు. ముక్క ముక్కలుగా అతడు నాకు తెలిపిన సమాచారం ఏమిటంటే, స్వామీజీ నన్ను ఇష్టపడడం లేదట. నిజానికి, స్వామీజీ అన్న అసలు మాటలు ఏమిటంటే, 'నేను స్వామీజీని వ్యతిరేకిస్తున్నాను,' అని.

స్వామీజీని నేను మళ్లీ సారి చూసినపుడు, ఆయన నేను హాస్పిటల్, క్యాంపస్ చూశానో లేదో అడిగారు. నేను చూశానని చెప్పాను. 'ఎలా ఉంది అక్కడ?'

'అన్నీ బాగానే ఉన్నట్టు అనిపిస్తున్నాయి. మన సంప్రదాయానికి చెందిన ఆధ్యాత్మిక ప్రమాణాల్లో మౌలికమైన మార్పు తప్ప!' అన్నాను.

'అదేమిటీ?' అన్నారాయన.

'ఇప్పటిదాకా, మన సంప్రదాయంలో తన అజ్ఞానం వల్ల విద్యార్థి గురువుని ధిక్కరించాడు. అంతే తప్ప గురువు శిష్యుణ్ణి ధిక్కరించడం జరగలేదు,' అన్నాను.

దానికి స్వామీజీ సున్నితంగా, 'వేలాదిసార్లు నీ గురించి ఆ మనిషికి ఎన్నో మంచి విషయాలు చెప్పాను. కానీ అవన్నీ మరిచిపోయి, ఆ మనిషి నీకు ఈ మాట ఒకటే గుర్తు పెట్టుకుని భుజాన మోసుకుని అనవసరంగా ప్రచారం చేస్తున్నాడు. ఈ ప్రపంచం అంతే. నువ్వు ఇవ్వగలిగినంత శ్రేష్ఠమైనది ఇవ్వు. ప్రేమగా, నిస్వార్థంగా ఇవ్వు. కానీ ఎవరి నుంచీ ఏమీ ఆశించవద్దు. బలంగా ఉండు, భయపడకు. నీకు మిత్రులు, శత్రువులతో కాలక్షేపం చేయడానికి సమయం లేదు, దేవుడి కోసమే నీ సమయాన్ని సమర్పించాలి,' అన్నారు.

'కానీ, స్వామీజీ! ఆ మనిషికి నేను బాగా తెలుసు కదా. మేము ఎంతో కాలంగా స్నేహితులం. ఏ కారణం లేకుండా ఈ వ్యక్తికి నేను గిట్టకపోవడమనేది ఎందుకు వస్తుంది?'

'ఆ మనిషి రోబోట్,' అన్నారు స్వామీజీ.

'కానీ, స్వామీజీ, ఫలానా మనిషికి మీరంటే ప్రాణం', అన్నాను నేను.

'పిల్లవాడుగా చిన్నతనంలోనే ప్రేమకి దూరమైన మనిషి ఇతరుల్ని ఎలా ప్రేమిస్తాడు?' అడిగారు స్వామీజీ. 'ప్రేమ యాదృచ్ఛికం. అది ఎప్పుడూ దయ, జాలితో నిండి ఉంటుంది. మరిచిపోవడం దాని గుణం. ప్రేమ ఎప్పుడూ ఇతరుల్లో మంచి గుణాల్నే చూస్తుంది. నిజంగా ప్రేమించేవారు ఎవరి పట్లా ద్వేషం పెట్టుకోలేరు. నిజంగా ప్రేమించడం తెలిసిన వ్యక్తి ఇతరులపై ప్రేమ కురిపించినందుకు మరో వ్యక్తిని ద్వేషించరు. ఆ మనిషిలాంటి వ్యక్తులు ఇతరులతో ఏర్పరచుకునే బంధాలు తాత్కాలికం, అర్థరహితం. ఈ జీవనోత్సవంలో మీరు ఇలాంటి వ్యక్తుల్ని ఎంతోమందిని చూసి ఉండవచ్చు. అలాంటి వ్యక్తుల్ని మీరు ఇంకా ఎక్కువ ప్రేమించాలి. కానీ భావావేశం పనికిరాదు. మీ హృదయంలో చాలా బలంగా ఉండాలి. మీ మనసు చాలా క్లియర్‌గా ఉండాలి.

అప్పుడు ఆయన మాట్లాడుతున్న విషయం మార్చి, 'మీరు ఎప్పుడు వెళ్తున్నారు?' అని అడిగారు. మేం ఉన్న ఆ పదిరోజుల్లో ఈ ప్రశ్న చాలా సార్లు అడిగారు. నాకైతే ఉండాలనే ఉంది గానీ ఈ సారి ఆయన ఇలా అడిగినపుడు ఇంకా నేను ఇక్కడ ఉండడం భావ్యం కాదని అనుకున్నాను.

మేము విమానం ఎక్కగానే నా మనసంతా ఇరవై ఏళ్లుగా స్వామీజీతో నా సాన్నిహిత్యం ఎలా సాగిందో కళ్ల ముందు సన్నివేశాలు ఒకటి తర్వాత ఒకటిగా కదలసాగాయి. వాటిలో చాలా వరకు మేం మృత్యువు గురించి మాట్లాడుకున్న సందర్భాలే గుర్తుకొచ్చాయి. ఢిల్లీ, న్యూయార్క్ మధ్య సాగిన ఆ సుదూర ప్రయాణంలో స్వామీజీ భవాల్ రాకుమారుని మృత్యువు గురించీ, పునర్జన్మ గురించీ చెప్పిన విషయాలు గుర్తుకొచ్చాయి. వారి గురుదేవులు స్వచ్ఛందంగా మరణించి తిరిగి అదే శరీరంలోకి ఎలా ప్రవేశించారో, స్వామీజీ పరమ గురువులు మేఘంలా మారి, తన చైతన్యాన్ని ఘనీభవింపజేసి ఒక చెక్క ప్లేట్‌ని కదిలించేలా ఎలా చేశారో అన్నీ గుర్తుకొచ్చాయి. స్వామీజీ, 'మరణం, జననం అనేవి జీవితమనే పొడవైన వాక్యంలో రెండు కామాలు. దాని సంపూర్ణత్వాన్ని తెలుసుకోవడానికి అంతకు ముందు ఏం వ్రాసి ఉందో తెలుసుకోవాలి. నువ్వు జన్మించక ముందు జీవితాన్ని చేరుకునే దారి ఏర్పడి ఉండకపోతే నీ గత జీవితంలోని సూక్ష్మ ప్రభావాల నుంచి నువ్వు బయట పడలేవు. మరణించిన తర్వాత ఎలా ఉంటుందనే కోణం అర్థం చేసుకోకపోతే నువ్వు భయం, ఆందోళన నుంచి విముక్తం కాలేవు. జీవితంలో తెలిసిన, తెలియని దృక్పథాలు రెండింటినీ అందుకోగలిగినవారే నిజమైన సిద్ధపురుషులు. అలాంటి సాధువులు తమ వృద్ధ శరీరాన్ని వదిలి, కొత్త శరీరంలోకి ప్రవేశిస్తారు, చిరుగుల పాత వస్త్రాన్ని వదిలి, నూతన వస్త్రం ధరించినట్లు!

కళ్లు మూసుకుని కూర్చున్న నేను ఏదో థియేటర్‌లో మూవీ చూస్తున్నట్లు చూస్తున్నాను. న్యూఢిల్లీలోని అక్బర్ హోటల్‌లో తొమ్మిదవ ఫ్లోర్‌లో స్వామీజీ నడిచి నావైపు వస్తుండడం కనిపిస్తోంది. ఆయన నన్ను తన గదిలోకి తీసికెళ్లారు. పదకొండు రాత్రులు నెహ్రూ పార్క్‌లో గడిపిన యువకుడు (నేనే) కళ్ల ముందు కదలాడుతున్నాడు. అతడికి స్వామీజీ ఆశీర్వాదం అందింది. 'నీకు ఎప్పుడూ ఆశ్రయం దొరుకుతుంది, భోజనం దొరుకుతుంది. నీకేనాడూ ఆకలి ఉండదు!' 1980 లో మొదటి గురుపౌర్ణమి నాకు గుర్తుంది. ఆయన తన గది నుంచి మాయమైపోయి, మళ్లీ నా ఎదుటకి వచ్చి నిలబడ్డారు. వందలాది అనుభవాలు నా మనో నేత్రం ముందు కదులుతున్నాయి. చివరికి నాన్నగారు చనిపోయినప్పటి సంగతులు గుర్తుకొచ్చాయి! నేను ఆలోచనల్లో గాఢంగా నిమగ్నమయ్యాను. స్వామీజీ లాంటి మహాపురుషులు కేవలం తమ శరీరాన్ని వదిలివేయడమే కాదు, అలాంటి సంధి సమయంలో ఇతరులకి మార్గదర్శన కూడా చేస్తారు. కానీ అది ఎలా సాధ్యపడుతుంది. అప్పుడు ఇన్నేళ్లుగా ఆయనకీ నాకూ మధ్య జరిగిన సంభాషణలన్నీ నా మదిలో మెదిలాయి. ఈ జ్ఞాపకాలు కర్మ, పునర్జన్మ, విధి, దైవ కృప, ఆధ్యాత్మిక విధానాలు, ఎంపికకి గల స్వేచ్ఛ, మహత్వకాంక్ష, అలవాట్లకి గల శక్తి వంటి వందలాది సంగతులకి సంబంధించినవి.

అంత సుదీర్ఘ ప్రయాణంలో నేను నా ఆలోచనల్ని నిలువరించుకోలేక మీరాతో పంచుకునేవాడిని. నాకు జెట్‌లాగ్ సమస్య తీరిన తర్వాత నేను మరణం నుంచి జననం వరకూ గల అంశాల్ని రాసేవాడిని. విశ్రాంతి సమయంలో ఆ అంశాలపై స్వామీజీతో కలిపి పనిచేసేవాడిని. ఆ పుస్తకం సగం పూర్తి అయింది. ఇంతలో నేను మరో గ్రూపుతో సెప్టెంబరు మొదటివారంలో భారతదేశానికి మళ్లీ తిరిగివచ్చాను.

నేను స్వామీజీని కలవడానికి వెళ్లినపుడు, ఆయన నన్ను చూడగానే వేసిన మొదటి ప్రశ్న, 'నువ్వు ఎంతకాలం ఉండబోతున్నావు?' నేను, 'మీరు ఎంతకాలం ఉండమంటే, అంతకాలం!' అన్నాను. ఆయన, 'మంచిది,' అన్నారు.

ఆయన బాగా బరువు తగ్గిపోయారు. ద్రవపదార్థాలూ, నీళ్లే ఆయనకు ఆహారం. ఆయన నిలబడితే, దుస్తులు ఒక వెదురు కర్రకి వ్రేలాడినట్లు వ్రేలాడుతున్నాయి. కానీ వినికిడి ఇంకా బాగా పని చేస్తూనే ఉంది. శరీరం నిటారుగా ఉంచి తల స్థిరంగా నిలిపి నడుస్తున్నారు. ఆయన

మెడికల్ కాలేజీ పని వ్యక్తిగతంగా చూసుకోలేకపోతున్నారు. కానీ అయినా సమావేశాలు నిర్వహిస్తున్నారు, ఆదేశాలు జారీ చేస్తున్నారు. అలాంటి సమయాల్లో ఆయన మాటలు చాలా సంక్షిప్తంగా, సూక్ష్మంగా ఉంటున్నాయి. చాలామంది ఈ మార్పుకి ఆయన బలహీనతే కారణమని అనుకున్నారు.

కానీ నేను గమనించినదాన్ని బట్టి, ఆ ప్రవర్తనకి బలహీనత కొంతవరకే కారణం. భౌతికంగా ఆయన బలహీనంగా ఉన్నారు, కానీ ఆయన మానసిక బలం– ఆయనకి అలవాటైన దారి ఒకటే ఇప్పుడు ఆయన్ని సంరక్షించుకుంటున్నాయి.

ఒకరోజు మీరా, నేనూ ఆయన గదికి వెళ్లాము. ఆయన పక్క మీద ఆనుకుని కూర్చున్నారు. ఆయన ముఖంలో వర్ణనాతీతమైన ఆనందం, ప్రశాంతత కనిపిస్తోంది. ఆయన కళ్లు మూసుకుని కూర్చున్నారు. అలికిడి విని కళ్లు తెరిచి మమ్మల్ని చూశారు. తల, కనుబొమలు, కళ్ల కదలికలతో, 'పిల్ల ఎక్కడ?' అని అడిగారు. ఆ రోజుల్లో మా తొమ్మిదేళ్ల అమ్మాయి ముస్సోరీ స్కూలుకి వెడుతుండేది. ఆ స్కూలు హాస్పిటల్ క్యాంపస్‌కి ఒక గంటన్నర దూరంలో ఉండేది. స్వామీజీని సెలవుల్లో వచ్చి చూస్తుండేది. ఆయన కొంచెం పెద్ద గొంతుతో, 'మీకు తెలుసా, దానికి నేనంటే చాలా ఇష్టం. అది నాలో ఒక భాగం!' అన్నారు. మేము ఆశ్చర్యపోతున్నాం. ఆయనలో నీరసంగా ఉన్న భావనే కనిపించడం లేదు. తాను అనారోగ్యంతో ఉన్న మనిషి అని మరిచిపోయినట్టు, ఒక పెద్ద గ్రూపుకి ఉపన్యాసం చెప్తున్నట్టు ఆయన తన గొంతుని పెంచి మాట్లాడుతున్నారు.

ఇప్పుడు మీరా, నేను స్వామీజీ సందర్శనకు వచ్చి ఊరికే కూర్చున్నాం. ఆయన 'మీకు లేనిది ఏమైనా నా దగ్గర ఉందా?', 'నేను మీకు ఒక పని అప్పగించాను. నీ జీవితం అందుకోసమే వినియోగించాలి!', 'ఈ ప్రపంచం ఒక స్వప్నం. దీన్ని నిజమని భ్రమించకు,' ఇలా అప్పుడప్పుడూ ఒకటీ రెండు మాటలు మాట్లాడుతున్నారు. ఒకరోజు మీరా, నేనూ లోపలికి వెళ్లాము. ఆయన దగ్గర మహేష్ అనే ఒక స్టూడెంట్ ఉన్నాడు. మేం మాట్లాడకుండా కూర్చున్నాం. మహేష్ వెళ్లిపోయిన తర్వాత స్వామీజీ, 'ఔర్ బోలో,' (చెప్పు నువ్వు ఇంకా ఏం చెప్పాలో!) అన్నారు. మేం మౌనంగా ఉండడం చూసి ఆయన, 'నువ్వు ఈ సంప్రదాయంలో ఇంకా శిశువువి. సందేహం, భయం నీ కోసం కాదు. మహర్షులు నీతో ఎల్లపుడూ ఉంటారు. వాళ్లు నిన్ను ప్రేమించినట్టే సమస్త మానవాళినీ ప్రేమిస్తారు. నువ్వు ముందుకు సాగాల్సి ఉన్నపుడు వెనక్కి తిరిగి చూడకు!'

అప్పుడు ఆయన, 'మీ గ్రూపు ఎప్పుడు వస్తోంది?' అని అడిగారు. నేను తేదీ చెప్పాను ఆయనకు. 'వాళ్లు ఎక్కడికి వెళ్తున్నారు ఈసారి?' అని అడిగారు.

'వాళ్లు ఉత్తర కాశీ, గంగోత్రి వెళ్దామని అనుకుంటున్నారు,' అన్నాను నేను.

'వాళ్లు వెళ్లగలరా ఈసారి?' అడిగాను నేను.

'ఎందుకు వెళ్లలేరు? నువ్వు సాధన చేస్తున్నావుగా. ఇక భూస్ఖలనం జరగదు. ఉత్తర కాశీలో చాలా అందమైన ప్రదేశాలు ఉన్నాయి. అక్కడ మహర్షి పరశురాముని తల్లి రేణుకా దేవి స్థలం చూడాల్సిన ప్రదేశం,' అన్నారు స్వామీజీ.

ఓ వారం తర్వాత ఒక గ్రూపు ఉత్తర కాశీకి చేరుకుంది. 'ఉత్తర కాశీ' అంటే 'కాశీకి ఉత్తరాన ఉన్న ప్రదేశం' అని అర్థం. పావన గంగా తీరంలో ఉన్న ప్రాంతం. ఇక్కడ ఉన్న పర్వతాల గుండా గంగ ప్రవహిస్తుంది. ఈ గ్రామం అనాదిగా సాధువుల నిలయం. ఇక్కడ ఉన్న శివాలయం వల్ల దీనికి ఈ ప్రసిద్ధి కలిగింది. ప్రశాంతమైన ఆశ్రమాలు నదీ తీరాల్లోనూ, కొండల్లోనూ అక్కడక్కడా ఉన్నాయి. మేము ప్రధాన శివాలయానికి వెళ్లి దైవ సందర్శనం చేసి వద్దామని అనుకున్నాము. మేము గంగోత్రి, గోముఖం వెళ్లే దారిలో ఎత్తైన ప్రాంతాలు ఉంటాయి

కాబట్టి మేము మరో మూడు నాలుగు రోజులు ఇక్కడే ఉండి ఇంకా ఎత్తుకి వెళ్లేందుకి తగిన ఏర్పాట్లు చేసుకోవాలని నిర్ణయించుకున్నాము.

కానీ స్వామీజీ మేము రేణుకా దేవి స్థలిని తప్పక సందర్శించాలని చెప్పారు. కాబట్టి మా ప్రధాన లక్ష్యం రేణుకా మాత ఆలయ దర్శనమే. ప్రాచీన కాలంలో స్కంద పురాణంలో ఇలా చెప్పబడింది, 'అక్కడ ఉన్నపుడు రేణుకా మాత జీవితాన్నీ, కృత్యాల్నీ గుర్తు చేసుకోవాలి. అప్పుడు ఈ జన్మలోని కర్మ బంధాల్నించి విముక్తి కలుగుతుంది. ఆమెని దర్శనం చేసుకోవడం వల్ల ఏడు జన్మల కర్మ కల్మషాలూ కరిగిపోతాయి.' నేను ఆ మార్గాన్ని గానీ, అలాంటి సూక్ష్మంలో మోక్షం ప్రసాదాల గురించి ఘంటాపథంగా చెప్పే గ్రంథాల గురించి గానీ ఎన్నడూ అంత బాగా పట్టించుకోలేదు. కానీ, ఇప్పుడు స్వామీజీ చెప్పడం వల్ల అది వాస్తవమైన విషయమేనని నాకు అర్థమైంది. నేను మా గ్రూపుతో ఉత్తర కాశీ గురించి నాకు తెలిసిన విషయాన్ని చెప్పాను. ఆ ప్రాంతంలో నివసించిన సిద్ధుల గురించిన కథల్ని తెలిపాను. స్వామీజీ అక్కడ 1960లో మూడేళ్లపాటు ఉన్నారని చెప్పాను. గ్రూప్‌లోని సభ్యులకి అంతా రేణుకాదేవి ఆలయాన్ని సందర్శించే ముందు తీర్థయాత్ర సందర్శన చేస్తున్నామనే అనుభూతి పొందేలా చేయడానికి తగిన వాతావరణం నేను రూపొందిస్తున్నాను.

మేము ఆ ప్రాంతానికి చేరుకున్నాం కానీ మాకు ఆలయం ఎక్కడుందో తెలియలేదు. కానీ మేము మా టూర్ గైడ్‌ని అడిగాము. అతడు ఆ ప్రాంత ప్రజల్ని అడిగాడు. కానీ అక్కడ ఎవరికీ ఆ ఆలయం గురించి తెలిసినట్టు లేదు. కానీ మేము ఒక పూజారిని కలిశాము. ఆయన ఆ ప్రాంతంలో ఉన్న సంస్కృత పాఠశాలకి ప్రిన్సిపాల్. ఆయనకి రేణుకాదేవి ఆలయం గురించి బాగా తెలుసు. అది పట్టణానికి బయట ఆరు కిలోమీటర్ల దూరంలో పర్వత శిఖరంపైన ఉంది. ఆ పర్వతపాద ప్రాంతానికి మేము మా బస్సుల్లో సునాయాసంగానే చేరుకోగలిగాము. అక్కడ నుంచి ఆలయం చేరుకోవడానికి మరో ముప్ఫై నిముషాల పాటు కొండ ఎక్కాలని చెప్పారు ఆ పూజారి. అది మాకు తేలికగానే అనిపించింది. మేము అక్కడికి మధ్యాహ్నం వెళ్దామని అనుకున్నాం. ఆ పూజారి మాకు తన దగ్గరి విద్యార్థుల్లో ఒకరిని మాకు గైడ్‌గా పంపించారు.

అక్కడి గెస్ట్‌హౌస్‌లో లంచ్ పూర్తి చేసుకున్నాక, గంగోత్రి నుంచి తిరిగి వస్తున్న ఒక జర్మన్ల బృందాన్ని కలుసుకున్నాము. వాళ్లు గంగోత్రి ప్రాంతంలో వాతావరణం చాలా భయంకరంగా ఉందనీ గత మూడు రోజులుగా వారు మంచుతుఫానులో ఇరుక్కుపోయామనీ చెప్పారు. మధ్యమధ్యలో సూర్యుడు కనిపిస్తున్నా రాత్రిపూట కరిగిన మంచు మళ్లీ గడ్డకట్టుకుపోతోందనీ చెప్పారు. మొత్తానికి వాళ్లు చెప్పిన విషయం సారాంశం ఏమిటంటే, ఆ మంచుకొండల్లో గంగోత్రి దిశగా ముందుకు వెళ్లడం ఎంత మాత్రమూ సురక్షితం కాదు. నాకింకా ఆశ్చర్యం వేసింది. భూస్ఖలనానికి బదులు మరో కారణం! అదీ సీజన్ కాని సీజన్‌లో మంచుతుఫాను! కానీ ఇలాంటి సందర్భాల్లో మనం ప్రస్తుత పరిస్థితుల్లో ఏది ఉత్తమమని అనిపిస్తే అదే చేయాలని పదే పదే చెప్పుకున్నాం. కాబట్టి మేం రేణుకాదేవి ఆలయానికి బయల్దేరిపోయాం.

కొండప్రాంతం క్రింద దుకాణ యజమానులు ఆ ఆలయానికి చేరుకోవడానికి కనీసం రెండు గంటలు పడుతుందని చెప్పారు. యాత్రికుల్లా కనిపిస్తున్న మిగతావాళ్లు మూడు గంటలు పడుతుందని చెప్పారు. ఆ గ్రామంలో ఉన్నవారు, 'అబ్బే, అదుగో, అక్కడే ఉంది. మా వెంట రండి, మేం తీసుకుని వెడతాం!' అని చెప్పారు. పడమటి దిశగా కొండ మీదకి ఎక్కడం ప్రారంభించాం. ఎండలో నడుస్తున్నాం. ఒక గంట గడిచిన తర్వాత చూస్తే మేం ఇంకా కొండ దిగువ ప్రాంతంలోనే ఉన్నాం. చాలా ఎండగా ఉంది. ఉక్కబోస్తోంది. మా దగ్గర నీళ్లు కూడా అయిపోయాయి. మా గ్రూపులో కొంతమంది పెద్దవాళ్లు కూడా ఉన్నారు. మరి కొంతమంది

స్థూలకాయులు ఉన్నారు. కొందరికి మధుమేహం గానీ, అధిక రక్తపోటు సమస్యలు ఉన్నాయి. నేను వారికి పైకి రావద్దనీ, శక్తికి మించిన సాహసం వద్దనీ, ప్రకృతికి వినమ్రంగా తలవంచి ఉన్నచోటే ఉండమనీ చెప్పాను. ఈలీన్ డియోరియో స్వామీజీతో డెబ్బై దశకం మధ్య నుంచీ ఉంటున్నారు. ఎంతగా అలిసిపోయినా ఆమె ముందుకు వెళ్లాలని కోరుకున్నారు. పైకి చేరుకోవడానికి రేణుకా మాతే సహాయం చేస్తుందనీ తను శిఖరానికి చేరుకుంటాననీ వాదించారామె. ఒకవేళ తాను ఆ ప్రయత్నంలోనే కన్ను మూస్తే, ఎక్కడో అక్కడ ఎలాగో అలాగ బ్రతికే కంటే రేణుకా మాత ఆలయ సమీపంలో చనిపోవడం మేలని ఆమె అభిప్రాయపడ్డారు. అందువల్ల నేను ఆమెని జాగ్రత్తగా మెల్లగా నడవమని చెప్పాను. మధ్య మధ్యలో విశ్రాంతి తీసుకోమనీ, సూర్యాస్తమయం లోపల దిగిపొమ్మని చెప్పాను. ఆమె దిగుతుంటే మేం మధ్యలో ఆమెని కలుసుకుంటామని భరోసా ఇచ్చాను.

మెయిన్ గ్రూప్‌ని తీసుకుని కొండ శిఖరానికి చేరుకోవడానికి రెండు గంటలు పట్టింది. మేం అక్కడికి వెళ్లేసరికి ఆ బుల్లి దేవాలయం తలుపు తాళం పెట్టి ఉంది. పూజారిగారు మా వెంట పంపిన యువకుడు మా కంటే రెండింతల వేగంతో నడిచాడు. కొండ మీదకి అతడు మా కంటే గంటన్నర ముందుగా చేరుకున్నాడు. ఆ దేవాలయ పూజారి అక్కడికి దగ్గరలోనే ఉంటున్నాడని చెప్పాడతడు. మాలో కొంతమంది తన వెంట వస్తే, ఆ పూజారి వచ్చి తలుపులు తీయవచ్చునని చెప్పాడు. కానీ మేం పూజారి ఇంటికి వెళ్లేసరికి ఆయన అక్కడ లేడు. కానీ ఆయన పిల్లలు ఇద్దరు అమ్మాయిలు వచ్చి గుడి తలుపులు తీశారు.

గుడి ప్రాంగణాన్ని శుభ్రం చేసే ఒక సాధువు తను శుభ్రం చేస్తున్న సమయంలో మమ్మల్ని బయట వరండాలో ఉండమన్నాడు. నేను మా గ్రూపుకి రేణుకా దేవి కథలు వినిపించాను. ఆమె పతి, కొడుకు పరశురాముడి గురించి చెప్పాను. నేను స్కంద పురాణంలో చెప్పబడిన రేణుకాదేవి మహత్యం గురించి వర్ణించబడిన విషయం, 'అక్కడ ఉన్నపుడు రేణుకా మాత జీవితాన్నీ, కృత్యాల్నీ గుర్తు చేసుకోవాలి. అప్పుడు ఈ జన్మలోని కర్మ బంధాల్నించి విముక్తి కలుగుతుంది. ఆమెని దర్శనం చేసుకోవడం వల్ల ఏడు జన్మల కర్మ కల్మషాలూ కరిగిపోతాయి' కూడా వారికి చెప్పాను. వారిలో కొంతమంది ఆమెని చూడడం సాధ్యపడుతుందా అని అడిగారు. 'మనం ఆమెని చూస్తే ఏమిటి? చూడకపోతే ఏమిటి?' అని అడిగాను నేను. ఆ తర్వాత మైకేల్ రాబిన్‌సన్ అనే వ్యక్తి, 'మనం రేణుకామాతని గంగోత్రి యాత్ర చేయడానికి అనుకూలమైన వాతావరణం కల్పించమని కోరదామా?' అని అడిగాడు.

'ఎందుకు కోరకూడదు? ఆ తల్లి ఇవ్వలేనిది లేదు.'

అప్పటికి ఆ సాధువు ఆలయాన్ని శుభ్రం చేశారు. ఆలయంలో ఏముందో మేము ముందుగా ఊహించలేకపోతున్నాము. మేము నమస్కరించబోయే చోట విగ్రహం ఉందా, శివ లింగం ఉందా, యంత్రం ఉందా, లేదంటే ఆరాధనా పీఠం ఉందా? ముందుగా నేను లోపలికి వెళ్లాను. అందరూ లోపలికి రావాలనుకుంటున్నారు. కానీ లోపల ఎనిమిదిమందికి, పదిమందికి సరిపడా చోటు లేదు. లోపల చీకటిగా ఉంది. నా వెనక మా వాళ్లు క్యూ కట్టడంతో బయట ఉన్నవాళ్లు తలుపుల మీదుగా తలలెత్తి చూడసాగారు. దాంతో ఇంకా చీకటై పోయింది.

అప్పుడు మెల్లగా మా కళ్లు చీకటికి అలవాటు పడ్డాయి. గోడ లోపల ఒక వృద్ధ స్త్రీని ఆ చిన్న విగ్రహం పక్కన నిలబడి ఉండడం మేము చూశాము. ఆమె అక్కడికి రావడం ఆశ్చర్యాన్ని కలిగించింది. బహుశా ఆమె పూజారిగారి తల్లి లేదా అమ్మమ్మ అయి ఉండాలి. ఆమె ఏవో జపిస్తోంది, వినడానికి మాత్రం అది హిందీ లాగానే ధ్వనిస్తోంది. ఆమె మా కోసం పూజ ఏదో చేస్తున్నట్లుంది. ఆమె విగ్రహం పక్కన నేల మీద ఉన్న రంధ్రం వైపు చూపించింది. మాకు

తోడుగా వచ్చిన యువకుడు దాని అర్థం వివరించాడు. రేణుకామాత అభ్యర్థన మేరక గంగా మాయి అక్కడ జలప్రవాహం రూపంగా అవతరించి అక్కడ నిరంతర ప్రవాహంగా ఉందట. ఆ వృద్ధ స్త్రీ ఆ రంధ్రం దగ్గర ఒక చిన్న పాత్రని ఉంచితే, అది నీటితో నిండింది. ఆమె ఆ జలాన్ని మా పై చల్లింది. ప్రమిద వెలిగించింది. నిండా జనం ఉన్న ఆ ఆలయంలో మమ్మల్ని తాకకుండా ధూపం వెలిగించడానికి అగరువత్తుల కోసం ఆమె అటువైపు వెళ్లింది. ధూపం వెలిగించిన తర్వాత ఆమె కొన్ని ప్రార్థనా శ్లోకాల్ని చదివింది. ఆ తర్వాత మా అందరి మణికట్లకీ ఒక్కొక్క పవిత్ర సూత్రం కట్టింది. పూజ పూర్తి అయిన తర్వాత పూజారులు సంప్రదాయబద్ధంగా నిర్వహించే తంతు అది. ఆమె మమ్మల్ని తాకకుండానే పవిత్ర సూత్రం కడుతూ ఉండడం మాకు చాలా ఆశ్చర్యంగానూ, అద్భుతంగానూ తోచింది. మేము ఆ అద్భుతాన్ని అనుభూతి చెందే లోపునే మాకు వచ్చిన అలసట, చుట్టూ చీకటి, గాలి లేకపోవడం, లోపల ధూపం పొగ అన్నీ తోడై బయటికి వచ్చేశాము. ఆమె మాతో బాటు ఆలయం బయటికి వచ్చింది. మాతో బాటు లోపలికి రాలేకపోయిన వారిని దగ్గరకు రమ్మని పిలిచి వాళ్ల మణికట్లకి కూడా పవిత్ర సూత్రం కట్టింది.

సూర్యాస్తమయం అవుతోంది. గ్రూపులో కొంతమంది చీకటి పడక ముందే కొండ దిగడానికి హడావిడి పడుతున్నారు. మిగతా వాళ్లు మరి కొంతసేపు ఆనందించి మరి కొన్ని ఫోటోలు తీసుకుని వెడదామని అంటున్నరు. కొన్ని గంటల ముందు మేము క్రింద వదిలిపెట్టి వచ్చిన ఈలీన్ అక్కడికి చెమటలు కక్కుకుంటూ వచ్చింది. ఆమె శిఖరం ఎక్కగలిగినందుకు నేను చాలా ఆనందపడ్డాను. కానీ ఆ చీకటిలో ఆమె క్రిందికి ఎలా దిగుతుందా అని చాలా ఆందోళన చెందాను. కానీ ఆ వృద్ధ స్త్రీ ఆమె దగ్గరికి వెళ్లి మణికట్టుకి పవిత్ర సూత్రం కట్టి ఈలీన్ జేవురించిన ముఖాన్ని చూసి, ఎడమ చేతిని ఇమ్మని చెప్పింది. ఆమె ఎడమ మణికట్టుకి మరో పవిత్ర సూత్రం కట్టింది. ఆమె అలా చేయగానే, ఈలీన్ అలసట అంతా మాయమైంది. ఆమె చాలా శక్తివంతంగా హుషారుగా ఉంది. ఇద్దరూ ఒకరి కళ్లలోకి ఒకరు చూసుకున్నారు. ఈలీన్, 'నేను మిమ్మల్ని ముద్దు పెట్టుకోవచ్చా?' అని అడిగింది. ఈలీన్ మాట్లాడేది ఇంగ్లీషే అయినా ఆ వృద్ధ స్త్రీ అర్థం చేసుకుని, తన బుగ్గని ముందుకు పెట్టింది. ఈలీన్ ఆమెకి ముద్దు పెట్టడానికి ముందుకు వంగింది. కానీ ఆమె తక్షణమే భయంతో బిగిసిపోయింది– అది మానవ శరీరానికి సంబంధించిన బుగ్గ కాదు. ఆమె పెదవులు ఆ స్త్రీ బుగ్గల్ని తాకాయి, కానీ తాకలేదు.

ఈలీన్ ఆ స్త్రీ దగ్గర సెలవు తీసుకుంది. బయట గుడి ప్రాంగణంలో ఉన్న వారిని కలుసుకుంది. ఆమె తన ఉత్సాహాన్ని నిలువరించుకోలేక పోయింది. 'ఆమె మానవ స్త్రీ కాదు, తెలుసా?' అని అడిగింది తన స్నేహితుల్ని. ఆమె అలా అనగానే ప్రతి ఒక్కరూ తమకి కలిగిన అనుభూతుల్ని తల్చుకున్నారు. అందరికీ రకరకాల అద్భుతమైన అనుభూతులు ఉన్నాయి ఈ విషయంగా. ఆ స్త్రీ ఆలయంలోకి ఎక్కడ నుంచి వచ్చింది? రద్దీగా ఉన్న ఆ ఆలయంలో ఎవరినీ తాకకుండా అందరి మణికట్లకీ పవిత్ర సూత్రాల్ని ఎలా కట్టింది! ఆమె సమక్షాన్ని ప్రతి ఒక్కరూ పోల్చి చూసుకున్నారు. ముఖ్యంగా సూత్రాలు కడుతున్న సందర్భంలో!

కానీ అసాధారణమైన ప్రత్యక్షానుభవం పొందింది మాత్రం ఈలీన్‌కే. ఆమె నడి వయసు దాటిన స్థూలకాయురాలు, ఆమె ఒక్కసారే టీనేజర్‌లా చురుగ్గా చకచకా కదులుతోంది. చీకట్లు కమ్ముకుంటూ ఉంటే కొండ దిగడం కూడా ఆమెకి ఏమాత్రం ప్రయాసగా అనిపించలేదు. నిజానికి, బస్సుల్ని చేరుకోవడానికి వెళ్తున్న మేమంతా చురుకైన చూపుతో ముందుకు వేగంగా కదులుతున్నాం.

మర్నాడు మేము గంగోత్రికి బయల్దేరాము. పర్వతాల్లో మరింత ముందుకు సాగిన కొద్దీ మేము డ్రైవ్ చేస్తున్న రోడ్డు కుడివైపు తప్ప ఎడతెరిపిలేకుండా మంచువాన కనిపిస్తోంది. మేము ఇంత క్రితమే ప్రయాణించి వచ్చిన రోడ్డుని చూశాము. భీభత్సకరమైన వాతావరణం

తరుముకుంటూ మా వెనకే వస్తోంది. కానీ కొన్ని వర్షపు చినుకులు తప్ప, మా బస్సులకి ఆ వాతావరణం తాకిడి ఏమీ లేదు. గంగోత్రి నుంచి మేము గోముఖ గ్లేసియర్‌కి ట్రెక్కింగ్ చేశాము. అక్కడ ఎక్కడ చూసినా సూర్యకాంతే.

ట్రిప్‌లో మిగతా కాలమంతా అందరూ ఈ విషయాల గురించే మాట్లాడుకుంటున్నారు. నేను వాళ్ల సంభాషణల్ని పట్టించుకోకుండా ఉండడానికి ప్రయత్నిస్తున్నాను. మేం ఇప్పుడు చూసిన సన్నివేశాలపై మాట్లాడుతూ ఎవరి ఊహల్నీ కొండంతలుగా చేసేయడం గానీ, లేదా నా స్వంత వ్యాఖ్యానం జోడించడం గానీ చేయదలచలేదు. ఆ వృద్ధ స్త్రీ ఫోటో తీసుకున్నవారికి ఆమెని మళ్లీ చూడాలనిపించి, మా గ్రూప్ సభ్యులు మేము ఋషీకేశ్‌కి వచ్చాక ఆ ఫిల్మ్‌ని డెవలప్ చేయించడానికి తీసుకుని వెళ్లారు. చాలా ఆశ్చర్యంగా, ఆ వృద్ధ స్త్రీ చాలా స్పష్టంగా కనిపిస్తోంది. కానీ కొన్ని ఫోటోల్లో ఆమె చీరకి రంగు బోర్డరు ఉంది, కొన్ని ఫోటోల్లో బోర్డరే లేదు. కొన్ని ఫోటోల్లో చీర తెల్లగా ఉంటే, మరి కొంతమంది ఫోటోల్లో ఆకాశ నీలం రంగులో ఉంది. ఇక అందరికీ సందేహం తీరింది. ఇదేదో 'దివ్యానుభూతి'కి సంబంధించిన ఘటనే అని అందరూ అర్థం చేసుకున్నారు.

కొద్ది రోజుల తర్వాత నేను స్వామీజీని చూడడానికి వెళ్లాను. స్వామీజీ, 'మీరు ఆమెని చూశారా?' అని అడిగారు. నేను, 'చూశాము,' అని చెప్పాను. ఆయన ఒక క్షణంసేపు మౌనంగా ఉన్నారు.

ఆ తర్వాత ఆయన, 'ఆమె దేవత, సర్వవ్యాపి. నామరహితం, రూపరహితం. పరశు రాముడు, గణేశ ఆమెతోనే ఉంటారు. ఆమె శాశ్వతమైనది, ఆమె సంతానమైన సాధువులు కూడా అంతే దివ్యాశీస్సులు పొందినవారు. ఆమె చరణాలకు సమర్పించుకున్న వారికి నేను వారికి నమ్మినబంటుని,' అన్నారు.

అప్పటికి స్వామీజీ చాలా నీరసంగా ఉన్నారు. ఆయన ఎంతో ప్రయాసతో మాట్లాడుతున్నారు. నిరంతరం ఆయనకు సపర్యలు చేయడానికి ఎవరో ఒకరు ఉంటున్నారు. ఇలాంటి సంభాషణలకి అవకాశం తక్కువ. కానీ ఈ కొద్ది వాక్యాల్లో హిమాలయ సాధువుల పరంపర అనే ధర్మగ్రంథ సారాన్ని అందించేశారు. ఆయన ఏం చెప్పారూ, దాన్ని ఎలా అర్థం చేసుకోవాలీ అన్న విషయాలపై ధ్యానించడానికి నేను కొంచెంసేపు ఎక్కడైనా ఏకాంతంగా గడపాలనుకుంటున్నాను. స్వామీజీ అపార్ట్‌మెంట్ ఉన్న బిల్డింగ్ పక్కనే కంబైన్డ్ థెరపీ డిపార్ట్‌మెంట్ హౌసింగ్ బిల్డింగ్ ఉంది. అక్కడ సెకండ్ ఫ్లోర్‌లో ఒక గది ఖాళీగా ఉంది. నేను అక్కడికి వెళ్లి రెండు గంటల సేపు ఆ గదిని లాక్ చేసుకుని కూర్చున్నాను. అక్కడ కూర్చుని, నేను స్వామీజీ ఇప్పుడు తానెవరో చెప్పారు. ఆ దేవత ఎవరో చెప్పారు. ఆ దేవతతో సాధుసన్యాసులకి గల సంబంధం ఏమిటో వివరించారు. ఆమె చరణాలకి అర్పించుకున్నవారికి ఆ సంప్రదాయం తప్పనిసరిగా ఇచ్చే అండ, భరోసా ఏమిటో చెప్పారు.

ధ్యానంలో నిమగ్నమై ఉండగా, నాకు స్వామీజీతో జరిగిన కొన్ని అనుభవాలు గుర్తుకొచ్చాయి. ఆ అనుభవాలు ఆయనకు పరమంతో ఉన్న సంబంధ బాంధవ్యాల్ని తెలియజేస్తాయి. 1980లో నేను స్వామీజీ తమ ప్రియతమ స్నేహితులు, శిష్యులు అయిన డా. అగ్నిహోత్రికి 1956–1975 మధ్యన రాసిన లేఖల్ని చదివే అదృష్టం కలిగింది. వాటిలో ఒకచోట ఆయన తనకు కనిపించిన దేవీమాత చిత్రాన్ని గీశారు. ఆ సమయంలో నాకు డ్రాయింగ్ కలిగించే ప్రేరణని అర్థం చేసుకోలేకపోయాను. కానీ నాకు ఆ లేఖ కూడా అర్థం కాలేదు. స్వామీజీ ఎవరికీ అర్థం కాకుండా ఉండేందుకు మార్మిక శైలిలో వ్రాసి ఉంటారని భావించాను. కానీ ఇప్పుడు ఆయన మాట్లాడిన ఈ కొన్ని అమూల్య వాక్కులు విన్న తర్వాత మాత్రం నేను ఆయనలో అనంతమైన దివ్యమైన ప్రేమతో ఉప్పొంగే మహాసిద్ధ సాధువుని చూశాను. ఈ దృక్కోణం నుంచి

చూస్తే ఆయన ఈ ప్రపంచంలో కనిపించిన శాస్త్రజ్ఞుడు, పరిశోధకుడు, వేదాంతి, యోగి, కవి, రచయిత, మానవతావాది, మల్టీనేషనల్ ఆర్గనైజేషన్ హెడ్ వంటి అన్ని హోదాలూ ఆయన అసలు అస్తిత్వానికి సంబంధించిన ఛాయలుగానే కనబడతాయి. ఆ ముగురమ్మల మూలపుటమ్మకి ఆయన ముద్దుబిడ్డ.

1980లో నా ఆలోచన ఒక సంఘటన రూపంగా బయటపడింది. స్వామీజీ కుటుంబానికి ఢిల్లీలో ఉన్న ఒక జ్యోతిష్యుడు బాగా సన్నిహితుడు. అతడు గ్రహాలు నక్షత్రాలు సరిగా లేకపోవడం వల్ల స్వామీజీకి రానున్న ఆపద గురించి హెచ్చరించడానికి ఆయనకు ఉత్తరం రాశాడు. దానికి స్వామీజీ ఆ జ్యోతిష్యుడికి రాసిన సమాధానం నాకొక కొత్త ఆలోచననిచ్చింది. ఆయన లేఖ సారాంశం ఏమిటంటే, దేవీమాత ఆయనపై ఎలాంటి షరతులూ లేని అపారమైన ప్రేమని కురిపిస్తానని వాగ్దానం చేసిందట, నిరంతరం ఆయనని సంరక్షించుకుంటానని మాట ఇచ్చిందట. ఆ అమ్మ పాదాలు నన్ను రక్షిస్తున్నాయి. నాకింక గ్రహాలు, నక్షత్రాల గమనాలు రక్షించాల్సిన పనేముందీ అని అడిగారట. ఆయన ఈ జవాబు డిక్టేట్ చేస్తుంటే ఆయన కళ్లలో కనిపించిన ప్రకాశం ఐహిక ప్రపంచానికి సంబంధించిన ప్రకాశం కాదని చెప్పారాయన. ఇప్పుడు నేను ఆ విషయాన్ని మళ్లీ నిర్ధారిస్తున్నాను, ఆయన కళ్లలో కనిపించిన ఆ కాంతి నిజంగానే ఈ ప్రపంచానికి చెందినది కాదు.

ఈ విషయాన్ని నేను గుర్తు చేసుకోవడంతో నాకు స్వామీజీ 1980 లో జరిగిన సంభాషణ గుర్తుకొచ్చింది. ఒక ఆదివారం ఉదయం ఆయన మాట్లాడబోతున్నపుడు, నేను ఉపన్యాసానికి బయల్దేరబోతున్నాను. సాధారణంగా ఆయన, 'ప్రాక్టికల్‌గా ఉండాలి, ఎమోషనల్ కాకూడదు. మీతో మీరు హాయిగా ఉండండి! మీ బాధ్యతలు మీరు నిర్వర్తించండి...' ఇలాంటి మామూలు మాటలేవో మాట్లాడతారని అనుకున్నాను. ఒకవేళ ఆయన ముందుగా, 'ఈరోజు టాపిక్ ఏమిటి?' అని అడిగితే (ఇలా చాలా సార్లు జరిగేది), నేను ఆయన్ని తమాషాకి, 'దేవీమాత, మార్గదర్శక ప్రకాశం' అనేవాడిని. నేను ఇన్‌స్టిట్యూట్ బిల్డింగ్‌కి చేరుకునేసరికి స్వామీజీ ఇంకా తన గదిలోనే ఉండేవారు. నేను ప్రవేశించేసరికి ఆయన తన శాలువా కప్పుకుంటున్నారు.

నేను ఆయన పాదాలకు నమస్కరించాను. ఆయన, 'నేనెలా ఉన్నాను?' అని అడిగారు.

నేను, 'మీరు చాలా అందంగా ఉన్నారు స్వామీజీ!' అన్నాను. ఆ తర్వాత నేను ఆయనతో, 'స్వామీజీ, నేను మీకో విషయం చెప్పాలి. నాకు ఇప్పుడే ఒక సిద్ధి వశమైంది!' అన్నాను. 'అదేమిటీ?' అన్నారాయన. నేను దానికి, 'నేనిప్పుడు ఎవరి మనసైనా చదివేయగలను. వెంటనే జరగబోతున్న సంగతుల్ని కనిపెట్టగలను. ఇంకా చెప్పాలంటే, మీరు ఈరోజు ఉపన్యాసంలో ఏం చెప్పబోతున్నదీ కూడా చెప్పగలను,' అన్నాను.

ఆయన నవ్వి, 'సరే, చెప్పు నాతో,' అన్నారు.

నేను, 'మీరు రాచఠీవితో స్టేజీ మీదకి వెళ్తారు. పోడియం చేరుకుంటారు. ప్రేక్షకుల్ని చూస్తూ మీ శిరసు వంచి (అలా అంటూ నేను ఆయన మాట్లాడే శైలిని అనుకరించాను), 'మీలోని దివ్యత్వానికి నమస్కరిస్తున్నాను. మీరెలా ఉన్నారు? మీరంతా సౌకర్యంగా ఉన్నారా? మీకు ఇన్‌స్టిట్యూట్ ఆహారం నచ్చిందా? మీకేదైనా సమస్య వస్తే దయచేసి కెవిన్, డా. క్లార్క్‌తో చెప్పండి,' అంటారు. అప్పుడు మీరు చాలా సొగసుగా బ్లాక్‌బోర్డ్ వైపు వెళ్తారు. అక్కడ నుంచి ప్రేక్షకుల్ని చూస్తూ, 'మనిషి కేవలం శరీరం మాత్రమే కాదు, మనసు మాత్రమే కాదు. మనిషి శ్వాసించే మనిషి కూడా.' అని చెప్తారు. ఆ తర్వాత మీరు బోర్డు మీద రెండు వృత్తాలు గీసి ఆ రెండింటి మధ్యా 'ఇది శరీరం, ఇది మనసు. ఈ రెండింటి మధ్యా 'శ్వాస' అనబడే అంశం ఒకటి ఉంది',

అని చెప్తారు. ఇంకా నేను ఆయన్ని యాక్షన్‌తో అనుకరిస్తూనే ఉన్నాను. ఇంతలో స్వామీజీ సన్నగా నవ్వి 'దుర్మార్గుడా! నువ్వు నీ గురువుని అనుకరిస్తావా?' అన్నారు.

'లేదు, స్వామీజీ! ఇన్నేళ్లుగా నేను వింటున్నది ఇదే. యోగం, ఆధ్యాత్మికతా అంటే ఇదేగా! ఇంకా వేరే ఏమైనా ఉందా?' అని అడిగాను.

'అయితే నువ్వు చెప్పు, యోగం అంటే ఏమిటో? నేనేం బోధించాలో చెప్పు?'

'ఊరికే ముక్కు పట్టుకుని కూర్చుని ఎడమ, కుడి నాసికా రంధ్రాల్లో నుంచి శ్వాస మీద ధ్యానిస్తూ గాలి పీలుస్తూ, విడుస్తూ ఉండడం కంటే, కేవలం అందమైన అమ్మ పాదాల బొటనవ్రేళ్లను తలచినా ఆ స్థితి సమాధి స్థితిని నిస్సారంగా చేసేస్తుంది కదా?' అన్నాను నేను.

దాని మీదట స్వామీజీ, కళ్లు మూసుకుని అవునన్నట్టు తల ఆడించారు. ఆయన దగ్గర ఉన్న కుర్చీలో కూర్చున్నారు. బహుశా ఇప్పుడు ఆయన ఉన్న ప్రపంచం సాధారణ స్థాయిలో ఉండే మనసుకి అందేది కాదు. అలా ఆయన ఐదు నిముషాల పాటు స్థిరంగా ఉన్నారు. ఆయన మెల్లగా కళ్లు తెరిచి, 'నువ్వు నాకు అమ్మని గుర్తు చేయనని మాట ఇవ్వు. అమ్మని గుర్తుకొస్తే నేను పని చేయలేను. కానీ గురువుగారికి ఈ శరీరం పడిపోయే లోపు పని పూర్తి చేస్తానని మాట ఇచ్చాను,' అన్నారు.

ఆ అనుభవం అమ్మ గురించి ఆయన అప్పుడప్పుడూ మాట్లాడినా, అమ్మతో తన అనుబంధాన్ని గురించి ఎప్పుడూ ఇంత గాఢమైన రీతిలో మాట్లాడలేదు.

నేను ఈ అనుభూతులన్నీ గుర్తు చేసుకుంటూ ఉంటే రెండు గంటలు గడిచిపోయింది. అప్పుడు నాకు అనిపించింది, మీరా నేను ఎక్కడున్నానో, ఏం చేస్తున్నానో అని కంగారు పడుతూ ఉండవచ్చు. నేను ఇప్పటికే చాలా ఆలస్యం చేశాను. నేను తిరిగి ఆశ్రమానికి వెళ్లాలి. అప్పటికి నేను 'మరణం నుంచి జననానికి' పుస్తకం పూర్తి చేశాను. కనీసం అది పూర్తి చేయాలని నా ప్లాన్. కానీ తర్వాత చాలా రోజుల పాటు ఎన్నో భావాలు సంచలిస్తూనే ఉన్నాయి మనసులో. నేను వ్రాత పనిలో ధ్యాస పెట్టలేకపోతున్నాను.

స్వామీజీ కొద్ది రోజుల ముందు మాట్లాడిన మాటల మీదే నా మనసు పదే పదే తిరుగుతోంది. ఆయన గత ఇరవై ఏళ్లుగా దేవీమాత గురించి చెప్పిన వివిధ విషయాల్ని ఆలోచిస్తున్నాను. ఆయన అనేకసార్లు నా వెంట ఆశ్రమంలో ఉన్న చిన్న లైబ్రరీకి వచ్చి 'హిమాలయ పరమగురువులతో జీవనం', 'లవ్ విష్పర్స్' ఈ రెండింటినీ వ్రాసేవారు. ఆశ్రమం నుంచి గంగా తీరమూ, దాని ఉప ప్రవాహాల వెంట ఆయన ఏకాంతంగా నడిచి వెళ్తూ ఉండేవారు. ఆ సమయాల్లో నేను ఆయనతో కూడా వెళ్లేవాడిని. నేను స్వామీజీ పుస్తకాలు అన్నీ చదివాను, ముఖ్యంగా ఈ రెండింటినీ నిశితంగా అధ్యయనం చేశాను. ఇప్పుడు, నేను వాటిని చూసి చాలా ఆశ్చర్యపోయాను. కొన్ని పేరాగ్రాఫుల్లో ఆయన తానెవరో, తనకి అమ్మవారితో ఎలాంటి బాంధవ్యం ఉందో స్పష్టంగా చెప్పారు. కానీ నా మనసులో ఈ విషయాలు పెద్దగా ముద్రించుకోలేదు. ఉదా. ఆయన లవ్ విష్పర్స్‌లో, 'నాకు ఏడేళ్ల వయసులోనే నాకు తెలియని ఓ వింత ప్రపంచంలోని వాస్తవికతకి రవాణా చేయబడ్డాను. భీతిల్లి, నేను మా గురువుగారిని చేరుకున్నాను. ఆయన, 'అక్కడ ఓ అద్భుతమైన, అనిర్వచనీయమైన అనుభూతి నీకు లభిస్తుంది. కాబట్టి దాని గురించి మాట్లాడకు. నోటికి చేయి అడ్డుపెట్టుకో. ఈ రహస్యాన్ని నీ హృదయ మందిరం నుంచి బయటికి రానీయవద్దు. అందువల్ల ఆ విషయాన్ని నీ మనసులోనే ఉంచుకో,' అని చెప్పారు.

అమ్మవారి గురించి కూడా స్వామీజీ, 'మౌన దివ్యత్వమా, నీవే స్త్రీలందరిలోకీ అద్భుతమైనదానవు. నా అజ్ఞాన తిమిర మందిరంలో జ్ఞాన ప్రకాశం వెలిగించినదానివి నువ్వే. నేను నిన్ను ప్రత్యక్షంగా చూడాలని కోరుకుంటే నువ్వు నన్ను ఎందుకు విడిచి పెట్టావు తల్లీ?

ఐహిక విషయాల్లో సౌందర్యంగానీ, ఆకర్షణలు గానీ, ఆరాటాలు గానీ నన్ను ఏవీ ఆకట్టుకోలేదు తల్లీ. నేను ఒకటీ రెండు సార్లు ఐహిక ప్రపంచంలో సంపూర్ణత్వం కోసం ప్రయత్నించాను. కానీ నెగ్గలేకపోయాను. నీ అభివ్యక్తి నాకు గొప్ప శక్తినీ, తాజాదనాన్నీ ఇస్తుంది మనసుకి. నువ్వు నాకు గొప్ప ఉత్సాహాన్ని ఇచ్చావు, రాత్రీ పగలూ. నేను అలాగే పని చేస్తున్నాను,' అని వ్రాశారు.

ఇప్పుడు నేను గంగా తీరంలో నడుస్తూ 'లవ్ విష్పర్స్' ప్రెస్‌కి వెళ్లబోతుంటే ఏం జరిగిందో గుర్తుకొస్తోంది. స్వామీజీ తన పక్క మీద తలగడని ఆనుకుని కళ్లు మూసుకుని కూర్చున్నారు. ఆయన నిద్ర పోవడం లేదు. కానీ ఆయనకు ఈ ప్రపంచం గురించిన స్పృహ ఉంది. నేను కొద్ది నిముషాలు కూర్చుని వెళ్లిపోయాను. మర్నాడు ఆయన నన్ను చూడగానే, 'రా, నేను నీకు ఒకటి చూపిస్తాను,' అన్నారు. నేను ఆయన గదికి వెళ్లినపుడు, నాకు ఒక పద్యం చూపించారు. క్రితం రాత్రి రాసి పద్యం అది...

*హిమాలయ సాధు వారసుడిని నేను!*
*స్వేచ్ఛాత్మని నేను!*
*ప్రకాశం నా తోడుగా నడుస్తోంది!*
*నిర్భయ జీవనం!*
*శీతల జలస్రోతస్సులు!*
*అన్నిటినీ మించిన హిమాలయ గుహ నా నివాసం!*
*శీతల గాలుల ప్రభంజనంలో ఏకాకిగా*
*అధిరోహిస్తున్నా పర్వత శిఖరాల్ని!*
*ఎవరూ మాట్లాడరు ఇక నాతో,*
*అడుగేయరు ఎవరూ ఇక నాతో,*
*జల ప్రవాహాల్ని దాటుతూ,*
*శీతల హిమాలయ సానువుల్లో తిరుగాడతాను,*
*గగనాలతో ఊసులాడే పర్వత చరియల్లో*
*నేను సంచరిస్తాను,*
*నిశ్శబ్దం నన్ను నేస్తంగా చేసుకుంది!*
*మౌన ప్రత్యుత్తరాలిస్తూ నా ప్రేమ నాతో,*
*మౌన మంద్ర భాషణలు చేస్తుంది,*
*నీ మార్గదర్శనలో నేను ఆరోహిస్తాను!!*

దీని అర్థం ఏమిటని నేను స్వామీజీని అడిగాను. దానికి ఆయన, 'నేను భవిష్యత్తులోకి వెళ్లిపోయాను, బాధపడకు. చివరి పంక్తులు చదువు,' అన్నారు.

*నీ పావన చరణాలకు నా జీవితాన్ని అర్పిస్తున్నాను.*
*అందరినీ నిస్వార్థంగా పరిపూర్ణంగా ప్రేమిస్తున్నాను.*

ఈ చివరి పంక్తులు చదివిన తర్వాత ఆయన, 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ఆమె చరణాలకు సమర్పించుకున్న వారికి నేను వారికి నమ్మినబంటుని. ఈ రహస్యాన్ని నీ పెదవుల నుంచి బయటికి రాకుండా చూసుకో. సేవ ఒక్కటే నువ్వు నాతో ఉండగలిగే మార్గం!' అన్నారు.

తర్వాత కొద్ది వారాలు ఈ ప్రపంచపు సంఘటనలతో సంబంధం లేనంతగా నేను ఉన్మత్త ప్రపంచంలో జీవించాను. ఐహిక సంఘటనల గురించి చెప్పాలంటే నేను హాస్పిటల్ క్యాంపస్‌ని సందర్శించి 'మరణం నుంచి జననానికి' పుస్తకాన్ని పూర్తి చేసి స్వామీజీని దూరం నుంచే చూశాను. స్వామీజీ నాకు 1993 ఆగస్టు 11న ఇచ్చిన సాధనని ఆయన హోనస్‌డేల్‌లోని ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్లే ముందు నవంబరు 10 న ముగించాను. సంప్రదాయ నియమం ప్రకారం నేను నా సాధనని పూర్ణాహుతితో సమర్పించాలి. ఈ ప్రత్యేక సందర్భాన్ని జరిపించడానికి ఆశ్రమ మేనేజర్ ప్రేమ్ శోభ్టే గంగా తీరంలో అన్ని ఏర్పాట్లూ సిద్ధం చేశాడు. ఆ నాడు సాయంత్రం నేను మొదలుపెట్టిన పూర్ణాహుతి విధి పదకొండవ రోజు తొలి వేకువ సమయం వరకూ తీసుకుంది. నేను పూర్ణాహుతిలో చివరి క్రియ పూర్తి చేశానో లేదో, గంగానది పైన ప్రాంతం వెనక సాధు బృందమనే పవిత్రాగ్ని ప్రజ్వరిల్లింది. స్వామీజీ కూడా వారిలో ఉన్నారు.

సూర్యోదయం అయిన తర్వాత మీరా తనకి స్వామీజీని చూడాలని ఉందని చెప్పింది. స్వామీజీ తన చూపులతోనే మమ్మల్ని కూర్చోమని చెప్పారు. మరి కొద్ది నిముషాల తర్వాత నేను స్వామీజీ సపర్యల కోసం అక్కడున్న మహేష్‌ని, 'మేము స్వామీజీతో కొంచెం ఆంతరంగికంగా మాట్లాడవచ్చా' అని అడిగాను.

అతడు వెళ్లిపోయాక, స్వామీజీ, 'అమ్మవారు సర్వవ్యాపి. ఆమె చిరంతనం. ఆమె సంతానంగా మహర్షులు కూడా చిరంతనులే. ఆమె కోరికని అనుగమిస్తూ మా గురుదేవులు ఆమె నుంచి ఆవిర్భవించారు. ఆమెలోకే తిరిగి ఐక్యం చెందారు. నేను కేవలం ఆయన విస్తరణని. మా గురుదేవులు నా విధిని నిర్ణయిస్తారు. నేను ఎప్పుడు రావాలో ఎప్పుడు తిరిగి వెళ్లాలో ఆయన నిర్ణయిస్తారు. ఇప్పుడు ఆయన తన సమాధి నిశ్చలతని ఎవరో ఒకరు భంగపరచాలి. నేను వెళ్లాలి' అన్నారు.

ఆయన వెళ్లిపోతున్నారు... ఓ మూల నా గుండె 'ఇక ఈ ప్రపంచంలో నాకు మిగిలిందేమిటి!' అని బావురుమంటోంది. ఆ చరమ ఘడియల్లో నేను స్వామీజీ మాటల్ని శ్రద్ధగా విని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను.

ఆయన గుండె నా గోడు వింది. ఆయన తర్వాత, 'ఋషుల్ని సేవించు. మానవ హృదయాల్లో వారి జ్యోతిని వెలిగించు. ఆ విధంగా నువ్వు ఆమె పవిత్ర పాదాలకు నీ జీవితాన్ని అర్పించు. నిస్వార్థంగా ఉండు. నిర్భయంగా ఉండు. సమయం వచ్చినపుడు నువ్వసలు ఇక్కడకి రావలసిన అవసరమే లేనంత నిశ్చలంగా ఇక్కడ నుంచి వెళ్లు.'

'నేను ఈ రోజు సాధనని పూర్తిచేశాను,' అని చెప్పాను స్వామీజీతో నేను. 'మూడేళ్ల క్రిందట, మీరు నాకు చివరి సోపానం బోధించారు. కానీ మీ అనుమతి లేకుండా నేను దాన్ని సాధన చేయకూడదని చెప్పారు. 'నేనిప్పుడు మీ అనుమతి తీసుకోవచ్చా?' అని అడిగాను.

'చేసుకో,' అన్నారు. ఆయన మార్మికంగా చిరునవ్వు నవ్వుతూ చివరగా నాతో అన్న మాటలు ఇవి... 'సాధన మొదలుపెట్టు. ఒకరోజు నేను నిన్ను మన పూర్వీకుల గుహకి తీసుకుని వెడతాను.'

మహేష్ తిరిగి వచ్చాడు. నా భార్య, నేను స్వామీజీ చరణాలకు వంగి నమస్కరించి సంతోషం, విచారం అనే ఆయన పురస్కారాన్ని దాచుకుని, గదిని విడిచి వెళ్లాము. రెండు రోజుల తర్వాత నవంబరు 13 న స్వామీజీ భౌతిక శరీరం విడిచి ఉన్నత హిమాలయాల్లో నివసించే తమ పరమగురువు సన్నిధికి చేరుకున్నారు.

# శబ్దార్థాలు

| | |
|---|---|
| **అఘోరా** | : శివుని పరమ ప్రశాంతమైన, అందమైన సాధు రూపం. ఆధునిక భారతదేశంలో ఇది శివుని కల్మష, వికార రూపానికి అర్థంగా మారింది. ఈ రకమైన అర్థం గ్రంథాల్లో కనిపించదు. |
| **అగ్నిసార** | : ఇది ఒక యోగ పద్ధతి. ఇది నాభి కేంద్రంలో అగ్నిని ప్రజ్వరిల్లేలా చేస్తుంది. |
| **ఆర్య సమాజం** | : ఇది స్వామి దయానంద సరస్వతి ద్వారా పంతొమ్మిదవ శతాబ్దంలో నెలకొల్పబడిన హిందూ సంస్థ. |
| **ఆత్మ** | : పరిపూర్ణ చైతన్యం. ఆత్మ, తాను. |
| **ఆయుర్వేదం** | : దీర్ఘకాలిక ఆయుర్దాయాన్ని ప్రసాదించే ప్రాచీన భారతదేశ వైద్య విజ్ఞానం. |
| **బాలాత్రిపుర** | : అమ్మవారి బాలా రూపం. ఈ విద్యనే **త్రిపుర** లేదా **శ్రీవిద్య** అని అంటారు. ఇది మూడక్షరాల మంత్రం. తంత్ర గ్రంథాలు ఈ విద్యని రహస్య విద్య అని ఉద్ఘాటించాయి. |
| **బంధాలు** | : హఠయోగంలో ప్రత్యేక విన్యాసాలు, శ్వాస వ్యాయామాలు. ఇంగ్లీషులో, ఇలాంటి అభ్యాసాల్ని 'లాక్స్' అని వ్యవహరిస్తాడు. అలాగే 'బంధాలు' అనే పదానికి కర్మ 'బంధం' అనే అర్థంలో తీసుకుంటే సాధకులు తమకు తాముగా ధ్యానం, అంతర శుద్ధీకరణ వంటి పద్ధతులతో కర్మ బంధాల్ని అధిగమించడం. |
| **భక్తి** | : ప్రేమ, అంకితభావం, సంపూర్ణ సమర్పణ, సంపూర్ణ విశ్వాసంతో కూడిన మార్గం. |
| **భస్త్రిక** | : కమ్మరి తోలుతిత్తి క్రియ వలె శ్వాసించడం. ఒక రకమైన ప్రాణాయామం. పొత్తికడుపు కండరాలు కదిలేటట్లుగా బలంగా ఉచ్ఛ్వాస, నిశ్వాసలు తీసుకోవడం. |
| **బిందుభేదన** | : కనుబొమల మధ్య గల సూక్ష్మమైన చక్రాన్ని జాగృతం చేయడం. |
| **బ్రహ్మచర్యం** | : బ్రహ్మ జ్ఞానాన్ని పొందే సాధన. దీన్ని సాధారణంగా పెళ్లి కాకుండా ఉండే స్థితికి పర్యాయపదంగా ఉపయోగిస్తారు. |
| **బ్రహ్మాజాగరణ** | : ఉత్కృష్ట సత్యాన్ని భావనలోకి తీసుకుని రాత్రంతా ఆ భావనలోనే ఉండడాన్ని అభ్యసించే పద్ధతి. |
| **బ్రహ్మాండి** | : అత్యంత ఆంతరిక శక్తి ప్రవాహం. |
| **బ్రహ్మర్షి** | : అత్యంత శక్తిసామర్థ్యాలు గల ముని. |

**దర్శనం** : 'గ్లింప్స్', అదృశ్యరూపం తృటికాలంలో గోచరించడం, సంపూర్ణ సత్యం, గోచరించడం, వేదాంత తత్వం.

**దేవదాసి** : 'దేవునికి సేవ చేసే దాసి'. భారతీయ సమాజంలో దేవాలయాల్లో ప్రతిరోజూ నర్తన, కీర్తన చేయడం, ఉత్సవాల సమయంలో సంగీత, నృత్య ప్రదర్శనలిచ్చే ఒక ప్రత్యేక సామాజిక వర్గం.

**దేవుడు** : సృష్టికి మూలకర్త దైవం.

**ధర్మం** : ఇతరులకి సహాయం చేయడం, సమాజంలో అందర్నీ ప్రశాంతంగా ఉండేలా చూడడం. సుఖశాంతులతో కూడిన సమాజానికి ఈ విలువ ప్రధానం. ఆధునిక సమయంలో ఈ మాట ధార్మిక సంబంధమైన, జీవన దర్శనానికి సంబంధించిన పదంగా రూపొందింది.

**ధుని** : పవిత్రాగ్ని. సాధువులు తమ తపస్సాధనలో అంతర్భాగంగా అగ్ని రాజేస్తారు.

**దుర్గామంత్రం** : ఆయుధాలు ధరించి సింహవాహిని అయిన దుర్గా మాతని ఆరాధించే మంత్రం.

**దుర్గా సప్తశతి** : దుర్గాదేవిని ఆరాధించడానికి పఠించే ఏడువందల మంత్రాలు.

**గఢ్వాలీ** : హిమాలయాల్లో గఢ్వాల్ ప్రాంతం.

**గాయత్రీ మంత్రం** : వేద మంత్రాల్లో అత్యంత పవిత్రమైన మంత్రం. ఈ మంత్రాన్ని దైవభక్తి కలవారు నిత్య దైవప్రార్థన, ధ్యానంలో భాగంగా ప్రతిరోజూ పఠిస్తారు.

**గురుభాయి** : ఒకే గురువు వద్ద చదువుకునే సహాధ్యాయి. గురుసోదరుడు.

**గురుచక్ర** : కనుబొమల మధ్యన కేంద్రీకృతం చేయవలసిన చక్రం. చైతన్య కేంద్రం. సాధువులు, అనాది గురువుని దర్శించగలిగే మార్గం ఇదేనని చెప్తారు.

**గురుదక్షిణ** : తనకి గురువు ద్వారా లభించిన జ్ఞానానికి ప్రతిగా శిష్యుడు తన గురువు గారికి ప్రేమపూర్వకంగా సమర్పించుకునే దక్షిణ.

**గురుదేవులు** : 'గురువు' అంటే, 'అజ్ఞానమనే చీకటిని పారద్రోలే మహనీయుడు.' 'గురుదేవులు' అంటే 'అజ్ఞానమనే చీకటిని పారద్రోలడంలో దైవంతో సమానమైన గురువు.' ఆధ్యాత్మిక బోధ చేసే గురువుని అత్యంత భక్తి శ్రద్ధలతో సంబోధించడానికి ఉపయోగించే పదం.

**గురుమంత్రం** : తొలిసారి దీక్ష ఇచ్చినపుడు గురువు శిష్యుడికి ఉపదేశించే మంత్రం

**గురుపౌర్ణమి** : గురువుని ఆరాధించే పౌర్ణమి. సాధారణంగా ఇది జూలై మాసంలో వస్తుంది.

**హరిజనుడు** : 'హరికి చెందిన జనుడు'. మహాత్మాగాంధీ ఆశ్రమం ద్వారా ప్రచురింపబడిన ఒక పత్రిక.

**హఠయోగం** : సూర్య, చంద్రనాడుల్ని సంతులితం చేసే ఒక యోగ సంప్రదాయం. పురుష, స్త్రీ శక్తుల్ని భంగిమలు, శ్వాస పద్ధతులు, శుద్ధీకరణ ప్రక్రియలు, ముద్రలు, ధ్యానం ద్వారా సాధించే పద్ధతి.

**జపం** : మంత్రాన్ని జపించడం.

**కబీర్‌పంథీ** : సంత్ కబీర్‌తో అనుసంధానమై ఉన్న సంప్రదాయం.

**కర్మ** : 'చర్య'. యోగ సంప్రదాయంలో ఇది చర్య, ప్రతిచర్య సిద్ధాంతాన్ని తెలియజేస్తుంది.

**కర్మయోగం** : కర్మపరమైన యోగం. నిస్వార్థమైన సేవ.

**కర్ణపిశాచి** : తంత్ర పద్ధతుల ద్వారా ఈ దేవతని కొలుస్తారు. ఆమె సాధకుడి చెవిలో నివసిస్తుంది. సాధకుడిని ఇతరులు ప్రశ్నలు అడిగినపుడు అతడు ఆ దేవతని ప్రార్థిస్తాడు. దానికి ఆమె అతడి చెవిలో సమాధానాలు తెలియజేస్తుంది.

**క్రియ** : అనేక రకాల యోగ శుద్ధీకరణ విధానాల్లో ఏదైనా ఒక పద్ధతి.

**కులదేవి** : కులదేవత.

**కుంభమేళా** : భారతదేశంలో నాలుగు విభిన్న నగరాల్లో పన్నెండేళ్లకి ఓసారి జరిగే భవ్యమైన ఉత్సవం. ఈ నాలుగు ఉత్సవాల్లోనూ అలహాబాదులో జరిగే కుంభమేళా భారతదేశంలోనూ, విదేశాల్లోనూ ఉన్న కోట్లాదిమంది భక్తుల్ని ఆకర్షిస్తుంది.

**కుండం** : యజ్ఞగుండం.

**కుండలిని** : 'సర్పం మాదిరిగా లోపలికి చుట్టుకుని ఉన్న శక్తి'. ఇది జీవులందరిలోనూ నిగూఢంగా ఉండే శక్తి. యోగులు ఈ ఆధ్యాత్మిక శక్తిని మేల్కొల్పుకోవడానికి ప్రయత్నిస్తారు.

**లఘు సమాధి** : కొంచెంసేపు అధ్యాత్మ యోగంలో సంలీనం కావడం. యోగులు ధ్యానముద్రలో ఉండి ప్రాణాన్ని కొద్దిసేపు శరీరం నుంచి బయటికి వదిలేస్తారు. దాన్ని కొద్దిసేపటి తర్వాత మళ్లీ శరీరంలోకి తెచ్చుకుంటారు.

**మహాకాల** : కాలాన్ని తినగలిగేది. ఉజ్జయినీలోని అన్ని ఆలయాల్లోకీ ప్రధాన దైవం. కాలాన్ని నాశనం చేయగలిగే దైవం.

**మహావిద్య** : తంత్ర సాధనలోని అత్యున్నత మార్గాల్లో ఒక మార్గం.

**మహీకారి** : జపాన్ దేశంలోని ఒక ఆధ్యాత్మిక సంస్థ. దీన్ని ఒకదాసన్ స్థాపించారు. దీని ప్రధాన కార్యాలయం టోకుయామా.

**మనస్** : మనసు. ముఖ్యంగా సందేహం, అనిశ్చితి నెలకొని ఉండే స్థితి.

**మాల** : మంత్ర జపంలో ఉపయోగించే పూసల దండ, జపమాల.

**మాయ** : అనంతశక్తిగల జీవుడు తాను 'పరిమిత'శక్తితో ఉన్నట్టు భావించడం. ఇది మాయ తెర.

**మోక్షం** : బంధనాల నుంచి విముక్తి. కర్మ బంధం నుంచి విముక్తి.

**ముద్ర** : యోగ భంగిమ. ఆసనాలు, బంధాలతో కూడిన వివిధ యోగ ముద్రలు. కుండలినీని మేల్కొల్పడానికి అవసరమైన ప్రారంభ సాధన.

**ముక్తి** : మోక్షం. కర్మ బంధం నుంచి స్వేచ్ఛ.

**మూలాధార** : తొలి, కుండలినీ యోగం ప్రకారం చైతన్య కేంద్రంలో అత్యంత కీలకమైన భాగం. ఇది ఉపస్థేంద్రియానికీ, గుదా ద్వారానికీ మధ్య ఉంటుంది.

**నాడులు** : శక్తి ప్రవాహ మార్గాలు. ఇవి ప్రాణశక్తి మార్గాలు.

**నాగసాధువు** : అతి తక్కువగా బట్టలు ధరించే సాధువు. లేదా కొన్నిసార్లు బట్టలే ధరించడు.

**నవరాత్రి** : దేవిని పూజిస్తూ చేసే తొమ్మిదిరోజుల ఉత్సవం.

**నవావరణ మంత్రం** : దుర్గాదేవి సాధనకు అంకితం చేయబడిన తొమ్మిది బీజాక్షరాల మంత్రం.

**పంచాగ్ని సాధన** : ఐదు అగ్నులను చుట్టూ ఉంచుకుని మనిషి చేసే సాధన. నాలుగు దిక్కులా నాలుగు అగ్నులు, పైన సూర్యుడు.

**పరకాయ ప్రవేశం** : ఇచ్ఛాశక్తితో ఒక శరీరాన్ని విడిచి మరొక శరీరంలో ప్రాణాన్ని ప్రవేశపెట్టగలిగే ఉన్నతస్థాయి యోగ పద్ధతి.

**ప్రాకృతం** : భారతదేశంలో ప్రాచీన భాషల్లో ఒకటి. జైన గ్రంథాలు ప్రాకృతభాషలో వ్రాయబడ్డాయి.

**ప్రాణం** : కీలకమైన జీవశక్తి. సూక్ష్మ శక్తి. శరీరాన్నీ, మనసునీ కలిపి ఉంచే శక్తి.

**ప్రాణాయామం** : ప్రాణశక్తి విస్తరణ, శ్వాస సాధనల వ్యవస్థ.

**పురాణాలు** : వేదవ్యాస మహర్షి వ్రాసిన గ్రంథాలు.

**పూర్ణాహుతి** : చివరి దక్షిణ. ఇది అగ్నికి చివరిసారిగా ఇచ్చే ఆహుతి.

**రాజయోగం** : 'రాచమార్గం'. పతంజలి రచించిన యోగసూత్రాల్లో వర్ణించబడిన ఎనిమిది మార్గాలు.

**రామానుజాచార్య సంప్రదాయం** : రామానుజుల ద్వారా ఆధ్యాత్మిక, తాత్విక సంప్రదాయం. వీరు ఇరవయ్యవ శతాబ్దంలో దక్షిణ భారతదేశంలో వెలసిన ఒక గొప్ప సన్యాసి. ఈ సంప్రదాయం ప్రకారం, భగవంతుడు గుణరహితంగా పరిపూర్ణ తత్వంతోనూ ఉంటాడు, గుణసహితంగా అంతర్గతంగానూ ఉంటాడు.

**రుద్రుడు** : పరమ కరుణామూర్తి అయిన దైవం. ఈ ప్రపంచంలోని దు:ఖాన్నీ విచారాన్నీ చూసి కన్నీరు నించే మహాదేవుడు. అత్యంత పరాక్రమశాలి అయిన శివరూపం. ఈయన అజ్ఞానాన్ని నాశనం చేసే సాధువు.

**రుద్రాక్షమాల** : రుద్రాక్ష మొక్క గింజలతో తయారుచేసే జపమాల.

**సాబర మంత్రం** : ఇది ఏ సంప్రదాయానికీ చెందని మంత్రం. ఇది సంస్కృతంలో కాక వేరే భాషలో ఉంటుంది.

**సాధన** : ఆధ్యాత్మిక సాధన.

**సమాధి** : ఒక ప్రశాంతమైన స్థితి. ఆధ్యాత్మికంగా లయించే స్థితి. సంతులిత స్థితి. ఒక సాధువు సమాధి.

| | |
|---|---|
| **సమయాగ్ని** | : ప్రశాంతమైన, ప్రకాశవంతమైన అగ్ని, ఇది రుద్రుడి వినాశక అగ్ని కంటే భిన్నమైనది. |
| **సంస్కారాలు** | : గత జన్మల సూక్ష్మ సంస్కారాలు. అచేతన మనసులో సంచితమైన గత జన్మల కర్మ సంస్కారాలు |
| **సంవర్తాగ్ని** | : రుద్రుడి వినాశక అగ్ని. ఇది ప్రశాంతమైన, ప్రకాశవంతమైన సమయాగ్ని కంటే విలక్షణమైనది. |
| **సంయమం** | : ఏకాగ్రత, ధ్యానం, సమాధి మొదలైన విషయాల్లో అంతర్గతంగా రూపాంతరణ చెందడం. |
| **సనాతన ధర్మం** | : వేదాల్లో చెప్పబడిన చిరంతన బోధలు. |
| **సాంధ్య భాష** | : 'సాంధ్య భాష' యోగులు ఉపయోగించే మార్మిక భాష. |
| **సంకల్పశక్తి** | : సంకల్పానికీ, ఆత్మ విశ్వాసానికీ గల శక్తి. |
| **సన్యాసం** | : చక్కగా వదిలిపెట్టడం, వైరాగ్య మార్గం. సాధుజీవనం. |
| **సన్యాస ధర్మం** | : సాధుజీవనంలో పాటించవలసిన ధర్మాలు. |
| **సన్యాసి** | : సన్యాస దీక్షలో గల నియమాల్ని నిబద్ధతతో పాటించే సాధకుడు. |
| **సత్సంగం** | : సజ్జనులు, సాధువుల సాంగత్యంలో ఉండడం. |
| **శైవులు** | : శైవ తత్వం, శైవ సాధనలతో అంతరంగంలో శుద్ధ చైతన్యభావనతో శివానుభూతి కలిగి ఉండడం. |
| **శక్తి** | : జీవశక్తి. సమగ్రమైన చైతన్య శక్తి. |
| **శక్తిపాతం** | : ఆధ్యాత్మిక శక్తిని నేరుగా గ్రహించే విధానం. |
| **శక్తిసాధన** | : దేవిని అనుభూతి చెందే సాధన. |
| **శతచండి** | : దుర్గా దేవి మీద వ్రాయబడిన ఏడు వందల మంత్రాలతో కూడిన దుర్గా సప్తశతిని పఠించడం. |
| **షట్కర్మ** | : ఆరు విలక్షణమైన తంత్ర పద్ధతులు. |
| **శివుడు** | : శుద్ధ చైతన్యం, ఉనికి, బ్రహ్మానందం. శివుడు పరమ దైవశక్తి. |
| **శివబలి** | : మంత్ర జపానికి సంబంధించిన తంత్ర విధానం. ప్రార్థనలతో దేవతకి అందించే ప్రత్యేక ఆహారం. ఈ విధానాన్ని సాధించే సాధకులు ఆడ నక్కలు, తోడేళ్లు, హైనాలను మాతృదేవతా దృక్పథంతో చూస్తారు. |
| **శివలింగం** | : లింగాకార స్థాణువు. శివుని ప్రతీక. నామరహిత, రూపరహిత దైవం. |
| **శివస్వరోదయ** | : శివుడు అంటే, 'చైతన్యం', 'స్వర' అంటే 'స్వరమాధుర్యం, సంగీతం, తరంగం, కెరటం' అని అర్థం. 'ఉదయ' అంటే, 'ఉత్థానం, ప్రకటీకృతం'. ఇది అనాది మౌలిక చైతన్య స్థితి నుంచి జీవతరంగం ఎగసిపడే విధానాన్ని వర్ణించే విజ్ఞానం. |
| **సిద్ధుడు** | : పరిపూర్ణమైన గురువు. |
| **సిద్ధి** | : అతీత శక్తులు. యోగసిద్ధులు, సంకల్ప శక్తి, దృఢనిశ్చయాన్ని నెరవేర్చుకోవడానికి చేసే సాధన. |
| **శ్రీచక్రం** | : సర్వోత్తమ సౌందర్యం, అఖండ బ్రహ్మానందానికి నిలయం శ్రీదేవీ చక్రం. అత్యంత శుభప్రదమైన చక్రం. |

**శ్రీవిద్య** : అత్యంత శుభప్రదమైన విజ్ఞానం. సర్వోత్తమ సౌందర్యం, అఖండ బ్రహ్మానంద రూపం. అత్యంత మార్మికమైన తాంత్రిక పద్ధతి.

**శ్రీయంత్రం** : శ్రీవిద్య జ్యామితి రూపం. ఇది తంత్రార్థంలో సూక్ష్మ జగత్తు, స్థూల జగత్తుల సంపూర్ణ చిత్రణతో కూడిన సర్వోత్కృష్టమైన యంత్రం.

**సూర్యవిజ్ఞానం** : 'సూర్యుని విజ్ఞానం.' సూర్యునిలో ఉన్న మర్మ జ్ఞానం. అలాగే నాభి కేంద్రానికి చెందిన పద్ధతులు.

**సుషుమ్న** : సూక్ష్మ శరీరంలో కేంద్ర ప్రవాహ మార్గం.

**స్వాధిష్ఠాన** : 'ఆమె స్వీయ నివాసం.' ఇది కటివలయ కేంద్రంలో ఉన్న చక్రం.

**తంత్రం** : శక్తి, శివుల సంగమాన్ని అనుభూతి చెందడంపై దృష్టి పెట్టే సాధన.

**తపస్సు** : 'వేడి, ప్రకాశం' కి చెందిన నియమాలు. ఇవి ఒక వ్యక్తిని తేజోవంతం చేస్తాయి.

**థెరవాదం** : 'ఈ సిద్ధాంతం పెద్దల సిద్ధాంతం.' ఇది అత్యంత ప్రాచీన వేదాంతం, బౌద్ధ విధానం.

**టీకా** : హిందీ భాషలో 'టీకా' ని తిలకం అనే అర్థంలో వాడతారు. వేడుకలు, ఉత్సవాల్లో అలంకరణగా నుదిటి మీద పెట్టే తిలకం.

**త్రాటక** : ఏకధాటిగా చూడడం. హఠయోగంలో శుద్ధీకరణ సాధనలలో ఇది ఒకటి.

**ఉపనిషత్తులు** : ఇవి యోగ, వేదాంత గ్రంథాలు. వీటిని గురువు మార్గదర్శకత్వంలో చదవాలి.

**వైరాగ్య సంప్రదాయం**: లౌకిక భావనల పట్ల విరాగత్వాన్ని సాధన చేసే సంప్రదాయం.

**వైరాగ్యం** : సంగరాహిత్యం. సాధకులు ఈ సాధు సంప్రదాయంలో లౌకిక విషయాల పట్ల అనాసక్తిని సాధన చేస్తారు.

**వజ్రోలి క్రియ** : హఠయోగ గ్రంథాల్లో వర్ణించబడిన శుద్ధీకరణ పద్ధతుల్లో పాదరసాన్ని అంతర్గతంగా తీసుకునే ఒకానొక అత్యున్నత శుద్ధీకరణ పద్ధతి.

**వేదాంతం** : వేదాల్లో వర్ణించబడిన అత్యున్నత విజ్ఞానం. అద్వైత సిద్ధాంతాన్ని వివరించే తత్వం.

**వేదాలు** : ప్రపంచంలో అత్యంత ప్రాచీన ధర్మగ్రంథాలు. వీటిలో వందలాది మంత్రాలు ఉంటాయి.

**విద్య** : విజ్ఞానం. ఆధ్యాత్మిక విజ్ఞానం. దేవి రూపంలో పరిపూర్ణ సత్యం.

**విరాజ హోమం** : అంతర్గత శుద్ధీకరణ కోసం ధర్మ గ్రంథాల్లో చెప్పబడిన ఒక విలక్షణమైన ఆహుతుల్ని ఇచ్చే యజ్ఞం. సన్యాస ధర్మం తీసుకుంటున్న సాధకుడు ఈ విధిని నిర్వహిస్తాడు.

**విరాట్‌రూపం** : విశ్వమంతా వ్యాపించి ఉన్న దైవరూపం. సమస్త విశ్వంలోనూ నిండి ఉన్న రూపం.

**విశ్వహిందూ పరిషత్**: 'విశ్వ హిందూ సమూహం.' ఈ పేరు వీహెచ్‌పీగా పేరుగాంచిన భారతదేశంలోని అతి పెద్ద హిందూ సంస్థ.

**యజుర్వేదం** : ఇది నాలుగు వేదాల్లో ఒకటి.

**యంత్రం** : తాంత్రిక దేవతల్ని కొలిచేందుకు లేదా తంత్ర పద్ధతుల్లో ధ్యానం చేసేందుకు ఉపయోగించే ఒక జ్యామితి రూపం.

**యోగనిద్ర** : యోగ సంబంధమైన నిద్ర. నిద్ర కాని నిద్ర. ఈ భంగిమలో నిద్ర పోకుండా శరీరానికీ, మనసుకీ సంపూర్ణ విశ్రాంతినిచ్చే పద్ధతిని సాధకుడు నేర్చుకుంటాడు.

**యూనానీ** : గ్రీకులు, పర్షియన్ల ద్వారా భారతదేశంలో ప్రవేశ పెట్టబడిన ఈ వైద్య విధానం ఇంకా ఇప్పటికీ ఉపయోగించబడుతోంది.

## పండిట్ రాజమణి టిగునైట్, పిహెచ్.డి



పండిట్ రాజమణి టిగునైట్, పిహెచ్.డి. హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్‌లో ఆధ్యాత్మిక విషయాలను నిర్వహిస్తున్న సంస్థాధిపతి. ఆయన కుటుంబం తరతరాలుగా అనుసరిస్తూ వస్తున్న సంప్రదాయం ఆయనకు అధ్యయనపరంగానూ, మౌఖికపరంగానూ కూడా అఖండమైన ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని ప్రసాదించింది. పండిట్ రాజమణి హిమాలయ సాధువు శ్రీ స్వామీ రామని కలుసుకోక ముందు నుంచీ యువకుడిగా ఉన్నప్పటి నుంచీ సుప్రసిద్ధ సాధువుల సాంగత్యంలో ఉంటూ అధ్యయనం సాగించారు. పండిట్ రాజమణి టిగునైట్‌కి వైదిక సంస్కృతిపై మంచి పట్టు ఉంది. వారు అనేక సంస్కృత శాస్త్ర గ్రంథాల్ని అధ్యయనం చేశారు. వారి సంస్కృత గ్రంథజ్ఞానం చూస్తే, వారిని 'సంస్కృత గ్రంథ సర్వస్వం' అని వ్యవహరించాలి. వారికి అలహాబాదు విశ్వవిద్యాలయంలో సంస్కృతంలో డాక్టరేట్ డిగ్రీ, అలాగే పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయంలో ఓరియంటల్ స్టడీస్‌లో మరో డాక్టరేట్ డిగ్రీ ఉంది. పండిట్ రాజమణి పన్నెండుకి పైగా పుస్తకాలు రచించారు. వారు ఆధ్యాత్మిక జీవనగాథల్ని పాండిత్యపరంగా విశేషమైన విశ్లేషణని అందిస్తూ, గ్రంథాల అనువాదం చేస్తూ, నిజజీవితంలో వచ్చే సమస్యలకు యోగపరమైన సిద్ధాంతాలను పరిష్కారాలుగా అందిస్తూ 'గమూట్' (సహజ హెచ్చరిక) ని నడుపుతున్నారు.

గత ముప్ఫై ఏళ్లకి పైగా ప్రపంచవ్యాప్తంగా ఉపన్యాసాలు, బోధలు ఇస్తూ, ఇన్‌స్టిట్యూట్ గ్రామీణ సాధికారితా ప్రాజెక్ట్‌లకు పండిట్ రాజమణి టిగునైట్ గొప్ప ప్రేరణ. హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్ కమ్యూనిటీ సెంటర్లను భారతదేశంలోనూ, ఆఫ్రికా, మెక్సికోల్లోనూ మూలాల్లో పనిచేస్తున్నాయంటే దానివెనక ప్రేరణ, స్ఫూర్తి పండిట్‌జీయే.

# ది హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్ గ్లోబల్ హెడ్‌క్వార్టర్స్ (యూఎస్ఏ)



*The main building of the Institute headquarters near Honesdale, Pennsylvania, USA.*

1971 లో స్వామీ రామ, హిమాలయన్ ఇన్‌స్టిట్యూట్‌ని ప్రాచ్య, పాశ్చాత్య ప్రాంతాల్లోని శ్రేష్ఠమైన విజ్ఞానాన్ని మేళవిస్తూ ప్రపంచ మానవాళి శారీరిక, మానసిక, ఆధ్యాత్మిక వికాసానికి అంకితం చేశారు. మా అంతర్జాతీయ ప్రధాన కార్యాలయం అమెరికాలో ఈశాన్య పెన్సిల్వేనియా పొకొనో మౌంటెన్స్ కొండల మధ్య మనోహరమైన 400 ఎకరాల క్యాంపస్‌లో ఉంది. ఇక్కడి వాతావరణం అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతోంది. అంతర్గత చైతన్యం విస్తరిస్తూ ప్రశాంతతని ప్రోత్సహించేదిగా ఉంటుంది. ఈ వాతావరణం అద్భుతమైన ప్రశాంతతకు నిలయం. మా సెమినార్లు నిర్వహించుకోవడానికీ, ప్రోగ్రామ్స్‌ని విస్తరించడానికీ అత్యంత స్వాస్థ్యప్రదమైన ఏర్పాటు ఉంది. హఠయోగం, ధ్యానం, ఒత్తిడి నివారణ, ఆయుర్వేదం, పోషణ, ప్రాచ్య దర్శనాలు, మనోవిజ్ఞానశాస్త్రం, ఇతర విషయాల్ని నేర్చుకోవడం కోసం ప్రపంచం నలుమూలల నుంచీ విద్యార్థులు ఇక్కడికి వస్తున్నారు. ప్రోగ్రామ్స్ వీకెండ్ మెడిటేషన్ రిట్రీట్స్ అయినా, ఆధ్యాత్మికతపై వారమంతా జరిగే సెమినార్లు అయినా నెలంతా జరిగే రెసిడెన్షియల్ ప్రోగ్రామ్స్ అయినా లేక హోలిస్టిక్ హెల్త్ సర్వీసెస్ అయినా ఇక్కడ జరిగే ప్రయత్నమంతా అంతర వికాసాన్ని మెల్లగా తట్టి మేల్కొల్పే వాతావరణాన్ని అందించడమే! నిరంతర వ్యక్తిగత వికాసానికీ, అభివృద్ధికీ మీరు కూడా మాతో కలిసి పనిచేయవలసిందిగా మిమ్మల్ని మేము ఆహ్వానిస్తున్నాము! ఈ ఇన్‌స్టిట్యూట్ నాన్-ప్రాఫిటబుల్ ఆర్గనైజేషన్. ఈ ఇన్‌స్టిట్యూట్‌లో మీరు తీసుకునే మెంబర్‌షిప్ అది నిర్వహించే ప్రోగ్రామ్స్‌కి మద్దతునివ్వడానికి ఉపయోగపడుతుంది. దయచేసి కాల్ చేయండి లేదా ఒక మెంబర్ కావడానికి అవసరమైన సమాచారం కోసం వ్రాయండి.

PROGRAMS AND SERVICES INCLUDE:

- Himalayan Institute Press
- *Yoga International* magazine
- Seminars and Workshops
- Meditation Retreats
- Yoga Teacher Training
- Self-Transformation Program™
- Residential Programs
- Pancha Karma
- Himalayan Institute Total Health Products and Services
- Spiritual Excursions
- Humanitarian Projects and Community Centers in Africa, India and Mexico

HIMALAYAN INSTITUTE® INDIA

THE HIMALAYAN INSTITUTE PRESS has long been regarded as the resource for holistic living. We publish books that offer practical methods for living harmoniously and achieving inner balance. Our approach addresses the whole person—body, mind and spirit—integrating the latest scientific knowledge with ancient healing and self-development techniques. As such, we offer a wide array of titles on physical and psychological health and well-being, spiritual growth through meditation and other yogic practices, as well as translations of yogic scriptures.

# Himalayan Institute Press Titles

**Swami Rama**

A Practical Guide to Holistic Health ₹250
Celestial Song: Gobind Geet ₹295
Choosing a Path ₹295
Exercises for Joints and Glands ₹250
Fearless Living: Yoga & Faith ₹295
Happiness Is Your Creation ₹250
Living with the Himalayan Masters ₹395
Love and Family Life ₹250
Love Whispers ₹250
Meditation and its Practice ₹250
Path of Fire and Light ₹295
Path of Fire and Light, Volume-2
(A Practical Companion to Volume-1) ₹295
Perennial Psychology of the Bhagavad Gita ₹495
Science of Breath ₹250
Spirituality: Transformation Within & Without ₹295
Swami Rama Gift Book Set ₹250
The Art of Joyful Living ₹295
The Royal Path: Practical Lessons on Yoga ₹295
Yoga and Psychotherapy ₹395

